సంపుటం 13. | బహుధాన్య సం॥రం ఫాల్గుణమాసం మార్చి నెల 1939. | సంచిక 1.




(పత్రిక విలాసము:—శ్రీవ్యాసాశ్రమం, ఏర్పేడుపోస్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

...తేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి.
...పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.
...blished by K. Venkatachalam Naidu, Seetharama Indian Stores, Chittoor.

# విషయసూచిక.





## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమంద్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమంద్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత నూతలపాటి నాగప్పనాయుడుగారు, మేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కఠారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీయుత. వేమూరు. చిన్నయ్యారావు పంతులుగారు, బందరు.
3. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
4. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
5. బ్రహ్మశ్రీ "మల్లాది నరసింహ...మూర్తి"గారు, ఆర్డ్.

# యథార్థభారతి

సంపుటం 13 | బహుధాన్య సంవత్సరం | చందా
సంచిక 1 | ఫాల్గుణమాసం | సం॥రం రు 2-4-0
1939 సం॥రం మార్చి నెల | విడిపత్రిక రు 0-4-0

ఓం.

## బ్రహ్మవిద్యాశీర్వాదపద్ధతి.

11. ఇదం సర్వమాత్మన్యేవ ప్రతీయమానంతు రూపరసాదికం జగన్మాయామయం న త్వేతద్వస్తుతోఽస్తీతి తత్త్వనిశ్చయో మే దృఢీభూయాత్ !

తా॥ ఈ సకల ప్రపంచమున్ను ఆత్మయందే కనఁబడు నట్టి రూపరసాది జగము మాయయే. ఇది వాస్తవముగా లేదు—అనెడి తత్త్వనిశ్చయము నాకు దృఢమగును గాక !

12. వాసనాక్షయ మనోనాశ తత్త్వజ్ఞానాభ్యాసవశాత్ జ్ఞానరక్షా తపస్సిద్ధిః సర్వసమత్వం దుఃఖనివృత్తిః సుఖావిర్భావ ఇత్యేతత్పఞ్చప్రయోజనసిద్ధిర్భూయాత్ !

తా॥ వాసనానాశమువలనను, మనోనాశమువలనను, తత్త్వజ్ఞానాభ్యాసమువలనను జ్ఞానరక్ష, తపస్సిద్ధి, సర్వసమత్వము, దుఃఖనివృత్తి, సుఖావిర్భావము అనునీ అయిదు ప్రయోజనములయొక్క సిద్ధి కలుగునుగాక !

[వాసన=దృఢభావనచే ముందువెనుక ఆలోచింపక కలుగునట్టి క్రోధము మున్నగు వృత్తులకు కారణమైన చిత్తముయొక్క సూక్ష్మస్వరూపమైన సంస్కారము. ఇది శుద్ధమనియు, అశుద్ధమనియు రెండు విధములు. డంబము, అహంకారము మొదలగు దుర్గుణములైన ఆసుర సంపద అశుద్ధవాసన. ఇదే అశుభవాసన యనియు, మలిన వాసన

# శ్రీ వివేకానంద లేఖావళి.

(అనువాదకులు — శ్రీ తత్త్వానంద స్వాములవారు).

——:o:-——

యోకహామా.
10 జూలై 1893

ప్రియమైన :—

నాయోగక్షేమములను గూర్చి నీకు తఱచుగా తెలుపనందుకు క్షమింపుము. ఎవనికైనను ఏదో పని కనబడుచునే యుండును. వస్తువు ఈవస్తువు కూడబెట్టుట, వానిని సంరక్షించుటయెనెడు జీవనపద్ధతికి క్రొత్తవాడనగు నాకుఅసలే తీరుబాటు లేకున్నది. అందు కొరకై నాశక్తి చాలవఱకు వ్యయమగుచున్నది. ఇది నిజముగా గొప్ప దుర్వస్థయే.

బొంబాయిలో బయలుదేరి 'కొలంబోకు' చేరినాము. మా నౌక దాదాపు ఒకదినమంతయు ఆరేవులోనే యుండిపోయినది. ఆ అదను కనిపెట్టి మేము పట్టణము చూచివచ్చుటకు పోతిమి. బండ్లెక్కి వీథివీథి తిరిగినాము. కాని నిర్వాణమునందుచు పండుకొనినట్లున్న బుద్ధభగవానుని గొప్ప విగ్రహముగల ఒకదేవళము మాత్రమే నా స్మృతిలో స్థిరముగ నిలిచినది.

ఆపిమ్మటి విరామస్థానము 'పినాంగు'. అది మలయాద్వీపకల్పమున సముద్రపుటంచు పొడవునగల సన్నని నేలచీలిక. మలయావాసులందఱును మహమ్మదీయులు; పూర్వమొకప్పుడు వీరు ఓడదొంగలని ప్రసిద్ధి. వ్యాపారస్థులకు వీరన్న హడలుగ నుండెడిది. కాని యిప్పుడు భీకర శతఘ్నులతోగూడిన యుద్ధనావలు ఈ మలయావాసులను శాంతిమయవృత్తులకు త్రిప్పివేసినవి. 'పినాంగు' నుండి 'సింగపూరు' పోవు మార్గమున ఎత్తగు కొండలతోనున్న 'సుమిత్రా' ద్వీపపు జాడలు గోచరించినవి. పూర్వపు దినములలో నివి ఓడదొంగలకు వాటమగు నెలవులుగ నుండెడివని ఓడసరంగు నాకు తెలిసినాడు. సింగపూరు పట్టణము 'స్ట్రెయిట్సు సెటిల్‌మెంట్సు' రాష్ట్రమునకు రాజధాని. ఇక్కడ వృక్షశాస్త్ర పరిశోధనల కేర్పడిన చక్కని తోట యొకటున్నది. ఇందు మనోహరములగు తాళవృక్షములు

చాలగలవు. 'పాంథపాణి' అనంబడుచు, విసనికఱ్ఱలనుబోలు ఆకు లతో ముచ్చటగు తాళవృక్షములు మిక్కుటముగ నీ ప్రాంతముల పెరగును. ఎచ్చోటజూచినను పనసచెట్లు కాన్పించుచున్నవి. చన్నపురి మామిడిపండ్లవలెనే ఇచ్చటి చూతఫలములు మిక్కిలి పేరు వడసినవి. కాని మన మామిడిపండ్లు అసమానములు. భూమధ్యరేఖకు దాపుగ నున్నను ఇచ్చటి ప్రజలు చన్నపురి ప్రజలంత నల్లగానుండరు. సింగ పూరునందు రమ్యమగు నొక చిత్రవస్తుశాలయు కలదు.

తరువాతి మజిలీ 'హాంకాంగు'. చీనాదేశము చేరితిమనిపించి నది. ఇచ్చట చీనాజాడలు సుస్పష్టముగా గోచరించును. కార్మిక వ్యాపారమంతయు, వర్తకమంతయు, చీనావారి చేతులలోనున్నది. 'హాంకాంగు' నిజముగా చీనాదేశమే. ఓడకు లంగరు వేయుట తోడనే ప్రయాణికులను ఒడ్డునకు తీసుకొనిపోవుటకై చీనావారి నావ లు వందలకొలది వచ్చి ముట్టడివేయును. రెండేసి చుక్కానులతో ఈ నావలు విచిత్రముగ కాన్పించును. సరంగు కుటుంబసహితముగా నావలోనే కాపురముండును. వాని భార్యయే చాలవఱకు చుక్కా నులచెంత కూర్చుండి, ఓడ చుక్కానిని చేతులతోడను, రెండవదానిని పాదములతోడను త్రిప్పుచుండును. ఇట్టివారిలో నూటికి తొంబదిమంది వీపునకొక పసిబిడ్డను కట్టుకొనియున్నవారే కాన్పింతురు. బిడ్డల కాలుసేతులు స్వేచ్ఛగా వ్రేలాడుచుండును. తల్లులు నిండు సత్తువతో పెద్ద పెద్ద బరువులను ఇటునటు నెట్టుచు, సర్దుచు, చంగుచంగున పడ వనుండి పడవమీదికి దుముకులు పెట్టుచుండ నిశ్చింతగా వారి వీపుల వ్రేలాడుచుండు ఈ చీనాపాపలను చూడ విచిత్రముగ నుండును. ఆ నావలు, ఆ స్టీము పడవలు తండోపతండములై రివ్వురివ్వున వచ్చుచు పోవుచునుండును. ఏ క్షణమున కాక్షణము ఆ బుడతల బుఱ్ఱలు తోకజడలతో సహా తుక్కుతుక్కుగా నలిగిపోవునేమో యను భీతి గొలుపుచుండును. కాని ఆ బాలకు చీకు చింతలు లేవు. ఎంతటి అలజడియున్నను వారికే దిగులునులేదు. పనులలో మునిగియున్న తల్లులు అప్పుడప్పుడు తమచేతుల కందిచ్చు అట్టుముక్కలంగైకొని వాని నిర్మాణ పరిశోధనలు చేయుచుందురు. చీనా పసివారు మహా

తత్త్వశోధకులవలె నుందురు. మన హైందవ శిశువులకు తిన్నగా ప్రాకులాడనైన చేతగాని ప్రాయముననే వారు చక్కగా పనిపాటులకు పోదురు. దారిద్ర్యతత్త్వము వారికి బాగుగ పట్టుబడిపోయినది. చీనావారును హైందవులును మృతప్రాయమైపోయిన నాగరికదశలో పడియుండుటకు వారి నిరంతర దారిద్ర్యమొక ముఖ్యకారణమై యున్నది. చీనావారి యొక్కయు, హైందవుల యొక్కయు పేదరికము దినదినము దుర్భరము కాగా, యితర విషయములం గుఱించి విచారించుటకు వారి కవకాశమే లేకుండపోయినది.

ఈ 'హాంకాంగు' చాల అందమైన పట్టణము. ఈ పట్టణము పర్వత పార్శ్వములందున్నది. నగరములోకన్న శీతలముగనుండు పర్వత శిఖరములందు ఇది నిర్మితమైయున్నది. దాదాపు నిటారుగా ఈ కొండ తలలపై తీగత్రాళ్లతో ఆవిరియంత్రముల సాయమున లాగబడు ట్రాముబండ్లు గలవు.

మేము హాంకాంగులో మూడుదినములుండి అక్కడికి ఎనుబది మైళ్లదూరాన, నదికి ఎగువనుండు 'కాంటను' నగరము చూడబోతిమి. ఆహా! ఆ కోలాహలము, ఆ జీవన వైఖరి ఏమని వర్ణించుట! నదీజలములను నిండుగ కప్పివేసినట్లుండు లెక్కకు మించు ఆ పడవల సమూహమేమి! వర్తకమున కుపకరించు నావలే గాక నివాసగృహములుగ వినియోగపడు పడవలు వందలకొలది కలవు! ఇన్ని అన్ని యని లెక్కింపలేము. మఱియు నవి సొగసుగను పెద్దవిగను కూడనున్నవి. నిజమున కవి పెద్ద భవనములే! రెండు మూడంతస్తులతో ఎత్తుగనుండును; మఱియు చుట్టును వసారాలు సయితము కలవు. నడుమ నడుమ వీథులు తీర్చియుండ ఈ పడవలన్నియు తేలియాడుచుండును.

పరదేశీయులు వాసముచేయుటకై చీనాదొరతనమువారిచే నొసగబడిన సన్నని చీలికవంటి తీరముపైని మేము దిగితిమి. మాకుచుట్టును నదికి రెండు వైపులను మైళ్లకొలదిగ వ్యాపించిన ఆ మహానగరము గోచరించినది. ఒండొరుల త్రోసికొనుచు, నెట్టుకొనుచు, ఏలుగెత్తి యఱచుచు, పరువులిడుచు పోవు ఆ ప్రజాసమూహము మహారణ్యమును బోలును!

ఇంతటి జనసంఖ్యయున్నను, ఇంతిటి చులుకుదనము చూపట్టుచున్నను నేను చూచినంతటిలో ఈ పట్టణము మిక్కిలి మలినభూయిష్ఠమైనది. అనగా భారతదేశపు పట్టణములబోలి మురికిగా నున్నదనుట కాదు లెండు. ఆవిషయములో మాత్రము చీనావారు నలుసంత పెంటనైనను వ్యర్థముగ పడియుండనీరు. కాని చీనావారు 'ఎన్నడును స్నానముచేయ మని ఒట్టుపెట్టుకొనిరో' యని తోచును. ప్రతిగృహమును ఒక అంగడి యిల్లే! ఇంటివారు మాత్రము పైఅంతస్తులో కాపురముందురు. వీథులు చాల యిరుకుగానుండును. అందుపోవువారికి యిరు ప్రక్కలనున్న అంగడులు దాదాపుగా తాకుచుండును. ప్రతి పదడుగుల దూరాన మాంసపు దుకాణాలు, వానిలో కుక్కలమాంసము, పిల్లులమాంసము నమ్ము దుకాణాలుకూడ గలవు. చీనావారిలో నిరుపేదలు మాత్రమే కుక్కలను, పిల్లులను తిందురనుమాట చెప్పనక్కరలేదు.

చీనా శ్రీమంతురాండ్రు ఎన్నడును కంటబడరు. ఉత్తర హిందూదేశమువలెనే ఇక్కడ ఘోషా పద్ధతియందు గట్టి పట్టుదల. కూలి జనపు స్త్రీలు మాత్రమే కానవత్తురు. వీరిలో సయితము మన చంటిబిడ్డల పాదములకన్నను చిన్నవగు పాదములుగల స్త్రీలు అప్పుడప్పుడు కాన్పించుచుందురు. సరే, అట్టివారు నడువజాలరు గదా! కుంటుకొనుచు పోవలసినదే.

నేను చాల చీనాదేవళములను చూడబోతిని. 'కాంటను' లోని కెల్ల పెద్దదేవళము ప్రప్రథమ బౌద్ధ సామ్రాట్టుయొక్కయు, మొట్టమొదటివారగు అయిదువందల బౌద్ధమతావలంబుల యొక్కయు, జ్ఞాపకార్థము అంకితమైయున్నది. మధ్యనున్న విగ్రహము బుద్ధదేవునిదే. వానికి క్రిందుగా చక్రవర్తి ఆసీనుడై యున్నాడు. ఇరుప్రక్కలను వరుసగా కొయ్యలో చెక్కబడిన భక్తుల విగ్రహములు అందముగా తీర్చబడియున్నవి.

'కాంటను' నుండి తిరిగి 'హాంకాంగు' నకు, అందుండి 'జపాను' కు చేరితిమి. మేముచేరిన మొదటిరేవు 'నాగసాకి'. కొలది గంటలపాటు ఒడ్డునకుదిగి పట్టణమును చూడబోతిమి. ఆహా! ఎంతటి వ్యత్యాసమో! ఈ జపానువారిది లోకములో(నె) అతి పరిశుభ్రమనుగానుండు(ను). జాతులలో

నొకటి. ఇచ్చట సమస్తమును చక్కగ తీర్చినట్లుండును. వీరి వీథులు దాదాపుగా నన్నియు వెడల్పైనవి. సరళముగను తిన్నగ రాయిపరచి నవిగను నున్నవి. వీరి చిన్నయిండ్లు పంజరముల బోలియుండును. 'పైను' వృక్షములతో పచ్చనై సతతము శోభిల్లు చిన్నచిన్న కొండలు దాదాపుగ ప్రతినగరమునకును, ప్రతిగ్రామమునకును వెనుక తెరవలె నమరి యుండును. జపానీయులు పొట్టివారు; పసిమివర్ణము గలవారు. విచిత్ర వసనముల ధరింతురు. వారినడకలు, వారి చూపులు, వారి అంగవిన్యాసములు సర్వమును సొబగు మీరియుండును. జపానుదేశము సొగసులకు నిలయము. ప్రతి యింటికిని వెనుక జపానీయుల సంప్రదాయాను సారముగ చిన్నిగుబురులతోడను, పచ్చిక దిబ్బలతోడను జలధారల తోడను, చిన్న చిన్న రాతివంతెనలతోడను ముచ్చటగ కూర్పబడిన కొలదిపాటి తోట యొకటియుండును.

'నాగసాకి' విడిచి 'కోబు' నగరము చేరితిమి. జపానుదేశపు లోపలిభాగమును చూచు కోరికతో అక్కడ స్టీమరు విడిచివేసి మెట్ట దారిని'యోకహామా'కు వచ్చితిమి.

లోపలిభాగమున నేను మూడుపెద్దనగరముల గాంచితిని. పెద్ద పారిశ్రమిక నగరమగు 'ఒసాకా', పురాతనరాజధానియగు 'కియోటో', ఇప్పటిరాజధానియగు 'టోకియో' నగరముల చూచితిని. టోకియో నగరము రమారమి కలకత్తాకు రెండురెట్లు వైశాల్యముకలది. జన సంఖ్య రెట్టింపుగలదు. అనుజ్ఞాపత్రము (ప్యాసుపోర్టు) లేకుండ యెవ రును ఈలోపలిభాగమున సంచారముచేయ వలనుపడదు.

జపానీయులు ఆధునిక కాలానుగుణ్యములగు అవసరములను పూర్తిగ గ్రహించినటుల కాన్పించుచున్నారు. వారికి సుశిక్షితమైన సైనికబలముగలదు. వారి సొంతయుద్యోగులలో నొకరు కనిపెట్టి నిర్మాణముచేసిన శతఘ్నులతో వారు సాయుధులైయున్నారు. ఆశత ఘ్నులు మఱి వేనికిని తీసిపోవునవి కావందురు. ఇంకను వారి నావికా సైన్యము సతతము పెంపుచేయబడుచున్నది. ఒక జపాను శిల్పావతం సునిచే తొలువబడి దాదాపు ఒక మైలు పొడవుగల నేలసొరంగము నొకదానిని చూచితిని.

వీరి నిప్పుపెట్టెలుచేయు కర్మాగారము చూచితీరవలసినదే. వీరికి అక్కరయున్న సర్వమును ఇక్కడనే సిద్ధముచేసికొన వీరు ప్రతిన బూని యున్నారు. చీనాజపానుల మధ్య ప్రయాణములు చేయుస్టీమరులు గలవు. కొలదికాలములో బొంబాయి యోకహామాలమధ్యకూడ వారి స్టీమరులను నడుపు యేర్పాటులుచేయ నుద్యమించియున్నారట.

నేను యెన్నెన్ని దేవళములనో జూచినాను. ప్రతిదేవాలయము నందును కొన్ని సంస్కృతమంత్రములు ప్రాచీనవంగలిపిలో వ్రాయబడి యున్నవి. సంస్కృతము తెలిసిన అర్చకులు చాలతక్కువను. కాని వారు చాలామేధావంతులు. పురోభివృద్ధి సాధింపవలయుననెడు ఆధుని కుల తీవ్రవాంఛ ఈ అర్చకబృందమునుకూడ ఆవహించినది. ఒక్క చిన్నఉత్తరములో ఈ జపానీయులనుగూర్చి నామనస్సులోనున్న దాని నంతను వ్రాయజాలకున్నాను. మనయువకులనేకులు ప్రతిసంత్సరము ను ఈ జపాను దేశమునకు వచ్చి చూచిపోవలయుననియే నా యభి మతము. జపానీయులకు భారతదేశమనగా ఇప్పటికిని ఉన్నతమును ఉచితమునగు సర్వమునకు నిలయమను అభిప్రాయము కలదు. కాని మీరో! మీరెటులున్నారు? వ్యర్థప్రలాపములతో మీ జీవితము లన్నియు గడచిపోవుచున్నవి. వట్టి వదరుబోతులు! రండు మీరెటు లున్నారో, ఈ ప్రజలెటులుండిరో చూచిపొండు. ఇక మీరు సిగ్గుతో ముఖములమీద ముసుగులు పెట్టవలసినదే. మీరు గాశాబపు పసి కూనల జాతివై పోయినారు. బయట కాలిడితిరా, మీరు కులభ్రష్టు లై పోదురుగా! గడ్డ కట్టిపోయిన మూఢ విశ్వాసముల నెత్తినవేసి కొని, ఆ భారముతో వందలకొలది సంవత్సరాలుగా మూలమూలల నడగియున్నారు. నూరులకొలది సంవత్సరాలుగా ఎట్టికూడు తాకదగునో, ఎట్టిది తాకరాదో యను చర్చలతో మీ శక్తినంతను వ్యర్థ పుచ్చుకొనుచున్నారే? యుగయుగములనుండి వెంటాడి వచ్చుచున్న సాంఘిక దౌర్జన్యము వలన మీరు మానవత్వమునే కోలుపోయి యున్నారు. కటా! ఇప్పుడు మీరెట్లున్నారు? ఏమిచేయు చున్నారు? పొత్తకాలు చేతబట్టుకొని సముద్రతీరాన తిరుగులాడుట, యురపియను ల మెదడునుండి రాలిన నాలుగు ముక్కలేవో జీర్ణముకాగానే వల్లె

వేయుట, ముప్పదిరూపాయల గుమాస్తాగిరి సంపాదించు టెట్లాయని పంచప్రాణాలను ఆ మహోద్యమమునకై అర్పించుట, లేదా, లాయ శే అయిపోవుటో! అంతటితో భారతయువకులు ఆశాపర్వత మహో న్నతాగ్రము చేరినట్లే ప్రతి విద్యార్థిని కాళ్లను చుట్టవేసికొని 'బుస్సో ట్టు బాబయ్యా' అంచు మొత్తుకొను కన్నబిడ్డల గుంపొకటి! కటా, మీ పొత్తములను, మీ గౌనులను, మీ విశ్వవిద్యాలయ యోగ్య తా పత్రాలను అన్నిటిని మిమ్ములను ఒక్కొక్కనిని ముంచివేయుటకు చాలనన్ని నీళ్లైనను సముద్రములో లేవా ?

రా! రండు రండు! పురుషులై మెలగుడు. పురోగమనమునకు అడ్డు దగులు పురోహితగణమును నెట్టి పారవేయుడు. ఏమందురా! వారెన్నడును చక్కబడబోరు. వారి హృదయము లెన్నడును వికాస మును చెందవు. శతాబ్దములనుండి పెరిగి వచ్చుచున్న మూర్ఖవిశ్వాస ములకును దౌర్జన్యమునకును వారసులై వారుపుట్టియున్నారు. ముమ్మ డుగా ఆపురోహిత కూటమును పెకలించివేయుడు. రండు రండు! పురు షులు కండు! మీ మీ ఇఱుకు బొక్కలలోనుండి వెలికిరండు విశాల ప్రపంచమును కన్నెత్తి చూడుడు. ఇతరజాతులు ఎటుల వర్ధిలుచు న్నవో గమనించుడు. మీకు నరుడనిన అభిమానము కలదా; మీకు మీదేశమున ప్రేమ కలదా? అటులైనచో రండు! ఉన్నతమును, యోగ్యతరమునగు ఉద్యమముల కొఱకై పాటుపడుదము. రండు వెను చూపు పెట్టకుడు మీ అత్యంత సన్నిహితబంధువులు గాని, ప్రియతము లగు మిత్రులుగాని, శోకములు పెట్టుదురుగాక అటుచూడకుడు! వెనుక చూపనునది తగదు; నడువుడు! పురోగాములైనడువుడు!

భారతమాత కనీసము ఒక వేయిమంది భారతయువకుల బలి అర్పణము కోరుచున్నది. అందుకు పురుషవరులును, మేధావులును కావలయును; నట్టి పశుప్రాయులు తగరు సుడీ! గడ్డకట్టుకొనిపోయిన మీనాగరికతను చితుకకొట్టుటకై భగవంతుడు ఆంగ్లరాచరికమను సమ్మెటను తెచ్చిపెట్టినాడు. ఆసమ్మెటకు చేయూతనొసగుటకై ప్రప్రథ మముగా చన్నపురివారు సంసిద్ధమైనారు. ఈనాడో! దరిద్రులయెడ సానుభూతియు, ఆకొనియున్నవారి నోటికి ఆకమువ్వ అన్నమును, జన

సామాన్యమునకు విజ్ఞానప్రకాశమును అమరులాగున నూతన పరిస్థితులను సమకూర్చునిమిత్తము చావు బ్రతుకులచూచుకొనకుండ శ్రమించునట్టి స్వార్థరహితులును, పూర్ణప్రజ్ఞావంతులునగు పురుషవరేణ్యులను ఎంతమందిని అర్పణముచేయుటకు ఆ చన్నపురి సంసిద్ధముగనున్నదో చూతము! మీపూర్వుల దౌర్జన్యమువలన పశుతుల్యులుగానొనర్పబడినవారలను తిరిగి మానవులనుగా చేయుకొఱకు మీలో నెంతమంది తమ జీవితములను సమర్పణముగావించి పాటుపడుదురో చూడవలసియున్నది.

ఇట్లు మీ,
వివేకానంద.

(ఉ-వే) కావలసినది పరిశాంతమును నిరాడంబరమును సుస్థిరమునగు పనియేగాని వార్తాపత్రికల బూటకపు ప్రకటనలుకావు. పేరు ప్రఖ్యాతులుకావు. ఈమాటను సదామదిని జ్ఞప్తినుంచుకోవలయును సుడీ.

---

ఓమ్.

# సదుపదేశములు.

(శ్రీ మలయాళ స్వాములవారు.)

181. కృషిచేయు వాడొకడు గోధుమ, వరి, సజ్జ, రాగి మొదలగు పైరులు చేయుచున్నచో వానిలో ఏపైరు చెడునో దానిఫలితము మాత్రము వానికి లేకపోవునేగాని తక్కిననాటి ఫలితములు లేకపోవుగదా! ఆలాగున నొకడు సత్యమును, శాంతమును కరుణను, వైరాగ్యమును బ్రహ్మచర్యమును అహింసను, పాలించుచుండిన, వీనిలో దేనికైన భంగము గలిగినచో దానివలన గలిగెడు ఫలముమాత్రము లభింపక పోవునేగాని తక్కిన యనుష్ఠానముల ఫలములు లభింపకపోవు.

182. సాధువులారా! ఏవృక్షపు ఆకులైనను పచ్చిగానున్నపుడు రాలవు. పండునపుడే రాలిపోవును. ఆలాగున సత్వగుణము పరిపక్వ దశకు వచ్చునపుడే యింద్రియములను విషయములు ఆత్మనుండి రాలి పోవును. రజోగుణముగాని తమోగుణముగాని యుండునంత వరకు విషయములను తొలగింప జూచినను అవితొలగనేరవు.

183. ముముక్షువులారా! ఒకరు సౌఖ్యవంతులు గావలెనన్న యుండిన ఋణము మాత్రము లేక యుండిన చాలదు. ధనవంతుడు కావలెను. అట్లుండగా ధనహీనుడును ఋణస్థుడుగాను నుండిన అట్టి వానికి సుఖమెట్లు గల్గును? ఆలాగున నిత్యశాంతియు శాశ్వత సౌఖ్య మున్ను మీకు కావలసియుండిన ప్రాకృత గుణములు లేక యుండిన మాత్రము చాలదు. కరుణ, విరక్తి మున్నగు సుగుణ సంపత్తియున్ను గలిగియుండవలెను. అట్లుండగా సుగుణ రహితమును. దుర్గుణ సంభరిత మునగు హృదయములో యెట్లు నిత్యశాంతియు నిరతిశయ సౌఖ్య మున్ను గల్గును? అయితే ఋణము లేనిచో బాధమాత్రము గలుగదు. ఆలాగున విషయ దోషములేనిచో ప్రకృతి బాధ గలుగదు.

184. జనులారా! జీవితమంతయు పవిత్రముగ లేనిచో మీరెప్పు డైన మనోశాంతి కొఱకుకాని ధ్యానము కొఱకుగాని వెళ్లినపుడు మీరొనర్చిన పాపకార్యములు మిమ్ములను బాధించుచుండును. అత్తఱి ఇతః పూర్వమొనర్చిన పాపకార్యము లన్నియు జ్ఞాపకమునకు వచ్చును దానివలన నిరంతరము మనోక్లేశము గలుటగుయేగాక చిత్తభ్రాంతికూ డగలుగ వచ్చును. ఆలాగున మీరేకాంతమున బ్రహ్మనిష్ఠ చేయునప్పు డుగాని, తపమొనర్చు నప్పుడుగాని దీనికి పూర్వముచేసియుండు పుణ్య కర్మములన్నియు జ్ఞాపకమునకు వచ్చి అపరిమితానందమును గలుగ చేయును. అట్లనే ఎచ్చటికి పోయినప్పటికిని పాపమున్ను ఆలాగున బాధించుచుండును. కావున యీ కార్యములో యెంతో జాగ్రత గలిగి యుండవలెను. కావుననే కొందఱు పుణ్యభూములలోనుండి తపమొన ర్చుచున్నను, ఏమైన కష్టములు వచ్చినప్పుడు తాను పూర్వము చేసిన కర్మలను గుఱించి వ్యాకుల చిత్తముగలిగి క్లేశముతో దుఃఖించుచు

దురు. కావున తానుచేయు సమస్త కార్యములను సాక్షిరూపముగ నుండి సర్వేశ్వరుఁడు చూచుచున్నట్లు మఱువఁగూడదు.

185. నిర్జలప్రదేశములో నెంత తిరిగినను దాహముతో తపించుచున్నవానికి దాహశాంతి యెట్లుగలుగదో, పుణ్యనదీజలములోనికి ప్రవేశించిన యెట్లు దాహశాంతి గలుగునో, ఆలాగున తురీయములోనికి ప్రవేశించు వఱకును, సంకల్పములుడిగి దైవభావములో నిలుకడ గలుగు వఱకును, జీవునకు నిత్యశాంతి గలుగదు. కావున దాహముతో యెడారిలోనుండువారు యెంత త్వరితముగ జలాశముదగ్గరకు జేరనిశ్చయింతురో, ఆలాగున బాహ్యకర్మ కాండములోను, బాహ్యలోకములోను సంచరించెడి స్వభావముగల జీవుఁడు అంతశీఘ్రముగ ఆత్మానుసంధానములోనికి ప్రవేశించవలెను. అప్పుడే బ్రహ్మనిష్ఠయొక్క పరమ సుఖమును అనుభవింపగలుగును. అయితే మనస్సు ఉపరతిని పొందవలసి యుండినను చలనముడుగ వలసియుండినను వృత్తులు నశింపవలెను. వృత్తులు నశించుటకు వైరాగ్యము బాగుగ కలుగవలెను. వైరాగ్యము కలుగ వలసియుండిన పాపకర్మలు నశించిపోవలెను. అట్టి పాపము నశించవలసియుండిన సత్కర్మలు చక్కగ నాచరించవలెను.

186. కొందఱీలాగున చెప్పుదురు 'మాకు యేలాటి సంకల్పములున్ను, వృత్తులున్ను లేవు. కాని ఆత్మశాంతి, నిర్మలసౌఖ్యము కలుగలేదు' ఈ వాక్యము సత్యమైనది కాదు. ఆకాశము నిర్మలముగానున్నది గాని సూర్యుడుగాని చంద్రుడుగాని కనుపించుటలేదని చెప్పినచో ఎట్లు పొసగదో ఆలాగున నిజముగా హృదయ నిర్మలత్వమున్ను నిస్సంకల్పమున్ను గలిగిన, నిరతిశ బ్రహ్మ సుఖము గలుగకపోదు.

187. మఱికొందఱిట్లు చెప్పుదురు 'మాహృదయములో యేలాటి గుణములున్ను విషయ వాసనలున్ను లేవు గాని; ఆత్మశాంతియు, నిజమగు ఆత్మదర్శనము (దైవభావము) న్ను గలుగలేదు.' ఇదిన్ని ఆత్మలో సత్యము గలిగిన వాక్యము గాదు. ఇది యెటువంటి దనగా:— మానేత్రములో ఏలాటి రోగములేదు, పటలముగాని పొరగాని యేమి

యు లేదు. కాని కన్ను మాత్రము కనుపించుటలేదు. యిదిన్ని సత్య
మైన వచనముకాదు కంటిలో యేలాటి దోషములేనిచో కనుపించక
పోదుకదా! వీరు సత్యమెఱుంగుటకు లోతుగ విచారించిన నిజము
కనుగొనగలరు.

188. ఇకకొందఱిట్లు చెప్పుదురు 'మాయంతఃకరణములో యేలాటి
సంకల్పములున్ను, కోరికలున్ను, వృత్తులున్ను లేవు. కాని నిరాటంకము
గా దైవసుఖము గలుగుటలేదు! ఇదిన్ని సత్యమైన వాక్కుగాదు
చెరువు నుండి జలమువచ్చెడు తూములో యేలాటి అడ్డులు లేవు కాని
నీళ్లుమాత్రము వచ్చుటలేదు! అనిచెప్పిన దానికేమి అర్థముగలదు!
జలమువచ్చు ద్వారములో ఏదైన అడ్డులేనిచో జలము రాకుండ
పోవునా? కావున ఈలాగున చెప్పువారు తమఆత్మలో బాగుగ పరిశోధన
చేసిన, లోపము కనుపించకపోదు. అట్టిలోపము నివృత్తి చేసిన నిరతి
శయదైవసుఖము అనర్గళముగ ప్రవహించుచుండును.

189. మనోనిర్మలమున్ను, చిత్తశాంతియు గలుగవలయునని తల
చువారికి ఒక ఉపాయముగలదు. అదేమన మితభాషణమున్ను, ఏసమ
యములోను మాటాడునప్పుడుగాని యితర కార్యములు చేయునప్పుడు
గాని ముఖమందేలాటి అప్రసన్న భావముగలుగనీయక చూచుటయు
నగును. ఈమొదలగు అభ్యాసములునేర్చుకొనిన మనోజయము సు
భముగ గలుగును. చుక్కానివాడు జాగ్రతగలిగి యుండిన, ఎట్టిగాలి
లోగాని, ప్రవాహవేగములోగాని ఏలాగున కొంచమైనను అపాయము
గలుగకఓడను తీసికొనిపోగల్గునో, ఆలాగున యీఅభ్యాసమున్ను మ
నుజుని దరిజేర్చగలదు.

———:o:-———

# శ్రీ బుద్ధోపదేశము.

(బౌద్ధమధ్యసికాయము నుండి).

[శ్రీ బుద్ధదేవుని కుమారుడగు రాహులుడు బాల్యకాలముననే సన్న్యసించి వేణువన సమీపమున నేకాంతమున ధ్యాననిష్ఠ శీలించుచుండ, శ్రీ బుద్ధదేవుడొకనాడచ్చోటికి వెళ్లి వానికి యుపదేశించెను. అదియిట పేర్కొనబడినది.]

'ఓ రాహులుడా! అసత్యము బల్కువానియందు సాధుత్వమిసుమంతైన నుండదు. సాధుత్వము, పవిత్రత మున్నగునవి అసత్యముబల్కు వానిని వీడిపోవును. కాన నవ్వులాటలందైనను అసత్యము బల్కనని దృఢనిశ్చయము గావించుకొనుము. బాగుగ విచారించియే శరీర వాఙ్మనంబులచే కార్యముపక్రమించవలెను. తనకుగాని, యితరులకుగాని బాధకరమైన యేకార్యమును చేయరాదు. పాపకర్మ దుఃఖమునకు హేతువగును. పుణ్యకర్మ సుఖమునకు హేతువగును. కాన బాగుగ పర్యాలోచించి శరీరవాఙ్మనంబులచే యుత్తమ కర్మనే ఆచరింపవలెను. పూర్వకాలమందెందఱో సాధువులు, పవిత్రాత్ములు యిట్టి పుణ్యకార్యములనే త్రికరణ శుద్ధిగ గావించియుండిరి. ఇపుడును గావించుచున్నారు. భావి కాలమునను అట్లనే చేయగలరు. కాన నీవును శరీర వాఙ్మనంబుల లెస్సగ బరిశోధించి యుత్తమ కార్యాచరణమే చేయుచు హితమొనగూర్చుకొందునను దృఢనిశ్చయము గావించుకొనుము.

ఓ రాహులుడా! భూత భవిష్యద్వర్తమాన కాలములందున్నది గాని' శరీరముయొక్క బాహ్యాభ్యంతరములందున్నదిగాని, స్థూలమైనదిగాని సూక్ష్మమైనదిగాని, మంచిదిగాని చెడ్డదిగాని, దూరముననున్నదిగాని సమీపముననున్నదిగాని యగు 'రూప'మంతయు - 'ఇది నాది కాదు' 'దీనితో నాకు సంబంధము లేదు' 'ఇదినాయాత్మగాద'ని నిశ్చయించుకొనవలెను. అట్లనే వేదన (అనుభవము), సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానము (మనోధర్మము) - ఇవన్నియు అనాత్మరూపములే, యను నిశ్చయము గావించుకొనవలెను.

[ బుద్ధదేవుని యీ యుపదేశమును వినిన రాహులుడంత, గ్రామమున భిక్షాటనమునకుగూడ బోవక యొక వృక్షముక్రింద గూర్చుని, ఆసనమువై చికొని, శరీరమును తిన్నగ నిలపి, స్మృతి ప్రజ్ఞతో గూడియుండి ధ్యాననిష్ఠ యవలంబింపసాగెను. బుద్ధదేవుడది జూచి వానిని బిలచి మరల నిట్లుపదేశించెను. ]

రాహులుడా! ప్రాణాయామ సహితముగ మహా-స్మృతిని (ప్రజ్ఞను) భావనజేయుచున్నచో నయ్యది గొప్ప ఫలమును గలుగ చేయును. అట్టి ప్రజ్ఞ గొప్పమహాత్మ్యము గలదని యెఱుంగుము.

రాహులుడు:—దేవా! ఎవ్విధమున భావనజేసిన నా మహా ప్రజ్ఞ గొప్పఫలమును గలుగ జేయునదగునో వచింప వేడెద.

బుద్ధదేవుడు:—రాహులుడా! నీ శరీరమునగాని, యితరుల శరీరమునగాని నున్న కేశ, రోమ, నఖ, దంత, చర్మమాంస, అస్థి, మజ్జాది కఠినపదార్థములన్నియు పృథివీధాతువునకు జెందినవని యెఱుంగుము. ఇది ఆభ్యంతర పృథివీ ధాతువగును. బాహ్యపృథివీధాతువు ప్రత్యక్షముగనే యున్నది. ఈబాహ్యాభ్యంతర పృథివీ ధాతువంతయును ఇది నేను గాను, నాకు దీనితో సంబంధము లేదు. ఇది నాయాత్మ గాదు అని నిశ్చయింనుకొనుము. ఇట్లు యథార్థతత్వమును బాగుగా నెఱుంగుటచే సాధకునకు పృథీవీధాతువునందు విరక్తి, ఔదాసీన్యము జనించును. ఇవ్విధముననే బాహ్యాభ్యంతర జల, అగ్ని, వాయు ధాతువులనుగూడ అనాత్మ రూపములని యే ధృఢముగ భావించుటచే వానియాదనాసక్తి యుదయమగును. పిదప ఆకాశ ధాతువును గూర్చి యిట్లు చింతనచేయవలెను. నాశరీరమునగాని యితరుల శరీరమునగాని యున్న ఆకాశ విషయకములైన. కర్ణ-ఛిద్ర నాసికా-ఛిద్ర ముఖద్వారాదులున్ను, బాహ్యమందున్న ఆకాశమున్ను, ఇది నేను గాదు, దీనితో నాకు సంబంధము లేదు, నాయాత్మ స్వరూపముగాదు అని నిశ్చయించుకొనవలెను. అపుడు అకాశ ధాతువు యెడ కూడ విరక్తి జనించును.

పృథివీధాతువును భావనజేయుచు రాగా రాగా స్పర్శాదులు నిన్నిక బాధింపకుండును భూమిపై శుచి, అశుచి వస్తువుల రెంటిని

గూడ పడవైచుచున్నను, అది దుఃఖమును గాని, ఏవిధమైన సంతాప మునుగాని జెందుటలేదు గదా! అట్లనే ఓరాహులుడా! పృథివీభావన చేయుచూ రాగా రాగా నీచిత్తమును స్పర్శాది దుఃఖములేవియు చేయ జాలవు. ఇవ్విధముననే జలమందును, అగ్నియందును మంచి వస్తువులను గాని చెడువస్తువులనుగాని వైచినను, అవి సుఖదుఃఖములం జెందక యుండుట తెల్లమే గదా! వాయువు, దుర్గంధయుక్త స్థలములందును, సుగంధ యుక్త ప్రదేశములందును వీచుచు, ఆ యా పదార్థములచే సుఖదుఃఖముల నెందక యున్నట్లు, నీవున్ను ఆయావాయ్వాది ధాతువులను భావన చేయుచునున్న, సుఖదుఃఖాదులు నీచిత్తము నేమియు బాధింపకుండును. ఆకాశము దేసిపైనను ప్రతిష్ఠితముగాక యున్నది. అట్టివిశాలాకాశమును భావన చేయుటచేతను స్పర్శాదులు నీచిత్తమున కేవ్యథయగలుగజేయ జాలకుండును.

ఓ రాహులుడా! మైత్రీభావన (సర్వులను మిత్రులుగ దలంచుట) మొనర్చుటచే ద్వేషము నిన్ను వీడిజనును. కరుణాభావన (సర్వ ప్రాణికోట్లయెడ దయ)చే హింసాభావము నశించును. ముదత భావనచే చిత్తమున కప్రియమైన దేదియునుండ కుండును. ఉపేక్షా భావనచే ప్రతిహింసా భావము నశించును. అశుభ (విషయభోగములు తుచ్ఛముల ను) భావనచే పదార్థములయెడ రాగమునశించును, అనిత్యత్వ (పదార్థములన్నియు అనిత్యములను) భావనచే అహంకార మడుగంటును.

అరణ్యమునగాని, వృక్షచ్ఛాయ యందుగాని, శూన్యగృహమునగాని, మఱియే యేకాంత ప్రదేశమునగాని ఆసనము వైచి కూర్చుండి, శరీరమును ఋజువుగానిలిపి, ప్రజ్ఞాయుతుడై, సాధకుడుం డుచ్ఛ్వాస నిశ్వాసములను, మనోభావములను బాగుగా గమనించు చుండవలెను. చిత్తమందలి సంస్కారముల నణచి, రాగాది దోషముల నశింపజేయుచు, పదార్థములన్నిటియందును అనిత్యత్వభావనచేయుచు మనమును సమాధాన మొనర్చుచు, ప్రసన్నవంతముగా జేయుచునుండవలెను. త్యాగము నభ్యసింపవలెను. త్యాగాది యుత్తమ భావము లతో గూడియే ఉచ్ఛ్వాస నిశ్వాసముల గావింపవలెను. ఇవ్విధమున ప్రాణాయామ సహితమగు నాప్రజ్ఞాభావన యుత్తమ ఫలం బొసంగు నదగును.

# 6. ఆత్మసంయమ యోగము.

దీనికి ఆత్మసంయమ యోగమని పేరు. ఇందు ఆత్మయనగా మనస్సులేక జీవాత్మయనియు అర్థము గలదు. సంయమ మనగా నో ములో నుంచుకొనుట లేక ఆత్మను పరమాత్మలో లయమొనర్చుట. ఆత్మనియమయోగమని చెప్పక ఆత్మసంయమయోగమని చెప్పిరి. సం యమన మనగా లెస్సగ నియమనము గల్గియుండవలెనని గ్రహించదగి నది. మనోనిగ్రహ మనినను మనోలయమనినను, మనోజయమనినను మనోరాహిత్యమనినను, యొకే అర్థము. మనోనిగ్రహముగాని మనో లయముగాని గలుగవలసియున్న, ఆత్మలో గల సంస్కారములన్నియు నశించవలెను. గుణములన్నియు రహితము కావలెను. దీనికి కావల యుండు ఉపాయములన్నియు యీ అధ్యాయమున శ్రీ భగవానుల పదేశించియున్నారు. యోగ శాస్త్రములన్నిటిలోను ఏ యే యను ష్ఠానములుపదేశింపబడినవో, అవన్నియు యీ అధ్యాయమున గలవు. దీనిలోగల అనుష్ఠానమును చేయుటకు ప్రత్యేకముగ ఒక జాతివారు గాని, దేశమువారుగాని, బ్రహ్మచర్యాద ఆశ్రమములందలివారుగాని, స్త్రీలుగాని పురుషులుగాని భేదమేమియు గన్పించుటలేదు. మనోనిగ్ర హము గల్గిన చాలునని యుపదేశింపబడినది. కావుననే ఆత్మసంయమ యోగమని పేరిడుటకు కారణమైనది. హఠయోగాదిగ్రంథములలో జెప్పినట్లు దీనియందు కఠిన సాధన లేవియు తెలిపియుండలేదు. సర్వ జనులకు ఆచరించుటకు సులభసాధ్యము. నివృత్తి మార్గములన్నిటి లోను మనోనిగ్రహము సాధించుట చాల ప్రయాసమైన విషయము. అట్టి నిగ్రహము దీనియందు సులభముగా నిరూపించడమైనది. రెండ వది నివాసస్థలము. మూడవది ఆహారనియమము. ఇవన్నియు నీ యధ్యాయమున సామాన్య జనులకు గూడ యాచరించుటకు సాధ్య మైనట్లు యుపదేశింపబడెను. ఆత్మ సంస్కారమందు సాధకుడు సదా మనస్సునుంచి జాగ్రతగ పరిశోధించుచుండవలెను. సమస్తమునకదియే మూలస్థానము. ఆత్మసంస్కారమనినను ఆత్మసారి శుద్ధ్యమనియు ఒకే

అర్థమని యిదివరకే తెలుపబడినది. ఆత్మనిష్ఠలో పూర్తినొందక, దేహము వీడినవానియొక్క పరలోకస్థితియు, మనుజన్మలో యుత్కృష్ట వంశమున జన్మించి బాల్యకాలమునుండియే ఆత్మధ్యానములో గల్గెడు ప్రవృత్తియు, దీనియందు విశదముగా తెలుపబడినది. ఈ భాగమును ముముక్షువులు ముఖ్యముగా జూడవలెను. దీనిలో యీ శ్లోకము ముఖ్యము.—

యం సన్న్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన. 6-2.

'ఓ యర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో, యద్దానిని నీవు యోగమనియు తెలిసికొనుము. ఎవడు మనస్సుయొక్క సంకల్పములను రహితమొనర్పలేదో, వాడెన్నటికిని యోగి కాజాలడు.'

ఓం తత్ సత్.

---

ఓం

# జీవన్ముక్తుని లక్షణములు ఆత్మజ్ఞుని పరిపూర్ణస్థితి.

( శ్రీ యోగవాసిష్ఠమునుండి. )

శ్రీ వసిష్ఠవువాచ:—

నసుఖాయసుఖంయస్య దుఃఖం దుఃఖాయ యస్యనో
అంతర్ముఖమ తేర్నిత్యం సముక్త ఇతి కథ్యతే.

వసిష్ఠుడు :—ఓ రామచంద్రా! నిత్యము సాక్షీ చైత్యమందు విశ్రాంతినొందు యే మహాత్మునకు లౌకిక సుఖసాధనములగు విషయ సమూహములు సుఖమునుగాని, దుఃఖసాధనములు దుఃఖమును గాని, గల్గింపజాలవో అట్టి వాడే జీవన్ముక్తుడనబడును.

యస్యనస్ఫురతిప్రజ్ఞా చిద్వ్యోమన్య చలస్థితేః
ప్రసృతేష్వివభోగేషు సముక్త ఇతి కథ్యతే.

అజ్ఞానుల బుద్ధియెట్లనేక విషయ భోగములందు స్థిరముగ నెలకొల్పబడి యుండునో, అట్లనే యెవని బుద్ధి చిదాకాశమునుండి చలింపక, అందేస్థిరముగ నుండునో, ఆతడే జీవన్ముక్తుడు.

చిన్మాత్రే౽౽త్మని విశ్రాంతం యస్యచిత్తమచంచలమ్
తస్త్రైవరతి మాయాతం సజీవన్ముక్త ఉచ్యతే.

చిన్మాత్ర స్వరూపమగు ఆత్మయందు విశ్రాంతిని బడయు యెవని చిత్తమచంచలముగనుండునో మఱియు నెవఁడాత్మయం సంతుష్టిగల్గి, ఆత్మారాముడై వెలయు చుండునో ఆతడే జీవన్ముక్తు వచింపబడును.

పరమాత్మని విశ్రాంతం యస్యవ్యాపృత్త్యనోమనః
రమతేస్మిన్నపనర్దృశ్యే సజీవన్ముక్తఉచ్యతే.

పరమాత్మయందు విశ్రాంతినొందుచు, యెవని చిత్తము మ యటనుండి మరలి దృశ్యమందు ప్రీతి గొనదో, అతడే జీవన్ముక్తు పేర్కొనబడును.

శ్రీరామ ఉవాచ:—

నసుఖాయ సుఖం యస్య దుఃఖం దుఃఖాయ యస్యనో
జడమేవమునే మన్యే మానవంతమచేతనమ్.

శ్రీరాముడు :— ఓ మునీంద్రా! సుఖ సాధనములు సుఖ గాని దుఃఖసాధనములు దుఖమునుగాని యెవనికి గలిగింపజాల ఆతడు చేతన రహితుడగు జడుడనియే నేనెంచెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

చిద్వస్త్వైకాంతనిష్ఠత్వా త్ప్రయత్నేన వినాసుఖమ్
నవేత్తిశుద్ధబోధాత్మా యఃస విశ్రాంత ఉచ్యతే.

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామచంద్రా! పరిశుద్ధమగు ఆత్మ జ్ఞా ముగల్గి కేవలము చిద్వస్తుపరాయణుడై యుండుటచే లౌకిక సుఖానుభ మునకై యత్నమొనర్పనివాడై యెవఁడుండునో, అనగా యెవఁడ ర్ముఖుడై యుండునో ఆతడే జీవన్ముక్తుడని చెప్పబడును.

సర్వఏవ పరిక్షీణాః సందేహా యస్య వస్తుతః
సర్వార్థేషు వివేకేన సవిశ్రాంతః పదేపదే.

వివేకముచే మూలాజ్ఞానము నశించుటచే యెవనికి సర్వవిష ములందును సంశయములు నివర్తించినవో, ఆతడే యుత్తమ మగ ఆత్మపదమున విశ్రాంతి నొందెనని యెఱుంగుము.

యస్య కస్మింశ్చిదప్యర్థే క్వచిదాసిక్తా స్తినో
వ్యవహారవతోప్యంతః స విశ్రాంత ఉదాహృతః
వ్యవహారములు సల్పుచున్నను యెవనికే వస్తువందును యనురాగము లేకయుండునో ఆతడే ఆత్మపదమున విశ్రాంతి నొందెనని గ్రహింపుము.

యస్యసర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః
యథాప్రాప్తం విహారతః స విశ్రాంత ఇతి స్మృతః.

ఎవని కృత్యములన్నియు, కామ, సంకల్పవర్జితమైయుండునో ఎవడు ప్రాప్తించిన దానిచే పరితృప్తుడై వ్యవహరించుచు నుండునో ఆతనిని శాస్త్ర వేత్తలు విశ్రాంతుడందురు.

అవిశ్రామే నిరాలంబే దీర్ఘే సంసారవర్త్మని
చిత్త్వాదాత్మని విశ్రాంతిః ప్రాప్తాయేన జయత్యసౌ.

విశ్రాంతి రహితమును, ఆశ్రియ శూన్యమును, దీర్ఘమునగు సంసార మార్గమున యలసియున్న యెవడు చిన్మాత్రస్వరూపమగు ఆత్మను దర్శించి, అందే విశ్రాంతి నొందునో ఆతడే సర్వోత్తము డనబడును.

ధా విత్వాయే చిరం కాలం ప్రాప్త విశ్రాంతయః స్థితాః
తే సుప్తాఇవ లక్ష్యంతే వ్యవహార పరా అపి.

వ్యవహారమందు తత్పరులై యున్నను, చిరకాల మీ సంసారమున విషయ సుఖముకొరకు పరిభ్రమించియున్నందున శ్రమనివారణార్థము, సుషుప్తియందున్న వానివలె (పరాఙ్ముఖులై) నున్నవారై, ఆత్మయందు విశ్రాంతి నొందువారు జీవన్ముక్తులనబడదురు.

తే హిచేత్య చిదాభాస నభస్యాభాంతి భామయాః
భాస్కరా ఉదితానిత్యం నే హాతిష్ఠంతి తే క్వచిత్.

అట్టి జ్ఞానులు ద్రష్టృదృశ్యరహితమగు తమ చిత్తాకాశమున ప్రకాశమయమగు సూర్యునివలె నిత్యోదితులై, అనగా నిరంతర మాత్మధ్యాన తత్పరులై యుందురు. మఱియు నట్టివారీ ప్రపంచమునందు (దృశ్యవిషయములందు) కొంచెమైనను ప్రీతిఁగొనరు.

సదేహావ్యవహారస్థా అపి సుప్తా ఇవోత్తమాః
ప్రక్షీణాఇవ లక్ష్యంతే జడభానతు తేజడాః

అట్టి యుత్తమ జీవన్ముక్తులు వ్యవహారములు సల్పుచు, దేహ ధారులై యున్నను, సంశయములన్నియు నశించినవారును, విదేహులును, నిద్రించినవానివలె వ్యవహారమందుదాసీనులునగుదురు. అట్టివారు జడునివలె గన్పించినను, యథార్థముగ జడులు గానేరరు.

దీర్ఘాధ్వ పరి విశ్రాంతో విశ్రాంతో న దదాతియః
వాక్యంస సుఖమౌనస్థః ప్రోచ్యతే న జటాకృతిః.

సంసారమార్గ పరిభ్రమణము నుండి నివర్తించినవారై, ఆత్మ యందు విశ్రాంతిని బడయుచు, నిరతిశయానందస్వరూపమగు ఆత్మ సుఖమునొందుచు మౌనముగనుండి బహిర్ముఖవృత్తిగల అజ్ఞానులతో సంభాషింపక నుండువారు ఆత్మజ్ఞులగు జీవన్ముక్తు లేగాని జడులు కానేరరు.

యానిశా సర్వభూతానా, మ విద్యా స్తమయాత్మికా
పరోబోధః పరాశాంతి స్తత్రసా సమమాస్థితః

అవిద్యాంధకారమున వ్యవహరించు చుండువారల కేది రాత్రియో, అనగా యెద్దానియందువారు నిద్రితులై యుందురో, అట్టిజ్ఞానము అనగా, యుత్తమబోధయే శాంతియొక్క పరాకాష్ఠ యగును. అట్టి ప్రశాంతస్థితియందును, జ్ఞానస్వరూపమందును జీవన్ముక్తుడెల్లపుడును ఏకరూపమున ప్రతిష్ఠితుడై యుండును.

యస్మిన్ జాగ్రతిభూతాని దృశ్యేస్మిన్ దుఃఖదాయిని
తత్రాసౌ సతతం సుప్తస్త న పశ్యత్యసౌసుఖీ.

ఏదుఃఖప్రదమైన సంసారరూపమగు దృశ్యమందు జీవులందరును మేల్కొనియున్నారో, అనగా సావధానమనస్కులై మెలగుచున్నారో, అద్దానియందెవడు సదానిద్రించుచుండునో అనగా, దృష్టియుంచకనుండునో అతడే సుఖభాగి (జీవన్ముక్తుడు) యగును.

యః కర్మాసు మనాదృత్య స్వాత్మన్యేవా వతిష్ఠతే
స ఆత్మారామ ఇత్యుక్తో న జడో౽సౌ రఘోద్వహ.

రఘుకులశ్రేష్ఠుడ వగునో రామచంద్రా! సంసారము మోద విరక్తిఁజెంది కామ్య కర్మములన్నింటిని త్యజించి సుఖరూపమగు ఆత్మ యందు స్థితుడైయుండువాడాత్మారాముడనబడును. అట్టివాడు జడుడు కానేరడు.

దుఃఖాదతి గతః సోऽస్మాత్ ప్రాప్తః పారంభవాంబుధేః
తిష్ఠత్యను భవన్ భవ్యో విశ్రాంతి సుఖమాత్మని.

అట్టి యుత్తమపురుషుడు దుఃఖప్రదమగు నీ సంసారసముద్రమునుదాటి విశ్రాంతిసుఖము ననుభవించుచు స్వాత్మయందే నెలకొని యుండును.

దీర్ఘాధ్వని పరిశ్రాంతో విషయైశ్చతురైశ్చిరమ్
భోగభావాతురః క్రూరైః ప్రోత్థితః పథికామరైః

దీర్ఘమగు సంసారమార్గమున చిరకాలము సంచరించుట చేయవలసినవాడును, భోగసాధనములగు పదార్థములచే వ్యాకులత్వము జెందినవాడును. కపటియునుక్రూరుడును చోరులచేవలె, విషయములచే భాధితుడునుకాన సంసార మార్గముననే స్థితుడైయున్న వాడునగు జీవుడు దుఃఖమునే పొందుచు వ్యాకులచిత్తుడై యుండును.

జరాతుషారా శనిభిర్భూయో భూయో జడీకృతః
జన్మజంగల సారంగో వ్యర్థ వ్యగ్రవిహారవాన్.

సంసారమున బద్ధుడగు జీవుడు వృద్ధాప్యమను తుషార, వజ్రపాతములచే మరలమరల జడుడుగ నొనర్పబడుచు, జన్మయను నరణ్యమున మృగమువలె వ్యర్థముగ సంచరించుచున్నాడు.

పరమాత్మ పరిక్రాంతో దుఃఖ కంటకసంకటే
సుదుష్ప్రాప సుఖచ్ఛాయే పాంథః సంసారవర్త్మని.

మఱియు ననేక దుఃఖములతో కూడుకొని సుఖమను నీడను పొందనివాడై సంసారమార్గమున జీవుడను పాంథుడు నొంటరిగనే సంచరింప వలసియుండును.

దుష్కృతైః కృతపాథేయో లుఠన్ క్షీణః పదే పదే
అర్థానర్థ మయైర్మార్గైః సంకటైర్వివశీకృతః.

పాపమను దారిబత్తెముగలవాడై, అడుగడుగునకు క్రిందపడుచు ఇష్టానిష్టములను మార్గమందలి దుఃఖములచే వివశుడై జీవుడను పథికుడు దుఃఖగ్రస్తుఁడగుచున్నాడు.

సంసారజలధేః పారం ప్రాప్యభూత వివర్జితమ్
అశేషోఽప్యపిప్రసనూ బుద్ధః పశేతే సుఖమాత్మనా.

ఒకానొకపుడు సౌభాగ్యముచే అనేక జన్మలందలి పుణ్యవిశేషముచే శాధన చతుష్టయ సంపత్తియుతుడుకాగా, సచ్ఛాస్త్రాభ్యాసముచేతను సద్గురు కృపచేతను, ప్రబుద్ధుడై, సంసార సముద్రమును దాటి, సంసారమందు బద్ధులైయున్న జీవులుండని ప్రదేశమును పొంది, శయ్యలేకున్నను, ఆత్మజ్ఞాని సుఖముగ నిద్రించును, ( అనగా ప్రశాంతస్థితిని బడయునని యర్థము.)

అపసర్పం నిరస్తేహ మస్వప్నమసుషుప్తకమ్
ప్రబుద్ధమబహిర్నిద్రం హా శేతేసుఖమాత్మవాన్.

ఆహా ! ఏమి ఆశ్చర్యము ! గృహము, శయ్యమున్నగునవి లేకున్నను, స్వప్న, సుషుప్తులకంటె భిన్నమైనదియు, ప్రబోధావస్థయు, బహిర్ముఖ వృత్తియను నిద్రలేనిదియునగు ఆత్మస్థితియందు నెలకొనియున్నవాడై, జ్ఞానిసుఖముగ శయనించును.*

జాత్యశ్వవది హాజాతి రశ్నన్ గచ్ఛన్ శ్వసన్ వదన్
లోకమధ్యేమహా రణ్యే హా శేతే సుఖమాత్మవాన్

శ్రేష్ఠమగు గుఱ్ఱము†వలె ఆత్మజ్ఞానులు భుజించుచున్నను, నడచుచున్నను సంచరించుచున్నను, శ్వాసగైకొనుచున్నను మాట్లాడుచున్నను ఈ మహా సంసారారణ్యమున సుఖముగ నిద్రించుచుందురు. (బహిర్ముఖత్వమునుత్యజించి, ఆత్మధ్యాన సుఖానుభవమును పొందుచుందురని భావము.

అపూర్వైవ ఘనా నిద్రా కాపి సా తత్త్వదర్శినామ్
యానశామ్యతి కల్పాభ్ర రవైర్నాంగ వికర్తనైః.

తత్త్వదర్శులగు వారినిద్ర అతి గాఢమైనది. అయ్యది ప్రలయకాలమందలి మేఘ గర్జనలచేగాని, అంగవిచ్ఛేదనాదులచేగాని నాశమొందనిదై యున్నది.

---

* పైశ్లోకములందు 'ఆత్మజ్ఞాని సుఖముగశయనించుననః బహిర్ముఖత్వమును త్యజించినవాడై, అంతర్ముఖుడై ఆత్మయందు విశ్రాంతినొందుచు సుఖానుభవమును పొందుననిభావము.

† ఉత్తమజాతికిచెందిన గుఱ్ఱములు యుద్ధభూమియందు దప్పఅన్యత్ర తినుచున్నను, త్రాగుచున్నను, నడచుచున్నను, సంచరించుచున్నను, ఎప్పుడును నిద్రించుచునే యుండునని లోకప్రసిద్ధము.

అపూర్వైవ ఘనా నిద్రా కాపి సా తత్త్వదర్శినామ్
ప్ర బుద్ధానామపి హియా నిమీలయతి దృగ్ద్రుశౌ.

తత్త్వజ్ఞుల నిద్ర అనిర్వచనీయమై యొప్పును. ఏలన, చిన్మాత్ర దర్శనముచే యోగి ప్రబుద్ధుడు కాగా అయ్యది బాహ్య పదార్థములనుండి వాని దృష్టిని మరల్చివేయును.

అనిమీలిత నేత్రస్య యస్య విశ్వం ప్రలీయతే
సతీబః పరమార్థేన హా శేతే సుఖమాత్మవాన్.

ఎవని నేత్రములు తెఱచియున్నను దృశ్య ప్రపంచమంతయును లేనట్లేయుండునో. అట్టి ఆత్మజ్ఞాని సుఖముగ విశ్రమించును. ఆహా! ఎట్టి హర్ష జనకమగు విషయము!

వినిగీర్య జగత్సర్వం పరమాంపూర్ణతాంగతః
ఆతృప్తేరమృతం పీత్వాంహా సేతే సుఖమాత్మవాన్.

జగత్తంతయు తన ఆత్మయందు లయమొనర్చి, ఆత్మానందామృతమును తృప్తిగ పానమొనర్చి పరమ పూర్ణత్వము బడసినవాడై ఆత్మజ్ఞుడు సుఖముగ విశ్రమించును.

నిరానందమహానందీ సుఖమద్వైత మక్షయమ్
నిరాలోక మహాలోకో హా శేతే సుఖమాత్మవాన్.

విషయానంద రహితమును, నిరతిశయమగు ఆనందముతో కూడియున్న వాడును, అన్యప్రకాశములచే నప్రకాశితమగు ఆత్మప్రకాశముచే పూర్ణుడునునై అక్షయమగు అద్వైత సుఖమనుభవించుచు, ఆత్మజ్ఞుడు సుఖముగ విశ్రమించును.

లోభాంధకారో పరమో లోక లంపటతాంగతః
అఘనత్వఘనా భోగో హా శేతే సుఖమాత్మవాన్.

కామ, క్రోధ, లోభాదులను యంధకారము లేనివారై ఉత్తమమగు ఆత్మప్రకాశమందు తత్పరులై యుండి, నిరాకారమగు ఆత్మానంద రసము నాస్వాదించుచు, ఆత్మజ్ఞాని సుఖముగ విశ్రమించును.

అనంతదుఃఖ మాశాంత మశాంతం జనతా స్థితౌ.
అబహిర్ముఖ నూభోగి హా శేతే సుఖమాత్మవాన్.

అనంతములైన సాంసారిక దుఃఖములనుండి విముక్తి నొంది లోకసంగ్రహార్థము వర్ణాశ్రమాచారములందు తత్పరుడై, బాహ్య పదార్థములందాసక్తిలేక, ఆభ్యంతరమున ఆత్మానంద రసాస్వాదనా రక్తుడై, ఆత్మజ్ఞాని సుఖముగ వర్తించును.

అణీయసా మణీయాంసం స్థవిష్ఠంచ స్థవీయసామ్
కృత్వాత్మానం నభః శయ్యాం హా శేతే సుఖ మాత్మవాన్.

సూక్ష్మ పదార్థములన్నిటికంటె సూక్ష్మమును, స్థూలపదార్థము లన్నిటికంటె స్థూలమునకు ఆత్మను సాక్షాత్కరించుకొని చిదాకాశ మను శయ్యపై ఆత్మజ్ఞుడు సుఖముగ విశ్రమించును.

పరమాణౌ పరమాణౌ జగత్కోటి శతాన్యపి
అణౌస్థూలే దధద్దేహం హా శేతే సుఖమాత్మవాన్.

అతిసూక్ష్మమగుటచే అణువును, మహత్తరమగుటచే స్థూలము నగు తన చిత్స్వరూప దేహమున ప్రతి పరమాణువందును అనం కోటి బ్రహ్మాండములఁ ధరించుచు ఆత్మజ్ఞుడు సుఖముగ విశ్రమించును.

కుర్వన్సం హార సర్గౌఘా నకుర్వంశ్చ కథంచన
పరమాలోక శయ్యాయాం హా శేతేసుఖమాత్మవాన్.

అనేక సృష్టిసమూహములను సంహారమొనర్చుచు, యథా ముగ నేమియు నొనర్పక యున్నవాడై ఆత్మజ్ఞాని పరమప్రకాశమ మగు ఆత్మయను శయ్యపై పరుండును.

సంసారనిచయ స్వప్నం పరిజ్ఞాయసుషుప్తతామ్
నయప్ర్ప కటదిగ్దీర్ఘాం హా శేతేసుఖమాత్మవాన్.

సంసార సమూహమంతయు స్వప్నమని నిశ్చయించి, పూ మగు ఆత్మప్రకాశముచే ప్రకటితమైన దిక్కులవలె దీర్ఘమగు సుషు ప్తిని (విశ్రాంతిని) పొందుచు, ఆత్మజ్ఞాని సుఖముగ నిద్రించును (సుషుప్తియందున్న వానివలె బాహ్యవిషయ రహితుడై జ్ఞాని, వ చును గాని, జ్ఞానియొక్క స్థితి సుషుప్తిగాదని తెలియునది).

సర్వేషాం జగదర్థానాం సత్తాసామాన్యతాంగతః
ఆకాశాదధికోవ్యాపీ హా శేతే సుఖమాత్మవాన్.

జగత్తునందలి సమస్త పదార్థములందును 'సత్తాసామాన్

(సద్వస్తు) రూపమున వ్యాపించుయున్నందున ఆకాశముకంటె అధిక ముగ వ్యాప్తినొందియున్నవాడై ఆత్మజ్ఞుడు సుఖముగ విశ్రమించును.

అచ్ఛాచ్ఛమంబరం కృత్వాజగదప్యంబరీకృతమ్
శాంత శబ్ద పరశ్వాసం హా సేతే సుఖమాత్మవాన్.

ప్రథమమున, లయక్రమముచే పృథివ్యాదులను ఆకాశమునం జేర్చి, పిదప జగత్తునంతయును, తదాశ్రయభూతమగు ఆకాశమును గూడ, అవ్యాకృతాకాశముకంటె స్వచ్ఛమగు చిదాకాశమున లయ మొనర్చి, ఆత్మజ్ఞాని, శబ్ద, శ్వాస, ప్రశ్వాశలు లేక సుఖపూర్వకముగ విశ్రమించును.

ఇదమస్మజ్జగత్పశ్యన్స్వయమాకాశ కోణకే
విశదాకాశ కోశాత్మా హా శేతేసుఖమాత్మవాన్.

స్వయంసాక్షియు, విశాలరూపుఁడునగు ఆత్మజ్ఞాని ఈ మన జగత్తును ఆకాశమువలె వ్యాప్తమైన స్వస్వరూపమున నొక భాగమున స్వప్నమువలె గాంచుచు, అత్మయందు సుఖముగ విశ్రాంతిని బడయుచుంఁడును.

యథాప్రవాహ సంప్రాప్త వ్యవహార మనోరమ
తృణ్యాస్తరణ విశ్రాంతో హా శేతే సుఖమాత్మవాన్.

ప్రవాహ పతితములగు యథాప్రాప్త వ్యవహారములను నట్టి తృణసిర్మిత యాస్తరణము (చాప) పై విశ్రాంతినొందుచు ఆత్మజ్ఞాని సుఖముగ శయసించును.

పరమేణస్వయత్నేన పరిజ్ఞానాత్స్వరూపిణా
స్వప్న సందర్శనేనైవ జీవన్ ఖమివఖేనఖే.

గాఢనిద్రయందలి స్వప్నానుభవమునెట్లు మనుజుడు బహుయత్నముచే స్మరించిపగల్గునో, అట్లనే ఆత్మవిచారమను సుషుప్తియందుండు ఆత్మజ్ఞాని నిజయత్నముచేగాని, పరులయత్న ముచేగాని, కొంచము బహిర్ముఖవృత్తిగలవాడై, బాహ్యవస్తుపరి జ్ఞానముచే, నిరవకాశప్రదేశమున స్థితిగల్గియుఁడుట కసమర్థమగు నాకాశము, తనచేతనే కల్పితమగు నిజాకాశ స్వరూపమున సత్తగల్గి జీవించునట్లు నామమాత్రము నకై శరీరధారణాది కృత్యముల నొనర్చుచునుండును.

జ్ఞానేనాకాశకల్పేన ధర్మాన్ గగనసన్నిభాన్
జ్ఞేయమత్నేన సంబుద్ధః పరమాంబరతాంగతః.

ఉత్తమమగు చిదాకాశ రూపత్వమునొందిన ఆత్మజ్ఞాని, ఆకాశమువలె విశాలమైన స్వస్వరూపజ్ఞాన దృష్టియందు అసత్తుల్యములగుటచే, జగత్తును, జీవులప్రాపంచిక ధర్మములను ఆకాశమువలె శూన్యప్రాయములుగనెంచి యత్నముచేతనే వాటినెఱుంగ గల్గుచుండును.

---

శ్రీ

# శ్రీ సనాతన జ్ఞానమహాసభ త్రయోదశ వార్షికోత్సవము.

---

ఈ సమాజవార్షికోత్సవము ఈ సంవత్సరము మార్చి 5, 6, 7 తేదీలందు విశాఖపట్టణము జిల్లా యెలమంచిలి పట్టణమున అచటి శ్రీ సమాజము వారి తోడ్పాటుతో జయప్రదముగ జరుపబడినది. మొదటి దినము బ్రహ్మ ముహూర్తకాలమున సభాస్థలియందు కలశస్థాపనము పూజలు హోమములు జరిగినవి. ఆమూడుదినములు, ఉదయమున వరుసగా అమృతనాదోపనిషత్తు, మైత్రేయ్యుపనిషత్తు, కైవల్యోపనిషత్తుల పఠనమును, ఆరేసి అధ్యాయముల చొప్పున గీతాపారాయణమును జరిగెను. మధ్యాహ్నవేళ సర్వజనులకును భోజనములు పెట్టబడినవి.

మొదటిదినము సాయంతనము 4 గంటలు మొదలు మహాసభ శ్రీయుత గుంటూరు సుబ్బారావు పంతులుగారి యాజమాన్యము క్రింద జరిగినది. సర్వమతములును దేశకాల పాత్రముల ననుసరించి ఆయాప్రజలకు తరణోపాయములుగా అధ్యాత్మజ్ఞాన విజ్ఞాన సంపన్నులగు మహనీయులచే నిర్మింపబడి యున్నవనియు, అందేలోపములు ఘటిల్లినను సాధకులగు సామాన్యప్రజాళి వలన కలుగునవేగాని మూల

సూత్రములందు పూర్ణ సఖ్యతయే కలదనియు, ఆకారణము వలన మతద్వేషములు, పరస్పరా సహనములు లేక ఎల్లఱును సోదర భావముతో దైవసేవచేసికొనుచు జీవించి ధన్యులు కానోపునని చక్కని సిదర్శనములతో ప్రారంభోపన్యాసము గావించిరి. అనంతరము శ్రీ యుతులు తూనుగుంట్ల ఆనంద మోహనుగారు "ఆత్మవిద్య"ను గుఱించి ప్రసంగించుచు, లోకమున సామాన్య విద్యలెన్నియో కలవనియు, అన్నిటివలనను సౌఖ్యము సాధింపబడుచుండుననియు, కాని ఈసౌఖ్యములన్నియు క్షణభంగురములగు టేగాక, దుఃఖమును కారణములునగునని యు వివరించిరి. ఇట్టి అల్ప సుఖముకై యెన్ని ఎంతటి శ్రమలకోర్చియో ప్రజలుపాటుబడుచుండగా, స్థిరతర శాశ్వత సుఖమునొసగు ఆత్మవిద్యను ఉపేక్షించుట శోచనీయ మనిరి. ఈ యంశమును చక్కగబోధపఱచు గురుసత్తములుండి ప్రచారములు గావించుటయు, బాల బాలికలకు బ్రహ్మచర్య శిక్షణము సలుపుట ముఖ్యావసరమని యుక్తియుక్తముగ వక్కాణించిరి.

ఆ పిమ్మట శ్రీశ్రీశ్రీ చిద్గగనానంద స్వాములవారు "అహింసాతత్వము" ను గుఱించి మాట్లాడుచూ పరమాత్మ సర్వజీవులందును అధివసింపుచు, సకలేంద్రియ వ్యాపారములకును, సమస్తభూతముల యునికికిని ఆధారమైయుండ, ఏప్రాణికే బాధగల్గించినను, ఆత్మహింసయే యగుననియు, కావున మనము సర్వభూతహితరతులమై వర్తించుట ముఖ్యమనియు, కావుననే మహాపురుషులు "అహింసాపరమో ధర్మః" అని దానికి ప్రప్రథమస్థానమునిచ్చియున్నారనియు కడు హృద్యముగనుపన్యసించిరి. తరువాత శ్రీయుత దాసం బ్రాహ్మణయ్య చౌదరిగారు తమ సహజానర్గళ వాగ్ధాటితోడను, గానమైపుణ్యము తోడను మోక్షోపాయమును గుఱించి ఉపన్యసించిరి. అనేకములగు ఇంపుకథలను చెప్పుచు శ్రోతల నానందింపజేసిరి. సకలేంద్రియ నిగ్రహము, జీవకారుణ్యము, వైరాగ్యము, ఆత్మజ్ఞాన పిపాసముక్తికి సోపానములగు నని బోధించిరి.

ఆపిమ్మట శ్రీ శ్రీ శ్రీ సద్గురు మలమాళస్వాములవారు ప్రసంగించిరి. ఉపనిషత్పారాయణము భగవద్గీతా పఠనము జరుగు సమయ

ములందెన్నెన్నియో దివ్యోపదేశముల చేయుచుందురు. కావున క్లుప్తము గా ఆత్మశక్తి, ఆత్మ విశ్వాసము, మనోదార్ఢ్యము, సర్వమానవులును వ్యవసాయము చేయగావలయుననియు, మనమందఱము ఋషిసంతాన మనుసజ్ఞప్తిగలిగి వర్తింపుచూ తుచ్ఛములగు లౌకిక భోగముల నుండి దృష్టిని మఱలించి, మూడు గుణములను దాటి, అతీతబోధనుగాంచి, సదా బ్రహ్మపథమున చరించుచుండ పరిశ్రమచేయ వలయునని హెచ్చరించిరి.

ద్వితీయదినము మధ్యాహ్నము 11 గంటలు మొదలు ప్రత్యేక స్త్రీల సమావేశమున శ్రీమతి నెట్టిమి వెంకటలక్ష్మీబాయమ్మగారి అధ్యక్షత వహించిరి శ్రీ శ్రీ శ్రీ సద్గురు మలయాళస్వాముల వారివంటిమహాత్ములు సర్వమానవ కారుణ్యము పూని దివ్యబోధలు వెదజల్లుచున్న ఈకాలముననే, స్త్రీజనమునకును ఆత్మావబోధము సలుపుచున్న ఈ సమయముననే, స్త్రీలును ఆత్మవిద్యలు గఱచి తోడివారికి బోధలు చేయు నవకాశము గలిగిన ఈ అదనుననే మేల్కొని తరించి, తోటి వారు తరించునటుల సేవజేయుటయు కర్తవ్యమని చక్కగబోధించిరి. తెలిక చర్లకామాక్షమ్మ, మద్దావి కృష్ణాబాయమ్మ పమిడిపాటి సుందరమ్మ, వెల్లూరి శ్రీనివాసమ్మ అను బాలికలు ముచ్చటలు కులుకు వాక్కులతో వైరాగ్య ప్రేరకములగునట్టియు పరమార్థద్యోతకములగు నట్టియు ప్రసంగముల గావించిరి. శ్రీ సాధుగాడు జోగమాంబగారు పరమార్థమును గుఱించి బోధించిరి ఎన్నెన్ని సాధించినను, పరమార్థ మును సాధించనిది మనజన్మధన్యము కాజాలదని హెచ్చరించిరి. సాధు జనాబాయిగారు 'ఆశయాబధ్యతే లోకః' అను విషయమునుగుఱించి మాట్లాడుచు లౌకిక ప్రవృత్తి కంతకును ఆశయే మూలమనియు, ఆశయే సకలబంధములకును సకల భయములకును కారణ మనియు, ఆశ లుడిగిన జీవన్ముక్తులగుట కడుసులభమనియు నుదాహరణముగ నుపన్యసించిరి. సాధు అమృతా బాయమ్మగారు విద్యనుగురించి ఉపన్యసించిరి విద్య వివేకము నొసగుననియు, విద్యలేనిది ధర్మమార్గము గోచరింప జాలదనియు మనవిధాయక ధర్మముల మనలకు జూపునది మాత్రమే విద్యయనదగుననియు, అందుకు వ్యతిరేకమును తెలివిని గాన్పించు చదు

వులను విద్యగా గణింపరాదనియు తెలిపిరి. సాధు సీతాబాయమ్మగారు "సత్యంసర్వశ్రేయః" అని ప్రారంభించి, సత్యప్రవర్తనమే తపస్సనియు, తపస్సునకు 'ఓమ్ తత్సత్' అని పేర్కొనబడు పరవస్తువే పరమ ప్రాప్యమనియు, సత్యవ్రతము చేత హరిశ్చంద్రుడిట్టి దానిని సాధింపగలైనని యు, సత్యాచరణము మోక్షప్రదమని యుపన్యాసించిరి. భవానీ పట్ల సూర్యకాంతమ్మగారు పరమార్థమును గుఱించి యుపన్యసించిన పిమ్మట అధ్యక్షురాలి ఉచిత భాషణములతో సభముగింపు చేయబడినది.

సాయంతనము తిరిగి మహాసభ శ్రీయుత పొట్టుముత్తు బల రామమూర్తిగారి అధిపత్యముక్రింద జరిగినది. శ్రీయుత చదువుల వీర రాజుపంతులుగారు 'ఇంద్రియనిగ్రహము'ను గుఱించి ఉపన్యసించిరి. ఆశలవలన వాసనలు, వాసనల వలన జన్మలు, జన్మల వలన దుఃఖములు కలుగుచున్నది గాన ఆశలను అణంచవలయును. ఇందునకు ఇంద్రియ నిగ్రహము అవసరము. ఇంద్రయనిగ్రహ మనగా వానిని ప్రకృతికి అభిముఖముగా కాక ఆత్మాభిముఖముగ నడుపుటయే. అప్పుడు సచ్చిదానందరూపమగు పరమాత్మను ప్రాపింప గల్గుదుము. ఈ ప్రవర్తనవలన సర్వావస్థలందును, వియోగము నవలంబించు వారమైనను, దివ్యప్రేమ అవసరమగును. అదియే ముక్తిప్రదమగు ఇంద్ర యనిగ్రహమునాబడునని చక్కని పద్యములను గీతలను చదువుచు నుపన్యసించిరి.

మిస్సుల వీరవేంకట సత్యనారాయణగారు 'మానవధర్మము'ను గుఱించి ప్రసంగించిరి. భగవంతుడు లీలగా సృష్టిచేసి, జీవులతో దాగుడు మూతలాడుచుండుననియు, వానిని అన్వేషించి పట్టుకొని, ఈ ఆటలో కృతార్థుల మగుటే మానవ ధర్మమనియు, సత్యాహింసలు ఆ ఆటలో గెలుపును సమకూర్చునుపాయములనియు, యోగములన్నియు మంచివేయైనను, ఇక్కాలమునకు, నిష్కామ కర్మయోగము శ్రేష్ఠతరమనియు వివరించిరి.

శ్రీయుత దాసరి బాహ్మణయ్యగారు క్రిందటిదినము వుపన్యసించిన మోక్షోపాయమును గుఱించి విపులముగ ప్రసంగించిరి. శ్రీమతి దువ్వూరు సుబ్బమ్మగారు "స్త్రీలకు ఆత్మవిద్యయందర్హతగలద"ను విష

యములను గుఱించి, గార్గి, మైత్రేయి, దమయంతి, సీత, భారతి మొ
లగు మహనీయురాండ్ర సిదర్శనములతో రమ్యమగు నుపన్యాసము
గావించిరి. శ్రీ శ్రీ శ్రీ సద్గురు మలయాళ స్వాములవారు సత్యయుగము,
త్రేతాయుగము, ద్వాపరయుగము కలియుగమునను నవి కాలమునకు
సంబంధించినవి కావనియు, ప్రకృతియు, ప్రాకృతి జీవులన్నియు సదా
ఒకేతీరున నుండుచున్నవనియు, మార్పుచూ పట్టినేని అయ్యాదినరు
గుణకర్మల ననుసరించి గణనసేయ నగుననియు, అందువలన
మానవునియందు ధర్మాంన్వేషణ, ధర్మానువర్తనములు విధాయకము
గుచున్నవనియు, కాలమను అవరోధము దీక్షాపరునకును ఆత్మసా
కునకును లేదనియు నుపన్యాస సందర్భమున బోధించిరి.

మూడవదినమున సుమారు 11-30 కి మహాసభ కూడినది. ఁ
దుముఖ్యముగా ఈ సభాకార్య నిర్వహణమునకు ఎవరెవరు, ఏ యే
పముల ఎంతెంతగా సాయపడియుండిరో సభవారికినివేదింపబడెను.
అట్టి వారందఱికిని వందనములర్పింప బడెను నాడు అధ్యక్షత వహి
చిన శ్రీయుత మదిర సుబ్బారావు పంతులుగారు భారతదేశపు ప్రా
చీనౌన్నత్యమును గుఱించియు, ఆకాలమున భారత జాతిని నడిపి
ఋషిసత్తముల ప్రభావమును గుఱించియు, నేటిపతితావస్థను గుఱించి
యు, మఱల భారతజాతి పునరుద్ధారణయుగాంచవలయునన్న, శ్రీ
సద్గురు మలయాళ స్వాములవారి వంటి మహనీయుల ప్రబోధము
ఎంతఅవసరమో, ఎంతలాభకరమో వివరించిరి. సమాజకార్యదర్శి యీ
వార్షికోత్సవమును జయప్రదము గావించుటలో తోడ్పడిన యెల్లజ
కును వందనము లర్పించుటతో సభముగింప బడినది. నాటి సాయం
నము ప్రత్యేకముగ హరిజనులకు గూడా సంతర్పణగావింప బడినది.

అనుబంధము.

ఈ సభాకార్యక్రమమున పాల్గొనుటకై సకాలమునకు రా
లేక, నాటిమధ్యాహ్నము అనకాపల్లెనుండి వచ్చియున్న శ్రీయుత
ఆకెళ్ల సత్యనారాయణరావు పంతులుగారు, శ్రీ శ్రీ శ్రీ సద్గురు
మలయాళస్వాములవారి ఆధిపత్యముక్రింది, సాయం సమయమున
వైదిక పరిశోధనను గుఱించి గంభీరోపన్యాసముగావించిరి. నరుడు

ఆత్మవిచారణకు పూని ప్రకృతిని తఱచి తఱచి తుదకు సర్వాధారమగు పరమాత్మనుచేరు పరిణామప్రకాశికను ప్రధానముగా శ్రుతి ప్రమాణములతో వివరించిరి. పాశ్చాత్య శాస్త్రములను, ప్రాచీన ప్రాచ్య గ్రంథములను పోల్చిచూపుచు, వేదములందు ప్రకృతి శాస్త్రరహస్య సిద్ధాంతములు పూర్తిగ కలవనియు, వివేకరహితమగు మేకల అఱపులతో వేదపఠనమును పోల్చు ఈనాటి హేళన అజ్ఞాన కార్యమనియు సహేతుకముగ, సోదాహరణ పూర్వకముగ విశదపఱచిరి. శ్రీ సద్గురుస్వాములవారుచితరీతిని ఉపసంహారోపన్యాసమును గావించిన పిమ్మట, వందనములర్పించుటతో మహాసభ ముగింపబడినది. రాబోవు సభ కృష్ణాజిల్లా తాడేపల్లి గ్రామమున జరుగునట్లు నిశ్చయింపబడినది. మఱియు ఆ సభ పూర్తియైన వెనుక దోనేపూడియందు ఓంకార సత్ర యాగమున్ను జరుగునట్లు సభవారంగీకరించిరి.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

ఓం.

# శ్రీ పరబ్రహ్మోపాసన !!

# త్రయోదశ మార్గములు.

—:0:—

క॥ పలికెడిది భాగవతమట, పలికించెడు వాడు రామభద్రుండట నే
పలికిన భవహరమగునట, పలికెదవేరొండు గాధ పలుకగ నేలా॥

(భాగవతము)

సర్వవ్యాపియు, నిర్వికారమును, అనంతమును, అఖండమునగు తత్పదార్థము నుపాసించుటచుటకు, ప్రకృతి బద్ధములగు మానవ బుద్ధుల కలవిగాదని మేధావంతులగు మహర్షులు తెలిపియున్నారు.

సర్వవ్యాపి, అనంతము, మహత్తునగు పదార్థమును యెచట నిలిచి యుపాసించవలెనో మనోబుద్ధుల కతీతమగు దానిని దేనిగా ధ్యానించవలెనో యూహించి నిశ్చయింప జాలకపోయిరి. అందువలన శబ్దాదులచే నిరూపింప నలవిగాని యాతత్పదార్థమును సర్వశబ్దములకు విలక్షణమైన ఓంకార స్వరూపమని భావించిరి. అట్టిదానికి జగన్మోహ నాకారంబగు సాకారమును కల్పించి మానవబుద్ధులకు ప్రియమగు సౌందర్యాది పదార్థముల యందును, పౌరుషాది కార్యములయందును, త్యాగయుక్తములగు సత్కర్మలయందును దైవము నారోపించి ధ్యానించిరి. ఆతత్పదార్థమగు నిర్గుణ బ్రహ్మము, పరిశుద్ధ సాత్విక బుద్ధికైనను స్పష్టముగా గోచరింపదు.

అట్లు సాకార మార్గమునగాక నిరంజన స్వరూపమును స్వతంత్రించి ధ్యానింప బూనుట, బయలు నందు నడచి సూర్యనొద్దకు వెళ్ల దలచినట్లును, గాలిని కౌగలించుకొని యెగబ్రాకినట్లును; ఆకసమును మ్రింగ నోరు తెఱచునట్లును, సాధ్యముగాని కార్యమని శ్రీ జ్ఞానదేవు వారు శ్రీ భగవద్గీత 12 వ అధ్యాయమున వ్యాఖ్యలో తెలిపియున్నారు. ఈ బయలు ఆకాశ తత్వమగును. దానికి శాస్త్రజ్ఞులు అతి సూక్ష్మమగు నొక విధమైన స్వరూపముగలదని నిశ్చయించిరి. గాని యీ నిరంజనమగు తత్పదార్థమునకు అట్లేమియు నిశ్చయింప జాలక వేదములు సయితము మౌనము వహించెను.

శ్రీ భగవద్గీత 12 అ 5 వ శ్లోకమునకు మహాత్మాగాంధీగారి వ్యాఖ్యానము:—దేహధారియగు మనుష్యుడ మూర్తస్వరూపమును కేవలమూహించుటకే సమర్థుడగుచున్నాడు. కాని వానియొద్ద నమూర్తస్వరూపమున కయి యొక్కటిగూడ నిశ్చయాత్మక శబ్దము లేదు అందుచే వాడు నిషేధాత్మకమగు నేతిశబ్దముతో సంతుష్టుడు కావలసి వచ్చెను. ఇందు మూలముననే మూర్తి పూజను నిషేధించు వారు సయితము సూక్ష్మరీతిగ విచారించినచో మూర్తిపూజకులే యగుచున్నారు. పుస్తకమును పూజించుట, దేవాలయమున కరిగి పూజ సల్పుట, ఒక దిశయందే ముఖమువంచి పూజచేయుట, యివన్నియు సాకారపూజ లక్షణములు. అయినప్పటికి సాకారమున కావలి యొద్దున నిరా

కారమగు నచింత్య స్వరూపము గలదు. ఇట్లెల్లరు గ్రహించుట వలన నే ముక్తులగుదురు. భక్తుడు భగవానియందు విలీనుడయిపోవ, తుదకు కేవల మొక యద్వితీయ నిరాకారుడగు భగవానుడే యుండిపోవల యును. అదియే భక్తియొక్క పరాకాష్ఠ. కాని యీ స్థితికి సాకార ము ద్వారముననే సులభముగా చేరవచ్చును. కాబట్టి నిరాకారమును తిన్నగాచేరు మార్గము కష్ట సాధ్యమని చెప్పబడినది. స్వల్ప లాభముల వెంటనైన పరుగెత్తుట యీ మానవబుద్ధికి సహజము. గాన, దీనితో అగమ్యగోచరమగు పరబ్రహ్మవస్తువును ధ్యానించుట సాధ్యమైన పని గాదు. ఏదో యొక సాకార స్వరూపమును భావించి ధ్యానించి తరించ వలెను. అని * శ్రీరామ కృష్ణానంద స్వాములవారు తెలిపి యున్నారు. ఇట్లనేకములు కనుగొనవచ్చును.

పరబ్రహ్మము నుపాసించుటకు హిందూ విజ్ఞాన పరులు అనేక మార్గము లేర్పఱచిరి. అందులో భగవంతుని చేరుటకు తల్లిగాను, తండ్రిగాను, గురువుగాను, దైవముగాను, సఖునిగాను, సఖునిగాను నాథునిగాను భావించి యుపాసించుట మొదలగు త్రయోదశ మార్గ ములు ముఖ్యములు.

వీటిచే మానవుల జనన మరణరూపకమై దుఃఖభాజన మగు సంసార బంధములనుండి విడివడజేసి పరమాత్మ సన్నిధిం జేర్చుటయే మహర్షుల యుద్దేశ్యమగుచున్నది. ఈయభిప్రాయముననే భాగవతమున శ్రీ శుకులవారిట్లు తెలిపియున్నారు.

ఆ॥ బాంధవముననైనఁ బగనైనఁ వగనైన బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన నహరికిఁ బరతంత్రులైయుండు జనులు మోక్షమునకు
జనుదు రధిపా॥

వ॥ అట్లుగావున పరమ పురుషుండును నంజుండును యోగీశ్వరేశ్వరుం డును నైన హరిని సోకిన స్థావరంబైన ముక్తంబగు-ననిరి. †

---

* వీరు శ్రీరామ కృష్ణ పరమహంస స్వాములవారి ప్రథమశిష్యులలో నొకరు.

† యోగరతోవా. భోగరతోవా సఙ్గరతోవా సఙ్గవిహీనః।
యస్యబ్రహ్మణిరమతే చిత్తం నన్దతి నన్దతి నన్దత్యేవ. ॥భజ॥
(అని శ్రీ శంకరాచార్యులవారి శిష్యుడగు నొకయతీశ్వరుడు తెలిపెను.)

గంగా, సింధు, బ్రహ్మపుత్రాది మహానదులు నానా ముఖము లుగ ప్రవహించుచున్నను, ఒకనదికి మరియొకనది దవ్వుగా గనబడి నను, తీవ్ర, మందాది గమన వ్యత్యాసము గలవై యున్నను సమస్త నదులన్నియు నొక మహాసముద్రమునే చేరునట్లు పై పేర్కొన బడి మార్గములు నొకదానికొకటి భిన్న భిన్నములుగానున్నను అన్నిటి లక్ష్యము ఒక పరబ్రహ్మస్వరూపమునందే గలదు.

అయితే యీ భిన్నత్వములనుండి కనుగొన వలసిన ఏకత్వ లక్షణములు కొన్నిగలవు. శ్రీ నారదమహరుషి. ధర్మరాజులవారి రాజ సూయాగము జరుగునప్పుడు చెప్పినది.

కామోత్కంఠత గోపికల్.

1. మనోబుద్ధి చిత్తాహంకారములు ఆలక్ష్య భూతమగు వస్తు వునందే లగ్నమై చలింపకుండుట.

2. ఆలక్ష్య భూతమగు పదార్థముకంటే మహత్తైనది మరి యొకటి లేదను ఆస్తికత్వము కలిగియుండుట.

3. వైరానుబంధమున తప్ప యితర మార్గములయందు వర్తిం చువారికి కామ, క్రోధ, లోభాదుల స్పర్శగాన రాకుండుట.

4. ఆలక్ష్యభూతమగు పదార్థమునందే తన ప్రయోజన ముంచి యితరస్వర్గాది భోగములయెడ సయితము తనకెట్టి ప్రయోజనము లేదని తలంచుట.

5. జన్మకర్మములకు మూలమగు యీ స్థూలశరీరము నందభి మానము లేకుండుట.

6. విరక్తియే తన ఆత్మకు కవచముగా గల్గియుండుట, మొద లగు ఏకత్వ లక్షణములు గలవారు ఏజాతివారు గాని, యేఖండము నివసించు వారుగాని, యెట్టి యాచారములు గలవారుగాని హిందూ మహమ్మదీయ, క్రైస్తవాది భిన్నాభిప్రాయముగల విరుద్ధమతస్థులే గాని, శైవవైష్ణవాది అంతః శాఖలకు చెందినవారు గాని, స్త్రీ పురు షాది భేదములు లేక సచ్చిదానంద మయమగు తత్వమును పొంద గలరు,

ఇక తెలుప బోవు త్రయోదశ మార్గములలో ఒక మార్గమే చక్కనిదని చెప్పునట్టి యితర మతస్థులవలె మహర్షు లెరుగక పోలేదు. అట్టిమార్గ మొక్కటియున్నను అది సవ్యము గాదని తలచిరి. ఎట్లు సర్వమానవులకు ఒకే ఆహారము, ఒకరకము కూరనే భుజించడము, ఒకగుంట నీరే త్రాగడము, ఒకసైజు అంగియే తొడగడము, ఒకప్ర దేశమందే నివసించడము మొదలగు నిట్టివానికి ప్రయత్నించడ మెట్లవి వేకులమో, సాధ్యము గాని పనియో, అట్లే పరమాత్మను సర్వులు ఒక మార్గముననే యుపాసించుటకు యేర్పరచిన శాస్త్రములు నిరుప యోగమని యెంచిరి. మానవ బుద్ధులు, ప్రకృతి బద్ధములై యున్నవి. ఎంతవిజ్ఞాని యందైనను, కేవల సాత్వకబుద్ధి నాశ్రయించిన భక్తుని యందైనను, ఏకాంచమో ప్రకృతిని వసింపక పోలేదు ప్రకృతి గుణ ములనేకములు. భిన్నభిన్న స్వరూపములు. గాన వారి వారి యిష్టాను సారముగానుండి వారికి ప్రీతిగల(లక్ష్యము) పదార్థముల ద్వారానే దైవ భావమున కుదురుట సులభమని తలచినారు. మానవదృష్టికి పతి, పితృ, పుత్రాదులయందు పామరత్వ మెక్కువ. అందున బుద్ధి సులభ ముగా లగ్నమగుచుండును. అట్టివారి ప్రేమను ఆపతి, పితృ పుత్రా దుల ద్వారానే పరాత్పరునియందు చేర్చుట సులభమగు తరుణో పాయమని పూర్వులగు ఋషులు నిశ్చయించిరి.

ఎ ట్ల న :—

1. తనయుడు తల్లియందుంచు ప్రేమ వలె.
2. కుమారుడు తండ్రియందు గనపరచు విశ్వాశము వలె.
3. శిష్యుడు గురువునకు చేయు శుశ్రూషవలె.
4. భక్తుడు దేవునియందు జరుపు భక్తివలె.
5. శత్రువు వైరియందు జూపు వైరమువలె.
6. మిత్రుడు మిత్రునియందు గనబరచు సఖ్యమువలె.
7. నాయకి నాయకుని యందుంచు నట్టి మజుబువలె.
8. తల్లి పుత్రుని యందుంచు వాత్సల్యము వలె.
9. సేవకుడు ప్రభువునకు చేయు సేవవలె.

10. బంధువు బంధువునందు జూపు బాంధవ్యమువలె.
11. చెలికాడు చెలికానియందు చేయు చెలిమివలె.
12. ధ్యాత, ధ్యేయము నందుంచు ధ్యానము వలె.
13. ముముక్షువు పరబ్రహ్మానుపాసించు ఐక్యానుసంధానము వలె.

ఇట్లు ఆ సర్వవ్యాపక (వ్యాపియగు బ్రహ్మము) వస్తువునందు చేరుటకు త్రికాలవేదులు త్రయోదశ మార్గము లేర్పరచిరి. ఇంత వరకు ఏ మతస్థులుగాని, ఏశాఖకు చెందిన వారుగాని తరించుటకు (ఆత్మశాంతి నొందుటకు) పై పేర్కొనబడిన యీత్రయోదశమార్గములయందే ఏదో యొకదాని నాశ్రయించియే ఆ జగదీశుని చేరియున్నారు. ఆమార్గములలోవర్తించి తరించిన పరమభక్తుల యొక్కయు, భక్తురాండ్ర యొక్కయు, చరిత్రములు సంగ్రహముగా యిందుదాహరణ నిమిత్తము కొన్నిగలవు. భగవంతుని చరితము "పఠనం పాసంశ్రుతం" అని భగవద్గీతయందు తెలుపబడిన ప్రకారము, చదువుట, చదివించుట, వినుట. చింతించుట, వ్రాయుట మొదలగు క్రియల చేత సయితము మనశ్శాంతి గల్గునని తలంచి యివివ్రాయబడినవి. గాన నిందలి పొరపాటులను విజ్ఞాన పరులగు పాఠకులు మన్నించ ప్రార్థన.

## శ్రీ పరబ్రహ్మోపాసన.

### 1. తనయుడు తల్లియందుంచు ప్రేమవలె.

లోకములో తల్లికంటే ప్రేమాస్పదమగు పదార్థమొక్కటియు బాల్యమున కనబడదు. తల్లి సర్వశక్తిగలదనియు, తన్ను అన్ని విధముల రక్షించుననియు, తనరోదన వినుననియు, ఆస్తికబుద్ధి ప్రతిశిశువునకు గలిగియుండును. "మాతృదేవోభవ" అనువేదవాక్యమ ననుసరించి యీ మాతృభావముచేతనే సర్వవ్యాపియగు పరబ్రహ్మమును కొందరుపాసించి తరించిరి. పరమాత్మను, తల్లిగా ధ్యానించి యిష్ట

ర్థములు కోరి కొందరు సిద్ధిని గాంచిరి. కర్మబంధనివృత్తికోరి మరికొం దరు మోక్షమునెందిరి.

యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం।
మ మ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥
(భగవద్గీత) 4 అ. 11 శ్లో.

ఓ అర్జునా! ఎవరెవరు యే యే మార్గముల నన్ను పూజిం చుచు యుపాసించు చుందురో, వారి వారికి నాయావిధమున దర్శన మిచ్చి యుద్ధరించుచుందును. అని భగవద్గీతయందు భగవంతుడు శెలవి చ్చియున్నారు.

అట్లే శ్రీరామకృష్ణ పరమహంస స్వాములవారు పరమాత్మను తల్లిగా భావించి కర్మబంధ నివృత్తికోరి, రోదన మొనర్చి యా మార్గ మున నే జగధీశు ననుగ్రహము బడసిరి. అందుకుగాను సర్వ సుఖము లను త్యజించి తన హృదయ వేదన వెల్లడిజేసెడివారు. పరబ్రహ్మము తనుపాసించు తల్లి కన్యముగాదని యనేకసార్లు బోధించియున్నారు. "నలుగురు గ్రుడ్డివారు యేనుగుయొక్క నిజస్వరూపమును తెలియ గోరి, వాదులాడినట్లు సామాన్య బుద్ధిగలవారు అనంతునియొక్క యనేక లీల లెరుగక వివాదపడుచుందురు. అందుకనియే శ్రీ వివేకా నందస్వాములవారు, కుక్క, తనయ జమానుడు యేరకము ఉడుపుల తో కనబడినను మెళ్లిట్లో వచ్చినను తెలిసికొని తన విశ్వాసము గన బఱచునుగాని మానవులలో యనేకులు తనయ జమానుడగు జగధీశుని లీల లెరుగక దర్శనము తెలిసికొన లేక ద్వేషించుచుందురు. అని ఒక సందర్భమున శెలవిచ్చియుండిరి, గాన విశాలబుద్ధి గలవారు పొర బడరు.

—: శ్రీరామకష్ణ పరమహంస పరంజ్యోతిని పొందిన మార్గము :—
(శ్రీరామ కృష్ణ లీలామృతము. 112 వ పేజి)

ఈ విధముగా నపరోక్షాను భూతికై దేవిసందర్శనమునకై శ్రీ గురుదేవుని హృదయము తకతక లాడుచుండెను. భక్తిరస పూరితము లగు పాటలను పాడుట యాయన యారాధానలో ముఖ్యమైన విష యము ఈ పాటలాయన హృదయ ద్వారమును తెఱచును. అప్పు

డాయన తనమనస్సు నాపుకొనజాలక తల్లినుండి వేరు పడిన బిడ్డవలె వెక్కి వెక్కి యేడ్చును. "అమ్మా! నీ వెక్కడనున్నావు? నాకుగన పడుము? రామప్రసాదు నిన్ను సందర్శించి నీదివ్యకటాక్షము బడసెను నీవు నాకడకు రాకుండుటకు నేనంత నిర్భాగ్యుడనా! సుఖము, ధనము స్నేహితులు, భోగములు యివియేవియు నాకక్కర లేదు. అమ్మా నిన్ను సందర్శించుటయే నాకోరిక" ఇట్టి దీనాలాపములతో శ్రీగురు దేవుడు విశ్వేశ్వరిమెదుట తనహృదయ వేదనను వెల్లడి జేసెడివాడు ఎడ తెంపు లేక ప్రవహించు దుఃఖాశ్రువులచే కన్నులు వాచి పోవును దివసావసానమై దేవాలయములోని గంటలు మ్రోగుచుండు నప్పుడు పూర్వముకంటే నెక్కువ దీనుడై యిట్లు విలపించును "అయ్యో! మరియొక దినము వ్యర్థముగ గడచి పోయినది. అమ్మా! నిన్నింకను జూడజాలకపోతిని. ఈ స్వల్ప జీవితములో మరియొక దినము వ్యర్థ ముగ గడచిపోయినది. నాకు సత్యము బోధ పడ లేదు." ఇట్టి హృద యవేదనతో శ్రీ గురుదేవుడు తనముఖమును నేలపై వేసి తలచుగ రాయుచు, గొంతెత్తి యేడ్చుచుండును. బహు విషాదకరమైన యారో ద్దును విని జనులెల్లరు నాయనచుట్టుమూగి యిట్లు చెప్పుకొను చుం దురు. "అయ్యో! పాపము యీబాలుని తల్లినిజముగా చనిపోయెను గాబోలు, లేనిచో పైత్యభ్రమవలన నితడు బాధపడు చుండనోపును ఇతని దీనాలాపములు విన్నవారికి గూడ కన్నీరు వచ్చును.

శ్రీ రామకృష్ణ లీలామృతం 275 పేజి:—

"అయ్యో? నేనెంతచెప్పినను మీరు నాతల్లినినమ్మక యామె అస్తిత్వము మిథ్యయని ఋజువుచేయుటకు వాదించు చుంటిరే? ఆమె కూడ నెంతసత్యమో మీకు బోధపడినదా! చాలకాలము క్రిందటనే బ్రహ్మమును శక్తియు, నగ్నియుష్ణతలవలె నభేదములని శ్రీ విశ్వేశ్వరి నాకు బోధించెను." అనిచెప్పెను.

2 కుమారుడు తండ్రియందుంచు విశ్వాసమువలె,

"పితృదేవోభవ" అనువేద వాక్యానుకీతి తండ్రియే దైవము ఆజ్ఞల నిచ్చువాడు, సర్వసంపదలు, సుఖములు గలిగించువాడు.



స క్షేమము

# యథార్థభారతి

సంపుటం 13. | ప్రమాది సం॥రం వైశాఖమాసం మేనెల 1939. | సంచిక 3.




(పత్రిక విలాసము:-శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోస్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

ర్వభూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి

మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.
Published by K. Venkatachalam Naidu, Seetharama Indian Stores, Chittoor.

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, యేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కఠారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, ఆంధ్రా."
5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్ పూర్.

# యథార్థభారతి

సంపుటం 13 | ప్రమాది సంవత్సరం | చందా
సంచిక 3 | వైశాఖమాసం | సం॥రం రూ 2-4-0
1939 సం॥రం మేనెల | విడిపత్రిక రూ 0-4-0


ఓం.

## బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి.

15. శమాదిపూర్వక శ్రవణమనన నిదిధ్యాసనాభ్యాసబలాద్విషయాసక్తిః ప్రజ్ఞామాన్ద్యం కుతర్కో విపర్యయదురాగ్రహశ్చేతి వర్తమాన ప్రతిబన్ధచతుష్టయ నివృత్తిద్వారా అప్రతిబన్ధాఽపరోక్షబ్రహ్మసాక్షాత్కారో దృఢీభూయాత్.

తా॥ శమాదిషట్క సంపత్తిని మున్నుగాఁ గల్గిన శ్రవణము, మననము, నిదిధ్యాసనముల యొక్క అభ్యాసబలమువలన, విషయాసక్తి, ప్రజ్ఞామాంద్యము, కుతర్కము, విపర్యయదురాగ్రహము అను నీ వర్తమాన ప్రతిబంధములగు నాలుగింటి యొక్క నివృత్తివలన ప్రతిబంధములేని అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము దృఢమగును గాక!

విషయాసక్తి = చిత్తమునకు విషయములచేఁ గలుగు కోరిక.

బుద్ధిమాంద్యము=బుద్ధికి గ్రహణ, ధారణ పటుత్వము లేకుండుట.

కుతర్కము = శుష్కతర్కము కలవాడగుటచే శ్రుత్యర్థములను వేఱుగా కల్పించుట.

విపర్యయ దురాగ్రహము = ఆత్మ కర్తృత్వాది ధర్మములతోఁ గూడినదనెడి విపర్యయవృత్తిజ్ఞానముచేత తాను పట్టిన పట్టు సాధింపవలయునని యుక్తిలేక హఠముచేయుట. మీఁద చెప్పిన నాల్గును శమాదిషట్కముచేతను, శ్రవణాది త్రయముచేతను నివృత్తియగునని చెప్పబడినది.

16. ఉపక్రమాది బహువిధలిఙ్గైరశేష వేదాన్తానా మద్వై
బ్రహ్మణి తాత్పర్యావధారణం దృఢీభూయాత్.

తా॥ ఉపక్రమము మొదలగు ఆఱులింగములచేత సకల
ఉపనిషత్తులకును అద్వైతబ్రహ్మమునందు తాత్పర్య నిశ్చయ
చేయుట దృఢముగా కలుగును గాక! (ఉపక్రమము మొదలగు
ధలింగములను విచారసాగరమునందు విస్తరముగాఁగనందగును).

ఓం తత్ సత్.

---

ఓం సర్వమహర్షిభ్యోనమః ఓం పరమగురుభ్యోనమః

## మనస్తత్వము.

(శ్రీ మలయాళ స్వాములవారు)

ఓం నమోగురుభ్యో గురుపాదుకాభ్యో నమః పరేభ్యః పరపాదుకా
ఆచార్యసిద్ధేశ్వరపాదుకాభ్యో నమోస్తు లక్ష్మీపతిపాదుకాభ్యః

మానవుడు తెలిసికొనతగిన తత్వము లన్నింటిలోను మన
త్వమే అతిప్రయాస్తమైనది. ఏలన అన్నింటిని మనస్సే తెలిసికొ
చుండగా నిక యామనస్సు యొక్క స్వరూపమును దేనివలన తె
కొనగలము? మనస్సును ప్రకాశముచేయు బుద్ధిగాని లేక ఆత్మగా
మఱియొకటి గలదను భావమీ విషయములో ఉపయోగపడు
కాదు. ఎందుకనగా, మనస్సును దాటిపోయినవారికి మాత్రమే
ఉపయోగకరమగును ఇదే వేదాంతశాస్త్రములోగల రహస్యమ
ఇది యెట్లుండుననిన ఒక రాజకీయ సభలో రెండుపార్టీల వారుగల
కాని ఒకపార్టీకి సంబంధించినవారే మంత్రులుగాను అధ్యక్షులుగా
సభ్యులుగానునున్నారు. అట్లుండగా, వారికి భిన్నమగు పార్టీవారి య
ప్రాయమును వారు ఋజువుచేయుదురా? లేదుకదా! . ఆలాగు
సమస్త కార్యములను మనస్సే చేయుచుండగా తనకు విరుద్ధమైన కా
మేదైనను ఆమనస్సు చేయగలదా? కనుకనే బ్రహ్మవిద్యయందు యీ
నిగూఢతత్వము గలిగియుండుటకు కారణము. ఈవిద్య మనోలోకమ

కావల వెలుగుచున్నది. మనస్సును దాటిపోవక, అచ్చోటికి వేఱు మార్గము లేదు. మనస్సును దాటిపోవలసియుండిన, మనోరాహిత్యము కలుగవలయును. అనగా మనోజయము గలుగవలసియుండును. మనోజయము గలుగవలసియుండిన, యింతవఱకు జన్మజన్మాంతరములనుండి యంతఃకరణములో నిలిచియుండు దృశ్యసంస్కారము లన్నియు లయ మొందవలెను. అట్టిసంస్కారములకే కర్మయనియు, వాసనయనియు, మాయయనియు, అవిద్యయనియు, అజ్ఞానమనియు, గుణముల సముదాయమనియు పేర్లు. ఇంతేగాక యిక యెన్ని పేర్లు కర్మనుగుఱించియు, బంధమును గుఱించియుగలవో, అవన్నియు యీమనస్సునకు సంబంధించినవని గ్రహించుకొనవలెను. ఈమనస్సును జయించనిచో బ్రహ్మవిద్యయందు ప్రవేశించుట యెట్టివారికిని సాధ్యమైన పనిగాదు. ఈ మనస్సు యొక్క ఆటంకము చాలగొప్పది. ఇదిశుద్ధమైన మాత్రమే ఆత్మవిద్య గోచరించును. ప్రపంచములోగల తక్కిన సమస్త విద్యలున్ను తెలిసికొనుటకుగాని వానియందు విజయము గాంచుటకుగాని యీ మనోజయము, అనగా మనశ్శుద్ధి కావలయునను నిర్బంధము లేదు. ఉండిన మంచిదేకాని, ఉండియేతీరవలెనను కఠిన శాసనము లేదు. ఈ బ్రహ్మవిద్యయందు నిశ్చయముగ మనోనిర్మలముగావలయునను నిర్బంధ నియమముగలదు ఇట్టి దానిలో నిది అలంఘనీయ శాసనము. కనుకనే దీనియందు జనులకు ప్రవేశము కలుగకుండుటకున్ను, ఒకవేళ కొందఱకు సుకృతవశమున ప్రవేశము గలిగినను, విజయము సంప్రాప్తింపక జారిపోవుటకును కారణమగుచున్నది. ప్రపంచములోగల విద్యలలో ముఖ్యములగు నాల్గువేదములున్ను వేదాంగములున్ను చదువుటకును, చదివించుటకున్నూ, నిర్విషయస్థితి, చిత్తైకాగ్రత పరమగు యుపరతి గలుగవలయునను నిబంధన లేదుకదా! ఏలన, వేదములు నాల్గున్ను చదివినవారును, చదివించెడివారును, ఆలాగున వేదాంగములను గ్రహించినవారును, గ్రహింపజేయువారును. అనేకులు గలరుకదా! కాని నిర్విషయస్థితిగాని, బంధవిముక్తిగాని, మనోరాహిత్యముగాని, యెందఱు కలిగియున్నారు? వేదాంగ

ములగు తర్క-శాస్త్రముగాని వ్యాకరణ శాస్త్రముగాని, జ్యోతిశ్శా
స్త్రముగాని వైద్యశాస్త్రముగాని, విజ్ఞానశాస్త్రము (సైన్సు)గాని
శిల్పిశాస్త్రముగాని (యింజనీరింగ్) గాని, వెయ్యేల, ప్రపంచమునగ
యెన్ని శాస్త్రములుగలవో, వాటియన్నిటిలో ప్రవేశముగల వారనే
లున్నారు. వారుగూడ మనశ్శాంతికలుగక, ప్రసన్నతపొందక, అజ్ఞా
ము తొలగక, శ్రమపడుచుండుట మనముగాంచుచున్నాము. ఇక
యజ్ఞాదికర్మశాస్త్రపారీణులనేకులు కలరు. వీరిలో, ఆత్మసుద్ధిగలి
ఉపశమమును పొందినవారెందఱు కలరు? ఇదేరీతిగ భూగర్భశాస్త్ర
ము, నక్షత్రశాస్త్రము మొదలైనవి తెలిసినవారికిగూడ ఆత్మ శుద్ధిగ
యుండవలెనను నియమములేదు. ఆత్మవిద్యలో యిట్టి ప్రయాసము
డుటచేతనే, యీవిద్య సామాన్యజనులకు అలవాటులో లేకపోవు
కు కారణమైనది. ఇదిలేనందులేతనే జీవకోట్లు తమస్సులోపడియు
వలసివచ్చినవి- సీతా రామాంజనేయము చూడుడు:—

వేదశాస్త్రంబులు వివరించి బుధులచేఁ
జదివింప వచ్చుఁదాఁ జదువవచ్చు
యజ్ఞదాన తపంబు లధికారి జనముచే
జేయింప వచ్చుఁదాఁ జేయవచ్చు
నిలలోనఁ గల తీర్థముల కేఁగ నన్యుల
బోధింప వచ్చుఁదాఁ బోవవచ్చు
నష్టాంగయోగవిద్యల నార్యులకుపదే
దేశింపవచ్చు సాధింపవచ్చుఁ

తే. గాని యెవ్వారికైన విజ్ఞానయోగ
గతినిక్కదేహేంద్రియములరికట్టి మనము
నాఁగి[illegible]యంతర్ముఖముఁజేసి యనవరతము
నిశ్చలసమాధినిష్ఠచే నిలుపరాదు.

తక్కినవిద్యలయొక్కయు, ఆవిద్యల ఫలముల యొక్కయు
అంత్యమునుండి యీ బ్రహ్మవిద్య ప్రారంభమగుచున్నది. వేదాంత
మనగా వేదములయొక్క అంతిమ భాగము. దీనికి ఉపనిషద్విద్యయని

పేరు. అందు ప్రవేశించుటకు ముందుగనే అంతఃకరణశుద్ధి గలుగవలె నని యది కఠినముగ శాసించును. ఈ ఆజ్ఞోల్లంఘనము యెవరిచేతను చేయ సాధ్యముగాదు. చేసినచో పునర్విచారణలేకనే అతనిని దాని నుండి తొలగించును. దీనికే పతనమని పేరు. మరల దానిలో చేరవల సియుండిన పుణ్యసంస్కారము కావలసియుండును. అట్లైన దానియందు మరల ప్రవేశము కలుగచేసికొనవచ్చును. అంతఃకరణశుద్ధి కలుగవలసి యుండిన శమాదిషట్కసంపత్తి యవసరము. అనగా శమము, దమ ము, ఉపరతి, తితీక్ష, సమాధానము, శ్రద్ధ - ఇవన్నియుచేరిన శమా దిషట్క సంపత్తి గలిగెనని నిశ్చయించుకొనవచ్చును. దీనిలోగల మరి యొక అంగమునకే సాధనచతుష్టయ సంపత్తియని చెప్పుదురు. నిత్యా నిత్య వస్తువివేకము, ఇహాముత్రఫలభోగ విరాగము శమాదిషట్కము, ముముక్షుత్వము యీ నాల్గునుజేరి సాధనచతుష్టయ సంపత్తియన బడును. ఇందు ముముక్షుత్వము మందమనియు, తీవ్రమనియు రెండు తరగతులు. ఇవన్నియు నేక కాలములో చేరునపుడే నిజమైన యంతః కరణశుద్ధి కలుగును. అనగా మనోశుద్ధి సిద్ధించును. అధిక పుణ్యఫల ముయొక్క యావిర్భావము కలుగునపుడే మానవుడు దైవత్వము లోనికి ప్రవేశించినవాడును, మోక్ష ద్వారముయొక్క తలుపు దగ్గరకు వెళ్లినవాడునగును. ఈ ఘట్టముననే శ్రీ కృష్ణభగవానులు గీతయం దిట్లుపదేశించిరి.

> యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి
> తదా గన్తాసినిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ.

తా॥ ఎపుడు (అనుష్ఠానముచే పరిపక్వావస్థ కలుగునపుడు) నీ యొక్క బుద్ధి దేహమే యాత్మయనెడి అజ్ఞానరూప దోషమును, లేక అవిద్యను దాటునో, అప్పుడు యికపై వినదగిన వేదాంతార్థము యొక్కయు, యింతవరకు శాస్త్రముల ద్వారావినబడిన వేదాంతార్థము యొక్కయు యథార్థజ్ఞానము, అనగా వేదముయొక్క నిజమగు అర్థ మును తెలిపెడి నిర్వచనమును పొందగలవు.

ఈలాగున స్కందోపనిషత్తునందు గూడ ఉపదేశింపబడినది. ఎట్లన, ననిజం నిజవద్భాత్యంతఃకరణ జృంభణాత్

అంతఃకరణ నాశేన సంవిన్మాత్రస్థితో హరిః.

అనగా, అంతఃకరణము దృశ్యవిషయములతో కూడి బహిర్ముఖమైనపుడు నిజమైన ఆత్మ స్వస్వరూపము అనుభవమునకు రాకయుండును. అంతఃకరణము శుద్ధమగునపుడు సత్యస్వరూపుడగు పరమేశ్వరుడు తనయాత్మగా వెలుగుచున్నట్లు గోచరమగును.

అంతేకాదు, ఇంద్రియములలోగల వాసన (దృశ్యవృత్తి) గలవారికి ఈశ్వరుని పరమార్థముగ నెఱుంగుటకుకూడ యవకాశము గలుగదు. మైత్రేయ్యుపనిషత్తును యీ విధముననే చెప్పుచున్నది.

శబ్ద స్పర్శ మయా యేఽర్థా అనర్థా ఇవ తే స్థితాః
యేషాం సక్తస్తు భూతాత్మా నస్మరేచ్చ పరం పదమ్.

'శబ్దస్పర్శరూపరసగంధాదులు అజ్ఞానదశలో సౌఖ్యములుగ నగుపడినను, యథార్థస్థితి తెలిసికొనుటలో నవి యాటంకమును కలుగచేయును. కావున, నవి యనర్థములనియే గ్రహించవలెను. ఏలన నవి దృశ్యసుఖములు శాశ్వతములనియు, వాని ననుభవించుట జీవుని స్వభావమనియు తలంచునట్టి బుద్ధిని గలుగచేయును. అందువలన పరమపద ప్రాప్తికి హేతువగు పరమేశ్వరుని (బ్రహ్మమును) నిశ్చయముగ స్మరించుట కవకాశము కలుగనీయదు. కావున మనుజుడేమి చేయవలసియుండునో, ఆ విధిని శ్రుతియిట్లు తెలుపుచున్నది.

తపసా ప్రాప్యతే సత్వం సత్వాత్సంప్రాప్యతే మనః
మనసా ప్రాప్యతేహ్యాత్మా హ్యాత్మాపత్త్యా నివర్తతే.

(మైత్రేయ్యుపనిషత్)

అనగా, 'తపస్సువలన యంతఃకరణము శుద్ధమగును. మనస్సు శుద్ధమగునపుడు ఆత్మకది స్వాధీనముగానుండును. అట్టి శుద్ధమైన ఆత్మలో పరమాత్మస్వరూపజ్ఞానము స్ఫురించును. అట్టి స్వస్వరూపసాక్షాత్కార జ్ఞానము కలుగునపుడు సంసారదుఃఖములన్నియు నశించును' గంధక సౌవీర పాషాణాది ధాతువులను స్ఫుటముచేయుట వలన అందలి విషదోషములు నశింప, ఏలాగున నవి సిద్ధౌషధములగునో, ఆలాగున తపస్సువలన విషయాది దోషములన్నియు నశించి ఆత్మ శుద్ధ

మగును. నిరంతర యీశ్వరచింతనయు, ఆత్మోపలబ్ధిపరమగు యోగ నిష్ఠయు, శమదమాది గుణములతో గూడిన బ్రహ్మవిచారమును, తపశ్శబ్దమునకు పర్యాయవాచకములు. తపశ్శబ్దముయొక్క నిర్వచనము, అంతఃకరణములోగల సమస్తదోషములను జ్ఞానాగ్నివలన దహింపచేయుట యేయగును. ఇది యేప్రకారము కలిగినను దానికి తపస్సనియే చెప్పబడును. మనస్సును పరిశోధించి చూచిన నది త్రిగుణములతో చేరినదే యని తెలియగలదు. ఈ గుణత్రియములో యెవరికేగుణము గలిగి యుండునో, వారు తాముచేయు కార్యములన్నియు నీతియుక్తములనియు, అనుష్ఠేయములనియు, ధర్మవంతములనిము తలంచునట్లుచేయు యొక మహిమ గల శక్తి యద్దానియందిమిడి యున్నది. ఇది కనుగొనుటకు గుణత్రయాతీతునకు మాత్రమే సాధ్యమగును. కనుకనే జీవకోట్లన్నియు వారివారి సంస్కారము (మనస్సు) ననుసరించి ప్రవర్తింప గలరని శాస్త్రముచెప్పెడు రహస్యము. అందువలననే ప్రాణికోట్లు కర్మపాశములచే బంధింపబడినవారలని చెప్పుటకు కారణము. అనేక రంగులుగల యద్దములమర్చబడి యుండిన మేడలో మీరు కూర్చుండుచో ఆయద్దముల యొక్క రంగు, నీలముగాని పీతముగాని రక్తముగాని అయియుండిన, వానిద్వారావచ్చెడు సూర్యరశ్మిచే నాగృహమంతయును, దానిలోనుండు సామానులన్నియును, ఆ దర్పణవర్ణము ననుసరించి ప్రకాశించుచుండునట్లు గాంచగలరు. అప్పుడది సత్యముగానే గోచరించును. ఇంటిలోనుండి బైటకువచ్చిచూచిన మాత్రమే సూర్యుడు కేవలము ప్రకాశస్వరూపుడై యుండెననియు, గృహాంతర్భాగమున గన్పించెడి వర్ణములన్నియు దర్పణముల భేదములచే గల్గినవనియు తెలిసికొనగలరు. ఆలాగున జీవకోట్లు త్రిగుణములతోగూడిన కర్మపంజరములోపల నుండువరకు సత్యస్వరూపుడగు యీశ్వరుని (ఆత్మను) యథార్థముగ తెలిసికొనజాలరు. ఇదే దీనిలో గలరహస్యము. కనుకనే బ్రహ్మవిద్యను ఆత్మజ్ఞానముపొందిన యాచార్యునివలన గ్రహింపవలెనని చెప్పెడు రహస్యము. లేనిచో వారివారి మనస్సు ననుసరించి వారువారుచేయునవన్నియు సరిగానుండునని తోచెడు ప్రమాదములో పడిపోవును. ఆత్మజ్ఞుడైన గురువైనచో యితరులలోగల గుణ

ములను కనుగొన శక్తిగలిగియుండును. అప్పుడు వారిని దిద్దుటకా
హాత్మున కర్తృతగలిగియుండును. కనుక నే గీతయందిట్లు చెప్పబడినది.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషో యోయచ్ఛ్రద్ధస్స ఏవ సః.

అనగా ఓ అర్జునుడా! సమస్త ప్రాణులకును వానివాని పూ
జన్మ సంస్కారముతో గూడిన యంతఃకరణము ననుసరించిన స్వభా
ముగలుగుచున్నది. ఈ జీవుడు శ్రద్ధయే (స్వభావమే) స్వరూపము
గలవాడు. ఎవ్వడెట్టి శ్రద్ధ (స్వభావము) కలవాడో వాడట్టి శ్రద్ధను తగ
వాడే యగుచున్నాడని యర్థము. మీరెవరైనను యెఱుపు, పసుపు
నీలవర్ణములుగల సులోచనములు పెట్టి చూచినయెడల, జగత్తంతయు
మీరు ధరించియుండు దర్పణవర్ణముగానే కన్పించును. శుద్ధమై
అద్దముద్వారా చూచువారికి మాత్రమే అన్నివర్ణములున్నూ, వే
వేఱుగ కనుగొనుటకు శక్తిగల్గియుండును. ప్రకృతియొక్క రహ
మున్నూ యీలాగుననే యుండును. కావున త్రిగుణములను దా
పర్యంతము, మనము సత్యమును తెలిసికొనజాలము. పరమేశ్వరు
యొక్క సృష్టిమహిమ ఈ లాగుననే యుండును. కావున యీశ్వరా
గ్రహముచే ప్రకృతిదోషము తొలగిన మాత్రముననే సత్యముగోచరమ
కాగలదని చెప్పెడు రహస్యము. బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము
వారిలో అగ్రగణ్యులును, త్రిమూర్త్యాత్మస్వరూపులును, పరమాద్వై
సత్యమును బోధించుగురువరేణ్యులునగు శ్రీ దత్తాత్రేయులు గా
అవధూతగీతయందు ప్రారంభముననే యీశ్లోకమునుపదేశించిరి.

ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా
మహాభయపరిత్రాణా ద్విత్రాణా ముపజాయతే.

జీవకోట్లకు ఈశ్వరానుగ్రహము వలన మాత్రమే అద్వై
జ్ఞానము కలుగును. సాంసారిక గుణములచే బద్ధులగువారికి దీనికం
వేఱుమార్గములేదు. కనుకనే యెట్టివారికిని మొదట భక్తిగలిగియు
వలెననియు, అట్టిభక్తిలేనివారికి యీశ్వరసాక్షాత్కారజ్ఞానముకలు

దసియు, శాస్త్రములును, మహాత్ములును చెప్పుటకు కారణము. కనుకనే సదా యింద్రియనిగ్రహము కలిగియుండుము. మనస్సునెల్ల ప్పుడును స్వాధీనములో నుంచుకొనుము. నిస్సంగత్వము కలిగేలాగున చూడుము. ప్రకృతిగుణములు కలిగియుండకుము. శాంతము, కరుణ విర క్తి, భ క్తి గల్గివ ర్తింపుము. ఇట్టి పావనమగు యుపదేశమును గురువులు ముందుగనుపదేశించుచో, మఱియు, ఉపదేశమును పొందిన శిష్యులు ఆ లాగున సదా యాచరణలోనుంచుచో, లోకమెంతో బాగుపడియుం డును. అయితే అట్టిస్థితికి గల్గుటకు వారిదృశ్యసంస్కారము నశించవలెను. కర్మముక్షయించవలెను. మనశ్శుద్ధి కలుగవలెను. అత్తఱి యింద్రియ నిగ్రహము, మనోనిరోధము గల్గియుండవలెనని చెప్పెడు వేదవాక్యము సార్థకమగును. అట్లుగానిచో, యెంతగొప్ప యుపదేశములైనను నిరర్థక ములేయగును. విరేచనమునకు ఔషధము వేసికొని, యుష్ణోదకము పా నముచేసియుండువానికి, బహిర్భూమికి వెళ్లక నిశ్చలముగ గూర్చుండు మని చెప్పినచో పాప మాతడేమి చేయగల్గును. విరేచనమయి, మలశుద్ధి అయిన తరువాత నిర్విచారముగ నుండుమని చెప్పిన, అతడాలాగుననే చేయగల్గును. ఇప్పుడుగల వేదాంతబోధయు యీలాగున పరిణమించి నది. అంతఃకరణశుద్ధి గలుగుటకున్ను, పాపము క్షయించుటకున్ను తగిన సాధనలుపయోగించక, అమనస్కము, అచలము, నిర్వికల్పము, నిస్సం గత్వము, సమాధి, తురీయము, తురీయాతీతము, సర్వసాక్షిత్వము, దృక్-స్థితి, మొదలగు అతీతవాక్యము లుపదేశించిన యేమి ప్రయోజనము? సామాన్యజనులుకూడ పై జెప్పిన వాక్యములను విని తాామున్నూ సాక్షిభావములోనో, అమనస్కములోనో, అచలములోనో, సదా తురీ యములోనో యున్నట్లు బల్కుచుందురు. దీనియొక్క యథార్థస్థితి గలుగక పోవుటచేతనే ఉపదేశమును పొందినవారు దృశ్యవిషయములలోనికి దిగి పోవుటకు కారణమగుచున్నది. వారున్నూ మనోనిగ్రహము కలుగక, దృశ్యబాధలోపడి పరితపించుటకు హేతువగుచున్నది. కావున ఆత్మశుద్ధి కలుగుటకు హేతువులైన దివ్యమంత్రజపము, సాత్వికాహారము, తప స్సు, యోగము, వ్రతము, పరమభ క్తి, పుణ్యకర్మానుష్ఠానములు,

వేదాంతశ్రవణము, యీలాటి దివ్యగుణములు గల్గియుండిన ఆత్మసు త్వరలో సిద్ధించును. అపుడు నిర్వికల్పము, అమనస్కము, నిస్సంకల్పము, అవన్నియు ప్రయత్నములేకనే సిద్ధించును. అపుడే ప్రవాహవేగము కును, అనుకూలమైన గాలికిన్ని అనుసరించి పోయెడు పడవవలె ఆత్మో న్నతిలోనికి త్వరలోచేరవచ్చును. అట్లుకాని బోధలన్నియు ప్రవాహ వేగమునకున్నూ, వాయువేగమునకున్నూ అడ్డముగ నడిపింపబడు పడ చందమున శ్రమపడవలసియుండును. మందబుద్ధిగల ఉపదేష్టలందఱు పైఁజెప్పిన అతిపావనములగు గుణములున్నూ, అనుష్ఠానములున్నూ క్రి ది మెట్టు అనియు, వారిబోధలు అన్నిటికన్న పైస్థితి అనియు వచింతురు. వారుచెప్పునది మాత్రము పైస్థితిలోచేరునదేకాని, వారుండుస్థితిని చూ చిన భూమిలోనేవారు సంచరించుచున్నారని తెలియవలెను. గుణము, శుభేచ్ఛగల పుణ్యజీవులయొక్క పవిత్రప్రవర్తన కూడ వారియందు కనుపించుటలేదు, కనుకనే పరమపవిత్రమై దివ్యమై బ్రహ్మాదిదేవతలచే కూడ పూజింపబడెడు బ్రహ్మవిద్య కింత పతనముకలిగినది. ఇక బ్రహ్మ విద్య యున్నత స్థితికి రావలసియున్న కొందఱు అంతఃకరణశుద్ధి గలవారును, బ్రహ్మనిష్ఠులును, త్యాగశీలురును, సోమరితనమను పెనుభూతమును జయించినవారును, కొంతవరకైన శాస్త్రపరిచ యముగలవారును, తపస్సుగాని, యోగముగాని బాగుగ యాచ రించినవారును, పరమ విరక్తులును, బ్రహ్మచర్యవ్రతమును నిర్వ హించువారును యేర్పడవలెను. ఒకవేళ విద్యలేనప్పటికిన్ని, మంచి త పస్సుగాని, పరమభక్తిగాని గలిగియుండిన చాలును. విద్యమాత్రము చదివినను, తపస్సుచేత ఆత్మ, స్ఫుటముచేసిన బంగారము వలెప్రకా శించును. అట్లుచేయని విద్య, అవిద్యయే యగును. పైఁజెప్పిన నిర్మల గుణముగల పురుషశ్రేష్ఠులవలె ధీరత్వముగల నారీమణులు కొందఱు యేర్పడవలెను. వీరు తమ జీవితమంతయు ఆత్మజ్ఞానోపార్జనమందును బ్రహ్మనిష్ఠ చేయుటలోను, దానినుపదేశించుటలోను వినియోగించవ లెను. తక్కిన ప్రపంచకార్యములు చేయుటకనేకులున్నారు. వారాయా కార్యములను చేయుచుందురు. ఈబ్రహ్మనిష్ఠులలోకూడ పరిపక్వమన స్సుకలుగని వారుండిన, వారు పుణ్యకర్మలను, లోకసేవను చేయుచుం

డుటయే మిక్కిలి శ్రేయస్కరమైనది. వృత్తులు, సంస్కారములు, విష
యవాసనలు, అంతఃకరణలో నుండువఱకు నిరంతరమీశ్వర విషయ
ముఖో నిలుకడగల్గి యుండుటకు సాధ్యముగాదు. వీరున్నూ ధ్యానకాల
ములో ధ్యానానుష్ఠానము నభ్యసించుకొనవలెను. ధ్యేయమగు భగ
వద్వృత్తి గల్గియుండువరకున్నూ అట్టి వృత్తియేచాలును. దానినుండి
బాహ్యవృత్తిగలుగునపుడు పైచెప్పిన సత్కర్మలను, బ్రహ్మాభ్యాసము
ను అందఱును చేయుచుండవలెను. ఇదే యుత్తమమైన పద్ధతియగును.
పూర్వీక ఋషి.సాంప్రదాయమును యీలాగున నేయుండెను. అట్టి పద్ధ
తియే మఱల మనకిపుడు కావలసినది. అయినను దేశకాలానుసారము
అనుకూలమగు మార్పులు వివేకజ్ఞులు చేయుదురు. వాని ననుసరించి
వర్తించేలాగున చూడవలెను. అవిన్నియు బాహ్యప్రపంచమును గుఱిం
చియేగాని, ఆత్మవిషయములో యేలాటి మార్పును గలుగదు. ఏలన,
అది సనాతనము.  ఓం తత్ సత్ .

—:o:-—

# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

(దశమోధ్యాయము)

విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె:—ఓలక్ష్మీ! యిక గీత 10 వ
అధ్యాయ మాహాత్మ్యమును జెప్పెద నాలకింపుము. కాశీపట్టణమందు
ధీరజుడను బ్రాహ్మణుడుండెను. అతడు ప్రతిదినము గంగానదియందు
స్నానముచేసి విశ్వనాథస్వామిని దర్శించుచు భగవద్భక్తుడై యుండెను.
ఇట్లు కొంతకాలము గడిచిన తదుపరి గ్రీష్మఋతువునందు ఒకనాటి
మధ్యాహ్నసమయమున విశ్వేశ్వరుని దర్శి నుద్దేశ్యముతో బయలుదేరె
ను. కాని, ఆనాడు వడగాల్పు విస్తారముగాకొట్టుటచేత కాశీవిశ్వనాథు
ని ఆలయసమీపమువఱకు వచ్చుసరికి వడకొట్టి పడిపోయెను. ఇంతలో
భగవంతుని కింకరుడైన భృంగీశ్వరుడు వెలుపలికివచ్చి మూర్ఛను
పొందియున్న బ్రాహ్మణునిజూచి పరమేశ్వరునితో యిట్లుచెప్పెను.
ఓస్వామీ! ఒక విప్రుడు తమదర్శనార్థము వచ్చుచు మార్గమధ్యమందు

వడకొట్టి పడిపోయెను; గనుక యతని నుద్ధరించుడని చెప్పెను.
భృంగి చెప్పినమాట విని శంకరుడు ఏమియు జవాబు నుడువలేదు.
రువాత భృంగీశ్వరుడు మఱల వెలుపలికివచ్చి చూచుసరికి ఆ బ్రాహ్మ
ణుడు చచ్చిపడియుండెను. అప్పుడు మఱల ఈశ్వరుని దగ్గరకువ
పరమేశ్వరా! ఆ విప్రుడు తమసమీపమున చనిపోయెను. కాన
ట్టి పుణ్యమును పొందునని యడిగెను. అప్పుడు పరమేశ్వరుడు
చెప్పెను. ఓ భృంగీ! అతని పూర్వజన్మవృత్తాంతమును చెప్పె
వినుము. కైలాసపర్వతముమీద పార్వతితో మేమొక దినము
కూర్చునియుండగా ఒకహంస మా దర్శనమునకు వచ్చుచుండెను. అ
బ్రహ్మదేవునియొక్క వాహనము. బ్రహ్మలోకమునుండి మానసస
వరమునకు పోవుచుండెను. ఆ సరస్సునందు కమలములు చాల య
ముగానుండెను. ఆపద్మముల మీదనుంచి ఎగురుచు తిరుగుచుండ
ఒకపుష్పముయొక్క నీడపడుటతోడనే ఆ హంస మూర్ఛపడెను.
టనే దానిశరీరము నల్లబడెను. ఇదంతయును మాగణములలో నొక
చూచి మాతో చెప్పెను. అప్పుడు మేమా హంసను ఎందుచేత నీ
నల్లబడితివని యడిగితిమి. అంత నాహంస యిట్లుచెప్పెను. ఓ స్వామీ
తమ దర్శనమునకు నేను బ్రహ్మలోకమునుంచి వచ్చుచూ మా
మధ్యనున్న యీ సరస్సుమీదుగా రాగా, అకస్మాత్తుగా నా శ
మంతయు నల్లనయ్యెను. కారణమేమియు గానరాదయ్యె. కాని నే
హేతువును తెలిసికొనుటకు ఆలోచించుచుంటిని. ఇంతలో నాకొల
నుండి యీక్రిందివాక్కులు వినవయ్యెను. 'ఏల హంస మూర్ఛనుపొం
నల్లనయ్యెనో దానికి కారణము నావలన వినదగును.' అంత నే
ఆ శబ్దమువచ్చిన దిక్కుకుపోగా అక్కడ అన్ని కమలములకన్న మిక్కి
పెద్దదియగు పద్మము నన్నుగూర్చి యిట్లుచెప్పెను. ఓహంసా! నీ
భయపడకుము నీకు దీనివల్ల కీడేమియు గలుగజాలదు. వ్యర్థముగా
తింపకుము. ఓ స్వామీ! అంతనేను పద్మము మాట్లాడుట విని ఆ
ర్యముతో నిట్లంటిని. నీ వెవరవు? అంత నాపుష్ప మిట్లు చెప్పదొ
గెను. నేను పూర్వజన్మమందొక బ్రాహ్మణునికి కన్యకనై జనించి
నాకు వివాహమైన తదుపరి అత్తవారింటికి బోయి కాపురముచేయు

ఒక మైనపు గోరువంకను పెంచితిని. ఒక దినమున ఆగోరువంకను పంజరమందుంచి దానితో భగవంతునియొక్క నామము చెప్పుచుంటిని. ఇంతలో నాభర్త యింటికి రాగా నేను లేచుటగూడ మఱచి గోరువంకతో మాట్లాడుచునేయుంటిని. అంతనాభర్త కోపించి నన్ను గోరువంకగాయగునట్లు శపించెను. వెంటనే నేను గోరువంకనై అచ్చటనుంచి ఎగిరి ఎగిరి ఒకఋషి ఆశ్రమము చెంతకు బోయితిని. అంత నాముని నన్ను ఆదరముతో చేరదీసి పంజరమందుంచి పెంచుచుండెను. ఆఋషి ప్రతి దినము గీత 10 వ అధ్యాయమును పఠించుచుండ నేను దానినంతయు వినుచుండెడిదానను. ఇట్లు కొంత కాలమైన పిమ్మట నేనీ మానససరోవరమునకు స్నానమునకువచ్చి జలక్రీడలాడుచుంటిని. ఇంతలో దూర్వాస మహర్షివచ్చిజలక్రీడలాడుచున్న నన్నుంగనెను. నేనునుయామునిని చూచుటతోడనే భయముచేత జలమునందే మరుగుపడియుంటిని. అంత నామహర్షి కోపించి నన్ను నూఱు సంవత్సరములు యీసరస్సునందు పద్మముగాగమ్మని శాపంబిచ్చెను. గనుక నో హంసచంద్రమా! నేనా దూర్వాసుని శాంపబనుభవించుచు కాలమును గడుపుచుంటిని. నాకు మనుష్యవాక్కులు వచ్చుటకు కారణము గీత 10 వ అధ్యాయమును వినిన ప్రభావముచేతనే. నేను 100 సం॥ లు యీ శాపంబనుభవించి స్వర్గమునకు బోవుచుంటినని చెప్పుచూ వెంటనే అప్సరసరూపము దాల్చి స్వర్గమునకు బోవుచూ ఓహంసా! నీవు గీత 10వ అధ్యాయమును ఎప్పుడు వినెదవో అప్పుడు నీపూర్వ రూపమును పొందగలవని చెప్పెను.

గనుక నో పరమేశ్వరా! నాశరీరము నల్లనగుటకు ముఖ్యకారణమిదియే. తమ దర్శనముచేత నాపాపములన్నియు పోయి పవిత్రతను పొందితినని చెప్పి యాహంస యెగురుచూపోయి ఒక వనమందు బ్రహ్మజ్ఞానియగు నొక బ్రాహ్మణుని వలన గీత 10వ అధ్యాయమును వినెను. ఆ ప్రభావముచేత ఆ హంసజన్మను వదలి బ్రాహ్మణుడై జనించెను. ఓ భృంగీశ్వరుడా! ఈ చచ్చిపడియున్న బ్రాహ్మణుడే ఆహంస. పూర్వజన్మమందు గీత 10-వ అధ్యాయమును వినిన ప్రభావముచేతనే యీతనికి ఏకాదశియందు నా సమీపమున మృత్యువు కలిగినది. ఇపుడీతడు స్వర్గమును గూర్చి పోగలడు.

ఓం.

# జీవన్ముక్తుని మిత్రుడెవడు? బంధువులెవరు?

(శ్రీ యోగవాసిష్ఠమునుండి)

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ప్రబుద్ధః సుప్తః సుప్తోపి ప్రబుద్ధోరమ తేఽనిశమ్
సుషుప్తోభూత్తతో జాగ్రత్స్వప్నార్థ సుహృదాసహ.

వసిష్ఠుడు:—జాగ్రత్సుషుప్తులందు జ్ఞాని యితరులవలనే ప్రవర్తి
చినను అయా జాగ్రత్స్వప్నపదార్థానుభవమందు తనకు సహాయు
డగు (ఈచెప్పబోవు) మిత్రునితో కూడియున్నవాడై చిరకాలము సు
ముగ వ్యవహరించును.

జన్మాంతరైక సహవాస సమాశయేన
చిత్తానువృత్తి మధురేణ చిరంతనేన
మిత్రేణసార్ధ మఖిలాని దినానినీత్వా
విశ్రాంతిమేష్యతి పదే పరమే చిరం సః.

అనేకజన్మలందు తనకు సహవాసియై యొప్పినవాడును, జ్ఞా
దశయందు తన విషమత్వముఁ ద్యజించి యేకాభిప్రాయముగల్గి వర్తి
చువాడును, శమదమవైరాగ్యాది యుక్తుడై మిక్కిలి స్నేహభావంబు
బలుగుచునుండువాడునగు మిత్రునితోడ ప్రారబ్ధపర్యంతమును గడ
తదనంతరము జ్ఞాని పరమానందస్వరూపమగు విదేహకైవల్యము
పొందును. అనగా, ముక్తిని బడయును.

శ్రీ రామ ఉవాచ:—

బ్రహ్మన్ కోఽస్య సుహృద్ బ్రూహి యేనాసౌ రమతే సహ
రమణం కింస్వభావం స్యాదుతరత్యాత్మ వాస్యతత్.

శ్రీరాముడు:—ఓమునీంద్రా! జీవన్ముక్తుని మిత్రుడెవడు? వా
నితో క్రీడించుటయనగా, స్వస్వరూపమందు (ఆత్మయందు) స్థితిగల్గి
యుండుటయా, లేక మనోహరములైన భోగ్యవస్తువులందు ప్రీతిగల్గి
యుండుటయా! తెలియజేయుము?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

స్వప్రవాహే హితంనామ స్వప్రాయే హితనామచ
స్వకర్మనామచాస్త్యాస్తే మిత్రమేకమకృతిమమ్.

శ్రీవసిష్ఠుడు:-ఓరామచంద్రా! స్వకులమున పరంపరగా వచ్చు చుండునట్టి కర్మ, లోకసంగ్రహార్థము నొనర్చు శాస్త్రీయ-కర్మ, స్వప్రయత్నముచే గావించు సచ్ఛాస్త్రాభ్యాస, విచార, శమ, దమ, తితీక్ష, ఉపరతి, శౌచ, సంతోష, ఈశ్వరప్రణిధాన సంయమాదులను స్వకర్మ, ఈమూడును ఉపాధిభేదముచే భిన్నములుగానున్నను నొకటియే. ఇట్టికర్మయే జీవన్ముక్తుని ఉత్తమమిత్రుడని యెఱుంగుము.

పితృవద్విహితాశ్వాసం దారాఇవనియంత్రణమ్
సంకటేషు దురంతేషు నిత్యమవ్యభిచారిచ.

సచ్ఛాస్త్రాభ్యాసాదులను యీకర్మ, తండ్రివలె వానిని సంరక్షించును; కుకర్మ ప్రవృత్తినుండి భార్యవలె నివారింపజేయును. గొప్ప యాపదలందు నిరంతరము తోడుగానుండును.

అశంకితోపచరణం సుసంపాదిత నిర్వృతి
కోపేష్వకోపనతయా వితీర్ణావర్జనామృతమ్.

జీవన్ముక్తుని యీమిత్రుడు సంశయముల దొలగించి కార్యప్రవృత్తి గల్గజేయువాడును, ఉత్తమరీతి శాంతిని ప్రసాదించువాడును, క్రోధాదులు గల్గినపుడు శాంతపరచువాడును, మనస్సమాధానమను అమృతమును ప్రసాదించువాడును నగును.

దుర్గ దుర్గమ దుర్వార దోషోద్ధరణ తత్పరమ్
సర్వవిశ్వాస రత్నానాం కోశఆశైశవోషితమ్.

జీవన్ముక్తుని యీ సత్కర్మయను మిత్రుడు, తీవ్రకలహములు సంప్రాప్తించినపుడు వాటినుండి సత్వరము యుద్ధరించును. విశ్వాసములను రత్నములన్నింటికిని యతడు నిలయము అనేకజన్మలయందు అభ్యసింపబడినందున బాల్యకాలము నుండియే సత్కర్మల ననుగమించుచుండును.

సహపాంసు కృతాక్రీడ మాబాల్యాదేవ సంగమమ్
వినివారిత దుశ్చేష్టం పితృవద్రక్షణోన్ముఖమ్.

జీవన్ముక్తుని మిత్రుడగు యీసత్కర్మ బాల్యకాలమునుండి క్రీడాదులందును వానికి సహచారియై యెప్పుచుండును. దుష్కర్మల నివారింపజేయును. మఱియు తండ్రివలె వానిని సదా సంరక్షించుచుండును.

వహ్నేరివౌష్ణ్యం సౌగంధ్యం కుసుమస్యేవ సర్వదా
అవినాభావి విమలం రవేరివచ వాసరమ్.

అగ్నికి ఉష్ణత్వము వలెను, పుష్పమునకు సుగంధమువలెను సూర్యునకు నిర్మల ప్రకాశమువలెను, జీవన్ముక్తునకీ శాస్త్రీయ సర్వదా సహచారియై యొప్పుచుండు.

లాలనైకరతం నిత్యం పాలనైక పరాయణమ్.
సర్వసంకట సంఘట్ట రక్షణైక సముద్యతమ్.

మఱియు నామిత్రుడు వానిని సదా లాలించుచు, సమస్తాపదలనుండి రక్షించుచునుండును.

హేమ్నోగ్నిరివ దేహస్య సర్వావస్థస్య శుద్ధిదమ్
ఇదం హేయముపాదేయమితి దర్శనతత్పరమ్.

సువర్ణమునగ్ని శుద్ధపరచునట్లు ఆయ్యాది సర్వావస్థలందును వా దేహమును శుద్ధముగ నొనర్చుచుండును. గ్రాహ్యాత్యాజ్య విషయము గూర్చిన వివేకమును సదా వానికి గల్గించుచుండును.

ఆహ్లాదకమనింద్యాభిః కథాభిరివనాగరమ్
సచ్ఛేష్టా మణి మాణిక్య భాండం సంభారమందిరమ్.

మఱియు సత్పురుషులవలెనది పవిత్రచారిత్ర్యములచే నాహ్లా మును గొల్పును. మనోవాక్కాయములచే నొనర్పబడు శుభకర్మల మణి మాణిక్యాదులకది నిలయమగును.

సూర్యస్తమ ఇవాజస్రమప్రదర్శ్యదప్రియమ్
అనురక్తామహేలేవ ప్రియమేవ ప్రదర్శయత్.

అంధకారమును సూర్యుడు తొలగించునటుల, అప్రియము పదార్థములనది దృగ్పథమునుండి తొలగించివేయును. మరియు అ రాగిణియగు స్త్రీవోలె ప్రియవస్తువుల బ్రదర్శింపజేయుచుండును.

జనంప్రియంవదం కుర్వన్ప్రియమేవసమాచరత్
పేశలం మధురం స్నిగ్ధమక్షుబ్ధ ముదితాశయమ్.

ఈ సత్కర్మయను మిత్రుడు, పవిత్రాచరణ గల్గియుండునట్లు చేయుచు, మనుజుని శాంతముగను, క్రోధాదిరహితముగను, అప్రమత్తునిగను, ప్రియవాదిగను నొనర్చును.

లోకోపచారకం పూజ్యం స్మితపూర్వాభిభాషణమ్
కామోపశాంతం సద్రూపం పరమార్థైక కారణమ్.

ఆత్మజ్ఞుని మిత్రుడగు యీ సత్కర్మ, సత్పురుషుల సేవకుడును, పూజ్యుడును, స్మితభాషియు, వర్జితకాముడును, సత్యస్వరూపుడును, మోక్షపరాయణుడునునై విలసిల్లును.

రణేఽజ్ఞాన సముద్భూతే పూర్వం ప్రహరణోద్యతమ్
అపూర్వ నర్మ నిర్మాణ లీలాలలన లాలకమ్.

జీవన్ముక్తుని మిత్రుడగు యీసత్కర్మ, అజ్ఞానముతో నొనర్పబడు యుద్ధమందు ప్రథమముననే శత్రువుపై ప్రహారమునసల్పువాడును, అపూర్వ క్రీడాదులచే విలాసమును గొల్పువాడనునగును.

పాలకం శీలసారాణాం దారాణాంచ కులస్యచ
ఆధివ్యాధి పరీతస్య చేతసోఽమృతమౌషధమ్.

ఈ సత్కర్మ ఉత్తమగుణములను, శీలవంతులగు స్త్రీలను, (కులమును) సంరక్షించును. చిన్తాగ్రస్తమగు మనస్సునకును, రోగపీడితమగు దేహమునకును, అమృతమునంటి సంజీవనీ యౌషధమిదియే

అనురక్తాన్నృపాన్ సాధూన్వదాన్యాన్కారయత్సదా
యజ్ఞదాన తపస్తీర్థ న్యాయార్థప్రేరణోన్ముఖమ్.

ఇయ్యది రాజాదులఁగూడ తనయందనురక్తులుగఁజేయుచు వారలను సాధుస్వభావులుగను, సత్యశీలురుగను, దానపరాయణులుగను నొనర్చుచు, యజ్ఞదాన తపస్తీర్థ న్యాయాదులొనర్చుటకై సదా ప్రేరణ జేయుచునుండును.

భోగాదిబద్ధ తృష్ణత్వం దుఃఖదం వినివారయత్
సుస్నిగ్ధ సంకథోదారం సమాశ్వాసోత్తమాస్పదమ్.

మఱియు దుఃఖప్రదములగు భోగాదులందు తగుల్కొనియుండు వారల నుద్ధరించుచు, వారల తృష్ణను నివారించుచు, ఉదార చరితంబులను వ్యాపింపజేయుచు, ధైర్యమున కుత్తమస్థానమై యొప్పుచునుండును.

ఈదృశేనాత్మమిత్రేణ స కలత్రేణ సంయుతః
స్వకర్మనామ్నారమతే స్వభావేనైవ నేరితః.

ఆత్మజ్ఞాని స్త్రీ పుత్రాది సహితుడగు నిట్టి తన యుత్తమ మిత్రునితోఁ గలసి యున్నవాడై నిజస్వభావముతోఁ గూడి ఆత్మారాముడై విలసిల్లును.

శ్రీరామ ఉవాచ:—

కలత్రమస్యమిత్రస్య తదీయస్యమునీశ్వర
కింతత్కింరూపమేవస్యా త్సమాసేనైవమేవద.

శ్రీరాముడు:—ఓ మునీశ్వరా! ఆత్మజ్ఞుని మిత్రుడగు నీతని కుటుంబమెద్ది? వారెట్లుందురు? దయజేసి సంక్షేపముగ నానతీయుడు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

స్నానదానతపోధ్యాన నామానోస్యమహామతే
సంతిపుత్రామహాత్మానః స్వనురక్తాఖిలప్రజాః.

శ్రీవసిష్ఠుడు:—మహాత్ములును, జనులందఱను తమయందనురక్తులుగఁజేయువారునగు, స్నాన, దాన, తప, ధ్యానాదులనఁబడు పెక్కురు పుత్రులు వానికిఁ గలరు.

చంద్రలేఖేవ లోకస్య దృష్ట్యైవాహ్లాదదాయినీ
అవినాభావినీ భార్యా ముదితాస్యానురాగిణీ.

మఱియు నాతనికి చంద్రరేఖవలె దర్శనమాత్రమున నానందము గొల్పునదియు, నిరంతర సహగామినియు, మిక్కిలి యనురాగవతియునగు 'ముదిత'యను భార్యగలదు.

కరుణా కారణా కీర్ణ ధనాహృదయహారిణీ
అనందజననీచాస్య వయస్యాఽవ్యభిచారిణీ.

దీనులయెడ కరుణగల్గి ధనమును విరివిగ నొసంగునదియు, మనోహారిణియు, ఆనందము గొల్పునదియు, సహగామినియునగు 'కరుణ' యే యాతని సఖి.

సమతాస్య మతాసత్యా మాస్తేహృదయవల్లభా
ప్రతీహారీ పురః ప్రహ్వాసంముఖం సుఖదాయినీ.
ధైర్యేధర్మేచ ధీఃసాధో నిత్యమాధీయతేచ యా
సాస్యధీరస్యధుర్యస్య పురోధస్యస్య ధావతి.

'సమత'యను హృదయేశ్వరియే ఆతని రెండవ భార్య. నిరంతరము సమ్ముఖముననే యుండునదియు, సుఖప్రదాయినియు, ధైర్య ధర్మోపేతయునగు బుద్ధియే యాతని ద్వారపాలికయైయున్నది. బుద్ధియను ప్రతీహారి, మహాత్ముడును, ధీరుడును, ధర్మధురంధరుడునగు జ్ఞాని యెదుట నిత్యము పరువులిడుచునుండును.

అస్యసన్నాసమంస్కంధే సర్వదైవమహౌజసః
విషయారి జయేరాజ్ఞో మైత్రీమంత్రప్రదాయినీ.

గొప్ప తేజస్సంపన్నుడగు యీ రాజుయొక్క విషయరూపము లగు శత్రువులను నిర్జించుటయందు సహాయభూతమై వాని పార్శ్వముననే నిలబడి మంత్రణాది వ్యవహారముల సల్పునట్టి 'మైత్రి'యను మంత్రి వానికిగలదు.

కార్యాణా మార్యమర్యాదా చర్యాచాతుర్యశాలినీ
సర్వేషామస్య మాన్యస్య సత్యతాసార్థదాయినీ.

మర్యాదా పాలనమందును, ఉత్తమ కార్యములందును ఆచార్యునివలె యుపదేశించుచు, బుద్ధిచాతుర్యముచే శోభించుచు, తన సర్వస్వమొసంగి సహాయవంతమైయుండు సత్యత్వమే సర్వమాన్యుడగు అమ్మహాత్మునకు (జ్ఞానికి) ప్రభుర్యాలై వెలయుచుండును.

ఇత్యేవంపరివారేణ మిత్రేణ సహమంత్రిణా
స్వకర్మణా వ్యవహరన్నహృష్యతి న కుప్యతి.

ఇట్లు, పరివారసమేతుడైమంత్రియు, మిత్రుడునునగు స్వకర్మతో గూడ వ్యవహరించుచు జీవన్ముక్తుడు, యిష్టప్రాప్తిచే ప్రసన్నుడును, అనిష్టప్రాప్తిచే క్రుద్ధుడునుగాక, సమభావము గల్గి వర్తించుచుండును.

స యథా స్థితమేవాస్తే విసిర్వాణమనా మునిః
చిత్రార్పితఇవాజస్రం లోకే వ్యవహరన్నపి.

జీవన్ముక్తుఁడగు ముని సదా వ్యవహరించుచున్నను, చిత్రము
యోధునివలె అచంచలుఁడై నిర్వాణపదమగు ఆత్మయందే స్థితిగల్గి
స్వరూపమున సదా నెలకొనియుండును.

వస్తుశూన్యేషు వాదేషు మూకః శైలమయో యథా
నిష్ప్రయోజన శబ్దేషు పరం బాధిర్యమాగతః.

తత్త్వజ్ఞాన రహితములగు వాదములందు జీవన్ముక్తుడు ప్రస్త
పక పర్వతమువలె మౌనముగ నుండును. మఱియు నాతడు నిర
వచనములను వినక వాటియెడ చెవిటివాని చందమున వర్తించును.

లోకాచార విరుద్ధేషు శవం సకల కర్మసు
ఆర్యాచార విచారేషు వాసుకిర్వా బృహస్పతిః

లోకాచార విరుద్ధములగు సకల కర్మలందును, శవమువ
యేమియు ప్రవృత్తుడుగాక యుండును. కాని శిష్టాచార, విచార
లందు ఆదిశేషునివలెను, బృహస్పతివలెను అతికుశలుఁడై మెలగు

ప్రవృత్త వాక్పుణ్యకథో జిహ్మనాం ప్రతిభానవాన్
నిమేషేణైవ నిర్ణేతా వక్తాశు బహువస్తునః.

జీవన్ముక్తుడెల్లపుడును పవిత్ర వృత్తాంతములనే దెల్పుచుండు
స్వపరదోషములను లెస్సగ నెఱుంగును. ఎట్టి కఠిన విషయముల
గూడ క్షణములో నిర్ణీతమొనర్చివేయ గల్గును.

సమదృష్టి రుదారాత్మా వదాన్యః సంవిభాగవాన్
పేశలస్స్నిగ్ధమధురః సుందరః పుణ్యకీర్తనః.

ఆతడు సమదృష్టిగలవాడును, ఉదారచరితుడును, దానశీలు
నై యుండును. మఱియు భృత్యాదుల కొఱకు పదార్థముల విభజి
వారికి యుచితమగు భోజనాదుల సమకూర్చుచు, శాంతస్వభావ
గల్గి, మనోహరుడై, తనపుణ్యకీర్తిని నలుగడల వ్యాపింపజేయు
నుండును.

స్వభావ ఏష్వైవ భవేత్ ప్రబుద్ధ
ధియాం ప్రయత్నేన తు నేదృశాస్త్రే,
భవన్తి నేన్దుర్వర్క-హుతాశనాద్యాః
క్వచిత్పర ప్రేరణయా ప్రకాశాః.

ఈపైనదెల్పిన యుత్తమ గుణములన్నియు ఆత్మజ్ఞులకు సహజముగనే యుండును. వారట్లు గుణసంపన్నులై యుండుట అన్యుల ప్రేరణచేగాని, యత్నముచేగాని కాదు. చంద్రాగ్నిసూర్యాదు లితరుల ప్రేరణచే ప్రకాశశీలురై యుండుటలేదు కదా ! ప్రకాశనము వారల నైజస్వభావమే అయియున్నది.

---

# శ్రీ వివేకానంద లేఖావళి.

(అనువాదకులు — శ్రీ తత్త్వానంద స్వాములవారు)

{ షికాగో
2 నవంబరు 1893

ప్రియమైన:—

ఒక్క తృటి కాలము నాయందు తలసూపిన దౌర్బల్యము మూలముగా మీకింత కష్టము గల్పించినందుకు నాకును విచారముగ నున్నది. ఆ సమయమున నాకడ పైసాకూడ లేకుండెను. అప్పటినుండియు దైవము నాకడకు మిత్రులను బంపుచున్నాడు. హార్వార్డు విశ్వకళాశాలలో గ్రీకుభాషాపండితులగు డాక్టరు రైటుగారిని బోస్టనునగర సమీపమున నొక గ్రామమునందు పరిచయము చేసికొంటిని. ఆయన నాయెడ మిగుల సానుభూతి చూపి మహామత సమావేశమునకు నేను వెళ్లు నవసరమును గుఱించి నొక్కిచెప్పినాడు. తద్ద్వారా నాకు ఈ జాతివారల పరిచయము లభించునని ఆయన అభిప్రాయము. నాకెవరి పరిచయమును లేదుగావున ఈ పండితుడే నాకై యేర్పాటులన్నియు చేయ సమకట్టినాడు. తుదకు నేను షికాగోకు తిరిగివచ్చినాడను. ఇక్కడ మతమహాసభకొఱకు ప్రాచ్యపాశ్చాత్య దేశాలనుండి వచ్చిన ప్రతినిధులందఱితోపాటు నేనును ఒక పెద్దమనుష్యుని యింటిలో బస దిగియున్నాను.

మహామతసభ సమావేశమగునాటి యుదయమున 'కళాభవనము' అనునొక భవనమున అందఱము చేరినాము. ఇక్కడ మహా

సభాసమావేశములకుగాను పెద్దదొకటియు మఱికొన్ని చిన్నవియును
శాలలు తాత్కాలికముగ నిర్మాణము చేయబడియున్నవి. సక
జాతులవారినుండియు వచ్చిన పురుషులు ఇందున్నారు. భారతదేశ
నుండి, బ్రాహ్మసమాజమునకు చెందిన ముజూందారుగారు, బొం
యివారగు నాగర్కారుగారు, జైనుల ప్రతినిధియగు గాంధీగారు, అ
బిసాంటుగారితోఁగూడి దివ్యజ్ఞానసమాజ ప్రతినిధిగా చక్రవర్తి
రును వచ్చియున్నారు. గొప్ప ఊరేగింపు జరిగినది. మమ్మందఱ
వేదికపైన వరుసలుతీర్చి కూర్చుండబెట్టినారు. క్రిందనొక విశాల భ
నము, పైని సోపానపంక్తి చుట్టు నమర్చిన బల్లలనిండ క్రిక్కిరిసి
నులైయున్న ఆదేశపు పరిజ్ఞానమునకు ప్రతినిధులగు స్త్రీ పురుషులు
వేదికపై చేరియున్న భూమండలమునగల సకలజాతులకు చెందిన పండి
బృందమును నీ మనోనేత్రములతో చూడుము! జన్మలో ఎన్నడు
సభలలో నోరెత్తి ప్రసంగించి ఎఱుగని నేను ఈ విద్వత్సభాముఖము
నుపన్యసించుటయా !! మహావైభవముగా సంగీతములతోడను ఉ
మర్యాదలతోడను, ఉపన్యాసములతోడను సభ ప్రారంభమైన
అంతట ప్రతినిధులను ఒకరొకరినే పరిచయముచేయుచుండ, వారు లే
ప్రసంగించుచుండిరి. ఇక చెప్పనేల ? నా గుండె కొట్టుకొనసాగిన
నాలుక ఎండిపోయినట్లైనది. సభాకంపము నన్నావహించినది. ఉదద
పు పూట మాటాడసాహసింపలేనైతిని. ముజూందారుగారు చక్క
యుపన్యాసము గావించిరి. చక్రవర్తిగారు అంతకన్న మంచి ప్రసం
ము చేసినారు. వారిని మిగుల మెచ్చుకొనిరి. వారందఱును ఆయ
పడి సంసిద్ధముచేసికొనియున్న యుపన్యాసములతో వచ్చిరి నే
పిచ్చివాడను, ఏమియు సిద్ధముచేసికొనలేదు. అయినను సరస్వతీదే
ప్రొక్కులిడి ముందుకు పోతిని. డాక్టరు బారోజుగారు నన్ను స
కు పరిచయము చేసిరి. నేనొక చిన్న ఉపన్యాసము చేసినాడను. అ
రికా వాసులగు సోదరీసోదరులారా ! అని సభ్యులంగూర్చి సంబోధిం
తిని. ఇక చూడుడు, చెవులు గింగురు మనునటుల రెండు నిమిషా
షాటు చప్పటులు చెలరేగినవి ! పిమ్మట నా ప్రసంగము సాగించితి

ముగించునప్పటికి సంభ్రమముతో నలసటచెందినవాడనై చతికిలబడి తిని. ఆ మరుసటినాడు వార్తాపత్రికలన్నియు నాటి ప్రసంగములలో నాయది ప్రముఖమైనదని ప్రకటించినవి. దానంజేసి అమెరికాలో నెల్లడల విఖ్యాతుడనై పోతిని. సుప్రసిద్ధ భాష్యకర్త శ్రీధరుడు వచించినది సత్యము. 'మూకం కరోతి వాచాలం' -- మూగవానిని మహావక్తంజేయుననుట నిజము. ఆ దేవదేవుని నామమునకు ధన్యవాదములు ! ఆనాటినుండియు నేను కీర్తిధరుడనై పోతిని. నేను హిందూమతమును గుఱించి, నా వ్యాసమును చదివిన దినమున ఎన్నడెఱుంగని రీతిని సభాభవనమంతయు క్రిక్కిరిసిపోయినది. వార్తాపత్రికలలో నొకదానియందలి ప్రకటనను నీకుదెల్పెదను. "నారీమణులు, నారీమణులు, ఎచ్చోజూచినను నారీమణులు క్రిక్కిరిసిపోయిరి! మూలమూలలందును నిండియుండిరి. వివేకానందునితో ఎడబాటుగూర్చిన వ్యాసములన్నియు పఠింపబడుచుండ వారెంతయు నోపికతో ఎంతకాలమో వేచియుండిరి." వార్తాపత్రికలనుండి ఇట్టికత్తిరింపులను నీకు పంపునెడల నీవచ్చెఱువందుదువు సుమీ! కాని ప్రఖ్యాతియన నేనసహ్యాపడువాడనని నీకు తెలిసియేయున్నది. నేను ఉపన్యాసపీఠము నెక్కినపుడెల్ల నన్నుగూర్చి చెవులు గింగిరుమనునటుల చప్పటులు చఱచుచుందురని వ్రాసిన చాలును. దాదాపుగ పత్రికలన్నియు నాకభివాదముల నర్పించినవి. మిక్కిలి దురభిమానపూరితములైన పత్రికలు స్వయితము "సుందర ముఖారవిందముతోడను, ఆకర్షవంతమహా వైఖరితోడను అద్భుతమగు వక్తృత్వముతోడను ఈ పురుషుడు ఆ మహాసభలో అత్యంతప్రముఖుడై యొప్పెను" అని యొప్పుకొనవలసి వచ్చినది.

నాకిపుడు లేమియనునది లేదు. నాకీనగరమందలి మహావిభవవంతములగు గృహములకు ప్రవేశమబ్బినది. సదా నేనెవరికో యొకరికి అతిథిగానుంటున్నాను. మఱెక్కడను నీవుగాంచలేని విచిత్రమొకటి ఈ జాతివారలందు గోచరించుచున్నది. వీరికి సర్వమును తెలిసికొనవాంఛగలదు. వీరి స్త్రీజనమో ప్రపంచములోని కెల్లబుద్ధిశాలినులు. సర్వసామాన్యపు అమెరికాస్త్రీ సర్వసామాన్యపు అమెరికాపురుషుని కన్న నెక్కుడు పరిజ్ఞాత్రియైయున్నది. పురుషులు డబ్బుకొఱకు తమ

జీవితములనెల్ల దాస్యముగ గడపుచుండ, స్త్రీలు తమ పురోన్నతి
సంపాదించుకొనుటకై ప్రతి అవకాశమును వినియోగించు కొను
చున్నారు. వీరు చాల కారుణ్యహృదయులు, నిష్కపటచిత్తులు.
వెఱ్ఱి సిద్ధాంతము ప్రచారము చేయదలచువారైనను ఇక్కడకు రా
చ్చును. వీరిలో చాలమంది చపలచిత్తులని తెలుపుటకు చింతిలు
న్నాను. అమెరికనులందును లోపములున్నవి. మఱి యేజాతియం
లేవు? కాని నేను సంగ్రహముగ చెప్పునదిది - ఆసియాఖండము నా
కతాబీజముల నాటినది. యూరపుఖండము పురుషుని ఉన్నతికి దెచ్చిన
అమెరికాఖండము స్త్రీని, జనసామాన్యమును ఉద్ధరించినది. ఈ ఖం
ము స్త్రీజనమునకును, పారిశ్రామికులకును స్వర్గతలము. ఇక అమెరి
స్త్రీలను పారిశ్రమిక జనులను మనవారితో పోల్చిచూడుము. వెంట
నీకు విషయము విశదమై పోగలదు. అమెరికావారు వేవేగమ ఉదా
శీలురగుచున్నారు. భారతదేశమున నీకు కాన్పించు కఱడుబారిపోయి
కైస్తవులను మచ్చుకాగొని, ఇచ్చటివారిని గుఱించి నీ అభిప్రా
మును నిర్ణయించుకొనకుము. అట్టివారిచ్చటను గలరు. కాని వారిసం
త్వరితగతిని తఱిగిపోవుచున్నది. హిందువులకు ప్రమాణమై పఱ
అధ్యాత్మము దిక్కునకు ఈ మహాజాతి చెచ్చెఱ సాగివచ్చుచున్నది.

హిందువు తన మతమును విడనాడకూడదు. కాని ఆ మతము
హద్దులలోనుంచి సంఘము అభివృద్ధియగుటకు తగిన స్వేచ్ఛ సం
రింపవలసియున్నది. హిందూదేశమున సంస్కర్తలందఱును పురో
తుల భ్రష్టత్వమునకును వారి ఘోరకృత్యములకును బాధ్యతనంతే
మతముపైని బడవేయుటయనెడు పొరబాటునే చేసియున్నారు. మ
యు వారీ దుర్భేద్యమగు నిర్మాణమునే విధ్వంసముచేయ నుంకించి
కాని ఫలితార్థమేమైనిది? అపజయమే! బుద్ధదేవుడు మొదలుకొ
రామమోహనరాయల వఱకును ప్రతి సంస్కర్తయు కులభేదమను
మతసంస్థయని పొరబడి, మతమును కులవ్యవస్థను కలిపి అణగద్రొ
వేయ ప్రయత్నములు సాగించినారు; విఫలులైనారు. పురోహితుల
లాపము లెటులున్నను, కులమనునది శిలీభూతమైపోయిన యొక సాం
సంస్థ. ఇది చేయవలసిన ఉపకృతియేమో చేసివేసినది. ఇప్పుడో భా

వాతావరణము దాని దుర్గంధముతో నిండిపోవుచున్నది. ప్రజలు ఎన్నడో పోనాడుకొనియున్న సాంఘికవ్యక్తిత్వమును తిరిగి వారి కొసగుట వలన మాత్రమే దీనిని నివారింప వీలగును. ఇక్కడ జననముగాంచు ప్రతిపురుషుడును తాను పురుషుడనని గుర్తెఱుంగును. హిందూదేశమున జనించు ప్రతి పురుషుడును సంఘమునకు తానొక బానిసనని భావించును. స్వాతంత్ర్యమొక్కటే అభివృద్ధికి అత్యవసరమగు నియమము. ఆ స్వాతంత్ర్యమును తొలగించితివా, భ్రష్టత్వమే ఫలము. ఈ కాలపు స్పర్థ రాగనే కులవ్యవస్థ ఎట్లు చరచర అదృశ్యమై పోవుచుండెనో గమనింపుడు. మతమే వచ్చి దానిని నాశము చేయునవసరము లేదు. ఉత్తర హిందూదేశములో వెచ్చములమ్ము బ్రాహ్మణుడు, చెప్పులవ్యాపారము చేయు బ్రాహ్మణుడు, సారాయములు చేయు బ్రాహ్మణుడు ఎల్లడల సర్వసాధారణమేగదా— ఎందువలన? పోటీవలననే! ప్రస్తుతమున్న ప్రభుత్వముక్రింద తన జీవనముకొఱకు ఎవని యిష్టమువచ్చిన పనిని వాడు చేయుటకు అడ్డము లేదు. తత్ఫలముగా నొకని నెత్తిమీద నొక డెక్కునటుల పోటీలు ఏర్పడినవి. అందువలన వేలకొలది జనులు దీనులై అడుగున పడియుండుటకంటె, తామెంత యున్నతి సాధించుటకై జన్మమెత్తినామనుకొనుచున్నారో, ఆ అగ్రస్థానమునకు ఎగబ్రాకు నిమిత్తము ప్రయత్నముల సాగించుచున్నారు.

ఈ శీతకాలమంతయునైన నేను ఈ దేశమున నుండవలయును. పిమ్మట యూరపునకు బోదును. ఈశ్వరుడే నాకు కావలయుదానినెల్ల సమకూర్పగలడు. అందునుగుఱించి నీవు శ్రమపడ నవసరము లేదు. నీవు జూపు ప్రేమంగుఱించి నాకృతజ్ఞతను మాటలతో తెలుపజాలను.

ఆ దినమున కాదినము భగవంతుడు నాకు తోడై నిలుచుచుండెనను అనుభూతి కలుగుచున్నది. నేను ఆ భగవంతుడు చూపు త్రోవనే నడవ యత్నించెదను. ఈశ్వరేచ్ఛయే నెరవేఱుగాక!— ఈ లోకములో మనము ఘనకార్యముల జేయనున్నారము. అటుల చేయుట లోకకల్యాణము కొఱకేగాని మన పేరుప్రఖ్యాతుల కొఱకుగాదు.

"తే. గీ. మరణమైనను, నియతకర్మమును దీక్ష
నాచరించుటె మహ విధి; యట్లుగాన

ఇట్టి పాటేలయని సంశయించుటాత్మ
ధర్మరతులకు సుంతేని దగదు తగదు."

ఉత్సాహపూరితులై యుండుడు. మహాత్కార్యములుచేయు
అకై భగవంతుడు మనను నియమించుకొనెనని విశ్వసింపుడు. మన
వానిని నిర్వహింపనున్నారము. మీరు సిద్ధముగా నుండవలెను. అస
నిర్మలురును పవిత్రులునై నిష్కామభక్తితో నిండియుండుడు. బీదల
దుఃఖితులను, అధఃపతితులను ప్రేమంజూడుడు. భగవంతుడు మిమ్మ
శీర్వదించుగాక !

రానిమఱి ఇతరులను అప్పుడప్పుడు చూచుచుండుము. భార
శపు ప్రజాసామాన్యమును ఆదరించుడని హెచ్చరించుచుండుము.
రెటుల బీదవారి మెడలమీద నెక్కి త్రొక్కుచుండిరో వారికి తెలుపు
మఱియు బీదల నుద్ధరించుటకు ప్రయత్నింప రేని తాము మానవులు
చుకొనుటకు అర్హులు కారని చెప్పుము. భయము చెందకుము. భగవం
డు నీకు తోడై యున్నాడు భారతదేశములో లక్షలాదిగా తిండిలేక
డుచున్న వారిని, అజ్ఞానమున నణగియున్న వారిని భగవంతుడు ఉద్ధ
నున్నాడు. యువకులగు మీలో ననేకుల కన్నను, మీ రాజపుత్రుల
ననేకులకంటెను, ఇచ్చటి రైల్వేకూలివానికి ఎక్కువ చదువువచ్చు
భారతస్త్రీలలో అధికసంఖ్యాకులు నేర్వగలదానికంటె ప్రతిఅమె
వనితయు అధికమగు విద్య నేర్చినదిగ నుండును. ఇట్టివిద్య మన
నేలలభించదు ? మనమును సాధించి తీరవలయును. నీవు పేదవని
పోయకుము. సంపదయన సొమ్ముకాదు. యోగ్యతయు, పవిత్రతయు
సంపద. ప్రపంచమందెల్లెడల నేమి జరుగుచుండెనో వచ్చిచూడుము

ఇట్లు.
వివేకానంద.

——:o:——

(భ గ వ ద్గీ త)

# 8. అ క్షర పర బ్రహ్మ యోగము.

(శ్రీ మలయాళ స్వాములవారు).

నాశరహితమగు పరబ్రహ్మమును పొందింప జేయునదగుటచే దీనికి అక్షరపరబ్రహ్మ యోగమను నామధేయముగల్గెను. నిత్యమగు బ్రహ్మములో జీవుని నైక్యపఱచునదని గూడ దీనిని గ్రహించవలెను. దీనియందెనిమిది ప్రశ్నలు మొదటగలవు. (1) బ్రహ్మమనగానేమి? (2) అధ్యాత్మమనగా నేమి? (3) కర్మయనగానెట్టిది? (4) అదిభూత మెటువంటిది? (5) అధిదైవమననేమి ? (6) ఈ దేహమందు అధియజ్ఞుడెవడు (7) ఆతడెట్టి స్వభావము గలవాడు? (8) ఆత్మధ్యాననిష్ఠగల వారు ప్రాణప్రయాణ సమయమున నెట్లు ధ్యానించిన నిన్ను (భగవంతుని) పొందగలరు ? — అను నీ యెనిమిది ప్రశ్నలను అర్జునుడు చేసియున్నాడు. వీనిలో యేడింటికిని ఒక్కొక్క వాక్యముతో సమాధానము చెప్పి యెనిమిదవ ప్రశ్నయగు అంత్యకాల స్థితినిగూర్చి విస్తారముగ సమాధానమిచ్చియున్నారు. అదేగదా ముఖ్యమైనది. అందఱున్ను చేయు సమస్తకార్యములును అంత్యకాలమున యుత్తమ గతి గలుగుటకే గదా! కాన ఈ విషయమై భక్తులున్ను, జ్ఞానులున్ను, యోగులున్ను, వెయ్యేల అందఱున్ను ముఖ్యముగా తెలిసికొనఁదగినదే. ప్రాణప్రయాణ సమయమున ప్రణవము నుచ్చరించి పరమాత్మను ధ్యానించి, దేహమును విడచువాడు అక్షర పరబ్రహ్మమును పొందునని శ్రీ కృష్ణ భగవానులుపదేశించిరి. అయితే ప్రణవమును ధ్యానించుట కెవరర్హులు, ఎవరు అర్హులుకారని దీనియందేమియు చెప్పియుండలేదు. కాని ప్రణవధ్యానమునకు యోగ్యతమాత్ర ముపదేశించియున్నారు. అదేమన, అన్ని యింద్రియములను స్వాధీనమందుంచుకొని మనస్సును భగవంతునియందు నిలిపి ఓంకారము నుచ్చరించి, దేహమును విడుచువాడు, గుఱిని లక్ష్యముంచి విడువబడిన బాణమేళా

గున లక్ష్యమున జొరబడునో, ఆలాగున అట్టి ధ్యానము గలవా
బ్రహ్మమును పొందుదురని భగవదుపదేశము. ఈ ఓంకార ధ్యాన
జేయుటకు ఫలాని జాతివారు, లేక ఫలాని కులమువారు, లేక ఫలా
దేశమువారు లేక ఫలాని ఆశ్రమములోనుండువారు, లేక స్త్రీలు లే
పురుషులు అను భేదమేమియు జెప్పక అంత్యకాలమున ముక్తిని గో
వారు పై జెప్పేలాగున యుండిన మోక్షము పొందవచ్చునని మా
మే శ్రీ కృష్ణభగవానులు ఉపదేశించియున్నారు. ప్రణవమును ధ్యా
నించుటకేదైన వర్ణాశ్రమ భేదముండినచో, యిచ్చోట భగవంతు
చెప్పకపోవునా ? కావున మనకు భగవద్వాక్యము ప్రమాణమా
లేక భగవత్ప్రీతికి ఆటంకము గలుగజేయు మానవుల స్వయంకల్పి
వాక్యము ముఖ్యమా యని విజ్ఞులందఱు ఆలోచించుకొనవలెను. ఇ
వఱకు భగవద్గీత కూడ అందఱును చదువరాదని చెప్పెడి వారుండి
దైవకృపవలన అట్టిపాపకాలము కాలగర్భములో కలసిపోయినందు
ఆ విషయమై యిపుడేమియు చెప్పఁబనిలేదు. ఇక్కాలపుణ్యముచే భ
వద్గీత అందఱున్ను చదువవచ్చునని, లోపల యిష్టములేక పోయిన
చెప్పవలసిన కాలమాసన్నమైనందుచే అంగీకరించియున్నారు. కాని ప్ర
వమును మాత్రముచ్చరింపగూడదట! దీనివలన వీరు గీతచదువువారేగా
దానియందు చెప్పినట్లు ఆచరించువారు కారని స్పష్టముగా తెలియు
గును. వారాచరించువారైన, యితరులతోను ఆలాగున నాచరించ
లెనని యేల చెప్పరు? ఎప్పుడు శాస్త్రములను మాత్రము చదివి దా
లో చెప్పేలాగున ఆచరణ లేకపోయినదో, అప్పుడే భారతదేశ
హీనస్థితికి వచ్చినది. చెప్పేలాగున ఆచరించేవారు యేర్పడిన మా
ము, దేనియందేఫలము చెప్పబడి యున్నదో అయ్యది ఫలించును. గీ
మాత్రము చదువవచ్చుగాని దానిలో చెప్పినట్లాచరించకూడదని చెప్పే
వాక్యమున కేదైన విలువగలదా? దానికన్న గీతచదువగూడదని చెప్పే
నే బాగుండును. దీనికి మించిన అంధవిశ్వాసము లోకములోగలదా
ఇట్టి మూఢస్వభావము యిక్కాలమునగూడ యెచ్చటయో మూలదా
యున్నదని వినుటచే ఆశ్చర్యమొందని వారుందురా? వారి యీమాటల
యేదైన సత్తువగలదా? ఇది, మీరు గోవును సంరక్షింపవచ్చును, పాలు

పెరుగు ఉపయోగించ వలదు; లేక మీరు మంచి ఫలవృక్షములను పెట్టి పోషింపవచ్చును, కాని ఫలములను మాత్రము భుజింపగూడదు యనుటనంటిది. ఈవాక్యములం దెంతసత్యముగలదో, వారువచించుదాని లోను అంతే సత్యముగలదని జనులందరును దృఢముగా నమ్మవలెను. మఱియొకవిధముగగూడ చెప్పువారు గలరు. ఎట్లన, అంత్యకాలమున భగవద్ధ్యానము చేసిన చాలుగదా, ఇప్పటినుండి యేలచేయవలెనని వారి యభిప్రాయము. అంత్యకాలము యేసమయమున యెచ్చోట యెప్పుడు గలుగునో యెవ్వరైన చెప్పగలరా? ఏ నిమిషమో, యెచ్చోటయో చెప్పువారు అరుదు. కావున తలంచినపుడే అట్టి దైవకార్యములో ప్రయత్నించవలెను. సాగరములో అలలుశాంతించిన తరువాత స్నానమాచరింపఁదలంచిన, కాలమేలాగును వ్యర్థమైపోవునో, ఆలాగున సంసారసంబంధ సమస్త కార్యములు శాంతినొందిన తరువాత ఈశ్వర ప్రార్థన చేసుకొనవచ్చునని తలంచుటయు వ్యర్థమేయగును. సముద్రములోని అలలు యే కాలముననైనను శమనముబొందనట్లు సంసారములో గూడ కార్యములన్నియు పూర్తిఅయ్యెడు కాలముండదు. ఈఅధ్యాయమున యీశ్లోకముఖ్యము.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యఃప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ (8-13)

'పరబ్రహ్మవాచకమగు 'ఓం' అనెడి ఏకాక్షరమునుచ్చరించుచు ఓంకారస్వరూపుడగు పరబ్రహ్మమును (భగవానుని) ధ్యానించుచు యెవడు దేహమును విడుచునో యట్టివాడు సర్వోత్తమమగు ముక్తిపదమును బొందును.

ఓం తత్ సత్

---

# శ్రీ బుద్ధోపదేశము.

( బౌద్ధ మధ్యమనికాయమునుండి )

శ్రావస్తినగరమున పూర్వారామమను ప్రాసాదమున శ్రీ దేవుడు, సారిపుత్రుడు, మౌద్గలాయనుడు, కాశ్యపుడు, అనురుద్ధుడు ఆనందుడు మున్నగు పలువురు విజ్ఞులగు భిక్షువులతో గూడ విడసియుండెను. అత్తఱి యొక దినమున పున్నమరాత్రియందు యొక విశాలమైదానమున గూర్చుండి భిక్షుసంఘమంతకును శ్రీ బుద్ధభగవానుడిట్లుపదేశించెను. ఓ భిక్షువులారా! ఈ మన భిక్షుసంఘము పరిశుద్ధులు, ధర్మమార్గానురక్తులు, ప్రశాంతచిత్తులు, ప్రలాపరహితులునగు భిక్షువులతో గూడియొప్పుచున్నది. ఇట్టియుత్తమ సంఘమే అతిథిసత్కారయోగ్యము దానయోగ్యమును, నమస్కారయోగ్యమును నగును. ప్రపంచము పుణ్యమును వ్యాపింపజేయునట్టి సంఘమిది. ఇట్టి భిక్షుసముదాయమున కొసంగబడు స్వల్పదానమైనను అధికఫలమును గలుగచేయును ఇట్టి పవిత్ర భిక్షుసంఘము యొక్క దర్శనము జనులకు దుర్లభమైనది ఈ భిక్షుసంఘమునందు, ధర్మమునందు ప్రతిష్ఠులును, కృతకృత్యులును, సంసారభార విముక్తులును, నిర్వాణపదప్రాప్తినొందినవారును బంధరహితులును, సమ్యక్-జ్ఞాన సంపన్నులును, క్షీణదోషులును అర్హతులు (జీవన్ముక్తులు) గలరు. ఐదు బంధనములు నశించుటచే దేవలోకమున జనించి యటనుండి నిర్వాణపదమును ప్రాప్తినొంది మఱల యీలోకమునకు రాకయుండు అనాగాములున్న యిందుగలరు. మూడుబంధనములు మాత్రము నశించుటచే రాగద్వేషములు సన్నగిల్లినట్టి సకృదాగాములగు భిక్షువులును యీ సంఘమునగలరు వీరింకొక పర్యాయమీ లోకమున జన్మించి దుఃఖము నంతమొందింపుచుకొందురు. ధర్మమార్గమున నిశ్చితరూపమున ప్రవేశించి న్యాయమనుష్ఠాన మొనర్చుచున్న స్రోతాపన్నులును యిటగలరు. ఈ సంఘమునందలివారు ఆర్యఅష్టాంగికమార్గము, స్మృతిప్రస్థానములు మున్న

ధర్మముల నవలంబించుచు, మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షాభావములు గల్గి ప్రాణాయామమును శీలించువారై యున్నారు.

ఓభిక్షువులారా! ప్రాణాయామాభ్యాసము మహాఫలప్రదమైన దని యెఱుంగుడు ఇది ధర్మాచరణను పూర్ణమొనర్చుచు విముక్తి కుపక రించునదగును. అరణ్యమునగాని, వృక్షచ్ఛాయయందుగాని లేక మఱి యేదైన ఏకాంత పరిదేశమునగాని ఆసనము వైచికొనికూర్చుండి, శరీర మును తిన్నగా నిలిపి, స్మృతి, ప్రజ్ఞాయుతుడై, శ్వాసను పీల్చవలెను. శ్వాసలయొక్క గమనాగమనముల వీక్షింపవలెను. శరీరస్థితియంత యు యనభూతమొనర్చుకొనుచు శ్వాసనుగైకొనవలెను. మఱియు తన యందలి దుస్సంస్కారములన్నియు నశించుచున్నట్లు భావనచేయుచుం డవలెను. ఇవ్విధమున అభ్యాసముచే సంస్కారములన్నియు నిరోధించి శరీరమంతయు సుఖమయమై, ఆనందమయమై చెన్నొందుచున్నట్లు భా వనచేయుచు ప్రాణాయామమును శీలించవలెను. చిత్తమును న్యేకాగ్ర మొనర్చవలెను. చిత్తసంస్కారము లెట్లుదయించుచున్నవో గమనించు చుండవలెను. శ్వాసలగైకొనునపుడు. జగత్తునందలి పదార్థములన్నియు అనిత్యములని భావించుచు వైరాగ్యభావనయు, ఇంద్రియ నిరోధ భావనయు, త్యాగభావనయు, గల్గియుండవలెను. ఇట్లభ్యసించినచో ప్రాణాయామము మిక్కిలిఫలప్రదమగును.

భిక్షువెపుడు వైరాగ్యముగల్గి స్మృతి, ప్రజ్ఞాయుతుడై యుండునో అపుడు ధర్మమునెఱుంగ జిజ్ఞాసగల్గి, యట్టి ధర్మమును గూర్చియే చింతనచేయును. మఱియు నిర్వాణప్రాప్తికై యత్నమొనర్చుచు విషయ సుఖమునకంటె పరమైన యుత్తమ సుఖమునసుభవింప కుతూహలము గల్గి చిత్తమును పరిశాంతముగజేసి, యేకాగ్రి మొనర్చి, సంబోధ్యంగము ల భావించుచు సమాధి నభ్యసించును. అట్టి ముముక్షువు ధర్మాచరణ, ప్రియత్నాతిశయము, ఆనందానుభవము, ప్రశాంతి, చిత్తైకాగ్రత, సమాధిభావన, ఉపేక్షాభావన మున్నగునవి గల్గియుండును. ఇట్ల భ్యాసముద్వారా యాతడు క్రమముగ బంధరహితుడై విముక్తినొం దును.

---

# శ్రీ మహాత్మాగాంధీగారి సుభాషితములు.

'సర్వశక్తి సంపన్నుడగు యే పరమాత్ముని పేర నేనీ ఉపవాస
మును ప్రారంభించితినో ఆ భగవంతుడే భారతదేశమునకును సంస్థా
ములకును సర్వాధికారియగు బ్రిటిషు ప్రభుత్వముయొక్క హృదయ
మును మార్చును.

'ఉపవాసమువలన పరమేశ్వరుని అనుగ్రహము, ఎదుటివా
హృదయము కరగించుట, ఆత్మశోధనయు కలుగును!

'గాంధిమహాత్ముడు ప్రపంచమునంతను మోయగలడుగా
ఒక్క అబద్ధమును మోయలేడు!

(7-3-39 తేదీన ఉపవాస దీక్షనుంచి విరమించిన పిమ్మ
గాంధీమహాత్ముడుచేసిన ప్రకటన—) 'కోట్లకొలది ప్రజలయొక్క
ప్రార్థనాబలము వలననే యీ శుభసమాప్తి కలిగినదని నా నమ్మకము
జనబాహుళ్య హృదయము నాకు తెలియును. అహోరాత్రములు
గంటల కాలమున్ను యీ ప్రజాసమూహమునందే నా మనస్సు ల
మైయుండును. వారిక్షేమమునుగూర్చి పరిపరిథమముగా ఆలోచి
చుందును. వారిక్షేమమును గూర్చియే కట్టకడపటివరకు నాలోచి
చుందును. ఎందువల్లననగా కోటానుకోట్లుగానున్న అసహాయు
మొరపెట్టుకోలేని ప్రజలహృదయములందే భగవంతుడున్నాడు.
భగవంతునినే సదా నేను ఉపాసించుచుందును. తమ హృదయము
భగవంతుడున్నాడని వారు గ్రహింపరుగాని నేను గ్రహించుచున్నా
సత్యస్వరూపుడగు భగవంతునే నేను ఆరాధించుచున్నాను. ఈ కో
కొలది ప్రజలకు సేవచేయుట ద్వారా సత్యస్వరూపుడగు ఆ భగ
తుని నేను సేవించుచున్నాను.'

'చుట్టు మంటలు మండుచున్నవి, కాని ఆమంటలో దుమ
వారే సుఖులనియు, మంటలను ఊరకచూచువారు ఆ మంట
దగ్ధము చేయబడుదురనియు తెలియుగునది.'

'ఆత్మత్యాగవహ్నియందు సీసము బంగారుగా మారునన
లో సందేహములేదు.'

ఉపవాసము, ముఖ్యముగ త్రికరణశుద్ధి లేనివారు సత్యాగ్రహమునకు అర్హులుకారు. ఎన్ని కష్టములు సంభవించినను చివరకు ప్రాణముకూడ అర్పించవలసిననుకూడ నిర్భయముగాను శాంతచిత్తులైయ్యుండవలెను. రేపు ఉపవాసము ప్రారంభించబోవుచు ఈ నాటిరాత్రి యెప్పటివలె చీకు చింత లేకుండ హాయిగా నిద్రించితిని. ప్రాయోపవేశము--చేయుమని యే మహాప్రభువు నాకుప్రేరణచేసెనో ఆ దయామయుఁడైన భగవంతుడే దానిని నేను కొనసాగించడానికి తగిన బలము కూడ నాకిచ్చును. నేనింకా ఈ ప్రపంచములో యుండి సర్వాంతర్యామియైన తనసేవ చేయడమే ఆ మహాప్రభువు సంకల్పమైనచో, ఎంత దీర్ఘకాలము నేను ప్రాయోపవేశము చేసినను నాకు మరణము తటస్థింపదు; నా శరీరంలో ప్రాణములు నిలచియేయుండును. ఇప్పుడునేను దీక్షపూనడం నాకు బొత్తిగా యిష్టములేదు. కాని భగవత్ప్రేరణ అప్రతిహత నిరసన దీక్ష గరళప్రయోగము వంటిది. రాజవైద్యుడు మతేమందు పనిచేయనప్పుడు మాత్రమే గరళము లోనికిచ్చును. మొదట యౌవనదశలోనే నేను శారీరక మానసిక పవిత్రత కొరకు నిరసన దీక్ష ను ప్రారంభించితిని. మఱొకప్పుడు నా కుమారుడు, నా దగ్గర మిత్రుడును అక్రమముగా ప్రవర్తించడము వల్ల నేను చాలాదినములు ఉపవాసము చేసితిని. దక్షిణాఫ్రికాలో భారతీయుల కొరకును, పూనాలో హరిజనుల కొరకును ఉపవాసదీక్ష నవలంబించితిని. ఎప్పుడును మంచి ఫలితములే కలిగినవి. కాని భగవదనుగ్రహము ఉంటేనేగాని నిరసన దీక్ష మంచిగా ఫలించదు. అట్లు భగవదనుగ్రహములేనిచో అది కఠినమైన లంఖనమే అగునుగాని పవిత్రమైన ఉపవాసము కాదు. నిరసన దీక్షను జరుపుచున్న కాలములో నా మనస్సు మిక్కిలి నిర్మలముగాను, ప్రశాంతముగాను, ఉల్లాసముగాను ఉండును. రాజుగారినిగూర్చి ఎవ్వరును పరుషంగా వ్రాయగూడదు, అప్పుడే నిరసనదీక్ష ఫలించును. సత్యాగ్రహమన్నను నిరసనదీక్షన్నను త్యాగమేగాని మఱియొకటి కాదు.

(18—3—39 తేది బిర్లాగారిచే కట్టించబడిన లక్ష్మీనారాయణ

దేవాలయమున్నూ బుద్ధ విహారమున్నూ ఢిల్లీలో తాను తెరచి ప్ర
చేసి అనంతరము గావించిన ఉపన్యాసము:—)

భగవన్మందిరములో ప్రజలందరు సమానులు. అగ్రవర్ణము,
త్యవర్ణము, ధనికులు, బీదలు అనే విభేదాలు వీటిలో యుండరాదు;
లుగు వర్ణాలున్న మాట నిజమే కాని అన్ని వర్ణాలవారు సమాన
ఆయావర్ణములవారు చేయుపనిని బట్టియే వర్ణములు యేర్పడి
భక్తి జ్ఞాన వైరాగ్యాదులగు పారమార్థిక ధనముగాని, ధన, క
వస్తువాహనాది ఐహిక సంపదగాని ఎవరికి చాల హెచ్చుగానుం
వారందరు మానవకోటికి సేవచేస్తూ యుండవలెను. ఎక్కువ విన
లుగా నుండవలెను. అహింసా సత్యములు హిందుమతమునకు స్థిర
నాదులు కాబట్టి హిందువులకు యితరమతములవారికిని యేవిధ
వివాదములుండరాదు. దేవాలయములకు వచ్చేవారందరు శరీర
మనశ్శుద్ధి కలిగియుండి నిర్మల ధ్యానముతోను నిశ్చల భక్తితో
భగవంతుని ఆరాధించుట ముఖ్యకర్తవ్యమైయున్నది. ఈ దేవాల
మునకు, ఈ విహారమునకు వచ్చువారందరు తద్విధముగా చే
లాగున అనుగ్రహించవలసినదని నేను భగవంతుని ప్రార్థి
చున్నాను!

'నేను సత్యాగ్రహిని. నేను పల్కెడు ప్రతివాక్యమును త్రి
శుద్ధిగ పల్కుచున్నాను. అహింస, సత్యము, ఈ రెంటియెడ నా
విశ్వాసము నానాటికి వృద్ధియగుచున్నది ఈవిశ్వాసము వృద్ధి
కొలది నా ఆత్మకూడ వికాసము పొందుచున్నది ఒక మహావృక
క్రమేణ పెరుగుచు మార్పు చెందుచున్నట్లే నేను మార్పుచెంద
న్నాను. నాతో మీరుకూడ ముందంజ వేయకోరెదను. నాపే
పట్టుకొని ప్రాకులాడవద్దు. సత్యము, అహింసయను ఈ రెండు
ధర్మసూత్రములను అన్వయింపచేసుకొనుచో నిర్భీతిగా ధర్మా
నిర్ణయము చేయుచుండవలెను. క్షణభంగురములైన తాత్కాలిక
కీయ తరంగములకంటె సత్యము, అహింస అనునవి శాశ్వత
ధర్మములై యున్నవి. ఆహింసాసత్యములు నాయందు సంపూర్ణముగ

శించియున్న యెడల మీతో నేను యీవిధముగ వాదింపవలసిన అగత్యము లేదు'

'ఆత్మదర్శనము కావలసినవానికి రామనామము, రామకృపయు అంతిమసాధనములు. నేను భారతదేశమునకు వచ్చిన తరువాతనే యీ విషయము ననుభవముచేసికొంటిని.'

'ఎపుడు దేనియెడల పూర్ణముగ వైరాగ్యము కలుగునో అపుడే శపథము పూనుట తనంతదానసివార్యమైపోవును.'

'సత్యశోధన సాధనము లెంత కఠినములో అంత సరళములునై యున్నవి. అహంత కలవానికేది దుశ్శక్యమనిపించునో, కల్లకపటమెఱుంగని వానికది సుశక్యమనిపించును. సత్యశోధకుడు తన్ను రజఃకణముకన్నను తక్కువవానిగా నెఱుంగనలయును. ప్రపంచమంతయు రజఃకణములను త్రొక్కుకొనుచు బోవుచుండును. అట్టి రజఃకణములచే గూడ త్రొక్కివేయబడునంత యల్పుడనని సత్యార్చకుడెంతవఱకు తన్నుదా తెలిసికొనజాలడో అంతవఱకును వానికి స్వతంత్రమగు సత్యముయొక్క ఆభాసమేనియు దుర్లభము. ఈ విషయము వసిష్ఠ విశ్వామిత్రుల యాఖ్యానమునందు పరిస్ఫుటమాయెను.

'మనస్సు మంచిదైనచో సంకటసమయమున సేవకులును సాధనములును తమంతట నచ్చిపడునని నాకనుభవపూర్వకమైన విశ్వాసము కలదు.'

—:o:—

ఓం

# శ్రీ నారద సనత్కుమార సంవాదము.

(శ్రీ ఛాందోగ్యోపనిషత్తునుండి)

(72-వ పుట శేషము.)

చాపశ్చ తేజశ్చ దేవాంశ్చ మనుష్యాంశ్చ పశూంశ్చ వయాంసి చ తృణవనస్పతీఞ్శ్వాపదాన్యాకీటపతఙ్గపిపీలికం ధర్మం చా ధర్మం చ సత్యంచానృతం చ సాధు చాసాధు చ హృదయజ్ఞం చాహృదయజ్ఞం

చాన్నంచ రసం చేమం చ లోకమముం చ విజ్ఞానేనైవ విజానాతి విజ్ఞా
ముపాస్స్వేతి!

తా॥ ధ్యానముకంటె విజ్ఞానమే శ్రేష్ఠమైనది. విజ్ఞానముచే
మనుజుడు ఋగ్వేదాది సమస్తశాస్త్రములను, సర్వవిద్యలను, ఆ
కాశాది భూతములను, దేవ మనుష్య క్రిమికీట పతంగాది సమస్తప్రా
లను, ధర్మాధర్మములను, సత్యాసత్యములను, సాధుత్వ అసాధు
ములను, మనోజ్ఞత్వ అమనోజ్ఞత్వములను, అన్నమును, రసము
ఇహపరలోకములను యెఱుంగుచున్నాడు. కాన నట్టియుత్తమ
విజ్ఞానమునే నీవుబ్రహ్మముగ ఉపాసింపుము.

'సయో విజ్ఞానం బ్రహ్మేత్యుపాస్తే విజ్ఞానవతో వై సలోకా
వతోఽభిసిధ్యతి యావద్విజ్ఞానస్య గతం తత్రాస్య యథా కామచా
భవతి యో విజ్ఞానం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో విజ్ఞానాద్భూ
ఇతి విజ్ఞానాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి.

తా॥ ఇట్లు విజ్ఞానమును బ్రహ్మముగ నుపాసించువాడు
వంతమగు లోకములఁబొందును. మఱియు విజ్ఞానముయొక్క ప్రవృ
యెంతవఱకుండునో అంతవఱకు తాను స్వేచ్ఛానుభవము కల్గియుండు

నారదుడు — విజ్ఞానముకంటె యధికమైన దేదేని కలదా?

సనత్కుమారుడు — కలదు.

నారదుడు — దానిని నాకుపదేశింప వేడెద.

సనత్కుమారుడు:—

'బలం వావ విజ్ఞానాద్భూయోఽపి హ శతం విజ్ఞానవతామే
బలవానాకమ్పయతే. స యదా బలీ భవత్యథోత్థాతా భవత్యుత్తి
పరిచరితా భవతి పరిచరన్నుపసత్తా భవత్యుప సీదన్ ద్రష్టా భ
శ్రోతా భవతి మన్తా భవతి బోద్ధా భవతి కర్తా భవతి విజ్ఞాతా భ
బలేన వై పృథివీ తిష్ఠతి బలేనాన్తరిక్షం బలేన ద్యౌర్బలేన పర్వ
బలేన దేవమనుష్యా బలేన పశవశ్చ వయాంసి చ తృణవనస్పతి
శ్వాపదాన్యాకీట ·పతఙ్గ పిపీలికం బలేన లోకస్తిష్ఠతి బలము
స్స్వేతి!

తా॥ విజ్ఞానముకంటె బలముగొప్పది. (అన్నపానాదులచే మనస్సునందు గోచరమగు నట్లొనర్చుటకు తగిన శక్తినికలుగజేయునది బలము). విజ్ఞానవంతులు నూఱుగురున్నప్పటికిని బలవంతు డొక్కడు యెల్లవారిని భయపెట్టుచున్నాడు. బలముగలవాడు మాత్రమే లేచు నట్టి శక్తిగల్గియుండును. అట్లు లేచియాతడు ఆచార్యునకు శుశ్రూష లొనర్చి తద్ద్వారా వానికి ప్రియుడగుచున్నాడు. కాన వాని నాశ్రయించి వానినుండి ఉపదేశమును వినుచున్నాడు. విని మననము చేయుచున్నాడు. మఱియు తదనురీతి కర్మల నాచరించుచు వాని ఫలమనుభవించుచున్నాడు. పృథివి మున్నగునవన్నియు బలమువలననే స్థితిఁగొనియున్నవి. బలముచేతనే లోకమున్ను స్థితివంతమైయున్నది. కాన నట్టిబలమునే బ్రహ్మముగా నుపాసింపుము.

'సయో బలం బ్రహ్మేత్యుపాస్తే యావద్బలస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యోబలం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో బలాద్భూయ ఇతి బలాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్ బ్రవీత్వితి'

తా॥ బలమును బ్రహ్మముగ నుపాసించువాడు బలముయొక్క ప్రవృత్తియున్నంతవఱకు స్వేచ్ఛాగతి కలిగియుండును.

నారదుడు:—బలముకంటె నధికమైనది కలదా?

సనత్కుమారుడు:—కలదు.

నారదుడు:—దానిని నాకుపదేశింప ప్రార్థన.

సనత్కుమారుడు :—

'అన్నం వావ బలాద్భూయస్తస్మాద్యద్యపి దశరాత్రీర్నాశ్నీయాద్యద్యు హ జీవేదథవాద్రష్టా శ్రోతా మన్తా బోద్ధా కర్తా విజ్ఞాతా భవత్యథాన్నస్యాయై ద్రష్టా భవతి శ్రోతా భవతి మన్తా భవతి బోద్ధా భవతి కర్తా భవతి విజ్ఞాతా భవత్యన్నముపాస్స్వేతి'.

తా॥ బలముకంటె అన్నము శ్రేష్ఠము (అన్నపానముచేతనే బలముగలుగుచున్నది. ఒకడు పది దినములు భుజింపకున్నయెడల మరణించును. ఒకవేళ జీవించియున్నను దేనినైన చూచుటకుగాని, వినుటకుగాని, చింతనజేయుటకుగాని, యెఱుంగుటకుగాని, చేయుటకుగాని,

విశేషముగ తెలిసికొనుటకుగాని శక్తివంతుడై యుండడు. అన్నము భుజించినచో శక్తివంతుడై యుండును. కావున, ఓ నారదా! అన్నముసే బ్రహ్మముగ నుపాసింపుము.

'స యో ఽన్నం బ్రహ్మేత్యుపాస్తేఽన్నవతో వై స లోకాన్పానవతోఽభిసిధ్యతి యావదన్నస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యో ఽన్నం బ్రహ్మే త్యుపాస్తేఽస్తి భగవోఽన్నాద్భూయ ఇత్యన్నాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి.'

తా॥ అన్నమును బ్రహ్మముగ నుపాసించువాడు అన్నపానములుగల లోకములను బొందుచున్నాడు. అన్నగతి యెంతవఱకుండునో అంతవఱకు వానికి స్వేచ్ఛాగతి గల్గును.

నారదుడు—అన్నముకంటె యధికమైనది కలదా?

సనత్కుమారుడు—కలదు.

నారదుడు—నాకు దానినుపదేశింప బ్రార్థన.

సనత్కుమారుడు:—

'ఆపో వా వాన్నాద్భూయస్య స్తస్మాద్యదా సువృష్టిర్న భవతి వ్యాధీయన్తే ప్రాణా అన్నం కనీయో భవిష్య తీత్యథ యదా సువృష్టిర్భవత్యానన్దినః ప్రాణా భవ న్త్యన్నం బహుభవిష్యతీత్యాప ఏ వేమా మూర్తా యేయం పృథివీయదన్తరిక్షం యద్ద్యౌర్య త్పర్వతా యద్దేవమనుష్యా యత్పశవశ్చ వయాంసి చ తృణవనస్పతయః శ్వాపదాన్యాకీటపతఙ్గ పిపీలిక మాప ఏవేమా మూర్తా ఆప ఉపాస్స్వేతి.'

తా॥ అన్నముకంటె జలము గొప్పది. (అన్నమునకు కారణముగాన) మంచివర్షములు లేక పోయినప్పుడు క్షామముకలుగ బోవుచున్నదని ప్రజలు పరితపించెదరు. మంచివర్షములు కురిసినపుడు అన్నమునకు కొదువలేదని జనులు సంతసించెదరు. జలమే, పృథివీ, అంతరిక్ష, ద్యులోక, పర్వత, దేవ, మనుష్య, పశు, పక్ష్యు, తృణ, వనస్పతి, కీట పతంగాది రూపముల పరిణమించియున్నది. అవన్నియు మూర్తిమంతమగు జలమేయగును. కావున అట్టి శ్రేష్ఠమగు జలమునే నీవుపాసింపుము.

'స యోఽపో బ్రహ్మేత్యుపా స్తే ఆప్నోతి సర్వాన్కామాంస్తృప్తిమాన్ భవతి యావదపాం గతం తత్రాస్య యథా కామచారో

భవతి యోఽపో బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవోఽద్భ్యో భూయ ఇత్య ద్భ్యో వావభూ యోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి.'

తా॥ జలమును బ్రహ్మముగ నుపాసించువాడు సమస్తకోర్కెల ను బడయును. తృప్తినంతుడగును. మఱియు, జల-గతి యెంతవఱకుం డునో అంతవఱకు తాను స్వేచ్ఛానుభవము గల్గియుండును.

నారదుడు:— జలముకంటె నధికమైనది కలదా ?

సనత్కుమారుడు:— కలదు.

నారదుడు:— దానిని నాకు జెప్పవేడెద.

సనత్కుమారుడు:—

'తేజో వావాద్భ్యో భూయస్తద్వా ఏతద్వాయు మాగృహ్యా కాశ మభితపతి తదాహుర్నిశోచతి నితపతి వర్షిష్యతి వా ఇతి తేజ ఏవ తత్పూర్వం దర్శయిత్వాథాపః సృజతే తదేతదూర్ధ్వాభిర్చ తిరశ్చీభిశ్చ విద్యుద్భి రాహ్రాదాశ్చరన్తి తస్మాదాహుర్విద్యోతతే స్తనయతి వర్షి ష్యతి వా ఇతి తేజ ఏవ తత్పూర్వం దర్శయిత్వాథాపః సృజతే తేజ ఉపాస్స్వేతి.'

తా॥ జలముకంటె తేజస్సు అధికమైనది. (జలమునకు కార ణము గాన). ఆ తేజస్సు వాయువు నెపుడు నిశ్చలముగ జేసి తపింప జేయునో అపుడు జనులు 'ఉక్కగానున్నది, వర్షము కురియుబోవు చున్నద'ని వచించెదరు. మొదట తన్నెఱుక పఱచుకొని తర్వాత తేజస్సు జలమును కలుగచేయుచున్నది. తేజస్సువలన గలిగిన యీ మేఘములు పైకి పోవునవిగను, అడ్డముగా బోవునవియునై మెఱుపు తో గూడి సంచరించుచున్నవి. కాబట్టి లోకులు 'ఇపుడు మెఱయు చున్నది, ఉఱుముచున్నది. కాన వర్షమువచ్చును అని చెప్పుచున్నా రు. ఇట్లు మొమ్మొదట తాను గనుపించినే తేజస్సు జలమును కలు గజేయుచున్నది. కాన తేజస్సును నీవుపాసింపుము.

'స యస్తేజో బ్రహ్మేత్యుపాస్తే తేజస్వీ వై స తేజస్వతో లోకా న్భాస్వతోఽపహతతమస్కా నభిసిధ్యతి యావత్తేజసోగతం తత్రాస్య యథాకామచారో భవతి. యస్తేజో బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవస్తే జసో భూయ ఇతి తేజసో వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి.'

తా॥ తేజస్సును బ్రహ్మముగా నుపాసించువాడు తేజస్సు తేజస్సంపన్నములై ప్రకాశవంతములై తమోరహితములైన లోకములను పొందును తేజముయొక్కగతి యెంత వఱకుండునో అంత వఱకు తాను స్వేచ్ఛాప్రవృత్తి గలిగియుండును.

నారదుడు:— తేజస్సుకంటె నధికమగునదెద్దేని కలదా?

సనత్కుమారుడు:—కలదు.

నారదుడు:—దానిని నుపదేశింపవేడెద.

సనత్కుమారుడు:—

'ఆకాశో వావ తేజసో భూయానాకాశో వై సూర్యాచంద్రమసావుభౌ విద్యున్నక్షత్రాణ్యగ్ని రాకాశేనాహ్వయ త్యాకాశేన శృణోత్యాకాశేన ప్రతిశృణోత్యాకాశే రమత ఆకాశే న రమత ఆకాశే జాయత ఆకాశ మభి జాయత ఆకాశముపాస్స్వేతి.'

తా॥ తేజస్సు కంటె ఆకాశము గొప్పది (వాయువు మున్నగువానికి కారణముగాన) సూర్యుడు, చంద్రుడు మెఱుపు, నక్షత్రములు, అగ్ని-ఇవన్నియు ఆకాశముననే స్థితిగలిగియున్నవి. ఆకాశమున్నందు చేతనే పిలుచుటయు, వినుటయు సంభవమగుచున్నవి (ఆకాశములేనిచో శబ్దమువినబడదు) సర్వజీవులు ఆకాశముననే విహరించుచు, ఆకాశముననే ఉత్పన్నమగుచు అకాశముననే వృద్ధినొందుచున్నారు. కాన నీవు యాకాశమును బ్రహ్మముగ నుపాసన జేయుము.

'స య ఆకాశం బ్రహేత్యుపాస్త ఆకాశవతో వై స లోకానాకాశవతోऽసమ్బాధానురుగాయవతోऽభిసిద్ధ్యతి యావదాకాశస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి య ఆకాశం బ్రహ్మేత్యుపాస్తే ऽస్తి భగవ ఆకాశద్భూయ ఇత్యాకాశా ద్వావ భూయోऽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి.'

తా॥ ఆకాశమును బ్రహ్మముగ నుపాసించువాడు, ఆకాశము గలవియు ప్రకాశవంతములును, బాధారహితములును, విశాలములునగు లోకములనుపొందును. మఱియు ఆకాశప్రభావము యెంతవఱకుండునో అంతదనుక తానుకోరినట్లనుభవించుచుండును.

# యథార్థభారతి

…పుటం 13. | ప్రమాది సం॥రం జ్యేష్ఠమాసం జూన్ నెల 1939. | సంచిక 4.




(పత్రిక విలాసము:—శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

…భూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి
…మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.
Published by K. Venkatachalam Naidu, Seetharama Indian Stores, Chittoor.

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు— రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త. వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పల్లమేడుగ్రామ.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత, నూతలపాటి నాగప్పనాయుడుగారు, వేమ్పేడుగ్రామ
10. శ్రీమతి. అకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కళారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామ.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాజీచెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, అడ్డా."
5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్ పూర్.

# యథార్థభారతి

| | | |
|---|---|---|
| సంపుటం 13<br>సంచిక 4 | ప్రమాది సంవత్సరం<br>జ్యేష్ఠమాసం<br>1939 సం॥రం జూన్ నెల | చందా<br>సం॥రం రు 2-4-0<br>విడిపత్రిక రు 0-4-0 |


ఓం

## బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి.

—:o:—

17. శ్రీ గురుముఖాచ్ఛ్రుతస్యాఽద్వితీయవస్తునో వేదాన్తాను గుణయుక్తిభిరనవరతమనుచిన్తనం భూయాత్.

తా॥ శ్రీగురుముఖముగా వినినట్టి అద్వైతవస్తువును వేదాంతమున కనుగుణమైన యుక్తులచేత సదా చింతించుట కలుగునుగాక!

18. విజాతీయ దేహాది ప్రత్యయానన్తరిత సజాతీయ సచ్చిదానన్దాత్మప్రత్యయప్రవాహో నిరన్తరం భూయాత్.

తా॥ విజాతీయ దేహాది ప్రత్యయము (జ్ఞానము) యొక్క అంతరితమైన సజాతీయ సచ్చిదానందాత్మయొక్క జ్ఞానము సర్వకాల సర్వావస్థలయందును కలుగునుగాక!

అంతరితము = తనకంటె వేఱైన వస్తువు కలదనెడి జ్ఞానము లేకుండుట. అనగా, తనకంటె వేఱైన వస్తువు కలదని మధ్యకాలమునందు తోపకుండుట.

ఓం తత్ సత్



# మనస్తత్వము.

## (నివృత్తి మార్గము)

(శ్రీ మలయాళ స్వాములవారు.)

ఇంతవఱకు చెప్పిన విషయములో మనము మఱింత లోతు దిగి చూడవలసి యుండును. లేకపోయిన నివృత్తిమార్గము పూ కన్పించదు. ఇట్లు లోతున ప్రవేశించుటకును, అచ్చట జరుగు తత్త్వరహస్యములు కనుగొనుటకున్ను హృదయశుద్ధి పూర్తిగ కా సియుండునని ముందుగనే చెప్పబడియున్నది. అది లేనిచో కాఱు టిలో నుండువానికి త్రోవ తెలియనట్లు మనమేమియు తెలిసికొన ము. జలము బురదచే నిండియుండ దానిలోపల జరుగు విషయము అచ్చటయుండు జంతువులును, వస్తువులును ఏలాగున తెలి జాలమో, ఆలాగున అంతఃకరణము పాపపంకిలమైయుండు సృష్టియొక్క రహస్యమేమియు తెలియసాధ్యము కాదు. అంతః శుద్ధి కలిగి రాగారాగా పరమేశ్వరుని యొక్క సృష్టిశక్తి కొం కొంచెముగా మనకు గోచరము కాగల్గును. అప్పుడే సత్యము తె వచ్చుటచే అనిత్యములగు విషయములలో విరక్తి గల్గి సత్యము స యించే స్వభావము కలుగును. ఈస్థితికి వచ్చునపుడు మనుజుడు స్వయముగ జడస్వభావము గలవాడు కాడనియు, కేవలము చై త్మయనిగాని, చేతనాత్మయొక్క యంశమనిగాని స్వబోధము మగును. అప్పుడు, యితవరకున్న స్థితికిన్ని, యిప్పుడు గల్గిన స్థితి చాల మార్పుగల్గును. ఇత్తటి మానవుఁడు కేవలము మనస్సుయొ స్వభావమున ననుసరించి ప్రవర్తింపవలసిన పని లేదనియు, ఆత్మయొ స్వభావము కేవలము చైతన్యమయమనియు, జ్ఞానమయమనియు గో రము కాగల్గును. ఈ యంతఃకరణస్వభావములన్నియు, మొ చేసిన కర్మలచే గల్గినవనియు వీటిని నివర్తింపచేయవచ్చునని స్వయముగా బుద్ధిగల్గును. వస్త్రముయొక్క రూపము స్వభావ తెలుపనియు, మురికిచేరుటచే నలుపుస్వభావము గల్గినదనియు, కొనునట్లున్నూ, షాలనాదిక్రియలచే, నిర్మలస్థితి గలుగజేసికొనవ ననియు, దృఢసంకల్పము కలుగునట్లు ధ్యానాది సంస్కరణము

ఆత్మ-శుద్ధి చేసికొనవచ్చునని నిశ్చయమగు బుద్ధి యుదయించును. ఒక చక్రములోనో, లేక అంకులరాట్నములోనో యమర్చిన బొమ్మలవలె అనగా, చక్రము తిరిగిన, బొమ్మలవలె తిరుగవలసియుండునే గాని దానినుండి తప్పించుకొనుటకు వేఱుమార్గము లేదని యింతవఱకు కలుగుచువచ్చిన బుద్ధి నశించును. ఏలన, ఆ కొయ్యబొమ్మలు నిర్జీవములు, అచేతనములు; మానవుడో నిర్జీవుడు కాడు, సజీవుడు. అచేతనుడు కాడు, చేతనస్వరూపుడు. కావున దానినుండి తప్పించుకొనవచ్చును, అను బోధకలుగును. అదేప్రకారము ప్రవాహమునకు లోబడి పోయెడు కట్టెలు మొదలైన జడవస్తువులన్నియు ప్రవాహ వేగమునననుసరించి పోవలసియుండినను చైతన్యముగల మనము ఆలాగున పోవలసిన పనిలేదను తత్వమాతనిని సదాప్రబోధించుచుండును. ఏలన, ఈత తెలిసినవారు ప్రవాహమునకు యెదురీది తీరమునకు చేరుచుందురు. తెప్పు, గడలు చుక్కాణి మొదలైనవాని సహాయములచే ప్రవాహవేగమునుండి తప్పించి మానవులు పడవను గమ్యస్థానమును చేర్చునట్లు, అతని నమ్మకమును, లక్ష్యప్రాప్తికి మఱింత బలమును గలుగచేయుచుండును. ఆలాగున సూర్యుని కాంతి అద్దములద్వారా ప్రసరించునపుడు అనేక రంగులననుసరించి ప్రకాశించినను, ఏల, ఇన్నిరంగులతో నిది ప్రకాశించుటకు కారణమేమియని యోచించెడి యవస్థకలుగునపుడు ఈ ప్రకాశ మెచ్చటినుండి వచ్చుచున్నది. దీనియొక్క మూలస్వరూపమెద్దియని తెలిసికొనవలెనని కుతూహలమతనిని ప్రేరేపించుచుండును. అపుడు గృహాంతర్భాగమునుండి బయటకు వచ్చి, ప్రకాశకారణభూతుడగు సూర్యభగవానుని దర్శించునపుడు యీ భాస్కరమూర్తి తేజోరాశియనియు, అద్దములద్వారా ప్రకాశము వచ్చుటచే దర్పణవర్ణానుసారము ప్రకాశము కలుగుచున్నదనియు, యాతనికి తెలియవచ్చును కదా! ఆలాగున అంతఃకరణస్వభావము త్రిగుణముల భేదముచే యేర్పడు చుండుననియు, సాక్షిచైతన్యాత్మ శుద్ధమై జ్ఞానమయమై, తేజోరూపియై ప్రకాశించుచున్నదనియు, అదే మనయొక్క ఆత్మస్వరూపమనియు, అపుడు బోధము కలుగును. అత్తఱి ఆమానవునకు గలిగెడి యానందము ఇంత, అంతయని వర్ణింప నలవికాదు.

సంతోషప్రవాహములో పొంగి పొరలుచుండును. ఉత్సాహ హద్దేలేదు. అప్పుడు తానింతవఱకుండిన దానికంటె తానెంత న్నత స్థితికి వచ్చెననియు, సాధారణముగ మెవనికిని సిద్ధింపని ద్దశ యతనికి సిద్ధించెననియు, తాను కేవలము దివ్యమూర్తి స్వ డనియు నిశ్చయ మాతనికి కలుగును. అత్తరుణమున అతని రాత్మ సదా యీలాగున ప్రేరణచేయుచుండును. ఇట్లు తనయ యంతర్వాణి పలుకుచున్నట్లు కూడ తోచును. లేక యొక తనలో ప్రవేశించి ఆత్మలో యీలాగున పలుకుచున్నదా, యన హము గల్గును. కాని అవియేవియును గావు. అది ఆత్మ శు నపుడు గలిగెడు స్వభావమని యోగులెఱింగియున్నారు. సంక యొక్క బలమీలాగున చేయుచుండును. దేనియందు సంకల్పము మగునో, అత్తఱి ఆత్మయు ఆలాటి స్వభావము గలదగును. ఉ వేసియుండు వస్తువులు కొంతకాలమునకు లవణమయమై పోవున కార్యరూపముగ కన్పించెడి ప్రతి పదార్థమున్నూ దానికి కారణ మగు మూలవస్తువై పరిణమించుట ప్రకృతియొక్క అలంఘనీయ స్వభావము. కార్యరూపముగ నుండెడు విత్తనము కారణరూప వృక్షమై పరిణమించుట ప్రకృతిమాతయొక్క స్వభావమైయు అయితే కాల, దేశ, పదార్థ, క్రియల అనుకూలము కావలసియుం అప్పుడు కార్యవస్తు సముదాయమంతయు కారణరూపముగ మా డును. బీజమునకు మెత్తని నేలయు, జలము, సూర్యప్రకాశము యు గలుగవలెను. అప్పుడే వృక్షమై మాఱుట కనుకూలముం ఆలాగున కారణస్వరూపుడగు యీశ్వరునినుండి కార్యరూ జీవుడుగా నుండెడు యీ ఆత్మయు తనకు వృద్ధినొందుటకు తగిన వైరాగ్యాది పరికరములన్నియు దొరకునపుడు జీవత్వమునుండి ము నొందుచుండును. సాధనానుష్ఠానముల పరిపక్వకాలము నపుడు కార్యరూపము కారణరూపముగా మాఱుచుండునను కొఱకు యుదాహరణంబు చెప్పెద. చేతనస్వరూపమగు పక్షియొ గ్రుడ్డు అచేతనమై (జడమై) యుండును. అయితే ఆ పక్షియొ ఱెక్కలలో గ్రుడ్డును పెట్టుచుండిన స్వయముగనది భేదింప పిల్లలు

కును. కాన్ని కొంగ మొదలగు కొన్ని పక్షి గ్రుడ్లు పరిపక్వము గలిగి పగిలినను, రోమములు, యీకలు యేమియు కలుగక కేవలము నెత్తురు ముద్దగనే నుండును. చలనశక్తి కూడ లేకయుండును. సృష్టికర్తయైన పరమేశ్వరుని శక్తివలన ప్రాణశక్తిగల్గి చలనమేర్పడును. మఱికొన్ని దినములకు యీకలు రోమములు యుద్భవించి, కొంచెము కొంచెము తిరుగుట కవకాశము కలుగును. వృద్ధికాగా, కాగా, గూటినుండి యటునిటు బోవుచు తానుండు వృక్షముయొక్క శాఖలలో సంచరించు శక్తిగల్గియుండును. మఱింత కాలము మార్పువచ్చునపుడు తల్లి పక్షివలె యాకాశమున యెగురుటకు తగిన అవయములన్నియు కలుగును. ఇప్పుడేలాగున జడమయమైయుండిన అండము చైతన్యమగుపక్షియై కార్యత్వముమాఱి కారణత్వమును పొందినదో ఆలాగున సంస్కారస్వభావమునుండి జీవుడును నిజస్వభావమగు దైవత్వమును పొందెడు కాలమొకటివచ్చును. అట్టి దైవత్వావిర్భావకాలమున, వృత్తులు, వాసనలు, సంకల్పములు, సంస్కారములు, గుణములు మొదలగునవన్నియు, ఆత్మగుణములుగాని ఆత్మస్వభావములుగాని కాదను బోధముగల్గును. అప్పుడు వాటినుండి విడుదల పొందుటకే యే ప్రయత్నములు కావలసియుండునో అవన్నియు సమకూర్చుకొని ముక్తుడగును. పైజెప్పిన పక్షియొక్క స్థితిలోనే యీ మానవుడుగూడ నుండును. కాని ద్రవరూపముగానుండు జీవపదార్థము పిండరూపమగు అండాకారముపొంది క్రమముగ కరచరణ, శిరాది అవయములవన్నియు యేర్పడినవి. అయితే అవన్నియు గర్భాంతరాళమున జరుగుచుండుటచే సామాన్యజనులు తెలిసికొనజాలకున్నారు. ఇదికొంచెము తెలిసికొనిన, దేహాభిమానము చాలావఱకు తొలగిపోవును. అదితెలియనీయక మాయ కప్పిపుచ్చుచుండును మాయయొక్క మహిమ తొలగిపోయినవారికి దేహోత్పత్తిసంగతి తెలియును. కనుక వారు నిరభిమానులైయుందురు.

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి. (భగవద్గీత 4-37)

అనగా, ఈలోకమందు జ్ఞానముతో తుల్యమై పాపములను

బోగొట్టి శుద్ధినిగలుగజేయునది, మఱియే దియును లేదు. కాల్ముమున, తన యనుష్ఠానమును పరిపక్వస్థితికివచ్చునపుడు జీవుడు సాక్షాత్కారజ్ఞానము తనలోనే స్వయముగ పొందగల్గును. సాధనల క్రింద పేర్కొనినవన్నియు చేరియుండును. నిరంతర దైవచింతన, మైన తపస్సు, దైవప్రాప్తిపరమగు యోగము, బ్రహ్మానుసంధానమగు అధ్యాత్మవిచారణయు, భూతకోట్లకు హితముగ నిరంతర ప్రయత్నము చేయుట. వీటిలో నెవరెవరికి దేనియందాత్మశాంతినో, అవిముఖ్యమని వారు చెప్పుదురు. అట్టిమాటల విని భ్రమనక్కరలేదు. తనయంతరాత్మసంస్కారమునను సరించి దేనియందైనా తుదివరకు విశ్రాంతినొందక ప్రయత్నించెనేని పరమశాంతిమయ ఆత్మలోనికి సర్వులును చేరగలరు. అనగా ఈశ్వరుని పొందగల పై జెప్పిన వారందఱును తత్తత్కార్యముల జేయుచుండినను దైవధ్యానము అనగా బ్రహ్మధ్యానము లేనివారై యుండరు. కావున అది (బ్రహ్మధ్యానము) ముఖ్యమైనది. ఇవ్విషయమై శ్రీ యోగవాసిష్ఠమున మునీంద్రుడు శ్రీరామచంద్రునకిట్లుపదేశించెను.

> స్వసంవిద్యత్నసంరోధా ద్యథాచేతః ప్రశామ్యతి
> నతథాంగతప స్తీర్థ విద్యాయజ్ఞక్రియాగ ణైః.

అనగా, 'బాహ్యవిషయములనుండి చిత్తమును నిరోధించి యందు నెలకొల్పుటయను ధ్యానయోగక్రమముచే చిత్తము పూర్ణశమించును. ఇట్టి చిత్తప్రసమనము తప, తీర్థ, విద్యా, యజ్ఞాది క్రియా సమూహములచేగూడ పూర్ణముగ సిద్ధింపనేరదు.'— ఇక ముముక్షుల సందేహ నివృత్తికొఱకొక సంగతి చెప్పెద—మంచి ఆచరణయు, అనుష్ఠానముగల యొకబ్రహ్మనిష్ఠునకే నైన నొక గొప్పవ్యాధి సంభవించినపుడు ఆహారము భుజింపవలెననిగాని, స్నానాది నిత్యకృత్యములు చేయవలెననిగాని సంకల్పముండదు. కేవలము దంతధావనముగాని శౌచముగాని చేయశక్తియున్నూ గలిగి యుండలేదు. అత్తఱిచేయవలెనను విచారముకూడ నుదయింపదు. ఔషధసేవవలన వ్యాధి కొంచెకొంచెము శమించుటకు కాలమాసన్నమైనపుడు స్వయముగ మలమూత్రాది శుద్ధిచేయవలెనను బుద్ధికలుగును. ఇక కొంత ఆరోగ్యము కలిగి

ముఖప్రక్షాళణాదులు చేయవలెనని ఆతడు వాంఛించును. మఱింత ఆరోగ్య ముకలిగిన, కొంచెము లేచికూర్చుండిన బాగుగనుండునని వానికి తోచును. ఇంకను ఆరోగ్యమావిర్భవించిన కొంచెము తిరుగుచుండిన బాగుండునను యిచ్ఛజనించును. ఎక్కువఆరోగ్యముకలిగి రాగారాగా స్నానసంధ్యాద్యనుష్ఠానములు జరుపవలెననియు, భోజనాదులుగూడ ఆరోగ్యదశలో యుండినట్లుండవలెననియు అభిలాషకలుగును. చూచితిరా! ఇక భవరోగము కల్గియుండు జీవునియొక్కయు స్థితి యీలాగుననే యుండును. భక్తివైరాగ్యములను దివ్యౌషధసేవనముచే అజ్ఞానవ్యాధి శమించునపుడు గల్గెడిస్థితియును యీలాగుననుండును. బ్రహ్మనిష్ఠయొక్కశక్తి యిటువంటిది. అనుష్ఠానము పూర్ణావస్థకు రాగారాగా జీవుడు అజ్ఞానసంబంధములగు సమస్తదుష్కృత్యములను మానును. సమస్త విషయవాసనలను త్యజించును. ప్రకృతిసంబంధములగు సకలగుణములను ఉపేక్షించును. అట్టియవస్థ గలుగనందుచేతనే సామాన్యులు విషయములను విడువజాలకయు, ఇంద్రియనిగ్రహాశక్తిలేకయు యున్నవారై వాసనామయములగు విషయములలోనే పడియుండి వేదాంతము మాత్రము వాక్కుతో చెప్పుచుందురు. బ్రహ్మధ్యాన పరిపక్వముగల్గిన జీవుడు శుద్ధుడుగాను, చైతన్యాత్ముడుగాను, స్వయంప్రకాశస్వరూపుడుగను నుండును. 'ఆత్మబోధ' యీలాగున చెప్పుచున్నది.

ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్.

అనగా, సర్వోత్తమమైన యౌషధమును సేవించుటవలన రోగములు నశించునట్లు ఎల్లప్పుడును బ్రహ్మానుసంధానాభ్యాసము చేయుటచే గల్గిన సంస్కారరూపమైన సద్వాసన, ఆవరణ విక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను పూర్ణముగ నశింపజేయును. మఱియు,

ఏమ మాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే
ఉదితాఽవగతిజ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్.

'లోకమందు, కొయ్యమీద కొయ్యనుంచి చిలికినమాత్రమున అగ్నిహోత్రముపుట్టి ఆ కొయ్యలను దహించివైచునట్లు, ధ్యానమను చిలుకడముచే, జ్ఞానముదయించి మూలాజ్ఞానమును పూర్ణముగ నశింప

జేసి స్వస్వరూపసాక్షాత్కారము గలుగజేయును'. మఱియు, ...
ణమునుండి గలిగిన సర్వవస్తుసముదాయమును, కార్యరూ...
భిన్నముగ కన్పించినను, కారణముతో సంబంధించినపుడు, కార్య...
నశించి కారణాకారస్థితిని బొందును. దృష్టాంతముగ, భూమి...
యేర్పడిన వృక్షాదులన్నియు మఱల భూమిలో పడిపోవునపుడు ...
అయిపోవును. ఆలాగున పృథివినుండి ఉత్పన్నమైన యినుము...
చేయబడినట్టి మిక్కిలి వాడిమిగల ఖడ్గములు, ఇతర ఆయుధము...
ఇంజనులు, మట్టిలో పడిపోయిన, కొంతకాలమునకు త్రుప్పుపట్టి...
అయిపోవును. ఆలాగున సమస్త వస్తువులగూర్చియు యూహి...
కొనవచ్చును. అట్లే బ్రహ్మమునుండి ఏర్పడిన జీవకోట్లన్నియు, ...
బ్రహ్మ చింతనమను ఆత్మానుసంధానము చేయుచు రాగా ...
బ్రహ్మమయమైపోవును. అజ్ఞానముచే జ్ఞానము మఱుగుపడిపోయి...
మఱల నిజమగు జ్ఞానముదయించుటతోడనే అజ్ఞానము లయమై...
చుండును. ఇదంతయు ప్రకృతియొక్క నియతియైయున్నది. కట్టె...
గూఢమైయుండు అగ్నిని కట్టె తనయొక్క గర్భములో దాచియుం...
అద్దానిని మథింపగా అగ్ని యేర్పడి దానిని దహింపచేయుచుండు...
ఆలాగున అజ్ఞానము పంచకోశములతో ఆత్మను భద్రముగ మూ...
యుండినను, ధ్యాన, నిదిధ్యాసనాదులచే విజ్ఞానముదయమగు...
దానిచే ఆ యజ్ఞానమంతయును విలీనమొనర్పబడును. ఏ కొ...
కాలుచుండునో, దానియందు వాసనగాని, దారుశేషముగాని కొం...
మైనను నిలువదుగదా! ఆలాగున యేహృదయములో జ్ఞానాగ్ని ...
లించుచుండునో ఆహృదయములో అజ్ఞానముగాని, వాసనలు...
యుండవు గీతనుచూడుడు:—

యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా.

అనగా, లెస్సగామండుచున్న అగ్నిహోత్రుడు సమిధలు...
హోమద్రవ్యములను, అన్నింటిని, యేలాగున సంపూర్ణముగ ...
మొనర్చునో ఆలాగున జ్ఞానమనెడి యగ్ని సమస్తకర్మలను వాసనలతో...
సంపూర్ణముగ నాశమొనర్చును. అని గీతాచార్యు(డుపదేశించె...

ఈవిషయమై సీతారామాంజనేయమందు చెప్పిన వాక్యములను వినిన, వాసనలతోను వృత్తులతోను మాకేసంబంధము లేదని చెప్పెడు వేదాంతబోధకుల హీనాశయ మందఱకును తెల్లముగ విశదము కాగలదు:—

మ॥ వనితానందన చందనాది విషయ వ్రాతంబులం బొంది చ
 య్యన నంతంతకుఁ జొక్కు నెమ్మనము బ్రహ్మానంద వారాశివా
 సన మొక్కించుక సోఁకెనేనిఁ బ్రవినాశంబొందు నానాద్రుప
 ప్పునటద్భృంగము చంపక ప్రసవ సంస్పర్శాప్తిఁ గూలుంగతిన్.

క॥ చక్కెరయును లవణంబును
 గ్రక్కున నుదకములయందుఁ గరఁగిన రీతిన్
 మిక్కిలి తనుఁగను ఘను మది
 చొక్కుచు నానంద జలధి సుడిసి నశించున్.

తే॥ ఇతర సంకల్పములు లేక యెపుడు దాను
 సచ్చిదాత్ముఁడనని సుప్రసన్న వృత్తిఁ
 దన్నుఁగనువాని చిత్తంబు దనకుఁదాన
 పొలియు దనయంద నింధనానలము పగిది.

క॥ ఇనుడస్తమించు తఱి నా
 తనికిరణము లతనితోడఁ దగఁజనురీతిం
 బెనుమానసంబు పొలిసిన
 మునుకొని తద్గత వికారములు పొలియుఁగడున్.

శా॥ నానాకర్మజవాసనాన్విత మనోనాశంబు గాకున్న బ్ర
 హ్మానందానుభవంబు గల్గునె యనాయాసంబుగా నిప్పుడి
 ధ్యానందాంబుధి నోలలాడకయ బాహ్యాభ్యంతరార్థానుసం
 ధానోద్భూత నితాంతదుఃఖమయ సంతాపంబు చల్లారునే?

(శ్రీసీతారామాంజనేయము, అమనస్కము)

ఒక యింటిగదిలో మంచిదీపము వెలుగుచుండిన దానియందు చీకటెట్లుండును? ఉండజాలనట్లే, మంచి జ్ఞానప్రబోధముగలవారి యంతఃకరణములో అవిద్యాసంబంధము లేవియు నుండజాలవు. ఇక యీ విషయమై విస్తారముగ వ్రాయఁబనిలేదని తలఁచెద. అయితే యిపు డొక సంశయము, ముముక్షువులకు గలుగనచ్చును. అదేమన, ఇపుడు

కొందఱు బ్రహ్మనిష్ఠులై యున్నను, వారిలో కొందఱికి కొన్ని ప్ర
సంబంధించిన గుణములు, విషయములు కాన్పించుచుండునే!
యమై వారినడిగిన; అంతఃకరణవృత్తుల కాత్మసాక్షిగా ను
చెప్పుదురు. ప్రమాణముకూడ చూపుదురు. సరి, రోగియైన
ఆరోగ్యము కలిగిన పిమ్మటగూడ, అప్పుడప్పుడు రోగచిహ్న
కలుగుచుండిన, జనులేమి తలంతురు? ఇకను రోగముయొక్క శే
నిలచియున్నది, కావుననే అప్పుడప్పుడు బాధలు కలుగచేయుచు
అనియెంచుదురు ఆలాగున వారు బ్రహ్మనిష్ఠ చేయుచుండవచ్చును
ధ్యాననిధి ధ్యాసనాదులు చాలవు; శ్రవణమననములు పూర్తియై
ద్యాసనమున రూఢిగల్గినవారట్టిగుణము గల్గియుండరు. కనుకనే శా
మీలాగున చెప్పుటకు కారణము.

> అహం బ్రహ్మేతివాక్యార్థం బోధో యావద్దృఢం భవేత్
> శమాది సహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికం.

దీనియర్థముపైన తెలిపినదే. బాగుగజ్వలించు అగ్నిలో కొ
భాగము కాలకనిలచిపోవునా? పోదు. అంతయును భస్మము
సుంగధముగల హోమద్రవ్యముగాని, దుర్గంధముగల యితరవ
లుగాని అన్నియును భస్మములై పోవును. బాగుగ జ్వలించని
మైనచో, కొంతభాగము కాలకయు, బొగ్గులతోకూడియు హో
చిన వస్తువులును దహింపజాలక పొగ కలిగియు యుండును. అ
శ్రోత్రియుఁడేమిచేయును? మఱల సమిధలు యెక్కువగవేసి
కఱ్ఱచే అగ్నిని ప్రజ్వలింపచేసి పూర్ణముగ భస్మమొనర్చును.
హోమమునకు మాత్రమే ఫలము గలుగును. ఆలాగున ఆత్మయ
చేయు బ్రహ్మనిష్ఠులు తమయందు విషయవాసనలుగాని, ప్ర
వృత్తులుగాని యుండిన మఱింత వైరాగ్యమును బలపఱచి,
యేకాంతస్థలమున తీవ్రమగు బ్రహ్మనిష్ఠ నభ్యసించుకొనవ
లేనిచో సామాన్యస్థితినే పొందుదురుగాని. అతీత బ్రహ్మనిష్ఠులస్థి
లభింపజాలదు; నిశ్శేష క్లేశ శమనమును కలుగదు. సముద్రా
బాడబాగ్ని జ్వలింప ప్రారంభించిన, అయ్యది సముద్రజలమునం
యేలాగున రహితమొనర్చునో, ఆలాగున అంతః (స

# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

(శ్రీ కంఠశివాచార్యులవారి గీతభాష్యమునుండి)

(ఏకాదశాధ్యాయము)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె—ఓలక్ష్మీ! యీక గీత 11 వ అధ్యాయముయొక్క మహాత్మ్యమును వినుము. తుంగభద్రమను నగరమును సుఖానందుడనురాజు పాలించుచుండెను. ఆయన మిక్కిలి భగవద్భక్తిగలవాడు. ఆ నగరమునందే విద్వాంసుడును ధనికుడునైన బ్రాహ్మణుడొకడుండెను. అతడు ప్రతిదినము గీత 11 వ అధ్యాయమును పఠించువాడు. రాజున్ను నిత్యము అచ్చటకు వెళ్లి వినుచుండువాడు. ఇట్లు కొంతకాలము గడచెను. రాజొకనాడు గృహముననుండగా చాలమంది అతిథులు దూరదేశమునుండి ఆయన యింటికి వచ్చిరి. అంతవారు రాజుతోనిట్లనిరి. ఓరాజా! మేము యిచ్చట కొంతకాలముండెదము; గాన మాకు నివసించుటకు తగినస్థలమును యిప్పించకోరెదము. అంతట రాజు వారినొక భవనమందు నివసింపజేసెను. తరువాత వారికి తగిన సత్కారమొనరించెను. దయాపాత్రుడైన నారాజు వారిని దర్శించుటకు కొంత పరివారముతోను, కుమారునితోను అక్కడకువెళ్లెను. రాజు వారిలో పెద్దవానితో మాట్లాడుచుండెను. కుమారుడచ్చట ఆడుకొనుచునే యుండెను. పాపమింతలో అక్కడ నివసించుచున్న దయ్యమొకటి హఠాత్తుగా నా కుఱ్ఱవానిని చంపివైచెను. అంత నొకరులది చూచి గీతాశ్రవణముచేయుచున్న యా రాజునకు తెలిపిరి. రాజావార్త వినినవెంటనే పుత్రమోహముచేత మూర్ఛమును వహించి వారితో 'మీ దర్శనమువలన నా కుమారున కకస్మాత్తుగ మరణము కలిగినదనెను. అంత నా బ్రాహ్మణుడు రాజుతో నిట్లనెను. ఓరాజా! నీకుమారుడున్న చోటు చూపమని, వారందఱుకలసి అచ్చటకు వెళ్లిరి. అప్పుడా బ్రాహ్మణుడిట్లనియె. 'ఓప్రేతస్వరూపా! నీవీ కుఱ్ఱవానిని జీవింపజేసినచో నేను నీకు గీత 11 వ అధ్యాయమును వినిపించెదను. అందువల్ల నీకును నీవిదివఱకు చంపిన జీవులకును ముక్తిదొరకును. అదియుఁగాక నీ ప్రేతరూపమెత్తుటకు కారణంబెయ్యది? నేను తప్పక

నిన్ను రక్షించెదను.' అంత నా భూతము, స్వామీ! మొదట
యందు నేను బ్రాహ్మణుడను. ఒక దినమున నేను పొలమును
చుండగా ఒక వృద్ధబ్రాహ్మణుడచ్చటికివచ్చి పడిపోయెను. వా
నుండి రక్తము వచ్చుచుండెను. ఒక గద్ద వానినుండి మాంస
తినుచుండెను. నేనిదంతయును చూచుచు నూరకుంటిని. ఆ బ్రా
ణుని విడిపించుటను నాకు కొంచెమైనను దయకలుగలేదు.
మఱియొక బ్రాహ్మణుడచ్చటికి వచ్చి యిదంతయు చూచి పొల
దున్నుచున్న నన్నుచూచి యిట్లనెను. ఓరీ! నీవు యెత్తినది బ్రా
జన్మమేగాని నీ కృత్యము చండాల కృత్యము. నీ పొలము దగ్గ
యీ విప్రుని పక్షులు బాధించుచుండగా చూచుచు నూర
కండ్లు పొరలుగప్పినవానివలె నున్నావు. ఇందువలన నీవు బహు
అదియుగాక ఎవడైనా ఒకడు ఎవని సొత్తైనను దొంగిలించి పో
డగా చూచి పారిపోవువాడును దుర్బలరోగి మార్గమున పడియు
చూచి వాని సంగతి యింటిదగ్గర చెప్పనివాడును, భూతవైద్యము
నిపుణుడయ్యును భూతము పట్టినవానిని చూచి విడిపించనివాడు
ముగ్గురును నరకమును బొందుదురు. మఱియు ఎవఁడు అన్నిప్రాణు
దయతో చూచునో, వానికి సహాయముచేయునో, అట్టివానికి అశ్వ
యాగముయొక్క ఫలముగలుగును. కాని నీవు యీబ్రాహ్మణుని
లు బాధించుచుండ చూచుచున్నందున, ప్రేతరూపమును బొంద
శపించెను. అంత నేను ఆయన పాదములపై బడి యిట్లు వేడు కొ
మహాత్మా! నాకాప్రేత రూపమెట్లు వదలును? అంతటాయన
నుడివెను. ఎప్పుడు నీవు గీత 11వ అధ్యాయమును వినుదువో
డు నీకు విముక్తి గలుగును. ఇట్లా ప్రేతము తన పూర్వకథ చెప్ప
బ్రాహ్మణుడు గీత 11 వ అధ్యాయమును వినిపించి వాని ప్రేత
మును బోగొట్టి రాచకొమరుని కూడ బ్రతికించెను. అంత స్వ
నుండి విమానమున్ను వచ్చెను. అపుడా వెనుకటి ప్రేతమిట్లు
రాజా! నీవు భగవద్భక్తుడవు. అంత రాజు పుత్రమోహముచే నిట్లు
నాయనా! నీవు నాతోనుండుము. అంత పుత్రుఁడిట్లనియె.
నేను నీకు కొన్నిసార్లు పుత్రుడను. నీవు కొన్నిసార్లు నాకు పుత్రు

నేను నీకు పుత్రుడుగా పుట్టినందున ఈ భూతము ధన్యురాలు. ఏ మంపురా, యిది నన్ను చంపుటచేత మీరు గీత 11 వ అధ్యాయమును పారాయణచేయించినందువలన వానికి విముక్తి గలుగుటయే గాక నాకును ముక్తి దొరికినది. నేను వైకుంఠమును పొందగా నీ కులము యొక్క 21 తరములవారు తరింతురని చెప్పగా రాజు సంతోషించి ఆతడట్లు వెళ్లుట కానందించెను. అంత విమానము నెక్కి యాతడు స్వర్గమును బొందెను. అది మొదలు రాజు విరక్తిసిజెంది గీత 11 వ అధ్యాయమును నియమముతో పఠించి అంత్యమందు పరమ పదవిని జెందెను.

---

ఓం సద్గురు పరమాత్మనేనమః

# ఆ రో గ్య సా ధ న యో గ ము .

---

[హిమాలయములలోని హృషీకేశమను పట్టణమందు గల
ఆనందకుటీరాధిపతియగు
శ్రీమత్పరమహంస శివానందసరస్వతీస్వాములవారిచే రచితము.
అనువాదకుడు : కామర్షి వెంకటసుబ్బయ్యగారు, పేరూరుపేట.]

---

హరిఓమ్-మితిమీరిన భోజనము, స్త్రీవిషయము, కోపోద్రేకము, ద్వేషము, అనువానివలన ననేకవిధములగు వ్యాధులు కలుగును. సర్వదా మనస్సును శాంతముగను నిర్మలముగ నుంచినయెడల అద్భుతమగు బలము, ఆరోగ్యము, తేజస్సున్ను కలుగును. కోపమువలన శరీరపాటవము చెడును. ఎవని కైనను దురహంకారమువలన నితరుల యెడల ద్వేషముకలిగెనేని రక్తకణములు దుష్టవిషపదార్థముతో పూరింపబడును. అప్పుడు శరీరసంబంధమగు రుగ్మతలు కలుగును. ఉష్ణాధిక్యతచేత రక్తము పలుచబడును. అందుచేత రాత్రివేళల కలవరములు కలుగును. పలువిధములగు నరసంబంధమగు రుజలున్ను, వీర్యనష్టమున్ను తరచు కోపోద్రేకమున్ను దురహంకారమున్ను పొడమును.

నీశరీరమునం దెట్టి రోగములున్నను నుండనిమ్ము. వానిని అదే ధ్యానముగ విచారింపకుము. సహనశక్తిని ధారణశక్తిని, జేసికొనుము. నిర్మలమగు గాలిలో సంచరించుటవల్లను, పుష్టి సాత్త్వికాహారమువల్లను, తైలాభ్యంగమువల్లను, తగిన వల్లను, నీశరీరమును మనస్సును నరములను బలపర్చుకొను శారీరక మానసిక వ్యాయామము గలిగియుండుము. జీవనమందు బాటుగలిగియుండుము. ఆహారపాన భోగములందు మితిగలిగియు ము. ఆధ్యాత్మికజీవనము గడుపుము. ఆప్రకారమాచరించెదవేని మందుగల వ్యాధులు తమంతటతొలగును. నీయాత్మశక్తియు బలమున్ను సరియైనస్థితిలోనుండిన ఎడల శరీరమందలి విషాణువులన్ను హరించును. నీసౌఖ్యాభివృధికి కారణమగు పరమరహస్యమిదియె.

బడాయికోర్లు, కువైద్యులు. (ధనాకర్షణకై) ప్రకటించు భీరప్రకటనలవలన మోసపోవలదు. నిరాడంబర జీవనమును గడుపు అమాయకులను మోసగించి ధనమునార్జించుకొనుటకు ప్రకటించు నీపనికిమాలిన ప్రకటనలవల్ల మోసపోయి సొమ్మును వ్యర్థము కుము. జాగ్రత. తఱచు డాక్టర్లవద్దకు పోవలదు. నీకు నీవే డాక్టరు నుండుటకు ప్రయత్నింపుము. ప్రకృతిధర్మములనున్ను ఆరోగ్యవిధా నున్ను తెలిసికొని వర్తింపుము. ఎప్పుడును ఆరోగ్యపద్ధతులకు వ్య కముగ నడుచుకొనకుము.

ప్రతిదినమున కొంత సేపు యెండలో తిరిగి సూర్యకిరణములు రీరమునకు తాకనిమ్ము. సూర్యరశ్మివల్ల శరీరమునకు చురుకుదనము పాటవమున్ను కలుగును. ఇదియె ఆతపవైద్యమనబడును. సూ వలననే మనకు బలదర్పములు కలుగుచున్నవి.

రాత్రివేళ 12 సీమబాదంకాయపలుకులు నీళ్లలోనానబెట్టి బునాటియుదయమున నాపలుకులపై పొరవదిలించి వానిని కలకండతో తినుము. లేదా ఆ పప్పు 3,4 మిర్యాలుచేర్చి నీళ్లతో నూరి త్రాగుము. ఇదియొక విధమగు ఆరోగ్యకరపానమగును. పంజాబీయులు 'టండాయి' అందురు. ఇది చల్లని బలవర్ధక టానిక్కు.

పడకయందు విశ్రాంతి అవసరము. ఆరోగ్యకరమై సులభముగ జీర్ణముకాదగిన సాత్త్వికాహారమును మితముగ తినుము. వేడిచేయు కారముగల కూరలు పచ్చడులు వగయిరా తినగూడదు. అప్పుడప్పుడు కొలది యుపవాసములుచేసి జీర్ణకోశమును పరిశుభ్రపరచుచుండుము. ఒక దినమంతయు పస్తుపడియుండుట మంచిది. అందువల్ల శరీరమందుగల విషపదార్థములు హరించును. శరీరయంత్రము బాగుపడును. పాలతో సగ్గుబియ్యపుజావ, బార్లిగంజి, తియ్యనారంజ, ద్రాక్షవగయిరా పండ్లను తినవలెను. విదాహమైనప్పుడు నిమ్మరసముగాని నారంజ రసముగాని కొంచెము కలకండచేర్చి త్రాగవలయును.

బ్రహ్మచర్యము నవలింబింపుము రాత్రి 4 గంటలకు నిద్రనుండి లేచిహరిఓమ్ అనిగాని మఱియొకమంత్రమునుగాని ఒకగంటసేపు జపించుము. ప్రపంచమందు మానవులకు భగవన్నామస్మరణమే పరమౌషధము. ఆ భగవన్నామమందు గాఢతరమైన భక్తివిశ్వాసములుండవలెను. హరినామ జపమువల్లను సంకీర్తనమువల్లను ఎటువంటి కఠినరోగములైనను హరించును. జపముచే శరీరమందలి సమస్తవ్యాధులు తొలగింపబడును. జపమువల్ల శరీరమంతయు అమృతమయమగును. రోగాణువులెల్లను నశించును; ఈపరమరహస్య మింతవఱకు వైద్యులకు దెలియదు.

విదేశీయ ఔషధముల ననవసరముగ శరీరమందు ఏల జొనిపెదవు? ప్రకృతిచికిత్సను, యోగచికిత్సను అనుసరింపుము. ఇదియే సర్వోత్కృష్టమగు చికిత్స. ప్రాణాయామము, శ్వాసనియమము, ఆసనములు, ఏకాగ్రత, ధ్యానమునను నీయభ్యాసము యోగచికిత్స యనబడును. నీవ్యాధివిషయమైగాని శరీరవిషయమైగాని అదేపనిగా చింతింపకుము. అటుల చింతించుటవలన వ్యాధి వృద్ధియగును. మనస్సును సర్వదా యితరవిషయమందు (భగవద్విషయమందు) మఱలింపుము. ఇది ముఖ్యమైనది. నీమనస్సును శరీరమునుండి వేఱుపరచి నిరామయమగు ఆత్మయందు, అనగా సర్వాధిష్ఠానమగు ప్రత్యగాత్మయందు (The soul) నిలుపుము. మిత్రమా, ఈవిధమగు ఆత్మచింతనమునభ్యసించి నిరామయపదమ్ము, అనగా పరమపదమును పొందుము. ఎలప్పుడు నానంద

మయుడవై యుండుము. మందహాసవదనముతో నుండుము. ఓం
మును ధ్యానింపుచు, ఓంకారమునే చింతింపుము. ఓంకారమునే
ముచేయుము. నీ నిజనామము ఓంకారమే. ఓంకారము సర్వవ్యా
రమగు టానిక్కు. పరమౌషధము. మందహాసముతో సంతోష
తుడవువై యుండుము. నీవు శరీరమే లేని నాశరహితుడవగు
వీనిని మఱవకుము.

భగవంతుడు నీకు పరిపూర్ణారోగ్యమును ప్రసాదించుగా
మనశ్శక్తియు శరీరపాటవమును ప్రసాదించుగాక! నీకు శ్రేయో
యగుగాక!

ఓమ్ తత్ సత్.

ఓమ్ శాన్తిః శాన్తిః శా

---

ఓం.

# మనోజయము.

(శ్రీ శివానంద సరస్వతీ స్వాములవారు హృషీకేశము)

అభ్యాసమువల్లను వైరాగ్యమువల్లను మనస్సు స్వాధీనమగు
సర్వకాల సర్వావస్థలయందును భగవంతునియందు అనగా
యందు లక్ష్యమునుంచుట అభ్యాస మనబడును. విషయవాం
కుండుట వైరాగ్యమనబడును.

"కోఽహం?"(=నేనెవరను?) అని విచారముచేయుము
సికముగ ప్రణవ (ఓం) జపముచేయుచు, ఆత్మను ధ్యానింపుము,
వలన మానసిక వృత్తులు నశించి సర్వదా సచ్చిదానందాత్మవైయుం

ఒంటరిగ గూర్చుండి వృత్తులెట్లు కలుగుచున్నవో కని
వానియందు ఉపేక్షాభావముతో వానికి సాక్షిమాత్రుడవై యుండు
వానితో నేకీభవింపకుము. అప్పుడు మనస్సు నీకు స్వాధీనమగు

కోరికలనెడి కట్టెలను ధ్వంసము చేసినయెడల సంకల్ప
యగ్ని తనంతట చల్లారును. (కోరికలు పోడమని యెడల సంకల్
కలుగదు). సంకల్పరహితమైన యెడల పరబ్రహ్మము ప్రకాశించు

మైత్రి, కరుణ, మోదము (సంతోషము) సుఖదుఃఖములందును పుణ్యపాపములందును ఉపేక్ష యీ మొదలగు వసంఖపద్దైర్గుణములను పెంపొందించెదవేని మనశ్శాంతి కలుగును.

గతమును స్మరింపకుము. భవిష్యద్విషయమై యోచింపకుము. (సర్వము దైవాధీనముగనుక), మనస్సునందు ఎట్టి సంకల్పములు పొడ మనియ్యక నీకు నీవైన ("బ్రహ్మాస్మి"యను) స్థితియందు ఉండుము.

మనస్సునకు సమాధానములేని (హరినామస్మరణము మొద లగు) పనినే చేయుచుండుము. మనస్సు అభిలషించు నేకార్యమును చేయకుము.

కోరికలను దీర్చుకొన యత్నింపకుము. దేనిని ఆశింపకుము. దురాలోచనలను సత్సంకల్పములచే నుపసంహరించి, పిమ్మట నాస త్సంకల్పముల సయితము పోనడచి మోక్షమునే కోరుచుండుము.

ప్రాణాయామాభ్యాసము రజస్తమోగుణములను హరించి మనస్సును నిర్మలముచేసి, ఏకాగ్రమున నిలుపును.

ఆధ్యాత్మిక (వేదాంత) సంబంధమగు పుస్తకములను (అర్థజ్ఞాన ముతో) చదువుచుండుట తపస్సు. మహాత్ములు, సాధువులు, (ఆత్మజ్ఞు లగు) సంన్యాసులు మొదలగు వారితో సత్సంగము అనునవి ప్రాపం చిక విషయసంస్కారముల నణగద్రొక్కి, మనస్సు స్వాధీనమందుండు టకు తగిన మార్గమును ఏర్పఱచును.

ఏమంత్రమునైనను జపించుటచేతను, ఉపాసనవలననను మనస్సు కల్మషరహితమై అంతర్ముఖమగును. తీవ్రవైరాగ్యము కలుగును. ఏ కాగ్రతకలిగి మనస్సు సంపూర్ణముగ స్వాధీనమై భగవత్సాక్షాత్కా రము కలుగును.

"కలౌ కేశవకీర్తనాత్" అనునట్లు కలియుగమున హరినామసం కీర్తనమే మనస్సుపరిశుద్ధమై స్వాధీనమగుటకును, మోక్షప్రాప్తికిని సులభసాధనము.

ఆహారమునకును మనస్సునకును సంబంధముకలదు. (పాలు పండ్లు మొదలగు) సాత్త్వికాహారము మనస్సును శాంతపఱచి పరిశుద్ధ ముగజేయును. (మాంసము, కల్లు, సారాయి మొదలగు) రాజసాహా

రము ఉద్రేకమును గలిగించును. కనుక కేవలసాత్త్వికాహారమునే ముగ భుజియింపుము.

మంచి అలవాటులవలన దురభ్యాసములను తొలగించు (ప్రకృతిసంభంధమగు) పశుబుద్ధిని సాత్త్వికబుద్ధిచే తొలగించును.

అహంమమతలు లేసి ఆత్మభావముతో చేయబడు ఈశ్వరా ధనవలన మనస్సు పరిశుద్ధమై స్వాధీనమున నుండును.

మనస్సును బలవంతపెట్టకుము. (లాలనచే పసిబిడ్డనువలె నము చేసికొనవలెననుట). ధ్యానమందు ఏకాగ్రతకొఱకు క్రమా సముచేయుము. మనశ్శాంతియు, సంతోషమును, ఆనందమును, శ్వరకైవల్యపదవియు భగవంతుడు నీకు ప్రసాదించుగావుత!

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

---

(శ్రీ భగవద్గీత.)

# 9. రాజవిద్యా రాజగుహ్యయోగము.

(శ్రీ మలయాళ స్వాములవారు)

ఈ బ్రహ్మవిద్య విద్యలన్నింటిలోను రాజై యుండుటచేతను ఇక్ష్వాకు ఆదిగాగల రాజులంఱును యీవిద్యననుష్ఠించి రా పాలన మొనర్చి జీవన్ముక్తి పదమును బొందినందుచేతను దీనికి విద్యారాజగుహ్యయోగమని పేరువచ్చినది. మఱియు రహస్య లన్నిటిలోను యిది అతిరహస్యమైనందుచేతను దీనికి రాజగుహ్యా గమని నామధేయముగల్గెను. మఱియు పూర్వీకులగు రాజులు యీ శాస్త్రసారము నాచరించియే ముక్తిని బొందిరి; కావున నో యర్జు నీవున్ను యీ గీతాశాస్త్రానుసారము వర్తించి జీవన్ముక్తి పదము బొందమని భగవానులు వచించిరి. ఈ పరమరహస్యమైన బ్రహ్మ అనాదికాలమునుండి రాజులు అనుష్ఠించివచ్చినదనియు, బహుకాలమునుండి నశించిపోయినదనియు, అట్టి క్షయించిపో

విద్యనే మఱల యిప్పుడు ఉద్ధరించుచున్నానని యని శ్రీ భగవానులు నాల్గవ అధ్యాయమున తెలిపియున్నారు. దీనియందింత రహస్యమేమన, మోక్షముకొఱకు సర్వసంగపరిత్యాగము కావలెననియు, యేకాంత ప్రదేశమున చేరవలెననియు, జటా కాషాయ వస్త్రములు ధరించవలెననియు, తపస్సుచే శరీరమును కృశింపజేయవలెననియు, యోగముచే నిర్వికల్పసమాధివఱకు ధ్యాన ధారణాదుల నవలంబించవలెననియు చెప్పుదురుగదా! అట్టి దుస్సాధ్యసాధనలు చేయకనే ఈశ్వరార్పణ బుద్ధితో నిష్కామ కర్మయోగ మనుష్ఠించిన, జీవన్ముక్తి పదవి పొందుటలో యేలాటి సంశయమును లేదని యిందుపదేశించినందుచే దీనిని రహస్యములన్నిటిలో మిక్కిలి రహస్యమైనదని చెప్పుటకు కారణమైనది. ఏలన, పైఁజెప్పిన కఠినక్రియల నాచరింపకయే వాని యొక్క ఫలము నొసంగెడు బుద్ధి-చాతుర్యమేమని చెప్పవచ్చును! అంతేకాదు. పైనదెల్పిన యేకాంతవాసము, యోగాభ్యాసము, తపశ్చర్య మొదలైనవి అందఱకును సాధ్యమైనవికావు. ఈ నిష్కామ కర్మయోగమో, సర్వజనులకును, సర్వకాలములయందును, స్త్రీలకును, పురుషులకును, వేయేల, అందఱకును ఆచరించుటకు సులభసాధ్యమైనది గదా. కావుననే దీనికి రహస్యమని చెప్పుటకు కారణము. మను, మాంధాత, జనక, భగీరథ, యిక్ష్వాకాది రాజులందఱును రాజర్షులనుపేరు బడసినవారే. రాజులైయుండియు రాజ్యపరిపాలన మొనర్చియు, వారు ఋషులయొక్క స్థానమును బొందినవారైయుండిరి. ఋషులనగా యింద్రియాతీతమగు జ్ఞానమును బొందినవారనియు, యింద్రియాతీతమగు బ్రహ్మపదవి గలిగినవారనియు, ఋక్కులు అనగా వేదముల యర్థమగు పరమాత్మను సాక్షాత్కరించుకొనినవారనియు అర్థము. నాల్గవ అధ్యాయమున యిట్టి పరమరహస్యమైన బ్రహ్మవిద్యను పూర్వీక రాజులనుష్ఠించుచువచ్చినదనియు, బహుకాలమునుండి క్షయించిపోయినదనియు వచించి అట్టి పరమరహస్యమునే నీకు జెప్పెదనియు శ్రీకృష్ణ భగవానులు యుపదేశించిరి. అయితే యిట్టి పరమపవిత్రమగు కర్మయోగము నశించుటకు కారణమేమని యనేకులకు సందేహము గలుగవచ్చును.

గీతాభాష్యకారులు కొందఱు ఈ విషయమేమియు చె
లేదు. మఱికొందఱు, పరంపరగా యనుష్ఠించువారు లేకపో
నశించినదని తెలిపిరి. కాని సరియైన సమాధానము దాని
పూర్తికాదు. దీనియొక్క రహస్యము మహాభారత ఆదిపర్వము
గలదు. క్షత్రియవంశము పతనమొందుటకును, క్షాత్రధర్మము న
టకును కారణమచ్చోట తెలుపబడినది. ఈ కారణము చె
పోయినను, దానియొక్క సంగ్రహార్థ మేమన, క్షత్రియధర్మ వి
ద్యానభూరుహములను శ్రీపరశురామదావాగ్ని దహింపజే
దుచే యప్పటినుండి క్షాత్రవిద్యలన్నియు నశించినవి. శిష్యప
గా ఆ విద్య నుపదేశించువారు లేకపోయిరి. అందువల్లనే బహు
మునుండి కర్మయోగరహస్యము నశించినదని శ్రీభగవానులు
విచ్చుటకు కారణమైనది. మఱియు నీ బ్రహ్మవిద్యను పొందు
బ్రాహ్మణాది సర్వవర్ణములవారికిని, స్త్రీలకును యధికారముగ
మాత్రము చెప్పక పాపజన్మము గలవారెవరుగలరో వారికి
యర్హత గలదని నిరూపించుటచే యీ గీతాశాస్త్రము యొక్క
కారత్వమును నిరూపించినందుచేతను యిది మిక్కిలి రహస్యము
ఏలన, బ్రహ్మవిద్య కందఱును అర్హులుకారనియు, కొన్ని వర్ణ
వారికి మాత్రమే అధికారము గలదనియు, కొందఱు ఆశ్రమస్థు
మాత్రమే అవకాశముండుననియు తెలుపు కపోలకల్పితగ్రంథము
వచ్చును. కావున నట్టి పాపములెవ్వియు దీనియందు లేనందుచే
మిక్కిలి పవిత్రమైనది, పాపరహితమైనది, గూఢమైనదని చెప్ప
కారణము. పాపులు పవిత్రులగుట యొక విశేషముగదా. ఇదే దీ
గలరహస్యము. ఈ విషయములన్నియు నీయధ్యాయమున గలవు
యు యెంతపాపియైననుగూడ దీనియందు చెప్పినట్లాచరించిన
లోనే పాపరహితుడై పుణ్యాత్ముడగుననియు అతడు, పవిత్రుడేయని
అందఱును తలంచవలెనని కరుణానిధియగు భగవానులీయధ్యా
మున నుపదేశించిరి. కావున నీయధ్యాయమునకు రహస్యమని
వచ్చెను. ఎంత దారుణవ్యాధియైనను దివ్యౌషధముచే యేలాగున
చునో, ఆలాగున పాపరోగములన్నియు నీగీతాశాస్త్రపఠన

శమించును. దరిద్రునకు నిక్షేపము దొఱకిన యేలాగున దారిద్ర్యబాధా రహితుఁడై శ్రీమంతుడగునో, ఆలాగున పాపహేతువగు దారిద్ర్యము గలవాఁడును గీతాపఠనమొనర్చిన పుణ్యశ్రీమంతుడగును; జ్ఞానధని కుఁడగును. ఈయధ్యాయమందీ శ్లోకము ముఖ్యము.

అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్
సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః (9–30)

ఎడతెగని భక్తితో నన్ను సేవించువాడు మిక్కిలి దురాచారుఁడై నను పాపియైనను వానిని శ్రేష్ఠుడనియే తలంచవలెను. ఏలన యెప్పు డును యితరచింతలులేక నాయందే నిశ్చయబుద్ధిగల భక్తుఁడు పవి త్రుఁడేయగును! భగవద్భక్తి మహిమ యటువంటిది. స్పర్శవేది సం యోగముచే యినుము యేలాగున బంగారగునో, మఱల నాబంగారము యినుము కాజాలదో, ఆలాగున యెంతపాపియైనను భగవద్ధ్యాన మహిమచే పవిత్రుడగును. ఇది భగవదాజ్ఞయని అందఱు మఱువక యుం డవలెనని భావము. వాల్మీకాది ఋషులే యిందుకు దృష్టాంతము.

ఓం తత్ సత్.

---

# శ్రీ వివేకానంద లేఖావళి.

అనువాదకులు — (శ్రీ తత్త్వానంద స్వాములవారు)

541 డియర్బోరన్ ఎవెన్యూ
షికాగో 24—1—1894.

ప్రియ మిత్రములారా!

మీ యుత్తరములు చేరినవి. నన్ను గుఱించిన అన్ని వార్తలు మీకు చేరుట కాశ్చర్యపడుచున్నాను. మీరుపేర్కొనిన ఆ పత్రికా విమర్శనమును అమెరికా ప్రజల అభిప్రాయముగా పాటింపదగదు. ఆ పత్రిక ఇక్కడ దాదాపు పేరులేనిది; కడు మూర్ఖవాదము చేయునది. దానిని "బ్లూనోజు ప్రెస్బిటేరియన్ పత్రిక" అని అపహాస్యము చేయు దురు. అయినను 'బ్లూనోజు' పక్షమువారందఱు విరసముగానుండు వారనుకొనదగదు. అమెరికాప్రజలును, చాలమంది మతబోధకులును

నాయెడ చాల ఆదరమును చూపుచున్నారు. సంఘమున విఖ్యా
గనుచున్న యొకనిని అధిక్షేపించుటవలన కొంచెము పేరెన్నిక
రావలయునని ఆపత్రిక యత్నము. ఆటన్కు లిక్కడ అందఱికి
యును ; దానినంతగా పాటించువారిక్కడ లేనే లేరు. అయినను
మాదేశములోని క్రైస్తవబోధకులు దానిని కొండంతగా చా
ప్రబలప్రయత్నములు చేయుట సహజమే. వారటుల చేయు
'ఓ యూదుడా! చూచుకో! తీర్పుదినము వచ్చి నీపై బడుచు
అని చెప్పుడు. వారి ప్రాతకొంప పునాదులవఱకు కదలిపోవుచు
వారెంతగా బొబ్బరింతలు పెట్టుచున్నను కూలిపోక తప్పదు. వారి
నాకు జాలికలుగుచున్నది. ప్రాచ్యమతబోధకులు ఇక్కడికి చే
టుట వలన, భారతదేశమునకు వచ్చువారి సుఖజీవనమునకు
ములు తెగిపోవచ్చును. కాని వారి మతబోధకప్రముఖులలో
డేనియు ఇక్కడ నాకు వ్యతిరేకముగా లేడు. కానిండు; చెఱు
చొఱబారితిని, గాన పూర్తిగనే స్నానమాచరింతు గాక!

వీరియెదుట మన మతమును గురించి నేను చదివినట్టి ఒక
వ్యాసమును ప్రకటించిన ఒక వార్తాపత్రికలోని భాగమును క
పంపుచున్నాను. నా యుపన్యాసములలో చాలభాగము అ
నోసగునవియే.... భారతదేశమునుండి సాహాయ్యము నాకేమియు
సరముండదు; ఇక్కడనే కావలసినంత లభింపగలదు. నా అ
యుపన్యాసమును ముద్రించి ప్రకటించుటకును, ఆయా ప్రాంతీ
లలోనికి అనువదించి విరివిగ ప్రచారము చేయుటకును మీకు
డబ్బును వినియోగించుడు. అది మన జాతియొక్క ఆశయమును
మనయెదుట నిలుపగలదు. ఈ లోపల కేంద్ర కళాశాలం గ
మన యాలోచనలను మఱువకుడు. ఆరీతిగ ప్రారంభించి భా
మున నలుదిక్కుల ప్రచారముగావింపవలయును. కష్టపడి పనిచేయు

అమెరికా స్త్రీలు నాయెడజూపు ఔదార్యమునకై నేను
యెడ నాకృతజ్ఞతను వెలువరింప జాలకున్నాను. పరమేశ్వరుడు
నాశీర్వదించుగాక! ఈదేశములో ప్రతియుద్యమమునకును స్త్రీలే

ధారలు. వారేజాతీయ పరిజ్ఞానమున కంతటికిని నిదర్శనులు. ఏలయన, పురుషులు తమ వ్యాపకములలో తాము మునిగిపోయియున్నారు.

కా—గారి లేఖలు చేరినవి. కులము వచ్చునా పోవునా, అను ప్రశ్నతో నాకు జోక్యము లేదు. భారతదేశమునందును, వెలు పలనుగూడ మానవకోటిని వృద్ధికి దెచ్చిన మహోన్నత భావరాజము లను అత్యంతక్షుద్రులును దరిద్రులునగు వారి ముంగిళ్ల కడకు గొని పోవుటే నా అభిమతము; ఆపిమ్మట వారు తమ సంగతి తామే విచారించుకొనగల్గుదురు. కుల వివక్షత యుండవలయునా, యుండ కూడదా, స్త్రీలకు సంపూర్ణ స్వేచ్ఛయుండవలయునా తగదా అను నిట్టి సమస్యలు నన్ను బాధింపవు. 'బ్రతుకుటకును, ప్రవర్ధనము గాం చుటకును, క్షేమముగ నుండుటకును, భావస్వాతంత్ర్యమును క్రియాస్వా తంత్ర్యమును మాత్రమే అవసర నియమము.' అది ఎచ్చటనుండదో ఆ నరుడు, ఆవంశము, ఆజాతి అథః పతితము కావలసినదే! కులముండుగాక, కులము పోవుగాక, మతము నిలుచుగాక, మతమును పోవుగాక, భావ స్వాతంత్ర్యమును, వ్యవహారస్వాతంత్ర్యమును—వీని అధికారము ఇతరు లకు హానికరము గానంతవఱకు—అణంచజూచునట్టి ఏనరుడుగాని, ఏ వర్గముగాని, ఏ కులముగాని, ఏ జాతిగాని, ఏ సంస్థగాని ఆసురమే, అది వినాశము కావలసినదే. ఉత్తమభావరాశిని ప్రతివాని ద్వారము కడకు కొనిపోయి, స్త్రీలను, పురుషులను, తమగతిని తామే నిర్ణయించు కొనునటుల చేయునొక మహాయంత్రమును కదలికలోనికి దెచ్చి నిడుచు టయే నాజీవితాశయమంతయును. సకలజీవన మహాసమస్యలంగూర్చి యు మన పూర్వులును, ఇతర జాతులవారును ఎటుల విచారించియుం డిరో వారిని తెలిసికొననిండు. ముఖ్యముగా, ఇతరులిప్పుడెటుల వర్తిం చుచున్నారో గమనించివారు తమకుతామే తమగతిని నిర్ణయించుకొం దురు గాక! మనము చేయదగినది, రసాయనద్రవ్యములను చేర్చిపెట్టుట మాత్రమే! అంతట ప్రకృతియే, దాని స్వభావధర్మముల ననుసరించి స్ఫటికాకృతుల నిర్మించుకొనగలదు. శ్రమపడి పనిచేయుడు; సుస్థిరులై మెలగుడు; భగవంతునియెడ విశ్వాసముతో నుండుడు. త్వరగనో అలస్యముగనో నేనురాగలను. మీరు కార్యనిర్వహణమునకు బూను

కొనుడు. 'మతమునకు హానిలేనితీరున ప్రజాసామాన్యము నుద్ధరిం చుట' యను ధర్మసూత్రమును మీ యెదుట నిలుపుకొనుడు.

మనజాతి కుటీరనివాసి యనుటను జ్ఞప్తినుంచుకొనుడు. కట కటా! ఎవరును వారికొఱకై పాటుపడినవారు లేరుగదా! మన నవీన సంస్కర్తలు వితంతూద్వాహసమస్యతో తీరికలేకయున్నారు. ప్రతి సంస్కరణయన్నను నాకు సానుభూతిగలదనుట సత్యమే! కాని ఒకజాతి యొక్క గతి వారి వితంతువులకు లభింపగల భర్తలసంఖ్యపైని ఆధార పడియుండదు; అది జనసామాన్యముయొక్క స్థితిపైని ఆధారపడియుం డును. నుడీ! మీరువారి నుద్ధరింపగలరా? సహజమైన తమ ఆధ్యాత్మ ప్రకృతిని గోల్పోవకుండ, వారు బోనాడుకొనియున్న వ్యక్తిసత్వమును మీరు వారి కొసంగజాలుదురా? సమత, స్వేచ్ఛ, కృషి, ధైర్యము మున్నగు వానియందు అభినివేశము పూని పాశ్చాత్యులను మించి పాశ్చాత్యులగుదురుగాక! అయినను, మతము, పరిజ్ఞానము, అభ్యాస ములను అనువానిలో భారతీయ లక్షణములను అకుంఠితముగనిలుపుకొన గల్గుదురా, ఇదియే మీరు చేయదగినపని! ఆత్మవిశ్వాసము పూని మెల గుడు; అత్యుత్తమ విశ్వాసములే మహోన్నతతర కార్యములకు బీజము లైయుండును నుడీ! నడువుడు! సంతత పురోగమనమును సాగించుడు! తనువులో ఊపిరి యున్నంతవఱకు బీదలయెడను, పీడితులయెడను, సా నుభూతి విడువకుడు! ఇదియే మన ధర్మసూత్రము.

నావీరసంతానములారా! ముందునకు సాగిపొండు!

పూర్ణవాత్సల్యము పెంపున ఇట్లువ్రాయు

వి వే కా న ం ద.

ఉ. వే:—

ఒక కేంద్రకశాలాల ద్వారమున జనసామాన్యము నుద్ధరించుట అందు సుశిక్షితులగు బోధకులద్వారమున బీదవారి ముంగిళ్లకు విద్యను మతమును సహకొనిపోవుట అనెడు ఉద్యమమును ప్రచారముచేయుడు. ప్రతివాని ఉత్సాహమును పురికొలుప ప్రయత్నించుడు.

వివేకానంద.

# సత్యసూత్రములు.

---

౧. సత్యమే దైవము, బ్రహ్మము, ఆత్మ సత్యముగానుండుట, దైవపూజ, బ్రహ్మనిష్ఠ ఆత్మస్వాతంత్ర్యమగును. సత్యముగా నుండుటకంటె యితరమెట్టిదియు దైవపూజ, బ్రహ్మనిష్ఠ, ఆత్మస్వాతంత్రము కానేరదు.

౨. దైవము, బ్రహ్మము, ఆత్మ సత్యము; సర్వము నెఱుంగును. అసత్యాధారము గొనుట, దైవధిక్కారము, అబ్రహ్మత్వము, ఆత్మద్రోహ మగుచున్నది. ఇదియే దుఃఖము. సర్వదుఃఖములకు మూలమసత్యము.

3. సత్యావలంబనము దుఃఖసంతరణ మార్గము, సత్యము, జ్ఞానము, ఆనంద మీమూడునొకటి. సత్యమును విడిచిన తక్కినవి రెండును లేవు. సత్యముగా నుండుటయే జ్ఞానివైయుండుట, ఆనందమయుడై యుండుట యగును. అదియే దైవదర్శనము. మోక్షము ఆత్మసాక్షాత్కారము బ్రాహ్మీస్థితి లోకసంగ్రహము.

౪. దైవము, బ్రహ్మము, ఆత్మ స్వతఃసత్యము కాబట్టి సత్యము సత్యముచే సాధ్యము. సత్యముగా నుండుటకు ప్రదేశ కాల వ్యక్తి భేదములు సహాయ మొసంగుట లేదు.

౫. అసత్యమునుండి విముక్తిసత్యమువలన; తపోపవాసాదులచే కానేరదు.

౬. సర్వదా సర్వులకు సత్యావలంబన మొకటియే మోక్షమార్గము. యుగభేదము, స్త్రీపురుష భేదము, వయోభేదము, ఆశ్రమభేదములచే మార్గాంతరము లేదు.

౭. సత్యావలంబనముచే మానవ సంతతి, రాజ్య యంత్ర, సంఘదాస్యములనుండి వెలువడి సర్వమానవైక్యకుటుంబము గ్రహించి దేవుడే రాజుగా పూర్ణానందమయు లగుదురు.

సత్యావలంబనము ప్రపంచశాంతి మార్గము.

సూర్యప్రకాశ,

ఓం

# శ్రీ నారద సనత్కుమార సంవాదము.

(శ్రీ ఛాందోగ్యోపనిషత్తునుండి)

(72-వ పుట శేషము.)

నారదుడు:—ఆకాశమునకు మించినదేదేని కలదా!

సనత్కుమారుడు.—కలదు.

నారదుడు.— దానిని నాకు వచింపుము.

సనత్కుమారుడు:—

'స్మరో వావాకాశాద్భూయస్తస్మాద్యద్యపి బహవ ఆసీన్నస్మ రన్తో నైవతే కఞ్చన శృణుయుర్న మన్వీరన్న విజానీరన్యదావావ స్మరేయురథ శృణుయురథ మన్వీరన్నథ విజానీరన్స్మరేణ వై పుత్రా న్విజానాతి స్మరేణ పశూన్స్మరముపాస్స్వేతి.'

తా॥ స్మరణ మాకాశముకంటె గొప్పది. స్మరణము (జ్ఞాపక ము చేసికొను తెలివి ) యున్నయెడలనే ఆకాశాదులు అనుభవింప డును. స్మరణములేనిచో ఉన్నదియు లేనిదానితో సమమేయగును స్మరణములేనియెడల ఆకాశాదుల నెఱుంగుటకు వలనుపడదు. మఱి యు (ఒకచోట అనేకులు గుమిగూడియుండగా స్మరణములేనిచో ఒకడు చెప్పెడిదానిని మఱియొకరు వినుటకు సాధ్యముకాదు. ఆలో చించుటకును, విశేషముగ నెఱుంగుటకున్ను సాధ్యముకాదు. స్మరణ ముచేతనే మనుజుడు తన పుత్ర పశ్వాదుల నెఱుంగుచున్నాడు. కావున స్మరణమునే బ్రహ్మముగ నుపాసింపుము.

'సయః స్మరం బ్రహ్మేత్యుపాస్తే యావత్స్మరస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి, యః స్మరం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవః స్మరాద్భూయ ఇతి స్మరాద్వావ భూయోఽస్తీతి తన్మేభగవన్బ్రవీత్వితి'

తా॥ స్మరణమును బ్రహ్మముగ నుపాసించువాడు, స్మరణము యొక్క ప్రభావము యెంతదనుక యుండునో, అంతదనుక తానుకో నట్లు యనుభవింపగలుఁను.

నారదుడు:—స్మరణముకంటె యధికమగునదెద్దేని కలదా?

సనత్కుమారుడు:—కలదు

నారదుడు:—నాకుదానిని జెప్పవేడెద.

సనత్కుమారుడు:—

'ఆశా వావ స్మరాద్భూయస్యాశేద్ధో వై స్మరోమన్త్రానధీతే కర్మాణి కురుతే పుత్రాంశ్చ పశూంశ్చేచ్ఛత ఇమం చ లోకమముం చేచ్ఛత ఆశాముపాస్స్వేతి.'

తా॥ స్మరణముకంటె ఆశ (లభింపనిదానియందలి యిచ్ఛ) యే గొప్పది. అట్టి ఆశచేత నుద్దీప్తమైన స్మరణముచేతనే మంత్రములను పఠించుచున్నాడు, కర్మలఁ జేయుచున్నాడు, పుత్రపశ్వాదుల నిచ్ఛగించుచున్నాడు, ఇహపరలోకముల వాంఛించుచున్నాడు. కావునట్టి ఆశనే నీవు బ్రహ్మముగ నుపాసింపుము.

'స య ఆశాం బ్రహ్మేత్యుపాస్త ఆశయాస్య సర్వే కామాః సమృధ్యన్త్యమోఘా హాస్యాశిషో భవన్తి యావదాశాయా గతం తత్రాస్య యథా కామచారో భవతి య ఆశాం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవ ఆశాయా భూయ ఇత్యాశాయా వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి.'

తా॥ ఆశను బ్రహ్మముగ నుపాసించువానికి సకలాభీష్టములు సిద్ధించును. వాని ప్రార్థనలన్నియు నెఱవేరును. ఆశయొక్క ప్రవృత్తి (గతి) యెంతవఱకుండునో అంతవఱకు నాతడు తాను కోరినవిధమున నెనర్పగల్గుచుండును (అనగా స్వేచ్ఛానుభవము గలియుండును).

నారదుడు:—ఆశకంటె గొప్పదేదైన కలదా?

సనత్కుమారుడు:—కలదు.

నారదుడు:—దానిని నాకు వచింపవేడెద.

సనత్కుమారుడు:—

'ప్రాణో వా ఆశాయా భూయాన్యథా వా అరా నాభౌసమర్పితా ఏవ మస్మిన్ప్రాణే సర్వం సమర్పితమ్. ప్రాణః ప్రాణేన యాతి ప్రాణః ప్రాణం దదాతి ప్రాణాయ దదాతి. ప్రాణోహ పితా ప్రాణో

మాతా ప్రాణో భ్రాతా ప్రాణః స్వసా ప్రాణ ఆచార్యః ప్రాణో బ్రాహ్మణః.'

తా॥ ఆశకంటె ప్రాణమధికమైనది (ఇట, ప్రాణమన ముఖ్య ప్రాణమని లేక దేహమందలి ప్రజ్ఞాత్మయనియు గ్రహించునది.) బండి చక్రముయొక్క నాభియందు ఆరము లెట్లు గ్రుచ్చబడియున్నవో అట్లే ప్రాణమునందు, ఆశాదులన్నియును స్థితిగల్గియున్నవి. ప్రాణము లేని యెడల ఆశ మొదలగునవి యెటనుండును. ప్రాణము స్వతంత్రమైనది. సమస్తమున్ను ప్రాణమే. తల్లి, తండ్రి ఆచార్యుఁడు మున్నగువారలందరును ప్రాణస్వరూపులే.

'ఏషతు వా అతి వదతి యః సత్యేనాతివదతి సోఽహం భగవః సత్యేనాతివదానీతి సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి సత్యం భగవో విజిజ్ఞాస ఇతి'

తా॥ ఇట్లు ప్రాణమునుగూర్చి తెలిసికొని వాఁడు పరమార్థసత్యమెఱింగినవాడగును. నామాదుల నపేక్షించినవాఁడుకాదు పరమార్థ సత్యము లేక ఆత్మవిజ్ఞానము నెఱింగి వచించువాఁడే అతివాది (శ్రేష్ఠమైన వస్తువును చెప్పెడివాడు బ్రహ్మవేత్త) యగును. అట్టి పరమార్థ సత్యమునే యెరుంగుటకు జిజ్ఞాస గలిగియుండవలెనని సనత్కుమారుఁడు జెప్పె, నేనా సత్యమునే తమవలన వినగోరెదనని నారదుఁడువచించెను.

'యదా వై విజానాత్యథ సత్యం వదతి నావి జానన్సత్యం వదతి విజానన్నేవ సత్యం వదతి విజ్ఞానం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి విజ్ఞానం భగవో విజిజ్ఞాస ఇతి!

తా॥ ఎపుడు సత్యమును విశేషరూపమున నెఱుంగునో (ఈప్రపంచమంతయు అసత్యమనియు సత్తు మాత్రమే సత్యమనియు తెలిసికొనునో) అపుడే మనుజుడద్దానిని వచింపగల్గుచున్నాడు. కావున విజ్ఞానమే ముఖ్యముగ నెఱుంగదగియున్నది.

నారదుఁడు:— నేనా విజ్ఞానమునుగూర్చి తెలిసికొనగోరెదను.

సనత్కుమారుఁడు:—

'యదా వై మనుతేఽథ విజానాతి నామత్వా విజానాతి మత్వైవ విజానాతి మతిస్త్వేవ విజిజ్ఞాసితవ్యేతి మతిం భగవో విజిజ్ఞాస ఇతి'

తా॥ ఎపుడు మననముచేయునో (చక్కగ నాలోచించునో) అపుడే విశేషరూపమున నెఱుంగ గల్గుచున్నాడు. మననము చేయ నిడే దేనిని తెలిసికొనుటలేదు. కాన మతినిగూర్చియే బాగుగ నెఱుంగుటకు జిజ్ఞాస గలిగియుండవలెను.

నారదుడు:— నేను మతిని తెలిసికొనగోరుచున్నాను.

సనత్కుమారుడు:—

'యదావై శ్రద్దధాత్యథ మనుతే నాశ్రద్ద ధన్మనుతే శ్రద్దధదేవ మనుతే శ్రద్ధా త్వేవ విజిజ్ఞాసితవ్యేతి. శ్రద్ధాంభగవో విజిజ్ఞాస ఇతి'.

తా॥ శ్రద్ధ (విశ్వాసము, ఆస్తికతయందభిలాష) గల్గియుండు నపుడే నేవిషయమునైనను మననముచేయును. శ్రద్ధలేనిచో మననము చేయుటయే సంభవింపదు. కాన శ్రద్ధయే బాగుగ నెఱుంగదగినది

నారదుడు:— నేనట్టి శ్రద్ధనే బాగుగ తెలిసికొనగోరుచున్నాను.

సనత్కుమారుడు:—

'యదా వై నిస్తిష్ఠత్యథ శ్రద్దధాతి నానిస్తిష్ఠఞ్ఛ్రద్దధాతి నిస్తిష్ఠన్నేవ శ్రద్దధాతి నిష్ఠా త్వేవ విజిజ్ఞాసితవ్యేతి నిష్ఠాం భగవో విజిజ్ఞాస ఇతి'.

తా॥ శ్రద్ధకు హేతువు నిష్ఠ (బ్రహ్మజ్ఞానార్థమైగురు సేవాదులు) నిష్ఠలేనిచో శ్రద్ధ కలుగదు. కాన నిష్ఠనుగూర్చి లెస్సగ నెఱుంగ వలయును.

నారదుడు:— నేనట్టి నిష్ఠనుగూర్చి తెలిసికొనగోరుచున్నాడను.

సనత్కుమారుడు:—

యదావై కరోత్యథ నిస్తిష్ఠతి నాకృత్వా నిస్తిష్ఠతి కృత్వైవ నిస్తిష్ఠతి కృతిస్త్వేవ విజిజ్ఞాసితవ్యేతి కృతిం భగవో విజిజ్ఞాస ఇతి.'

తా॥ ఎపుడు కృతి (ఇంద్రియ సంయమము, చిత్తైకాగ్రత) అపుడే నిష్ఠ సంభవమగుచున్నది. లేనిచో కాదు. ఇక్కారణమున కృతిని కూర్చి బాగుగ నెఱుంగవలెను.

నారదుడు:— నేను కృతి నెఱుంగగోరెదను.

సనత్కుమారుడు:—

'యదావై సుఖం లభతేఽథ కరోతి నాసుఖం లబ్ధ్వా కరోతి సుఖ మేవ లబ్ధ్వాకరోతి సుఖం త్వేవ విజిజ్ఞాసిత వ్యమితి. సుఖం భగవోవిజిజ్ఞాస ఇతి.'

తా॥ సుఖము కొఱకు కృతి చేయబడుచున్నది. సుఖమును బొందవలెనని యెపుడు కోరుచున్నాడో అపుడే క్రియయొనర్చును. ఏసుఖమును గోరక యెవఁడు నేకార్యముఁ జేయడు.

నారదుడు:—నేనాసుఖమును గూర్చి విశేషముగ తెలిసికొన గోరుచున్నాను.

సనత్కుమారుడు:—

'యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవ సుఖం భూమా త్వేవ విజిజ్ఞాసితవ్య ఇతి భూమానం భగవో విజిజ్ఞాస ఇతి'

తా॥ నిక్కముగ 'భూమా' మహత్తరమైనది! (నిరతిశయమైనది) ఏ సుఖము, ఆనందము, బ్రహ్మము, (ఆత్మ) గాని అల్పమునందు సుఖములేదు. అట్టి ఆత్మసుఖమే గొప్పది. కాన 'భూమా' యను దానినే తెలిసికొనవలెను.

నారదుడు:—నేనా 'భూమా' యనుదానినే యెఱుంగగోరెదను.

## సనత్కుమారుడు నారదునకు "భూమా"విద్య నుపదేశించుట.

సనత్కుమారుడు:—

'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమాథ యత్రాన్యత్ప శ్యత్యన్య చ్ఛృణోత్యన్య ద్విజానాతి తదల్పం యో వై భూమా తదమృతమథ యదల్పం తన్మర్త్యమ్. స భగవః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని యది వా న మహిమ్నీతి'

తా॥ ఎచట తనకంటె వేఱైనది కనంబడుటలేదో, వినంబడుటలేదో, తెలియంబడుటలేదో అదియే భూమా. ఎచట తనకంటె వేఱైనది చూడబడుచున్నదో, వినబడుచున్నదో, తెలియబడుచున్నదో, అది అల్పము. భూమా నాశరహితమైనది. అల్పమైనది నాశముకలదు.

నారదుడు:—ఆ భూమా దేనియందు ప్రతిష్ఠితమైయున్నది ?
సనత్కుమారుడు:—తన; మహిమయందే. తన మహిమయందును గాదు (అనగా దేనిపైనను ఆధారపడినది కాదని భావము).

'స ఏవాధస్తాత్స ఉపరిష్టాత్స పశ్చాత్స పురస్తాత్స దక్షిణతః స ఉత్తరతః స ఏవేదం సర్వమిత్యథాతోఽహంకారాదేశ ఏవాహమే వాధస్తాదహముపరిష్టాదహం పశ్చాదహం పురస్తాదహం దక్షిణతోఽహ ముత్తరతోఽహమేవేదం సర్వమితి'

తా॥ ఆ భూమా, క్రిందను, పైనను, వెనుకను, ముందును, ప్రక్కలను, అంతట నిండియున్నది. ఈ కనంబడు ప్రపంచమంతయు నదియే. అదియే నేను. కాన నేనే సర్వత్రవ్యాపించియున్నాను.

'అథాత ఆత్మాదేశ ఏవ ఆత్మైవాధస్తాదాత్మోపరిష్టాదాత్మా పశ్చాదాత్మా పురస్తాదాత్మా దక్షిణత ఆత్మోత్తరత ఆత్మైవేదం సర్వ మితి. స వా ఏష ఏవం పశ్యన్నేవం మన్వాన ఏవం విజానన్నాత్మరతి రాత్మ క్రీడ ఆత్మ మిథున ఆత్మానన్దః స స్వరాడ్భవతి. తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి. అథయేఽన్యథాతో విదురన్యరాజానస్తే క్షయ్యలోకా భవన్తి తేషాం సర్వేషు లోకేష్వకామచారో భవన్తి!

తా॥ ఇపుడాత్మరూపమున నా భూమా పదార్థమే వర్ణింపబడు చున్నది. ఆ'భూమ'యే ఆత్మ. కాన ఆత్మయే క్రిందను, పైనను, నలు వైపులను గూడ వ్యాపించి నిండి నిబిడీకృతమైయున్నది. అంతయు ఆత్మయే ఇవ్విధమున మననము చేయువాడును, మఱియు నాత్మను గూర్చి యిట్లు విశేషముగ నెఱుంగువాడును సదా ఆత్మయందే క్రీడించుచుండును. అనగా ఆత్మ తనయందే యున్నదని గ్రహించి ఆత్మా నంద మొందుచుండును. అట్టివాడే స్వారాట్ యనఁబడును అనగా స్వారాజ్యపదమున నభిషిక్తుఁడగును. మఱియు నాతడు సర్వలోకము లందును తన యిష్టప్రకారము వర్తించుచుండును. అట్లుగాక యెవఁడు ఆత్మను మఱియొకవిధముగ నెఱుంగునో అట్టి యవిద్వాంసుడు స్వారాట్ కానివాడై యితర రాజునకు లోబడినవాడగును. మఱియు నటివాడు క్షయించు లోకములనే బొందును. సకలలోకములందును యథేచ్ఛగ సంచరించుటకు వానికి సాధ్యము కాదు.

తస్యహవా ఏతస్యైవం పశ్యత ఏవం మన్వానస్యైవం విజానత ఆత్మతః ప్రాణ ఆత్మత ఆశాత్మఃత స్మర ఆత్మత ఆకాశ ఆత్మతస్తేజ ఆత్మత ఆప ఆత్మత ఆవిర్భావతిరోభావా వాత్మతో౽న్నమాత్మతో బలమాత్మతో ధ్యానమాత్మతశ్చిత్తమాత్మతః సఙ్కల్ప ఆత్మతో మన ఆత్మతో వాగాత్మతో నామాత్మతో మన్త్రా ఆత్మతః కర్మాణ్యాత్మత ఏవేదంసర్వమితి.

తా॥ ఇవ్విధమున ఆత్మస్వరూపమును లెస్సగ చింతన జేసి యెఱుంగువానికి ప్రాణాది సమస్తమున్ను ఆత్మస్వరూపముగనే ను డును. అనగా ప్రాణము, ఆశ, స్మృతి, ఆకాశము, తేజము, జలము, ఆవిర్భావతిరోభావములు, అన్నము, బలము, విజ్ఞానము, ధ్యానము, చిత్తము, సంకల్పము, మనస్సు, వాక్కు, నామము, మంత్రము, కర్మ మున్నగునవన్నియు ఆత్మనుండియే కలిగినవని వానికి తోచును.

ఇట్లాత్మ స్వరూపము నెఱుంగువానికి గలుగుఫలమును వివరించు చున్నారు.

'తదేష శ్లోకో నపశ్యోమృత్యుం పశ్యతి న రోగం నోతదుఃఖ తాం సర్వం హపశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశ ఇతి సఏకధా భవతి త్రిధా భవతి పఞ్చధా సప్తధా నవధా చైవపునశ్చైకాదశః స్మృతః శతం చ దశ చైకశ్చ సహస్రాణి చ వింశతిరాహారశుద్ధౌ సత్త్వ శుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః స్మృతి లాభే సర్వగ్రన్థీనాం విప్రమోక్షస్తస్మై మృదితకషాయాయ తమ సస్పారం దర్శయతి భగవాన్సనత్కుమారస్తం స్కన్ద ఇత్యాచక్షతే తం స్కన్ద ఇత్యాచక్షతే.'

తా॥ ఇట్లాత్మను తెలిసికొనినవాడు మృత్యువును జూడడు రోగమునొందడు. దుఃఖమునొందడు. సర్వమును ఆత్మగనే చూచుచు కొన సమస్తమును పొందుచున్నాడు. అనేక రూపములయగుచు న్నాడు. (సృష్టికి పూర్వమాతడే యేక (బ్రహ్మ) రూపమున నుండుచు సృష్టియందు పలురూపముల బడయుచు, మఱల లయకాలమున తన పారమార్థిక స్వరూపమునే బొందుచున్నాడు).

[ఇపుడీ యాత్మవిద్య సమ్యక్ రీతి సిద్ధించుటకు వలయుసాధనను చెప్పుచున్నారు.] ఆహారశుద్ధి (రాగద్వేషమోహాది దోషములచే స్పృశింపబడని విషయవిజ్ఞానము) యైనచో అంతఃకరణశుద్ధి కలుగును. అంతఃకరణ శుద్ధియైనచో నిశ్చలమగు స్మృతికలుగును. అట్టి నిశ్చల స్మృతి (ఆత్మజ్ఞానము) గలిగినచో సమస్తగ్రంథులును తెగిపోవుచున్నవి. ఇట్లు వాసనలు క్షయించి, రాగద్వేషాది రహితుడైన నారదునకు భగవంతుడగు సనత్కుమారుడు అజ్ఞానాంధకార నివృత్తిని భోధించెను. ఆసనత్కుమార దేవునే పెద్దలు 'స్కందుడనుచున్నారు.'

హరిః ఓం తత్ సత్.

# పుణ్యుని యుపదేశము.

## (శ్రీ యోగవాసిష్ఠము నుండి)

[పుణ్యపావనులను యిరువురు బ్రాహ్మణపుత్రులు పూర్వము గంగాతీరమున మాతాపితృల సహితముగ వసించుచుండిరి. కొంత కాలమునకు వృద్ధులగు తల్లిదండ్రులు మరణింప పావనుఁడతి శోకాకులుఁడయ్యె. తనసోదరుఁడు దుఃఖించు చుండుటఁగాంచి ఆత్మజ్ఞుడగు పుణ్యుడు వానికి ఆత్మతత్వప్రబోధముగావించి, దుఃఖమును దూరీకృత మొనర్చిన విధము యిట తెలుపబడినది.]

పుణ్య ఉవాచ:—

కింపుత్ర ఘనతాం శోకం న యస్యాంధ్యైక కారణమ్
బాష్పధారాధరం ఘోరం ప్రావృట్ కాలఇవాంబుజమ్.

పుణ్యుడు పావనునితో నిట్లనియె:—సోదరా! వర్షాకాలమున జలధారలతో కూడియున్న పద్మములవంటి నేత్రములుగల్గి, బాష్పముల రాల్చుచు, అజ్ఞానవశమున యేల యిట్లు మిగుల ఖిన్నుడవగుచున్నావు?

పితాతవ మహాప్రాజ్ఞ గతః సార్థం త్వదంబయా
స్వామేవ పరమాత్మాత్మ్య పదవీం మోక్షనామికామ్.

మహాప్రాజ్ఞుఁడవగు నోపావనుడా! నీ తల్లిదండ్రులిపుడు మో[illegible]
పదము నొందియున్నారని యెఱుంగుము.

తత్స్థానం సర్వ జంతూనాం తద్రూపం విజితాత్మనామ్
స్వభావమభిసంపన్నే కింపితర్యను శోచసి.

బ్రహ్మమే సర్వజీవులకును నిలయము. అదియే బ్రహ్మవేత్త
స్వరూపము. నీ మాతాపితృలు స్వస్వరూపముఁ జెంద యిక దుఃఖమేల

ఈ దృశీతుత్వయాబద్ధా భావనేహా విమోహజా
సంసారే య దశోచ్యోపి త్వయాతాతోన శోచ్యతే.

'ఈతడు నాతండ్రి, ఈపె నాతల్లి' యను భావన అజ్ఞానము
చేతనే నీకుదయించినది. ఈ ప్రపంచమున శోకింపఁదగని విషయము
నీవు వ్యర్థముగ శోకించుచున్నావు.

నసైవ భవతో మాతా నాసావేవ పితాతవ
న భవానేష తనయ స్తంయోర్నిః సంఖ్యపుత్రియోః.

నీ తల్లిదండ్రులు వీరుమాత్రమే గాదు. మఱియు అసంఖ్యా
ములగు పుత్రులుగల వీరలకు నీవొకడవు మాత్రమే పుత్రుడవు గా[illegible]

మాతాపితృ సహస్రాణి సమతీతాని తేసుత
బహూన్యంబు ప్రవాహస్య నిమ్నానీవవనే వనే.

సోదరా! వనములందు జలప్రవాహమనేక నిమ్నప్రదేశము
(మడుగులు) గల్గియుండునట్లు నీవును యెందఱో మాతాపితృల
యున్నావు.

అస్మ త్పిత్రోరతీతాని పుత్రలక్షాణ్యనేకశః
పత్ర కోరక వృంతాని లతావిటపయోరివ

లతావృక్షములందు పత్రాదులవలె మన తల్లిదండ్రుల
కో లక్షలమంది పుత్రులనేక పర్యాయములు గడచియుండిరి.

మిత్ర బాంధవ వృందాని జంతోర్జన్మని జన్మని
ఋతావృతావతీతాని ఫలానీవ మహాతరోః.



గొప్ప వృక్షమునకు ఋతుఋతువునకనేక ఫలములు[illegible]

ముగునట్లు, ప్రతిజన్మమందును జీవునకనేక మిత్రబాంధవులు సమ్పన్న మగుదురు.

శోచనీయాయదిస్నేహా న్మాతాపితృ సుతాఃసుత
తదతీతాన శోచ్యంతే కిమజస్రం సహస్రశః.

సోదరా! ప్రేమకారణమున మాతాపితృసుతాదులు శోకింప దగినవారనిన, యిప్పటికనేక పర్యాయములు గతించిన మాతాపితృ సుతాదుల కొఱకేల దుఃఖించుట లేదు?

ప్రపంచోఽయం మహాభాగ దృశ్యతే జాగతే భ్రమే
పరమార్థేన తేప్రాజ్ఞా నాస్తిమిత్రం న బాంధవాః.

ఓ మహాశయా! జగత్కల్పనా హేతువగు అజ్ఞానమువలననే యీ జగత్తు గాన్పించుచున్నది. యథార్థముగ నీకు మిత్రులుగాని బంధువులుగాని లేరు.

ననాశఇవహిభ్రాతః పరమార్థేన విద్యతే
మహత్యపి చిరాతప్తే మరావివ పయోలవాః.

ఓ సోదరా! చిరకాల మతి సంతప్తమగు మరు భూమియందు లేశ మాత్రమైన జలముండనట్లు పరమార్థ దృష్టియందాత్మయందు (బ్రహ్మమున) నాశ మేమియును లేదు.

దృష్ట్వాతు పారమార్థిక్యా పుత్రసత్యం విచారయ
నైవత్వంనవయంచైవ భ్రాంతిమంతఃపరిత్యజ.

పరమార్థ దృష్టిచే నీవు సత్యమును విచారింపుము. యథార్థముగ నీవుగాని, నేనుగాని లేనివారమే యగుదుము. కాన 'నీవునేన'ను భేదపూర్వకమగు భ్రమను మనంబునుండి పారదోలుము.

ఏతాయాః ప్రేక్ష సే లక్ష్మీశ్ఛత్రచామర చంచలాః
స్వప్నఏవమహా బుద్ధే దినాన్త్రీణి పంచవా.

ఓ ధీవర్యా! ఛత్రచామరాది యుక్తమగు యీరాజ్యాది విభవములన్నియు స్వప్న తుల్యములేయగును. అయ్యవి మూడు నాల్గు దినములు (అల్పకాలము) మాత్రమేయుండునని యెఱుంగుము.

అయంగతోఽ మృతశ్చాయమితి దుర్దృష్టయః పురః
స్వసంకల్పోపపాత్రోత్తా దృశ్యం తేనతు సత్యతః.

ఇది నశించినది, వీడు మరణించెను ఇత్యాది యసత్య భావన లన్నియు స్వసంకల్పము చేతనే యావిర్భవించుచు సమ్ముఖమున గోచ రించుచున్నవి. యథార్థముగ నియ్యవిసత్యములు గావు.

అజ్ఞాన విస్తీర్ణ మరౌవిలోలం
శుభాశుభస్యందమయైస్తరంగైః
స్వవాసనానామ మరీచివారి
పరిస్ఫురత్యేతదనంతరూపమ్.

అజ్ఞానమను తాపముచే నాచ్ఛన్నమగు ఆత్మయను మరుస్థల మున శుభాశుభ కర్మలను చంచల తరంగములతో కూడిన వాసనా రూపమగు మృగతృష్ణా జలమే ఈయనంత సంసార రూపమున ప స్ఫురించుచున్నది.

కఃపితాకించవా మిత్రం కామాతా కేచ బాంధవాః
స్వబుద్ధ్యైవావ ఘూయంతే వాత్యయాజన పాంసవః.

తండ్రియెవరు, మిత్రుడెవడు, తల్లియెవరు బంధువులెవరు గో వాయువుచే ధూళి సముత్పన్నమగునటుల, వీరందరును స్వభ్రాంతివలన కల్పింపబడినవారే యగుదురు.

బంధుమిత్రసుతస్నేహ ద్వేషమోహదశామయః
స్వసంజ్ఞామాత్ర కేనైవ ప్రపంచోయంవితన్యతే.

బంధుమిత్ర పుత్రాదిసహితమును, రాగద్వేష మోహమయ దశాయుక్తమునునగు యీప్రపంచమును ఆత్మ స్వసంకేత మాత్రము ననే విస్తరించుచున్నది.

బంధుత్వే భావితోబంధుః పరత్వే భావితః పరః
విషామృతదశేవేహ స్థితిర్భావ నిబంధినీ.

మనుజుడు బంధుత్వము, గూర్చిన దృఢభావనచే బంధువును శత్రుత్వమును గూర్చిన దృఢ భావనచే శత్రువును అగుచున్నా అమృత భావనచే విషమమృతమును, విషభావనచే అమృతము వి ముగను యగుచున్న యీప్రపంచస్థితి నేవలము భావాధీనమైయున్నది

ఏకత్వేవిద్యమానస్య సర్వగస్య కిలాత్మనః
అయం బంధుః పరశ్చాయ మిత్యసౌ కలనా కుతః.

సమస్త దేహములందును యభిన్నరూపమున నొకేయాత్మ సర్వవ్యాపకుడై వెలుగుచుండ నిక యీతడు బంధువు, యీతడు మిత్రుడను భేదకల్పనయెచట?

రక్తమాంసాస్థి సంఘాతా ద్దేహాద్దేవాస్తి పంజరాత్
కోహంస్యామితిచిత్తేన స్వయంపుత్ర విచారయ.

రక్తమాంసాదుల సంఘాతమగు యీదేహ పంజరముకంటె అన్యమగు చైతన్యమును గూర్చి స్వచిత్తముచే విచారించుము. మఱియు 'నాయొక్క యథార్థస్వరూపమేమి'యని చింతనచేయుము.

దృష్ట్యాతు పారమార్థిక్యా నకశ్చిత్త్వ నవాస్మ్యహమ్
మిథ్యా జ్ఞాన మిదంపుణ్యః పావనశ్చేతి వల్గతి.

పరమార్థ దృష్టియందు పావనుడని వ్యవహరింపబడు నీవును, పుణ్యుడని వ్యవహరింపబడు నేనును లేనివారమే యగుదుము. మిథ్యాజ్ఞాన వశముననే దేహమందాత్మాభి మానముగల్గుచున్నది.

కస్తే పితాకశ్చ సుహృత్కా మాతా కశ్చవాపరః
ఖస్యానంత విలాసస్య కిమస్వం కింస్వ ముచ్యతామ్.

శరీరదృష్టితో పరికించిన (దేహము నశ్వరమగుటచే) నీ తండ్రియెవరు, మిత్రుడెవడు, తల్లియెవరు, శత్రువెవడు? ఇక దేహాద్యుపాధి భిన్నమగు శుద్ధచైతన్య దృష్టియందు అనంత చిదాకాశమున స్వకీయ పరకీయము లేచట?

అసి చేత్త్వం తదన్యేషు యాతేషు బహుజన్మసు
యే బంధవో యే విభవాః కింతానపినశోచసి.

ఇక లింగశరీర దృష్టియందు బంధు మిత్రాదివ్యవహారము కలదు గదాయనిన, గడచిన జన్మలందలి బంధు విభవాదుల కొఱకేల పరితపించుట లేదు?

బభూవువస్తేసు సుపుష్పాసు స్థలీషు మృగయోనిషు
బహవోబంధవోమార్గా స్తాన్కథం నానుశోచసి.

పుష్పయుక్తమగు వనస్థలీదేశములందనేక మృగయోనులందు

జన్మించితివి. వారందఱు నీ బంధువులే కదా! అట్టిచో వారలకై యేల దుఃఖించుట లేదు?

బభూవుస్తే మహాశైలేషు శిఖరేషు మహీభృతామ్.
బహవో బాంధవాః సింహాస్తాన్కథం నానుశోచసి.

ఏశాలపర్వతముల అత్యున్నత శిఖరములపై అనేక సింహములు నీబంధువులై యున్నారు. వారందఱి కొఱకేల వ్యథఁజెందుట లేదు?

కోసలేషు ద్విజో భూత్వా భూత్వా వంగేషు తిత్తిరిః
అశ్వో భూత్వా తుషారేషు జాతస్త్వం బ్రాహ్మణోధ్వరే.

నీవు పూర్వము కోసలదేశమందు బ్రాహ్మణుఁడవుగను, వంగదేశమందు తిత్తిరిపక్షిగను, తుషార దేశమందొక బ్రాహ్మణునియింట గుఱ్ఱముగను జన్మించియుంటివి.

ఇత్థంతవాత్మనశ్చైవ ప్రాక్తనంవాసనా క్రమమ్
పశ్యామి సూక్ష్మయాబుధ్యా సమ్యగ్దర్శనశుద్ధయా.

ఇవ్విధమున నీయొక్కయు నాయొక్కయు వాసనాక్రమమును సమ్యగ్దర్శనముచే విశుద్ధమైన సూక్ష్మబుద్ధిచే నేను పరికించుచున్నాను.

మమాపి బహ్వ్యోబహుధా యోనయో మోహమంథరాః
సమతీతాః స్మరామ్యద్య తాజ్ఞానోదితయాదృశా.

నేనున్ను అజ్ఞానముతోఁగూడిన నాపూర్వపు వివిధజన్మలను జ్ఞానోదిత దివ్యదృష్టిచే యిపుడు సంస్మరించుచున్నాను.

ఏవంస్థితేజగజ్జాతా బాంధవాః శతశోగతాః
పితరోమాతరశ్చైవ భ్రాతరః సుహృదస్తథా.
కాంస్తాన్సమనుశోచామోన శోచావశ్చకానపి
బంధూనిహాతిశోచావ ఈదృశ్యేవ జగద్గతిః.

దీనినిబట్టి యీ జగంబున యెందరో బంధుమిత్రాదులు, మాతాపితరలు మనకు గతించియున్నారని స్పష్టమగుచున్నది. అట్లైన యాబంధువులలో యెవరినిగూర్చి శోకించెదము, యెవరినిగూర్చి శోకింపకుందుము? సోదరా! జగద్గతి యిట్టిదేయగు యెఱుంగుము.

కిం ప్రమాణమతః పుత్ర దుఃఖస్యాత్రసుఖస్యచ
తస్మాత్సర్వంపరిత్యజ్య తిష్ఠావః స్వచ్ఛతాంగతౌ.

సోదరా! ఈ ప్రపంచమున దుఃఖమునకుగాని సుఖమునకుగాని యంతమెచట? కాన సమస్త దుఃఖములవీడి దృశ్యమాత్రమంతను పరిత్యజించి ప్రశాంతచిత్తులమై యుండెదముగాక:

ప్రపంచభావనాంత్యక్త్వా మనస్యహమితిస్థితామ్
తాంగతింగచ్ఛభద్రం తే యాంయాంతిగతికోవిదాః.

మనంబున యహంకార రూపముననున్న ప్రపంచభావనసుత్యజించి ఆత్మజ్ఞానుల యుత్తమగతి ననుకరింపుము. అట్టిచో నీకు శ్రేయమే గల్గును.

ఇహాజవం జవీభావం పతనోత్పననాత్మకమ్
నశోచంతి సుధియశ్చిరంనల్గంతి కేవలమ్.

ఈ ప్రపంచమున ఊర్ధ్వాధోగమన రూపమగు చక్రభ్రమణము నిరంతరము కొనసాగుచునేయున్నది. ధీమంతులద్దానినిగూర్చి చింతింపక నిరభిమానులై ప్రాప్తించిన వ్యవహారములఁ జేయుచుందురు.

భావాభావవినిర్ముక్తం జరామరణవర్జితమ్
సంస్మరాత్మానమవ్యగ్రో మావిమూఢమనాభవ.

సోదరా! భావాభావ వివర్జితమును, జరామరణ రహితమునగు ఆత్మనుగూర్చి సావధానుఁడవై చింతనజేయుము. మూఢచిత్తుఁడవుగాకుము.

నతేదుఃఖంన తేజన్మ నతేమాతాన తేపితా
ఆత్మైవాసి నసద్బుద్ధే త్వమన్యఃకశ్చిదేవహి.

సద్బుద్ధివగు నోసోదరా! యథార్థముగ నీకు తండ్రిగాని తల్లిగాని సుఖముగాని దుఃఖముగాని, లేవు. జన్మయున్నూ లేదు. నీవు పరిశుద్ధమగు ఆత్మస్వరూపుఁడవేగాని అన్యమగు దేహాదులుగావు.

అస్యాం సంసారయాత్రాయాం నానాభినయదాయినః
అజ్ఞాఏవ నరాఃసాధురసభావసమన్వితాః.

ఈ సంసారయాత్రయందు, వివిధచేష్టల నొనుర్చుచు అజ్ఞులు దృశ్యవిషయములం దే సాధు ... [illegible]

మధ్యస్థ దృష్టయః స్వస్థాయథా ప్రాప్తార్థదర్శినః
తజ్జ్ఞాస్తు ప్రేక్షకా ఏవ సాక్షిధర్మే వ్యవస్థితాః

కాని తత్వజ్ఞానులుదాసీనులై, ప్రాప్తించిన వాటినే యెఱ్ఱుచు, ప్రేక్షకునివలె వర్తించుచు సాక్షిమాత్రులై యుందురు.

కర్తారోపి నకర్తారో యథాదీపానిశాగమే
ఆలోకకర్మాణామేవం తజ్జ్ఞాలోకస్థితావిహ.

రాత్రియందు దీపము తన సన్నిధానమాత్రముచే ప్రకాశక్రియ నొనర్చుచు వస్తువులచే నంటక యుండువట్లు నజ్ఞానులు వ్యవహారములాచరించినను, అభిమాన రహితలగుటచే అకర్తలై ప్రపంచము మెలఁగుచుందురు.

సర్వైషణామయ కలంక వివర్జితేన
స్వస్థాత్మభావ కలితేనహృదబ్జమధ్యే
పుత్రాత్మ నాత్మనిమహామునినాముసైవ
సంత్య జ్యసంభ్రమ మలంపరితోష మేహి.

సోదరా! కోర్కెలను కళంకమును పూర్ణముగ విడనాడి, మహాముని వై హృదయకమలమధ్యమున స్థిరరూపమున ప్రతిష్ఠితమైయున్న ఆత్మను సాక్షాత్కరించుకొని, అట్టి ఆత్మభావముచే సంసార భ్రమను త్యజించి, ఆత్మయందే సంతుష్టిని బడయుము.

ఓం తత్ సత్.

---

# యథార్థభారతి

సంపుటము 13. | ప్రమాది సం॥రం ఆషాఢమాసం జూలై నెల 1939. | సంచిక 5.




(పత్రిక విలాసము:—శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

...భూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి
...మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

Printed by R. Krish[illegible] Singh, at the Dt. Printing Works, Chittoor.
Published by K. Venkatachalam Naidu, Seetharama Indian Stores, Chittoor.

1. బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి
2. శ్రీ వివేకానంద లేఖావళి (అనువాదకులు శ్రీ తత్వానంద స్వాములవారు)
3. శ్రీ భగవద్గీతాఫలస్తుతి (శ్రీ కంఠశివాచార్యులవారి గీతాభాష్యమునుండి.)
4. శ్రీమద్భాగవతసారము
5. శ్రీమన స్తత్వము (శ్రీ మలయాళస్వాములవారు)
6. శ్రీభగవద్గీతాధ్యాయములు 10-వ. అ. (శ్రీమలయాళస్వాములవారు.)
7. శ్రీపరబ్రహ్మోపాసన (సాయం పాపయ్యగారు)
8. జీవితలక్ష్యము (శ్రీ మతుకుమల్లి వెంకటలక్ష్మీనరసింహరావుగారు)

## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమంద్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, యేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమంద్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కతారి. వెంకటసుబ్బరాజుగారు—చిననింద్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, ఆడ్రా."

5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్‌పూర్

# యథార్థభారతి

| | | |
|---|---|---|
| సంపుటం 13 | ప్రమాది సంవత్సరం | చందా |
| సంచిక 5 | ఆషాఢమాసం | సం॥రం రు 2-4-0 |
| | 1939 సం॥రం జూలై నెల | విడిపత్రిక రు 0-4-0 |


ఓం

## బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి.

—:o:—

19. అసంగోహం చిదాత్మాహమితి ప్రత్యగాత్మని నివేశితే వృత్తిరహితే సంస్కారభేదమాత్రతయా సూక్ష్మరూపేణావస్థితే చిత్తే ఆత్మనః స్వరూపభూతపరమానన్దో నిరన్తరం సమ్యగావిర్భూయాత్.

తా॥ నేను అసంగుడను, నేను చిదాత్మ, అనెడి ప్రత్యగాత్మ యందుంపఁబడిన, వృత్తిరహిత సంస్కారభేదమాత్రముగను, సూక్ష్మ స్వరూపముగను, నెలకొనియుండు చిత్తమునందు ఆత్మయొక్క స్వరూపభూతమైన పరమానందము నిరంతరమును చక్కఁగా ప్రకాశించును గాక!

ఆవిర్భావము = మొదట తెలియఁగూడనిదై మఱుఁగైయున్న ఒక వస్తువు తర్వాత తెలియబడుట.

20. అహమాత్మా సాక్షీ కేవల చిన్మాత్రస్వరూపో నాజ్ఞానం తత్కార్యం చ కింతు నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య పరమానన్దాద్వయం బ్రహ్మైవాహమస్మీత్యభేదేనావస్థాన స్సమాధిరన్తస్సమాధినా దృగ్దృశ్యవివేకే బహిఃసమాధినా బ్రహ్మసర్గవివేకే చ దృఢేజ్ఞాతే తేన వివేకద్వయేనాయం విగాహిత దేహాభిమానో విజ్ఞాత మాత్మతత్త్వశ్చ సదా భూయాత్.

తా॥ నేనుఆత్మ, నేనుసాక్షి, నేను కేవలచిన్మాత్రుడను, అజ్ఞా
మును, దానికార్యమును (నాకు) లేదు. మఱియు నిత్యమై, శుద్ధమై,
బుద్ధమై ముక్తమై, పరమానన్దాఽద్వయ పరబ్రహ్మమై నేనున్నాడను;
అనెడి అభేదముగా (మనస్సు) నెలకొనుట సమాధి. ఆంతరసమాధిచే
దృగ్దృశ్యవివేకమును, బాహ్యసమాధిచేత బ్రహ్మసర్గవివేకమును
దృఢముగాఁ దెలియబడినప్పుడు, ఆ రెండు వివేకములచేతను వీఁడు దేహా
భిమానము లేనివాడుగను, ఆత్మతత్త్వమును దెలిసికొనినవాడుగను
నిరంతరముండునుగాక !

---

# శ్రీ వివేకానంద లేఖావళి.

(అనువాదకులు:— శ్రీ తత్త్వానంద స్వాములవారు)

541 డియర్బారన్ ఎవెన్యూ
చికాగో 3—3—1894

ప్రియమైన :—

విశ్వాసమునకు అద్భుతమగు సూక్ష్మపరిజ్ఞాన మమరియున్న
ననియు, మఱియు అయ్యదియే తరణోపాయమనియు నేనును ఒప్పు
కొందును; కాని పురోవృద్ధిని అరిగట్టి మూర్ఖావేశమునుగూడ కల్పిం
చేయగల అపాయము సయితము దానియందు గలదు.

జ్ఞానము మంచిదే. అయినను అది నిస్సారమగు బుద్ధిచా
త్కృతిగాఁ పరిణమించుననుభయము దీనియందు గలదు. భక్తి శ్రే
ష్ఠమైనదే. కాని అది అర్థశూన్యమగు భావోద్రేకమున మునిఁగి శోషిం
సమయగలదు. ఈ అన్నింటికి సామరస్యమును గూర్చు మూ
మనకు కావలయును. అట్టి సమరసమూర్తి శ్రీ రామకృష్ణునివ
వారిఁబోలు మహనీయులు కాగల్గుట దుర్లభము. అయినను శ్రీ
వారిని, వారి సద్బోధలను ఆదర్శముగ బెట్టుకొని మనము
సాగించ వచ్చును. మనలోని ప్రతివ్యక్తియు శ్రీవారివంటి పూర్ణ
షుడుగ ఉత్తీర్ణుడు కాజాలకపోయినను, ఒండొరుల మందలించుకొను
సఖ్యత ... ఒకరి లోపము

లను ఒకరు సవరించుకొనుచు, సమష్టి బలముతో గమ్యార్థమును సాధింపవచ్చును. అనేకులు చేరి కూర్చు సమరసఫలమై ఆ గమ్యార్థము వెలయగలదు. అది ఇతరములగు అన్ని మతములకన్నను ఆచార వ్యవహారములకన్నను తప్పక శ్రేష్టతరమై యొప్పగలదు.

ఏ మతముగాని సమర్థమైనదిగ నుండుటకు దానియందు ఉత్సాహశక్తి ప్రబలముగనుండుట అవసరము. సరేగాని మనమూలమున పరస్పరను ద్వేషించుకొనుచుండు సంప్రదాయములు పెరుగకుండ చూడవలయును. పాక్షికాభిమానములేని మార్గమును అవలంబించుచో మనము ఆ అపాయమునుండి తప్పించుకోగల్గుదుము. విశిష్ట సంప్రదాయముయొక్క సుగుణములనన్నటిని నిలుపుకొనుచుండియు విశ్వశరణ్యమతమంత విశాలత గలిగి, పాక్షిక సంప్రదాయపరులము కాకుండ మనము వర్తింపవలయును.

భగవంతుడు సర్వవ్యాపియే యైనను మానవస్వభావమునందు, మానవస్వభావము ద్వారమున నే మనకాయన ప్రత్యక్షము కాగలడు. శ్రీ రామకృష్ణునివంటి పూర్ణపురుషుడుగ మతేవ్యక్తియు కాన్పించుట లేదు. శ్రీవారిని లక్ష్యము నందిడుకొని, మన మండలమును వారిని పరివేష్టింతముగాక ! అయినను ప్రతివాడును తన యిచ్ఛానుసారముగ తన అనుభూతి ననుసరించి శ్రీవారిని తన దైవముగనో, రక్షకుడుగనో, గురువుగనో, ఆదర్శమూర్తిగనో లేక మహానుభావుడుగనో భావనచేసికొనవచ్చును.

మనము సాంఘికముగ సమత్వమునుగాని, భిన్నత్వమునుగాని ప్రచారము చేయబోము; కాని ప్రతివానికిని సమానార్హత కలదందుము ప్రతివానికిని భావస్వాతంత్ర్యమును, సర్వవిధముల క్రియాస్వాతంత్ర్యమును ఉండవలయునని గట్టిగ ప్రతిపాదింతుముగాక!

ఆస్తికుని గాని, ప్రకృతి ఉపాసకునిగాని, అద్వైతినిగాని, బహుదేవతారాధకునిగాని, అజ్ఞేయవాదిని గాని, నాస్తిక సిద్ధాంతావలంబునిగాని, ఎవ్వనినిగాని మనము త్రోసిపుచ్చబోము. విశాలమును మఱియు గంభీరమునునగు శీలమును నిర్మాణముచేసికొను

దీక్ష యొక్కటే మనము విధిగా నిర్ణయించు శిష్యలక్షణము. పర హింసాకరముగ నుండరాదనుట తప్ప, ఏ ఆచారమునుగాని, మర్యాదను గాని, వర్తనమునుగాని, భోజనపానీయ మర్యాదలనుగాని, యేదో ఒక ప్రత్యేకవిధముగ నుండవలయునని శాసింపము.

ఎయ్యది పురోగమనమునకు అడ్డు దగులునో, ఎయ్యది అధో గతికీడ్చునో అదియే పాపము; ఏది ఉద్ధరించునో, ఏది సామరస్యము గూర్చునో, అదియే పుణ్యము.

ఎవనికేది అనుకూలపడునో, ఎవనికేది ఉపకారకరమగునో దానిని తెలిసికొనుటకును, స్వీకరించుటకును, అనుసరించుటకును ప్రతి వానికిని మనము స్వేచ్ఛనంగీకరింతుము. ప్రతివాడును తన ప్రత్యేక మార్గమున బోవచ్చును. కాని ఒకానొకని మార్గము ననుసరించుట తనకు హానికరమగునను కారణమున, ఎవడును ఇతరుల వర్తనము ఆక్షేపించు నధికారము కలవాడు కాజాలడు. మఱియు ఆ యితరులు తనమార్గము నవలంబింపవలయునని పట్టుబట్టుటకు అసలే అర్హుడు కా జాలడు. కొంతమందికి భార్యాస్వీకరణము వారి పురోవృద్ధికి అనుకూ లింపవచ్చును. మఱికొందఱికి భార్యయుంట ప్రత్యక్షము హానికరము కానగును. కావున బ్రహ్మచారియైనను నరుడు గృహస్థుని ఆకారణము చేత దోషియని చెప్పుటకు అర్హుడుకాడు; మఱియు ఆసోదరుని తన ధర్మము ననుసరింపుమని బలాత్కరించుటకు అంతకన్నను అర్హుడు కాడు.

ప్రతిజీవియు దైవాంశసంభూతుడనియు, దేవుడే యనియు మనము విశ్వసింతుము. ప్రతి జీవాత్మయు అవిద్యామేఘముచే మరుగు పడియున్న ఒక సూర్యుడే సుమా! భేదమంతయు ఈ మేఘముల సాం ద్రతను బట్టి యేర్పడుచున్నది. ఎఱిగినను, ఎఱుగకున్నను ఇదియే సమస్త మతములకును పునాదియని మనయభిప్రాయము. ఇంకను స్థూలశరీరము నందుగాని, బుద్ధిక్షేత్రమునగాని, అధ్యాత్మ ప్రపంచ మునగాని గల్గు మానవకోటి పరిణామ గతియొక్క చారిత్రమునంతటి కిని ఇదియే వివరణము కూర్చగల సూత్రము. ఒకే ఆత్మ భిన్న భిన్న భూమికలద్వారమున వ్యక్తమగుచు వచ్చుచున్నది.

ఇదియే వేదసారమనియు మన నమ్మకము. ప్రతిజీవియు ఇతర జీవులను ఆరీతిగా, అనగా దేవతలనుగా పాటించవలయును; అటులనే భావనచేయవలయును; అట్టి భావముతోడనే సంసర్గము చేయవలయును. అంతియేగాని ఇతరజీవులను ద్వేషించుటగాని, అసహ్యించుకొనుటగాని, దూషించుటకాని, మఱియు ఏతీరునను ఏకారణమునను హింసింప యత్నించుటగాని తగదు, అని మన విశ్వాసము. ఇటుల వర్తించుట సన్యాసుల ధర్మమేగాక, సమస్తపురుషులయొక్కయు, సమస్తస్త్రీలయొక్కయు విధి. ఆత్మకు స్త్రీపురుషభేదముగాని కులభేదముగాని ఏలాటి లోపముగాని లేదు.

వేదములందు గాని, దర్శనములందు గాని, పురాణములందు గాని, తంత్రశాస్త్రములందుగాని, ఎచ్చటను ఆత్మకు స్త్రీపురుషభేదము కులము, మతము యున్నట్లు ప్రతిపాదింపబడియుండలేదని మన విశ్వాసము; కాబట్టియే 'మతమునకు సాంఘిక సంస్కరణలతో ఏమి జోక్యము' అని ప్రశ్నించువారితో మనము ఏకీభవించుట! సరే, సాంఘిక ధర్మముల నిర్ణయించుటలోను, జీవులందు భేదము కల్పించుటలోను, మతమునకు పని లేదని మనము చెప్పు మాటను వారుకూడ అంగీకరింపవలసియుండును. ఏమన, ఆవిధమగు జూటకములను, రాక్షస భావములను రూపుమాపుటయే మతముయొక్క ఉద్దేశ్యమును, పరమగమ్యమునునై యున్నది.

ఆతీరున తారతమ్యములను పెట్టుకొని మనము పూర్ణార్థతను, ఐకమత్యమును పొందగలమని వాదింపబూనునెడల, ఆ మతసూత్రమే బురదచేత బురదను కడుగ వలనుపడదని పలుమారు వక్కాణించుచున్నదని చెప్పుటే మన ప్రత్యుత్తరము.

ఓహో! దుర్వర్తనము మూలమున నరుడు సద్వర్తనుడు కాగలడనుటయా!

సంఘధర్మములు, ఆర్థికావసరములబట్టి, మతముయొక్క అనుమతితో కల్పింపబడుచు వచ్చినవి. ఇట్లు సాంఘిక విషయములో వ్రేలు పెట్టుటే మతము గావించిన ఘోరమగు పెద్దపొరబాటు. ఇప్పుడు 'సం

ఘసంస్కరణము మతముయొక్క పనిగాదు సుడీ!' అని తాటోటు మాటలుచెప్పి స్వవచోవిఘాత మొనరించుకొనుట ఎంతటి మోసమో చూడుడు! నిజమే; మతము సంఘసంస్కరణకు పూనదగదని మన అభి ప్రాయము; కావున మతము సంఘధర్మముల ప్రచారమును పూనుటయు కూడని పనియే అని మన వాదము. దూరముగ నుండుడు! మీ హద్దులలోపల మీరుండుచో, సర్వమును చక్కబడగలదు.

(1) ఇదివఱకే నరునందు నిగూఢమైయున్న పూర్ణత్వమును ప్రకాశమునకు తెచ్చుటయే విద్యాభ్యాసము.

(2) ఇది వఱకే నరునందు నిగూఢమైయున్న దైవత్వమును ప్రకాశమునకు తెచ్చుటయే సాధనము!

కాబట్టి ఈ విషయముల రెండింటను గురువుయొక్కవిధి ఏమన, మార్గమునందుగల అవరోధముల నన్నింటిని తొలగించుట మాత్రమే. కాబట్టి నేను సదా చెప్పుచుండు విధమున దూరముగ నిలువుడు; సర్వమును చక్కబడును. మార్గము సరిచేయుట మాత్రము మన విధ్యుక్త ధర్మమే. తక్కినదో సర్వేశ్వరుడే చూచుకొనును.

మతమునకు అధ్యాత్మవిషయములతో మాత్రమే ప్రమేయము గలదనియు, సాంఘిక విషయములతో మతమున కెంతమాత్రము జోక్యము లేదనియు మీరు ముఖ్యముగా జ్ఞప్తినుంచు కొనవలయును. ఈ నా ప్రవచనము ఇదివఱలో జరిగియున్న అనర్థముల పట్లను చెల్లనని మీరు మనస్సున నుంచుకోవలయును. నీ వాదన, ఒకడు మఱొకని ఆస్తిని బలాత్కారముగా కైవశముచేసికొనియుండి, ఆతడు తన సొత్తును తాను తిరిగి లాగికొన ప్రయత్నము సాగించునప్పుడు ము కృన క్రోధమూని ప్రలాపించుచును మానవస్వామ్యములు మహా పవిత్రములని శ్రీరంగనీతులు బోధించుటవలెనున్నది.

లక్షలాది మానవ జీవులకు పీడాకరుడగుచు ప్రతిసాంఘిక విషయములలోను జోక్యము కల్పించుకొనుటకు పురోహితున కేమి హక్కు వచ్చినది?

నీవు మాంస భక్షణముచేయు క్షత్రియుని ప్రసక్తిని ఎత్తితివి ; మాంస భక్షకులు కానీ, కాకపోనీ, మన హిందూమతములో విభవ వంతమును సుందరమునగు సర్వమునకును వారే మూలపురుషులు సుమీ! ఉపనిషత్తులు రచించిన వారెవరు ? రాముడెవడు ? కృష్ణుడె వడు ? బుద్ధుడెవడు ? జైనుల తీర్థంకరులెవరు ? క్షత్రియులు మతమును బోధించినపుడెల్లవారు దానిని సర్వజనులకును బోధించియున్నారు. కాని బ్రాహ్మణులు ఏమి వ్రాసినను దానింగూర్చి ఇతరులహక్కు లేకుండచేసి యున్నారు. గీతలు, వ్యాససూత్రములను చదివిచూడుము, లేదా ఎవ నిచేతనైన చదివించి వినుము. గీతయందు అన్నికులములవారికిని, సర్వవ ర్ణములవారికిని, స్త్రీలకు, పురుషులకు ఎల్లరకును తరించు త్రోవచూప బడియున్నది. కాని వ్యాసుడో, పాపము శూద్రునికండ్లు గప్పుటకై, వేదములకు ఏవేవో అర్థముల కల్పింప కుతంత్రముల పన్నియున్నాడు. ఒకమాంసపుముక్కను అడ్డముపెట్టి తన కరుణాప్రవాహమును మఱ లించుటకు భగవంతుడును నీవలె గజగజలాడిపోవు వెంగలియా? దేవుడట్టివాడగునేని వానికి దమ్మిడీ విలువయు నుండదు.

నాపైని ఏలాటి ఆశలు పెట్టుకొనకుము. భారతదేశీయులు తమను తామే ఉద్ధరించుకొనవలసియున్నారను నా విశ్వాసము, ఇప్పుడీ ఉత్తరము వ్రాయునప్పుడును అటులనే యున్నది. మఱియు నీతో మునుపు మాటాలాడినప్పుడును చెప్పియేయున్నాను. కాబట్టి భారతదేశపు తరుణవయస్కులగు మీరు గుంపులు గుంపులుగా బయ లుదేఱి ఈనూతనాదసర్శముతో ఉన్మత్తులైపోగల్గుదురా? యోచనచేయు ము. కావలయు సామగ్రిని సంపాదించి శ్రీరామకృష్ణ పరమహంసుని చరిత్రనొకదానిని రచించుడు—కాని అలౌకిక సంఘటనలనన్నింటిని మెలకువతో విడిచివేయుడు. శ్రీవారిజీవితము, వారుగాంచిన సద్బో ధలకు అనుగుణముగా రచింపబడవలయును. అది శ్రీవారిదిగనే యుండవలయును—నన్నుగాని, మఱే సమకాలికునిగాని అందు ప్రస్తా వన లోనికి దీసికొని రావలదు. శ్రీవారి భావనామహిమను, దానికి సదృశమగు శ్రీవారి జీవితమును లోకమునకు వెల్లడించుటే ప్రధానోద్దేశ్యముగ నుండవలయును. నేనెట్టి అయోగ్యుడనైనను,

నాపైని ఒక కార్యభారమున్నది —. అదేదన, నా యధీనముచేయబడి యున్న రత్నపేటికను బయటపెట్టి దానిని మీకు అందచేయవలసియున్నాడను. మీకు అననేల ? కారణమేమనగా, కపట వేషగాండ్రును, అసూయాపరులును, భావదాస్యమున క్రుంగువారును, పిఱికివారును, భౌతికవిషయములను మాత్రమే నమ్ముకొనువారును ఎన్నడును ఏమియు చేయజాలరు. మన జాతీయవర్తనముపైని అసూయ అనునది ఒక మచ్చపడిపోయినది. బానిసలకు అట్టిది సహజము! అసూయ గల్గు పట్టున, సర్వశక్తిమంతుడగు ఈశ్వరుడు సహా ఏమియు చేయబోడు.

* * * *

తనధర్మమును తాను పూర్తిగ నిర్వర్తించి, చని పరలోకగతుడైన వానిగ నన్నుతలంచుడు. కార్యభారమంతయు మీమీద పడినటుల భావనచేయుడు. మాతృదేశ యువకగణమగు మీరు దీని నంతను నిర్వహించుట దైవనిర్ణయమని యెంచుడు. ఈ యుద్యమమును పైనివేసికొనుడు. ఈశ్వరుడు మిమ్ము కృతార్థులచేయుగాక! నన్ను విడిచివేయుడు. నన్ను మీదృక్పథమునుండి తొలగించివేయుడు. ఈ నూతనాదర్శమును ఈ అపూర్వధర్మమును, ఈ నవ్యతర జీవన విధానమును బోధచేయుడు. ఎవ్వనికిని విరుద్ధముగగాని, ఏ ఆచారమునకేని ప్రతిరోధముగగాని బోధలు చేయబూనకుడు. వర్ణవివక్షతకుగాని, మఱి యే యితర సాంఘికానర్థమునకుగాని అనుకూలముగనైనను ప్రతికూలముగనైనను కూడ బోధింపజనదు. జోక్యము విడిచి దూరముగ నుండుటే ప్రోత్సహింపదగినది, సర్వమును చక్కబడగలదు.

ధీరులును, ప్రేమార్హులునగు మిత్రములారా, మీకు శుభమగుగాక !

ఇట్లు
వివేకానంద.



# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

(శ్రీ కంఠశివాచార్యులవారి గీతాభాష్యగ్రంథమునుండి)
(ద్వాదశాధ్యాయము.)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో శ్రీ భగవద్గీతయొక్క పండ్రెండవ అధ్యాయముయొక్క మాహాత్మ్యమునుగూర్చి యిట్లు చెప్పదొడంగెను. ఓ లక్ష్మీ! దక్షిణదేశమందు ఖుదావందుడను రాజుండెను. అతని ప్రజలు సుఖవంతులై యుండిరి. వాని దేశమంతయు ధర్మస్థాపితమై యుండెను. ఆరాజు నివాసనగరమునందే అవంతుడను దుర్మార్గుడొక డుండెను. వాడు వ్యభిచరించువాడును, అసత్యవాదియునై యుండెను. వాని కొక వేశ్యగలదు. వాడా వేశ్యతో ప్రతిదినము త్రాగుట, మాంసము దినుట, జూదమాడుటయునుగలదు. వాడా వేశ్యను వెంటనిడుకొని ఆగ్రామములోనుండు అమ్మవారి ఆలయమునకు బోయి విలాసవంతులతో క్రీడించుచు దుష్కృత్యముల జేయుచుండెను. ఈకృత్యమంతయు అక్కడ అమ్మవారికి పూజచేయు బ్రాహ్మణుడు లేకుండుట చూచి చేయుచుండెడివాడు. ఇట్లు కొన్ని దినములు గడచినవి. ఒక దినమా యర్చకుడు అమ్మవారిని పూజించి స్తుతించగా నాదేవి ప్రసన్నమై వరమును కోరుకొమ్మనెను. అంతనా విప్రుడు సంతసించి విశేష ధనలాభమును, సంతతిని కోరుకొనగా నా యమ్మవారిట్లు చెప్పెను. ఓ బ్రాహ్మణుడా! నీవు నామందిరమునకు వచ్చుచున్న దుర్మార్గులైన వేశ్యను బ్రాహ్మణుని ఉద్ధరించిన, నేను నీ యిష్టమును పూరించెదను. వారి నుద్ధరించుటకు నీకు సామర్థ్యము గలదనెను. అంతనా విప్రుడందులకు సమాధానముచెప్పక అమ్మవారికి నమస్కరించి తన గురువుదగ్గరకుపోయి తనవృత్తాంతమంతయు చెప్పెను. గురువామాట లాలకించి శిష్యునితో నిట్లుచెప్పెను. 'నాయనా! మనమిద్దరము నారాయణుని గూర్చి తపమొనరింపవలెను, అని యిట్లొడంబరచుకొని వారిరువురును భగవంతునిగూర్చి తపమొనరించిరి. కొంతకాలమునకా భగవంతుడు ప్రత్యక్షమై మీరెందులకు తపముచేయుచుంటిరని ప్రశ్నించెను. అప్పు

డర్చక బ్రాహ్మణుడిట్లుచెప్పెను స్వామీ! తమకు తెలియని సం
లేదు. కాని అడిగితిరిగాన చెప్పెదను. నేను అమ్మవారిని గూ
తపస్సుచేయగా ఆమె నాకు అమూల్యవరము నిచ్చినది. కాని మొ
దురాచారులైన ఆవేశ్యను బ్రాహ్మణుని నుద్ధరించుమనియు, అం
తగిన సామర్థ్యము నీ దగ్గర నున్నదనియు నుడివెను. కాని వారి
రించు ఉపాయము తోచలేదని తన వృత్తాంతమంతయు చెప్పగా
నా భగవంతుడు ఓ విప్రుడా! చింతింపకుము. నీవు గీత 12-వ అ
యమును వారికి వినుపించిన యెడల వారికి సద్గతి గలుగునెను. భ
వంతుని యా మాటలు విని తన గురువుతో సహా అమ్మవారి ఆల
మునకు వచ్చి దేవికి నమస్కరించి దేవి ఆజ్ఞానుసారము దురాచా
లైన వేశ్యా, బ్రాహ్మణుల కిద్దరికిని గీత 12-వ అధ్యాయమును
పింపమొదలిడెను. వారు శ్రద్ధగా వినుచునేయుండిరి. అట్లు అధ్యా
ము సమాప్తి కాగానే వారిగువురును నిర్జీవులై భూమిపై బడిరి. అ
స్వర్గమునుండి విమానము వచ్చెను. అంత వారు దివ్యశరీరముల ధరి
విమానమెక్కి స్వర్గమునకు బోయిరి. అటుల వారు స్వర్గమునకు బో
చుండగా చూచి అమ్మవారికి తన భక్తుడైన విప్రునియందు విశ్వాస
దయించి ఓవిప్రుడా! నేను ప్రసన్నమైతిని. నేటినుంచి నేను వైష
దేవినైతిని. నేనీ నగరరాజ్యమును నీకిచ్చుచున్నానని చెప్పి యంత
మొందెను. అంతట విప్రుడు తన యింటికి బోయెను. ఓ లక్ష్మీ! ఆ
రరాజునకు సంతానములేని కారణముచేత ఈ బ్రాహ్మణునే తన రా
మునకు పట్టాభిషేకముచేసి తాను అరణ్యమునకు తపస్సుచేయ
బోయెను. ఇచ్చట పూజారీ బ్రాహ్మణుడు సుఖముగ రాజ్యము చే
చుండెను.



ఓం తత్ సత్.

ఓమ్ శ్రీ పరమ గురుభ్యోనమః

ఓం సర్వమహర్షి భ్యోనమః

# శ్రీమద్భాగవత సారము.

సీ॥ హరినామకథన దావానల జ్వాలచే।
గాలవే ఘోరాఘ కాననములు
వైకుంఠ దర్శనవాయుసంఘంబుచే।
దొలగ వేభవదుఃఖతోయదములు
కమలనాభ ధ్యానకంఠీరవంబుచే।
గూలవేసంతాపకుంజరములు
నారాయణస్మరణ ప్రభాకరదీప్తి।
దీరవేషడ్వర్గతిమిరతతులు

గీ॥ నలిననయన భక్తినావచే గాక
సంసార జలధిదాటి చనగరాదు
వేయునేలమాకు విష్ణు ప్రభావంబు
దెలుపవయ్యసూత ధీసమేత. 1.

సీ॥ మందారమకరంద మాధుర్యమున దేలు
మధుపంబువోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలదూగు
రాయంచజనునె తరంగిణులకు
లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు-
కోయిలచేరునే కుటజములకు
బూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు,

తే-గీ॥ నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేలా.

సీ॥ కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవనకుంభిత చర్మ భస్త్రిగాక
వైకుంఠుబొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుజూడని కన్నులు కన్నులే
తనుకుడ్య జాలరంధ్రములుగాక.
గీ॥ చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విభుదుండు విభుదుడే
పాదయుగముతోడి పశువుగాక.

సీ॥ సంసారజీమూత సంఘంబులిచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్నులారునే
విష్ణుసేవామృత వృష్టిలేక
సర్వంకషాఘౌఘ జలరాసులింకునే
హరిమనీషా బడబాగ్నిలేక
ఘనవిపద్గాఢాంధకారంబులడగునే
పద్మాక్షునుతిరవిప్రభలు లేక
గీ॥ నిరుపమాపునరావృత్తినిష్కళంక
ముక్తినిధిగానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక
తామరసగర్భునకునైన దానవేంద్రా.

సీ॥ విష్ణుకీర్తనముల విననికర్ణంబులు
గొండలబిలములు కువలయేశ
చక్రిపద్యంబుల జదువనిజిహ్వలు
గప్పలజిహ్వలు కౌరవేంద్ర
శ్రీమనోనాథు నీక్షింపనికన్నులు
కేకిపిచ్ఛాక్షులు కీర్తిదయిత
కమలాక్షుపూజకు గానిహస్తంబులు
శవముహస్తంబులు సత్యవచన
గీ॥ హరిపదతులసీదళామోదరతిలేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర
గరుడగమను భజన గతిలేని పదములు
పాదపముల పాదపటల మనఘ. 5

సీ॥ నారాయణునిదివ్య నామాక్షరములపై
గరగని మనములు కఠినశిలలు
మురవైరికథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమై యుండనిమేనుమొద్దు
చక్రికి మ్రొక్కని జదుని యోరాదలనున్న
కనకకిరీటంబు గట్టిమోపు
మాధవార్పితముగా మననిమానవుసిరి
వనదుర్గ చంద్రికావైభవంబు
గీ॥ కైటభారిభజన గలిగియుండనివాడు
గాలిలోననుండి కదలుశవము
కమలనాభుపదము గననివాసిబ్రదుకు
పసిడికాయలోని ప్రాణిబ్రదుకు. 6

సీ॥ కమనీయభూమిభాగములు లేకున్నవే
పడియుండుటకు దూదిపరుపులేల
సహజంబులగు కరాంజలులు లేకున్నవే
భోజనభాజన పుంజమేల

వల్కలాజినకుశావళులు లేకున్న వే
కట్ట దుకూల సంఘంబు లేల
గానకానివసియింప గుహలు లేకున్న వే
ప్రాసాదసౌధాది పటలమేల.
గీ॥ ఫలరసాదులు గురియవే పాదపములు
స్వాదుజలములనుండవే సకలనదులు
బొసగభిక్షులు పెట్టరే పుణ్యసతులు
ధనమదాంధులకొలువేల తాపసులకు.

---

# మనస్తత్వము.

## (నివృత్తి మార్గము)

(శ్రీ మళయాళ స్వాములవారు.)

(130-వ పుట శేషము.)

అంతఃకరణములో గల సంసార వాసనామయమగు జలమంతటిని జ్ఞానాగ్ని ప్రజ్వలించిన నశింపచేయగల్గును. ఇప్పుడు జీవకోట్లు వాసనా వశమై ప్రవర్తించునని చెప్పినయెడల, ఒక సందేహము ముముక్షువులకు కలుగును. అదేదన, అట్లైన యీవాసనకు అంతముగలదా, లేదాయని కలదని చెప్పిన, జీవకోట్లిన్నియు కాలపరిపక్వము గల్గునపుడు ముక్తులగుదురు. లేదని చెప్పిన యెల్లప్పుడును బద్ధులై యుందురు. అట్లయిన ప్రయత్నమే యక్కరలేదు. ఏ జీవి యేకార్యమును చేసినను, అది వాటి యొక్క స్వభావమేగనుక దానినుండి నివృత్తిగల్గదు ప్రయత్నమే అవసరము లేక పోవును. అట్లయిన నివృత్తిమార్గమును బోధించెడు శాస్త్రములే వ్యర్థములగును. అంతేగాక జ్ఞానోపదేష్టలగు పరమగురువులయొక్కయు అవసరముండదు. ఈవిషయమై మనము చెప్పబూనిన అంతములేదు. శాస్త్రముయొక్క సిద్ధాంతమే సజ్జనులయొక్క అభిప్రాయమైయున్నది. ఎప్పుడైనను యీజీవులు పుణ్యకర్మవిశేషముల

వలననో, ఈశ్వరుని కరుణవలననో, కాకతాళీయకముగ మహాత్ముల కృపవలననో ఆత్మజ్ఞానములో ప్రవృత్తి గల్గి రాగా రాగా, రెండు విషయములకు వశపడి యుండవలెననెడి తత్త్వము బోధమగును. 1 మనయొక్క గుణములను కనిపెట్టి సవరించుటకు మనకు స్వయముగ సాధ్యముకాదు 2. మనకంటె యెక్కువస్థితిలో నుండువారును, ఆత్మ జ్ఞానము గలవారును, ఈశ్వరసాక్షాత్కారము గలవారును నగు జ్ఞానులను అనుసరించి వారు చెప్పేలాగున నడువవలెనను బుద్ధి యుదయమగును. ఇదే యెక్కువమందికి గలిగెడు పుణ్యస్వభావమై యుండును. ఇట్టివారు గురూపదిష్ట మార్గానువర్తులైయుందురు. దానివలన వారు త్వరలోనే బంధనమునుండి విముక్తులగుదురు. ఇక రెండవతరగతి వారుగలరు. ఇట్టివారు చాల యరుదుగనే నుందురు. వారీశ్వరప్రాప్తి కొఱకు తీవ్రమైన తపోధ్యానాదులయందు సదా ప్రవృత్తిగల్గియుండుదురు. సమస్తమును ఈశ్వరునియందు సమర్పించి అనన్యభక్తి గల్గి తదేకధ్యాననిష్ఠ గలవారై యుందురు. ఉత్కృష్టమైన శాస్త్రములను గూడ, ధ్యానమునుండి బహిర్దృష్టి గల్గినపుడు చూచుచుందురు. అనేక బ్రహ్మనిష్ఠులందర్శించి వారి యాచరణలన్నియు తెలిసికొని ప్రవర్తింతురు. వీరున్నూ ఈశ్వరానుగ్రహమువలన కొంతకాలమునకు ప్రకృతి దోషరహితులై జీవత్వోపాధినుండి విముక్తులగుదురు. ఎవరు తమలో గల దృశ్యవిషయవాసన నశించు పర్యంతము బ్రహ్మనిష్ఠ చేయుదురో వారే పుణ్యజీవులు. ఇదే ఋషులయొక్క ఆశయము.

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి.

ఈ లోకమందు పాపములను బోగొట్టి అంతఃకరణశుద్ధిని గలుగజేయునది జ్ఞానముతో తుల్యమైనది మఱేదియు లేదుకదా! యోగ ధ్యాననిష్ఠాపరాయణుడై కాలముపరిపక్వముకాగా తనయందే మనుజుడాత్మసాక్షాత్కారరూపమగు జ్ఞానమును పొందుచున్నాడు.

తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

'నేను అట్టి ధ్యాననిష్ఠాపరులగువారి యంతఃకరణమున నివసిం చుచున్నవాడనై' అనుగ్రహించు తలంపుతో వారియజ్ఞానమను తమ స్సును ప్రకాశించుచున్న వివేకమను దీపముచే నశింపఁజేయుచు న్నాను, అని గీతాచార్యులగు శ్రీకృష్ణభగవానులుపదేశించిరి.

జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణోవాఽంత్యజోపివా
సంసారసాగరం తీర్త్వా ముక్తిపారంహిగచ్ఛతి.

జ్ఞానమనెడు ఓడచే బ్రాహ్మణుడైనను, అంత్యజుడైనను, ఈ సంసారసాగరమును తరించి ముక్తియను తీరమును పొందగల్గును.

సంసారార్ణవమగ్నానాం జంతూనామవివేకినాం
అగతీనాం గతిస్సాక్షాత్ జ్ఞానమేవహి కేవలమ్.

'సంసారమెనెడి దుఃఖసాగరములో మునిగినవారును, వివేక జ్ఞానము పూర్తిగలేనివారును, సహాయమేమియు లేనివారునగు మాన వులకు యీ జ్ఞానమొక్కటియే సమస్త దుఃఖములనుండి తరింపజేసి మోక్షము గలుగజేయునదైయున్నది అని పరమశివుడు సూతసంహిత యందుపదేశించెను. ఇప్పుడు శ్రీ విష్ణుమూర్తియొక్కయు, పరమ శివునియొక్కయు యాశయము మనము తెలిసికొనదగినది. చెట్టు కాలపరిపక్వావస్థ వచ్చునపుడు పుష్పించి ఫలించునట్లు ధ్యాననిష్ఠ పరిపక్వస్థితికి వచ్చునపుడు వారి యంతరాత్మలో జ్ఞానము స్వయముగా నుదయించి ప్రకాశించును. అరణిని మథించి రాగారాగా అగ్ని ప్రజ్వ లించునట్లును, పెరుగును తరచుచు రాగారాగా నవనీతము బయటపడు నట్లును, భావిత్రవ్వుచు రాగారాగా జలము కన్పించునట్లును వీరిలో నిగూఢమైయుండు ఆత్మతత్వమున్ను తపోధ్యానాదులు చేయుచురాగా కొంతకాలమునకు ప్రకాశమునకు వచ్చును అట్టి తపోధ్యానాదులు చేయని పక్షమున శుద్ధాంతఃకరణులైయుండిరేని వేదాంతశ్రవణ మననినిదిధ్యాసనాదులు తప్పక చేయుచువచ్చిన, వీరున్నూ స్వరూప సాక్షాత్కారము పొంది ముక్తులుకాగలరు. ఈ బ్రహ్మవిచారము చేయువారిలో అనుష్ఠాన పరిపక్వము ననుసరించి శుక్లపక్ష చంద్రుని గమనమువలె కొందఱు ద్వితీయ, కొందఱు పంచమి, కొందఱు సప్తమి,

కొందఱు ఏకాదశి, కొందఱు త్రయోదశి చంద్రకళలవలె ఆత్మప్రకాశములోను, సత్వగుణ పరిణామములోను విభేదము గల్గియుందురు. పౌర్ణమి దినమున పూర్ణచంద్రుడు సంపూర్ణకళలతో నెట్లు ప్రకాశించుచుండునో, ఆలాగున కేవలము దృశ్యమునశించి నిరంతరము దైవాకృతి కలవారు చాల యరుదుగానుందురు. మఱియు, పౌర్ణమిదివసమున అస్తమయమునుండి మఱునాడు సూర్యోదయమువఱకు యేలాగున కొంచెమైనను చీకటిలేక శరత్కాలమున షోడశకళాప్రపూర్ణమై చంద్రబింబము కన్పించుచుండునో, ఆలాగున యేకాలమునను తన పూర్ణాత్మస్వరూపము మఱుపు కలుగకయు, సంపూర్ణ ఆత్మశాంతికి భంగము కలుగకయు, బ్రహ్మానందామృతము సంతతము వర్షించుచుండినచో అట్టి స్థితియే నిజమైన జీవన్ముక్తియని గ్రహించుకొనవలెను. శరత్కాల పూర్ణచంద్రునివలె జ్ఞాని ప్రసన్నుడైయుండును. ఇట్టి షోడశకళాప్రపూర్తి లేని వారందఱును ఇంకను పూర్ణావస్థను పొందియుండలేదు. వీరు పంచమియో, దశమియో, త్రయోదశియో, ఏదోయొక తిథియందుండువారే యగుదురు. షోడశకళాపూర్ణ జ్ఞానసిద్ధిగలవారు చాల యరుదుగనే నుందురు. శ్రీబుద్ధదేవుడు, శ్రీదత్తాత్రేయులు, శ్రీశంకరాచార్యులు మొదలగు మహాత్ములు పౌర్ణమిదశలోనికి వచ్చినవారే. కనుకనే "వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః"-అని శ్రీగీతాచార్యులుపదేశించుటకు హేతువైనది.

> మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
> యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః.

వేలకొలది మనుజులలో ఒక్కడు మాత్రమే పరమార్థతత్వమునెఱింగి తరింపవలెనను బుద్ధిగల్గియుండును. అలాగున తరుణోపాయ బుద్ధిగల యనేకులలో ఒక్కడు మాత్రమే నిజమైన భక్తి, శ్రద్ధ సత్య, ధర్మనిష్ఠలతోకూడి యనుష్ఠించును. అట్టి యనుష్ఠానము గలవారిలో యొకానొకడు మాత్రమే సర్వబంధరహితుడై పరమాత్మసాక్షాత్కారజ్ఞానమును పొందును. అయితే తక్కినవారి యనుష్ఠానములన్నియు వ్యర్థములై పోవునని తలంపరాదు. వారు ఉత్కృష్టమైన

పుణ్యలోకములను పొంది మఱుజన్మలో శ్రేష్ఠవంశములో శ్రేష్ఠగుణ
ములు గల్గి, జీవన్ముక్తి పొందుటకు తగిన నిష్ఠగలవారై మోక్షము
పొందుదురు, అని గీతాచార్యుల యభిప్రాయము. కఠోపనిషత్తునందు
కూడ యీ లాగుననే కన్పించుచున్నది.

'శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః, శృణ్వన్తోపి బహవోయంన
విద్యుః, ఆశ్చర్యోవక్తా కుశలోస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః'

అనగా 'ఏ యాత్మ వినుటకును, వినినను తెలిసికొనుటకును అలభ్య
గానిదో అట్టి యాత్మను గుఱించి చెప్పువాడును, పొందువాడును, తెలిసి
కొనువాడును అరుదై యున్నారు' అయితే తదితర బ్రహ్మనిష్ఠులు పూర్ణ
జ్ఞానమును పొందక నిత్యసుఖ మనుభవించక పోవుదురని తలంప
నక్కఱలేదు. ఏలాగున ప్రతిదినమున్నూ ఒక్కొక్కతిథి యెక్కుపోవు
చుండునో ఆలాగున పంచమిలో నుండువారు షష్ఠికిని, దశమిలో
నుండువారేకాదశిస్థితిలోనికిన్ని మార్పుదల పొందుచు యిట్లీశ్వర
జ్ఞానము పూర్ణముగ పొందువఱకు మఱల మఱల ఉన్నతస్థితికి వచ్చు
చునుందురు. ఈ జన్మలో పూర్ణస్థితి పొందనివారు వచ్చేజన్మలో
పూర్వాధిక యుత్కృష్ట స్థానమును పొందుదురు. అయితే అనుష్ఠా
నము మాత్రము తప్పక చేయుచుండవలెను. తానున్నూ జగత్తున్నూ
ఈశ్వరమయమను జ్ఞానము కలుగువఱకున్నూ అంతఃకరణోపాధి
పూర్తిగ తొలగిపోజాలదు. అదే దానికి గుఱుతు. ఏలన, యెంత
వఱకు పౌర్ణమిదినము కాలేదో, అంతవఱకు చంద్రుని రేఖలో
నుండు భూమి తొలగిపోయి యుండలేదు. ఎంత వఱకు గ్రహణ
కాలమున రాహుకేతువుల విమోచనము గలుగలేదో, అంత
వఱకు చంద్రబింబము పూర్ణముగ కన్పించదు. మఱియు సంపూర్ణ
గ్రహణవిమోచనము గలుగనిచో శుద్ధికాలేదనియు, గ్రహణదోషము
కను యుండెననియు తలంచవలెను. ఆలాగున దృశ్యవృత్తి నిశ్శేషము
గ నశించువఱకున్నూ యీ జీవుడు ప్రకృతినుండి విమోచనావస్థ
పొందలేదు. అమృతత్వ మనుభవించుట గూడ పూర్తికాలేదు.
మాయామాలిన్య కల్మషమున్నూ నశించలేదని ప్రతిబ్రహ్మనిష్ఠుడును

గ్రహించవలెను. అనుష్ఠానము కూడ చేయుచుండవలెను. సృష్టియొక్క రహస్యము జీవన్ముక్తి గల్గినవారికి మాత్రమే లెస్సగ తెలియగలదనియు, తక్కిన వారందరును వారివారి ప్రకృతి (మనస్సు) యొక్క స్థితినిబట్టి యుందురనియు, ఈలాగున యింతవఱకు చెప్పినదానిలో యింకను గ్రహించవలసిన విషయములు చాలగలవు. వాస్తవముగ యిపుడు కన్పించెడు పంచేన్ద్రియ విషయము వేస్థితిలోయుండునని మనకు తెలియ సాధ్యముకాదు. ఏలన, మనస్సుయొక్క సృష్టినిగుఱించియు మనయొక్క మనోస్థితినిగూర్చియు మాత్రమే మనకు తెలిసికొనుట కవకాశముగల్గు చుండును. ప్రకృతియొక్క మహిమవలన, మనకు తెలిసినదే సరిగానుండు నని తోచెడుస్వభావము మనకు గలిగియున్నది. ఈ రహస్యము తెలిసికొ నుటచాలకష్టము. దీనియొక్కతత్త్వము తెలిసికొనుటయే మనస్తత్త్వమును మెఱుంగుట యగును. సామాన్యయోగులు, తపస్వులు, జ్ఞాననిష్ఠులు, భక్తులు సహితము యీ మానసిక తత్త్వమునకు లోబడియుందురను విషయమిదివఱకే చెప్పబడియుండెను గదా! కనుకనే కొందఱు యోగమెక్కువనియు, కాదు, తపస్సేగొప్పదనియు, కాదు, కాదు, జ్ఞానమే యత్కృష్టమైనదనియు, అట్లుకాదు, భక్తియొక్కటియే శ్రేష్ఠమైనదనియు, అదికాదు, లోకసేవయే సర్వోత్కృష్ఠమనియు, అట్లు కాదు, ధర్మమార్గముతో గృహస్థాశ్రమమందుండుటయే అన్నిటికంటె యుత్తమమైనదనియు అనేకులు అనేకవిధములుగ చెప్పుటకు కారణమగు చున్నది. ఇవన్నియు వారియొక్క పొరబాటుకాదు. పరమేశ్వరుని యొక్క సృష్టిమహిమయని ఆత్మజ్ఞానులు తలంతురు. భోగమనుభ వించుటకొఱకే మానవజన్మము నీశ్వరుఁడిచ్చెనని యు, దానియందే లాటి దోషము లేదనియు కొందఱు వచింతురు. ఇక కొందఱు భోగములు భోగకారణములగుటచే మితముగానే అనుభవింపవలెనుగాని, భోగ పరవశులై పోగూడదనియు యుపన్యసింతురు. మఱింత అంతఃకరణశుద్ధి గలవారు భోగములన్నియు యోగమునకు ప్రతిబంధములనియు, అవి అజ్ఞులకొఱకేర్పడినవనియు, వాటిని నిశ్శేషముగ రహితమొనర్పవలె ననియు వాదింతురు. ఇక కొందరు గృహస్థాశ్రమమే అన్నిటికంటె

శ్రేష్ఠమైనదనియు, సంసారములో నుండియే అన్నిటియొక్క సారమును కనుగొనవలెననియు, కనుకనే సంసారములోనే సారముగలదనియు, శ్రుతులట్లే చెప్పుచున్నవనియు తర్కింతురు. అట్లుకానిచో ఈశ్వరు డేల యీసంసారమును సృష్టించవలెననియు నుపదేశింతురు. శ్రేష్ఠ నుండి మఱియొకడు సంసారములో సారము లేదనియు, దీనిలో నుండి నచో నేకాలమందును దరిజేరజాలరనియు, దీనిలో శాశ్వతవస్తువే యు లేదనియు, కనుకనే సంసారము నిస్సారమని శాస్త్రములు చెప్పు టకు కారణమనియు వచించుచుండును. వీరు చెప్పువాదము లన్ని కిన్ని ప్రమాణములుగలవు. ఆత్మజ్ఞాని మాత్రము పైవారినిగూర్చి వారి వారి యంతఃకరణవృత్తి అలాగున యుండుటచేతనే యిట్లు చెప్పు చున్నారేకాని వారిని గుఱించి మనమేమియు చెప్పుట తగదని తలంచి యూరకుండును. ముందు మనము ప్రారంభించిన శబ్దాదివిషయము గ్రహించునట్టి కర్ణ, చర్మ, నేత్ర, జిహ్వా, ఘ్రాణములను గుఱించి వివరించెద. ఒక శబ్దము వినవచ్చుచున్నది. అది యింత పెద్దదనిగాని చిన్నదనిగాని మనము నిశ్చయింపజాలము. మనయొక్క కర్ణగోళస్థి ననుసరించి మనకా శబ్దముయొక్క లఘుత్వముగాని గురుత్వముగాని గోచరమగును. దృష్టాంతముగ, మనలో కొంచెము చెవుడున్నవాని ఆ శబ్దము చాలపెద్దదిగానున్నను చిన్నదిగానే వినవచ్చును. ఈ శబ్దముయొక్క దోషమా, లేక చెవియొక్క దోషమా? కర్ణముయొక్క దోషమేకాని మఱియొకటిగాదు. మఱియు కొన్ని జంతువులకు శ్రవణ శక్తి మానవులకంటె యెంతో అధికముగ నుండును. అనగా చిన్న శబ్దముగ మనకు తోచునది, వాటికి చాలదూరమునగూడ పెద్దది వినవచ్చును. మనలో యెవరికైన కొంచెము చిత్తైకాగ్రతయు, ఇంద్రి యములకు సూక్ష్మతయు గల్గిన, వారికి సామాన్యజనులకు చిన్నది వినిపించెడు శబ్దము చాలపెద్దదిగానే వినిపించును. మీలో యెవరైన చెవిపై చేతిని వంకరగాపెట్టిన చిన్నశబ్దముకూడ పెద్దదిగ వినవచ్చును కావున, యొకశబ్దము వినవచ్చిన, అదియెంత పెద్దదో యెంత చిన్నదో మనము నిర్ణయింపజాలము.

(సశేషము)

# 10. విభూతియోగము.

(శ్రీమలయాళస్వాములవారు.)

దీనియందు ఈశ్వరవిభూతిని వర్ణించుటవలన యీ అధ్యాయము నకు విభూతియోగమని పేరు వచ్చినది. ఈశ్వరమహిమాతిశయము నకు గూడ విభూతియని పేరుగలదు. ఈశ్వరశక్తికికూడ యిట్టి అర్థ ముగలదు. ఈయధ్యాయమున సర్వేశ్వరుని యోగశక్తి అనంతమ నియు, యిది సామాన్యజనులు తెలిసికొనజాలరనియు మనుష్యులకే గాక దేవతలకు సహితము తెలియుట దుస్సాధ్యమనియు శ్రీ భగవా నలుపదేశించియున్నారు. ఇందువలననే సాకారమూర్తి పూజాదు లేర్పడినవి. అనంతుడును, నిరాకారుడును నగు పరమేశ్వరుని, యింద్రియ ములకు లోబడియుండు మనుజులే గాక దేవతలు సహితము తెలిసి కొనుట దుస్తరము. ఎంతవఱకు యింద్రియాతీతమగు జ్ఞానము గలుగ లేదో అంతవఱకు యెవరికిని సర్వేశ్వరతత్వము పూర్తిగ యెఱుంగ సాధ్యముకాదు. అట్టి అతీతజ్ఞానము సమాధిస్థితిలో మాత్రమే పొందగ లము. అట్టిస్థితి పొందనివారికి పంచేంద్రియములకు విషయములగు యొకమూర్తిగాని, భావముగాని యేర్పడినమాత్రమే అనగానానము చేయుటకును ధ్యానించుటకును సాధ్యపడును. సర్వేశ్వరునికరుణాస్వరూ పుడుగాను, ప్రకాశ స్వరూపుడుగాను, జ్ఞానస్వరూపుడుగాను, వ్యాపక స్వరూపుడుగాను భావించుటయు ఒకవిధమగు మూర్తిపూజలోజేరినదే యగును. ఇట్టి భావమేదైన చేయనిచో మనస్సునకు నిలుకడ కలుగదు. ఇది మానసికపూజ యనఁబడును; లేక మనోధ్యానమనియు చెప్పవచ్చు ను. భగవద్విభూతి అనంతమైనదైనను సామాన్యజనులు తెలిసికొను టకై కొన్ని ముఖ్యములగు పవిత్రములు మాత్రమీయధ్యాయమున తెలుపడమైనది. మఱియొక విశేషార్థము కూడ యిట తెలియజేయబడి నది. దైవీకగుణములగు సత్యము, జ్ఞానము, శాంతము, కరుణ, విరక్తి తపస్సు మొదలైనవి యెవరియందైనను, యేదేశమందైనను, యే కుల

మంద్దైనను, ఏ మతమంద్దైనను కనుపించునో, అవన్నియు భగవత్స్వ
రూపములుగా నెఱుంగవలెననియు, అట్టివారెవరైనను వారిని భగ
ద్విభూతి భూషితులుగ చూడవలెనని యుపదేశించియున్నారు.
మఱియు నీ చరాచర జగత్తంతయు భగవత్స్వరూపముగానే చూడ
దగినదనియు, ఆలాగున చూచుటకు శక్తిలేనివారికి మాత్రమే ప్రత్యేక
మొక స్థలముగాని, రూపముగాని, వస్తువుగాని యేర్పడినవని వివేకులు
జ్ఞాపకములో నుంచుకొనవలెను. స్త్రీలను కొందఱు హీనులుగ దలం
తురు. భగవద్విషయమునకు, భగవద్జ్ఞానమునకు గూడ వారనర్హులని
చెప్పుదురు. ఓహో! ఇదెంత పొరబాటు, భగవదాశయమునకిది
విరుద్ధమైనది. ఏలన, ఈ అధ్యాయమున శ్రీ భగవంతుడే స్త్రీల
యందు యేడు సుగుణములతో భగవానుడు నివాసము చేయుచున్నా
డని అనుగ్రహించియున్నారు. 34 వ శ్లోకము చూడుడు. స్త్రీలలోగల
(1) కీర్తి (పుణ్య కర్మలచే గలిగెడు విఖ్యాతి) (2) లక్ష్మి (పవిత్ర
శోభ) (3) ప్రేమపూరితవాక్కు-(4) స్మృతి (ధర్మకార్య మాచరింపవలె
నను జ్ఞాపకము) (5) మేధ (పుణ్యాపుణ్యవివేచనా సామర్థ్యము) (6)
ధైర్యము (7) క్షమ (ఓరిమి)-యీ యేడుగుణములతో గూడి స్త్రీలలో
పరమాత్మ నివసించుచున్నాడని ఆనతించియున్నారు.

'కీర్తిశ్శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా'

ఇట్టి పుణ్యస్వరూపులగు నారీమణులకు భగవంతుడనుగ్రహిం
చిన గీతశాస్త్రమునుగూడ వారలకు చదువుట కర్హతలేదని చెప్పుట
భగవదాజ్ఞను ఉల్లంఘించిన దౌష్ట్యమును చేయుటయని అర్థముగదా.
అట్టి దానివలన అనర్థమే గల్గునుగాని సార్థకమెట్లు గల్గును? గీతా
మాహాత్మ్యమున, కర్మబద్ధులై దుఃఖమనుభవించు జీవకోట్లకు దేనివలన
కర్మశాంతియు పరమపద ప్రాప్తియు గల్గునని యడిగినది శ్రీ భూదేవి
గదా అట్టి భూదేవికిగదా భగవంతుడు శ్రీగీతనుపదేశించెను.
భూదేవియు స్త్రీవర్గములో చేరిన వారుగదా. ఈవిషయమై యిదివ
వరలో వ్రాసియుండు భగవద్గీతయొక్క ఋష్యాదిన్యాసములో విస్తార
ముగ గనందగును, అయితే భగవంతుడనుగ్రహించిన యిట్టి పుణ్య

గుణములన్నియు నారీమణులు సంరక్షించుకొనవలెను. లేనిచో భగవంతుడిచ్చిన దివ్యత్వమును పోగొట్టుకొనినవారే యగుదురు. అందువలన భగవత్ప్రీతికి దూరులగుటయేగాక లోకనిందకును పాత్రు లగుదురు. మఱియు నీయధ్యాయమున యొక గొప్పరహస్యము నుప దేశించియున్నారు. దైవగుణములు యెవరియందు గన్పించునో, ఆ గుణములు భగవత్స్వరూపమునకు సంబంధించినవని, అవశ్యముగా వానిని గ్రహించుకొన వలసినదని భగవద్వచనముండియు జనులు దానినిమఱచిపోవుచున్నారు. కావున యేదేశమున యేజాతియందైనను యిహలోకమునకు సంబంధించినవియు, పరలోకమునకు సంబంధించి నవియును, నగు విద్యగాని జ్ఞానముగాని యుండిన, అవశ్యముగా వానిని భగవదంశముగ దలంచి యంగీకరించవలెను. భగవద్గుణ ములు అనంతములు, భగవద్జ్ఞానమున్ను అనంతము. ఇంతవఱకు వ్యక్తమైనదేగాక యింకను కల్పాంతము వఱకు యెంతయో జ్ఞానము పాంచభౌతిక సంబంధమైనదిన్ని, అప్రాకృతమైనదిన్ని ఒక్కొక్క దేశ ములో ఒక్కొక్క కాలములో అభివ్యక్తము కాగల్గును. ఏలన, వేద మనంతమనియు, భగవద్విభూతి యనంతమనియు శాస్త్రములలో గన్పించుచున్నది. కావున యెచటెచట భగద్విభూతి గన్పించునో, అచ టచట భగవద్భావము గలుగచేసికొనవలెనని శ్రీభగవానులుపదేశిం చిరి. ఈ యధ్యాయమున యీ శ్లోకము ముఖ్యము.

యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవా వగచ్ఛత్వం మమ తేజోఽంశ సంభవమ్. (10-41)

'ఈశ్వరసంబంధమైనదియు, చైతన్యయుక్తమైనదియు, అత్యంతో త్సాహముతోఁ గూడినదియునగు వస్తుసమూహ మేదేదిగలదో, అదం తయు నా తేజస్సుయొక్క అంశమువలన గలిగినదానినిగనే నీవు తెలి సికొనుము.'

వి॥ పైఁజెప్పిన దైవగుణములు యెవరియందు గన్పించిన, అవి భగవదంశమని తలంచి అంగీకరించుకొనవలెనని భగవంతుడుపదేశిం చిన యీ భావము చాల విశాలమైనది. కనుకనే శాస్త్రవేత్తలు.

'అన్త్యాదపి పరంధర్మం – 'అమేధ్యాదపి కాంచనం' – అని తెలుపుటకు కారణమైనది. అనగా శ్రేష్ఠమైన ధర్మము అంత్యజునినుండియు, సువర్ణము మాలిన్యమునుండియు గ్రహించినను దోషములేదని తెలిపిరి. ఆహా! యెంతవిశాలభావము!

ఓం తత్ సత్.

---

ఓం.

# శ్రీ పరబ్రహ్మోపాసన !!

# త్రయోదశమార్గములు.

(ఏప్రెల్ నెల సంచిక 80-వ పుట శేషము.)

—:o:—

మునిభార్యలు (భాగవతము – దశమస్కంధము)

(విప్రులు స్వర్గమునకరుగ అంగీరసాన్వయ సత్రము జరుపుఘట్టమున.)

వ॥ అంతగోపకులు సిరాశులై వచ్చి యెఱిగించిన హరిలోకికా ను సారియగుచు మీరయ్యార్యుల నడుగక వారి భార్యలకు మాకు రాకఁజెప్పుఁడన్నంబు పెట్టెదరని పంచిన వారలు సని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితులై యిట్లనిరి. 858

క॥ గోవులమేపుచునాఁకొని,
గోవిందుండన్నమడిగి కొనిరండని మ
మ్మీవేళంబుత్తెంచెను,
ధీవిలసితలారరండు తెండన్నంబుల్. 859

వ॥ అనిన విని గోవింద సందర్శన కుతూహలలై ధరణీసుర సుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులుంగలిగి సంస్కార సంపన్నంబులైన యన్నంబులు కుంభంబుల నిడుకొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున. 860

క॥ బిడ్డలుమగలును భ్రాతలు
నడ్డముచనివలదనంగనటుదలఁడని మా
యొడ్డుచుజగదీశ్వరునకు
జడ్డుననన్నంబుగొనుచుఁ జనిరాసుదతుల్. 861

వ॥ చని యమునా సమీపంబున నవపల్లవాతి రేకంబును విగతవనచరశోకంబును నైనయశోకంబు క్రింద నిర్మలస్థలంబున. 862

సీ॥ ఒకచెలికానిపై నొకచేయిసాఁచివే,
యొకచేతలీలాబ్జ మూఁచువానిఁ
గొప్పునకందని కొన్ని కుంతలములు,
పెక్కుఁల నృత్యంబు సేయువాని
గుఱిచ చుంగులు పుచ్చికోమరారఁగట్టిన,
పసిఁడి వన్నియగల పటమువాని
నొదలఁదిరిగిరానలవడఁ జుట్టిన,
దట్టంపుఁబించెపు దండవాని

తే॥ రాజకోత్పల కర్ణపూరములవాని
మహితపల్లవ పుష్పదామములవాని
భువనమోహన తటవేషభూతివాని
గనిరికాంతలు కన్నులకఱువుదీఱ. 863

క॥ కనిలోచన రంధ్రంబుల
మునుమిడిహరిలలిత రూపమును లోఁగొనినె
మ్మనములఁబరిరంభించిరి
తనుమధ్యలు హృదయజనితతాపము వాయన్. 864

క॥ వారితసర్వ స్పృహలై,
వారందఱుదన్నుఁ జూడవచ్చుటమదిలో
వారిజనయనుఁడు వొడగని,
వారికినిట్లనియె నగి యవారితదృష్టిన్ 866

శా॥ కాంతారత్నములార మీగృహములం గల్యాణమే యేమిగా
వింతల్ మీకిటురండు మమ్మునిచటన్ వీక్షింపనే తెంచినా,

రెం తే వేదుకళో నెరుంగుదుము నిష్ఠైతుస్థితిన్ నన్నుధీ
మంతుల్ మీక్రియఁ జేరి కందురుగదా మత్సేవలన్ సర్వమున్. 867

వ॥ కావున గృహస్థులైన మీపతులు మిమ్ముంగూడి క్రతువు నిర్విఘ్నముగా సమాప్తించెదరు. మీరు యాగవాటంబునకుం జనుం డనిన విప్రభార్య లిట్లనిరి. 868

మ॥ తగునేమాధవ యిట్టివాఁడిపలుకుల్ ధర్మంబులే మాయెడన్,
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగనీ యంఘ్రులు సేరినారమటవోఁ జేకొందు రేవారలా
పగిదే మొల్లము కింకరీజనులఁగా భావించి రక్షింపవే. 869

వ. అనిన జగదీశ్వరుండు. 870

సీ॥ నాసమీపమున నున్నారంచు నలుగరు
బంధులు భ్రాతలు పతులు సుతులు
మిమ్ముదేనతలైన మెత్తురంగనలార
నాదేహసంగంబునరుల కెల్ల
సౌఖ్యానురాగ సంజన కంబుగాదు ము
క్తి ప్రదాయకము నాకీర్తనమున
దర్శనాకర్ణన ధ్యానంబులను గర్మ
బంధ దేహంబులఁ బాసిమీరు.

తే॥ మానసంబుల నాయందు మరగఁ జేసి
నన్నుఁ జేరెదరటమీదఁ నమ్ముడనుచు
బలికివారలు దెచ్చిన భక్ష్యణాదు
లాప్తవర్గంబుతో హరి యారగించె. 871

క॥ పరమేశ్వరార్పణంబుగఁ
బరజనులకు భిక్షయిడినఁ బరమ పదమునం
బరఁగెదరటఁ తుదిసాక్షా
త్పరమేశుఁడు భిక్ష సేయ ఫలమెట్టిదియో. 872

5. శత్రువు వైరియందు జూపు వైరమువలె.

ఇదిలోక విఖ్యాతమైన మార్గము. గాని, త్రికాలవేదులగు మహా

నభావులెందరో యీ వైరానుబంధన మార్గమును కొనియాడి యున్నారు. శిశుపాల వధ సందర్భమున శ్రీనారద మహర్షులవారు ధర్మరాజులవారికి చెప్పిన విషయము.

క॥ వైరానుబంధనంబున చేరిన
చందమున విష్ణుచిరతర భక్తిన్
చేరగరాదని తోచును నారాయణ
భక్తియుక్తి నాచిత్తమునన్.

ఇట్లు శ్రీ నారదమహర్షులవారు అతిశయముగా శెలవిచ్చుటకు కారణ మాలోచించవలసియున్నది. ఒకరియందు మనకు శత్రుత్వ మేర్పడిన వారిని యే విధముననైన చెరచుటకై సర్వత్ర సంకల్పము చేయుచుండును. శత్రువే మహాబలవంతుడైన, చంపునేమోయను భయమున యెప్పుడును వారి స్మరణేయుండును. అగస్మాత్తైన శబ్దము వినవచ్చిన శత్రువుయొక్క రాకడయని సంకల్పము గల్గుచుండుటచేత యెప్పుడును ఆశత్రువు, హృదయమునందెయుండును. సంకల్పమును బట్టి యింద్రియములు దానివంకనే పనిచేయుచుండును అట్టి స్మరణ స్వరూపుడు సామాన్యమానవుడైన ముప్పుగలుగును. గాని కల్మష రహితమగు సత్ పదార్థము దాని కార్యము అదిచేయకపోదు. విష మని అమృతము భుజించినను, ఫలము అమరత్వమేకదా! తెలిసిగాని తెలియకగాని చందనమున బొరలాడిన వారికి ఉష్ణము శాంతించుట స్వభావముగాన సర్వేంద్రియములు యితరము మఱచి ఆయానంద స్వరూపమునందే నిలిపి, మనోబుద్ధులచేత పరబ్రహ్మమునే స్మరించి చింతించి మహాపదవి నొందినవారు కలరు.

వీరభాష లెట్లున్నను భావార్థము గ్రహించిన సందియముండదు.

విగత సంబంధుండనియును, గురుదేవ సూన్యుండనియును, వావివరశలులేని వాడనియును అనేక చోట్ల పరబ్రహ్మకు సంబంధించిన అర్థము గల వాక్యములు చెప్పియున్నారు. రావణునికి తల్లి నీతి చెప్పినప్పుడు,

ద్విపద॥ "యామహాత్ముడు విష్ణుడైనరామునకు
నీమేనిత్తో బోయియే మొక్కజాల

హేయ పదార్థమై మొసగుచున్నట్టి
కాయంబు బెంచుట కష్టంబు కాదె" అనెను.

అయితే వీరిశత్రువు. సాధు, దేవ, గో, బ్రాహ్మణులకున్ను, యజ్ఞాది సత్కర్మలకు రక్షకుడనియును, అట్టివారికిన్ని, అట్టిసత్కార్య ములకు యిక్కట్టులు గలిగించిన, వానిరక్షకుడగు హరి ప్రత్యక్షమై పరమపదవి నొసంగుననియు వీరి అంతరాభిప్రాయము.

హిరణ్యకశిపుని వాక్యము. (భాగవతము)

"సీ॥ ఖాండుదానవులార భూసురక్షేత్రసం
గతమైనభూమికి గములుగట్టి
మఖతపస్స్వాధ్యాయమౌన వ్రతస్థుల
వెదకిఖండింపుఁడు విష్ణుఁడనఁగ
నన్యుఁడొక్కఁడులేఁడు యజ్ఞంబువేదంబు
నతఁడెభూదేవక్రియాదిమూల
మతడుదేవర్షి పిత్రాదిలోకములకు
ధర్మాదులకు మహాధారమతఁడె
తే॥ యేస్థలంబులగో భూసురేంద్రవేద
వర్ణధర్మాశ్రమంబులు వరుసనుండు
నాస్థలంబులకెల్ల మీరరిగిచెఱచి
దగ్ధములుసేసిరండు మీదర్పమొప్ప."

అని తనభటులకు ఆజ్ఞచేసియున్నాడు.

ఈమార్గమున నడచినవారిలో హిరణ్యకశిపుడు, రావణ కుంభ కర్ణ అతికాయ పూతన మొదలగు వారు ముఖ్యులు. ఇదియు మహా త్ముల చేత ఆమోదింపబడినది. గాన పురాతన మార్గమే అయినను యిది సర్వులకు అనుష్టేయ మార్గముగాదు.

కంసుడు (భాగ — దశ పూర్వాభాగము)

సీ॥ శ్రవణ రంధ్రముల నేశబ్దంబు వినబడె
నది హరిపలుకని యాలకించు

నక్షిమార్గమున నెయ్యది సూడఁబడెనది,
హరిమూర్తిగానోపునంచుఁజూచు,
దిరుగుచో దేహంబు తృణమైనఁజోకిన
హరికరాఘూత మోయనుచుఁగదియు
గంధంబులేమైన ఘ్రాణంబుసోచ్చిఁ నా
హరిమాలికా గంధమనుచునదరుఁ
తే॥ బలుకులెవ్వియైనఁ బలుకుచో హరిపేరు
పలుకఁబడియెననుచు భ్రమసిపలుకు
దలపులెట్టి వైనదలఁచి యాతలపులు హరి
తలంపులనుచు నలుగఁదలచు. 87

క॥ తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు,
నరుగుచుఁగూర్చుండి లేచు చనవరతంబున్
హరిఁదలఁచి తలఁచి జగమా హరి
మయమని జూచెగంసుఁడారసియలుకన్. 85

శిశుపాలుడు (భాగ-దశ-ఉత్తరభాగము)

సీ॥ గురుదేవసూన్యుండు కులగోత్రరహితుండు
తలిదండ్రులెవ్వరో తడవఁగాన
మప్పులఁబోరలెడు నాదిమధ్యావసానంబు
లందరయ మానంబులేదు,
బహురూపియై పెక్కు భంగులవర్తించుఁ
వావివర్తనములు వరుసలేవు
పరికింప విగతసంబంధుండు దలపోయ
మానిమిత్తంబున మానిసయ్యె.
తే॥ బరఁగమున్ను యయాతి శాపమునఁ
జేసివాసికెక్కదు యీయదువంశమెల్ల
బ్రహ్మతేజంబు నెల్లఁగోల్పడినయితఁడు
బ్రహ్మఋషిసేవ్యుఁడగునె గోపాలకుండు,

వ. అపుడు కేకయసృంజయ భూపతులునుం దామును వివిధ యుధపాణులై యదల్చి నిల్చిన వాడునుం బెఱితివక యదల్చి పలుకయు వాలునుం గైకొని భుజాగర్వదుర్వారుండై గోవిందుని దదనువర్తులైన వారలం గుపితుండై నిందింప నమ్మునికుందుండాగ్రహంబున లేచి తన కట్టెదుర నెదిర్చియున్న శిశుపాలుని రూక్షేక్షణంబుల నీక్షించుచు నాక్షణంబ తన్మస్తకంబు నిశిత ధారాకరాళంబైన చక్రంబున నవక్ర పరాక్రముండై రుధిరంబు దొరగందునుమ నమ్మహాకలకలంబాకర్ణించి చైద్యబలంబులు దదీయపక్షచరులైన భూపతులును గనుకనింబఱచి రయ్యవసరంబున.

క॥ మునివరులును జనపతులును
గనుగొని వెఱగంద జైద్యుగాత్రమునందుం
డనుపమ తేజము వెలువడి
వనజోదరు దేహమందు వడిజొచ్చెనృపా!

వ॥ అనిన మునివరునకు భూవరుండిట్లనియె.

క॥ కమలాక్షునినిందించిన దమఘోష
తనూభవుండు దారుణమలనూ
పమునం బొందక యేక్రియ సుమ
హితమతి గృష్ణునందుజొచ్చెనృపా.

వ॥ అనిన శుకయోగి రాజయోగికిట్లనియె.

మ॥ మధుదైత్యాంతకు మీఁదిమత్సరమునన్ మత్తిల్లిజన్మత్రయా
వధి యేప్రొద్దు దదీయరూపగుణ దివ్యధ్యానపారీణధీ
నిధియై యట్టి శిశుపాలభూవిభుడు దానిద్ధూత సత్పాపుఁడై
విధిరుద్రాదుల కందరానిపదవిన్ వేపొందెనుర్వీశ్వరా!!

(హిరణ్యకశిపుడు (భాగ-సప్తమస్కంధము)

వ॥ ఇట్లు దానవేంద్రుడు పరిగృహ్యమాణవరుండును వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును రోషానల జంఘన్యమానవిజ్ఞాన వినయుండును వినయగాంభీర్య ధైర్యజేగీయ మానహృదయుండును హృదయచాంచల్యమాన తామసుండును తామసగుణ చంక్రమ్యమా

మాణ స్థైర్యుండునునై విస్రంభంబున హుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁ జూపుమని కనత్కనక మణిమయ కంకణ క్రేంకార శబ్ద పూర్వకంబుగా దిగ్దంతి దంతభేదన పాటవ ప్రశస్తంబగు హస్తంబున సభామండప స్తంభంబున వ్రేసిన వ్రేటుతోడన దశదిశలను మిడుగురులు సెదరఁ జిటిలి పెటిలి పడి బంభజ్యమాన మగు నమ్మహా స్తంభంబు వలన. 285

బకుడను రాక్షసుడు (భాగ-దశ-పూర్వభాగము)

ఆ॥ ఎల్లపనులుమాని యేకాగ్రచిత్తుడై
మానివృత్తిని తరమమతవిడిచి
వనములోన నిలిచి వనజాక్షుపైదృష్టిఁ
జేర్చిబకుఁడుదపసి చెలువుఁదాల్చె. 444

పూతనశరీర (దహనం) (భాగ-దశ-పూర్వభాగము)

ఆ॥ పొగిలిపొగిలి కాలుమగువదేహంబున,
నగరుపరిమళముల పొగలువెడలె
దేహకల్మషములు శ్రీహరిముఖమున
ద్రావఁబడుట జేసి భూవరేంద్ర 239

క॥ హరిదనమీఁదం బదములు,
గరములు సిడిచన్నుఁగుడిచి కదిసిన మాత్రన్
హరిజనసిపగిదిఁబరగతి,
కరిగెను దురితములఁబాసి యసురాంగనయున్. 240

క॥ ఆపూతనమెయిగంధము,
గోపాలురెఱిఁగి యిట్టిదివసిత యొడలం
దీపాటిస్వాదుగంధము,
ప్రాపించు నెయనుచుఁజనిరి పల్లెకునధిపా. 243

6 మిత్రుడు మిత్రునియందు గనబరచు సఖ్యమువలె

మిత్రభావముకూడ నవ్యమైనవానిలో నొకటి. మిత్రుని యొక్క యోగక్షేమములు తనవిగా చూచుకొనుట లోకవిదితము పవిత్రులెంద రో సఫలమును గోరక యెకరియుండొకరు మిత్రత్వము గలిగియుం

దురు. శ్రీకృష్ణభగవానుని మిత్రత్వముచేత, ఆరాధించిన పార్థునకు ఇహమునందు విజయము, పరమునందు మోక్షమును భగవంతుడొసగూర్చెను. ఈకారణము చేతనే పాండవుల గృహకల్లోలములలో సయితము భగవంతుడు పాల్గొని కీడులు తొలగించుటయేగాక ఘోరరణమునందు సయితము పాండవవిజయనిమిత్తము రథసారథ్యము పూని పార్థసారథియను నామమును వహించెను. ఇట్టిమిత్రభావముతో మెలగిన ద్రౌపతీదేవిని లోకమాన్యగా నొనర్చి కర్మబంధ నివృత్తి చేసినారు సచ్చిదానంద అనంతస్వరూప లక్షణము లెరిగినవెనుక అర్జునుడు

భ. గీ. 11 అ 41, 42 శ్లో ॥

శ్లో॥ సఖేతిమత్వాప్రసభం యదుక్తం హేకృష్ణ!
హేయాదవ! హేసఖేతి!
అజానతా మహిమానం తవేదంమయా
ప్రమాదాత్ప్రణయేనవాపి॥

శ్లో॥ యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు।
ఏకోఽథవాప్యచ్యుత! తత్సమక్షం
తత్ క్షామయే త్వామహమప్రమేయమ్॥

తా॥ అచ్యుతా! నీమహిమయిట్టిదని యెఱుగక అజ్ఞానముననో, ప్రేమచేతనో, స్నేహితుఁడవనిఁదలచి, నిన్ను కృష్ణా, యాదవా, సఖా, యనిగర్వముచేత పలకినదియు, నిన్ను పరిహాసించు కొఱకు ఆటలయందు, శయనించువేళ, కూర్చుండువేళ, భుజియించువేళ, నీవు యెదుట లేనప్పుడును, ఎదుటనున్నప్పుడును, నేను జేసిన యపరాధములన్నియు క్షమింపవలయునని అప్రమేయుఁడవగు నిన్ను ప్రార్థించుచున్నాను.

అని పశ్చాత్తాపమును తెలుపుకొనియున్నారు. ఇట్లే భావించిన కుచేలునకు యింద్రాదులకు జరుగని మాన్యత జరిగినది. మహదైశ్వర్యమును, పరమశాంతియు, కోరకనే లభించినది. గాన యిదియు ఉత్కృష్ట మార్గమనియె పెద్దల అభిప్రాయము.

(సశేషము.)

# జీవిత లక్ష్యము.

(గ్రంథకర్తలు శ్రీ మతకుమల్లి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు
శ్రీరామకృష్ణ వివేకానంద సందేశ ప్రచారకులు

ప్రకాశకులు — శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారు; ప్రొప్రైటర్;
వేంకట్రామ అండుకో, హెడ్ ఆఫీసు ఏలూరు.)

---

## విషయప్రవేశము.

సృష్టికి మానవుడు కిరీటము వంటివాడు. మానవ జన్మ దుర్లభము. అయ్యది లభించినను, ప్రాణి క్షణభంగురముగదా! అన్య దేహములచేత నాత్మ సాక్షాత్కారము చేయుటకు వీలులేదు. "క్షీణే పుణ్యేమర్త్యలోకం విశన్తి" అను న్యాయము ననుసరించి దేవతలుం గూడ పుణ్యము క్షీణించిన తదుపరి మనుష్యలోకమున జన్మించు చున్నారు, అటుల జన్మించినగాని ఆత్మసాక్షాత్కారములేదు. అట్టి అమూల్యమైన మానవ దేహమునుపొంది, జీవుడు ఆత్మ సాక్షాత్కారముచే బ్రహ్మస్వరూపు డగుచున్నాడు. తద్వారా బ్రహ్మానందము నొందుచున్నాడు. లేనియెడల అధోగతిపాలై క్రిమి కీటకాదులుగ జన్మించు చున్నాడు ఇదియే సృష్టివైచిత్ర్యము.

చార్వాక మతస్థులు తిని త్రాగి తిరుగుటయే జీవిత లక్ష్యమనియు, దేహమే ఆత్మయనియు, ఉయ్యెలలో శిశువై రోదనము చేయునది మొదలు శ్మశానవాటికలో దేహము భస్మీపటల మొనర్చబడు వరకుగల మధ్యకాలమే ఆత్మానంద మనుచున్నారు. ఇట్టి వారలకు ముక్తి యెక్కడిది? ఆత్మతత్వము తెలియబడుటెట్లు? ఛాందోగ్యోపనిషత్తునందలి అష్టమ ప్రపాఠకములో, దేవతలకు గొప్పయగు ఇంద్రుడును, రాక్షసులకు గొప్పయగు విరోచనుడును ఆత్మను తెలుసుకొని ఆనందము పొందుటకు ప్రజాపతి యొద్ద కేగిరి. వారల కోరికను తెలుసుకొని, 32 వత్సరములు బ్రహ్మచర్యము సలిపిరమ్మని యానతిచ్చె.

తదుపరి వారల కాత్మతత్వము నుపదేశించెను. ఇంద్రవిరోచను లిద్ద రును వెడలిపోయిరి. ఇంద్రునికి ప్రజాపతి యొసంగినబోధ సరిగా తె యకపోవుటచే, అనుమానాస్పదుడై, మఱల ప్రజాపతి యొద్దకేతెంచె అప్పుడు వాసనాక్షయము పొందుటకు 12 వత్సరములు బ్ర చర్యము సలిపినను ప్రజాపతి యొసంగినబోధ ఇంద్రునకు సంపూ ముగ నర్థముకాలేదు: మరల ప్రజాపతియాజ్ఞచే 32 వత్సరము బ్రహ్మచర్యవ్రతము సల్పి, వాసనాక్షయమైనంతనే యిట్లనేక క ములుబడి, ఆత్మ సాక్షాత్కారముచే బ్రహ్మప్రాప్తి నొందెను. రాక్షస రాజగు విరోచనుడు భ్రమజనిత దోషముచేత గురూ దేశముం జక్కగా నర్థముం జేసుకొనక దేహాత్మభ్రాంతిం జెంది ఆత్మ దూరుడై దుర్గతినొందె. పైనుదహరింపబడిన చార్వాకులు రాక్ష త్వములోనివారు. వారలు శాశ్వతానందమును క్షణికానందమున బలియొసంగి, ఆత్మకుదూరులై, వినాశము నొందుచున్నారు. దేవతాంశ సంభూతులగు ఉత్తమ మానవులు, సాధన చతుష్ట సంపత్తిచే, అరిషడ్వర్గమునుం బరిమార్చి, ఆత్మను తెలుసుకొని బ్రహ్మా నందము నొందుచున్నారు. ఇదియే జీవితలక్ష్యము.

నేడు ప్రపంచమంతయు, అజ్ఞానాంధకారముచే నావరింప నది. విశ్వమానసికము కారుమబ్బులచే నిండిపోయినది. అరిషడ్వ ములే యీ కారుమబ్బులు. ఆత్మభాస్కరుం డదృశ్యుడైనాడు. 'అ మ్మమ'లను ఊబులు మానవకోటిని భయపెట్టుచున్నవి. మ మధ్య వ్యావహారిక జ్ఞానమను మెఱుపులు మానవకోటిని మఱి అంధత్వమునకు తీసికొనిపోవుచున్నవి. ఎచ్చటను శాంతిలేదు. ఫ్రెం విప్లవము నాటి "సమానత్వము, సోదరత్వము, సర్వసౌభ్రాతృత్వము అనుమాటలు విశ్వరంగమునుండి మాయమైనవి. ఎచ్చటచూచిన అహంభావము వృద్ధినొందుచున్నది. నానాజాతుల మధ్య నేడు తీ మైన ద్వేషము చెలరేగుచున్నది. ప్రేమ యనునది కాన్పించదు. ఎచ్చ చూచినను యుద్ధ ప్రయత్నములే. శాంతిని నెలకొల్పుటకు కో లక్షల రూప్యములు వ్యయముచేసి యేర్పరుపబడిన నానాజాతీయసమి నామ మాత్రావశిష్టమైనది. వారలమాటలు వినువారెవ్వరును లే

రష్యా తన తీవ్రములో భగవంతునే మఱచినది; జర్మనీ యుద్ధసన్నాహములు చేయుచున్నది. సౌభ్రాతృత్వమునకు జన్మభూమియైవ ఫ్రాన్సు దేశమున మఱల నిరంకుశత్వము వచ్చునట్లు కాన్పించుచున్నది. ప్రపంచ మింతదుస్థితిలోనుండ అమెరికా దేశపు అధ్యక్షుడు మఱల బంగారుప్రమాణమును తెచ్చిపెట్టినాడు. ఇంగ్లండుగూడ ఆయుధ సామగ్రిని యితర దేశములతోఁబాటు వృద్ధి జేయుచున్నది. ఇకజపాను వీలైనచో ప్రపంచమునే కబళించవలెనని కుతూహలచిత్తముతో ముందంజవేయుచున్నది. స్వల్పకాలములో పాశ్చాత్యరంగమున యుద్ధము రావచ్చునని రాజకీయవేత్తలు చెప్పుచున్నారు. అటులనే వచ్చినచో నా యుద్ధము మహాభయంకరమై గత యుద్ధములకంటె శతాంశము లతో విలసిల్లి మానవధ్వంసమునకు కారణముఁగాగలదు. దీనికంతకును కారణమేమి? జీవితలక్ష్యము తెలియకపోవుటయే. పాశ్చాత్యులు క్రైస్తవబోధల నర్థముచేసుకొని ఆచరించుటకు ప్రయత్నించినచో యిట్టి విపరీతస్థితులు రానేరవు. రెండువేల వత్సరముల క్రిందట మానవకోటి శ్రేయస్సుకై, జగత్కల్యాణమునకై, ప్రేమసామ్రాజ్యమును స్థాపించుటకై తన వేడిరక్తము నొసంగిన క్రైస్తవుని స్వార్థత్యాగము నేడు మానవకోటి కర్థమగుటలేదు. క్రైస్తవాలయములలో ఆదివారము నాడు మాత్రమే క్రైస్తవుని స్మరించి, మిగత కాలము బైబిలును మూసిపెట్టుచున్నారు.

అంతకుపూర్వమేవచ్చి జగత్కల్యాణమునకై ప్రేమబీజముల నాటిన ఋషుల మాటలకు చెవియొగ్గు వారెవ్వరు? మానవజీవితముచాలక్లిష్టమైనది, హాస్యాస్పదమైనది. హృదయకుహరమున ప్రేమకు మారుగా కాంక్షజనించి, అంతకంతకు యెక్కువై, బయటఁబడి, ప్రవహించి ఆ మహాప్రవాహములో విశ్వమునే ముంచనున్నది. అస్మద్దేశీయులారా! ఇట్టివిపరీతస్థితులు పోవలెనన్న, సర్వసౌభ్రాతృత్వము వర్ధిల్లవలెనన్న ఆశాపిశాచమునరికట్టవలెనన్న, ఆత్మానందము నొందవలెనన్న, అరిషడ్వర్గమునుఁ బరిమార్చవలెనన్న, జీవితలక్ష్యమును తెలుసుకొనవలె అప్పుడే మానవకోటికి మేలుచేకూరఁగలదు. లెండు! మీ అజ్ఞానాంధకారమునుండి మేల్కొ... ...బడయుటకు

ప్రయత్నించుడు జీవితవృక్షము నకు వేరుపురుగైన స్వార్థమును నాశ మొనర్పుడు. స్వార్థత్యాగముతో, ఆత్మానందముతో భగవంతుని స్మరించుచు ముందంజవేయుడు. మహనీయుల బోధల గ్రోలి, సంస్కృతి జెందిన చిత్తములతో భగవన్మహిమనుఁ గాంచుడు. భావిభాగ్యోదయము కావలెనన్న, మానవుల మధ్య గల భేదమునుఁ బారద్రోలి ప్రేమ దృక్కులతో ప్రపంచమును వీక్షించవలె. అప్పుడే జీవితలక్ష్యము తెలియగలదు.

ఈచిన్న పొత్తమున జీవితలక్ష్యమునుఁగూర్చి స్వల్పముగ ముచ్చటించి యుంటిమి. ఇయ్యది నేను వ్రాయసమకట్టిన ఒక మహాగ్రంథము యొక్క (Out line) సంక్షేపవర్ణన మాత్రమే. భగవదనుగ్రహమున్న చో, నేను వ్రాయసమకట్టిన ఆమహాగ్రంథమును ఆంధ్రమాతయొక్క పాదములచెంత నుంచగలనను నాశయముతో విరమించుచున్నాను.

ఉ. అచ్చపుజీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచుం మరలఁ జద్విత చర్వణులైన వారికిం
జెచ్చెరఁబుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు నేగిననైన హరిప్రబోధముల్.

ఉ. ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటి నూతిలోపలం
ద్రెళ్లక, మీరు మేమను మతిభ్రమణంబున ఖిన్నులై ప్రవ
ర్తిల్లక, సర్వము న్నతని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లముఁజేర్చి కారడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ!

# జీవితలక్ష్యము.

---

చతుర్విధ పురుషార్థములలో నుత్తమమైన దేది? మోక్షము. మోక్షమనగా నేమి? స్వేచ్ఛ. ఇష్టమునచ్చినట్లు ప్రవర్తించుట స్వేచ్ఛ గాదు. ధర్మబద్ధమైనజీవితమే స్వేచ్ఛా జీవితము. ఇట్టిపరమ పవిత్రమైన స్వేచ్ఛ యిట్టిమహోత్కృష్టమైన స్వేచ్ఛయే, మానవుని లక్ష్యము. సృష్టియంతయు యీముక్తికొరకే వికసించుచున్నది. పిపీలికాది బ్రహ్మ

పర్యంతము యీముక్తి పథముననే నడుచుచున్నది; యీముక్తికొరకే జీవులు పడరాని కష్టముల సహించుచున్నారు; యీముక్తి కొరకే మహానుభావులు సర్వమును కోల్పోయినారు; యీముక్తికొరకే ఋషీశ్వరులు అసిధారావ్రతమును సల్పినారు. అట్టి యీ పరమపవిత్రమైన ముక్తియొక్క స్వరూపమేమి? ఈ ముక్తి దేనినుండి? దీనిస్వరూపమేమన: అహంభావమునుండి విశ్వభావమునకు మారుటయే. మానవోత్తముడు పొందదగిన నుత్తమ విషయము చిత్తవికాసము. అదియే ఆత్మోత్తేజమని ప్లేటో పండితుడు వచించియున్నాడు. ఇక యీముక్తి దేనినుండి? ప్రకృతిసంబంధమైన దేహమునుండి, సత్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతినుండి, అరిషడ్వర్గమునుండి. ఆశాపిశాచము నరికట్టి, కామినీ కాంచనములకు దాసులుగాక, అరిషడ్వర్గమును జయించి అవస్థాత్రయము తీతులై, ఆత్మతత్వమును అనుభవపూర్వకముగ తెలుసుకొని. బ్రహ్మాండమును దిలకించి, విశ్వాత్మను సాక్షాత్కరించి, జీవబ్రహ్మైక్యానుసంధానము చేయుటయే.

ఉపనిషత్తులు యీముక్తిగానమునే పాడినవి. గీత యీముక్తి చేతనే జీవితమునకు నూతనశోభ చేకూర్చినది. అష్టాదశపురాణములు యీముక్తినే ఘోషించినవి. ఈ ముక్తియను ప్రవాహము, వేదహృదయమను గోముఖమున జన్మించి, షట్శాస్త్రములను కొండలజారి, అష్టాదశపురాణములను పల్లపు బయళ్ళగుండ ప్రవహించి, హైందవభూమిని సారవంతమొనర్చి, జీవితలక్ష్యమును మహాసాగరమును జేరినది.

అస్మద్దేశీయులారా! లెండు! మేల్కాంచుడు!! మీపవిత్రాశయములు బడయుడు. మీరందఱు ఋషీశ్వరుల సంతానమని తలంపుడు. ద్విపాద పశువులై అజ్ఞానాంధకారమున, గబ్బిలములవలె కామ్యములను కొమ్మల వ్రేలాడక, విశ్వమహాలీల సాక్షాత్కరించి, భగవంతుని యొక్క యీవిలాస భవనమున, మీమీ కర్తవ్యముల నెఱవేర్చి జీవితలక్ష్యమును బడయుడు. నిస్పృహులై నిస్సారముతో కూర్చుని, "అహంబ్రహ్మాస్మి" అనువాక్యమును స్మరించుచు, కాలముగడుపక, అందం తరువాత ... విషయమును తెలుసుకొని శక్తివంతులు గండు.

ప్రపంచమంతయు నూతనశోభగాంచుచుండ, కూపస్థ మండూకములవలె
యెంతకాలముండెదరు ? ఈప్రపంచము శ్మశానవాటికయని భావించి
ఉభయభ్రష్టత్వమునుం బొందకుండు; ఈ ప్రపంచము భగవానుని
యజ్ఞమందిరము. అందునిరంతరము ప్రజ్వరిల్లునది జ్ఞానాగ్ని. పశువుల
వధించి, స్వర్గభోగములకై, యజ్ఞయాగాది క్రతువులం జేయుచున్నా
మని విఱ్ఱవీగక, 'అహమ్మమ'లను పశువుల నీ జ్ఞానాగ్నియందు
దగ్ధమొనర్పుడు.

భక్తియను అమృతముతో తడుపుడు; దానిని సేవించి శక్తిమం
తులై ముందంజవేయుడు. క్షణకాలము సోమరులైయున్న ఆ క్షణము
తిరిగి రానేరదు. ప్రపంచమున జన్మించినదాది, పాంచ భౌతిక దేహ
ము శ్మశానవాటికలో భస్మీపటల మొనర్చబడు వఱకు సోమరులై
తిరిగి, తదుపరి పశ్చాత్తప్తులుం గాకుడు. మహాపవిత్రమైన మానవ
జన్మ వ్యర్థపుచ్చకుడు. సృష్టికిమానవుండేకిరీటము. అనేక యోనుల
జన్మించి క్రిమికీటకాదులై తదుపరి మృగములై కష్టప్రయాస
లచేం బొందిన మానవజన్మమునుంగూడ కోల్పోయిన యిక నెప్పుడు
ముక్తినిగాంచగలరు ? రేపు అనుమాట యెప్పటికిని లేదు. (now
or never). ఇది నా పరమ పవిత్రమైన విశ్వాసము. ప్రపంచచరిత్ర
తిలకించినచో రేపుచేసెదనని చేసిన మహానుభావు లెవ్వరును లేరు;
నేముహూర్త మెట్టిదినో ? అందుచేలెండు ! యిప్పుడే లెండు !!
ఆలసించిన నమృతముగూడ విషమగునుగదా ! ఈ నిమిషమునను్న
మనస్సు మఱుక్షణమున మారవచ్చును. సంధ్యాసమయమున, నిరం
తరము ఋషులపేర్లు తలంచుచు, యీ ప్రపంచమున రాక్షసులవలె
యెంతకాలము సంచరించెదరు ; ప్రపంచమంతటను ప్రతినిమిషమును
ఓంకారనినాదముం బ్రతిధ్వనించుచుండ యెంతకాలము చెవులం మూ
సికొని. కూర్చుండెదరు ? మీహృదయ కుహరమున ప్రతినిమిషమును
వినబడుచున్న ఓంకారనినాదమును వినుట కంగీకరింపరా ? యేమా
శ్చర్యము ! జ్ఞానభక్తి వైరాగ్యములు శోభిల్లిన భారతదేశము నే
శ్మశానివాటిక యైనది. ధనకనకరాసులకాలవాలమై జ్ఞానభాస్కరుడు
ప్రపంచమునకు ప్రసాదించిన భారతదేశము, నేడు అరిషడ్వర్గములు

కారు మబ్బులచే చీకట్లు క్రమ్మినది. అహమ్మమలను మేఘములను మేఘములు గర్జించుచున్నవి. స్పర్ధ అను తుపాను వీచుటకు సంసిద్ధమైనది. అంతయు తారుమారైనట్లు కాన్పించుచున్నది. జ్ఞానభాస్కరు డదృశ్యుడైనాడా? భక్తియను వెన్నెల కాన్పింపదేమి! హిందూదేశమిప్పుడు సందిగ్ధావస్థయందున్నది. జ్ఞానభాస్కరుడు తూర్పు దిక్కున ఉదయించి, అంతకంతకు పైకెక్కి క్రమముగ క్రిందికి దిగి పాశ్చాత్య దిక్కున నూతనకాంతులతో శోభిల్లి నిప్పు ముద్దవలె యిప్పుడిప్పుడే అంబుధియందు దిగజారనున్నాడు. అజ్ఞానమను అంధకారపు రాత్రి పూర్తియగుచున్నది. అరుణోదయ కాంతు లిప్పుడిప్పుడే పొడసూపుచున్నవి. ఇది జ్ఞానభక్తివైరాగ్యములు శోభిల్లు కాలమునకు సూచన.

సృష్టియంతయు వికసించి, తదుపరి మానవుని ప్రపంచమున జన్మింపజేసినది. క్రమవికాసములో మానవుడే ఉత్తముడు. మొదట ఖనిజములు, తదుపరి వృక్షములు, పురుగులు, పక్షులు, మృగములు, కోతి, మానవు డాఖరుదశ. ఇట్టి మానవునికి మాత్రము విజ్ఞానముఁ గలదు. కృషియను వీవనచే యీ జ్ఞానమును విసరి రగుల్కొల్పిన, అరిషడ్వర్గములు పటాపంచలై, జీవితమను బంగారునందు, అహంమమలను తుప్పు ఘూళిమాయమై ఆత్మానందమను పదారువన్నె బంగారు ప్రకాశింపగలదు. అప్పుడు ఉత్తమ మానవజన్మ భగవత్సాక్షాత్కారమునకు వినియోగింప బడగలదు. సర్వమును భగవంతుని దివ్యకళగా ప్రకాశింప గలదు.

ఆ. క్షరము నక్షరంబుఁ గానంగబోలు వే
దార్థచింతనమున నమ్మిథునము
నందుఁ బూర్వముఁబవి యపరంబు సేపట్టి
నిలువవలయు నధిక నిష్ఠగలిగి.

తే. అక్షరంబందు పంచవింశాఖ్యతత్వ
తత్పరతనున్నఁ గేవలత్వము ఘటిల్లు
వినుము కేవలత్వమున షడ్వింశదర్శ
నంబు పురుషునకు [illegible] గలుగు.

అను భారతమునందలి శాంతిపర్వములో శ్లోకిల్లు యీ పెన్న పద్యరత్నములు మోక్షస్వరూపముఁ జెప్పుచున్నవి.

జీవితలక్ష్యము ఆనందముః యీ యానందము స్వస్వరూప జ్ఞానముచేలభించు. స్వస్వరూపము యథార్థములో సత్తామాత్ర సత్య స్వరూపమే. ఇట్టి పర మోక్షప్రాప్తమైన దశనుండి, మానవుడు దిగజారి పడిపోయినాడు. సంసార పంకిలమున కీటకమువలె సంచరించుచున్నాడు. ఇల్లను చీకటినూతియందు అహంమమలను పాశములచే బంధింపబడినాడు నీవు నేనను భేదముచే అహంకారమును పెంపొందించుకొనుచున్నాడు. జీవితలక్ష్యమున మఱచినాడు. విశ్వలీలా మందిరమున ద్విపాద పశువువలె సంచరించుచున్నాడు. ఆనందమునకు మాఱు ప్రకృతి సంబంధమైన భోగముల ననుభవించు చున్నాడు, ప్రతినిమిషమును తారుమారగు చున్నాడు. తన యథార్థ స్వరూపమునుఁ దిలకింపలేక, దేహాత్మ భ్రాంతిఁ జెందినాడు. అనిత్యమగు దేహరాజ్యమునందు మానసికమును లగ్న మొనర్చినాడు. సత్వరజస్తమో గుణాత్మకమైన దేహసంపద అనిత్యమని తెలియక అజ్ఞానావరణములచే భ్రమజెందుచున్నాడు, దారాపుత్ర క్షేత్ర విత్తాదులయందు సచ్చిదానందమును వెదకుచున్నాడు. జీవుడు అహంకారముతోఁ గూడినవాడై అజ్ఞానాంధకారమునఁబడి ఆత్మను దేహముగ భావించుచున్నాడు. దేహభ్రమలఁ జిక్కి, కృంగి, కృశించుచున్నాడు. సంసారనను మహారణ్యమున వ్యామోహమను వ్యాఘ్రముచే తరుమబడి కుటుంబమను దిగుడు బావిలోఁబడి, నారియను లతకుఁ జిక్కినాడు; అడుగున కాలసర్పము వేచియున్నది. జీవిత వృక్షము యొక్క వేళ్ళు ప్రతి నిమిషమును తెల్ల నల్ల యెలుకలను పగలు రాత్రులచే శిథిలముఁ జేయబడుచున్నవి. ఇది యిట్లుండ యీ వృక్షమునందు గల తేనె తుట్టె యిటునటుగల ప్రారబ్ధ కర్మల రాపిడిచే కదలి కొంచెము కొంచెము తేనెబొట్టులను క్షణికానందము జారిపడుచుండ వాటిని నాకిసంతసించుచున్నాడు. స్వల్పకాలములో జీవితవృక్షము కూలిపడిపోవునని తెలిసికొనలేకున్నాడు. అడుగునగల కాలసర్పము మ్రింగునని భావింపలేకున్నాడు.

(సశేషము.)

# యథార్థభారతి

సంపుటం 13. | ప్రమాది సం॥రం శ్రావణమాసం ఆగస్టునెల 1939. | సంచిక 6.




(పత్రిక విలాసము:—శ్రీవ్యాసాశ్రమం, ఏర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత. జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

భూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి

మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.



Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.
Published by:— K. Venkatachalam Naidu, Chittoor.

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, మేర్లపేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కతారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాక్ చెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, అడ్డా."
5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్ పూర్

# యథార్థభారతి

సంపుటం 13
సంచిక 6

ప్రమాది సంవత్సరం
శ్రావణమాసం
1939 సం॥రం ఆగష్టునెల

చందా
సం॥రం రూ 2-4-0
విడిప్రతిక రూ 0-4-0


ఓం

## బ్రహ్మవిద్యాశీర్వాదపద్ధతి.

---

21. దేహాద్బహిః సకలనామరూపాత్మకేషు వస్తుష్వపి సర్పధారాదిషు రజ్జురివవ్యాప్తః సచ్చిదానన్దలక్షణో యః పరమాత్మా స ఏవ పరశబ్దేనోచ్యతే. అన్తరహమాదిదృశ్యవిలక్షణోఽస్మత్ప్రత్యయాలమ్బనభూతః ప్రత్యక్ చిన్మాత్రరూపః సాక్ష్యాఖ్యో యో జీవాత్మా స ఏవాఽవరశబ్దేనోచ్యతే. పరశ్చాసావవరశ్చేతి పరావరః ప్రత్యగభిన్నః పరమాత్మా స ఏవమన్తర్బహిః పరరూపేణాఽవరరూపేణ చావస్థితే పరమార్థతః పరావరవిభాగరహితే ప్రత్యగభిన్నే పరావరే బ్రహ్మణి త్వంవాహమస్మి భగవో దేవతేఽహం వా త్వమసీతి శ్రుత్యనుసారేణాహం బ్రహ్మాస్మి బ్రహ్మైవాహమస్మీతి వ్యతిహారేణాఽఖణ్డైకరసత్వేన సాక్షాత్కృతే సతి తేన పరావరబ్రహ్మసాక్షాత్కారేణాస్య పరావరబ్రహ్మసాక్షాత్కృతవతో తుమ హృదయగ్రన్థిభేదః సర్వసంశయనివృత్తిః సర్వకర్మక్షయరూపః పరమపురుషార్థః సమ్యగావిర్భూయాత్.

తా॥ శరీరమునకు బయట సకలమైన నామరూపాత్మక వస్తువులందును, సర్పము, ధార, మొదలగు వానియందు త్రాడువలె వ్యాపించియున్నట్టి సచ్చిదానంద పరమాత్మయేదియో, అదే పరము అని చెప్పబడుచున్నది. లోపల నేను మొదలగు దృశ్యవిలక్షణమై, నేను అనెడి ప్రత్యయముయొక్క సంబంధముతో గూడినట్టి ప్రత్యక్ చిన్మా

త్రస్వరూపమైన సాక్షి అనెడి పేరుగల జీవాత్మయేదియో అది అక్ష
రము అని చెప్పబడుచున్నది. పరమే అవరమనుటచేత పరావరమన
నది ప్రత్యగభిన్న పరమాత్మయని యెఱుంగునది. అదియే లోపలను
బయటను పరరూపముగను అవరరూపముగను నుండునదియును, పర
మార్థముగా పరావరవిభాగములేనిదిగను నుండునట్టి ప్రత్యగభిన్న పరా
వరబ్రహ్మము. 'భగవంతుడా! దేవుడా! నీవేనేను, నేనేనీవు' అనెడి
శ్రుత్యుక్తమైన 'నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను' అనెడి వ్యతిహారము
చేత అఖండైకరసముగా సాక్షాత్కరింపబడినప్పుడు ఆ పరావర బ్రహ్మ
సాక్షాత్కారముచేత ఈ పరావర బ్రహ్మసాక్షాత్కారము చేయించెడి
నాకు హృదయగ్రంథిభేధమును. సర్వసంశయ నివృత్తియును, సకల
కర్మక్షయస్వరూపమైన పరమపురుషార్థమును చక్కగా ప్రకాశ
మగును గాక!

వ్యతిహారముఓత = ప్రోతభావము.

22. అహఙ్కారాత్మనో రేకత్వభ్రమనివృత్తిరూపోఽయంగ్రన్థి
భేదో దృఢీభూయాత్.

తా॥ అహంకారము, ఆత్మయను నీరెండును ఒక్కటే యనెడి
భ్రమను నివృత్తిచేయునట్టి ఈ గంథిభేదనము దృఢమగునుగాక!

---

# మనస్తత్వము.

(నివృత్తి మార్గము)

(శ్రీ మలయాళ స్వాములవారు).

(180-వ పుట శేషము.)

ప్రకృతియొక్క మహిమ ఇటువంటిది. రెండవదగు స్పర్శ
మును గూర్చి చింతించెదము. పైజెప్పిన రీతిగ మనయొక్క చర్మ
సృష్టి ననుసరించియే స్పర్శముగూడ తెలియనగును. కఠినమైనను,
మృదువైనను, ఉష్ణమైనను, శీతలమైనను త్వగింద్రియము యొక్క స్వభా
వముననుసరించి అనుకూలముగాను ప్రతికూలముగాను నుండును. మంచి

వేసవి మధ్యాహ్న కాలమునగూడ కొందఱు మండుచున్న యెండలో పనిచేయుదురు. కొందఱా తీక్ష్ణమగు యెండను సహింపలేక యుందురు. శీతకాలములో మంచులోకూడ కొందఱు సుఖముగ పనిచేయుచుందురు. కాని కొందఱకు చేతులు కాళ్లు ముడుచుకొనిపోగా, కష్ట పలెనుందురు. ఇట్లు కలుగుటకు కారణమేమి? స్పర్శేంద్రియ భేదమే. ఆలాగున ఒంటెయు, ఒకరకము మేకలు మొదలగునవియు నిండు యెండలో సంచరింపగలవు. గేదె మొదలగు జంతువులా యెండను సహింపజాలవు. ఇదిన్ని సృష్టివిశేషము కదా! మఱియు తాఁబేలు, కప్ప, మొదలగునవి మంచుగడ్డలలోకూడ జీవించును. కొన్ని ప్రాణులట్టి మంచులో జీవింపజాలవు. మానవులలోకూడ కొందఱికి తిమ్మిరి గలిగిన స్థలములలో నిప్పుతగిలినను, వేడిమి తెలియదు. ఇదిన్నీ స్పర్శేంద్రియ భేదమేగాని యుష్ణత్వభేదము కాదు. ఆలాగున నేత్రేంద్రియ శక్తి (చూపు) కొందఱకు మందగించిన, అట్టివారికి దగ్గఱనున్న వస్తువు కూడ బాగుగ కన్పించదు. సులోచనములు పెట్టిచూచిన, వారికిని బాగుగ కన్పించగలదు. ఈ భేదము దేనివలన కలిగినది? నేత్రభేదమే కాని వస్తుభేదము కాదు. కొన్ని యద్దములద్వారాజూచిన, చిన్న వస్తువులుకూడ చాల పెద్దవిగ గోచరించుట, మనముగాంచుట లేదా! దూరదర్శనీ సహాయముచే బహుదూరమున నున్న పదార్థములను కూడ జనులు కనుగొనుచున్నారు. ఈ రహస్యమునుగూర్చి విచారించిన, ఏ వస్తువుయొక్కయు యథార్థ స్థితిగతులు మనకు తెలియవనియు, మన మనస్సుయొక్క పరిమితిననుసరించి తెలిసికొనవలసియుండునేకాని, మఱేమియు చెప్పజాలమనియు దృఢముగ బోధగల్గును. మఱియు రంగు అద్దముద్వారా చూచిన యతనికి ఆయద్దము వర్ణముననుసరించి అన్నియు అదేరంగుగ గోచరించును. ఈ విషయమై యెవరేమి చేయగలరు? సూక్ష్మమైన దుర్భిణీ యంత్రసహాయముచే గాలిలోను, నీటిలోనుగల సూక్ష్మప్రాణులనుగూడ జనులు కనుగొన సమర్థులగుచున్నారు. కావున పరమేశ్వరుడు మానవుల కిచ్చియుండు నేత్రగోళసృష్టి ననుసరించియే అందఱికిని గోచరించుచుండునుగాని వాస్తవస్థితి అందఱకును తెలియసాధ్యముకాదు. మఱియు చీకటియందునప్పుడు కొన్ని

జంతువులకది ప్రకాశముగానుండును. మనకు ప్రకాశముగా నుండు
వాటికి చీకటిగానుండును. గుడ్లగూబలకు పగలు కన్ను కన్పించదు
రాత్రి బాగుగ కన్పించును. కాకి, కొంగ, కోడి మొదలగు జంతువులకు
చీకటిలో యేమియు కనుపించదు. గబ్బిలములు కారుచీకటిలో నున్న
చిన్నవస్తువులను కూడ కనుగొనును. గబ్బిలములలో కొన్నిరకములు
(యిండ్లలోనుండునవి) కారు చీకటిలో అతిసూక్ష్మములగు దోమ
మొదలగువాటిని పట్టి తినుచుండును కొన్ని జంతువులకు పగలున్నూ
రాత్రియున్ను ఒకేవిధముగ గన్పడును. పిల్లి, కుక్క మొదలగువాని
గా రాత్రిన్ని పగలున్నూ భేదములేకయే ఒకేవిధముగ కన్పించును. మీ
ములు మొదలగు జంతువులకు జలములోపల కన్పించునేగాని బయట
కన్పడదు. తాఁబేలు, మొసలి మొదలగు జంతువులకు నీటిలోను, తీరమం
దును ఒకేవిధముగ కన్పించును. ఇదంతయు పరమేశ్వరునిసృష్టి మహి
గదా. ఇక రసనేంద్రియవిషయమై యోచించిన అదిన్ని మఱింతచిత్ర
గానున్నదని తెలియగలదు. ఒకరికి రుచికరమైనది మఱియొకరికి అరు
గానుండును. ఒకరికి కొంచెముగా రసవంతముగనుండునది మఱియొకరి
మిక్కిలి రసవంతముగనుండును. దృష్టాంతముగ కొందఱకు ఉప్పు
కారము, పులుపు యెక్కువగా నుండవలెను. కొందఱు వాటిని భుజిం
జాలరు. కొందఱికి మధురముపై ప్రీతియుండును. ఇంకొకరికి అది య
మేయుండదు. మనకు మధురముగానుండు పదార్థములు కొన్ని జం
వులకు చేదుగానుండును. మనకు చేదుగానుండు వేపాకు మొదలైన
మేకలు మొదలైన వానికి రసయుక్తముగనేనుండును. ఈలాగున విచా
చిన, దేనినిగుఱించి యెవరు యేమిచెప్పగలరు? రాబందు మొదలగు
పక్షులకు దృష్టి అతిదూరముగ కన్పించెడి శక్తియుండును. కొన్ని జంతు
లకు ఘ్రాణేంద్రియము అతిదూరమునకూడ వాసనగనుకొను మహి
మగల్గియుండును. ఇవన్నియు చూచిన వాటి వాటి సృష్టిననుసరించి
వస్తువుల భేదము గోచరించుచున్నట్లు తెలియును. కొందఱు అతి
ప్రీతితో భుజించెడు గోమాంసాది పదార్థములు మఱికొందఱు ప్రాణ
స్నానముచేయుదురు. కొందఱకు పక్వాహారమిష్టము. మఱికొందఱకు
అపక్వాహారమందు ప్రీతి. కొందఱికి షడ్రసములం దిష్టముగలు

కొందఱకు తీపివస్తువులందభిరుచి జనించును. కొందఱకు ప్రకృతిసిద్ధమైనరసము మాత్రము చాలును. అట్టివారికి కృత్రిమరసములన్నియు నీరసములుగానేయుండును. ఈలాగున అన్నిటిని గూర్చియు విచారించుకొనవచ్చును. కొందఱకు అతిదుర్గంధము కలిగిన స్థలములున్నను ఘ్రాణేంద్రియమేమియు విరోధము కలుగజేయదు. మఱికొందఱకట్టి దుర్వాసన యెంతో బాధకరముగా నుండును. కొందఱకు సుగంధమందు ప్రీతిమిక్కుటము. ఇవన్నియును విచారించిచూచిన జనులందఱును ఏదోయొక అలవాటునకు వశులైయుండుటచే దానివలన అట్టిస్వభావము గల్గియున్నారని బోధపడును. కావున ప్రకృతిగుణములుండువఱకును సత్యము తెలిసికొనుట కెవరికిని సాధ్యముకాదు. అతీంద్రియజ్ఞానముకల యోగులకు అతిదూరమునగనుండు శబ్దమును వినుశక్తియు వస్తువులను కనుగొను శక్తియునుండును. గొప్పసిద్ధపురుషులకు త్రికాలజ్ఞానముండును. ఇట్టి మహిమయు తపోయోగాదులచే అంతఃకరణమందు కలిగిన మార్పేగాని వేఱుగాదు. గీతాచార్యులీ విషయమై యిట్లు పదేశించియున్నారు.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత
సర్వభూతాని సమ్మోహం సర్గేయాన్తి పరన్తప!

ఓ యర్జునుడా! జన్మించుకాలమున ఇచ్ఛాద్వేషముల బుట్టిన ద్వంద్వమోహముచే సమస్తప్రాణులును మిక్కిలి మోహమును పొందుచున్నవి. సృష్టికాలములో జన్మాంతర కర్మానురూపమగు సంస్కారముననుసరించి సత్వగుణముకాని, రజోగుణముకాని, తమోగుణముగాని, మిశ్రగుణముగాని, విశుద్ధగుణముగాని జీవకోట్లుగల్గియుండును. వాటినన్నింటిని యీ జన్మలో రహితమొనర్చిననే, జీవన్ముక్తిగల్గును. ఈ సంస్కారము పుష్పములో గంధమేలాగున సంబంధపడియుండునో అలాగునేయుండునని గీతాచార్యులుపదేశించిరి. ఎట్లన,

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్.

అనగా, దేహేంద్రియాది సంఘాతమునకు స్వామియగు జీవుడు ఎప్పుడీ శరీరమునుండి బయలుదేఱి మఱియొకశరీరమును పొందుచు

న్నాడో అప్పుడు, పరిమళమునకు, స్థానమైన పుష్పము మొదలగున్నా నుండి వాయువు వాసనగల సూక్ష్మాంశములను స్వీకరించిపోవునట్లు మనస్సుతో కూడిన యింద్రియములను స్వీకరించి పోవుచున్నాడు. ఇహ లోకమునుండి పరలోకమునకు జీవుడేలాగున పోవుచుండునో పరలో కమునుండి యిహలోకమునకును ఆలాగున వచ్చుచుండును. ఇది మా వులకు గల్గియుండేలాగున దేవతలకున్ను, అసురులకును రాక్షసులకు గూడ వ్యాపించియుండునదే. గీత చూడుడు.

నతదస్తి పృథివ్యాంవా దివిదేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః.

'ప్రకృతివలన బుట్టిన సత్త్వాది మూడు గుణములచేత విము బడిన స్థావర జంగమాది రూపమైనవస్తువు మనుష్యలోకమునైనను స్వర్గాది లోకమునైనను, దేవతలలోనైనను, మఱియెక్కడనైనను లేదు!' దీనిని యోచించిన, చతుర్దశ భువనములలోగల జీవకోట్లన్ని యు ఏదో యొకవిధమగు ప్రకృతిగుణముతో కూడి యున్నట్లు గోచ రమగుచుండును. కావుననే గీతలో 14-వ అధ్యాయమున,

గుణానేతానతీత్యత్రీన్ దేహీదేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే.

అని చెప్పబడినది. అనగా 'జీవుడు దేహమువలనఁబుట్టిన సత్త్వా దిమూడు గుణములను దాటి, పుట్టుక, చావు, ముదిమి, దుఃఖములు, అనువానిచే, యీ శరీరముండినను విడువబడినవాడై (జీవన్ముక్తుడై) మోక్షమును పొందుచున్నాడ'ని యర్థము. కావున ముముక్షువులు, యీత్రిగుణములలో యేగుణమైనను తమలో నుండినచో దాని యొక్క ప్రభావమే మనలను ఈలాగున ప్రవర్తింపజేయుచున్నదని తెలిసికొని అట్టిగుణములను రహితమొనర్చుటకు చూడవలెను. అట్లైన వారు ధన్యాత్ములగుదురు. బంధవిముక్తి కలుగువఱకు అట్టి పరమసత్య ముపైననే ఆధారపడియుండవలెను. సత్యము ఒకేవస్తువుగను, ఒకేరూ పముగాను యుండునేగాని అనేక రూపములుగాను, అనేకవిధములు

గాను యుండునది కాదు. అట్లనేక విధములనుండునది సత్యము కాదు. సత్యమే సద్వస్తువు; అదే ఈశ్వరస్వరూపము; అదే బ్రహ్మము; అదే భగవత్స్థానము; అదే కైవల్యము. జీవులను, అట్టి పరమసత్యమును తెలియనీయక మాయ అంతఃకరణమున జేరి మోహమును కలుగజేయుచుండును. ఇదే దీనిలోగల మర్మము. సత్యమెల్లప్పుడును యేకరీతిగనే నుండవలెను. ఏకాలమందును దానికేలాటి మార్పును కలుగగూడదు. ఈధర్మము నాధారముగ చేసికొని చూచిన మనకు చిన్నకాలమునుండి యిప్పటి వఱకు యెన్నిమార్పులుగల్గినవో తెలియందగును. ప్రాకృతగుణమునకు మాత్రమే పరిణామముకల్గును. కావున శైశవావస్థనుండి గలిగి వచ్చిన మార్పులన్నియు అంతఃకరణములో గల ప్రకృతిగుణములే. ఇఁకను మార్పుగలుగుచుండిన అవియున్నూ, ప్రకృతియొక్క స్వభావములని మే గ్రహించవలెను. అయితే యీ అవిద్య త్రిగుణాత్మకమనఁబడును. సత్వగుణమనియు, రజోగుణమనియు, తమోగుణమనియు త్రిగుణముల కుపేర్లు. అవి ఒక్కొక్కదానిలో నొకొక్కటి కలసి యనేక భేదములు గనుండును. బాల్యకాలమున యాటలలో సౌఖ్యముగలదను తలంపు గల్గియుండును. దానికి మించిన సుఖమాతనికి కన్పించదు. కొంతకాలముగడచిన పిదప, విద్యాభ్యాసములోను, దానికి సంబంధించిన కార్యములలోను మనస్సు మగ్నమైపోవును. అప్పుడట్టి స్వభావమునకు మించిన జీవితము మానవ జీవితమే కాదను తలంపుగల్గును. పిదప యట నుండి యౌవనదశకు వచ్చును. ఆపత్తులన్నిటికిని, వ్యామోహము లన్నిటికి నదే తగిన కాలము. ప్రకృతి అప్పటికి బాగుగ వికాసము పొందియుండును. మాయయొక్క మహిమలన్నియు అతని యందుసంస్కారము ప్రదర్శింపజేయుచుండును. అత్తఱి స్త్రీలకైనను పురుషులకైనను వైవాహిక సుఖమునకన్న మించిన సౌఖ్యము ప్రపంచములో లేదను తలంపు గలిగించును. కొంతకాలము మలినమైన ఆ విషయములోనే జీవులు కాలము గడుపుదురు. ఆ తరుణమున యెట్టిహీన విషయముకూడ మహాశ్రేష్ఠముగ తోచుచుండును. మలమూత్రమయమగు శరీరములో బంగారముకన్న అధికమగు ప్రీతిగల్గియుండును. అమృతము కూడ దీనికి మించినదను తలంపు గలుగదు. శరీరములోగల నవద్వారముల

నుండి యుద్భవించెడు మలములన్నియు పీయూషమునకన్న యెక్కువ మహిమగలవని మాయాప్రభావముచే జీవులు తలంతురు. అకటా! అవిద్యయొక్క ప్రభావమేమని వర్ణింపవచ్చును! ఎంత మేధాసంపత్తి గలవానిని కూడ నేమియు తెలియని పరమమూఢునిగ నొనర్చు యీ అవిద్యయొక్క శక్తి యేమని వర్ణించవచ్చును? జ్ఞానులనుకూడ మహా మోహచక్రమున పడవైచి త్రిప్పునట్టి యీ అజ్ఞానముయొక్క శక్తి యేమని (సశేషము.)

# ధార్మిక సందేశము.

శ్రీ శివానంద సరస్వతీస్వాములవారు (హృషీకేశము).

[ చిత్తూరు 'తపోవన' ప్రారంభోత్సవసమయమున హృషీకేశమునుండి శ్రీ శివానంద సరస్వతీ స్వాములవారు పంపిన ఆంగ్లసందేశమునకు అనువాదము. ]

ఆత్మసాక్షాత్కారము, లేక, దైవప్రాప్తియే జీవితముయొక్క పరమలక్ష్యము. సర్వోత్తమమై, సర్వాధిష్ఠానమై వెలయు చైతన్యము (ఆత్మ, బ్రహ్మము లేక పరతత్వము) మీహృదయాంతరాళమున యందే వసించియున్నది. ఆ పరమాత్మ భూతభవిష్యద్వర్తమాన కాలములందును స్థితిగల్గి యేకరీతి వెలుంగుచుండును. ఆతడు సద్ఘనము, చిద్ఘనము, ఆనంద ఘనము దేశకాలక్రియలచే పరిచ్ఛిన్నమైనట్టి నశ్వరమగు బాహ్య వస్తు సముదాయముననే శాశ్వత సుఖము గలదనియెంచి అజ్ఞుడు వానిని వెన్నంటుచు విఫలమనోరథుడగుచున్నాడు. వానికి మనశ్శాంతి లేదు. వాని కోర్కెలున్ను పూర్ణములు కాలేదు. ఆతడు ధనమార్జించును; సంతతిగనును; కీర్తిగౌరవములను, పేరుప్రతిష్ఠలను సంపాదించును. కాని యింకను వాని మనస్సు అశాంతముగనే యున్నది. స్థిరమై శాశ్వతమైనట్టి పరమానంద మాతనికి లభించుటలేదు. ఆతడింకను యెద్దానినో వాంఛించునే యున్నాడు. పూర్ణత్వానుభవము వానికి కలుగలేదు. స్థిరసంతుష్టియు, పూర్ణత్వానుభవమున్ను ఆత్మసాక్షా

త్కారము ఇంద్రియనిగ్రహము, హృదయ పారిశుద్ధ్యత, ధ్యానముల వలననే సంప్రాప్తమగును.

చంచలములగు ఇంద్రియసుఖములను యావర్తములఁబడి మీరు మీ జీవితలక్ష్యమును, ధ్యేయమును విస్మరించినారు. ఆత్మ కొఱకు గాక దేహము కొఱకే మీరెక్కువగ జీవించుచున్నారు. మిథ్యాప్రాపంచిక విషయభోగముల వెంట బరుగిడుటలో మీరు మీ యాధ్యాత్మిక కర్తవ్యమును, ఆత్మిక సంస్కారములను మైమఱచితిరి. ఆహా! ఎట్టి శోచనీయమగు స్థితి? అత్యాశ్చర్యకరమైనదీ మాయ! అతి విస్మయజనకమైనదీ మోహము! దీర్ఘమగు నీ యజ్ఞాన నిద్ర నుండి మేల్కొనుము. పరమసత్యమును సాక్షాత్కరించుకొని శాశ్వతానంద మనుభవింపుము.

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, హిమవత్పర్వత శిఖరములు, మల్లె, గులాబి పుష్పములు, నైగరా జలపాతము, విశాల సముద్రము - వీనిఁగాంచి నీవచ్చెరు వందుదువు. విమానము, స్టీమరు, రైలుబండి, టెలిగ్రాఫ్, వైర్‌లెస్ మున్నగువానిని జూచి ఆశ్చర్య చకితుఁడవగుదువు. కాని హృదయస్థమగు మనస్సు యింకను అద్భుతమైనది. క్షణములో నయ్యది కొలంబోనుండి లండనుకును, హిమాలయమునుండి బెర్లినుకును పయనమగును. అయినను, వీటన్నింటికంటెను ఆశ్చర్యకరమైన వస్తువింకొకటి కలదు. అదియే ఆత్మ. అదియే శాశ్వతమగు పరబ్రహ్మము. జగంబంతటను వ్యాపించి, సూర్యచంద్రనక్షత్రాదులను, మనస్సును గూడ నది ప్రకాశింపజేయుచున్నది.

స్థూలదేహముతో ఆత్మను తాదాత్మ్యము నొందింపవలదు. ఇట్టి దేహతాదాత్మ్యమే మహాపాతకమని యెఱుంగుము. కువికల్పనలను, దురాలోచనలను పరిత్యజించుము. వ్యర్థ పరిశ్రమలఁ గావింపకుము. సంకల్పముల దూరీకృత మొనర్పుము. వాంఛలను, దురాశలను, ప్రాపంచిక వైభవములను లెస్సగ బారద్రోలుము. స్వార్థచింతనను వీడుము. ఇతరుల స్తుతి మన్ననల గోరకుము. పేరు ప్రతిష్ఠల నభిలషింపకుము. వ్యాధి, పరసమాలోచనలయెడ భీతిల్లకుము. దుర్భాషణ, దూషణాదులకు చెవి యొగ్గకుము. ప్రాపంచిక పదార్థముల తోటి సం

బంధమును వదలుము. సంసారిక బంధనమును, విషయాసక్తిని త్రెంచి వేయుము. అట్లొనర్చిన, నీవిక శాశ్వతానంద సామ్రాజ్యమును, స్వర్గ లోకమును యిపుడే చేరగలవు. ఇపుడే ముల్లోకములకు నధిపతి వగుదువు. సర్వదేవతలిపుడే నిన్ను సంస్తుతించెదరు.

నామరూపాత్మక స్వప్నమునుండి మేల్కొనుము. అసత్యము లగు యీ నామరూపముల నాశ్రయించి వ్యర్థముగ మోసపోకుము. సత్యమగు ఆత్మవస్తువునే అవలంబింపుము. ఆత్మనే ప్రేమింపుము. ఆత్మ (బ్రహ్మ) యే సత్యమైనది. ఆత్మయొకటియే స్థితి గలదియగును కాన ఆత్మయందే వసింపుము. ఆత్మయే యగుము. ఇదియే నిజమైన జీవితము.

ఆశలను చంపుము. కోర్కెల నణగద్రొక్కుము. మనస్సు యొక్క యల్పబుద్ధిని విడనాడుము. ఆత్మగాంభీర్యము ననుభవింపుము. ఆత్మయందు ఏకోరిక గాని, వాసనగాని లేదు. అదెల్లపుడును పవిత్ర మైనదై, పరిపూర్ణమై, స్వమహిమయందే స్థితిగల్గియున్నది. ఆత్మ మహత్తరమగు యాత్మతోటి తాదాత్మ్యమునొందుము. అపుడే కోర్కె లన్నియు సమయును. వాంఛితములెల్ల యీడేరును, ఇదియే పూర్ణ కామత్వము నందలి రహస్యము. అపుడు ప్రకృతి నీకు వశవర్తియై నీయాజ్ఞల కార్యాన్వితమొనర్చును. పంచభూతములు నీయాజ్ఞకు బద్ధు లైయుండును. అష్టసిద్ధులు, నవబుద్ధులు నీపాదములచెంత జోహారు లొనర్చుచుండును. అంజలిబద్ధులై అయ్యవి నీ యాదేశముల నెరవేర్ప సంసిద్ధముగనుండును. ఈ పరమసత్యమును వేదాంతమున్ను యుద్ఘో ధించుచున్నది.

అతిపవిత్రుఁడవై, మహాధైర్యమవలంబించి సత్యము కొఱకై ప్రాణమేమి, సమస్తమున్ను త్యజించుటకు సంసిద్ధుడవై, సమదృష్టిగల్గి ఆత్మజ్ఞానార్జనాసక్తుఁడవై, మహాత్ములఁగాని, సద్గురువునుగాని హృదయ పూర్వకముగ సేవించుచుండిన, అచిరకాలములోనే నీవాత్మసాక్షా త్కారము నొందగలవు.

కర్మయోగము- సాధకుని మనంబును ఆత్మజ్ఞానమున కర్హ మొనర్చును. మఱియు వేదాంతాధ్యయనమునకు నాసినది తగిన యో

కారిగఁజేయును. అజ్ఞులు ప్రథమమున కర్మయోగసాధన లేకనే జ్ఞానయోగమునకు గడంగుదురు. కనుకనే వారు సత్యస్వరూపమగు ఆత్మను సాక్షాత్కరింపజాలక తమ యత్నముల విఫలులగుటకు హేతువగుచున్నది. అపవిత్రత, మాలిన్యము, దోషము లింకను వారి మనంబుల దాగియేయున్నవి. వారి చిత్తము ఇష్టానిష్టములతో కూడియేయున్నవి. బ్రహ్మమునుగూర్చి మాటలను మాత్రము జెప్పుదురు. అనేక వ్యర్థ సంభాషణయందును, వాదవివాదములందును, కలహమునందును వారు పాల్గొనుచుందురు. వారిది వాచావేదాంతము మాత్రమే. ఆత్మభావముగల్గి, నిస్వార్థబుద్ధితో ఏవిధముననైన లోకసేవ, ప్రజాసేవాదుల నిరంతర మాచరించుటయను అనుష్ఠాన వేదాంతమే మనకిపుడు కావలసినది.

ప్రేమజ్యోతిని నీహృదయమున స్థాపిత మొనర్పుము. సర్వభూతములయెడ నీప్రేమను విస్తరింపజేయుము. విశ్వప్రేమ నభివృద్ధి పఱచుము. ప్రేమయనునది సర్వజీవుల హృదయము నైక్యమొనర్చునట్టి యొక దైవీకవస్తువు. అప్రతిహత ప్రభావముగల దివ్యభేషజమే అది. నీవాచరించు ప్రతిక్రియయు ప్రేమపూరితమై యుండవలెను. మోసము, అత్యాశ, కొంటెతనము, స్వార్థబుద్ధి—వీనిని మొదలింట నఱికివేయుము. కారుణ్యము, దయ, ప్రేమ గల్గి పుణ్యకార్యముల నిరంతర మాచరించుచుండుటచే శాశ్వతవస్తువు (ఆత్మ) లభించును. దయార్ద్రహృదయుడవై పరప్రాణుల కెల్లపుడు సేవజేయుచుండుటచే ఈర్ష్యాసూయక్రోధాది దుర్గుణములెల్ల సమసిపోవును. పరోపకారాది పుణ్యకార్యముల నాచరించుటచే నీకింకను అధిక బలము, అధికానందము, అధిక సంతుష్టియు గలుగును. సర్వులచే నీవు ప్రేమింపబడుదువు. జీవకారుణ్యము, పరోపకారము, పుణ్యకార్యములు మున్నగునవి హృదయమును కోమలముగను, పవిత్రవంతముగను నొనర్చి హృదయకమలము నూర్ధ్వముఖముగజేసి యాత్మప్రకాశ గ్రహణమున సాధకుని యర్హునిగ గావించును.

పరమలక్ష్యమును సాధించుటయే జీవితము. విజయమే జీవిత చిహ్నము. మఱల మఱల సాధించుచు, ఈ యాత్మానాత్మ సంగ్రామమున విజయము గాంచవలెను. ప్రగతిపరంపరయే జీవితమగును. ఇంద్రి

యమనంబుల జయింపుము. ఇవియే నీ నిజమైన శత్రువులు. యా
మనుష్ఠించునట్టి వ్రతములగై కొనుము. భాహ్యాభ్యంతర ప్రకృతు
రెంటిని నిర్జింపుము. ఆత్మవిరుద్ధములగు మాయా, తమస్సుల
పోరాడి జయము నొందుము. నిన్నవనతికి యీడ్చునట్టి సంస్కారము
నిగ్రహించుము. అట్టిచో నిక యీజన్మమున నే నీవు పరిపక్వయోగివై
విరాజిల్లగలవు.

నీ ఆత్మయొక్క అనంతశక్తియందు విశ్వాసము గల్గియుండుము
'తత్త్వమసి'—నీవే బ్రహ్మము. కానయాబ్రహ్మము నే అన్వేషింపుము
దానినిగూర్చియే వినుము. దానినే తెలిసికొనుము. మనన నిదిధ్యాస
ముల ద్వారా పూర్ణాత్మను సాక్షాత్కరించుకొనుము. ఆత్మ యె
డును జన్మించునది కాదు. మరణించునది కాదు. సంశయములను
అంధవిశ్వాసములను పారద్రోలుము. దుస్సంస్కారములను, దుర్భా
నలన్నింటిని తెగటార్చుము. స్త్రీయైనను, పురుషుడైనను సరే, వేదా
లక్ష్యము నిరువురును సాధింపగల్గుదురు. ఇందు సందియమేమియు
లేదు. మిథ్యావిభేదంబుల హతమొనర్పుము. చిన్న పెద్ద, ఎక్కు
తక్కువ, చేతనము జడము, యనునవి యథార్థముగ ఆత్మయందు లే
నీ యాత్మనే యెల్లడలను గాంచుము. ఆత్మకన్యముగ యెద్దియును లే

అల్పవిశ్వాసముగల నో మానవుడా ! దీర్ఘమగు నీ యజ్ఞాననిద్ర
నుండి లెమ్ము. ఆత్మజ్ఞానము బడయుము. సంసారపంకమగ్నుడవగు
జీవా ! నీవు నీ స్వస్థానమున కేగుము. అదియే శాశ్వతమైనది. శాం
యుతమైనది. అనంతానందపరిదమైనది. మహచ్ఛక్తియుతమైనది
ప్రకాశముల కదియే యాకరము. సచ్చిదానందమయమై, అనంత తే
విరాజితంబైన బ్రహ్మమేయది. మనస్సు నాత్మభావనలతో నింపుము
నీయొక్క ప్రతి భావమున్ను పవిత్రవంతమై చైతన్యమయమై యు
వలెను. ప్రకాశములన్నింటికిని ప్రకాశమగు ఆత్మ నీ దేహమం
ప్రతి రోమముననను వెలుంగుగాక ! అనంతమగు పరమాత్మ నీ శరీరము
దలి ప్రతి అణువందును వ్యక్తమై స్ఫురించుగాక! నీయుచ్ఛ్వాస నిశ్వాస
ములన్నియు 'సోహం' 'రాధేశ్యామ్' 'సీతారామ్' యనునామస్మ
ము[illegible] ఆత్మయొక్క [illegible] శంబును పాడుగా

ఏకాంతమున ధ్యానాదులనొనర్చుట కనుకూలముగ నుండుటకై చిత్తూరునందొక యాశ్రమమును నిర్మింపదలంచిరని వినుట కెంతయో సంతసము. అట్టి ఆశ్రమములున్ను, ఏకాంతధ్యాననిష్ఠకై తగిన కుటీరములును, జిల్లాయంతట అచటచట ముఖ్యముగ స్థాపింపబడవలసియున్నవి. (కారణాంతరములచే) ప్రతివారికిన్ని హిమాలయములకుజని తపస్సుచేయుటకు అనుకూలము తటస్థింపదు. అట్లుపోజాలనివారికీ యాశ్రమములు నెంతో సహాయభూతములై యొప్పును. మఱియు సాంసారిక జీవితమునెడ విసుకు జెందినవారు సమీపముననున్న యట్టిపుణ్యాశ్రమములకు, ఏకాంతస్థలములకు జని, యెంతయో మేలును బొందగలరు. చిత్తూరునందు ఆశ్రమనిర్మాణమునకై మీరు గావించు యత్నములన్నియు సఫలమగునుగాక!

శాశ్వతానందమును పరమప్రశాంతిని ప్రసాదించి, జీవన్ముక్తులుగను, నిర్భయులుగను నొనర్చునట్టి ఉత్తమ కైవల్యపదమును మీరందరును పొందుదురు గాక!

స్వామి శివానంద.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

---

# అరుట్పెరుంజ్యోతి శ్రీరామలింగ స్వాములవారిచే

నుపదేశింపబడిన

## తత్త్వోపదేశము.

మనము పొందదగు పురుషార్థములు నాల్గు. 1 హేమసిద్ధి 2 సిద్ధవిద్య 3 తత్త్వనిగ్రహము 4 భగవత్ స్థితి నెఱిగి తన్మయమగుట.

వీటిని పొందుటకు నిగ్రహములు 4 విధములు. 1 ఇంద్రియ నిగ్రహము 2 కరణ నిగ్రహము 3 జీవనిగ్రహము 4 ఆత్మ నిగ్రహము.

## (1) ఇంద్రియ నిగ్రహము.

ఇంద్రియ నిగ్రహమనగా కఠినవాక్కులు చెవి జొరనివ్వక, నాదము మొదలగు స్తోత్రములను వినుట, అశుద్ధ స్పర్శములేక దయా రూపముగా స్పర్శించుట, క్రూరముగా చూడకుండుట, రుచి గోరకుండుట, సుగంధము నిష్టపడకుండుట, సత్యముపలుకుట, అసత్యము పల్కకుండుట, జీవహింస సంభవించు సమయములందే యుపాయములచేనైన నడ్డగించుట, పెద్దలు వసించుచోట్ల కరుగుట, జీవోపకార నిమిత్తముగా సాధుజనవాస స్థలములయందును దివ్యక్షేత్రములయందును సంచరించుట, సత్ప్రయత్నమున నిల్చుట, యెత్తుట మొదలగునవి చేయుట, మితాహారము మితభోగము జేయుట, మలజలోపాధులను క్రమముగా విసర్జించుట, కాలభేదముచేతను ఉష్ణాభాసముచేతను అడ్డు దగిలినచో ఓషధ్యాదులచేతనో భౌతిక మూలముచేతనో చరభేదహస్త, స్పర్శ, తంత్రములచేతనో మూలాంగ ప్రణవధ్యాన సంకల్పము చేతనైనను నివర్తించుట, (మందదరునకు) శుక్లమును అక్రమాతిక్రమముల ద్వారాస్ఖలితము గాక నిలుపుట, (తీవ్రదరునకు) శుక్లమును ఏవిధముగానైనను స్ఖలితముగాక నిలుపుట, ఏమఱక కోశమును కవచముచే మూయుట, ఇటువలెనే కపాలము, బొమ్మ, మొదలగు యంగములను మఱుగుపఱచుట, సంచరించు కాలములయందు పాదములయందు కవచమును ధరించుట, మలినవస్త్రమును ధరించకుండుట, మొదలగునవి ఇంద్రియనిగ్రహము.

## (2) కరణనిగ్రహము.

కరణనిగ్రహ మనగా, మనస్సును చిత్సభయందు నిల్పుట అనగా భ్రూమధ్యముననిల్పుట, దుర్విషయములందు పోనివ్వకుండుట, జీవదోషముల విచారించకుండుట, తన్ను మఱించకుండుట, రాగాదుల వదలి సత్వమయమగుట, తన తత్త్వముల నకర్మములయందు పోనివ్వకుండుట మొదలగునవి కరణనిగ్రహము.

## (3) జీవనిగ్రహము.

జీవనిగ్రహమనగా! స్త్రీ పురుషులు మొదలగువారి యందును జాతి, సమయము, మతము, ఆశ్రమము, సూత్రము, గోత్రము,

కులము, శాస్త్ర సంబంధము, దేశమార్గము, ఎక్కువవారు తక్కువ వారనే భేదములనవదలి ఎల్లరు మనవారని సమత్వముగ జూచుట జీవనిగ్రహము.

### (4) ఆత్మనిగ్రహము.

ఆత్మనిగ్రహమనగా పిపీలికాది గజపర్యంతము దోచు శరీరము లందుండు జీవాత్మ చిత్సభగాను, అందులోనుండు పరమాత్మయే పతి గాను మెఱిగి దేనినిగాని వదలక, యెచ్చోటను అభేదమై సర్వముతానై నిలుచుట ఆత్మనిగ్రహము. ఇవ్విధముగా నిలిచినచో పైకనిన పురుషార్థ ములు చేకూఱును.

ఇట్లు,
ఉత్తర వడలూరు సమరస సన్మార్గసంఘము.
అనకాపుత్తూరు.

—:o:—

# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

## (శ్రీ శ్రీకంఠశివాచార్యులవారి గీతాభాష్య గ్రంథమునుండి)

## (త్రయోదశాధ్యాయము)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె:—ఓ లక్ష్మీ! ఇక గీత 13వ అధ్యాయ మాహాత్మ్యమును వినుము.

దక్షిణదేశమందలి హరినామ నగరమందు ఒక స్త్రీ యుండెను. ఆమె వ్యభిచారిణియు వ్యసనశీలురాలునునై యుండెను. ప్రతిదినము క్రొత్త క్రొత్త పురుషులతో విలాసముగా కాలము గడుపుచుండెడిది. ఒకనాడొక నూతన పురుషుని ఒక అరణ్యప్రదేశమందలి సంకేతస్థాన మునకు రమ్మని తాను అక్కడకు పోయెను. కాని వేఱొక పనికారణ మున నాపురుషుడచటికి రాకుండెను. అంతట నామె కామబాధకోర్వ లేక అటునిటు తిరిగి రొదపెట్టి యేడ్వదొడగెను. ఆ యేడుపు విని ఒక సింహామచటికి వచ్చి ఆమెను చంపి తినినదైనను. తరువాత ఆమె

మరుసటి జన్మయందును వ్యభిచారిణియై జనించెను. ఆ జన్మయందు
అనేక దురాచారములు చేయుచుండెడిది. ఆమె నివసించు యింటి
సమీపమున నొక శివాలయముండెను. అచట నొక బ్రాహ్మణు
ప్రతిదినము గీత 13వ అధ్యాయమును పఠించువాడు. అట్లా బ్రాహ్మ
ణుడు పారాయణ చేయుచుండుటగని ఆమెకును పఠనచేయుటకు
కలిగెను. ఆమె అటునిటు తిరుగుచు సగము అధ్యాయమును మా
మచ్చుటచ్చుట వినెను. చివరకామెకు పూర్తిగా వినవలెనని తలం
కలిగి ఆమందిరములోనికి వెళ్లి కూర్చుండెను. అంత నాబ్రాహ్మణు
పారాయణ చేయమొదలిడెను. ఆమె మనస్ఫూర్తితో హృదయ
నిలిపి వినుచునేయుండెను. అధ్యాయము పూర్తియగు సరికి ఆమె చే
సమస్తపాపములు నశింప, శరీరమును వదలి, విమానము మీ
గూర్చుండి స్వర్గమునకు పోయెను.

---

(శ్రీ భగవద్గీత)

# 11. విశ్వరూప సందర్శన యోగము.

---

(శ్రీ మలయాళస్వాములవారు)

విశ్వరూప యోగమని చెప్పక విశ్వరూప సందర్శన యోగ
చెప్పుటచే భగవంతునియొక్క విశ్వరూపము లెస్సగా దర్శింప
యోగమని దీనికిపేరు. విశ్వరూప సాక్షాత్కారము ఈ యధ్యాయ
జూపినందుచే దీనికి విశ్వరూప సందర్శనయోగమను పేరు గల్గినది.
వద్దర్శనమనిగాని భగవత్ ప్రత్యక్షమనిగాని, భగవత్సాక్షాత్
మనిగాని చెప్పక, విశ్వరూప సందర్శనమని చెప్పుటలో గొప్పరహ
ముగలదు. వేదాంతశాస్త్రముయొక్క కొసలో, ఈజగత్తంతయు
వత్స్వరూపమనియు బ్రహ్మమయమనియు, మాయవలన ఆ స
మును మెవరున్ను కనుగొనజాలకున్నారనియు భగవానులుప
యున్నారు. 'ఏకమేవాఽద్వితీయం' అనిచెప్పు శ్రుతివాక్యమే యు

ప్రమాణము. అయితే అట్టి అప్రాకృతమగు దివ్యదర్శనము మాయచే నావృతమగు హృదయముగలవారికి దర్శింప సాధ్యము కాదనియు, మాయయొక్క ఆవరణము భగవత్కృపవలననే తొలగవలెననియు, అప్పుడే దివ్యదృష్టిగలుగుననియు ఈ యధ్యాయమువలన తెలియఁదగినది. భగవత్కృప గలుగుటకు నిష్కళంకమైన భక్తియే ముఖ్యసాధనమని యుపదేశించిరి. శ్రీకృష్ణభగవానుని దేహమందే అర్జునుడు చతుర్ముఖ బ్రహ్మను, దేవతలను, ఋషులను ఆదిత్యులను యక్షులను గంధర్వులను రాక్షసులను మానవులను పశ్వాది తిర్యగ్జంతువులను వెన్మ్యేల, లోకమంతయును చూడడమైనది. కావున యీజగత్తంతయు వాసుదేవమయమని 7-వ అధ్యాయమున చెప్పుటకు కారణమైనది. ఏకత్వమున అనేకత్వమును కల్పించుట మాయయొక్క పనియైయున్నది. అట్టి అవిద్య నశించిన 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అనుశ్రుతి వాక్యము గోచరమగును. ఇదే దీనిలోగల ముఖ్యవిషయము. రెండవది, యజ్ఞాదిక్రతువులచేగాని వేదాధ్యయనాదులచేగాని మోక్షము కలుగదనియు, అనన్యభక్తి యొక్కదానివలననే యీశ్వరసాక్షాత్కారము సిద్ధించుననియు సెలవిచ్చియున్నారు. ఇదే కారుణ్యమయుడగు శ్రీకృష్ణభగవానునికి జీవరాసులలోగల వాత్సల్యము. ఏలన, యజ్ఞములు చేయుటకున్ను, వేదములు పఠించుటకున్ను, దానములు చేయుటకున్ను, తపస్సులు సల్పుటకున్నూ అందఱకు అనుకూలముండదు. అనన్యమైన భక్తిగలిగి సర్వేశ్వరస్మరణ హృదయములో గలిగియుండుట ప్రతివారికి సాధ్యమైన పనియేగాని, భారమేమియు దీనియందు లేదు. శ్రద్ధయు, పవిత్రతయు గలిగిన చాలును. మూడవది, మానవులు నిమిత్తమాత్రులనియు, సమస్తమును సర్వేశ్వరశక్తి వలననే జరుగుచున్నదని తలంచి నిస్సంగత్వము వహించి భగవదర్పిత హృదయము గల్గియుండవలెనని దీనివలన తేలుచున్నది. కనుకనే అర్జునునితో నీవు నిమిత్తమాత్రుడవేగాని సమస్తక్రియలును నావలననే జరుగుచున్నవని చెప్పుటకు హేతువైనది. అయితే సమస్తము భగవదాజ్ఞానుసారము జరుగుచున్నదని తలంచి పురుషప్రయత్నము నుపేక్షించియుండవలెని కాదు. తాను చేయవలసిన కృత్యములను నిర్వహించుట ఈశ్వరాజ్ఞయైయున్నది.

మరుసటి జన్మయందును వ్యభిచారిణియై జనించెను. ఆ జన్మయందు అనేక దురాచారములు చేయుచుండెడిది. ఆమె నివసించు యింటి సమీపమున నొక శివాలయముండెను. అచట నొక బ్రాహ్మణుడు ప్రతిదినము గీత 13వ అధ్యాయమును పఠించువాడు. అట్లా బ్రాహ్మణుడు పారాయణ చేయుచుండుటగని ఆమెకును పఠనచేయుటకు బుద్ధి కలిగెను. ఆమె అటునిటు తిరుగుచు సగము అధ్యాయమును మాత్రము మచ్చుటచ్చుట వినెను. చివరకామెకు పూర్తిగా వినవలెనని తలంపు కలిగి ఆమందిరములోనికి వెళ్లి కూర్చుండెను. అంత నాబ్రాహ్మణుడు పారాయణ చేయ మొదలిడెను. ఆమె మనస్ఫూర్తితో హృదయము నిలిపి వినుచునేయుండెను. అధ్యాయము పూర్తియగు సరికి ఆమె చేసిన సమస్తపాపములు నశింప, శరీరమును వదలి, విమానము మీద గూర్చుండి స్వర్గమునకు పోయెను.

---

(శ్రీ భగవద్గీత)

# 11. విశ్వరూప సందర్శన యోగము.

---

(శ్రీ మలయాళస్వాములవారు)

విశ్వరూప యోగమని చెప్పక విశ్వరూప సందర్శన యోగమని చెప్పుటచే భగవంతుని యొక్క విశ్వరూపము లెస్సగా దర్శింపబడు యోగమని దీనికి పేరు. విశ్వరూప సాక్షాత్కారము ఈ యధ్యాయమున జూపినందుచే దీనికి విశ్వరూప సందర్శన యోగమను పేరు గలిగినది. భగవద్దర్శనమనిగాని భగవత్ ప్రత్యక్షమనిగాని, భగవత్సాక్షాత్కారమనిగాని చెప్పక, విశ్వరూప సందర్శనమని చెప్పుటలో గొప్పరహస్యము గలదు. వేదాంతశాస్త్రము యొక్క కొసలో, ఈజగత్తంతయు సద్వస్తు స్వరూపమనియు బ్రహ్మమయమనియు, మాయవలన ఆ సత్యము నెవరున్ను కనుగొనజాలకున్నారనియు భగవానులుపదేశించియున్నారు. 'ఏకమేవాఽద్వితీయం' అని చెప్పు శ్రుతివాక్యమే యిందుకు

ప్రమాణము. అయితే అట్టి అప్రాకృతమగు దివ్యదర్శనము మాయచే నావృతమగు హృదయముగలవారికి దర్శింప సాధ్యము కాదనియు, మాయయొక్క ఆవరణము భగవత్కృపవలననే తొలగవలెననియు, అప్పుడే దివ్యదృష్టిగలుగుననియు ఈ యధ్యాయమువలన తెలియఁదగినది. భగవత్కృప గలుగుటకు నిష్కళంకమైన భక్తియే ముఖ్యసాధనమని యుపదేశించిరి. శ్రీకృష్ణభగవానుని దేహమందే అర్జునుడు చతుర్ముఖ బ్రహ్మను, దేవతలను, ఋషులను ఆదిత్యులను యక్షులను గంధర్వులను రాక్షసులను మానవులను పశ్వాది తిర్యగ్జంతువులను వెన్యేల, లోకమంతయును చూడడమైనది. కావున యీజగత్తంతయు వాసుదేవమయమని 7-వ అధ్యాయమున చెప్పుటకు కారణమైనది. ఏకత్వమున అనేకత్వమును కల్పించుట మాయయొక్క పనియైయున్నది. అట్టి అవిద్య నశించిన 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అనుశ్రుతి వాక్యము గోచరమగును. ఇదే దీనిలోఁగల ముఖ్యవిషయము. రెండవది, యజ్ఞాదిక్రతువులచేగాని వేదాధ్యయనాదులచేగాని మోక్షము కలుగదనియు, అనన్యభక్తి యొక్కదానివలననే యీశ్వరసాక్షాత్కారము సిద్ధించుననియు సెలవిచ్చియున్నారు. ఇదే కారుణ్యమయుడగు శ్రీకృష్ణభగవానునికి జీవరాసులలోఁగల వాత్సల్యము. ఏలన, యజ్ఞములు చేయుటకున్ను, వేదములు పఠించుటకున్ను, దానములు చేయుటకున్ను, తపస్సులు సల్పుటకున్నూ అందఱకు అనుకూలముండదు. అనన్యమైన భక్తిగలిగి సర్వేశ్వరస్మరణ హృదయములోఁ గలిగియుండుట ప్రతివారికి సాధ్యమైన పనియేగాని, భారమేమియు దీనియందు లేదు. శ్రద్ధయు, పవిత్రతయు గలిగిన చాలును. మూడవది, మానవులు నిమిత్తమాత్రులనియు, సమస్తమును సర్వేశ్వరశక్తి వలననే జరుగుచున్నదని తలంచి నిస్సంగత్వము వహించి భగవదర్పిత హృదయము గల్గియుండవలెనని దీనివలన తేలుచున్నది. కనుకనే అర్జునునితోఁ నీవు నిమిత్తమాత్రుడవేగాని సమస్తక్రియలును నావలననే జరుగుచున్నవని చెప్పుటకు హేతువైనది. అయితే సమస్తము భగవదాజ్ఞానుసారము జరుగుచున్నదని తలంచి పురుషప్రయత్నము నుపేక్షించియుండవలెని కాదు. తాను చేయవలసిన కృత్యములను నిర్వహించుట ఈశ్వరాజ్ఞయైయున్నది.

లేదనియు, తామే దాని నుపదేశింపవలయుననియు వేడ నంత ఆరు
బ్రహ్మమునుగూర్చి యిట్లుపదేశించెను.

'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్.'

అనగా సృష్టికి పూర్వము ఏకమును, అద్వితీయముననగు సద్వ
స్తు వొకటిమాత్రమే యుండెను. దానినుండియే నామరూపాత్మ
మగు యీ జగత్తంతయున్ను కలిగినది. అని యిట్లువచించి క్రమము
సృష్టిక్రమమంతయు వాని కెఱింగించి మఱియు నిట్లనియె:—

'స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా
తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వి
తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ అణుస్వరూపమగు అనగా మిగుల సూక్ష్మమైన నీ సు
మాత్మయే సమస్తజగత్తున్ను యగును. అదియే సద్వస్తువు. అదియే
ఆత్మ. ఓ శ్వేతకేతూ! ఆ యాత్మయే నీవు' — అని యుపదేశింప దేవా
ప్రతిదినము సుషుప్తియందు జీవులందఱును ఆసద్వస్తువునే జేరుచున్నను
అట్లు జేరితిమని యేలయెఱుంగకున్నారో తెలయజేయుమ'ని యాతడు
తండ్రి నడుగగా, అంతనాతఁడిట్లు వచింపదొడగెను:—

'యథా సోమ్య మధు మధుకృతో నిస్తిష్ఠన్తి నానాత్యయానాం
వృక్షాణాం రసాన్సమవహారమేకతాం రసం గమయన్తి. తే యథా తత్ర
న వివేకం లభన్తేఽముష్యాహం వృక్షస్య రసోఽస్మ్యముష్యాహం వృ
క్షస్య రసోఽస్మీత్యేవమేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సతి
సమ్పద్య న విదుః సతి సమ్పద్యామహ ఇతి. త ఇహ వ్యాఘ్రోవా సిం
హోవా వృకోవా వరాహోవా కీటోవా పతఙ్గోవా దంశోవా మశకో
వా యద్యద్భవన్తి తదా భవన్తి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం
తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగ
వాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ'.

తా॥ తేనెటీగలు పలువృక్షములనుండి రసముల గ్రహించి
యొకటిగాఁ జేర్చి ఒక్కరసముగాఁ జేసి తేనెను గలుగఁజేయుచున్నవి
ఆ రసము లొక్కొక్కటియు తా నీపుష్పరసమనియు, తానీపుష్పరసము
నియు యెఱుంగుటలేదుగదా! అట్లే సమస్తప్రాణికోట్లున్ను (సుషుప్తి

మరణ(ప్రళయ, మూర్ఛాదులందు) సత్తుతోఁ జేరియున్నను. అట్లు సత్తుతోఁ జేరితిమని యెఱుఁగుటలేదు. కాన వారివారి కర్మానుసారము మఱల యీ లోకమునకు మఱలివచ్చి వ్యాఘ్ర, సింహాది జన్మలం బొందుచున్నారు. కాని సద్రూపమగు ఆత్మయందు స్థితిగలవారు అట్టి సత్యాత్మస్వరూపమున బ్రవేశించినవారై మఱల తిరిగి జన్మింపక యుందురు. ఈ సమస్తప్రపంచమున్ను అతిసూక్ష్మమగు నాసద్వస్తువే అయియున్నది. అదియే సత్యము. అదియే ఆత్మ. ఓ శ్వేతకేతూ! అదియే నీస్వరూపము! - ఇట్లారుణి యుపదేశింప శ్వేతకేతువు తండ్రీ! జీవులు సత్తునుండియే వచ్చినను యేల తామట్లు సద్వస్తువునుండి వచ్చితిమని తెలిసికొనజాలకున్నారను విషయము నాకు వచింపవేఁడెద ననెను. అంత యారుణి మఱియొక దృష్టాంతముద్వారా తన కుమారునకు తత్త్వమసి మహావాక్యము నిట్లుపదేశించెను:—

ఇమాః సోమ్య నద్యః పురస్తాత్ప్రాచ్యః స్యన్దన్తే పశ్చాత్ప్రతీచ్యస్తాః సముద్రాత్సముద్రమేవాపి యన్తి స సముద్ర ఏవ భవతి తా యథా తత్ర న విదురియమహమస్మీయ మహమస్మీతి. ఏవమేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సత ఆగమ్య న విదుః సత ఆగచ్ఛామహ ఇతి త ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా కీటో వా పతఙ్గో వా దంశో వా మశకో వా యద్యద్భవన్తి తదా భవన్తి. స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ నదీనదములు సముద్రమునుండియే (మేఘరూపమున, బయలుదేఱి కొన్ని పూర్వదిక్కునను, మఱికొన్ని పశ్చిమదిక్కునను ప్రవహించి తుదకు సముద్రముననే కలియుచు, సముద్రరూపమునే పొందుచున్నవి. ఆనదులు, పూర్వము మేమీ నదీరూపముగా నుంటిమని యెట్లు తెలిసికొనుటలేదో, అట్లే యీ జీవులందఱును సత్తునుండివచ్చినప్పటికిని, అట్లు సత్తునుండి వచ్చినట్లు తెలిసికొనకయున్నారు. ఆ యజ్ఞానకారణమున వారీప్రపంచమున వ్యాఘ్రాది నీచజన్మలను మఱల మఱల పొందుచున్నారు. కాని జ్ఞాని సద్రూపమగు బ్రహ్మమునే పొందుచున్నాడు. ఈ సమస్తప్రపంచమున్ను అణుస్వరూపమగు నాబ్రహ్మ

మే అయియున్నది. అదియే సత్యము. అదియే ఆత్మ. ఓ శ్వేతకేతూ! ఆబ్రహ్మమే నీవు — అని యిట్లుపదేశింప నంతయాతడు జలమున దుద్భవించిన తరంగ బుద్బుదాదులు మఱల జలరూపమునే బొందునట్లు నశించుచున్నవిగదా, కాని జీవుడు ప్రతిదినము సుషుప్తియందును మరణ, ప్రళయాదులందును తన కారణరూపమును బొందినను నశించుటలేదేల? దేవా! యిద్దానిని మఱియొక దృష్టాంతముచే బాగుగ తెలియజేయుమనివేడ, అపుడారుణి యిట్లు చెప్పఁదొడఁగెను:—

'అస్య సోమ్య మహతో వృక్షస్య యో మూలేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేద్యో మధ్యేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేద్యోఽగ్రేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేత్స ఏష జీవేనాత్మనానుప్రభూతః పేపీయమానో మోదమాన స్తిష్ఠతి. అస్య యదేకాం శాఖాం జీవో జహాత్యథ సా శుష్యతి ద్వితీయాం జహాత్యథ సా శుష్యతి తృతీయాం జహాత్యథ సా శుష్యతి సర్వం జహాతి సర్వః శుష్యతి ఏవమేవ ఖలు సోమ్య విద్ధీతి హోవాచ జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియత ఇతి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ ఒక గొప్ప వృక్షమునొకవైపున కత్తితో గొట్టిన యెడల ఆ వృక్షము చచ్చుటలేదు. బ్రతికియేయుండి రసమును మాత్రము కార్చుచుండును. మధ్య కొట్టినను అట్లేయుండును. తుదను కొట్టినను ఆలాగేయుండును. అది (వృక్ష-) జీవునిచే వ్యాప్తమై భూసంబంధమైన జలమును గ్రహించుచు సంతోషముతో నుండును. ఆ వృక్షముయొక్క ఒక శాఖను (వృక్ష) జీవుడు వదలిపెట్టినచో అదియెండి పోవును. రెండవ మూడవ శాఖలున్ను అట్లే. అన్నిటిని వదలిపెట్టిన యెడల వృక్షమంతయు యెండిపోవును. అట్లనే జీవుడీ దేహమును విడచినచో, దేహము నశించునే గాని జీవుడు నశించుట లేదు. ఆతడు అణుస్వరూపుడు, ఈ జగత్తంతయును అట్టి సూక్ష్మరూపమును సద్వస్తువుచేతనే వ్యాప్తమైయున్నది. అదియే సత్స్వరూపము. అదియే ఆత్మ. ఓ శ్వేతకేతూ! ఆయాత్మయే నీవు.

ఇట్లారుణి యుపదేశింప, 'అత్యంత సూక్ష్మమున్ను, సద్రూపమును, నామరూప రహితమునగు సద్వస్తువునుండి నామ రూపాత్మకమును విశాలమునునగు యీ ప్రపంచమెట్లు కలిగె'నని శ్వేతకేతువు ప్రశ్నించి, యవ్విషయమును దృష్టాంతపూర్వకముగ మఱల బాగుగ నెఱింగింపుమని ప్రార్థింప నంతయారుణి యిట్లు చెప్పఁదొడఁగెను—

(సశేషము)

---

# వి వే కా నం ద లే ఖా వ ళి.

(అనువాదకులు:— శ్రీ తత్త్వానంద స్వాములవారు)

ప్రియమైన :— { షికాగో నగరము, 28—5—1894.

న్యూయార్కునకు బోస్టనుకు మధ్య నిటు నటు సుడి తిరుగుచుండుటంబట్టి నేను నీ కింతకంటె ముందుగా ఉత్తరము వ్రాయజాలనైతిని. నేను భారతదేశమునకు ఎప్పుడు తిరిగి రాగలనో తెలియదు. నా వెంటనుండి నన్ను నడుపుచున్న పరమగురుని చేతిలో సర్వమును వదలివేయుట శ్రేష్ఠతరము. నేను లేనటులనే భావించి నన్ను విడిచివేసి పనిసాగించుడు. ఎవనికొఱకును దేనికొఱకును వేచియుండకుడు. మీరు చేయగలదంతయు నిర్వహించుడు. ఎవ్వనిమీదను మీ యాశల నిడుకొనకుడు.

* * * నేనిక్కడ ఉపన్యాసము లిచ్చు పని చాల చేసినాను. * * *

ఇచ్చట ఖర్చులు విపరీతము. ప్రతిచోటునను ఉదారులును ఉత్తములు నగు కుటుంబములవారు నన్ను గుఱించి నిరంతరము జాగ్రత తీసుకొనుచుండినను, డబ్బు ఖర్చు కావలసియే యున్నది.

ఈ వేసవియందు నేను ఇచ్చోటు విడిచివెళ్లగలనో లేదో నాకు తెలియదు. బహుశః అటుల జరుగదేమొ. ఈలోపుగ సమాజనిర్మాణముచేసి, మనయుద్యమమును సాగింప ప్రయత్నింపుఁడు. మీరు సర్వమును నిర్వహింపగలరను విశ్వాసముంచుఁడు.

గురుదేవుడు మనకు తోడై యున్నాడని తెలిసి, సాహసులారా! సాగి నడువుడు!

నా దేశములో నేను చాలినంత మెప్పు బడసియున్నాను. మెచ్చు కొనువారుండనీ లేకపోనీ, మీరు నిద్రపోకుడు; పూనిక సడలింపకుడు. మనము సంకల్పించిన కార్యములలో ఇసుమంతయైనను ఇంకను నిర్వా హకమై యుండలేదని జ్ఞప్తి నుంచుకొనుడు.

చదువుకొనిన యువకులను పురికొలుపుడు; వారిని సమావే పఱచుడు; వారితో నొక సంఘము నిర్మాణముచేయుడు. గొప్ప త్యా గములు చేసిననే ఘనకార్యములు కొనసాగ గలవు. స్వార్థపరత తగదు. నాదిగాని, మీదిగాని, తుదకు నా గురుదేవునిదిగాని, పేరు ప్రఖ్యాతు లతో పని లేదు. పని పూనుడు; ఉద్యమవ్యాప్తికై పాటుపడుడు. సంకల్పసాధన ప్రధానము. బిడ్డలారా! ధీరులారా! శూరులారా! ధన్యసంతానములారా! రథచక్రమును నెట్టుడు, చక్రమునకు భుజము మోపుడు! పేరుకొఱకుగాని, కీర్తికొఱకుగాని, అట్టి మఱే తుచ్ఛవి యము కొఱకుగాని వెనుదిరిగి చూడబోకుడు! స్వప్రయోజనపరత దూరముగా నెట్టివేసి, కార్యశూరులగుడు. తృణలేశములు సయితము పెనవేయబడి మదపుటేనుగును కూడ బంధించివేయగలవనుటను మఱ వకుడు. గురుమహారాజు నాశీస్సును మీ యందఱిమీద వర్షించు గాక! వాని మహిమ మీ యందఱిలో నావేశించుగాక!—ఆవేశిం చియుండెననియే. నా విశ్వాసము! "మేల్కాంచుడు; పరమావధి చే రఱకును ఆగకుడు." అని వేదములు శాసించుచున్నవి. లెండు! లెండు; దీర్ఘరాత్రము అంతరించుచున్నది సుడీ; అరుణోదయము గో రించుచున్నది! మహాప్రవాహము సాగి వచ్చుచున్నది; దాని ప్ర వేగమును అడ్డగించి నిలుచుటకు ఏదియు సమర్థము గాదు.

కావలయునది సాహసము! బిడ్డలారా! సాహసము! ... యన్నలారా! ప్రేమ! ప్రేమ! విశ్వాసము! దృఢమగు నమ్మక పూనుడు! భీతిలకుడు! భయ మనునది మహా ఘోరపాపము!

మీ చెల్లెళ్ళను నా దీవనల నందుకొనుడు అక్కడ మనయు మమునకు ... దొడ్డ ... పురుషులు ... చెల్లెళ్ళు ... నా శాశ్వ...

ను కృతజ్ఞతను పంపితిననియు, తమ పూనికను సడలనీయవలదని ప్రార్థించుచుంటి ననియు చెప్పుడు. ఆదర్శమును ఎల్లెడల వ్యాపింప జేయుడు. గర్వపడకుడు; మూర్ఖవాద పురస్సరమగు దేనినియెడలగాని పట్టుపట్టకుడు; దేనిని ఖండన మొనరించుటకు పూనవలదు;—రసాయనద్రవ్యములను చేర్చిపెట్టుటయే మన పని; అవి యెన్నడు ఏ విధముగా స్ఫటికాకృతుల దాల్చవలయునో భగవంతుడెఱుగును. అన్నిటికన్న ముఖ్యముగ, నా విజయమును గుఱించిగాని మీ విజయమును గుఱించిగాని ఉబ్బిపోరాదు. మహత్కార్యములు జరుగవలసియున్నవి! ముందు జరుగనున్న వానితోడ పోల్చునెడల, ఈస్వల్పవిజయము ఎంత పాటిది? నమ్ముడు! విశ్వాసముపూనుడు! ఈశ్వరాజ్ఞ యైనది; భగవంతుని శాసనము ప్రకటనమైయున్నది—భారతభూమి అభ్యుదయము గాంచి తీరవలయును; సామాన్యప్రజలును దరిద్రులును సుఖముల బడయగలరు. ఆనందము, ఆనందము! * * *

అధ్యాత్మమహాప్రవాహము వెల్లివిరిసినది! అది భూమండలము నంతటను ఏహద్దులును లేక, సమస్తమును తనయందైక్యపఱచుకొనుచు, యెచ్చోటను ఆగిపోక వఱదలై పాఱుచుంట నాకు గోచరించుచున్నది. ప్రతి నరుడును ముందుకు రావలయును; శుభంకరమగు ప్రతిదియు దాని బలమును వృద్ధిచేయవలసినదే; ప్రతివాని హస్తములును దాని మార్గము చదును చేయుటలో వినియోగపడవలయును సుడీ. జై! పరమేశ్వరా!

నాకెవరి సాహాయ్యమును అక్కఱలేదు. ఒక నిధిని ప్రోగుచేయ ప్రయత్నించుడు; కొన్ని మాజికు లాంతరులును, భూగోళపటములను, గ్లోబులను, మఱియుకొన్ని రసాయన శాస్త్రబోధకుపరికరించు ద్రవ్యములను—ఇత్యాదులను కొన్నింటిని కొనుడు. ప్రతి సాయంతనమును పేదలను దిక్కులేనివారిని మాల మాదిగలను సహా ప్రోగుచేయుడు; మున్ముందు వారికి మతమును గుఱించి బోధించుడు; తరువాత మీ మాజికు లాంతరులు మున్నగు సాధనలతో ఖగోళశాస్త్రము భూగోళశాస్త్రము మొదలగు వానిని వారి వారి మాతృభాషలో నేర్పుడు. ఉత్సాహవంతులను తమను ఉద్ధరించుకొనగలిగిన తయా

రుచేయుడు; మీ యుత్సాహమును వారిలో ప్రవేశపెట్టుడు. క్రమ క్రమముగా సంఘమును వృద్ధిచేసి దాని వైశాల్యమును పెంచుడు; మీకు అలవియగునంత శ్రేష్ఠతమ సేవలచేయుడు; నీరంతయు పోయిన పిమ్మట కాలువ దాటవచ్చుననుచు మసలకుడు. వార, మాస పత్రికలును వార్తాపత్రికలును మంచివే, సందేహము లేదు; కాని నాయకులారా! ప్రత్యక్ష సేవ, అత్యంతాల్పమైనను కూడ నిరంతరము జరుపు వ్రాతలకన్నను ప్రసంగములకన్నను హెచ్చు ప్రయోజనకరముగ నుండి!

—ఒక సభ చేసి, కొంచముగ చందాలు వసూలుచేయుడు; ఆ డబ్బుతో నేను పేర్కొనిన వస్తువులను కొనుడు. ఒక కుటీరమును అద్దెకు తీసికొని పని సాగించుడు. ఇది ప్రధాన కార్యము; పత్రికా ప్రకటనము అప్రధానము. సామాన్యప్రజపైని మీరు పలుకుబడి సంపాదింప వలయును. మన ప్రారంభములు అల్పములుగదా యని నిరుత్సాహకులు కావలదు; మున్ముందు మహత్కార్యములు జరుగగలవు, ధీరులై నిలువుడు. మీ సోదరులపైని నాయకత్వము వహింప చూడకుడు; కాని వారికి సేవలచేయ పూనుకొనుడు. నాయకత్వము వహింపవలయునను దురాశ ఈ జీవనజలధియందు ఎన్ని యోడలనో ముంచివేసియున్నది. దీనింగూర్చి బహు జాగరూకులై యుండుడు; అనగా చచ్చినను సరియే పూర్ణముగా నిస్స్వార్థపరులై యుండి పనిచేయుడు. నేను చెప్పదలచుదాని నంతను వ్రాయజాలకుంటిని; అయినను, సాహసులారా! నా బిడ్డలారా! భగవంతుడే మీకు విజ్ఞానమును ప్రసాదింపగలడు. ఓ నా బిడ్డలారా! పనికి వంగుడు! గురుమహారాజుకు జై!

ఇట్లు

వాత్సల్య పురస్సరముగ,

వివేకానంద.

ఓం

# శ్రీ పరబ్రహ్మోపాసన !!
# త్రయోదశ మార్గములు.

(గత సంచిక 192 పుట శేషము.)

---

కుచేలుడు (భాగ — దశ — ఉత్తరభాగము)

క॥ నాపుణ్య మరయనెట్టిదో
యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి
ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుంగను గొంటిన్. 1016

సీ॥ పరికింపఁ గృపణ స్వభావుండనైనట్టి
యేనెడ నిఖిలావ నీశ్వరైన
యిందిరాదేవికి నెనయంగ నిత్యని
వాసుఁడై యొప్పునవ్వాసుదేవుఁ
డేడ నన్నర్థిమైఁ దోడఁబుట్టిన వాని
కైవడిఁ గౌఁగిట గదియఁ జేర్చి
దైవంబుగానన్ను భావించి నిజతల్ప
మున నుంచి సత్క్రియల్ పూని నడపి
తే. చారునిజవధూకర సరోజాత కలిత
చామరానిలమున గతశ్రమునిఁ జేసి
శ్రీ కుచాలిప్త చందనాంచితకరాబ్జ
తలములను నడ్గులొత్తె వత్సలత మెఱసి. 1017

వ. కావున:—

ఉ. శ్రీనిధియిట్లునన్ను బచరించి ఘనంబుగ విత్తమేమియు
న్నీని తెఱుగు గానఁబడెనెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరడని కాకశ్రితార్తి హారుండు సత్కృపాం
భోనిధి సర్వవసు పరిపూర్ణునిగా నను జేయకుండునే. 1019

వ. శుద్ధాంతకాంతానివహంబులు తమ మనంబుల నద్భు...
బంది యిట్లనిరి.

ఉ. ఏమి తపంబు సేసెనొకొ యీధరణీ దివిజోత్తముండుల్లో
భామునయోగి విస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్న
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవులెంత వారలున్.

చ. తనమృదు తల్పమందు వనితామణియైనరమా లామ ప్రా
దును నెడఁగాఁదలంపక యదుప్రవరుండెదు రేగి మోదము
దనుకఁగఁగౌగిలించి యుచితక్రియలంబరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుడో.

7. నా య కి నా య కు ని య ం దు ం చు మ ఱు లు వ లె,

భార్యభర్తయందుంచు ప్రేమ గాఢతరమైనది. అనేక ఉత్త
స్త్రీలే భర్తయందుగల అమితానురాగముచేత, పుట్టింటిని, తల్లిదం
లను, యింతవరకు తనదనుకొనుచున్న సర్వసంపదను తృటిలో
చుట స్వభావము. భర్తవియోగము సహింపజాలక అగ్నియం
జొచ్చినవారునుగలరు. అనగా ఆ భావనయందు మనస్సు గాఢము
లగ్నమగును. అట్లే శ్రీరాధాదేవి, గోపికలు ఆపరాత్పరుని నాయ
డుగా భావించి ఆరాధించి జన్మకర్మబంధ నివృత్తిని పొందిరి.

తమనాయకుడు జన్మకర్మలులేనివాడు, అనంతుడు, అఖండు
సర్వవ్యాపకుడు అని, మాయారహితుడగు పరబ్రహ్మమేయని వీరి
నమ్మకము. శ్రీమతి తరిగొండ వేంకమాంబగారు 'నాభర్తమరణ
లేదు.' నాకు వైధవ్యమును రాదు, యని చెప్పియుండెను. నిజమో
లేని అజ్ఞానులు దాని అర్థమును గ్రహించజాలక, ఆమెకు శిరోజము
తీయించ సాధ్యముగాక క్షమాపణవేడుకొనిరి. ప్రకృతిలో జీ
పరతంత్రులకు జీవులందరును స్త్రీలే. వారే అబలలు. అట్లుగాని స
త్పరు డొకడే పురుషుడు. అందరికి భర్త ఆయనయే, అని లో
మాన్యతగాంచిన యొక భక్తురాలు గోకులబృందావనమున
యుండిరి. ఎంత తపస్సంపన్నుడగు పురుషునికైనను, లేక జ్ఞానవిహా

పరుని కైనను, ప్రకృతిని దాట పురుషుని గదాయను అహంకార లేశము అడ్డముతగులుచుండును. అందుచేత పరమ తపోధనులగు మహాజ్ఞాన నిధులయిన ఋషులు పరాత్పరుని చేరుటకు యీ అహంకార లేశము ఆవరణమగు చుండుటచేత ద్వాపరంబున గోపికలుగా జన్మించి ఆ లేశ అహంకారమును తొలగించుకొని మలినము లేని అంతఃకరణమును ఆపరాత్పరుని కర్పించి సర్వేంద్రియములతో భగవదారాధన మొనర్చి, ఆ యానందస్వరూపమందు ఐక్యము జెందిరని ఒకచోట, జితేంద్రియుడు, జ్ఞాన కేసరియునగు శ్రీ వివేకానందస్వాములవారు సెలవిచ్చియున్నారు. అనగా స్త్రీలహృదయము మృదుత్వముగలిగి సులభముగా లీనమగును. అహంకారము చేరవీలుండదని అభిప్రాయము. శ్రీరామకృష్ణ పరమ హంస స్వాములవారు 'నేనుగోపికను' అని చెప్పి స్త్రీలక్షణములతో మెలగి ఆభావనతో ధ్యానము చేసినప్పుడు దాని పవిత్రత యెంతయో తెలియగలదు. శ్రీగౌరాంగస్వామి 'నేనుగోపిక'నని చెప్పేవారు. అయితే గోపికాకృష్ణలీల బాహ్యలక్షణములబట్టి పరీక్షిన్మహారాజును ఒకప్పుడు కొంచెము సందేహపడినారు. అందుకు మహాజ్ఞానియు, స్త్రీపురుషాది భేదము లెరుగని ఆఖండబ్రహ్మచారియగు శ్రీశుకులవారు,

మ॥ ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యాన సంప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి,
బంధనిరోధంబులు లేక విచ్చలవిడిం దర్పింతురాది
వ్యాశోభను డెట్లుండిన నుండెగాక కలవే బంధంబులుర్వీశ్వరా.

అని సమాధానము చెప్పియున్నారు. అయితే సర్వులకు అనుష్ఠాన మార్గము కాదు. ఇంద్రియములను పరాత్పరునియందు పరుగెత్తించి, సత్పదార్థమునందు చేరు మార్గము బహుజాగ్రతతో మెలగ వలసియుండును. వక్రమార్గమున బడిన అధోగతియె. ఘటసర్పమును పట్టుటకు గరుత్మంతునికి చెల్లునుగాని, వూరకోడి ప్రయత్నించిన అపాయము తప్పదు. బ్రహ్మాకారస్థితిలోయుండు అవధూతస్థితిని త్రాగుబోతు విమర్శించబూనినట్లు, గోపికా కృష్ణలీలలు విమర్శించు నేటి నాగరికు లగు రాజస, తామసులుగలరు. ముందే కోతి, దానికి సారాయిత్రాపి నట్లు, మూఢమనస్సుగలిగి, జ్ఞానశూన్యులైన యీ విమర్శకులకు, పాత

ముల పద్యములు నేర్ప విదేశములనుండి నాగరికతా నాస్తికాద్యు
వచ్చియున్నారు. ఆ యమలుకు దాసులగువారికి నమ్మకము దొరక
మహాపురుషులచేత ఆమోదింపబడిన మార్గముగాన మనము జో
చేయక తప్పదు.

గోపికలు. (భాగ-దశ-పూర్వభాగము.)

(ఈశ్వరత్వమునకై ఆతురత-శ్రీకృష్ణుని శరద్రాత్రిగానము)

వ॥ ఇట్లు వాడిచి నవకుంకుమాంకితరమాముఖమండల
నుంబోలె నఖండంబైన చంద్రమండలంబుఁ బొడగని పుండరీకన
నుండు యమునానదీ తటవనంబున జగన్మోహనంబుగా నొక్కగీతం
బాడిన విని పరాయత్తచిత్తలై తత్క్షణంబున వ్రేతలే పనులకుం జే
డకయు గోవులకుం గ్రేపుల విడువకయు విడిచి విడిచియు నీక
నీడి యీడియు నీడిన పాలుగాపకయుఁ గాఁచి కాఁచియు కాఁ
పాలు డింపకయు డించి డించియు డించినపాలు బాలురకుం బో
కయు, బోసి పోసియు బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ జేసి చేసి
నశనంబులు గుడువకయుఁ గుడిచి కుడిచియుఁ గుసుమంబులు ము
వకయు ముడిచి మూడిచియుఁ దొడవులు దొడుగకయుఁ దొడిగి
గియుఁ గోష్ఠంబు పట్టుల నుండకయు, బాయసంబు నెఱయ వండక
నయ్యెయెడల నిలువంబడకయు గాటుకలు సూటి నిడకయుఁ గు
నక్కనొత్తకయుఁ సఖులకుం జెప్పకయు సహోదరులు మగ
మామలు మఱందులు బిడ్డలు నడ్డంబుచని నివారింపం దలాడింపక
మందవెలువడి గోవింద సందర్శనంబునకుం జనిరప్పుడు.

మ తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాశ
ద్విరహాగ్నింబరితాపమొందుచు మనోవీథిఁ విభుఁ మాధవు
బరిరంభంబులు సేసి జారుడజనుచుఁ భావించియుం జొక్కి
దిరి ముక్తిఁ గుణదేహముల్ విడిచి ప్రీతిఁ బంధనిర్ముక్తలై

గోపికావస్త్రాపహరణం.

(అవతారముల వర్ణన).

సీ. బహుజీవనముతోడ భాసిల్లియుండుటో
గోత్రంబులెల్లతో గూర్చితోడ

మహీనుద్ధరించుటో మనుజసింహంబవై
ప్రజలగాచుటో కాక బలిఁదెరల్చి
పిన్నవైయుండియుఁ బెంపువహించుటో
రాజుల గెల్చుటో రణములందు
గురునాజ్ఞసేయుటో గుణనిధివైబల
ప్రఖ్యాతిఁజూపుటో భద్రలీల
ఆ. బుధులుమెచ్చ భువిఁ బ్రబుద్ధతమెఱయుటో
కల్కితనముసేయ ఘనత గలదె
వావిలేదు వారివారు నా వారని
నెఱుగవలదె వలువలిమ్ము కృష్ణ. 823

క. కొంటివి మాహృదయంబులు
గొంటివి మానంబు లజ్జఁగొంటివి వలువల్
గొంటివిఁక నెట్లు సేసెదొ కొంటెను
గద సిన్ను నెఱిగి కొంటిమి కృష్ణా. 824

సాంఖ్యము:—సీ. రాజసంబునసీవు రంజిల్లు టెఱుగమే
చెలరేగి వింతలు చేయుచుండ
సత్వసంపదగల్గి జరుగుటఁదలపమే
సిరిగల్గియన్యులఁ జెనకుచుండ
గురుతరశక్తియుక్తుడవౌటఁ జూడమే
తామసంబున నెగ్గుదలచుచుండ
నొకభంగితోనుండకుంటఁ జింతింపమే
మాయావివై మాఱు మలయుచుండ.
ఆ. నేమిజాడవాఁడ వేపాటి గలవాడ
వేగుణంబు నెఱుగ వెల్లయెడల
నొదిగియుండనేర వోరంత ప్రొద్దును
బటముల్ఁగదయ్య పద్మనయన. 825

మత్తకోకిలము:— (ప్రపత్తి సేయుట).
నీ పర్యఙ్క రతిసేయుచుందురు నేర్పరుల్ సతతప్రియో
ద్దీప్తకుండవుగాన నెన్నఁగఁ దెచ్చు నాథ సుతాదులం

జూపనేటికి మన్మహాశలు సుట్టి నీకడ నుండగా
బాపనేల మదీయ తాపముఁ బాపఁ బోలుగృపాసధీ. 95

ఉ. అత్తలు మామల్గూ వగవనాడిక కోడక నాథులక్ శుగా
యత్తులఁజేసి యిల్వరుస లాఁబడిఁ బోవఁగ నీదు నవ్వుల్
మెత్తని మాటల్ మరుడుమేల్కఁసి చోఁచిన వచ్చినారమే
పొత్తుల నోల్ల మో పురుషభూషణ దాస్యములిచ్చికావవే. 99

(ఈశ్వర తత్వాన్వేషణము.)

వ. ఇట్లు హరి గను మొఱంగి చనిన తఱింగానక కఱిం బ్రా
తిరుగు కరిణుల పెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవ కాంతలు తదీయ
గమనహాసలీలావిలాస చేష్టలకుం బాల్పడి తదాత్మకత్వంబున నే
నేన కృష్ణుండనని కృష్ణగుణావేశంబులం జరియించుచు, 100

క. భూతములలోన వెలిఁబ్రఖ్యాతుండవగు
నట్టివాని గాంతలు కాళిం
దీతీరవనాంతరముల భ్రాంతిక్
వెదకంగఁ జనిరి పాడుచు నధిపా.

సీ. పున్నాగ కానవే పున్నాగ వందితు
దిలకంబ కానవే తిలకనిటలు
ఘనసార కానవే ఘనసారశోభితు
బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని
వంశబ కానవే వంశధరునిఁ
జందన కానవే చందనశీతలుఁ
గుందంబు కానవే కుందరదను

తే. నింద్రభూజమ కానవే యింద్రవిభవుఁ
గువల వృక్షమ కానవే కువలయేశుఁ
బ్రియక పాదప కానవే ప్రియవిహారు
ననుచుఁ గృష్ణుని వెదకిరయ్యబ్జముఖులు. 101

(సశేషము.)

# జీవిత లక్ష్యము.

(గ్రంథకర్తలు - శ్రీ మతకుమల్లి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు
శ్రీరామకృష్ణ వివేకానంద సందేశ ప్రచారకులు)
ప్రకాశకులు—శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారు; ప్రొప్రైటర్;
(వేంకట్రామా అండుకో, హెడ్ ఆఫీసు, ఏలూరు.)
(గతసంచిక 200-వ పుట శేషము.)

---

విషయ ప్రవేశము (అనువృత్తము)

ఆహా! యేమి మానవజన్మ! తానాత్మస్వరూపుడై శాశ్వతానందము తన జన్మహక్కైయుండ క్షణికానందమునకు తిరుగుచున్న యీ మానవుని జీవితము యెంత ఆశ్చర్యము! ఇదంతయు దేహాత్మభ్రాంతిచే గలిగినది గదా? ఎంతకాలము వెదకినను శాశ్వతానందము కాన్పింపఁగలదా? లౌకికవిజ్ఞానముచే ఉత్తమ విజ్ఞానము లభింపగలదా? ప్రపంచమంతయు నొక పాఠశాల. విశ్వనియంత ఉపాధ్యాయుడు; యీ పాఠశాలయందు సక్రమముగ విద్య నభ్యసించి, విశ్వనియంతచే ప్రసాదింపబడిన జ్ఞానమును భక్తితో నలవరచుకొని స్వస్వరూప సాక్షాత్కారము చేయవలెను. తదుపరి జీవబ్రహ్మైక్యానుసంధానముఁ జేయవలె. విశ్వనాట్య మందిరమున తా నొక పాత్రధారి నని మాత్రము గ్రహించి సుఖదుఃఖములచే బాధింపబడక, ద్వంద్వాతీతుడై, తన పాత్రఁనుచితరీతినిఁ బోషించి, యీ మహానాటకమునకుఁ దోడ్పడవలె. తన పాత్రకు తాను సాక్షి కావలె. అప్పుడే జీవితశోభ గాంచఁగలఁడు. మానవజన్మ విచారించిన నొక విధముగాఁ నుత్తమోత్తమము. మఱియొక విధమున నధమము. తనను దా తెలుసుకో గలిగినప్పుడే జీవితము సార్థకము. దేహాత్మభ్రాంతి నొందినపుడు జీవితము తుచ్ఛమై, నీచమై, అధమమై, అన్యాయమై, అజ్ఞానాంధకారమున గబ్బిలమువలె తలక్రిందుగ వ్రేళ్ళాడును. ఆహా! యేమి యాశ్చర్యము!

రోమక సామ్రాజ్యాధిపత్యము వహించిన, మార్కస్ ఎరూలియస్, జీవితము నొక గాలియని వచించియున్నాడు. అదిగూడ నిలకడ లేని గాలి

యట. అందుకనియే కెంపీస్ అను ఉత్తమక్రైస్తవుడు యీ జీవితకాల
ములో శాశ్వతమై, నశింపని ఆత్మసంపద చేకూర్చుకొమ్మని వక్కాణిం
చియున్నాడు. ఎందుచేత నన, యేసుక్రీస్తు వచించునట్లు ఆత్మనుఁ గోల్పో
యిన వానికి ప్రపంచసామ్రాజ్యమంతయు లభించిన నేమిప్రయోజనము?
అలెగ్జాండరను వీరశిఖామణి ప్రపంచమునంతయు జయించి, జయిం
చుటకు యింకను తావు లేదని విచారించినాడట. తదుపరి దయోజినీస్
అను నొక జ్ఞాని చెంత కేగ నాతడు మల మల కాలుచున్న యెండలో
కూర్చుండి, ఆత్మానందములో విశ్వమునే మఱచియున్నాడు. గుడ్డపే
కలు మాత్రమే గూతనికిగల భౌతిక సంపద. చక్రవర్తిచూచి, విస్మ
రపడి, కొన్నిదుస్తుల నాజ్ఞానికి యియ్యవలెనని అపేక్షించినాడు. కాని
ఆ జ్ఞాని వాటిని తిరస్కరింపగా అలెగ్జాండరు తాను ప్రారబ్ధము
చక్రవర్తినై జన్మించితిననియు, తన కవకాశమున్నచో యథార్థము
దయోజినిస్ వలె ఆనందించుటకు అపేక్ష కలదనియు వచించి
యున్నాడు. ఆహా! చూచితిరా! ఆత్మ సామ్రాజ్యమునకు భౌతిక సామ్రా
జ్యమునకు గల భేదము? కిరీటధారియైన చక్రవర్తియొక్క మకుటము
తుదకు జ్ఞానియొక్క పాదముల చెంత వ్రాలినదిగదా! భుజబల పరా
క్రమముగల క్షత్రియ వీరులందఱు ఆత్మానందము ననుభవించు ఋషుల
యాజ్ఞలనే యనుసరించి జీవితకర్తవ్యముల నెరవేర్చిరిగదా! సామ్రా
జ్యాధిపత్యమును వహించిన జనకచక్రవర్తి, యాజ్ఞ్యవల్క్యుని బోధలచే
కృతార్థుడయ్యె గదా! అవతారమూర్తి యగు శ్రీరామచంద్రుడు
వసిష్ఠమహాముని ఉపదేశముచే వికాసము పొందెగదా! ఇక శివాజీ
చక్రవర్తి 'సమర్థుని' అనుభవ విజ్ఞానముచే తన జీవితలక్ష్యమును తెలుసు
కో గలిగెగదా! బృహదారణ్యక, వాసిష్ఠ, దాసబోధలు దిలకించుడు
మహాశయా! యీజ్ఞానమే హైందవదేశముయొక్క సంపద.

అధ్యాత్మరామాయణమున, జనింపబోవు శిశువును, చీమునెత్తు
రుతో నిండిన కుదుపునుండి దిగజారిన పురుగువలె వర్ణించబడియున్నది
దిగజారిపడినంతనే, కలిమాయకు వశుడై, బాల్యమంతయు పడరాని
యిక్కట్లు పడుచు, మాటాడచేతకాక రోదనసేయుచు, అసహాయుడై
కదలలేక వెలికిలబడుండి, తదుపరి [illegible] గదలుచు స్తన్యపానము

చేయుచు, దుర్గంధభూయిష్టమైన రొంపియందువలె, మంచములోనుండి యెట్లెటులనో తుదకు యౌవనదశ పొందుచున్నాడు. యౌవనమంతయు క్షణికసుఖముల నపేక్షించి, దేహమును చూచి యానందించుచుండ అర్థాంగిని చేకూర్చుకొనుచున్నాడు; సంతాన ప్రాప్తి నొందుచున్నాడు; నాలుగుడబ్బులు సంపాదించి, కష్టపరంపరలకు గురియై, భార్యాపుత్రాదుల పోషించుచున్నాడు. అంతలో కౌమారము వచ్చును; సంసార బాధ; అప్పుడే తలవెంట్రుకలు నెరయుటకు ప్రారంభించును. ఇది రాబోవు ముసలితనమునకు సూచన. ముఖము ముడతలుఁబడి, కండ్లు మసగలై, చెవులు వినబడక, దంతములూడి, అపేక్షమాత్రము పోక, శరీరమంతయు ముడతలుఁబడి, శీతోష్ణములు సహించ లేక, చేత కఱ్ఱబూని వచ్చుదృశ్యము నొక్కసారి తిలకించుడు. ఇది యంతయు, స్వల్పకాలములో జీవితమునకు 'సలాం' చేసి శ్మశానవాటికలో పాంచభౌతిక దేహము భస్మీపటలము చేయబడవలయుననుటకు సూచన. అంతలో రోగము, మంచప్రాప్తి; కృంగి, కృశించి, లేవలేక, మూల్గుచు, యింటివారలచే తిరస్కరింపబడుచు, యెప్పుడు మృత్యువు వచ్చునా యని విలపించు మానవుని దశ తిలకించిన, యెవరైన జీవితలక్ష్యమును మఱచి యుండ గలరా? శాశ్వతానందమును క్షణికానందమునకై కోల్పోవుదురా?

జీవితలక్ష్యము శాశ్వతానందమని చెప్పియుంటిమి గదా! ఈ శాశ్వతానందము జ్ఞానముచేఁ గలుగుననిఁ గూడ వక్కాణించి యుంటిమి. 'పేస్కల్' అను ఫ్రెంచిపండితుఁడు ప్రపంచమునగల మానవకోటిని మూడురకములుగ భాగించియున్నాడు. మొదటి తెగవారెవరన, తాము జన్మించిన కారణము నెఱింగి భగవంతుని సాక్షాత్కరించి కృతార్థులగువారు; యిక రెండవ తెగవా రెవరన, భగవంతుని తెలుసుకొనుటకు యత్నించువారు; మూడవ తెగవారు విశ్వనియంతనుగూర్చి తెలుసుకొన నిచ్ఛలేనివారు. ఈ మూడవ రకపువారి జీవితము మాత్రము దుర్భరము. రామకృష్ణుఁడు ప్రపంచమునగల మానవుల నాలుగురకములుగ భాగించినాడు. మొదటి తెగవారు నిత్యముక్తులు: నీరు సంసారబంధమునఁ బడరు సంసారమను బురదలో నున్నప్పటికిని

కుమ్మర పురుగువలె అంటకుండని వారు. తామరపత్రమునందలి నీటి బిందువువలె అంటినట్లగపడుచు అంటకుండనివారు. జాలరి వలపన్ని పట్టుకొనునపుడు కొన్నిచేపలు ఆ వలచెంతకే రావు. అటులనే మారుడు వల విసర, ఆ భ్రమకు చిక్కక దూరముగనుండి చూచువారు వీరలే నిత్యముక్తులు. మఱికొన్నిచేపలు వలలో పడుచు వెంటనే తప్పించుకొనును. అటులనే కొందఱు మానవులు సంసారబంధములో బడి వెంటనే తెలివితో ప్రవర్తించి సంసారబంధముచే బాధింపబడక ఆత్మానందము ననుభవించువారు. వీరు సాక్షీస్వరూపులు. మఱికొన్ని చేపలు వలయందు జిక్కి కొట్టుకు కొట్టుకొని తుదకు తప్పించుకొని పోవును. అటులనే కొందఱు మానవులు సంసార బంధమున జిక్కి కృంగి, కృశించి, తపించి, విలపించి యెటులనో తుదకు బంధమును వీడి సుఖించువారు. మఱికొన్ని చేపలు వలయందు చిక్కి తాము బంధింపబడినట్లెఱుంగక, బురదలో దూరుకొని "ఆహా! యెంత ఆనందము! యెంత సుఖము" అని సంతసించునట. ఇటువలెనే కొందఱు మానవులు జీవితలక్ష్యమును మఱచి సంసారమను వలయందు జిక్కి, భార్యా పుత్రాదులను పంకిలమున దూరుకొని క్షణికానందమునకు దాసులై యానందించువారు. వీరలగతి మాత్రము దుర్భరము. ఎందుచేతనన, వల లాగినప్పుడు అడుగున మిగిలిన చేపలు బయటికీడ్వబడి ప్రాణములు కోల్పోవుచున్నవి. అటులనే సంసారపంకిలమున చిక్కిన జీవులు కాలుని చే బరిమార్చబడుచున్నారు. ఆహా! యేమి దుర్గతి! ఇట్టి దుర్గతికేనా మానవుడు జన్మించినది? జీవితమంతయు కష్టించి ధన కనకరాసుల చేకూర్చి, రత్నహారములచే నర్ధాంగికంఠము నలంకరించి, దారా పుత్రాదుల కొఱకు పడరాని యిక్కట్లుపడి, తుదకు మరణశయ్యపైనుండి కఫముచే మాట్లాడలేక విలపించు జీవుని స్థితి నొక్కసారి మీ మానసికమునకు తెచ్చుకొనుడు. దారాపుత్రాదులతో మాట్లాడలేక, కంట నీరు కార్చుచు, గురక మాత్రము పెట్టుచుండ నింతలో యమధర్మరాజు శిష్యవర్గముతో మహిషారూఢుండై దర్శన మిచ్చును. ఆదుర్భరస్వరూపము, చేతులయందు పాశములు, వానిచే జీవుని బంధించునట. అప్పుడు జీవుడు శ్రీ శంకరులు వచించినట్లు

“బధ్వాకశ్శైర్యమభటా బహుభర్త్సయన్తి।
కర్ష స్తియత్రపథి పాశశతైర్యదా మామ్।
ఏకాకినం పరవశం చకితం దయాళో।
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్”.

సమస్తమైన బంధుకోటి యుండియు, నిస్సహాయుఁడై, యమ దర్శనము సహించలేక ‘ఏకాకినం’ అని విలపించునట. అంతలో జీవుఁడు శరీరమునుండి లాగబడుచుండ గృహాంగణమునుండి గృహయజమానిని క్రిందబెట్టుదురట. క్రిందటినిమిషమున చైతన్యసహితమైన మానవుఁడు మరుక్షణమున చైతన్యరహితమైన శవము. ఆహా! యెట్టి విపరీతస్థితి. స్వల్పకాలములో నీశవము శ్మశానవాటికకు నడుపబడి భస్మీపటల మొనర్పబడును. ‘భస్మాంతక శరీరం క్రతో స్మర, క్రతో స్మర, క్రతో స్మర,’ అను ఉపనిషద్వాక్యము యెట్టి తత్వమును బోధించుచున్నది? ఇది యంతయు దేహమునుగూర్చి చెప్పబడినది. అయినను అందలి యాత్మ నిత్యము, సత్యము, అనిర్వచనీయము, అవాఙ్మానస గోచరము. అట్టి యాత్మను సాక్షాత్కరించిన మానవుఁడు దేహమును, దాని బాధల సాక్షివలె నంటకుండ చూచుచుండగలఁడు. అట్టివాడే కృతార్థుఁడు. మఱియు ఉపనిషత్తునందు చెప్పబడినట్లు జీవితవృక్షమునకు రెండుకొమ్మలుఁ గలవు. రెండుకొమ్మలను రెండుపక్షు లధిష్ఠించియున్నవి. జీవాత్మ, పరమాత్మలే ఆ రెండుపక్షులు. జీవాత్మ సుఖదుఃఖముల నెడు ఫలములఁ జవిచూచుచు, మంచిచెడ్డలకు గుఱియై సుఖదుఃఖములఁ జెందుచుండును. పరమాత్మ యనెడు పక్షి సాక్షియై యీచిద్విలాసమునుఁ జూచుచుండును. జీవాత్మ సుఖదుఃఖములచే బాధనొందుచు, తుదకు పరమాత్మనుగాంచి, ఆ ప్రకాశమునుఁ జూచుచు, అందు లీనమై అద్వైతసిద్ధిగాంచును. ఇదియే జీవబ్రహ్మైక్యానుసంధానము. ఇదియే ప్రతిజీవుఁడు పొందదగిన ఉత్తమ స్థితి. ఇదియే జీవితలక్ష్యము. జీవితమను వింటిని కృషియను నారిచే సంధించి, జీవాత్మయను బాణమును పరమాత్మయను గుఱిలో నైక్యానుసంధాన మొనరించవలె. దుర్ఘటమైనప్పటికి యిదియే మానవుని లక్ష్యము. ఈప్రపంచమున వాసనాత్మిక బుద్ధిచే యీడ్వబడి, అధోగతిపాలై మహనీయుల బోధల వినుటకుఁ గూడ అంగీకరించని దేహా

ధారులఁగూర్చి రామకృష్ణ పరమహంస యిట్లు వచించియున్నాఁడు. ఒక జాలరి తన గ్రామమునకు చేరువనున్న పట్టణమునకు వెళ్ళి చేప విక్రయించి యింటికి వచ్చుచుండఁగా, త్రోవలో గాలివానచే బాధితుఁడై, చేరువనున్న తోటలోని కేగి, తోటమాలిని ప్రార్థించి, వాని గుడిసెలో నారాత్రి తలదాచుకొనియె. చేపలబుట్ట ప్రక్కనుంచుకొని కొంచెము గంజిఁద్రావి నిద్రించె. రెండుజాము లగుసరికి మేల్కాంచి, గులాబి, మల్లె, సంపెంగ, మొగలిరేకుల సువాసనల నాఘ్రాణించి, చీకాకుఁజెందె; యీ సువాసనల కాతఁడెన్నఁడు నలవాటు బడియుండ లేదు. అతని కలవాటైనది చేపల దుర్గంధము; ఎట్టులనో, భరింపలేక జాముగడపి, అచ్చటనుండలేక, తట్టనెత్తిన వేసుకొని, గంపెడు చీకటుండగనే పరుగిడి, తనతోడి జాలరుల కలసి సంతసించెనట. మహాశయా! అరిషడ్వర్గముచే పీల్చి పిప్పిచేయబడి, అధోగతిపాలై, సంసార పఙ్కిలమునఁ దగుల్కొనిన జీవులకు, ఆత్మబోధ, చేపలవానికి పుష్పముల సువాసనవలె, వెగటుదోచుగదా! అటుల తోచుటలో నాశ్చర్య మేమిఁగలదు? ఆత్మానందమును కోల్పోయి విషయానందముచే బాధితుడైన జీవుడు కృతార్థుడగు టెట్లు? సజ్జన సాంగత్యముచేతనే. ఈ సజ్జన సాంగత్యము లభించినప్పుడే నిస్సంగుడై, మోహమును వీడి, నిశ్చలత్వమును పొంది, ఆత్మను సాక్షాత్కరించి, ఆనందము నొందఁగలడు. విషయ లంపటుడైనవానికి ఆత్మానందము లేదు. అనుభవజ్ఞానముచే గాని ఆత్మానందము లభింపనేరదు. అయ్యాది మహనీయుల అనుగ్రహముచే గాక, మఱియొక విధమున పొందజాలము. కఠోపనిషత్తునందు నాచికేతుడు యమలోకమునకుఁ బోయి, యముడు వరములు కోరు మనగా, మూడవవరముగ దేహము వీడినప్పుడాత్మగతిని గూర్చి యడిగె. యమధర్మరాజు, నాచికేతుని, లౌకికసంపదలనపేక్షింపు మనగా, అవి క్షణికములని వానిని కోరక, ఆత్మవిద్యనే కోరె. మానవుడేమి యొనర్చినను, ఆత్మశ్రేయస్సు కొఱకై యుండవలె. ఆత్మసాక్షాత్కారమున కుపయోగింపని సమస్తవిద్యలు వ్యర్థములు. ఛాందోగ్యమునందాఱవ ప్రపాఠకమున చెప్పబడినట్లు, శ్వేతకేతు లౌకికవిద్యల నేర్చి, గర్వించి తండ్రిమొద్ద కేతెంచె. ఉద్దాలక అరుణి

"యే విద్యనేర్చిన సమస్త విద్యలు తెలియబడగలవో, అవిద్య నేర్చితివా?" అని యడుగ, శ్వేతకేతు అందులకు ప్రత్యుత్తర మొసంగ లేకపోయెను. అప్పుడు తండ్రి కుమారునకు ఆత్మవిద్య బోధించి కృతార్థుని జేసె. లౌకికవిద్యావిహీనుడైనను, రామకృష్ణ పరమహంస, ఆత్మానుభవముచే ప్రజ్ఞావంతులందఱకు బదులు చెప్పగలిగె. మఱియు రామాయణమునందు చెప్పబడినట్లు భుజబల పరాక్రమముచే శోభిల్లు విశ్వామిత్రుడు వసిష్ఠునిపై యుద్ధమున కేగ, భౌతిక సంపదలేని వసిష్ఠుడు తన బ్రహ్మదండమునే నమ్మి, దానిని తనముందు నిలిపియుంచె. విశ్వామిత్రుని బాణపరంపరలు బ్రహ్మదండమును దాటి వసిష్ఠుని బాధింపలేకపోయె. అప్పుడు విశ్వామిత్రునివంటి రాజర్షి "ధిక్ బలం క్షత్రియ బలం, బ్రహ్మతేజోబలం బలమ్" అనిపలికె. భుజబల పరాక్రమము వ్యర్థము. బ్రహ్మతేజస్సే నిజమగు శక్తియని గ్రహించి, విశ్వామిత్రుడు అరణ్యములకేగి తపోనిష్ఠాగరిష్ఠుడై బ్రహ్మర్షి యనిపించు కొనుటకు ప్రయత్నించె. నూర్గురు కొడుకుల కోల్పోయి నప్పటికిని, వసిష్ఠుని కలని యాత్మానుభవమే ఆనందమును చేకూర్చె. ఆత్మానుభవములేని భౌతికసంపద వ్యర్థము; అయ్యది ఆత్మలేని శవమువంటిది. ఆత్మానుభవమే హైందవదేశముయొక్క ఖ్యాతిసంపదలు. ఆత్మసాక్షాత్కారమే భారతీయుని కృషి; ఎంతకాలమీ ఆత్మానుభవము పొందగలిగినదో అంతవరకు భారతదేశము ప్రపంచ దృక్కుల నాకర్షించినది. కృత, త్రేత, ద్వాపర యుగములు పూర్తియై కురుక్షేత్ర సంగ్రామము జరిగి, వీరాధివీరులు స్వర్గముఁ జేరినంతనే భారతదేశము ఆత్మను కోల్పోయినది. కలి ప్రారంభమైనది. ఆత్మ సంపదతో పాటు భౌతిక సంపదగూడ నశించినది; కాదు-కాదు-నిగురుఁ గప్పిన నిప్పువలె నున్నది.

తైత్తిరీయోపనిషత్తునందు "బ్రహ్మవిదాప్నోతి పరమ్" అను వాక్యము వినబడుచున్నది. అనగా బ్రహ్మవేత్త శ్రేష్ఠమైన సుఖమును పొందుచున్నాడని యర్థము. తదుపరి బ్రహ్మను నిర్వచించుచు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనగా సత్యమును, జ్ఞానమును గల్గి, అనంత స్వరూపముగలవాడే బ్రహ్మ. ఈబ్రహ్మసాక్షాత్కారము చేయగలవాడే ఉత్తముడు. బ్రహ్మసాక్షాత్కారమెటుల చేయనగును? ఇయ్యది

ప్రతి మానవుని సమస్యయే. అందుకనియే "యో వేద నిహితం గుహాయామ్" అని వినబడుచున్నది; గుహాస్వరూపము నెఱుంగవలె. ఇదియే పంచకోశగుహ; ఇదియే దేహము; సత్వరజస్తమోగుణాత్మకమైన దేహమును పరీక్షించి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశముల ప్రకాశింపజేయుచు కోశాతీతమై, విలక్షణమైన ఆత్మను సాక్షాత్కరించినపుడే మానవుడు జీవితలక్ష్యమును చేరగలడు. పంచీకరణముద్వారా దేహమును విభజించి, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, పంచప్రాణ మనోబుద్ధి చిత్తాహంకారముల కతీతుడై భూతసృష్టికి విలక్షణుడై ప్రకాశించు తన స్వస్వరూపము తనలో తనచేత తనను సాక్షాత్కరించి తనయందు తాను రమింపవలె. తనచే తాను భాగించుకొని, తనచే తాను తెచ్చుకొన్న భేదమును నివారించుకొనవలె; యిదియె పిండజ్ఞానము. ఇట్టి పిండజ్ఞానమును పొందిన మానవుడు బ్రహ్మాండ పంచీకరణముచే విశ్వాత్మను సాక్షాత్కరించి జీవబ్రహ్మైక్యానుసంధానము చేయుచున్నాడు. ఇదియే జీవిత లక్ష్యము. తననుఁ దా పరీక్షించుకొనుటయే ఉత్తమ పరీక్ష యని ఎథెన్స్ దేశమునకు జ్ఞానచక్షువని ప్రసిద్ధిగాంచిన సోక్రెటీసు వచించియున్నాడు. మఱియు (Know thyself) "నిన్ను నీవు తెలుసుకొనుము" అని గూడ వచించియున్నాడు; ఇదియే ఆత్మవిద్య. ఈ ఆత్మానుభవమే హైందవ విజ్ఞానముయొక్క ఫలము.

భాగవతమునకు వ్యాఖ్యానము రచించిన శ్రీధరుడు భార్యను కోల్పోయి యెనిమిది వత్సరముల కుమారుని పోషించుచుండెనట. అతఁడు దినదిన ప్రవర్ధమానుఁడై పదివత్సరముల ప్రాయమువాడైనప్పుడు శ్రీధరునికి సన్యాసాశ్రమము స్వీకరింప నపేక్ష గలిగినదట; కాని కుమారునికి ద్వాదశ వర్షములు పూర్తికాగానే సన్యసింతు ననుకొనినాడట. ఇట్లుండ నొక రోజున భోజనానంతరము సావడిలో భాగవత కాలక్షేపము సేయుచుండ పైనుండి ఒక బల్లిగ్రుడు క్రిందపడినదట; వెంటనే గ్రుడు బ్రద్దలై బల్లిపిల్ల పై కెగసినదట; వెంటనే ప్రక్కనే యెగురుచున్న దోమను బల్లిపిల్ల మ్రింగినదట. అదిచూచి భాగవతవ్యాఖ్యానకర్త "ఆహా! యేమి యాశ్చర్యము;

(సశేషము)

ఓమ్. తత్. సత్.

ఓమ్ శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

# కడప మండల, టంగుటూరు గ్రామమున

శ్రీ పరబ్రహ్మానందాశ్రమ సంప్రోక్షణ సమయమున
శ్రీ సద్గురు మలయాళస్వాములవారికి
సమర్పింపబడిన

# స్వాగత పద్యములు.

——:0:——

శా॥ శ్రీ కారుణ్యమయాత్మ సత్వగుణరాశీ సచ్చిదానంద రూ
పా కల్యాణకళాప్రదీప్తతర యాపద్బాంధవా జీవర
క్షాకార్యైకనిధాన యోగమహిమాసంపన్న సంస్తుత్య సు
శ్లోకా శ్రీమలయాళసద్గురువరా సుస్వాగతంబియ్యదే. ౧.

సీ॥ పరమభక్తిస్వరూపము నెరుంగగగోరు వారలొక్కటమిమ్ము జేరికొలువ
గరిమబ్రహ్మాత్మైక్య సరణినేర్చెడిజనంబులుమీకు సతముసేవలనొనర్ప
నిష్కామయోగైకనియతి నాకాంక్షించు సుజనులుమీకు శుశ్రూషసేయ
దేవభాషార్థులర్థిక మీపదాబ్జాల కనవరతంబు నర్చనలుసల్ప

గీ॥ పూర్ణకరుణాప్రబోధానబుద్ధుడవయి
శాంతసుజ్ఞానవిమల తేజంబుతోడ,
అలరితివిగురుడవగుచువ్యాసాశ్రమమున
పరమకారుణ్య మలయాళగురువరేణ్యా. ౨.

సీ॥ భయదసంసారకూపంబునఁ బడి దారి నరయక విలపించునరుల బాధ
కఱుక త్తినిదమ కంతాలనరుకంగ వాపోవునట్టి జీవములగోడు
కులజాతిమతభేదకలుషాగ్ని కింధనం బయితపియించు దీనాళియేడ్పు
అక్షరజ్ఞానశూన్యతదిక్కుదోచక దురపిల్లుపేదబాలురమహార్తి

గీ॥ నెందుకొనియుండు మీకృపానియతినట్టి
దుఃఖమయరోదనము లెల్లదొలగిపోయె,
పూర్ణమగు జ్ఞానబోధయిప్పుడమియందు
వరలెనెల్లెడ మలయాళ గురువరేణ్య.

సీ॥ చంపవచ్చినయట్టిశత్రువునైనను దరిజేర్చుబుద్ధావతారకరుణ
అద్వైతసిద్ధాంతమతిసులభోపాయ సరణిని దెల్పు శంకరుమనీష
సకలసన్మత తత్త్వసారమెరింగిన సుకృతిశ్రీరామకృష్ణునిఘనంబు
ప్రళయమందైన సంచలనమందని వివేకానందుబ్రహ్మచర్యప్రదీక్ష

గీ॥ దీనజనరక్షణకుదనప్రాణములను
బలినొసగుగాంధిజీత్యాగభాగ్యగరిమ
అలరెనీయందు సఖ్యతాకలన నేడు
మహితగుణసాంద్ర మలయాళమౌనిచంద్ర.

మ॥ ఎటువీక్షించిన హృత్ప్రశాంతిదములై యింపారియజ్ఞానసం
కటిముల్ బాపెడియాశ్రమంబులును నోంకారాత్మపూరంబుగా,
మటముల్ కొల్లగ మీపదాశ్రయములై మాన్యస్థితిన్ వెల్గెనో
పటువిజ్ఞానరుచిప్రపూర్ణగురు దేవా దీనసంరక్షకా.

సీ॥ అవధూతయైన వేమన్నయోగీంద్రు సత్సిద్ధిసీమప్రసిద్ధమయ్యె
అమలభక్తీంద్రుపోతన్న కవీశునకీమండలము ప్రుట్టుభూమియయ్యె,
బ్రహ్మర్షియైన వీరబ్రహ్మగురునకీ ప్రాంతంబుమాతృభూప్రాంతమయ్యె
అవిరళజ్ఞానభాగ్యావాసి సిద్దయ్యస్వామికియ్యది జన్మశాలయయ్యె,

గీ॥ మరియుమీవంటి ఋషులను పరమభక్తి
స్వాగత మొసంగి పూజించి సత్కరించి,

నిండుయశమునవెగ్గె మామండలంబు
దివ్యగుణసాంద్ర మలయాళ దేశికేంద్ర. ౮.

గీ॥ భవదమోఘదయాగుణప్రాపకమున
అనఘమైమాన్యమయ్యె మాయన్వయంబు,
కపటవేదాంతమణగి సుజ్ఞానదశను
మహితమైబొల్చెనయ్యమామండలంబు. ౯.

మ॥ మునుపొక్కప్పుడు సత్కవీంద్రుడు మనమ్ముల్ సద్గురుస్వామి క
ర్పణగాజేసిన సాధువర్యుడు పరబ్రహ్మాఖ్యుయత్నాన మీ,
ఘనపాదాంకితమయ్యె నీస్థలమునిక్కాలాన నాధీగుడే
మనియున్నల్ భళియెట్టులీ సన్మానంబు శోభిల్లునో. ౧౦.

సీ॥ మృదులమై మధురమై హృదయప్రమోదమౌ కవితస్వార్థంబుగ గలమనీషి
మాతృదేశోద్ధారసూత్రానుసారియై తనసౌఖ్యమెంచనిత్యాగమూర్తి,
దనజీవులవ్యథల్ దీర్పగాదృఢదీక్షబట్టిన పరమకృపాపరుండు
మనమునల్ వాక్కునల్ బనిచి సద్గురుసేవఘనభక్తిజేసినజ్ఞానరాశి.

గీ॥ భవములల్ గ్రొంపజాలిన పరమసాధు
వర్యుడనవద్యుడగు పరబ్రహ్మగురుని,
తలపచిత్తంబదేలకో తల్లడిల్లు
మహితగుణసాంద్ర మలయాళసూనిచంద్ర. ౧౧.

గీ॥ ప్రాకృతంబగురక్తంపుభాగమొకటి
పరమమైనట్టిజ్ఞానవిభాగమొకటి,
జేరితద్భుధువలచిన చిత్తమెల్ల
దీనమైవ్రీలిపోవునో దేశికేంద్ర. ౧౦.

గీ॥ పూర్ణమగుదైవసిద్ధినిబొందినట్టి
పరయశోమూర్తి యాపరబ్రహ్మగురుని
పేరనియ్యాశ్రమంబు స్థాపించినారు
భవదమలపాద పంకజార్పణమనాన. ౧౧.

గీ॥ మీయనుగ్రహంబు మాయందుపూర్ణమై
వెలసియిట్లు జేయగలిగెనయ్య,
లేకయున్నశక్తిలేదు లేశముమాకు
దివ్యసుగుణసాంద్ర దేశికేంద్ర.

సీ॥ హింసజేసినపాపమేలేదటంచును కటికవేదాంతాంధకారపటిమ
ఇంద్రియంబులకోర్కెలెల్లదీర్చుట ముఖ్యమనెడి శుష్కజ్ఞానఘనతమంబు
కల్లుసారాభంగి నెల్లగోప్యంబుగా త్రాగుదుస్సాధుతాధ్వాంతగణము
దేవుండులేడు యీదృశ్యమాత్మయటంచు తిరుగునాస్తికవాదతిమిరచయము,

గీ॥ భవదఖండైకవిజ్ఞానభావబోధ భాసితవిభాకరమయూఖ
భాఃప్రదీప్తి భిన్నమై భిన్నభిన్నమై చెదరిపోయె.

శా॥ నీకారుణ్యసువీక్షణామృతమె తండ్రీమాకు ప్రజ్ఞాభరో
త్సేకంబైనసువిద్య నివ్వగలిగెక్ సేమంబుమాకయ్యె దే
వా కల్పాంతము మాహృదంతముల మీయర్చాస్వరూపంబు వి
ద్యైకస్ఫూర్తిని వెల్గజేయుమవికల్పా దీనసంరక్షకా.

వ॥ పారబాల్లెన్నియొుగల్గు మాయెడల ప్రాక్ పుణ్యంబులేకుంటనో
గురుదేవాయని యెల్లగైకొనక మీకుక్షిక్ మమున్నిల్పి స
త్కరుణాదృష్టిని బ్రోచిజ్ఞానమిడి మాకాలుష్యముక్ బాపు మీ
చరణబ్జంబుల నమ్మినారము సుధీశవిశ్వసౌఖ్యప్రదా.

ఇట్లు,
భవత్పాదధూళి.
సాయం. నారాయణచరణుడు.

---

# యథార్థభారతి

పుటం 13. | ప్రమాది సం॥రం భాద్రపదమాసం సెప్టెంబరు నెల 1939 | సంచిక 7.

భక్తియోగః





కర్మయోగః




ధ్యానయోగః





జ్ఞానయోగః

(పత్రిక విలాసము:—శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరా౯ నిబోధత.

...భూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి
...ం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.
Published by:— K. Venkatachalam Naidu, Chittoor.

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమంద్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమంద్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, మేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమంద్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కఠారి. వెంకటసుబ్బరాజుగారు—చిననింద్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నగాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోటేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. [illegible]
5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్‌పూర్

యథార్థభారతి

| సంపుటం 13 | ప్రమాది సంవత్సరం | చందా |
| --- | --- | --- |
| | భాద్రపదమాసం | సం॥రం రూ 2-4-0 |
| సంచిక 7 | 1939 సం॥రం సెప్టెంబరు నెల | విడిపత్రిక రూ 0-4-0 |

# బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి.

23. ఆత్మా దేహాదివ్యతిరిక్తో న వా; వ్యతిరిక్తత్వేఽపి కర్తృత్వాది ధర్మయోగీ న వా; అకర్తృత్వేఽపి తస్య బ్రహ్మణోఽభేదోఽస్తి వా న వా; అభేదేఽపి తజ్జ్ఞానం కర్మాదిసహితం ముక్తిసాధనం కేవలం వా; కేవలేఽపి ఆత్మా సాక్షీ వా కర్తా వా; సాక్షిత్వేప్యస్య బ్రహ్మత్వమస్తి వా న వా; బ్రహ్మత్వేఽపి తద్బుద్ధ్యా వేదితుం శక్యం వా న వా; శక్యత్వేఽపి తద్వేదనమాత్రేణ ముక్తిరస్తి వా న వా; మమ పరమార్థతో బ్రహ్మత్వమస్తి వా న వా; బ్రహ్మత్వేఽపి తాదృగ్రూపం మమ సాక్షాత్కృతం వా న వా; సాక్షాత్కృతేఽపి ఇతఃపరం కర్తవ్యమస్తి వా న వా; కర్తవ్యాభావేఽపి ఇదానీం మమ జీవన్ముక్తత్వమస్తి వా న వా, జీవన్ముక్తత్వేఽపి వర్తమాన దేహపాతానన్తరం విదేహముక్తిర్భవిష్యతి వా న వా; తదప్రాప్తావపి కాలాన్తరేషు పునర్జన్మ భవిష్యతి వా న వా; ఇత్యాది సర్వ సంశయ నివృత్తిర్భూయాత్.

తా॥ ఆత్మ దేహాదులకంటె వేఱైనదా? కాదా? వేఱైనదిగా నుండు నెడల కర్తృత్వాది ధర్మసంబంధము కలదా? కాదా? కర్తృత్వము లేనిదిగా నుండినను దానికిని బ్రహ్మమునకును అభేదమున్నదా? లేదా? అభేదముండినను దానియొక్క జ్ఞానము కర్మాదులతోఁగూడినదై ముక్తికి సాధనమైనదా? అట్లుగాక ప్రత్యేకముగనైనను ముక్తికి

సాధనమా? ప్రత్యేకముగానైనను ఆత్మ సాక్షియా? కర్తయా? సాక్షిత్వముండినను దీనికి బ్రహ్మత్వము కలదా? లేదా? బ్రహ్మత్వ ముండినను ఆ జ్ఞానముచేతనే తెలిసికొనదగినదా? తెలిసికొనుటకు సాధ్యముకానిదా? తెలిసికొనుటకు సాధ్యమైనను ఆతెలివిమాత్రము చేతనే ముక్తి కలదా? లేదా? నాకు పరమార్థముగా బ్రహ్మత్వము కలదా లేదా? బ్రహ్మత్వము కలదిదైనను తత్ స్వరూపము నాకు సాక్షాత్కారమగునా? కాదా? సాక్షాత్కారమైనను దీనికంటె వేఱే కర్తవ్యము కలదా? లేదా? కర్తవ్యము లేకపోయినను ఇప్పుడు నాకు జీవన్ముక్తి కలదా? లేదా? జీవన్ముక్తి కలదైనను వర్తమానశరీరము పోయిన మీదట విదేహముక్తి కలుగునా? కలుగదా? అది లభించినను కాలాంతరములందు మఱల జన్మము గలుగునా? కలుగదా? అను నీమొదలగు సకల సంశయములయొక్క నివృత్తి కలుగును గాక?

24. అనారబ్ధానా మాగామిజన్మహేతునా మనేకకోటిజన్మార్జితానాం ప్రారబ్ధవ్యతిరిక్తానాం సఞ్చితకర్మణాం నివృత్తిరూపః పరమపురుషార్థః సమ్యగ్భూయాత్.

తా॥ ఆరంభింపనిదియు, రాఁగల జన్మలకు కారణమైనవియును, అనేకకోటి జన్మములయందు సంపాదింపబడినవియును, ప్రారబ్ధకర్మములకు వేఱైనవియును అగు సంచితకర్మములయొక్క నివృత్తిరూప పరమపురుషార్థము చక్కఁగా కలుగును గాక!

---

# మనస్తత్త్వము.

(నివృత్తి మార్గము)

(శ్రీ మలయాళ స్వాములవారు).

(208-వ పుట శేషము.)

తలంచవచ్చును! మలమును నిర్మలముగాను, దుఃఖమును సుఖముగాను, బంధమును మోక్షముగాను తలంపజేసెడు ప్రకృతి

యొక్క మాహాత్మ్యము యేమని వర్ణింపగలము ? దీనియందు కొంత కాలము గడపినపిమ్మట సుకృత విశేషముండిన, అంతఃకరణము కొంచెము గ శుద్ధమై పై వర్ణించినవన్నియు మాయయొక్క మహిమవలన గల్గిన మోహమనియు, ఇంద్రజాలమువలె యివి నశ్వరములనియు, అంతేకాదు, దుఃఖహేతువులని గూడ తలంపుగల్గును. ఇప్పటికెన్ని మార్పులుగల్గినవో లెక్కపెట్టుకొనుడు. సుకృతవిశేషములేని జీవికైనచో ఆమాయామోహములోనే వార్ధక్యముకూడ గడిచిపోవును. అట్లుగాక దైవకృప గల్గిన జీవి యైనచో యీ మార్పులన్నిటికిని మనస్సే కారణమనియు, ఈ ప్రపంచము కలలో కల్పించెడి లోకమనియు నిశ్చయించుకొనును. అప్పుడే దీనినుండి నివృత్తినిబొందెడి మార్గము కలదా యను విచారణగలుగును, అత్తటి ఈశ్వరప్రార్థన, పుణ్యకర్మలు, పవిత్రమైన వ్రతములు, దివ్యమంత్రముల జపములు, తీర్థయాత్రలు, మొదలగు పవిత్రమార్గములలో ప్రవేశముగల్గును. అందువలన అంతఃకరణశుద్ధి మఱింత యెక్కువగుటచే ప్రపంచమందు సంపూర్ణ విరక్తిగల్గును. మాయయొక్క మహామహిమయే యిదంతయునని తెలిసికొనును. అప్పుడు పరమేకాంతమున ప్రవేశించి, తపస్సు, యోగము మొదలగు ఆత్మప్రాప్తికి ముఖ్యమగు సాధనలను శ్రద్ధతోను, తీవ్రవేగముతోను అనుష్ఠించుచుండును. ఆ తరుణమున దానికి మించినది లేదనియు, ఇంతవఱకు ప్రారంభించిన జప తప ప్రార్థన వ్రతాదులు యెక్కువ కాదనియు, ఇప్పుడుగల నిష్ఠయే అన్నిటికెక్కుడనియు బోధముగల్గును. ఇప్పటికెన్ని మార్పులు గలిగినవో యోచించుకొనవలెను. ఎన్ని పరిణామములు మాఱివచ్చినవో విచారణీయము. పైఁజెప్పేలాగున జ్ఞానతపస్సుచేతను, ఆత్మజ్ఞానసంధానమగు యోగనిష్ఠచేతను, అంతఃకరణము మఱింత శుద్ధమగుచుండగా వీటివలన యథార్థతత్వము బోధము కాజాలదనియు, ఉత్తమబ్రహ్మనిష్ఠులగు గురువుల సహాయముచే నిజమగు వస్తుతత్వము తెలిసికొనవలెననియు బోధముదయించును. అంతఃకరణము చాల నిర్మలస్థితికి వచ్చుటచే మనస్సులో యింతవఱకు గల్గివచ్చిన మార్పులన్నియు బోధమునకు వచ్చును. కావున, హృదయపరివర్తనము గలుగక సచ్ఛస్థితిలో నుండు

టకును, తనలోగల లోపములను సవరణ చేయుటకును, ప్రత్యే
కావల ప్రకాశించు ప్రకాశములోనికి ప్రవేశించుటకును, శిష్యు
ఆచార్యుడావశ్యకమని తోచును. ఏలన, ఇంతవఱకు వచ్చిన
దారులన్నియు, పరిణామములన్నియు, అంతఃకరణముయొక్క
ణామమే గాని, నిజమైన ఆత్మలో (ఈశ్వరునిలో) మనమింకను
ప్రవేశించియుండలేదనియు, ఆతనికి నిశ్చయమగు నమ్మకము గల్గు
గును. ఏలన, ఆత్మ పరిణామము లేనిది, స్వయంప్రకాశమైనది. దుఃఖ
ముయొక్క లేశమైనను స్పర్శింపనిది, నిత్యమైనది. అని శ్రుతి
వాక్యములు దెల్పుచుండగా, అట్టి స్థితి తనకు గల్గినదా, లేదాయని
తనలో యోచించుకొనుచుండును. అపుడీ యంతఃకరణమును,
మనస్సును, బుద్ధిని ప్రకాశింపజేయువస్తువొకటి వీటన్నిటికంటె పై
భాగమున యేవికారముగలుగక స్వయంప్రకాశమై యుండుననియు,
అది అమృతమనియు, అనంతమనియు, బ్రహ్మాది స్తంబపర్యంతమన్నిటి
లో అంతర్యామియై ప్రకాశించుననియు, తనలోను, తానుభజించు
దైవములోను, తనకాత్మతత్వముపదేశించు గురువులోను మెలగు
చున్నదనియు బోధము కల్గును. దానివలనే యివన్నియు ప్రకాశింపు
చున్నవి; కావున యీ బుద్ధియు, మనస్సున్ను, అంతఃకరణమున్నూ
జడములు; ఇంతవఱకు వీటిననుసరించియే మనము ప్రవర్తించితిమి.
ఇపుడివన్నియు బంధముతో కూడినవే. ఇవి సత్యములని నమ్మి మోస
పోయితిమి. అను దృఢబోధము గల్గును. అత్తఱి ముండకశ్రుతి జ్ఞాపక
మునకు వచ్చును.

> నతత్ర సూర్యో భాతి నచంద్రతారకం
> నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః,
> తమేవ భాంత మనుభాతి సర్వం
> తస్య భాసా సర్వమిదం విభాతి.

'సర్వప్రకాశకుడగు సూర్యుడు ఆత్మభూతుడగు ఆ పరబ్రహ్మ
మును ప్రకాశింపచేయ జాలడు. చంద్రుడు, నక్షత్రములున్నూ ప్రకా
శింపచేయజాలవు. ఈ మెరుపులును ప్రకాశింప చేయజాలవు. మన
కనుల కెదుట [illegible] ప్రకాశింప

జేయును? అంతట, ప్రకాశించుచున్న ఆ పరమేశ్వరుని అనుసరించే సర్వము ప్రకాశించుచున్నది. ఈ ప్రపంచమంతయు ఆ పరమేశ్వరుని ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నది'. అత్తఱి ఆ సత్యస్వరూపమగు ఆత్మను ఈశ్వరునిగా తెలిసికొనును. సమస్త మతములయొక్క సార మొక్కటియే యను నిజతత్వము గోచరమగును. శ్రుతులన్నియు ఈ తత్వమునే యుపదేశించుచున్నవి. అట్టివాక్యములన్నింటిని యిచట వ్రాయదలంచిన విషయము పెరిగిపోవును. శివమహిమ్న స్తోత్రములో గల పరమ తత్వమిదియే. ఇది మానవప్రణీతముగాదు. పుష్పదంతుడను గంధర్వప్రణీతము.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషాం
నృణామేకో గమ్య స్త్వమసిపయసా మర్ణవమివ.

వేదమతము, సాంఖ్యమతము, యోగమతము, శైవమతము, వైష్ణవమతము, మొదలుగాగలవన్నియు పరమసత్యమగు బ్రహ్మమునే ఉపదేశించుచున్నవి. మార్గములు వేఱ్వేఱుగానున్నను జలప్రవాహము లన్నియు మహాసముద్రమును చేరునట్లు, భక్తులయొక్క అభిరుచి నను సరించి వేఱ్వేఱు భావనచే యుపాసనచేయుచున్నను, అందఱును ఆ పరమేశ్వరునే పొందుచుందురు. అదియే పరమసత్యము. దానినే బ్రహ్మమనియు, ఈశ్వరుడనియు, మహాశక్తియనియు, పరాశక్తియని యు అనేక పేర్లతో పిలచెదరు.

యం శైవాస్సముపాసతే శివఇతి బ్రహ్మేతి వేదాన్తినః
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణ పటవః కర్తేతి నైయ్యాయికాః
అర్హన్ కథ్యతి జైనశాసనరతః కర్మేతిమీమాంసకాః
సోయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథోవిభుః.

'శైవులు దేనిని శివమని చెప్పుచున్నారో, వేదాన్తులు దేనిని బ్రహ్మమనుచున్నారో, బౌద్ధులు దేనిని మహాబోధితత్వమనియు, నిర్వా ణమనియు, బుద్ధదేవుడనియు వచింతురో, న్యాయశాస్త్రనిపుణులు దేనిని కర్తయనుచున్నారో, జైనశాస్త్రపరులు దేనిని 'అర్హత్' అని

తలంచుదురో, కర్మనిరతులగు మీమాంసకులు అన్నిటికి కర్మయే కారణమని యెద్దానినిగూర్చి చెప్పుచుందురో, వైష్ణవులు విష్ణువని దేనిని వచింతురో, ఆలాగున దేనిని క్రైస్తవులు దేవుడనియు, మహమ్మదీయులు అల్లాయనియు వచింతురో, అట్టి త్రైలోక్యనాథుడగు ప్రభువు మనందఱియొక్క వాంఛితమును సఫలమొనర్చునుగాక! అందఱి యొక్క దుఃఖమును శమింపచేయునుగాక! నిత్యము ముక్తిపదము అందఱికిని గలుక జేయునుగాక! మహావాక్యశ్రవణము, స్వానుభవము గల గురువులయొద్ద శ్రవణముచేయవలెననియు, అట్టి మహాపురుషుల సమీపమున వినయ విధేయతలు గల్గి వర్తింపవలెననియు, అట్లుకాని యీ పరమసత్యము బోధముకాదనియు ఆత్మలో సంకల్పము గల్గును. మహావాక్యశ్రవణభాగ్యము గలుగునప్పుడు ఆత్మానుసంధానపరుడై తాను శివజీవైక్యానుభవము గలిగినవాడనియు, తరించినవాడనియు, జన్మముయొక్క అంత్యము కనుగొనినవాడనియు, జననమరణ రహితుడనియు బోధముగల్గును. అదే పరమప్రాప్యము. ఆవల పొందవలసినది మఱొకటిలేదు. అంతర్యామిత్వావస్థయు నశించి దృగ్దృశ్యములయొక్క ఏకత్వమున్నూ, ధ్యాతృధ్యేయముల నైక్యమున్నూ అప్పుడు గల్గును. ఇత్తఱిమాత్రమే భ్రమలన్నియు యుడిగిపోవును. ప్రకృతియొక్క నామమంతయు నశించును. మాయయొక్క మహిమ మటుమాయమైపోవును. కర్మలన్నియు నశించును. సంశయములన్నియు తొలగును. భవబంధములన్నియు నశించును. అప్పుడు శరత్కాలపౌర్ణమిదినమున షోడశకళాపూర్ణచంద్రునివలె అమ్మహాత్ముడు ప్రకాశించును. అదే శివము, అమృతము, ఆనందము, దైవము. ఓం తత్ సత్.

---

## మనస్తత్వము (సత్యమార్గము.)

దీనిలో నడుచుటకు ప్రారంభించినపుడే నిజముగ ఈశ్వర విషయములో అడుగుపెట్టినవారమగుదుము. వేదాంతమార్గమున గల యనేకులున్నూ, సత్యమార్గమునుండి దూరులుగా నున్నారని చెప్పవచ్చును. దీనికి కారణ మేమన, పరిశుద్ధమగు సత్యములో జీవించు

గడపి సత్యస్వరూపమగు సర్వేశ్వరుని సాక్షాత్కరించుకొనిన జీవన్ము క్తులు, బ్రహ్మనిష్ఠులు ప్రస్తుతము మన నేత్రములయెదుట కనుపడక పోవు టయే. అట్టివారుండిన, వారినే ముముక్షువులు మార్గదర్శకులుగ జేసికొని బ్రహ్మనిష్ఠామార్గమున నడుతురు. అట్టి దివ్యపురుషుల దర్శనము లభించ నిచో యెన్ని శాస్త్రములు చదివినను నిజమగు మార్గమిదియని నిశ్చ యము గలుగదు. ఇప్పుడుండువారిలో కొందఱు హీనకర్మలుచేసియు, (ఆత్మజ్ఞానికి) అతీంద్రియజ్ఞానికి కర్మలు బాధింపవని చెప్పుచుండు పరమ పవిత్రములగు శ్రుతివాక్యముల నుదాహరింతురు. ఆత్మజ్ఞానికి బంధన ములేకున్నను, తామట్టి ఆత్మజ్ఞానులైతిరా యని విచారణచేయువారరు దైరి. కర్మయొక్క ఫలము అతిసిగూఢమైనది.. తాను ఏవిత్తనముపెట్టు నో, అదే వృక్షమై ఫలించునట్లు, జ్ఞానికిగాని అజ్ఞానికిగాని కర్మఫలము వెంబడించుచుండును. విత్తనమొకటి, దానివలనగలుగు ఫలము మఱి యొకటి చేయశక్తిగల యోగులుగాని జ్ఞానులుగాని యుండిరేని, వార లను మాత్రము కర్మము బాధింప నేరదని నమ్మవచ్చును. ఈ విషయమై వాసిష్ఠరామాయణములో శ్రీరామచంద్రులకు వసిష్ఠమునీంద్రుఁడు పదేశించిన విషయములే యీక్రింద నిరూపింపబడుచున్నవి..

యోయాదృక్ క్లేశమాధాతుం సమర్థస్తాదృగేవ సః
అవశ్యం ఫలమాప్నోతి ప్రబుద్ధో౽స్త్వజ్ఞ ఏవ వా.

అనగా జ్ఞానియైనను, అజ్ఞానియైనను, వారివారి కర్మల కను రూపమగు ఫలమును తప్పక పొందుదురు. కాన యిరువురును ఆకాశ గమనాది సిద్ధులఁగూర్చి తాముచేయు యత్నము ననుసరించియే వాటిని బొందుదురు.

ఆమోదశ్చందనస్యేవ స్పందనస్య ఫలం హృది
సర్వస్యైవాస్తి తన్మానం తద్వతా సమవాప్యతే.

శ్రీగంధమందు సుగంధమువలె విహితనిషిద్ధకర్మలఫలము అందఱియందు నుండియేయుండును (కలుగునని భావము). కాలక్రమ మున అట్టి క్రియాఫలమును వారవశ్యము పొందెదరు.

సంవిదుద్బోధనే బంధ స్తదనుద్బోధనే శివమ్
అసత్సద్వాజ్జగద్భాతి సంవిదుద్బోధనే చిరమ్.

చిత్తవృత్తిని బహిర్ముఖమొనర్చుటయే బంధము. ధ్యానము (సమాధి)చే దాని నాత్మయందు లీనమొనర్చుటయే మోక్షము. చిత్తవృత్తిని బహిర్ముఖమొనర్చుటచేతనే అసత్తగు యీ జగత్తు సత్యముగ తోచుచున్నది.

అజడంవేదనం సుప్తం మోక్ష ఇత్యభిధీయతే
ప్రబుద్ధం బంధ ఇత్యాహుర్యదిచ్ఛసి తదాహర.

ఓరామచంద్రా! జగత్తుయొక్క నామరూపరహితమగు చైతన్యస్థితియే మోక్షమనియు, నామరూపసహిత దృశ్యస్థితియే బంధమనియు చెప్పబడును. ఈ రెంటిలో నీకేదియిష్టమో దానినే యభ్యసింపుము.

నికటస్థః శివః స్పృష్టః సమనాగ్రభ్రమంతికమ్
వాడవోఽగ్నిః స్వనాశాయ వహంత్యేవాంబులేఖయా.

చిదాకాశమున నృత్యముచేయుచున్న శివసంకల్పస్వరూపిణియగు ప్రకృతి, సమీపముననున్న శివునిస్పృశింపగనే క్రమముగ తన యావరణశక్తిని గోల్పోయి, సముద్రజలము బడబాగ్నిని స్పృశించి తద్రూపమేయగునట్లు, శివునియందైక్యమగుచున్నది.

చితిః శివేచ్ఛాసాదేవం తమేవాసాద్య శాయతి
జన్మస్థాన శిలాం ప్రాప్య తీక్ష్ణధారా యథాయసీ.

పదునైన యినుపకత్తిని తన యుత్పత్తిస్థానమగు భూమియందుంచినచో క్రమముగనది తనరూపమును గోల్పోయి మట్టియై భూమియందే లయమగునట్లు, శివేచ్ఛాస్వరూపిణియగు చిచ్ఛక్తి (ప్రకృతియు) శివునిపొంది వానియందే లయించుచున్నది.

జ్ఞాతజ్ఞేయస్య మనసో నూనమేతద్ధి లక్షణమ్
న స్వదంతే సమగ్రాణి భోగవృందాని యత్నతః.

జ్ఞేయవస్తువగు ఆత్మ (బ్రహ్మము) నెఱింగిన వానికిక భోగములు రుచింపవు. ఇదియే నిశ్చయముగ జ్ఞాతజ్ఞేయుని లక్షణము.

స్వాత్మతత్వాభిగమనం భవతి ప్రాయశో నృణామ్
ముదే ... వైరాగ్యం ... తే

అత్మజ్ఞానము శ్రవణాదుల మూలమున ప్రాయశః లభింపవచ్చు నుగాని, విషయవైరాగ్యము చేకూరుట దుస్తరము.

తస్మాత్ పౌరుష మాశ్రిత్య సచ్ఛాస్త్రైః సత్సమాగమైః
ప్రజ్ఞా మమలతాం నీత్వా సంసార జలధిం తరేత్.

కాన పురుషప్రయత్నము నాశ్రయించి సచ్ఛాస్త్ర, సత్సాంగత్యములచే బుద్ధిని శుద్ధమొనర్చుకొని, సంసారసాగరమును దాటవలెను.

యస్తూదార చమత్కారః సదాచారవిహారవాన్
స నిర్యాతి జగన్మోహాత్ మృగేంద్రః పంజరాదివ.

నిరంతరము యత్నశీలుడై, సజ్జనులును జ్ఞానులునునగు మహాత్ముల యుత్తమ ఆచారములుగల్గి వర్తించువాడు పంజరమునుండి సింహమువలె యీ జగన్మాయనుండి బయల్వెడలును.

# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

---

(శ్రీ శ్రీకంఠశివాచార్యులవారి గీతాభాష్య గ్రంథమునుండి)
(చతుర్దశాధ్యాయము.)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె:—ఓలక్ష్మీ! మహారాష్ట్రదేశమందు ఒక బ్రాహ్మణుడుండెను. వాని భార్య జగడమాడునదియు, కఠినహృదయురాలును, వ్యభిచారిణియునై యుండెను. కాలకర్మవశముచేత నొకరోజున ఆమె భర్త పరపురుషునితో నామె క్రీడించుటగని మిక్కిలి కోపముతో వెనుకముందు నాలోచింపక కత్తితో నామెను ముక్కలు ముక్కలుగా నరికి చంపెను. ఆమె తన పాపకర్మానుసారము నరకమందు అనేక యిడుములబడి తిరిగి కుక్కయై జనించెను. అది ఒక రాజుయొక్క గృహమున కావలికాయుచుండును. బ్రాహ్మణుడును స్త్రీని చంపిన పాపమువలన మరుసటి జన్మమున కుందేలుగా జనించి ఒక అడవియందు పెరుగుచుండెను. ఇట్లు కొంతకాలమైన వెనుక నొకరోజున రాజు కుక్కను తీసి వేటనిమిత్తము

అడవికిపోయి వేటాడుచుండెను. ఇంతలో హఠాత్తుగా కుందేలు యొక్క
నటు దుముకుచుండుట చూచి పూర్వజన్మ వైరముచేత నాకుందేలును
కుక్క చంపుటకు పరుగెత్తుచుండెను. అదిచూచి రాజభటులున్ను
అల్లరిచేయుచు నాకుందేలు వెంట పరుగులిడుచుండిరి. ఇటుల విశే
దూరము పరుగిడి ఒక తాపసియొక్క ఆశ్రమము చెంతకురాగా, విశే
మైన అలసటచేత ఆ కుందేలు భూమిపై బడి మరణించెను. కుక్క
యును మిక్కిలి అలసటజెందిన కారణముచేత గుండె పగిలి చచ్చెను.
ఇటుల నా రెండు జంతువులు ఒకే స్థానమున మరణించెను. అచ్చో
టున ఆ ఋషి ప్రతిదినము తన పాదములను కడుగుకొనుచుండువాడు.
అందువలన నారెండు జీవులు స్వరమునకు బోవుటకు విమానము రాగా
అందున గూర్చుండి స్వరమునకు బోయిరి. ఇదియంతయు ఆ ఋషి
చెంత వేటాకరాజు గూరుచుండి చూచి ఆశ్చర్యమును జెంది యా
ఋషినడిగెను. ఓ ఋషిచంద్రమా! ఈరెండు జీవులును స్వర్గము
నకు బోవుటకు కారణము చెప్పుమనగా నాఋషి చెప్పదొడగెను.
ఓ రాజా! నేను ప్రతిదినము గీత 14 వ అధ్యాయమును పఠించుచుం
టిని. ఆరెండు జంతువులు మరణించిన చోటున నేను ప్రతిదినము
కాళ్లు కడుగుకొనుచుండెడివాడను. ఆ కారణముచేత నారెండు జీవు
లకు స్వర్గఫలము దొరకెననెను. అంత నారాజు మిక్కిలి ఆనందపడి
అప్పుడు మునిదగ్గర గీత 14 వ అధ్యాయము నుపదేశమునొంది ప్రతి
దినము పారాయణచేయుచు అంత్యమందు స్వర్గమును బొందెను.

---

ఓం.

# నిష్కళంక ప్రేమయే యోగికి ముఖ్యలక్షణము.

(సాధు రామయ్య.)

పరిశుద్ధాత్మస్వరూపులగు సోదర సోదరీమణులారా!

సమస్తజీవరాసులలో మానవజన్మ శ్రేష్ఠమైనది. అట్టి మాన
వులలో ధ్యానయోగి శ్రేష్ఠుడగును. అట్టి ధ్యానయోగి ముఖ్య

లక్షణములు విశదముగా చెప్పుకొందముగాక! ధ్యానయోగమున కంతకును అనుభవమే మూలాధారము. ముస్ముందు ధ్యానయోగము వలన ప్రయోజనమేమని యడుగవచ్చును. ధ్యానసాధనచే అఖండసత్య జ్ఞానోపలబ్ధియే పొందదగిన పరమపురుషార్థమని చెప్పుచున్నారు. దానివలన సర్వదుఃఖములు నశించుచున్నవి. అంతఃకరణమును శోధించి తన్మూలమున నాశరహితమును, స్వతస్సిద్ధమును నిత్యమును, నిష్కళంకమును, పరిపూర్ణమును నగు వస్తువును ప్రత్యక్షముగా దర్శించ వచ్చును. అట్టివాని కిక శోకమోహము లెక్కడివి? భయమును, తీరని కోర్కెయు మొదలగునవియే గదా దుఃఖమునకు మూలకారణములు? తాను పరిపూర్ణుడనని గ్రహించినంతనే మనుష్యుని వ్యర్థవాంఛలంత రించుచున్నవి? కోరికలయొక్క సమూహమే మనస్సు? ధ్యానయోగి అట్టిమనస్సును జయింపబూనును. మనస్సును జయించుటయే యోగ మనబడును. యోగ మనగానేమి? 'యోగశ్చిత్తవృత్తి నిరోధః'. చిత్త వృత్తులను నిరోధించుటయే యోగమనబడును. ఇక యోగమునకు అంగములని చెప్పబడు విషయముల విచారింతము—'ఏతే జాతి దేశ కాల సమయానవచ్ఛిన్నాస్సార్వ భౌమామహావ్రతమ్, అని పతంజలి యోగవివరణమున దేశ, కాల, నిమిత్తములచేతను, జాతి చేతను తెంపులేనివైన (సార్వజనీనములైన) మహావ్రతములను పేర్కొను చున్నాడు. అవియేవనగా? అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మ చర్యము, అపరిగ్రహము, అను యమములు అయిదును. 'శౌచ సంతోష తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః,— శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరారాధనము అను నియములు అయిదును యోగమునకు ముఖ్యాంగములు. ఈ 10 అంగములు యుండిననే పూర్ణయోగము సిద్ధించును. లేనియెడల యోగము రోగ ముగాగాని లేక దుఃఖముగాగాని మారగలదు. 1 అహింస—అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః దీని మహిమ అత్యద్భుతము. అహింసయందు నెలకొనియుండువాని సాన్నిధ్యమున స్వభావముచే క్రూరములైన సింహవ్యాఘ్రాది జంతువులును శాంతముగలిగి వర్తించును. అట్టియోగి యెదుట పులియు మేకపిల్లయు గలసి ఆటలాడు

కొనును, 2 సత్యము - సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్. సత్యశక్తి నీయందు నెలకొనియున్నయెడల కలలోగూడ కల్లలాడక మనోవాక్కాయ కర్మలయందు సత్యవంతుడవై యుందువు. అప్పుడు నీవేమి పలికినను సత్యమైతీరును. ధన్యుడవగుము అని నీవొకనిని జూచి పలికినంతనే ఆతడు ధన్యుడగును. అస్తేయము—అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్. అస్తేయము (దొంగలింపకుండుట) యందు నెల కొనియుండుటచే యోగికి సర్వ సంపదలును గలుగును. 4 బ్రహ్మ చర్యము—బ్రహ్మ చర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః. బ్రహ్మచర్యము వలన అద్భుతమైన సామర్థ్యమును బ్రహ్మాండమైన సంకల్పశక్తియు గలుగును. బ్రహ్మచర్యము లేనిదే ఎట్టి ఆధ్యాత్మికశక్తియు గలుగనేరదు. ఆధ్యాత్మికమార్గ దర్శికులు ప్రబల జితేంద్రియులై యున్నారు. కావున యోగి తప్పక జితేంద్రియుడై యుండవలయును. 5 అపరిగ్రహము - అపరిగ్రహస్థైర్యే జన్మకథంతా సంబోధః. అపరిగ్రహమునందు సుస్థి రుడై యుండువానికి పూర్వజన్మజ్ఞానము గలుగును. పరిగ్రహింపకుం డుటచే మనస్సు పరిశుద్ధమైయుండును, పరిగ్రహమువలన దాతయొక్క పాపములనుగూడగ్రహించుట కవకాశముగలదు, దాన ధర్మములను గ్రహింపనివాడు యితరులకు బద్ధుడుగాక స్వతంత్రుడై యుండును. 6 శౌచము — శౌచాత్స్వాంగ జుగుప్సాపరైరసంసర్గః? బాహ్యాంతః శౌచము స్థిరముగా నేర్పడినంతనే శరీరాడంబరమునం దసహ్యమును ఇతరులతో సంసర్గము లేకుండుటయు గలుగును. సత్వశుద్ధి సౌమన స్యైకాగ్ర తేంద్రియజయాత్మ దర్శనయోగ్యత్వానిచ. (శుచిత్వము వలన) సత్వశుద్ధియు, ఉల్లాసమును, ఏకాగ్రతయు, జితేంద్రియతయు, (ఇంద్రియనిగ్రహము)ను ఆత్మదర్శనయోగ్యతయు గూడ గల్గును. 7 సంతోషము—సంతోషాదనుత్తమస్సుఖలాభః. సంతోషమువలన పర మానందము లభించును. 8 తపస్సు - కాయేంద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్త పసః. తపస్సువలన మాలిన్యము నశించుటచే శరీరమునకును ఇంద్రియ ములకును సిద్ధులు గలుగును. 9 స్వాధ్యాయము — స్వాధ్యాయాదిష్ట దేవతా సంప్రయోగః. స్వాధ్యాయము (మంత్రజపము) వలన యిష్ట దేవత (తాను కోరిన దేవత) ప్రత్యక్షమగును. 10 ఈశ్వరారాధనము—

సమాధి సిద్ధిరీశ్వరప్రణిధానాత్. సర్వమును ఈశ్వరార్పణము చేయుట వలన సమాధి సిద్ధించును. భగవంతుని శరణు పొందుటచే స్థిరమైన సమాధిగలుగును. ఈ చెప్పబడిన యమనియమాదులును 12 సంవత్సరములు సాధనచేసిన, ఆయాసిద్ధులు గలుగునని పతంజలి మహాఋషి యోగసూత్రములలో చెప్పియున్నాడు. పైజెప్పినవిధమున జేయక కొలదికాలమభ్యసించి ఫలముగలుగలేదని విరమించుకొనువారు చాల మందిగలరు? ధ్యానయోగము సిద్ధించవలయుననిన ముఖ్యముగా పంచశీలములు గలిగి యుండవలెను. 1 ఆహారనియమము 2 ధ్యాననియమము 3 సంసర్గనియమము 4 ఆత్మనియమము 5 కృత్యనియమము. ప్రకృతినుండి నీ వెంతతొలగి వర్తించిన ప్రకృతి నిన్నంతగా వెంబడించుచుండును. ప్రకృతికాంతను క్రేగంటనైనను జూడకున్న యెడల నీకామె దాసురాలగును. యోగి యోగప్రతిబంధకములైన భావములను నిరోధించుటకై తద్వ్యతిరేక భావముల నవలంబింపవలయును. సద్గుణముల నలవరచుకొనుట కిదియే మార్గము. పరుల సొత్తు నపహరింపవలయునను భావము కలిగినంతనే అపహరింపకుండుటయను సద్గుణమును గూర్చి చింతింపుము. దానధర్మములను గ్రహింపవలయునని తోచినంతనే తద్వ్యతిరేకభావమును గూర్చి చింతింపవలయును. ఇటులనే ప్రతిదుర్గుణము యెడలను తద్వ్యతిరేక భావన చేయుచురాగా మనోజయము గలుగును. అసత్యము, హింస మొదలగునవి తానుచేసినను, పరులచే చేయించినను, పరులుచేసినప్పుడు ఆమోదించినను, లోభముచే నైనను, క్రోధముచేనైనను, అజ్ఞానముచే నైనను, మందముగానున్నను, సామాన్యముగానున్నను, ప్రబలముగానున్నను, యోగప్రతిబంధకములై అనంత దుఃఖముగను, అవిజ్ఞానముగను పరిణమించుచున్నవి. ప్రతిదుర్భావమును, ద్వేషాలోచనయు అతిరహస్యముగా కొండగుహలో గూర్చుండి తలచినను విక్షిప్తమై యొకానొకదినమున అప్రతిహత శక్తితో నేదియో యొక దుఃఖరూపమున నిన్ను అది పొందక తప్పదు. అసూయాద్వేషములు నీయందుండి వెలువడిన యెడల వడ్డికి వడ్డీతో సహితముగా అవి నిన్ను కట్టి కుడుపకమానవు. హరిహరబ్రహ్మాదులును దాని నడ్డగింపజాలరు. ఈర్ష్యా

ద్వేషములకు నీవొక్కసారి తావిచ్చినంతనే వాని ప్రతిఫలమును నీవను
భవింపక తీరదు. సమస్త సద్గుణములును ప్రేమయందు అంతర్భూతమై
యున్నవి. ఈ విషయము జ్ఞప్తియందుంచుకొనుటచే దుష్కార్యములను
చేయజాలవు. ధ్యానాభ్యాసి దుర్భావమునకు ఏమాత్రము హృదయ
ములో తావీయక సదా సద్భావము (లేక) బ్రహ్మభావమునే చేయు
చుండవలయును? అభ్యాసి దీనిని అనుష్ఠానము చేయుచు రాగారా
దానివలన మనస్సున కేకాగ్రతయు ఉల్లాసమును గలుగును? ఉల్లాసమే
పారమార్థికతకు ప్రథమ లక్షణము. మనోవ్యాకులత్వమజ్ఞానా
లక్షణముగాని పారమార్థికతకు చిహ్నముగానేరదు. సంతోషదా
మగు మనోభావమే సత్వగుణస్వభావము. సాత్వికునకన్నియు ఆనం
కరముగనే యుండును. ఇట్టి మనఃప్రసన్నత నీకుచేకూరినయెడల యో
మునందభివృద్ధి గలుగుచున్నటుల గ్రహింపుము. దుఃఖమంతయు తమో
గుణఫలితము. కావున యోగి దుఃఖమును విడువవలయును. దుఃఖమే
పాపము. సంతోషమే పుణ్యము. చిరచిరలాడుచు మొగము ము
చుకొని యుండుట తామసికలక్షణములలో నొకటి. బలవంతులై,
దృఢకాయులై, యౌవనవంతులై, ఆరోగ్యసంపన్నులై, సాహసో
తులై. యలరారునట్టివారే యోగులగుటకర్హులు. నాయమాత్మా
బలహీనేనలభ్యః — ఈ యాత్మబలహీనులకు లభించునది కాదని
శ్రీవివేకానందస్వాములవారు సెలవిచ్చియున్నారు. యోగికి సర్వము
ఆనందమయమై ప్రతిమానవముఖమును సంతోషజనకమై చూపట్టును.
ఇదియే శుద్ధప్రేమమయుని లక్షణము. ప్రేమలేక మొగము ము
చుకొని యుండునట్టివారితో మనకేమిపని? అదియొక ఘోరమైన దృ
శ్యము. మనోవ్యాకులత నీమొగమున మూర్తీభవించినప్పు డానా
నీవీవలకురాక తలుపువైచుకొని గదిలో కూర్చుండుము. ఈ వ్యాకు
ప్రపంచములో వ్యాపింప జేయుటకు నీకేమిహక్కుగలదు. కనుక
ఋషులు, మహాత్ములు, ప్రేమానందభరితులై స్వప్నమందైన దుః
ము నెఱుంగరని లోకప్రసిద్ధమై యున్నది. అట్టివారిని దర్శించిన మాత్ర
మున శారీరికమానసిక దుఃఖములన్నియు నంతరించి పోగలవు. వారు
ఉత్సాహపూరితులై ప్రేమస్వరూపులై యలరారుచుందురు. ప్రేమమే

భగవత్స్వరూపము. అప్రేమయే (ప్రేమ లేకుండుట) రాక్షసత్వము. ఈ పృథ్వికాధారము ప్రేమయే. వాయువు వీచుట, మేఘములు వర్షించుట, సస్యములు ఫలించుట దానివలననే. ప్రేమ దివ్యధామమునుండి ప్రేరితమై మనుజులను దివ్యధామమునకు జేర్చుచున్నది. ప్రకృతిసంబంధమగు నట్టి కళంకమాపాదిల్లినను ఆప్రేమ ప్రేమయని చెప్పజనదు. ప్రేమ స్వచ్ఛమైనది. స్వచ్ఛమైన ప్రేమ ప్రతిఫలమును వాంఛించునదిగాదు. ఇట్టిప్రేమయే కౌండఋబుప్యాదులను మతకర్తలను ప్రేరేపించి లోకో ద్ధరణ కొఱకు పురికొల్పినది. ప్రేమయొక్క తీవ్రగమనత్వమును బట్టియే ప్రేమి లోకకల్యాణమును నిరీక్షించుచున్నాడు. క్రమముగా మానవలోకమునందును ఒక్క మానవరాజ్యమే గాక సమస్త చేతనాచేతన పదార్థములయందును ప్రవేశించుచున్నది. అప్పుడది మధురవర్షము గురిపించుచు జగన్మయ మగుచున్నది. బుద్ధదేవుని ప్రేమ చైతన్యప్రభువు ప్రేమ, క్రీస్తుభగవానుని ప్రేమ సర్వలోకైకవిదితమే గదా! శ్రీరామచంద్రమూర్తి సీతను యెంతగా ప్రేమించెను. బుద్ధుడు తనప్రాణప్రియయగు సతిని ప్రేమించియు కర్తవ్యానురోధముచే క్షణకాలములో ఆప్రేమను విసర్జించెను.

శ్లో॥ వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతుమీశ్వరః

మహాపురుషులయొక్క ప్రేమ పుష్పముకంటె కోమలమైనదిగా నుండును. కాని కర్తవ్యాహ్వానసమయమున వజ్రముకంటె గూడ నెక్కుడు కాఠిన్యమును వహింపుచున్నది. సామాన్యులందఱు ప్రేమ యనుపేర మోహమును వాడుకొనుచున్నారు. శుద్ధప్రేమ భగవత్త త్త్వము చవిజూచినవారికి మాత్రము లభించునుగాని అన్యులకు లభింప జాలదు. ఈ ప్రేమ సులభముగా అలవడునది కాదు. ధ్యానయోగి సాధనాభ్యాస ఫలితమే విశ్వజనప్రేమగా పరిణామము పొందబడు చున్నది. ఈ ప్రేమ దైవానుగ్రహము, గుర్వనుగ్రహముగలవారికి మాత్రము లభించగలదు. ప్రేమలేని సాధనలన్నియు సున్నయగును. ప్రేమస్వరూపుని దేవగణములు ప్రేమసింహాసనమున విశ్రమింపజేసి ప్రేమహారతి నొసంగుదురు. [illegible] మృత్యులో

కము స్వర్గలోకముగ బరిణమించును. పవిత్రప్రేమను సంపాదింపగ
అప్పుడెంతసుఖము, ఎంతయానందము ప్రాప్తించునో గ్రహింపగలరు.
భగవానుడు అట్టిదివ్యప్రేమ నొసంగి మిమ్ముల నాశీర్వదించుగాక!

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

---

# భక్తియోగము.

(శ్రీ మలయాళస్వాములవారు.)

దీనియందు భక్తిని మిక్కుటముగా జెప్పినందుచే, దీనికి భక్తి
యోగమని పేరువచ్చినది. దీనిలో సగుణ భక్తియు, నిర్గుణ భక్తియు
ఉపదేశింపబడెను. వీనిలో యేది శ్రేష్ఠమని ప్రశ్నరాగా, యేదైన
సరే, శ్రద్ధయను సుగుణముతోగూడి నిరంతరము భగవచ్చింతన గల
వాడెవడైనను వాడేశ్రేష్ఠుడని భగవంతుఁడుపదేశించెను. దేహా
మానము, కులాభిమానము, ఆశ్రమాభిమానము, విద్యాభిమానము,
అధికారాభిమానము, రూపాభిమానము మొదలగు దేహసంబంధ
ధనము గలవారికి మోక్షప్రాప్తి గలుఁగుట ప్రయాసమని యుపదేశించి
ఇట్టి యభిమానము ఆత్మను కనుపఱచ నీయక కప్పివేయుచుండును
మఱియు జ్ఞానయోగమే అన్నిటికంటె శ్రేష్ఠమని తెలిపి, అట్టి జ్ఞా
యోగమునకు శక్తి చాలకపోయినచో ధ్యాన సమాధి యోగము
నుపదేశించిరి. దానికిన్ని సమర్థత లేని వారికి భక్తియోగము నుపదే
చిరి. అనన్యమగు భక్తియోగమును శీలించుటకు సమర్థత లేనిచో,
నిష్కామ కర్మయోగము నాచరించిన చాలునని తెలిపిరి దీనికి
సమర్థత లేని పక్షమున యెవరైనను సత్కర్మలాచరించు దానిని చూచి
సంతోషపడినను సద్గతిగల్గునని వచించిరి. కాని తాను చేయుటకు
యిష్టము లేక, యెవరైనను చేయుదానిని చూచి అసూయ పడకుండు
టయు, ఆటంకము కలుగజేయ కుండుటయుకూడ పుణ్యమని యానతి
చిరి. కావున సత్కర్మలకు ఆటంకముచేసి నరకము బాల్పడకుండ
చూచుట శ్రేయస్కరము. భగవద్భక్తులు యుండవలసిన సుగుణము

లన్నింటిని బాగుగ నీ యధ్యాయమున దెలిపియున్నారు. గీతాపారాయణము చేయువారు మొదటనుండి ప్రారంభించక అనగా ప్రథమాధ్యాయమునుండి యారంభముచేయక, ఈ పండ్రెండవ అధ్యాయము నుండి మొదలుపెట్టుట మంచిదని పరంపరానుభవముగల పెద్దలు చెప్పుదురు. ఇదిపారంపర్యధర్మమని కూడ తెలిపెదరు. అట్లయిన విఘ్నములు కలుగవనికూడ వచింతురు. ఈయధ్యాయమున అమృతసమానములైన వాక్యములు గలవు. మఱియు నీయధ్యాయశ్లోకములు చాలచిన్నవి. అనుష్టుప్ ఛందస్సుతోగూడినవి. అంతియేగాక యిఱువది శ్లోకములు మాత్రమే యిందుగలవు. మొదటి అధ్యాయము దుఃఖవార్తలతో కూడినది; అది దుఃఖమును గురించిన కథలు గలదగుటచేతను, శ్లోకములు చాల పెద్దవగుటచేతను యెక్కువశ్లోకములుండుటచేతను, క్లేశమే దానియందు వివరింపబడియుండుట చేతను పైవిధమున జెప్పుటకు కారణమై యుండవచ్చును. శ్రీ మద్భగవద్గీతయంతయును 4 భాగములలో నిమిడియున్నది. (1) కర్మయోగము, ఇది మూడవ అధ్యాయమున గనందగును. (2) భక్తియోగము, ఇది ద్వాదశాధ్యాయమున వివరింపబడినది. (3) ధ్యానయోగము (అభ్యాసయోగము), ఇది ఆఱవ అధ్యాయమున నుపదేశింపబడెను. (4) జ్ఞానయోగము, ఇది పదునాల్గవ అధ్యాయమున గనందగును. తక్కిన అధ్యాయములన్నియు వీటిలో నంతర్భూతములే. మఱియు యీ గీత 'తత్త్వమసి' అనుమహావాక్యమునే యుపదేశించుచున్నదనియు మొదటి ఆఱు అధ్యాయములు 'తత్' అను యీశ్వరునిగుఱించియు రెండవ ఆరు అధ్యాయములు 'త్వం' పదమగు జీవుని గూర్చియు, మూడవ ఆఱు అధ్యాయములు 'అసి' అను ఐక్యపదమును గూర్చియు నిరూపించునని విజ్ఞులు దెల్పిరి. అనగా జీవేశ్వరైక్యమే గీతయొక్క సారమని మహనీయుల యభిప్రాయము.

అన్ని యోగములున్ను, అన్నివిద్యలున్ను ఒక్కరియందుండవు. అవన్నియు సర్వేశ్వరునియందుమాత్రమే నిండియుండును. జీవుల సంస్కారము ననుసరించి భక్తియోగమందుగాని కర్మయోగమందు గాని ధ్యానయోగమందుగాని జ్ఞానయోగమందుగాని మనస్సు ప్ర

వర్తించును. కావున భక్తులు యీ భక్తియోగమును, నిష్కామకర్మ యోగులు మూఁడవ అధ్యాయమును, ధ్యానయోగులు ఆఱవ అధ్యాయమును, జ్ఞానయోగులు పదునాల్గవ అధ్యాయమును ముఖ్యముగ పఠింపఁదగినది. ఒక్కొక్కరును యీనాల్గుయోగములలోని యొక్కొక్క దానియందు ఆధిక్యము గల్గియుండినను తక్కిన మూఁడుయోగములు మిశ్రరూపములుగ గల్గియుండవలెను. ఒకటి ముఖ్యముగాను తక్కినవి గౌణముగాను నుండుటయే పవిత్రధర్మమగును. అట్లుగాక భక్తియోగ మందుగాని కర్మయోగమందుగాని ధ్యానయోగమందుగాని జ్ఞానయోగ మందుగాని యాధిక్యము గల్గియుండినను తక్కినవాటిని నిందించుట చాల సంకుచితభావమే యగును. ఏ యోగమవలంబించినవాడైనను ఈ ద్వాదశాధ్యాయమున చెప్పియుండు దైవగుణము లందఱును గలిగియుండవలయు. ఈ నాల్గుయోగములును సనాతనములు. వీటిలో ఏ యోగము ఏ కాలమున క్షయించునో దానినుద్ధరించుటకొఱకు నొకడు భూలోకమున నవతరించును. అప్పుడు దానికే యాతడాధిక్య మిచ్చును. ఇదే దీనిలోగల పరమ రహస్యము. మఱియొక కాలమున యింకొక యోగము క్షీణించినపుడు దానిని పునరుద్ధరించుటకొఱకు మఱియొక దివ్యపురుషుఁడావిర్భవించును. ఆ మహనీయుడు దానినవలంబించి దానికగ్రస్థానమిచ్చును. ఈలాగున కాలచక్రము తిరుగుచుండును. ఇది అనాది ధర్మము. అనంతకాలము వఱకు యీలాగునే జరుగుచుండును. ఒకరాజ్యపరిపాలనమందు చతురంగ బలముండును. వారందఱున్ను రాజ్యసంరక్షణయందును, అధికారమందును సమానులై యుందురు. వారిలో వైద్యశాస్త్రనిపుణులు మేమే ముఖ్యులము, మేము లేనిచో రోగములనుండి జనులనెవరు రక్షింపగలరు? అనియు, విద్యాశాఖవారు- మేమే అధికులము, అందఱుకును విద్యచెప్పి భాగుపఱచువారము మేము, విద్య లేనిచో మనుజులకును జంతువులకును యేమి భేదము? అనియు, శత్రువులనుండి దేశమును సంరక్షించువారగు సైన్యాధిపతులు- మేమే దేశసంరక్షకులము, మేము లేనిచో దేశమును శత్రువులు ఆక్రమింతురు, అనియు, నాల్గవవారగు మంత్రివర్గమువారు చెడ్డలను విచారించి న్యాయబుద్ధముగ మేమే రాజ్యపరిపాలన మొన

ద్భుచున్నారము, మేము లేనిచో జనులు అన్యాయపరులై ప్రపంచ మును నాశమొనర్తురు. వైద్యుల న్యాయాన్యాయములను, సేనాధిపతుల కార్యాకార్యములను, విద్యాధికుల మంచిచెడుగులను మేమే విచారణచేయు వారమగుటచే, మేమే యధికులమనియు నిట్లుచెప్పఁ బూనిన అదెట్లుండునో, పైవిషయమున్ను ఆలాగుననేయుండును. ఇది యెంతయో వివేకదూరమనియు, ఇది కేవలము అవివేకపూరితవచనమనియు జనులెఱుంగువిధమున మేమధికులమని చెప్పువారిని గూర్చియు వివేకులు తలంతురు. లేక, శరీరకార్యనిర్వాహణములో నేత్రమే ముఖ్యమని కన్నును, కర్ణమేయెక్కువని చెవియు, వాక్కే ప్రధానమని నోఁటును, ఘ్రాణమే యధికమని ముక్కును వచించి పోట్లాడుకొనిన అది యెంత సామరస్యముగా నుండునో, అట్లనే కరచరణాదులును దంతములునుకూడ మాత్సర్యమును ప్రకటించిన ఆ దేహస్థితి యెట్లుండునో, పైదానిచే లోకమునకు కలిగెడు ఫలితమున్ను ఆలాగుననే యుండును. కావున నట్టి యంధకారములో పడిపోఁగూడదని తలంచి శ్రీకృష్ణభగవానులు జీవకోట్ల సంస్కారము ప్రకారము యీ నాల్గు యోగములను యుపదేశించిరి. అందఱకును ఆత్మశుద్ధి, ఇంద్రియనిగ్రహము, జీవకారుణ్యాము, దైవభక్తియు, నిరంతర పరమేశ్వరధ్యానమున్ను సమానముగానే యుండవలెను. అయితే యిచ్చట భక్తులకొక సందేహము కలుగవచ్చును. అదేమన, పుణ్యాకర్మాదులను ఫలాపేక్షలేక ఈశ్వరార్పణబుద్ధితో చేయుటచే ఆత్మశుద్ధిగలిగి జ్ఞానముదయమై మోక్షము కలుగుట నిజముగ నుండవచ్చును. కాని యోగ, సమాధి, తపస్సులవల్ల గలిగెడు ఆత్మశక్తియు దివ్యప్రజ్ఞయు యోగసిద్ధులును వీరికిగూడ గలుగునా? యని. దీనికి సమాధానమేమన, నిష్కామకర్మయోగము ఈశ్వరార్పణబుద్ధితో చేయుచు రాఁగారాఁగా ఆత్మయొక్క ఆవరణములు తొలఁగిపోయి స్వరూప జ్ఞానముగల్గి ముక్తి గలుగుట నిక్కము. కాని యోగ, సమాధులచేతను, తపోనిష్ఠాదులచేతను గలిగెడు అప్రాకృతదైవశక్తి మాత్రము గలుగుట దుస్తరము. ఏలన, అనేక మహర్షులు దివ్యప్రభావముగలవారు, తపస్సువల్లను, యోగాభ్యాస మహిమవల్లను, అట్టి అతీంద్రియ జ్ఞానముగలవారైరి.

కాని యోగము తపస్సు లిన్నియు నిర్విఘ్నముగ ఫలసిద్ధి గల్గ వలసియుండిన, చిరకాలము పుణ్యకర్మలు ఈశ్వరార్పణబుద్ధితో చేయవలసియుండును. లేనిచో యోగసమాధులకు అర్హత గలుగదు. ఇదే యిందుగల రహస్యము. వైరాగ్య, బోధోపరతుల ఫలములను గుఱించి పంచదశియందు తెలుపబడినది. ఒక్కొక్కదానివల్ల ప్రయోజన మచట ప్రత్యేకముగా చెప్పబడినది. వ్రాసినందు గాంచవచ్చును. ఈ యధ్యాయమున యీ శ్లోకము ముఖ్యము.

యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మేప్రియాః. (12-20)

ఎవరు ఈశ్వరునే పరమగతియని నమ్మి, మోక్షప్రదమగు ఈ యమృతవాక్యములను నేను చెప్పిన విధమున యాచరించి శ్రద్ధతో నడచుకొనుచున్నారో, అట్టి భక్తి గలవారు నాకు మిక్కిలి ప్రియులు.

ఓం తత్ సత్.

---

ఓం.

# ఆరుణి శ్వేతకేతువునకు 'తత్త్వమసి' మహావాక్యము నుపదేశించుట.

---

(శ్రీ ఛాందోగ్యోపనిషత్తునుండి)

గతసంచిక 223 పుట శేషము.

కిఞ్చన భగవ ఇతి. తం హోవాచ. యం వై సోమ్యైతమణిమానం న నిభాలయస ఏతస్య వై సోమ్యైషోఽణిమ్న ఏవం మహాన్న్యగ్రోధ స్తిష్ఠతి శ్రద్ధత్స్వ సోమ్యేతి. స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ 'ఆరుణి (శ్వేతకేతువును జూచి) ఒకమఱ్ఱి పండును తెమ్మనెను. ఆతడట్లనే తెగా దానిని త్రుంచుమనెను. ఆతడట్లనే దానిని

త్రుంచెను. దానియందేమి యున్నవని యడుగ, మిగుల సూక్ష్మమైన విత్తనములున్నవనెను. వానిలో నొక విత్తనమును చీల్చుమన నాతఁ డట్లనే చేసెను. అందేమి యున్నదని యడుగ ఏమియు లేదనెను. అంత నాతఁడిట్లుపదేశించెను — ఇట్టేమియు లేని సూక్ష్మవస్తువు నుండి పెద్ద మఱ్ఱిచెట్టు యెట్లుకలిగెనో, అట్లే అతి సూక్ష్మమైన సత్తునుండి యీ మహాప్రపంచమంతయు కలిగినదని తెలిసికొనుము. ఆ సద్వస్తువు అణు ప్రమాణమైనది (అతి సూక్ష్మమైనది). ఈ జగత్తంతయు అట్టి సద్రూపమగు ఆత్మయే. అదియే సత్యవస్తువు. అదియే ఆత్మ. అదే నీవై యున్నావు'—ఇట్లు తండ్రియగు ఆరుణి శ్వేతకేతువునకుపదేశింప యది విని మఱల నాతఁడిట్లు ప్రశ్నించెను – 'ఇట్టి సత్తామాత్రమైన వస్తువు ప్రపంచమునకు మూలమై యుండగా అది కనబడకుండుటకు కారణ మేమి ? దానిని దృష్టాంతముతో ఇంకొకసారి చెప్పవేఁడెద' — అత్తఱి ఆరుణీ యిట్లు చెప్ప నారంభించెను.

'లవణమేతదుదకేఽవధాయాథ మా ప్రాతరుపసీదథా ఇతి స హ తథా చకార తం హోవాచ యద్దోషా లవణముదకేఽవాధా అఙ్గ తదాహరేతి తద్ధావమృశ్య న వివేద. యథా విలీనమేవాఙ్గాస్యా న్తాదాచామేతి కథమితి లవణమితి మధ్యాదాచామేతి కథమితి లవణమిత్యన్తాదాచామేతి కథమితి లవణమిత్యభిప్రాస్యైతదథ మోప సీదథా ఇతి తద్ధ తథా చకార తచ్ఛశ్వత్సంవర్తతే తంహోవాచాత్ర వావ కిలసత్సోమ్య న నిభాలయసేఽత్రైవ కిలేతి. స య ఏషోఽణిమైత దాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సౌమ్యేతి హోవాచ'.

తా॥ ఆరుణి తన కుమారునిఁబిలచి, ఒక ఉప్పుగడ్డను ఒక చెంబు నీళ్లలో యీరాత్రికి వేసియుంచి మఱునాడుదయము నాయొ ద్దకు రమ్మనెను. ఆతడట్లనే యొనర్చి మఱునాడుదయమున తండ్రికడకు వచ్చెను. ఇప్పుడా ఉప్పుగడ్డను తీసికొని రమ్మనగా, ఆతడద్దానికొఱకై నీళ్లలో వెదకి చూచి కనబడక మరలివచ్చి తండ్రిని జూచి, ఆ ఉప్పుగడ్డ నీళ్లలో కరఁగిపోయినది. కనఁబడలేదు, అనెను. అపుడాతడు దానిని కంటికి జూచుటకు సాధ్యముకాదు, నీళ్ల జిహ్వతో దెలిసికొన

వచ్చునని వచించి దాని పైనీటిని త్రాగుమనెను. ఆతడట్లనే త్రాగి ఉప్పుగా నున్నదనెను. మధ్యజలమును త్రాగి చూడుమనగా అదియు ఉప్పుగానేయున్నదనియు, అడుగునీటిని త్రావుమన నదియు ఉప్పుగానే యున్నదనియు బదులుచెప్పెను. దానిని దృష్టాంతముగా గైకొని అప్పుడు తండ్రివానికిట్లుపదేశించెను. జలమునందు ఆ ఉప్పు కలిసిపో యియున్నది. అది కంటితోఁజూచుటకును, చేతితో తాకుటకును సాధ్యముగాక నాలుకతో రుచిచూచి తెలిసికొనుటకు మాత్రము సాధ్యమై యెట్లు సూక్ష్మరూపమున దాఁగియున్నదో అట్లనే సత్తున్ను (ఈదేహమున) దాఁగియున్నది. అది యింద్రియములచే నెఱుఁగుటకు సాధ్యముకానిది. వేఱేవిధముగా యెఱుంగఁదగినది. ఆసద్వస్తువగు ఆత్మ అతిసూక్ష్మమైనది. ఈ ప్రపంచమందంతట నదియే గలదు. అదియే సత్స్వరూపము. అదియే ఆత్మ. అట్టిసద్వస్తువగు ఆత్మవే నీవైయున్నావు. అని యిట్లుపదేశింప శ్వేతకేతువు వేఱే విధముగా నాయాత్మ యెట్లెఱుంగబడునో మఱియొక తూరి విశదముగా బోధిం పుడన నంత యారుణి యిట్లు చెప్పదొడఁగెను.

'యథా సోమ్యపురుషం గన్ధారేభ్యోఽభినద్ధాక్షమానీయ తం తతోఽతిజనే విసృజేత్స యథా తత్ర ప్రాఙ్వోదఙ్వాధరాఙ్వాప్రత్యఙ్వా ప్రధ్మాయీతాభినద్ధాక్ష ఆనీతోఽభినద్ధాక్షో విసృష్టః తస్య యథా భినహానం ప్రముచ్య ప్రబ్రూయాదేతాం దిశం గన్ధారా ఏతాం దిశం వ్రజేతి స గ్రామాద్గ్రామం పృచ్ఛన్పణ్డితో మేధావీ గన్ధారానేవో పసమ్పద్యేతైవమేవేహాచార్యవాన్పురుషో వేద తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యేఽథ సమ్పత్స్య ఇతి. స య ఏషోఽణిమైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ'.

తా॥ ఒకానొకని కన్నులగట్టివైచి గాంధారదేశమునుండి తీసి కొనిపోయి జనసంచారములేని యొక ప్రదేశమున వదలివైచిన, అతఁడే ప్రకారము నలువైపుల దిరిగి 'నాకండ్లు బంధింపబడినవి. నేనిటకు గొని రాబడియున్నాను. నా కండ్లనెవరైన విప్పివేయుడ'ని కేకలిడుచుండు నో, మఱియు ఆ సమయమున నెవ్వరైన దయగలవాఁ డెవ్వడేని

మార్గమున వచ్చి, వాని బంధనముల విడిపించి, గాంధారదేశ మీ దిక్కున నున్నది, ఈమార్గముగాఁ బొమ్మని వచించిన, ఆ గాంధారదేశస్థుడు గ్రామగ్రామములఁజని, దారి తెలిసికొని యెట్లు తనదేశమును జేరునో అట్లే జీవుడు సద్వస్తువునుండివచ్చి వాత, పిత్త, కఫ, రుధిర, మేద, మాంసాస్థి, మజ్జా, శుక్ర, కృమి, మలమూత్రాదులచే పూర్ణమై, శీతోష్ణాది పలువిధద్వంద్వములతో గూడి సుఖదుఃఖసహితమైన దేహమను యరణ్యమును జేరి, మోహమను వస్త్రముచే బంధింపబడిన నేత్రములు గలిగి, స్త్రీ, పుత్ర, మిత్ర, పశు, బాన్ధవాది దృష్టాదృష్ట విషయతృష్ణలందు తగుల్కొని పుణ్యపాపములను చోరులచే సంసారారణ్యమున ప్రవేశపెట్టబడగా - నేను వీని పుత్రుడను, వీరు నా బంధువులు, నా ధనము నష్టమైనది-ఇవ్విధమున ప్రలపించుచునుండ ఏదేని పుణ్యవశముచే కారుణికుడగు గురువుచే మార్గము చూపబడి సంసారమందు విరక్తి నొందినవాడై తుదకు సద్వస్తువునుబొంది దానితో నైక్యమగుచున్నాడు. అట్లే యీ లోకమున ఆచార్యుండైన పురుషుడే బ్రహ్మమును (సద్వస్తువును) తెలిసికొనుచున్నాడు. అట్లు దేహబంధనమునుండి విముక్తి నొందిన వెంటనే ఆతడు మోక్షప్రాప్తి నొందుచున్నాడు. (సత్తుతో నైక్యమగుచున్నాడు). ఆ సద్వస్తువగు ఆత్మ అతిసూక్ష్మమైనది. సకల ప్రపంచమును ఆత్మ (బ్రహ్మ) మయము. అది సత్యస్వరూపము. అదియే ఆత్మయనఁబడును. ఓ శ్వేతకేతూ! ఆయాత్మయే నీవైయున్నావు. ఇట్లుపదేశింప నంత యాతడు 'దేవా! ఆచార్యఁ డెవ్విధమున సద్వస్తువును జేరుచున్నాడో దృష్టాంతపూర్వకముగ నెఱింగింపవేడెద' ననెను. అపుడు ఆరుణి మఱల యిట్లు చెప్పెను.

'పురుషం సోమ్యోతోపతాపినం జ్ఞాతయః పర్యుపాసతే జానాసి మాం జానాసి మామితి తస్య యావన్న వాఙ్మనసి సమ్పద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం తావజ్జానాతి అథ యదాస్య వాఙ్మనసి సమ్పద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయామథ న జానాతి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ మరణావస్థయందుండువానివద్దకు, వాని బంధువులం[illegible]
జేరి 'నన్నెఱుంగుదువా! నన్నెఱుంగుదువా'! అని యడిగెదరు. [illegible]
యెంతవఱకు వాని వాక్కు మనస్సునందును, మనస్సు ప్రాణమునందు[illegible]
ప్రాణము తేజస్సునందును, తేజస్సు పరమాత్మయందును లయముగా[illegible]
యుండునో, అంతవఱకును 'నీవు ఫలానివాడవు, నిన్నెఱుంగుదు[illegible]
చెప్పును. అటుపిదప యేమియు నెఱుంగజాలడు. [ఆచార్యోపదేశము[illegible]
జ్ఞానము బడసి సద్బ్రహ్మరూపమగు పరదేవత (ఆత్మ) యందు ప్ర[illegible]
శించి జ్ఞాని మఱల తిరిగి జన్మింపకుండును. కాని అజ్ఞాని, తన పూ[illegible]
సంస్కారము ననుసరించి వ్యాఘ్రు), దేవ, మనుష్యాది జన్మలంబొ[illegible]
చుండును.] ఆ పరమాత్మ అణుస్వరూపుడు. ఈ జగత్తంతయు ఆ[illegible]
మయమే అయియున్నది. అదియే సద్వస్తువు. అదియే ఆత్మయ[illegible]
బడుచున్నది. ఓ శ్వేతకేతూ! ఆ యాత్మయే నీవై యున్నావు - (ఉ[illegible]
పదేశింప, అదివిని యాతడు జ్ఞాని, అజ్ఞాని యిరువురును మరణిం[illegible]
పిదప సత్తును బొందినను, అజ్ఞాని మరలి వచ్చుటకు, జ్ఞాని మ[illegible]
రాకుండుటకును హేతువెద్దియో వచింపుడని కోరెను అపుడు తం[illegible]
యగు ఆరుణి యిట్లు చెప్పదొడగెను

'పురుషం సోమ్యోత హస్తగృహీతమానయ న్త్యపహా[illegible]
యమకార్షీత్పరశుమస్మై తపతేతి స యది తస్య కర్తా భవతి [illegible]
ఏవాऽనృతమాత్మానం కురుతే సోऽనృతాభిసన్ధోऽనృతేనాత్మా[illegible]
మన్తర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స దహ్యతేऽథ హన్యతే[illegible]
యది తస్యాకర్తా భవతి తత ఏవ సత్యమాత్మానం కురుతే స సత్యా[illegible]
భిసన్ధః సత్యేనాత్మానమన్తర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స [illegible]
దహ్యతేऽథ ముచ్యతే స యథా తత్ర నాదాహ్యేతైతదాత్మ్యమిదం
సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి తద్ధాస్య [illegible]
జ్ఞావితి విజజ్ఞావితి'.

తా॥ సౌమ్యుడవగు నో శ్వేతకేతూ! ఒకానొకనిని రాజభటు[illegible]
చేతులఁగట్టివైచి తీసుకొనివచ్చిరి. న్యాయాధీశులు 'ఈతడేమి [illegible]
నన, దొంగిలించినాడని' వారు చెప్పిరి. అపుడు వారు ఇనుపగొ[illegible]
కాల్చి [illegible] దొంగిలించియున్నచో యాతడు దాని[illegible]

దహింపబడును! అనిరి. ఈతడు నిర్దోషియైనచో, దానిని గ్రహించుటచే తన సత్యమును వెల్లడింపగల్గును. అనగా, సత్యాత్ముడైనచో దానిచే దహింపక యుండును. అపుడాతడు విడువబడును. కాని దోషియైనను, తన దోషమును కప్పిజూచినచో ఆ కాలిన యినుపగొడ్డలిని స్పృశింపగనే దహింపబడి మరణించును. ఇవ్విధమున సత్యాభిసంధుడగువాడు, తన సత్యత్వకారణమున యెట్లు దహింపబడక యుండునో, అట్లే దేహపతనసమయమున, సద్బ్రహ్మరూపమగు సత్యమున నిష్ఠగలవారియొక్కయు, అజ్ఞానులయొక్కయు స్థితియందు సమానత్వమున్నను, అజ్ఞానిజనుల జన్మపరంపరలఁ బొందును. జ్ఞాని అట్లు పొందకుండును. ఏ ఆత్మయందు స్థితిగల్గిన మోక్షమున్ను, స్థితిగలుగకున్న బంధమున్ను సంభవమగుచున్నవో, ఏది సమస్త జగత్తునకు మూలభూతమో, సర్వజీవులు దేనినాశ్రయించుకొని, దేనియందు ప్రతిష్ఠితులై యున్నారో, ప్రపంచమంతయు యెద్దాని స్వరూపమై యున్నదో, ఏది జనన మరణములు లేనిదో, మఱియు అభయమును, శివమును, అద్వితీయమునగునో, అదియే సత్యము. ఓ శ్వేతకేతూ! అదియే నీయాత్మ. కాన నీవదియే అయియున్నావు. — అని యిట్లు బోధింప నంత శ్వేతకేతువు 'ఇపుడు నాకు తెలిసినదని' వచించెను.

ఇవ్విధమున ఆరుణి తన కుమారుడగు శ్వేతకేతువునకు తొమ్మిది పర్యాయములు తత్త్వమసి మహావాక్యమును భిన్నభిన్న దృష్టాంతములతో బోధించి వానిని ప్రబుద్ధుని జేసెను.

---

# వివేకానంద లేఖావళి.

(అనువాదకులు:— శ్రీ తత్త్వానంద స్వాములవారు)

శ్రీశ్రీశ్రీ మైసూరు మహారాజావారి సన్నిధికి:—

మహారాజా:—

శ్రీమన్నారాయణుడు మిమ్మును మీరాజ్యమును ఆశీర్వదించుగాక! దయాళురగు మీతోడ్పాటుతో నేనీదేశమునకు వచ్చుట సాధ్యమైనది. అప్పటినుండియు నేను ప్రఖ్యాతుడనైతిని; ఆదరణశీలురగు ఈదేశప్రజలు నా[illegible]లన్నియు తీర్చుచున్నారు. ఇది ఒక అద్భు

తమగు దేశము. అనేక రీతులలో వీరిజాతి విచిత్రమయినది. ఈదేశ
ప్రజలంతగా మరేజాతివారలును తమ నిత్యకృత్యములందు విశే
ముగా యంత్రసంపుటిని వాడుటలేదు. సర్వమును యంత్రమయమే.
అయినను వీరు ప్రపంచపు జనసంఖ్యలో ఇరువదియవవంతు మాత్రమే,
అట్లయ్యును ప్రపంచసంపద యంతటిలో పూర్తిగా అరవవంతు వీరిది.
వీరి ఐశ్వర్యమునకు, వీరిభోగములకు మితియనునది లేదు. కాని ఇచ్చట
ఏదిచూచినను ప్రియమే. ఇక్కడ పనిపాటుల వారు పుచ్చుకొనుకూలి
ప్రపంచములోనికెల్ల హెచ్చు. అయిననేమి ? పారిశ్రామికులకును
పెట్టుబడిపెట్టు సాహుకారులకును నిరంతరముపోరే.

ఆమెరికాలోవలె మరెచ్చోటను స్త్రీల కిన్ని సౌకర్యము
పుడమిని గానము. వీరు నెమ్మదినెమ్మదిగా సమస్తమును తమహస్త
తము చేసికొనుచున్నారు. పరిజ్ఞాతలగు నారీరత్నములసంఖ్య పరిజ్ఞాత
లగు పురుషుల సంఖ్యకంటె చాల నెక్కువగా నుండుటయు విచిత్ర
ము. కాని ఉత్తమతర విజ్ఞానరాశి మాత్రము పురుషవరులయందే గోచ
రించుచున్నది. మన కులవ్యవస్థను పాశ్చాత్యులెంతగా విమర్శించు
వారైనను వీరిలో నంతకన్న అధ్వానమగు విభేదముగలదు. ఇది ధన
మునకు సంబంధించియున్నది. అమెరికనులు చెప్పుకొను తెలుగున సర్వ
శక్తి సంపన్నమగు డాలరు (=దుడ్డు) ఇక్కడ ఏమేని చేయగలదు!

* * *

భూలోకమున ఏదేశమునందును ఇన్ని రాజశాసనములు లేవు.
మఱల ఏదేశమునందును వాసి నింతగా ఉపేక్షించుటయు గానము.
మొత్తముమీద పేదలగు హిందూప్రజలు ఏ పాశ్చాత్యప్రజలకంటె
నైనను ఎక్కువ నీతిమంతులని చెప్పనగును. మతవిషయములో వీరు
వేషధారులుగనైనను నుందురు. లేదా మూఢావేశపరులుగనైనను
నుందురు. విచారశీలురగు పురుషులు తమ విమూఢమతవిశ్వాసము
లతో విసుగుజెందినవారై నూతన ప్రబోధముకొఱకై భారతభూమిని
గుఱించి ఆశలు పెట్టుకొనుచున్నారు. నవీన శాస్త్రములు కొట్టుదెబ్బ
లకు తాళుకొని చెక్కుచెదఱక నిలుచు పవిత్రవేదముల యొక్క గంభీ
భావములలో [illegible] వీరు ఆత్మాతురతతో ఎట్లు స్వీక

బింపనున్నారో, మహారాజా! మీరు స్వయముగ చూడక గ్రహింప జాలరు. శూన్యమునుండి పుట్టుకొనివచ్చెనను జగత్తును గుఱించినట్టియు, సృష్టియయ్యెనను ఆత్మను గుఱించినట్టియు పరలోకమనెడు నొకానొక స్థలమున సింహాసనము నధిష్ఠించి కూర్చుండునను దేవునిగుఱించినట్టియు, శాశ్వత నరకాగ్నుల గుఱించినట్టియు సిద్ధాంతములయెడ విద్యావంతు లందఱికిని రోతపుట్టిపోయినది. అఖండసృష్టిని గుఱించియు, ఆత్మను గుఱించియు మన జీవాత్మయందు అంతర్యామియై పలుగు బ్రహ్మ మును గుఱించియు మన వేదములు తెలుపు దివ్య బోధామృత మును ఏదోయొక రూపమున వీరు అత్యాతురతతో గ్రోలుచున్నారు. సనాతనమై వెలయు ఆత్మయందును, సృష్టియందును, మఱియు మన పవిత్రవేదములలో ప్రతిపాదింపబడినట్లుగా, అత్యున్నతమును, అఖం డము నగు బ్రహ్మమునందును, ఏబదివత్సరములలోపుగ లోకమందలి విద్యాధికులెల్లఱకును విశ్వాసము కుదురగలదు. ఇప్పుడు సయితము వీరి మతాచార్యులలో మనీషావంతులగువారు ఆరీతిగనే తమ బైబి లునకు వ్యాఖ్యానము చేయుచున్నారు. నాసిద్ధారణ ఏమన, హెచ్చుగ ఆధ్యాత్మపరాయణమగు నాగరికము వీరికిని, హెచ్చుగ ఐహికమగు నాగరికము మనకును కావలసియున్నది.

భారతదేశముయొక్క అనర్థము లన్నిటికిని పేదల దురవస్థయే మూలము. పాశ్చాత్యభూములందు పేదలనగా కేవల రాక్షసులన్న మాట. వీరితో పోల్చుచో మనదరిద్రులు దేవతలే యనదగును. కాబట్టి మనదరిద్రుల నుద్ధరించుట చాల సులభతర కార్యము. మన నిమ్న జాతులయెడ మనము కావింపవలసిన సేవ వారికి విద్యగఱపుటే; అన గా వారు కోల్పోయిన వ్యక్తిత్వమును పునరుద్ధరించుటయే. మన ప్రజ లకు ప్రభుగణమునకు మధ్య జరుగదగిన మహోద్యమము ఇదియే. ఈ సందర్భమున ఇంతవఱకు ఏమి పనియు జరిగియుండలేదు. అనేక శతాబ్ద ములనుండి పురోహితుల అధికారమును పరదేశ ప్రభుత్వమును వారిని అణగద్రొక్కి యుంచెను. మన భారతదేశములోని దీనజనులు తుదకు తాము మానవజీవులమనుమాటనే మఱచి పోయినారు. వారికి ఉచిత భావముల గఱపుట యత్యవసరము; చుట్టును ప్రపంచమున ఏమి జరుగు

చున్నదో వారికండ్లకు చూపవలయును. పిమ్మట వారు తమ ము
తామే చేకూర్చుకొందురు. ప్రతిజాతియు ప్రతిపురుషుడును ప్రతిస్త్రీయు
తనముక్తిని తానే సాధించుకోవలసియున్నది. వారికి భావముల నం
యుడు. వారికి కావలసిన సాహాయ్యము అదియే. ఆపిమ్మటదాని ప్రతిఫల
ముగ తక్కినపని జరుగగలదు. రసాయనిక ద్రవ్యముల కూర్చి పెట్టిన వా
ను; అవి స్ఫటికములుగ నేర్పడుట ప్రకృతిశాసనము ననుసరించి తన
నదియే జరుగును. వారి తలలోనికి ఉచితభావములను చొనుపుట మ
పని; తక్కినది వారే చేసికొందురు. భారత దేశమున జరుగవలసిన
అది. ఈసంకల్పము చాలకాలమునుండి నామనస్సులో నున్నది.
భారతదేశములో దీనిని నిర్వహింపజాలనైతిని. మఱియు ఆ కారణము
చేతనే నే నీదేశమునకు వచ్చినదియు. పేదలకు విద్యగరపుటలో
ప్రతిబంధక మున్నది. పల్లెపల్లెయందును మీరే ఉచితపాఠశాలల
సంస్థాపించెద రనుకొనుడు ; అప్పుడు నయితము ప్రయోజనముండదు.
ఏలయన భారతదేశపు దారిద్ర్యము మహాఘోరముగనున్నది. అచ్చటి
పేదవారి బిడ్డలు ఆ పాఠశాలలకు వచ్చుటకంటె పొలాలలోనికి తమ
తండ్రులకు సాయపడుటకో లేక మఱేవిధముగనైనను జీవనోపాధి
సంపాదించుకొనుటకో వాంఛింతురు. ఇదెట్లున్నదనగా, మహమ్మదు
పర్వత ముచెంతకు పోవుటలేదు. కాన పర్వతమే మహమ్మదుకడకు
పోవలయు ననునటులున్నది. పేద పిల్లడు బడికిరాడుగాన బడియే పే
పిల్లని కడకు పోవలసి యున్నది. మతబోధచేయుచు పల్లెపల్లెలను తి
గాడుటకు త్యాగశీలురై దీక్షతో పనిచేయగల సన్న్యాసులు మనదే
మున వేలకొలదిగ నున్నారు. వారిలో కొలదిపాటి సన్న్యాసులను
సంఘముగా కూర్చి ఉపాధ్యాయులును కూడ తయారుచేసిన యెడల
వారలు అన్నిచోటులకును, గడపగడపకును పోయి ఉపదేశము
గావించుటయేగాక పాఠమును నయితము నేర్పుచుండ గలరు.
సాయంసమయమున అట్టి వారిలో నిరువురు ఒక బొమ్మల లాంతరును
భూస్వరూపమును దెలుపు ఒక గోళమును, కొన్ని క్షేత్ర పఠములను
తీసికొని వెళ్లుదురనుకొనుడు. వారచ్చటి నిరక్షరాస్యులకు ఖగోళ
శాస్త్ర విషయములను, భూగోళవిషయములను ఎన్నింటినో నేర్పగల

గుదురు. బ్రతికియున్నంత కాలము పుస్తకములను చదివియు, నేర్చు కొనజాలనంత విజ్ఞానమును, ఆపేదవారికి శ్రవణము ద్వారా వీరు ప్రసాదింపగల్గుదురు. ఇందుకై ఒక సంస్థను నిర్మాణము చేయుట అవసరము. అందుకు ధనము నవసరమగును. ఈ ఉద్యమమును చేపట్టి సాగింపగల పురుషులు భారతదేశములో అనేకులు గలరు. కాని కటకటా! వారికి డబ్బులేదు. ఉన్న కష్టమంతయు రథచక్రమును కదిలించుటలోనే యున్నది. ఒక్కసారి దానిని త్రిప్పివిడిచితిమా అది క్రమక్రమముగా హెచ్చువేగముతో సాగి పోగలదు. మనదేశములో సాహాయ్యమునకై వెదకి వెదకి ధనికుల సానుభూతిని సంపాదింపజాలక, మీతోడ్పాటుతో ఈదేశమునకు వచ్చియున్నాను. ఈ అమెరికావారు భారతదేశములోని నిరుపేదల చావుబ్రతుకులం గూర్చి ఇసుమంతయు విచారింపరు. సరే, మనదేశీయులే తమస్వార్థములలో మునిగి ఏమియు విచారింపక యుండగా ఆగొడవ వీరెందుకు పెట్టుకోవలె?

ఉదారశీలా! ప్రభూ! ఈజీవితము అల్పము! లౌకికాడంబరములు క్షణభంగురములు. పరోపకారపరులై జీంచువారే జీవించువారు; తదితరులు బ్రతికియున్నను చచ్చినవారిలో లెక్కయే. తేజస్వియు ఉదారచేతస్కుడును అగు శ్రీవారింబోలు భారతరాజన్యుడు, భారతజననిని ఉద్ధరించి, ఆమె తన పాదములపైని తాను నిలుచునటుల చేయుటలో చాలవఱకు కృతకృత్యుడు కాగలడు. మఱియు రానున్నతరములవారు చేతులుమోడ్చి పూజలర్పింపగల కీర్తిని నెలకొలుప గలడు. అజ్ఞానములో మునింగి భారతప్రజాకోటి అనుభవించు దుఃఖమును చూచి కృపామతులగు మీ హృదయము కఱుగునటుల చేయుగాకయని పరమేశ్వరునికి ప్రార్థనలర్పించు,

వి వే కా నం ద.

# శ్రీ పరబ్రహ్మోపాసన !!

# త్రయోదశమార్గములు.

(గతసంచిక 232 పుట శేషము.)

క॥ హరిచరణములకు ప్రియవై హరినిను
మన్నింప భద్రమందెదు తులసీ
హరినీదెసరాఁడుగదా హరిచొప్పెఱిఁగించి
శుభములందింపఁగదే. 1017

తే॥ పొగడఁదగు వానిఁగానరే పొగడలార
యీడెఱుంగని విభుఁజూపు డీడెలార
మొల్లమగు కీర్తివాఁడేఁడి మొల్లలార
శుకనిగడితుని జెపుఁడుకింశుకములార. 1018

క॥ కిటివైకోఁగిటఁ జేర్చెను
వటుఁడైవర్థిల్లికొలిచె వడిఁగృష్ణుండై,
యిటపద చిహ్నములిడెఁగ్రిం
దటిబామున నేమి నోఁచితమ్మధరిత్రీ. 1020

(ఈశ్వరత్వమును తనయందారోపించుకొనుట) (ఉన్మాదావస్థ)

వ॥ అనుచు మదనోన్మాదచిత్తలై తదాత్మకత్వంబునఁ గృష్ణు లీల ననుకరించుచు, 1021

సీ॥ పూతనవై యొక్కపొలతి చరింపంగ
శౌరివై యొక కాంతచన్నుగుడుచు
బాలుఁడై యొక భామపాలకు నేడ్చుచో
బండినేనను లేమఁ బాఱఁదన్ను
సుడిగాలినని యొక సుందరిగొనిపోవ
హరిననివర్తించు నబ్జముఖియు
బకుడనేనని యొక్కపడఁతి సంరంభింపఁ
బద్మాక్షుఁడను కొమ్మపరిభవించు

ఆ॥ నెలమిరామకృష్ణులింతు లిద్దఱుగాఁగ
గోపవత్సగణము గొందఱగుదు
రసురవైరిననుచు నబలయొక్క తెచీరఁ
బసుల మనెడిసతుల భరతముఖ్య. 1022

ఆ॥ లోకమెల్లఁగుక్షిలోపలనున్నది
మాధవుండనేను మాతవీవు
చూడుమనుచునొక్క సుందరియొకతెకు
ముఖముఁదెఱచి చూపుముఖ్యచరిత. 1023

క॥ వెన్నలు దొంగిలితినియెడి
వెన్నుఁడనని యొకతెనుడువ వేఱొక్క తెచే
సన్నల యశోదనంచును
గ్రన్ననకుసుమములదండఁగట్టునిలేశా. 1024

క॥ కాళియఫణి యిదిపీరలు
కాళియఫణిసతులుమొ్రొక్కఁగడఁగిరినేగో
పాలకుమారుఁడ ననుచును
లీలాగతినాడు నొక్క లేమ నరేంద్రా. 1025

క॥ తరుణులుగోపకులందఱు
హరి హాయ్యఁడిదెవానగురిసె హరినేననిభా
సురచేలాంచలమొక్క తె
గిరినెత్తెదనుచు నెత్తుఁ గొంగేలనృపా. 1026

క॥ మీరలుగోపకులేనసు
దారినిదావాగ్నివచ్చెనటుసూడకుఁడీ
వారించెదనని యొక్క తె
సేరిబయలొకబళనంబు సేయు నరేంద్రా. 1027

వ॥ ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరులతాదుల హరినడుగుచు దుర్గమంబులయిన విపినమార్గంబుల సరోజాతకేతనహాల కులిశకలశాంకుశాది శుభలక్షణ లక్షితంబులయి మనోహరంబులయిన హరిచరణంబుల చొప్పుఁగని తప్పక చెప్పికొనుచుఁ దమలో నిట్లనిరి. 1028

(ఈశ్వరతత్వమును గుర్తించుట)

సీ॥ కొమ్మకుఁబువ్వులు గోసినాఁడికఁ గూడ
మొనసిపాదాగ్రంబు మోపినాఁడు
సతినెత్తికొని వేడ్కఁ జరిగినాఁడికఁ గూడ
దృణములో లేదిదె తెలియనజాడ
ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాఁడికఁ గూడఁ
గూర్చున్న చొప్పిదె కొమరుమిగులు
నింతకిఁ గొమ్మాలి యిచ్చినాఁడికఁ గూడ
వెలదినిక్కినగతి విశదమయ్యె. 1028

ఆ॥ సుదతితోడనీరు సొచ్చినాఁడికఁ గూడఁ
జొచ్చితా వెడలిన చోటులమరె
దరుణిగాముకేళిఁ దనిపినాఁడికఁ గూడ
ననఁగిపెనఁగి యున్న యందమొప్పె. 1029

సీ॥ ఈ చరణంబులే యిందునిభానన,
సనకాదిముని యోగ సరణినొప్పు
నీపాదతలములే మెలనాగశ్రుతి
వధూసీమంత వీథుల చెన్నుమిగులు
నీపదాబ్జంబులే యిభకులోత్తమయాన
పాలేటిరాచూలి పట్టుఁగొమ్మ
లీసుందరాంఘ్రులే యిందీవరేక్షణ
ముక్తికాంతామనో మోహనంబు.

ఆ॥ లీయడుగులరజమె యింతిబ్రహ్మేశాది
దివిజవరులుమౌళి దిశలఁదాల్తు
రనుచుకొంద ఱబలలబ్జాక్షుఁ డేఁగిన
క్రమముఁగనియు నతనిగానరైరి. 1032

మ॥ అని యిబ్బంగిలతాంగు లందఱునుబృందారణ్యమందీశ్వరుఁ
వనజాక్షుంబరికించి కానక విభునర్ణించుచుం బాడుచుఁ
మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు నమ్మానాథుపైఁ జేర్చివే
చనిరయ్యామునసైకతాగ్రమునకుఁ సంత్యక్త గేహేచ్ఛలై. 1037

(సశేషము.)

# జీవితలక్ష్యము.

(గ్రంథకర్తలు - శ్రీ మతకుమల్లి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు
శ్రీ రామకృష్ణ వివేకానంద సందేశ ప్రచారకులు)

ప్రకాశకులు — శ్రీ. ఈదర వెంకట్రావుపంతులుగారు; ప్రొప్రైటర్;
(వేంకట్రామా అండుకో, హెడ్ ఆఫీసు, ఏలూరు.)

(గతసంచిక 240-వ పుట శేషము.)

---

అప్పుడు జన్మించిన బల్లిపిల్లకే విశ్వనియంత ఆహారము సమకూర్చియుండ, పది వత్సరములు వచ్చినను నా కుమారుని పోషణ కాటంకము గలుగునని నేను సన్యసించలేకపోతిని గదా! యెంత వెఱ్ఱితనము!! నిర్హేతుకజాయమాన కరుణాస్వరూపుడగు భగవంతుడు పిపీలికాది బ్రహ్మపర్యంతము ఆహార మేర్పరచియుండ, కర్తృత్వము వహించుట యెంత బుద్ధిలోపము" అని విలపించి సన్యసించి, కృతార్థుడైనాడట. మహాశయా! విశ్వమునకు పోషణకర్తయగు పరాత్పరుని లీల లత్యద్భుతములు గదా! పరమేశ్వరు డొకప్పు డర్ధరాత్రివఱకు ఇంటికి రాకపోగా, యింత యాలస్యమునకు కారణ మేమని పార్వతి పరమేశ్వరుని ప్రశ్నించినదట. విశ్వపోషణ కార్యములో నిమగ్నుడనై రాజాలకపోతినని పరమేశ్వరుడు ప్రత్యుత్తర మిచ్చినాడట. ఈ చీమకాహార మిడితివా యని, యెనిమిది పెట్టెలలో దాచియున్న చీమను చూపగా, దాని ముక్కున నొక బియ్యపు గింజ ఉండుట చూచి, పార్వతి ఆశ్చర్యచకితురాలై, నాథుని మహిమను కొనియాడినదట; విశ్వనియంత యగు పరాత్పరుడు ప్రతి అణువునందు నిండి, నిబిడీకృతమై విరాజిల్లుచుండ, అజ్ఞానావరణలచే బాధితుడైన మానవుడు భగవన్మహిమను గాంచలేక, ఆత్మసాక్షాత్కారము చేయలేక, ఖిన్నుడై, దేహముచే నరికట్టబడి, మీరు మేమను మతిభ్రమలపాలై ఇల్లను చీకటి నూతియందు కూపస్థమండూకమువలె అహంమమలచే పీడింపబడుచున్నాడు. ఇంతకన్న దుర్గతి [illegible]!

శ్రీధరుడు సన్యాసియై కృతార్థుడైనాడని చెప్పియుంటిమి గదా! సన్యాసులు సామాన్యముగ కాషాయ వస్త్రమును ధరింతురు; యది నిప్పురంగును బోలియుండును. ఇది జ్ఞాన చిహ్నము; యీ జ్ఞానముచే అహంమమల నశింపజేసుకొని ఆత్మసాక్షాత్కారము పొంది విశ్వమెల్ల సాక్షాత్కరించి, విశ్వాత్మలో లీనమై, రమించుటయే యథార్థమైన సన్యాసియొక్క స్థితి. అట్టి సన్యాసులు భారత దేశము యొక్క అధ్యాత్మిక సంపద. ఎంతవఱకిట్టి సన్యాసులు భారతదేశమున విలసిల్లిరో, అంతవఱకు భారతదేశము ఆత్మ సామ్రాజ్యమున కాధిపత్యము వహించినది. శ్రీ మత్పరమహంస పరివ్రాజక శ్రీమత్ శంకరాచార్యులవారు యీ జ్ఞానమును తనయందు మూర్తీభవింప జేసి, ప్రస్థానత్రయముపై భాష్యములు రచించి, ఆత్మవిద్యను పునరుద్ధరించి ఆత్మానందములో భౌతిక దేహమును వీడె. తిరిగి 1893 సంవత్సరమున చికాగో నగరమున జరిగిన మహామత సభయందు వేదాంత కేసరి మరల వివేకానందునిద్వారా గర్జించినది. వెంటనే అరి షడ్వర్గములు పటాపంచలైనవి; అజ్ఞానాంధకారము నశించి, జ్ఞాన భాస్కరుడు ప్రత్యక్షమైనట్లగుపడినది. ఆనాటి మహాసభయొక్క పీఠకపై వివేకానందు డధిష్ఠింప ఒక జ్వాలవలె (a huge column of fire) ఆతడు ప్రకాశించినాడట. అట్టి యాత్మప్రతిభ చూచుటకు యీ భౌతిక చక్షువులు చాలవు. ఆత్మచక్షువుచేతనే ఆత్మను సాక్షాత్కరించవలె ఆత్మచేతనే ఆత్మానంద మనుభవింప జేయవలె. అంతేకాని నిన్న మొన్నజరిగిన కుంభమేలమువద్ద పోగైన ఒకలక్ష యిరవైవేల సన్యాసులచేగాదు భారతదేశోద్ధారణ కాబడునది. యథార్థములో వీరలలో నూరుమందివైన శంకరునిప్రతిభ తమయందు జూపగల్గినచో భారతదేశము జ్ఞానభక్తి వైరాగ్యముల కొల్లోపోయి యిట్లు కృంగి కృశించదు.

జనకచక్రవర్తి సామ్రాజ్యాధిపత్యమూని మహాజ్ఞాని కొఱకు వేచియున్నాడట, తుదకు ఒక మహాసభ నేర్పాటుచేసి, అందొక పీఠ ముంచి "మహాజ్ఞాని" యెవరైననున్నచో ఆపీఠము నధిష్ఠింప వలసినదిగా మహనీయులందరకు లేఖల నంపినాడట. బృహదారణ్యకోపనిషత్తు

నందు ప్రకాశించుచున్న యాజ్ఞ్యవల్క్య ఋషి ఆపీఠము నధిష్ఠించి ప్రతి వాదుల నందర నోడించి జనకునికి జ్ఞానభిక్ష పెట్టి, భౌతిక సామ్రాజ్యాధి పత్యముతో పాటు అధ్యాత్మిక సామ్రాజ్యాధిపత్యమునుగూడ జనకునిచే వహింప జేసినాడట. మరియు శ్రీరామచంద్రుడు రాజ్యాధిపత్యము వహించుటకు ముందుగ, నానాదేశముల కేగివచ్చి, నిస్సారుడై, నిస్పృహుడై, భౌతికసంపద వీడి అరణ్యముల కేగ నిశ్చయించినాడట. వెంటనే దశరథుడు దిగులుజెంది వసిష్ఠుని పిల్వనంపినాడట. వసిష్ఠుడు వచ్చి శ్రీరామచంద్రుని యెందుల కరణ్యముల కేగెదవని ప్రశ్నింప, పరాత్పరుని సాక్షాత్కరించుట కనగా, పరాత్పరుడు లేనిచోటెక్కడ? అంతయు నిండి నిబిడీకృతమైన పరాత్పరుని అరణ్యమధ్యముల వెదుక బోయెదవా?" అని ప్రశ్నింప శ్రీరాముడు మాట్లాడక నిశ్చేష్టితుడై నిలబడినాడట. అప్పుడు 32 వేలశ్లోకములుగల "వాసిష్ఠ రామాయణమును" వసిష్ఠుడు శ్రీరామచంద్రుని కుపదేశించినాడట. అందలి రత్నముల చేకూర్చి కాశ్మీర దేశమున ప్రసిద్ధిగాంచిన అభినందనపండితుడు జ్ఞానవాసిష్ఠమును మానవకోటియొక్క ఉద్ధరణకై, భారతమాత కంఠమున మణికంఠహారమువలె శోభిల్లునట్లు చేసినాడు.

మఱియు రామాయణమును అధ్యాత్మికదృష్టితో తిలకించి, మానవోద్ధరణకై, అధ్యాత్మరామాయణమను గ్రంథమును విశ్వామిత్రుడు రచించినాడట. ఇందలి ప్రతి పుటయందును ఆత్మానుభవము గోచరించుచున్నది.

ఇది ఉపనిషత్సారమన్న అతిశయోక్తి కానేరదు. దీని మహిమను కొనియాడవలె నన్న, యీ చిన్న కథనాలకించుడు. వసిష్ఠుడు నూర్గురు కుమారుల కోల్పోయి, హిమాలయ పర్వతములలో వసిష్ఠాశ్రమమున సాయంసంధ్యా సమయమందు, చంద్రుడు తూర్పు దిక్కున పొడసూపుచుండ, తన శత్రువుచే రచింపబడిన అధ్యాత్మ రామాయణమును తాటియాకుల కట్ట నొకదానిని చదువుచు ఆనందించుచున్నాడట. అప్పుడు వసిష్ఠ మహామునియొక్క సతీతిలకమగు నరుంధతీదేవి, నాథుడు విచారగ్రస్తుడైనటుల భావించి ఆతని సంతసింప జేయుట [illegible] "నాథా! [illegible] పూర్ణిమనాడు చంద్ర

బింబమెంత విలక్షణముగ ప్రకాశించుచున్నదో చూడుము?" అందు లకు వసిష్ఠుడు తలయెత్తక, "ఆ భౌతిక చంద్రబింబపు శోభకు శతాంశ ములతో ప్రకాశించు విశ్వామిత్రుని బుద్ధిబలముచే రచింపబడిన యీగ్రంథము నాకు యెక్కుడు సంతసమునే చేకూర్చుచున్నది." అహా! యేమి ఆశ్చర్యము! ఆత్మజ్ఞానము పొందినవారికి భౌతికసంపద యందపేక్షజనించునా? అట్టి ఆత్మసంపదచే విరాజిల్లు అధ్యాత్మ రామాయణము హిందూదేశముయొక్క యథార్థమైన సంపద. ఏసు క్రీస్తు ఆత్మజ్ఞానమునకై నిరీక్షించుచుండ సైతాన్ వాని నాకర్షించి నాడట. అప్పుడు యేసుక్రీస్తు (Get behind me, Satan, I will have none of thee) "పొమ్ము! నీ భోగభాగ్యము నాకక్కరలేదు" అని తిరస్కరించినాడట. బుద్ధభగవానుడు ఆత్మసాక్షాత్కారమునకై భౌతికసంపద వీడిపోవుచుండ, మారుండడ్డుదగిలి నీవు పోకుండినచో నారు సామ్రాజ్యములు నీకు లభింపజేయుదునని వచించినాడట. అవ న్నియు తిరస్కరించి, బుద్ధుడు బయల్వెడలి గయాక్షేత్రమునకేగి, అశోక వృక్షము క్రింద కూర్చుండి, "నాదేహము భస్మీపటలమగుగాక! నా చర్మము, నెత్తురు, యెముకలు మట్టిపాలగుగాక! అనేక వత్సరము లకు సహితము లభింపని బోధిత్వము లభించినగాని నాదేహ మిచ్చట నుండి చలింపజాలదు" అని వచించి కృతనిశ్చయుడై, ఆరువత్సరము లకు బోధిత్వము పొందినాడట; యిదియే మహనీయుల లక్షణము. ఆత్మసాక్షాత్కారమునకై భౌతిక సామ్రాజ్యమును ధారవోసిన బుద్ధ భగవానుని ఖ్యాతిని వేనోళ్లుగల ఆదిశేషుడైన కొనియాడ గలడా! శివాజీ చక్రవర్తి సామ్రాజ్యాధిపత్యమును వహించి చక్రవర్తి బిరు దాంకితుడై, రాజ్యపరిపాలన చేయుచుండ, సమర్థ రామదాసు వారింటికి వచ్చి భిక్ష పెట్టుమని కోరినాడట. సమర్థుడు మహాజ్ఞాని మహారాష్ట్ర దేశోద్ధారకులలో నగ్రగణ్యుడు. ఆసేతు హిమాచల పర్యంతము పాదచారియై పర్యటనమునల్పి, కష్టముల కోర్చి సంపాదిం చిన జ్ఞానభక్తి వైరాగ్యములు మహారాష్ట్ర దేశపు సొమ్మేకాక, హైం దవ భూమియొక్క నిజమైన ధనము. ఇమ్మహనీయుని దర్శించి కృతా ర్థుడగుట కువ్విళ్లూరుచున్న శివాజీచక్రవర్తి, సమర్థునిరాకచే, లేచ

గృహము పావనమైనదని సంతసించి, వెంటనే నొక కాకితముపై తన సామ్రాజ్యము నంతయు ధారపోసితినని వ్రాసి, కాకితము మడచి సమర్థుని భిక్షాపాత్రలో పడవైచెనట. సమర్థుడు చిరునవ్వుతో, "రాజా! ఆకటిబాధచే, భిక్షుకై మీగృహమునకు రాగా, కాగితపు ముక్కచే నా క్షుద్బాధ నివారణచేయ ప్రయత్నించిన నీకృత్య మెంత విచిత్రము. నాకు కొంచెమాహారము కావలెను; కాకితపు ముక్క గాదు" అనెనట. అంతట శివాజీ సార్వభౌముడు, "మహాశయా! నా సామ్రాజ్యమునే మీకు ధారాగృహీత మొనర్చితి. ఆకాకితము నందలి మదీయ లిఖితాక్షరముల దిలకించుడు." అని భక్తివిశ్వాసములతో వంచినాడట; సమర్థుఁడా వ్రాతనుతిలకించి, ఆశ్చర్యచకితుఁడై 'రాజా! నీత్యాగము వర్ణనాతీతము, యిప్పుడు నీవు నాఆజ్ఞకు బద్ధుడవు కావలె' ననెను. శివాజీ శిరసావహించెదనని చెప్పగా సమర్థుడు కిరీటము శివాజీ తలపైనిడి తన ప్రతినిధిగా రాజ్యము నేలుమని యాజ్ఞాపించినాడట. ఆహా! యేమి యాశ్చర్యము! ఇదికాదా యథార్థమైన జ్ఞానము. భౌతిక సామ్రాజ్యాధిపత్యము తనకు లభించినను తృణప్రాయముగా చూడ గల సమర్థుడుగదా నిజమైన సన్యాసి, జ్ఞాని; వారలే రాజులకు రాజులు; వారలే భగవత్ప్రతినిధులు. అట్టి తపోనిష్ఠాగరిష్ఠులైన మహనీయుల పాదములచెంత రాజుల మకుటములు వ్రాలుననుటలో నాశ్చర్యమేమి గలదు? అప్పుడు శివాజీ బదులుచెప్పలేక సమర్థుని యాజ్ఞ శిరసావహించి, సింహాసనమధిష్ఠించినాడట. తన సింహాసనముపై, సమర్థుని జ్ఞాన చిహ్నముగ, కాషాయ పతాకమును వ్రేలాడగట్టినాడట! ప్రజాక్షేమమునకై శక్తివంచనలేక పాటుబడుచు సమర్థుని బోధల ననుసరించి, రాజ్యపరిపాలన సల్పి, హిందూధర్మోద్ధరణకై తోడ్పడిన, శివాజీ చక్రవర్తి ఖ్యాతి వర్ణనాతీతము; సమర్థుడు శివాజీ కొసంగిన బోధయంతయు, దాసబోధయను గ్రంథమున వ్యక్తపరుపబడియున్నది. ఇట్టి రాజులు పరిపాలించుచుండ ప్రజాక్షేమమునకు గొరఁతయేమిగలదు. వీరిలోనగ్రగణ్యులగు, జనకుఁడు, రామచంద్రాదులు నేటివఱకు స్మరింపబడుచున్నారు. కనుకనే ప్లేటోపండితుడు (rulers ought to be philosophers) రాజులు తత్వవేత్తలై యుండవలెనని వర్ణించియున్నాడు.

మహాశయా! యథార్థములో, ప్లేటో వచించినట్లు, రాజులు తత్త్వవేత్తలే యగుచో ప్రజాక్షేమమున కేమి కొఱంతగలదు ? అట్టి దేశమున జ్ఞానభక్తి వైరాగ్యములు శోభిల్లి, ధన కనక రాసులకు నిలయమై యుండగలదు. అట్టిదేశమే ప్రాచీన భారతవర్షము. పాడి పంటలకు నిలయమై, జ్ఞానమునకు జన్మస్థానమై ఆధ్యాత్మిక దృష్టితో విశ్వమును వీక్షించిన ప్రాచీన భారతవర్షము, సోదరత్వమును పెంపొందించుకొని సర్వసాభ్రాతృత్వమును మానవలోకమునకు చాటినది. ఏనాడు జ్ఞానభక్తి వైరాగ్యములను భారతదేశము కోల్పోయినదో, ఆనాడే మన నైకమత్యము తొలగినది. ఆనాడే జ్ఞానభక్తి వైరాగ్యములకు మారు కామ క్రోధములు పెంపొంది, అరిషడ్వర్గమునకు దాసులై, మహాపవిత్రమైన భారతభూమిని శ్మశానవాటికగా మార్చివైచినారు; అదియే దుర్గతి; అట్టి యధోగతి యేనాడు భారతదేశమునకు ప్రాప్తించినదో ఆనాడే భారతీయులు భగవన్మహిమను మఱచినారు.

మన వాఙ్మయమంతయు నాధ్యాత్మికదృష్టితో వ్రాయబడినది; మన ఆదర్శము ముక్తి; మన విద్య ఆత్మవిద్య ; మన లక్ష్యము ఆత్మానందము ; మన గమ్యస్థానము సృష్టిస్థితిలయములకు హేతుభూతుడైన భగవానుడు. మహాశయా ! ఉత్తమ కావ్యమై పురాణ పురుషుని చారిత్రమై మధురాక్షరములచే సంపుటిచేయబడి, లవకుశులచే గానము చేయబడి, వాల్మీకిచే రచింపబడిన రామాయణమును స్మరింపుడు. ఇది యథార్థముగ ఆత్మవిద్యను బోధించు వేదాంతశాస్త్రమే ; ఇది విశ్వగానమే; యీ మహాగ్రంథము బంధమోక్షములనే ప్రతి పుటయందును చూపుచున్నది. జీవుని యొక్క పతితదశ, తదుపరి జీవుడు భగవత్ప్రాప్తినొందు విధము రామాయణమునందు గలదు. శ్రీరామచంద్రుడు పరాత్పరుడు; ఆత్మారాముడు. సీత జీవుడు. ద్వైత దృష్టితో చూచిన సీతయను జీవుడు రామసాన్నిధ్యమున నున్నంతవఱకు బాధ లేదు'. పంచవటిలో రాము డడవికేగ, సీతయను జీవుడు మాయలేడి యొక్క భ్రమలకుఁ జిక్కినప్పుడు లంకయను దేహము ప్రాప్తించినది. ఈ దేహపురము అరిషడ్వర్గముచే పరిపాలింపబడుచున్నది. రావణుడు వాసనాత్మికబుద్ధి ; విభీషణుడు వ్యవసాయాత్మిక బుద్ధి. దేహము

ప్రాప్తించినప్పుడు జీవుడు సుఖదుఃఖముల పాలై విలపించినట్లే సీత లంకలో విలపించినది; జీవుడు భక్తిచిత్తముతో భగవంతుని సాక్షాత్కరించి ధన్యుడగుచున్నాడు; హనుమంతుఁడు భక్తియే స్వరూపముగ దాల్చినవాడు. హనుమంతునిఁ జూచి సీత ఉంగరమును గ్రహించి, హృదయపద్మమునఁ దాల్చినది. తదుపరి జరిగిన మహాసంగ్రామమంతయు దేహాత్మలకు మధ్య సంగ్రామమే. అందలి అరిషడ్వర్గము నశింపబడి, ఆత్మవిజయము స్థాపితమైనది. సీతయను జీవుడు ఆత్మారాముని పొంది, ఆనందముఁ బొందినాడు. ఇంతవఱకు విశిష్టాద్వైతపరము. ఇక సీత భూమిలో నంతర్ధానమగుట జీవ బ్రహ్మైక్యానుసంధానము; అదియే అద్వైతసిద్ధి. అట్టి అద్వైతసిద్ధిని, అట్టి ఆత్మతత్వమును, అట్టి అనుభూతిప్రకాశికను, బోధించిన రామాయణము ఉత్తమ వేదాంతగ్రంథ మనుటలో నాశ్చర్యమేమి గలదు ?

మహాశయా ! మన లౌకిక విద్యగూడ ఓంకారముతో ప్రారంభమగుచున్నది. ఓంకారనినాదమే విశ్వగానము; యీ ఓంకార నినాదమే హృదయకుహరము నుండి వెలువడు హంసనినాదము. షట్చక్రములలో మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక చక్రములు దాటినప్పుడే హంసనినాదము వినబడగలదు. ఈ మూడు చక్రములలో జీవుని కాత్మదృష్టి లేదు. వీనియందు జీవుడు కామక్రోధములచే ప్రేరేపింపబడును. ఈ మూడు చక్రములు దాటినప్పుడు హంసకూర్ధ్వగతి ప్రాప్తించును. అనాహత, విశుద్ధ, ఆగ్నేయములయందు జీవుడు ఊర్ధ్వగమనము పొందుచున్నాడు. జ్ఞాన భక్తి వైరాగ్యములు పెంపొందుచున్నవి. సహస్రారమున ఆత్మారాముని చూచుచు ఆత్మలో లీనమై, ఆత్మగా ప్రకాశించుచున్నాడు. నది ప్రవహించి మహాసాగరమున కలసి తన స్వరూపమును కోల్పోయి మహాసముద్రము వలె శోభిల్లునట్లే హంస సహస్రారమునందు బ్రహ్మలో లీనమగుచున్నది. ఇట్టి జీవబ్రహ్మైక్యానుసంధానము భారతదేశముయొక్క అమూల్యమైన ధనము. ఇట్టి ఆత్మప్రాప్తి ప్రతి మానవుని యొక్క జన్మహక్కు. ఇట్టి ఆత్మసాక్షాత్కారమే ఉపనిషత్తులయొక్క ప్రతిపాదనము కల్పించుచున్నది ఋషులయొక్క

అనుభవములే ఉపనిషత్తులు. ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతానుభవ ములతో శోభిల్లు ఉపనిషత్తులు వేదశిరస్సులు. ఆత్మను సాక్షాత్కరించి అరిషడ్వర్గమును బరిమార్చి జీవబ్రహ్మైక్యానుసంధాన మొనర్చి ఆత్మానందముచే గలిగిన ఆత్మానుభవము ననుభవించి జీవితలక్ష్యమును స్థిరపరచిన ఋషిపుంగవులకు నా ధన్యవాదములు; యీ ఉపని షత్తులయొక్క ప్రతి పుటయందు శక్తి విరాజిల్లుచున్నది. అది పశుసం బంధమైన దేహశక్తిగాదు. మానసిక శక్తిగూడ కాదు. ఆత్మశక్తి చేతనే పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రకాశించుచున్నది. ఈ ఆత్మశక్తియే చైతన్యశక్తి. ఈ శక్తియే సూర్యునియందు ప్రకా శించు తేజస్సు. చంద్రబింబమునందు కాన్పించు శోభ. పుష్ప ములు వికసించునది యీశక్తిచేతనే. ఈ శక్తియే మెఱుపులో అంత ర్భూతమైన శక్తి. ఈ శక్తియే ప్రాణమునకు ప్రాణము; యిట్టి శక్తినొందిన మానవుడు విశ్వమున ధీరుడు; భగవత్స్వరూపుడు, అట్టి ఆత్మశక్తిని పొందిన మానవుడు విశ్వమంతయు భగవన్మహిమనే తిల కించును; దేహము మాంసపుముద్ద. దేహభ్రాంతి జెందిన మానవునికి దుర్గతి. అట్టి దేహభ్రాంతి ఆత్మజ్ఞానముచేగాని నశింపదు; అట్టిదేహభ్ర భ్రాంతి అరిషడ్వర్గము నశించినగాని నశింపదు. ఇట్టి ఆత్మవిద్యనే ఉపని షత్తులు వేనోళ్ళ ఘోషించినవి. ఇట్టి తత్వశాస్త్రము విశ్వమందెచ్చటను కాన్పించదన్న అతిశయోక్తి గానేరదు. ప్రాగ్దేశమునకు హృదయ మైన హైందవదేశమునందే కాన్పించుచున్నది. పాశ్చాత్య దేశముల యందు 2500 సంవత్సరముల క్రిందట థేల్స్ (Thales) అను పండి తునిచే ప్రారంభింపబడిన తత్వజిజ్ఞాస అంతఃకరణ చతుష్టయమును నేటివఱకు దాటలేకున్నది. హెజిల్ (Hegel) పండితుడు విజ్ఞానమయ కోశమును దాటలేక పోయినాడు. వీరందఱు పంచకోశముల కతీతమై అంతఃకరణ చతుష్టయమును ప్రకాశింపజేయుచు, అంతఃకరణ కతీత మై, అవాఙ్మానసగోచరమై సమాధియందు మాత్రమే ఋషులచే అనుభవింపబడిన ఆత్మతత్వమును గ్రహింపలేకపోయినారు. అట్టి ఆత్మతత్వమును వేనోళ్ళ ఘోషించిన ఉపనిషత్తులు (Scophenour) అను జర్మన్ పండితునకు జీవితాంతమును చేకూర్చినవి; (సశేషము)

# విజ్ఞప్తి.

అనేక ప్రాంతములలోయుండు భక్తులు ఆశ్రమ పుస్తకములు తపాలు మార్గముగ తెప్పించుకొను చుందురు. వీరికి తపాలు ఖర్చు యెక్కువగుటయేగాక కొంతశ్రమగూడ గలుగుచుండును. దీనియొక్క నివారణకొరకు యీక్రింద కనుపరచిన స్థలములలో ఆశ్రమమునకు సంబంధించిన గ్రంథములు వుంచడమైనది. అచ్చట తీసుకొను వారికి అసలు వెలకు దొరకుటేగాక పుస్తకములు శుద్ధముగనుండును. వీరందరును పుస్తకముల అమ్మకమునకు యేలాటి ప్రత్యుపకారము కొరక కేవలము గురుసేవ యీశ్వరసేవయని తలచి యిట్టి కార్యమును చేయుచున్నారు. గనుక యీవిలాసమునకు సమీప గ్రామస్తులగు జనులందరు అచ్చటనే తీసుకొనవచ్చును. అయితే యీ స్థలములనుండి వి. పి. గా. గాని మరియేవిధమునగాని తపాలుద్వారాపంపుట కనుకూలముండదు. తపాలుద్వారా తెప్పించుకొనువారందరును శ్రీ వ్యాసాశ్రమమునకే వ్రాయవలెను.

1. శ్రీపరమాత్మానన్దాశ్రమమ్, పెనమలూరు, P. O. కృష్ణాజిల్లా.
2. శ్రీ ఓంకారాశ్రమం, తెనాలి, గుంటూరుజిల్లా.
3. శ్రీ సాధుస్త్రీల మఠం, వీరభద్రపురం, రాజమహేంద్రవరము.
4. కే. వెంకటాచలంనాయుడుగారు, తపోవనము, చిత్తూరు.
5. దేవతి తిమ్మరాయప్ప శెట్టిగారు, శాంతినివాసము, విశ్వేశ్వరపురం, బెంగుళూరుసిటీ.
6. శ్రీపరమ శివానందస్వామిగారు C/o పక్కి సోమనాథంగారు, మిలిటరిలైను బెంగుళూరు.
7. వంగ. గోవిందు నరసయ్యగారు, బీపాట్ట్ టెరస్, బొంబాయి.
8. మైలాపురం, రామయ్యశెట్టి & సన్సు, మహబూబ్‌నగర్, నైజాం.
9. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మంచర్లపోస్టు, అనంతపురంజిల్లా.
10. ముక్కాముల సీతయ్యగారు, యీడుపుగల్లు, P. O. కృష్ణాజిల్లా.
11. శ్రీ శివగిరి ఆశ్రమం, దిగవమాగం, అరగొండ, P. O. చిత్తూరుజిల్లా.
12. శ్రీ రామానందస్వామిగారు గాంధి నగరు బళ్లారి.
13. శేగు కృష్ణదాసుగారు, అగరం, శ్రీనివాసపురం తాలూకా, కోలార్ జిల్లా.
14. భవనాశని ఆశ్రమం, వంకరకుంట, కదిరితాలూకా.
15. K. వెంకటనారాయణగారు, వీరఘట్టాం P. O. విశాఖపట్నం జిల్లా.
16. M. S. వీరభద్రయ్య శ్రేష్ఠిగారు, శ్రీరామవిలాసం, బొరింగుపేట P. O.
17. సాధు నారాయణంగారు, శ్రీ సుబ్రహ్మణ్యస్వామిగుడి, మారేడుపల్లి,
18. చక్కా గుర్నాథంగారు, యినుపకొట్టు, గుంటూరు. సికింద్రాబాద్.
19. మేనేజరు శ్రీసీతారామ సేవాసమితి L/26. A. 1 (24) N. S. ఖరగ్ పూర్
20. తులసి. కృష్ణప్పగారు, బీరంగి కొత్తకోట, వాయల్పాడు తాలూకా.
21. S. వెంకటాచలపతిగారు, కొత్తపేట, కుప్పం P. O. చిత్తూరుజిల్లా.
22. కాక, హనుమంతుగారు. కంకటపాలెం P. O. బాపట్ల తాలూకా.

తపాలుమార్గముగ తెప్పించుకొనువారు యీ క్రిందివిలాసమునకు వ్రాసిన దొరకును.

శ్రీ వ్యాసాశ్రమం, ఏర్పేడు పోస్టు, చిత్తూరుజిల్లా.

ఓమ్.

# శ్రీ మలయాళస్వాములవారి గ్రంథములు.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీశుష్కవేదాంత తమోభాస్కరము. వెల రూ. | 1 | 4 | 0 |
| స్వబోధ సుధాకరము. | 1 | 2 | 0 |
| ఓంకారము (ప్రణవోపాసన) | 1 | 0 | 0 |
| ధర్మసేతువు | 1 | 8 | 0 |
| ఉపదేశామృతము ప్రథమభాగము. | 0 | 4 | 0 |
| ఉపదేశామృతము ద్వితీయభాగము. | 0 | 10 | 0 |
| వేంకటేశాది పూజాపంచరత్నమాల. | 0 | 6 | 0 |
| ధ్యానామృతము | 0 | 4 | 0 |
| సుప్రబోధము. | 0 | 4 | 0 |
| సాంఖ్యయోగము. | 0 | 4 | 0 |
| యథార్థభారతి చిన్నపొత్తము. | 0 | 2 | 0 |
| శ్రీభగవద్గీతమూలము. | 0 | 4 | 0 |
| ఓంకారపటము. | 0 | 2 | 0 |
| బుద్ధోపదేశము. | 0 | 1 | 0 |
| శ్రీరామనామామృతము. | 0 | 0 | 6 |
| నిత్యప్రార్థన | 0 | 0 | 6 |
| జ్ఞానామృతము. | 0 | 0 | 6 |
| శివధ్యానామృతము. | 0 | 0 | 6 |

## ఇతర గ్రంథములు.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| ధర్మపదము. | 0 | 8 | 0 |
| స్తోత్రమఞ్జరి. | 0 | 2 | 0 |
| శ్రీవేంకటేశ్వర స్తోత్ర పంచకము. | 0 | 3 | 0 |
| గృహలక్ష్మి (మోక్షమార్గము) | 0 | 2 | 0 |
| శ్రీసరస్వతీ అమ్మగారి జీవితచరిత్రము. | 0 | 2 | 0 |
| శ్రీరామస్తవము. | 0 | 0 | 6 |
| శ్రీమద్భగవద్గీత అంతరార్థము. ప్రథమోధ్యాయము. | 1 | 0 | 0 |
| ,, ద్వితీయాధ్యాయము. | 1 | 0 | 0 |
| శ్రీభగవద్గీత కాలికోబైండు ప్రతిపదటీకాతాత్పర్యసహితం | 1 | 8 | 0 |

శుద్ధబ్రహ్మ కైవల్యము 0—12—0

## శ్రీయుత సాయం వరద దాసుగారిచే రచియింపబడిన గ్రంథములు.

| | |
|---|---|
| శ్రీమలయాళ సద్గురు స్మరణామృతము | 0—4—0 |
| ఆత్మారామ తత్వామృతము. | 0—4—0 |
| రామకృష్ణ ప్రేమామృతము. | 0—1—6 |
| తులసీబృందావనము | 0—1—6 |
| సుబ్రహ్మణ్య గేయామృతము. | 0—1—0 |
| భజగోవిందము. | 0—1—0 |
| నారాయణ గేయామృతము | 0—1—0 |
| అహింసాపుష్పము | 0—1—0 |

## శ్రీ తత్వానంద స్వాములవారి గ్రంథములు.

| | |
|---|---|
| ప్రబోధ చంద్రోదయము. | 0—6—0 |
| జ్ఞానప్రియ | 0—12—0 |
| శ్రీరామకృష్ణ పరమహంస జీవితకథ | 0—10—0 |
| అనుష్ఠానవేదాంతము | 0—7—0 |
| గృహస్థాశ్రమతత్వము | 0—3—0 |
| దుఃఖనివారణోపాయము | 0—3—0 |

## శ్రీమలయాళ స్వాములవారి ఫోటోలు.

| | | |
|---|---|---|
| మొదటిరకం సైజు | 1/1 | 1—0—0 |
| రెండవరకము | 1/2 | 0—8—0 |
| మూడవరకము | 1/4 | 0—4—0 |
| ఆల్బోను బ్లాకుపటము | | 0—1—0 |

ఇచ్చట రుద్రాక్ష మాలలుకూడ దొరకును. మాల 1-కి 108 రుద్రాక్షలు కలిగియుండును.

| | |
|---|---|
| సన్నరకముమాల | 1—2—0 |
| పెద్దరకముమాల | 1—0—0 |

వలయువారు:—క్రింది విలాసమునకు వ్రాయవలయును.
మేనేజరు: శ్రీవ్యాసాశ్రమము, యేర్పేడుపోస్టు, చిత్తూరు జిల్లా.

# యథార్థభారతిని గురించిన మనవి.

1. ఈ పత్రిక మానవకోట్లలో ఐక్యజ్ఞానము, కరుణ, క్షమ, విరక్తి, శాంతి మొదలైన దైవగుణము నభివృద్ధిచేసి తద్వారా విశ్వప్రేమను గలుగచేయు నిమిత్తము స్థాపింపబడినది.

2. కేవలము భక్తుల సహాయముచే మాత్రము జరుగవలసినదేగాని మరియేయొక్క ధనసహాయము దీనికిలేదు. ఈపత్రికను ఆదరించుట దైవసేవయనియు, లోకసేవయనియు, గురుసేవయనియు తలంచి మేము, మనసా, కర్మణా, వాచా, శక్తికొలది సేవచేయువార్లము.

3. వ్యాసము వ్రాయువారు శుద్ధముగా అక్షరాలు విడివిడిగా, కాగితము వకప్రక్కమాత్రమే వ్రాయవలయును. వక్కమతమునుగాని సంఘమునుగాని దూషించెడి వ్యాసము అంగీకరింపబడదు. వ్యాసము విషయమైన కారములన్నిటికి వారే జవాబుదారులై వుండవలయును.

4. వాద ప్రతివాదములకుగాని, ప్రశ్నోత్తరములకుగాని, దీనియందు స్థలము దొరుకదు.

5. ఇంగ్లీషునెల ప్రతి తే 15 లో పత్రికె పంపబడును. ఏదైనా కారణాంతరముచే, సకాలమున పత్రిక చేరనివారలు మరునెల 15 తేదిలోపల తెలుపవలయును.

6. పత్రిక విషయమై వ్రాయునప్పుడు చందా నెంబరున్ను విలాసమున్ను విశదముగా వ్రాయవలయును. లేనిచో సమాధానమిచ్చుటకు అనుకూలముండదు. చందా నెంబరు 2237 ముద్రింపబడియుండు రిజిస్టర్ నెంబరుగాదు. మా చిరునామపై ముద్రించియుండు సన్న అక్షరము గలిగినదని జ్ఞాపకముంచవలయును.

7. చందాదారులై క్రొత్తగా ఏనెలలోచేరినను, ఆ సంవత్సర పత్రికలన్నియు వారికి పంపబడును. చేరిననెలనుండి మాత్రము యేర్పాటుచేయుటకు అనుకూలముండదు.

8. ఏదైనా కారణాంతరముచే చందాదార్లు నిలిచిపోవుటకు తలంచితేని దయయుంచి ముందుగా ఆశ్రమమునకు తెలుపకోరుదుము. అట్లుచేయక పత్రిక వి. పి. పంపినతర్వాత అవసరములేదని వాపసు చేయుట ఆశ్రమమునకు యెంతో నష్టపరచినవార్లగుదురు.

# యథార్థభారతి

సంపుటం 13. | ప్రమాది సం॥రం ఆశ్వయుజమాసం అక్టోబరు నెల 1939. | సంచిక 8.




(పత్రిక విలాసము:— శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

సర్వభూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి
యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.



Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.

Published by:— K. Venkatachalam Naidu, Chittoor.

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మూఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, యేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కఠారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాక్ చెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, అడ్డా."
5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్ పూర్

# యథార్థభారతి

సంపుటం 13
సంచిక 8
ప్రమాది సంవత్సరం
ఆశ్వయుజమాసం
1939సంగరం అక్టోబరు నెల
చందా
సంగరం రు 2-4-0
విడిపత్రిక రు 0-4-0

ఓం

## బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి.

25. యత్పూర్ణానన్దైకబోధస్య బ్రహ్మాహమస్మీతి బ్రహ్మాత్మానుభవమాత్రపర్యవసానే బుద్ధిర్నిరన్తరం భూయాత్.

తా॥ ఏది పూర్ణానందైకబోధమో ఆబ్రహ్మమే నేను అనెడి బ్రహ్మాత్మానుభవమాత్రనిశ్చయమునందు బుద్ధి యెల్లప్పుడు నుండును గాక!

26. యస్మిన్కాలే ద్వైతభానం నాస్తి నిద్రాపి నాగచ్ఛతి తస్మిన్కాలే ఉపలభ్యమానం యత్సుఖమస్తి స బ్రహ్మానన్ద ఇతి బ్రహ్మానన్దానుభవసిద్ధిర్నిరన్తరం భూయాత్.

తా॥ ఏకాలమునందు ద్వైతము గోచరించుటలేదో, నిద్రయు రాదో, ఆకాలమునందు తెలియబడునట్టి సుఖమేదికలదో, అది బ్రహ్మానందమనెడి బ్రహ్మానందానుభవసిద్ధి సర్వదా కలుగునుగాక!

## మనస్తత్త్వము.

(నివృత్తి మార్గము)
(శ్రీ మలయాళ స్వాములవారు)
(249-వ పుట శేషము).

సవివేకోఽపి కౌశల్యస్య న్యాసత్వాత్ పుణ్యప్రమతే
భాజనం భూషణాకారో భాస్కరస్తేజసామివ.

వివేకవంతుడే శాస్త్ర, జ్ఞాన, తప, శ్రవణాదుల కర్మము ప్రకాశవంతములగు పదార్థములలో సూర్యునివలె యాతడందరిలోను అగ్రగణ్యుడగును.

శమేనాసాద్యతే శ్రేయః శమోహి పరమం పదం
శమః శివః శమః శాంతిః శమో భ్రాంతినివారణమ్.

శమముచేతనే మోక్షప్రాప్తి చేకూరును. శమమే యుత్తమ పదము. శమమే శుభప్రదమైనది. శాంతికి మూలము శమమే. శమము చేతనే భ్రమతొలగును.

విచారా చారవో జీవా భాసయన్తో దిశో దశ
భాన్తి భాస్కరవన్నూనం భూయో భవ భయాపహాః.

ఉత్తమ విచారణగల్గి శోభించు జీవన్ముక్తుడు దశదిక్కులఁ బ్రకాశింపచేయుచు అనేకజీవుల సంసారభయమను యంధకారమును తొలగించుచు సూర్యునివలె నిక్కముగ వెలుగొందుచుండును.

వరం కర్దమ భేకత్వం మలకీటకతా వరమ్
వరమన్ధ గుహాహిత్వం న నరస్యావిచారతా.

బురదయందు కప్పయైయుండుట మేలు; మలమందు కృమియై యుండుట మేలు; చీకటి గుహయందు సర్పమైయుండుట మేలు; కాని మనుజునకు విచారజ్ఞానము లేకయుండుట ఉత్తమముకాదు.

వరం శరావహస్తస్య చండాలాగారవీథిషు
భిక్షార్థమటనం రామ న మౌర్ఖ్యహతజీవితమ్.

ఓరామా! చేతియందు పాత్రనుంచుకొని వీథులలో సంచరించుచు చండాలుని గృహమందు బిచ్చమెత్తుట మేలు. కాని అజ్ఞానముతో కూడియుండు జీవితముత్తమముగాదు.

యోఽస్మత్తాతస్య కూపోఽయమితి కౌపం పిబత్యపః
త్యక్త్వా గాంగం పురస్థం తం కోఽనుశాస్త్యతి రాగిణమ్.

'ఇది మా తండ్రి త్రవ్వించిన నూయి' యని తలంచి ప్రక్కనున్న పవిత్ర గంగాజలమును వదలి, అందలి మురికి నీటినే త్రావనెంచు మూర్ఖున కెవరు బోధింపగలరు?

యస్మై నేదం త్వరుచయే రోచతే దుష్కృతోదయాత్
విచారయతు యత్కించిత్సచ్ఛాస్త్రం జ్ఞానవాఙ్మయమ్.

శ్రేష్ఠమగు నౌషధముచే యారోగ్యము కలుగునట్లు, ఈ యోగవాసిష్ఠ గ్రంథ శ్రవణముచే మనుజునకు జీవన్ముక్త్యాను భవము కలుగును.

ఓముచ్చారణసంవిత్తి వేదనాచ్చ ప్రపశ్యతి
యత్కరోతి మనోరాజ్యం భవత్యాశు స తన్మయః.

ఓంకారము నుచ్చరించుచు దాని యర్థమును భావించుచు బ్రహ్మదేవుడు మనస్సుచే యెద్దానిని సంకల్పించునో, శీఘ్రముగ యా రూపమునే పొందును. అనగా, తన మనఃకల్పన ననుసరించియే పదార్థములు వ్యక్తమగుచుండుటను గాంచును.

యదార్యగర్హితం యద్వా న్యాయేన న సమార్జితమ్
తస్మాద్గ్రాసాద్వరం మన్యే మరణం దేహినామిదమ్.

పూజ్యులగు మహాత్ములచే గర్హితమును, అన్యాయోపార్జితమును నగు దానిని భుజించుటకంటె మరణించుటయే శ్రేష్ఠతరము.

గచ్ఛ కర్కటి మూఢాం స్త్వం జ్ఞానే నాశ్వవబోధయ
మూఢోత్తారణమేవేహ స్వభావో మహతామితి.

ఓ కర్కటీ ! నీవజ్ఞుల చెంతకుఁబోయి వారలకాత్మబోధ గావింపుము. ఏలయన, మూఢుల యజ్ఞానము తొలగించుటయే మహాత్ముల స్వభావమగును. (ఇట్లాకాశవాణి కర్కటియను రాక్షసినిఁగూర్చి పల్కెను.)

వివదంతే హ్యసం బుద్ధాః స్వవికల్పవిజృంభితైః
ఉపదేశాదయంవాదో జ్ఞాతే ద్వైతం న విద్యతే.

అవివేకులు తమతమ కల్పనలఁగూర్చి వాదవివాదములఁ జేయుచుందురు. ఈ భేదదృష్టియంతయు వేదాంతోపదేశమునకు పూర్వమేయగును. ఏలన, తత్త్వమెఱిగిన పిదప యిక ద్వైతస్ఫురణయే యుండదు.

అన్యేపి సావధానా యే ధీరాః సురమహర్షయః
చిత్తాత్మ్యమనుసంధానం న త్యజంతి మనాగపి.

సావధాన చిత్తులును, ధీరులునునగు యితర దేవ, మహర్షులు గూడ యుపాసనాజ్ఞానముల తమ చిత్తమునుండి తొలగింప నొల్లరు.

మనసైవ మనస్తస్మాత్పౌరుషేణపుమానిహా
స్వకమేవస్వకేనైవ యోజయేత్పావనే పథి.

కాన పురుషప్రయత్నముచే మనస్సుచేతనే మనస్సును పవిత్ర మార్గమందు నియోగించవలెను.

ప్రతిభాసస్యానుపదం ప్రాక్తనీం స్థితిముజ్ఝతి
కులాలకర్మానుపదం ఘటో మృత్పిండతామివ.

కుమ్మరివాని క్రియచే ఘటము తన పూర్వపు మృత్తికాదశను త్యజించునట్లుదృఢవాసనాప్రాబల్యముచేతను,దృఢభావనచేతను మనస్సు తనపూర్వస్థితిని, పూర్వ సంస్కారములను త్యజించును.

మహాసత్వగుణోపేతా యే ధీరాః సమదృష్టయః
అనిర్దేశ్యకలోపేతాః సాధవస్తఉదాహృతాః.

విశుద్ధ సత్వగుణముకలవారును, ధీరులును, అనగా విషయములచేగాని, దుఃఖములచేగాని చలింపనివారును,సమదృష్టిగలవారును బ్రహ్మసాక్షాత్కారము బడసి అవర్ణనీయమగు ఆనందమననుభవించువారును సాధువులనఁబడుదురు.

సాధు సంవ్యవహారార్థం శాస్త్రం యోనానువర్తతే
బహిఃకుర్వంతి తం సర్వే స చ దుఃఖే నిమజ్జతి.

సాధువుల యాచారవ్యవహారములఁదెల్పు శాస్త్రముల ననుసరించని వానిని సజ్జనులు బహిష్కరింతురు. మఱియు నాతఁడు దుఃఖమునే పొందును.

వహ్న్యౌష్ణ్యయోరివ సదా శ్లిష్టయోశ్చిత్తకర్మణోః
ద్వయోరేకతరాభావ ద్వయమేవ విలీయతే.

అగ్నియుష్ణత్వములవలె యెల్లపుడు కలసియేయుండు చిత్తకర్మల రెంటిలో యొకటి లేనిచో రెండును లేకపోవును.

జాగ్రచ్చాభిమతం వస్తు నయత్యమృత మృష్టతామ్.
అనీ హితం చ విషతాం నయత్యమృతమప్యలమ్.

వివేక ముదయించుచున్నను రాగాదుల ప్రభావముచే మనస్సు విషము (స్వాదరహితవస్తువు) నమృతముగను, అమృతమును విషము గను నొనర్చుచు నేయుండును.

అమృష్ట సర్వభావానామల మాత్మచమత్కృతిమ్
మనః స్వాభిమతాకారం రూపం సృజతి వస్తుషు.

పరిపూర్ణమగు ఆత్మసాక్షాత్కారము బడయనివాని చిత్తమే పదార్థముల నభిలషించుచు వాటిగూర్చిన కల్పనలఁ జేయుచుండును గాని పూర్ణ సాక్షాత్కారముగల తత్వజ్ఞానుల చిత్తమట్లుగాదు

స్వాయత్తమేకాంతహితం స్వేప్సితత్యాగవేదనమ్
యస్య దుష్కరతాం యాతం ధిక్తంపురుషకీటకమ్.

తన యధీనముననున్నదియు, సర్వవిధముల హితమునే గలుగ జేయునదియునగు అభిలషితవిషయములయెడ వైరాగ్యవృత్తి యెవరికి దుష్కరమైయుండునో అట్టి మనుజకీటకమునకు ధిక్కారమగుగాత!

నాహంబ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాద్బధ్యతే మనః
సర్వం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతే మనః.

నేను బ్రహ్మముగానను దృఢసంకల్పముచే మనస్సు బంధమున దగుల్కొనును. అంతయు నాత్మస్వరూపమగు బ్రహ్మమేయను దృఢ సంకల్పముచే బంధవిముక్తిని బడయును.

సంకల్పః పరమో బంధ స్త్వసంకల్పో విముక్తతా
సంకల్పం సంవిజిత్యాతర్యథేచ్ఛసి తథాకురు.

సంకల్పమే గొప్పబంధనము. సంకల్పరాహిత్యమే ముక్తి. ఓరామచంద్రా! 'నేను బ్రహ్మనుగానను సంకల్పమును అంతయు నాత్మ స్వరూపమగు బ్రహ్మమేయను విరోధసంకల్పజనిత జ్ఞానముచే జయించి, పిమ్మట నీకొక్కెచ్చొప్పున యాచరింపుము.

ఇంద్రియగ్రామసంగ్రామసేతునా భవసాగరః
తీర్యతే నేతరేణేహ కేనచిన్నామకర్మణా.

సర్వేంద్రియజయమను వారధిచే గొప్పదగు సంసారసాగరము దాటబడునుగాని, మఱియే కర్మచేతను గాదు.

చిత్రామృతం నామృతమేవ విద్ధి
చిత్రానలం నానలమేవ విద్ధి
చిత్రాంగనానూనమనంగనేలి
వాచావివేక స్త్వవివేకఏవ.

ఓరామచంద్రా! చిత్రమందలి అమృతము అమృతము కాదు. చిత్రమందలి అగ్ని అగ్ని కాదు. చిత్రమందలి స్త్రీ స్త్రీ కాదు. ఇట్లే వాచావివేకము వివేకము కానేరదు. అది అవివేకమే యగును.

విచారః సఫల స్తస్య విజ్ఞేయో యస్య సన్మతేః
దినానుదినమాయాతి తానవం భోగగృధ్రుతా.

ఏసద్బుద్ధియొక్క భోగలాలస దినదినము క్షీణించుచుండునో, అట్టివానిచే నొనర్పబడు విచారణయే సఫలమగును.

ఆస్థామాత్రమనంతానాం దుఃఖానామాకరం విదుః
అనాస్థామాత్రమభితః సుఖానామాకరం విదుః.

అసద్వస్తువందు సత్యత్వ బుద్ధి గల్గియుండుటయే సర్వదుఃఖములకును నిలయము. అసద్వస్తునందు సత్యత్వబుద్ధి లేకయుండుటయే సర్వసుఖములకును నిలయము.

సంశాంతాహంకృతేర్జంతోర్భోగా రోగా మహామతే
నస్వదంతే సుతృప్తస్య యథా ప్రతివిషారసాః.

ఓమహాత్మా! అహంకారము లెస్సగ నశించిన నిత్యతృప్తునకు రోగరూపములగు భోగములు విషమువలె రుచింపకుండును.

భోగేష్వస్వదమానేషు పుంసః శ్రేయః పురోగతమ్
క్షీణేంధకారే కింనామ మనసోఽన్యత్ ప్రవర్తతే.

మనజునకెపుడు భోగములయెడ ప్రీతి తొలగునో అపుడు మోక్షశ్రేయము వానియెదుట నున్నట్లే. ఏలయన, మనస్సునందలి యంధకార (దోష) మగు అహంకారము క్షయింప యిక మతియొక్క ప్రతిబంధమేమి గలదు?

క్రియా విశేషబహులా భోగైశ్వర్యహతాశయాః
నాపేక్షంతే యథా సత్యం న పశ్యంతి శరాస్తథా.

అనేక క్రియాకలాపములఁ దగుల్కొని, భోగైశ్వర్యములచే నశించిన బుద్ధిగల జీవులు పరమాత్మ వైపునకు తమ చిత్తమును మరల్పనిచో, ఆత్మవంచకులై శ్రేయమును పొందకయుందురు.

యేతు పారంగతా బుద్ధేరింద్రియైర్న వశీకృతాః
తపనాం జాగతీం మాయాం పశ్యన్తి కరబిల్వవత్.

బుద్ధినిగూడ నతిక్రమించినవారును, ఇంద్రియములకు వశులు కానివారును నగుమహాత్ములు ఈ జగన్మాయను అరచేతి యందలి బిల్వఫలమువలె స్పష్టముగ గాంతురు.

సుఖోచ్ఛేద్యతయాజ్ఞస్య సంసారమలమాతతమ్
తండులస్య యథాచర్మ యథా తామ్రస్య కాలిమా.
నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలమ్
నశ్యత్యేవ నసందేహ స్తస్మాదుద్యమవాన్భవ.

ఓరామచంద్రా! ఈ సంసారమాలిన్య విస్తారమంతయు జ్ఞానిచే సులభముగ నశింపజేయబడును. బియ్యపు గింజపైఁగల పొట్టు, రాగి యందలి మాలిన్యము, దంపుట స్ఫుటమొనర్చుట యను క్రియలచే తొలగునట్లు ఈ సంసారమాలిన్యమున్ను, జ్ఞానభూమికాభ్యాసమను పురుషప్రయత్నముచే తప్పక నశించును. కాన నీవు యత్నపరుడవు కమ్ము.

వృథా భవతి బాలేషు యథా రాగమయీ కథా
నిరర్థకాల్పబోధేషు తథోదారోదయా కథా.

శృంగారరసయుక్తమగుకథలు బాలురకు బోధించిన, నిరర్థకమగునట్లు అల్పజ్ఞానము గల వారియెడ మోక్షప్రాప్తిఁగూర్చిన యతీత బోధయు వ్యర్థమగును.

బద్ధోహి వాసనా బద్ధో మోక్షః స్యాద్వాసనాక్షయః
వాసనా స్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపిత్యజ.

ఓ రామచంద్రా! వాసనలు గలవాడే నిజముగ బద్ధుడు. వాసనాక్షయమే మోక్షము. కాననీవు వాసనలన్నింటిని తొలగించి యుడకు మోక్షాపేక్షను [illegible] త్యజింపుము [illegible] యవస్థ

యుండునపుడే ముక్తిఁబొందతలంచును. మోక్షావస్థయందు బంధమే లేదుగాన యిట్లు చెప్పబడినది.)

కిం కిలస్ఫార మనసాం పశూనాం చ విశేషణమ్
కృష్యంతే పశవో రజ్జ్వా మనసా మూఢచేతసః.

దృశ్యవిషయములందు ప్రవర్తించు చిత్తముగల మనుజునకును, పశువులకును భేదమేమి? త్రాడుచే పశువు లీడ్వబడుచున్నవి, మనస్సుచే మూఢులీడ్వబడుచున్నారు.

అయం గుణసమాహారో బంధాయైవ సమాశ్రితః
సంత్యక్తోభవ మోక్షాయ యథేచ్ఛసి తథాకురు.

ఓరామచంద్రా! త్రిగుణాత్మకమగు మాయారూపమైన యీ దృశ్యము నాశ్రయించుటచే బంధమున్ను దీనిని పూర్ణముగ త్యజించుటచే ముక్తియు లభించునని యెఱింగి యిక నీయిచ్ఛవచ్చినట్లొనర్పుము.

చిత్తతాం శృంఖలామేతాం స్వరూపజ్ఞానయుక్తితః
బిలాచ్చిత్తాన్మహాబాహో స్వాత్మసింహం విమోచయ.

మహాబాహుడవగు నోరామా! చిత్తమను గొలుసును ఆత్మజ్ఞానమను యుక్తిచే త్రెంపి ఆత్మసింహమును సంసారమను బోనునుండి విడిపింపుము.

ఓంకారాదర్ధమాత్రార్థం భావయన్మౌనమాస్థితః
సంశాంతసర్వసంకల్పః ప్రశాంత కలనాగణః.

శాంతుడును, సంకల్పరహితుడును, కల్పనా వర్జితుడునునయి బలిచక్రవర్తి ఓంకారము యొక్క త్రిమాత్రలకు పరమగు అర్ధమాత్రచే సూచితమగు తురీయాత్మస్వరూపమగు బ్రహ్మమునే భావించుచు మౌనము వహించియుండెను.

సర్వసంభ్రమసంశాన్త్యై పరమాయ ఫలాయ చ
బ్రహ్మవిశ్రాంతిపర్యంతో విచారోస్తు తవానఘ.

పాపరహితుడవగునో ప్రహ్లాదా! భ్రమయంతయు పూర్ణముగ నశించుటకొఱకును, పరమానందస్వరూపమగు ముక్తియను ఫలము ప్రాప్తినొందుటకొఱకును, బ్రహ్మమందు విశ్రాంతి లభింపనంతవఱకు

ఆత్మవిచారణ చేయుచునేయుండుము (ఇట్లు శ్రీభగవానుడు ప్రహ్లాదున కుపదేశించెను.)

ఏష జాగర్తి సుప్తానాం ప్రహరత్యవివేకినామ్
హరత్యాపదమార్తానాం వితరత్యమహాత్మనామ్.

ఇంద్రియములన్నియు లయమగునపుడు పరమాత్మయే మేల్కొనీ యుండును. అవివేకుల నీతడే రక్షించును. ఈతడే దీనుల యాపదలను తొలగించును. మఱియు ఈశ్వరోపాసకుల వాంఛితఫలముల నీతడే యొసంగును.

చేత్యహీనం చిదాలంబం మనో యస్యగతజ్వరమ్
తేనాంబుకతకేనేవ జనతా సంప్రసీదతి.

(సశేషము)

---

# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

---

(శ్రీ శ్రీకంఠశివాచార్యులవారి గీతాభాష్య గ్రంథమునుండి)
(పంచదశాధ్యాయము)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె:—ఓ లక్ష్మీ! దక్షిణ దేశమందు పద్మనాభుడను రాజు పాలించుచుండెను. అతనిదగ్గర కొందఱు మంత్రులుండిరి. వారిలో నొక మంత్రికి రాజును చంపి రాజ్య మపహరింపవలెనని తలంపు గలిగియుండెడిది. కాని ఈశ్వరప్రేరణచేత ఆ మంత్రియే మరణించెను. నీచమైన తలంపు గలిగియుండిన హేతువు చేత యాతడు గుఱ్ఱపు జన్మయందు పుట్టవలసి వచ్చెను. ఆతడొక గుఱ్ఱపు వర్తకునియొద్దనున్న గుఱ్ఱమునకు బుట్టి పెరుగుచు సుందరముగా నుండెను. అంత నావర్తకుడు దానిని పద్మనాభుని దగ్గరకు తెచ్చి చూపగా నారాజు దాని యందమున కచ్చెరుపడి దానిని పరీక్షకులకు జూపెను. వారు దాని లక్షణములను పరిశీలించి రాజును తీసికొమ్మనిరి. పద్మనాభుడు ఆ వర్తకునకు విశేషధనమునిచ్చి దానిని కొనెను. ఒక దినమున రాజు ఆగుఱ్ఱము నెక్కి వేటకుబోయెను. అర

ణ్యమందు ఒక లేడిని తరుముకొనుచు బహుదూరము పోగా ఆలేడి అడవియందు కనబడక అదృశ్యమయ్యెను. అంత రాజు చాల డస్సి యున్నవాడు గావున వేట చాలించి దప్పికచేత నీరుండుతావు వెదకు కొనుచు బోయెను. మార్గమున రాతిపలక ముక్కమీద గీత 15 వ అధ్యాయమందలి సగము శ్లోకముండుట చూచి రాజు దానిని చదువగా అద్దానిని గుఱ్ఱము విని వెంటనే క్రిందబడి మరణించెను. గుఱ్ఱము నిష్కారణముగా మరణించినందులకు రాజునకు చాలా ఆశ్చర్యము కలిగెను. విచారమున్ను జనించెను. అంతట నారాజున కేమియు తోచక తిరిగి తిరిగి ఒక ఋష్యాశ్రమునకు బోయి గుఱ్ఱముయొక్క మరణహేతు వడిగెను. ఋషి రాజునుజూచి, రాజా! గుఱ్ఱము వెను కటి జన్మయందు నీయొక్క మంత్రియైయుండి నిన్ను చంపి నీ రాజ్య మపహరించు నుద్దేశ్యముతో నుండెను. కాని దైవప్రేరణచే నతడే మరణించి గుఱ్ఱమైపుట్టి నీకు వాహనమై బరగినది. అరణ్యమందు నీవు రాతిముక్కమీద వ్రాసియున్న గీత 15 వ అధ్యాయములోని సగము శ్లోకమును చదివిన మాత్రమున అది వినినందున దాని పాపమంతయు నశింపగా స్వర్గమునకు బోయెనని ముని చెప్పగా రాజు మిగుల ఆశ్చ ర్యమునొందెను. తదుపరి గీత 15 అధ్యాయమును ఆఋషివలన నుప దేశమును పొంది తన నగరమునకు మరలివచ్చి రాజ్యమంతయు తన కుమారుని కిచ్చి తాను అరణ్యమునకుబోయి ఈశ్వరుని నుపాసించుచు గీతాధ్యాయమును పఠించుచు దేహాంతమున స్వర్గమును జేరెను.

---

(శ్రీ భగవద్గీత)

# 13. క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము.

(శ్రీ మలయాళస్వాములవారు)

క్షేత్రమనగా శరీరము. క్షేత్రజ్ఞుడనగా జీవుడు. ఈ రెంటియొక్క విభాగము దీనియందు గలిగియుండుటచే దీనికి క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగమని పేరువచ్చినది. ఆత్మ యెటువంటిది? అనాత్మస్వరూప మెట్టిది? అని తెలిసికొనవలెనని భగవదాశయము. కొందఱు ఆత్మ

నాత్మా విచారము భక్తులకుగాని నిష్కామ కర్మయోగులకుగాని అవసరము లేదని వాదింతురు. శ్రీభగవానుల యభిప్రాయమట్లుగాదు. భక్తిగలిగినను ఆత్మ యిటువంటిది, అనాత్మ యిటువంటిది, ప్రకృతి యిటువంటిది, పురుషుడిటువంటివాడని తెలియకపోయిన ఆత్మయందు నిత్యబుద్ధియు అనాత్మయందనిత్యబుద్ధియు గలుగదు. కావుననే 'నా యొక్క భక్తులుగూడ దీనిని తెలిసికొనియే ముక్తిని పొందుచున్నార'ని 19-వ శ్లోకమున భగవానుడు చెప్పుటకు కారణము. మఱియు దీని యందు మొదట ఆఱుప్రశ్నలను అర్జునుఁడు అడిగియున్నాడు. (1) ప్రకృతియనగా నెట్టిది? (2) పురుషుడనగా యెవడు? (3) క్షేత్రమనగా నెటువంటిది ? (4) క్షేత్రజ్ఞుడెట్టివాడు ? (5) జ్ఞానమనగా దేనికిపేరు ? (6) జ్ఞేయమనగా నేమి? — ఈప్రశ్నలలో ఆఖరున గల ప్రశ్నలు రెండును ముఖ్యములు కనుకనే పైప్రశ్నలలోని మొదటి నాల్గింటికిని సామాన్యముగా అర్థము చెప్పి, తుది రెండు ప్రశ్నలను విశేషముగా అర్థము చెప్పుటకు కారణము. ఇచట జ్ఞానమునే జ్ఞేయమనియు, జ్ఞానమునే ఆత్మజ్ఞానమనియు దలంపక జ్ఞానికి యుండవలసిన సుగుణములను జ్ఞానమనియు, దైవసాక్షాత్కారమును జ్ఞేయమనియు గ్రహించుకొనవలెను. ఇట జ్ఞానికి యుండవలసిన ధర్మములు యిఱువది చెప్పియున్నారు ఈ గుణములుగలవాడే జ్ఞానియని తెలిసికొనవలెను. ఈ గుణములకు భిన్నములగు ప్రకృతిగుణములు యెవనియందు గన్పించునో వానిని అజ్ఞానియనియే నిశ్చయించవలెను. సాధకులు గూడ తమ యందు శ్రీ భగవానుఁడుపదేశించిన జ్ఞానగుణములకు భిన్నములగు ప్రకృతి గుణము (దుర్గుణము) లుండిన వానిని అవిద్యాగుణములని యెఱింగి అట్టి దుష్టగుణములను రహితమొనర్పవలెను. మఱియొక రహస్య మీ యధ్యాయమున గలదు. అదేమన జ్ఞానికి యుండవలసిన అమానిత్వాది యిఱువది సుగుణములు పూర్తిగా గలిగి యుండినను తమపని పూర్తియైనదని సాధకులు తలంపరాదు. జ్ఞేయమగు బ్రహ్మసాక్షాత్కారము గలిగిన మాత్రమే అమృతత్వము గలుగునని శ్రీభగవానులుపదేశించిరి. జ్ఞాన గుణములు పూర్తి అయిననే జ్ఞేయములో ప్రవేశించుటకు అర్హత గలుగును. వీనిలో యేదైన యొకటి పూర్తిగ

లేనిచో జ్ఞేయమునకు అర్హతలేదని గ్రహించవలయు. ఏదైన యున్న త్యోద్యోగమునకై కావలసిన పరీక్షలలోను త్తీర్ణులు కానిచో, అపద వికి జనులెట్లు యోగ్యులుకారో, ఆలాగున బ్రహ్మవిద్యయందును యిట్టి నియమము గలదు. కనుకనే అర్జునుడు మొదట జ్ఞానమునడిగిన తరువాత జ్ఞేయము నడుగుటకు కారణమైనది.

భగవానులుకూడ జ్ఞానమునుపదేశించిన తరువాత జ్ఞేయమగు బ్రహ్మము నుపదేశించెను. అట్లుగాక మొదటనే నీతిని, నిష్ఠలను యుప దేశింపక బ్రహ్మము నుపదేశించువారు తైలము, వత్తియు, ప్రమిదయు మొదట నమర్చక దీపమును వెలిగించువారిచందముననుందురు. ఆదీపము నిలచునా? తైలాదులు మూఁడును సిద్ధపరచిన తరువాత బ్రహ్మజ్ఞానజ్యోతిని వెలిగించిన అది వెలుగుచుండును. తైలాదిత్రయ ముచే దీపము వెలిగించినను గృహాంతరాళములందు యేదైన కిటికీల ద్వారాగాని తలుపులు ద్వారాగాని గాలివచ్చిన దీపమాఱిపోవును. అపుడు గాలివలన దీపమునకు అపాయముగలుగునని తెలిసిన ఆద్వా రము నెట్లు మూసివేయుదురో, ఆలాగున శమదమాదులు గలిగి బ్ర హ్మోపదేశము సిద్ధించినను, విక్షేపాదివిషయవాసనలు గలుగుచుండిన, అట్టి దానినుండి విముక్తినొందుటకు తగిన ప్రయత్నములు చేసికొని ధ్యానధారణాదులను, మనన నిధిధ్యాసములను బాగుగ నభ్యసించుకొన వలెను. దీనికే జ్ఞానయజ్ఞయనిపేరు. మనమొక పరీక్షకు చదువుచుండు నపుడు కొన్నిపాఠములలో నుత్తీర్ణులై మఱికొన్నిటిలో తప్పినచో, మఱుసంవత్సరము వాటినేలాగున పూర్తిచేయుదుమో, ఆలాగున బ్రహ్మనిష్ఠులకుండవలసిన సుగుణములలోను కొఱఁతగలిగిన మఱియొక జన్మలో ఆ కొఱఁతను పూర్తిచేసికొనిననే మోక్షపదమున కర్హులై గలుగును. ఇట్టివారే చిన్నకాలమునుండి విరక్తులై బ్రహ్మనిష్ఠ గల వారుగ జన్మింతురు. గడచిన జన్మలో యేప్రతిబంధములుగలిగి మోక్ష ము 'లభింపకపోయినదో, అట్టి ప్రతిబంధము లేవియు లేని యుత్కృష్ట జన్మము ఈశ్వరకృపచే గలుగును. దీనియందేలాటి సందేహమును లేదు. జీవించియుండగనే, జీవుడిచటయుండగనే నిశ్శేషవాసనారాహిత్యము గల్గి మనుజుడు తాను బ్రహ్మసుఖము నొందవలయు. 'నాయుందు

ప్రకృతిదోషమంతయు నశించినది. నేను నిత్యసుఖమును పొందితిని నేను అఖండ జ్ఞానస్వరూపుడను ప్రకృతిగాని, ప్రకృతిదోషములుగాని యిప్పుడు నాయందు యేమాత్రము కనుపించుటలేదు. అంతయుశాంత మయము, జ్ఞానమయము, పుణ్యమయము, ఆనందమయము' అను బోధ కలుగవలెను. ఏలాగున రోగియైనవాడు ఔషధసేవచే ఆరోగ్య ము గలుగునపుడు 'నాభాధలన్నియు పోయినవి, ఏలాటిదుఃఖమును లేదు, ఆరోగ్యముగానున్నాను' అని చెప్పునో, ఆలాగున అజ్ఞానము నశించిన జ్ఞానికూడ ప్రకృతివలన గలిగెడు దుఃఖములన్నియు నశించిన వాడై యుండును కావుననే మోక్షదశయందు అతిహర్షము కలుగునని శ్రుతివాక్యముల యొక్క సారము. నిశ్శేషశోకశాంతియు అప్పుడు సిద్ధించునని శాస్త్రములు చెప్పెడి రహస్యము. ఆకలి దప్పి కలచే మండుచుండు యెండలో తపించుచు యెడారిలో ప్రయాణము చేయువాడు చల్లని నీడయు, శీతలోదకమును, తృప్తిగ మంచిభోజన మును పొందిన, ఏలాగున పూర్ణతృప్తుడై యుండునో, ఆలాగున తాపత్ర యాగ్నిచే తపించి సంసారమను యెడారిలో ప్రయాణముచేయు జీవికి కూడ మోక్షసుఖము గలుగునపుడు పూర్ణతృప్తి గల్గును. కనుకనే నిశ్శేష దుఃఖనివృత్తియు. నిరతిశయ సౌఖ్యమున్ను ముక్తిదశయందు గలుగునని వచించుటకు కారణము. తక్కిన సౌఖ్యములు ఏకవేళ గల్గినను క్షణకాలములో నశించిపోవును. ఈ కైవల్యసుఖమునకు పతనమను నదిలేదు. ఎన్ని యుగములుగాని, కల్పములుగాని పోయినను దానికి క్షయము గలుగదు.

ఈ యధ్యాయమందీ శ్లోకము ముఖ్యము.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి. (13-28)

"ఎవడు బ్రహ్మాది స్తంబపర్యంతముగల సమస్త ప్రాణులందు సమానముగనుండునో, వస్తుసముదాయము నశించుచున్నను యెవడు నాశనమునొందడో, అట్టి పరమేశ్వరుని సమస్తములోను సమాన ముగా జూచువాడే నిజముగా జూచువాడు. తక్కిన వారలు నేత్ర

ములు గలవారైనను నేత్రములు లేనివారితో సమానులే! పాంచ భౌతికమగు యీదృష్టి పంచభూతసముదాయ వస్తువులను మాత్రమే చూడగల్గును. ఆత్మ (బ్రహ్మ) పంచభూతవిలక్షణముగాన దానిని చూడవలెనన్న దివ్యదృష్టి గలుగవలెను. అనగా ఆత్మయొక్క ఆవరణము లన్నియు తొలగవలెను.

జ్ఞానము అనగా జ్ఞానికుండవలసిన గుణములు సంపూర్ణముగ గలిగియున్నను జ్ఞేయమును పొందనిచో అమృతత్వము గలుగదని ఈ యధ్యాయమున భగవంతుడు విస్పష్టముగా చెప్పుటచే ఈ జ్ఞేయ పదమును గూర్చి బాగుగ యోచింపదగియున్నది. ఇప్పుడు చాలా మంది జనులు, ఏదైన కొంత పరోపకారము చేయుటచేతను, కొన్ని సత్కర్మల నాచరించుటచేతను, కొంత లోకసేవ యొనర్చుటచేతను, కొంత సదాచారనిష్ఠ గలిగియుండుటచేతను తాము ధన్యులమైతిమని యు, దానికంటె పరమైనది పొందదగినది లేదనియుతలంచి సంతుష్టు లగుచున్నారు. దానివలన తృప్తినిబొందక జ్ఞేయమగు బ్రహ్మమును అనగా ఆత్మసాక్షాత్కార స్వరూపమును అనుభవములోనికి తీసికొని వచ్చుటకై చూడక కృతకృత్యులమైతిమని తలంపవలదని యే భగవ దాశయము. అయితే యిపుడు కొంత పరోపకారముచేత తాము అందఱికంటె శ్రేష్ఠులమైతిమని తలంచుటకు కారణమేమన, అంతమాత్ర మైనను సత్కర్మచేయువారిక్కాలమున యరుదైరి. అంతియేగాక జ్ఞేయమగు బ్రహ్మములో స్థితిగల్గిన బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు, తాపసోత్త ములు యోగనిష్ఠులు యిపుడు మిక్కిలి అరుదైపోయినందుచేతను యిట్టి అభిప్రాయము వీరికి గలుగుటకు కారణమైనది. ఎట్లన, ఒకదేశములో వృక్షములే లేవు. అచ్చోట ఆముదపుచెట్టు గొప్ప మ్రాను అని తలంచి జనులు గర్వపడుదురు. మఱియు యింకొక దేశమున పాములే లేవట. అచట భూనాగము (ఎఱ్ఱ) ఆదిశేషుడుగా తలంపబడునట. ప్రస్తుతము మన యొక్క దేశస్థితియు ఈలాగున పరిణమించినది.

ఓం తత్ సత్.

ఓం.

# సభాపరిసమాప్తి.

(దశరథాదులు శ్రీ వసిష్ఠమునీంద్రుల యుపదేశమును కొనియాడుట)
(శ్రీ యోగవాసిష్ఠమునుండి)

శ్రీవాల్మీకి రువాచ:—

ఇత్యుక్తవత్యథమునౌ నభసోననాద
వర్షామృతాభ్రమివ దుందుభిరామరోద్రాక్,
శుక్లీకృతాఖిల కకుబ్వదనాతుషార
వర్షోపమాభువి పపాతచ పుష్పవృష్టిః

శ్రీవాల్మీకి:— ఓ అరిష్టనేమిరాజా! వసిష్ఠమునీంద్రులు తన యుపదేశమును సమాప్తిగావింప, అమృతపూర్ణ మేఘముల గంభీరనినాద మువోలె దేవదుందుభులు మ్రోగెను. తుషారవృష్టివలె నలుదెసలును తెల్లవర్ణమయ మొనర్చుచు ఆకసమునుండి పుష్పవర్షము కురిసెను.

తాని దివ్యాని పుష్పాణి యథాస్థానమధఃస్థితాః
వసిష్ఠాయ నమస్కృత్వా సభ్యాః సంశోకితాంజ హుః.

పిదప, శ్రీవసిష్ఠుల యాసనమునకు కొంచెముక్రిందుగ తమతమ స్థానములం దాసీనులై యుండిన మునిగణమున్ను, దశరథాది సభ్యులున్ను, ఆ దివ్యకుసుమములనైకొని శ్రీవసిష్ఠభగవానుల చరణముల పై పుష్పాంజలి సమర్పించి ప్రణమిల్లిరి. ఆపుష్పాంజలితో బాటు వారు తమ జననమరణాది దుఃఖములంగూడ త్యజించివైచిరి.

శ్రీదశరథ ఉవాచ:—

అహోను సువిశాత్మానః సంసారవితతాకృతేః
విశ్రాంతాఃస్మశ్చిరంశ్రాంతాః శుద్ధామేఘాఇవాచలే.

శ్రీదశరథుడు:— ఓ వసిష్ఠమునీంద్రా! శుద్ధమేఘము హిమాలయాది పర్వతములపై విశ్రమించునట్లు, తమ అనుగ్రహపూర్ణమగు యుపదేశముచే మాకు ఆత్మశాంతి లభించినది. మఱియు సద్దాసచే విశాలమగు సంసారారణ్యమునుండి విడువడి మేమందఱమును పూర్ణ విశ్రాంతిని బొందితిమి.

కర్మణామవధిఃపూర్ణో దృష్టః సీమాంతఆపదామ్
జ్ఞాతం జ్ఞేయమశేషేణ విశ్రాంతాఃస్మః పరేపదే

ఓగురువర్యా! పరమపురుషార్థము సిద్ధించుటచే కార్యములు యవధిఁబొందితిమి. ఆపదలన్నియు నశించినవి. జ్ఞేయవస్తువగు బ్రహ్మమును పూర్ణముగ నెఱిఁగినాము. సర్వోత్తమమగు ఆత్మపదమందు విశ్రాంతినొంది నారము.

ధ్యానలబ్ధ పరవ్యోమ చిరానుభవనక్రమైః
ధారణాధారవిశ్రాంత్యా దేహసంత్యజనక్రమైః.
సంకల్ప నవనిర్మాణైః స్వప్నదృష్టి జగజ్జ్వరైః
శుక్తిరూప్యానుభవనైః స్వప్నాత్మమృతిదర్శనైః.

ఓ మహాత్మా! ధ్యానముచే లభ్యములగు అన్యాకాశము లందలి యనుభవములను గూర్చియు, యోగధారణచే సర్వాధారమగు బ్రహ్మమునందు విశ్రాంతిని పొంది యీ దేహమును త్యజించునట్టి క్రియలఁగూర్చియు, సంకల్ప, స్వప్నాదులందు నిర్మింపబడు జగన్నిమూహములఁ గూర్చియు, శుక్తియందలి రజతమువలెను స్వప్నమందలి స్వమరణము వలెను మిథ్యయగు యీ జగత్తుయొక్క స్వరూపమును గూర్చియు తెలిపినవారై తాము మా సాంసారిక దృష్టిని తుడచివైచిరి.

అనన్యైః పవనస్పందైరనన్యైః సలిలద్రవైః
ఇంద్రజాలపురాపూరైర్గంధర్వనగరోత్కరైః.
మాయాపూర్ణ పురాభోగైర్మృగతృష్ణానదీరయైః
ఆయతౌ పవనస్పర్శైర్ద్విచంద్రానుభవోదయైః.

మఱియు అభిన్నమగు వాయు, స్పందములగూర్చియు, జలద్రవత్వాది దృష్టాంతములఁగూర్చియు, గంధర్వనగరాద్యుపమానములను గూర్చియు, మృగతృష్ణానదీప్రవాహమువలె మిథ్యారూపమగు మాయచే రచింపబడిన దృశ్యజగత్తును గూర్చియు, ద్విచంద్రానుభవములఁగూర్చియు నిశ్శేషముగ వచించి తాము మా దృశ్యదృష్టిని తొలగించివైచితిరి.

మదభ్రంశపురస్పందై ర్మధాత్వవనికంపనైః
బాలయక్షాద్యనుభవైః ఖకేశోండ్రకదర్శనైః.
ఏవమాదిభిరన్యైశ్చ దృష్టాంతైః స్వానుభూతిదైః
అహోనుమార్జితా దృశ్యదృష్టిర్భగవతా మమ.

మదపరవశులకు వివేకనాశముచే యనుభూతమగు నగరాదుల సంచలమును గూర్చియు, శుభాశుభసూచనారహితమై భ్రాంతిచే నుదయించిన భూకంపాద్యనుభవములఁగూర్చియు, బాలుర బేతాళ, భ్రమనుగూర్చియు, నేత్రదోషముచే యాకసమున గన్పించు కేశాదులఁ గూర్చియు, ఇంకను ఇట్టివేయగు ననేక ఆత్మానుభవకారకమగు దృష్టాంతములఁగూర్చియు వచించి, మా ప్రాపంచికదృష్టిని దూరీకృత మొనర్చిరి. ఆహా! ఎట్టి యానందజనకమగు విషయము!

శ్రీరామ ఉవాచ: —

నష్టోమోహః పదం ప్రాప్తం త్వత్ప్రసాదాన్మునీశ్వర
సంపన్నోహ మహంసత్య మత్యంతమవదాతధీః.

ఓ మునీశ్వరా! తమ కృపావిశేషముచే నాయజ్ఞాన మంతరించినది. ఆత్మపదము సంప్రాప్తమైనది. వెయ్యేల! గురువర్యా! నేనిపు డత్యంత శుద్ధబుద్ధిగలవాడనై సాక్షాత్ పరబ్రహ్మస్వరూపుడనే అయి యున్నాను.

స్థితోస్మి గతసందేహః స్వభావేబ్రహ్మరూపిణి
నిరావరణ విజ్ఞానః కరిష్యే వచనం తవ.

ఓ గురుదేవా! నేనిపుడు సంశయరహితుడనైతిని. నిరావరణ జ్ఞానయుక్తమగు బ్రహ్మస్వరూపమున స్థితుఁడనై యున్నాను. ఇక తామాజ్ఞాపించు నట్లొనర్చెదను. (ఆసక్తిలేక రాజ్యపాలనాది కార్యముల నొనర్తును.)

స్మృత్వాస్మృత్వా ఽ మృతాసేకసౌఖ్యదం వచనం తవ
అర్పితోపిచ శాంతోపి హృష్యామీవ ముహుర్ముహుః.

అమృతతుల్యములును ఆనందజనకములును నగు తమ వచనంబుల మాటిమాటికి సంస్మరించుటచే మహానావమానములందు

హర్ష శోకములను పొందక ప్రశాంతుడనై మిగుల యానందము నొం దుచున్నాను.

నైవమేఽద్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన
యథాస్థితోఽస్మి తిష్ఠామి తథైవ విగతజ్వరః.

ఓ గురువర్యా! నాకిక కర్మలఁ జేయకుండుటచే దోషముగాని చేయుటచే ప్రయోజనముగాని లేదు. వ్యవహారజనిత సంతాపరహి తుడనై యిపుడు నేను పూర్వమువలెనే కార్యము లాచరించెద.

ఉపాయస్తు తథా తేన దృష్టిర్యా స్త్రీహ కీదృశీ
అహోఽనువితతా భూమిః కష్టమేతాదృశీ దశా.

తాము వచించిన ఆత్మవిశ్రాంత్యుపాయము అత్యుత్తమమైనది. అట్టి యుత్తమ దృష్టికి తుల్యమైనది మఱియొకటి లేదు. ఆహా! అపరి చ్ఛిన్నమగు ఆనందము నాకు లభించినది. ఇట్టి మీయుపదేశమును గ్రహింపనివారి యొక్క జననమరణాదియుక్తమగు సంసారదశ మిగుల భయంకరమైనది.

నశత్రుర్నచ మిత్రం మే న క్షేత్రం దుర్జనోజనః
దుర్బోధైషా జగత్బుద్ధా శాంతా సర్వార్థసుందరీ.

నాకిక శత్రువుగాని మిత్రుడుగాని లేడు. ఈ శరీరముగాని బాహ్యప్రపంచముగాని లేవు. సజ్జనుడుగాని దుర్జనుడుగాని లేడు. ఆత్మీయ పరకీయములును లేవు. ఈ స్వాత్మచైతన్యమే, యెఱుంగబడ నపుడు దుఃఖప్రదమగు జగద్రూపముగ నుండెను. ఇపుడెఱుంగబడు టచే శాంతస్వరూపమును, సర్వార్థసుందరమును నైయున్నది.

కథమేతాం జనో వేత్తి వినాభ వదనుగ్రహమ్
వినైవ సేతుం పోతం వా బాలోబ్ధిం లంఘయేత్కథమ్.

దేవా! తమయనుగ్రహము లేకయే యిట్టి శుద్ధాత్మ స్వరూప మును జీవుడెట్లెఱుంగ గలడు? వారధిగాని నౌకగాని లేకయే బాలుడు సముద్రమును దాటగల్గునా?

లక్ష్మణ ఉవాచ;—

జన్మాంతరోపచిత సంశయనాశనేన
జన్మాంతరోపచిత పుణ్యవశోదితేన.

జాత్రోఽద్య మే మునివచఃపరిబోధనేన
జాత్రోఽద్య మే మనసి చంద్రఇవప్రకాశః.

ఓ మునీంద్రా! అనేక జన్మలందుచేసిన పాపములన్నియు నశిం చుటచేతను, అనేక జన్మలందలి పుణ్యపరిపాకముచేతను మాకు తమ యుపదేశము లభించినది. తమ వచనామృతముచే ఆత్మప్రబోధ ముద యింప యిపుడు నామనంబున చంద్రునివలె పరమాహ్లాదజనకంబగు ప్రకాశముత్పన్నమైనది.

ఈదృశ్యాం దృశ్యమానాయాం దృశిదోషదశాశతైః
కాష్ఠవద్దహ్యతే లోకః స్వదుర్భగతయాతయా.

దేవా! తమవంటి మహాత్ముల యుపదేశముచే నిత్యాపరోక్ష ఆత్మదృష్టి లభించుచుండ, నిజదౌర్భాగ్యవశమున మహాత్ముల సేవాశు శ్రూషాదులు లేని జీవులు రాగ, ద్వేష, అహంకార, జననమరణాది దోషములచే యహర్నిశము కాష్ఠముభంగి భస్మీభూతులగుచున్నారే! ఆహా! ఏమి యాశ్చర్యము!

విశ్వామిత్ర ఉవాచ:—

అహోఽబత మహత్పుణ్యం శ్రుతం జ్ఞానం మునేర్ముఖాత్
యేన గంగాసహస్రేణ స్నాతాఇవ వయంస్థితాః.

విశ్వామిత్రుడు:— ఆహా! ఎట్టి ఆనందజనకమైన విషయము! పరమ పవిత్రమగు జ్ఞానమును వసిష్ఠమునీంద్రుల ముఖతః శ్రవణము జేసితిమి. ఇందుచే వేలకొలది గంగానదులలో స్నానమొనర్చిన దాని కంటె యధిక పావనత్వము నొందితిమి.

శ్రీరామ ఉవాచ:—

సంపదా మథ దృష్టీనాం శాస్త్రాణామాపదాం గిరామ్
దేశానా మథదృష్టానాం దృష్టః సీమాంత ఉత్తమః.

శ్రీరాముడు:—ఓ మునీంద్రా! సమస్త సంపదలయొక్కయు, దృష్టులయొక్కయు, శాస్త్రములయొక్కయు, కావ్యరసాదులచే శోభి తమగు వాక్కులయొక్కయు, సుఖసాధనములగు ఆరామ, నదీ, ప్రాసాదాదులయొక్కయు అవధి నిపుడు గాంచినాను. ఏలయన

ఆత్మలాభము సర్వోత్తమ సంపత్తియు, సర్వోత్తమ దర్శనమును, సర్వ సుఖమయమును నగునుగదా!

నారద ఉవాచః—

యన్న శ్రుతం బ్రహ్మలోకే స్వర్గే భూమితలే యథా
కర్ణౌ తజ్జ్ఞానమాకర్ణ్య యాతౌ మేఽద్య పవిత్రతామ్.

నారదుడు:—ఓ మునీశ్వరా! ఏ జ్ఞానమయమగు యుపదేశము బ్రహ్మలోకమునగాని, స్వర్గమునగాని, భూతలమునగాని విని యుండలేదో, అద్దానిపుడు శ్రవణమొనర్చుటచే మాకర్ణములు పరమ పవిత్రత్వముఁ జెందినవి.

లక్ష్మణ ఉవాచః—

హార్దం బాహ్యంచ తిమిర మపమృష్టవతా త్వయా
మునే పరమభానుత్వం నూనం నః సంప్రదర్శితమ్.

లక్ష్మణుడు:—ఓ మునీంద్రా! బాహ్యాభ్యంతరముల గల యంధకార (అజ్ఞానాంధకార) మును నశింపజేయునట్టి సర్వోత్కృష్టమగు సూర్యప్రకాశమునుమాకొఱకై ప్రదర్శించియున్నారు.

దశరథ ఉవాచః—

బహుజన్మోపరుద్ధేన పుణ్యేనాయం మునీశ్వరః
ధీరః కథితవాన్నస్తద్యేన పావనతాంగతాః.

దశరథుడు:—ఓ మహాత్మా! అనేక జన్మలందలి పుణ్యసంచయముచే, ధీరులును, వివేకులును నగు తాము మాకొఱకై బ్రహ్మజ్ఞానోపదేశము గావించితిరి. అద్దానిచే మేమందఱమును పరమ పవిత్రతము నొందితిమి.

పిమ్మట శ్రీ వసిష్ఠ మునీంద్రుల యాదేశమునను సరించి సభాంత్యమున మంగళసూచకముగ దశరథుడు బ్రహ్మనిష్ఠులగు ద్విజులకును తదితరులకును భూరి యన్నప్రదానంబు గావించెను.

పౌరామాత్యాంస్తథాభృత్యాన్ దీనాంధకృపణాంశ్చతాన్
తస్మిన్ దశరథోరాజా దినేసహాసుహృజ్జనైః.

అపుడు నగరనివాసులను, మంత్రులను, భృత్యులను, దీనులను, అంధులను, దరిద్రులను ... దాన ... దులచే తృప్తి

ప్రజిచి, సహృజ్జనులతోఁ గూడ దశరథమహారాజు సభాపరి సమాప్తి సమయమున గొప్ప యుత్సవమును జరిపెను.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఓం తత్ సత్.

# వి వే కా న ం ద లే ఖా వ ళి.

(అనువాదకులు:—శ్రీతత్త్వానంద స్వాములవారు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు

29—9—1894.

ప్రియమైన:—

ధీరనిస్స్వార్థచిత్తులారా! నాయనుంగు పుత్రులారా! మీరు చేసినది బాగున్నది. మీధైర్యమునుగూర్చి నేనెంతయు గర్వించుచున్నాను. ఆశాపూరితులై యుండుడు; నిరుత్సాహపడకుడు. అట్టి ఉపక్రమణము చేసినపిమ్మట నిరుత్సాహపడితిరా వెడగులన్నమాట.

* * *

భారతదేశమే మన కర్మక్షేత్రము. పరదేశీయుల అభినందనముల విలువ, భారతభూమి పొందుప్రబోధమునందు కనబడవలయును. అంతే; * * మనకొక సమర్థమగు ప్రధానకార్య స్థానముండి అందుండి వ్యాప్తిగాంచవలసియున్నది. * * క్షణకాలమైనను అధైర్యమున క్రుంగకుడు. సర్వమును సవ్యముగనే జరుగగలదు. ఇచ్ఛాశక్తియే సుడీ జగత్తునంతను ఆడించునది!

కుమారా! క్రైస్తవులుగమారుచున్న యువకులను గూర్చి మీరు విచారపడ నగత్యము లేదు. ప్రస్తుతమున్న సాంఘికదాస్యదశలో, ముఖ్యముగా చెన్నపురి ప్రాంతమున, వారింకెట్లు వర్తింపగలరు? వృద్ధికి మొట్టమొదటగా కావలయునది స్వేచ్ఛ. మీపూర్వులు ఆధ్యాత్మవిషయములందు పూర్ణస్వాతంత్ర్యము నంగీకరించియున్నారు; మతము అభ్యుదయము గాంచినది. వారు దేహమును బానిసతనమున నుంచిరి; సంఘము వృద్ధిగాంచజాలదయ్యె. పాశ్చాత్యభూములందు

ఇందుకు సరిగా వ్యతిరేకపరిస్థితులు వెలయుచున్నవి. సాంఘికవిషయము లందు కావలసినంత స్వాతంత్ర్యము గలదు; మతమునకో సున్న. ఇప్పు డిప్పుడు పాశ్చాత్యుల మతనిర్బంధములు తొలగుచున్నవి; అటులనే ప్రాచ్యుల సాంఘిక నిర్బంధములును తొలగిపోవుచున్నవి.

ఎవరి సాంప్రదాయము వారిది. భారతదేశమున మతము అనగా అభ్యంతరదృష్టియు, పాశ్చాత్యదేశములందు ప్రకృతిశాస్త్రము అనగా బాహ్యదృష్టియు ప్రబలుచుండును. ఇంచుకంత ఆధ్యాత్మిక ప్రభావ మైనను పాశ్చాత్యులు సాంఘికాభివృద్ధిద్వారముననే పొందగోరుదురు. ప్రాచ్యులలో ఇంచుకంత సాంఘికాధికారమైనను మతముద్వారముననే పొందగోరుదురు. ఇట్లుండ ఆధునికసంస్కర్తలు భారతదేశమున తాము చేయు సంస్కరణమునకు మతమును మున్ముందుగా అణగద్రొక్కక గాని త్రోవ లేదనుకొనిరి. పాపము వారు తమప్రయత్నముల సాగింపక విఫలులైరి. ఎందువలన ? వారిలో తమ మతమును పరిశోధించి చూచినవారు కడుస్వల్పముగ నుండిరి. అన్ని మతములకు తల్లియైన యీమతమును అర్థముచేసికొనుటకు వలసిన శిక్షణమును వారిలో ఒక్కరైనను పొందియుండరైరి. హిందూసంఘమును వృద్ధికి దెచ్చుటకై మతమును నాశనము చేయుట ఎంతమాత్రమును అనవసరముకాదని నేను గట్టిగ చెప్పగలను. సంఘము ఇట్టి దురవస్థపాలగుటకు మూలము మతముగాదు; మఱియేమన, మతమును సంఘమునందు ఎట్లు అను వర్తింప చేయవలయునో అటుల అనువర్తింప చేయకుండుటయే. ఈ విషయములో మన ప్రాచీనగ్రంథములనుండి ప్రమాణముల దీసికొని నేను చెప్పు ప్రతివచనమును రుజువుచేయగలను. నేనుగాంచు బోధ ఇది యే; మనజీవితములం దన్నింటను మనము నిర్వహించుటకై పూని వహింపవలసినదియు ఇదియే. కాని అందుకు చాలకాలము అవసర మగును. విషయపరిశోధనకే చాలకాలము పట్టును. ఓపికపట్టుము శ్రమపడి పనిచేయుడు. 'ఉద్ధరేదాత్మనాత్మానమ్,—మిమ్ము మీరే ఉద్ధరించుకొనుడు.

ఇట్లు
వివేకానంద.

ఉ. లే.

గమనించుడు : మన ప్రస్తుతపు హిందూసంఘము పరమార్థమునకై పాటుపడువారికొఱకు మాత్రమే నిర్మాణము చేయబడి, తదితరుల నందఱిని త్రొక్కి పార వేయుచున్నది. ఎందుకటుల కావలె? ప్రాపంచకపు అల్పభోగములను ఒకింత అనుభవింపగోరువారి గతి ఏమి కావలయును? మన మతము ఎల్లఱను తనలో నిముడ్చుకొను తెఱగున, మన సంఘముకూడ వర్తింపవలయును. మన మతముయొక్క యథార్థములగు మూలసూత్రములను అర్థముచేసికొని వానిని సంఘమునకు అనువర్తింప చేయుటవలన * * * ఈ పని జరుగవలసియున్నది. నెమ్మదిగనైనను నిశ్చయముగ జేయవలసిన పని ఇదియే!

---

# శ్రీ పరబ్రహ్మోపాసన !!

# త్రయోదశమార్గములు.

(గతసంచిక 272 పుట శేషము.)

(ప్రార్థన.)

ఆ॥ చరణసేవకులకు సంసార భయమును
బాపి శ్రీ కరంబు పట్టుగలిగి
కామదాయియైన కరసరోజంబు మా
మస్తకములనుసిచి మనుపుమీశ. 1013

ఉ॥ గోవుల వెంటఁద్రిమ్మరుచుఁ గొల్చిన వారల పాపసంఘముల్
ద్రోవఁగఁజాలి శ్రీదనరి దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం
భావితమైన నీ చరణ పద్మము చన్నులమీఁద మోపి త
ద్భావ జపుష్పభల్ల భవబాధ హరింపు వరింపు మాధవా 1014

ఉ॥ నీవు యశోద బిడ్డఁడవే నీరజనేత్ర సమస్త జంతు చే
తోవిదితాత్మ పీశుఁడవు తొల్లివిరించి దలంచి లోక ర

చవిధ మాచరింపుమని సన్నుతిసేయఁగ సత్కళంబునన్
భావలయంబుఁ గావనిటు పుట్టితిగాదె మనోహరాకృతిన్ 1046

మ॥ ఘనలక్ష్మీయుతమై విరన్ శుభదమై కామాది విధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతర తపస్సంతప్త పున్నాగ జీ
వనమై యెప్పుడు నీకథామృతము ద్రావం గల్గునే భూరి దా
నసి రూక్షత్వము లేని వారలకు మానారీ మనోహారకా? 1047

క॥ నీ నగవులు నీ చూడ్కులు నీ
నానా విహరణములు నీ ధ్యానంబుల్
నీ నర్మాలాపంబులు,
మానసముల నాటి నేఁడు మగుడవు కృష్ణా? 1048

ఆ॥ ఘోషభూమి వెడలి గోవుల మేపంగ
నీరజాభమైన నీ పదములు
గసవు శిలలుఁదాఁకి కడునొచ్చునోయని
కలగు మామనములు కమలనయన. 1049

ఉ॥ నీవడవింబగల్ దిరుగ నీకుటిలాలక లాలి తాస్యమి
చ్ఛావిధిఁజూడకున్న నిమిషంబులుమాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁగన్నుల నెప్పుడుఁ జూడకుండ
లక్ష్మీవర ఱెప్పలడ్డముగఁ జేసెసిదేల విధాత క్రూరుఁడై.

మ॥ అని యిట్లంగన లంచిత సర్వముతో నంకించుచుం బాడుచు
దనుశావేయని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్య మో
హనుఁడై మన్మథ మన్మథుండయి మనోజ్ఞాకారియై హారియై
ఘనపీతాంబర ధారియై పొడమెఁ దత్కాంతా సమీపంబునన్

( సాక్షాత్కారము. )

క॥ వచ్చినవల్లభుఁగనుఁగొని
విచ్చేసెనటంచు సతులు వికసితముఖులై
యచ్చుగఁ బ్రాణముతో డలికి
నచ్చినసిలుచుండు నవయవంబులభంగిన్. 1052

క॥ హరిముఖకమలముఁ జూచుచుఁ
దరుణి యొకతె ఱెప్పలిడక తనివుక యుండెన్

హరిపద కమలముఁ జూచుచు
మరిగితనివిలేని సుజనుమాడ్కి నరేంద్రా! 1064

ఉ॥ ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపముఁ జూడ్కితీవలం
జిక్కఁగఁబట్టి హృద్గతముఁ జేసి వెలింజనకుండ నేత్రముల్
గ్రక్కునమూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచుం
జొక్కములైనలోచవులఁ జొక్కుచునుండెను యోగికైవడిన్.

ఆ॥ పరమయోగి హృదయ భద్రపీఠంబుల
నుండు మేటివజ్రిజ వగూత్తరీయ
పీఠమున వసించి పెంపారెఁ ద్రిభువన
దేవలక్ష్మి మేనఁ దేజరిల్ల.

వ॥ నను సేవించుచు నున్న వారలకు నేనా రూపముం జూపఁ జూ
చినఁ జాలించి మదించి వారు మఱి నన్ సేవింపరో యంచుని
ర్ధనికుండాత్మధనంబు సెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుఁ దా
ల్చినభంగిన్ ననుఁ బాసి మత్ప్రియుడు దాఁ జింతించు
నా రూపమున్. 1080

తరలము॥ తగవుధర్మముఁ జూడనొల్లక తల్లిదండ్రుల బంధులన్
మగలబిడ్డలఁ బాసివచ్చిన మన్నిషక్తల మిమ్ము నేఁ
దగదు పాసితిఁ దప్పు సైఁపుఁడు తద్వియోగ భరంబునన్
వగలఁ బొందుచు మీరలాడిన వాక్యముల్ విను చుండితిన్.

ఉ॥ పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతరమత్పరత్వముం
జేయుచునున్న మీకుఁ బ్రతిసేయ యుగంబులనైన నేరనన్
బాయక గొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచినా
పాయుటఁ దప్పుగాఁ గొనక భామినులార కృపన్ శమింపరే.

రాసక్రీడ (బ్రహ్మానందము)

వ॥ ఇట్లు బహుగతులన్ దిరుగ నేర్పరియగు హరి, దర్శించి తన
యిరుగెలంకుల నలంకృతలయి కళంకరహిత చంద్రవదన లిద్దఱు ముద్ది
యలుద్దిగొని వీణలందుకొని ప్రవీణలై సొంపుమెఱసి యింపుగ
వాయించుచు నానందలహరీ నిధానంబగు గానంబుచేయ నవి
రళంబైతరళంబుగాని వేణుక స్వరళంబుగ మురళంబు లీలఁ గేలనందికొని

మధురంబగు నధరంబు నంగదియించి మించి కామికామినీజనక కబరికా సౌగంధిక గంధబంధుర కరాంగుళీకి సలయంబులు యతిలయంబులం గూడి వివరంబుల సారించి పూరించుచు సరిలేని భంగింద్రి భంగిమై కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరు లెంద అందఱకు నందఱయిసుందరుల కవలమెడలం దానును దనకవలమెడల సుందరులును దేజరిల్ల నృత్తవిద్యామహార్ణవ వేలావలయ వలయితంబై విస్మితాఖండలంబైన రాసమండలంబు గల్పించి వేల్పులు హర్షంబునం గుసుమ వర్షంబులు గురియనందు. 1085

చ॥ నడుములువీఁగియాడఁ జిఱునవ్వులు నివ్వటిలంగహారముల్
సుడివడమేఖలల్ వదలఁజూడిక్కు మెఱుంగులు పర్వఘర్మముల్
వ్రాడమఁగురుల్ చలింపశ్రుతిభూషణముల్ మెఱయన్ సకృష్ణలై
షడఁతుకలాడుచుం జెలఁగి పాడిరి మేఘతటిల్లతాప్రభల్ 1086

క॥ అంకరహితేందు వదనలు,
పంకజలోచనునిఁగూడి పరఁగనటింపం
గింకిణుల నూపురంబుల,
కంకణముల మ్రోతలెసఁగెఁగన్నోత్సవమై. 1087

క॥ హరిణీనయనలతోడను,
హరిరాసక్రీడ సేయ నంబరవీధిన్
సురనాథులు భార్యలతో
సౌరిదివిమానంబులెక్కి చూచిరిలేశా. 1088

క॥ కురిసెంబుపువ్వుల వానలు
మొరసెందుందుభులు మింటముదితలు దారున్
సరసన్ గంధర్వపతుల్
వరుసన్ హరిఁబాడిరపుడు వసుధాధీశా! 1089

వ॥ ఇట్లుభగవంతుడైన కృష్ణుండాత్మారాముండయ్యును గోపసుం తులెందఱందఱకు నందఱై నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు బాలు పోలిక రాసకేలిసలిపిన. 1100

క॥ తగఁగూడి యాడిమనముల
నగేఁచూచెంబలికెనంద నందనుఁడనుచున్
మగువలు పెద్దతికముతోఁ
బొగడిరి తమపూర్వజన్మ పుణ్యశ్రేణిన్. 1101

( ఈశ్వరవియోగ పరితాపము. )

మ॥ చెలియాకృష్ణుఁడు కన్నుఁబాసి వనమున్ జేరంగ నమ్మైక్షణం
బులు నాకన్నియు నుండనుండఁగడునా పూర్ణంబు లైసాఁగిలో
పలదోచున్ బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్ధములై మహాయుగములై సిండారుకల్పంబులై 1134

శా॥ ఏకాంతంబున నీదుపై తానేమేని భాషించుచో
మాకాంతుండు వచించునే రవిసుతా మధ్యప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా రాసంబుమాతోడనం
గీకారం బొనరించి బంధసియతిం గ్రీడించు విన్నాణముల్. 1482

సీ॥ తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీఁద
నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబు లొక్కటఁ దలగుననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ
జిత్తంబులిక్కడఁ జిక్కవనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కగవచ్చినఁ
బ్రాణంబులుండక పాయుననుము
తే. ప్రాణములుపోవ మఱివచ్చి ప్రాణవిభుఁడు
ప్రాణరక్షకుఁడగుతన్నుఁ బ్రాణులెల్ల
జేరిదూఱఁగ మఱియేమిసేయువాఁడు
వేగవిన్నప మొనరింపవే మహాత్మ. 1483

భాగవతము (దశ — ఉత్తరభాగము)

వ॥ అని యిట్లు ప్రియాలాపంబులు వలుకుచుండు నవసరంబున
గోపాల సుందరు లమందానందలలిత హృదయలయి హృదయేశ్వరుం

డైన గోవిందుండు చిరకాల సమాగతుం డగుటం జేసి యతనిం జూచు
తలంపు లుల్లంబుల వెల్లిగొనం జేరి. 1067

చ॥ నళినదళాక్షుఁ జూచి నయనంబుల మోడ్పఁగఁ జాలకాత్మలం
వలచితదీయమూర్తి విభవంబు దలంచుచుఁ గౌఁగిలించుచుం
బులకలు మేన జాదుకొనఁ బొల్తులు చొక్కిరి బ్రహ్మముం దనుం
బులఁగని చొక్కు యోగి జనముం బురుడింపఁగ మానవేశ్వరా

చ॥ పోలతుం భావమాత్మఁ గని ఫుల్లసరోరు హలోచనుండువా
రలనపుడేకతంబునకు రమ్మని తోడ్కొనిపోయి యందున
ర్మిలిఁ బరిరంభణంబు లొనగించి లసద్దరహాస చంద్రికా
కలితక పోలుఁడై వలికెఁ గాంతల భక్తిని తాంత చిత్తులం. 1069

(అ భ య ము.)

సీ॥ తరలాక్షులార మద్భక్తి చేతనులకుఁ
దనరు మోక్షానంద దాయకంబు
జప తపోవ్రత దాన సత్కర్మల ముక్తి
గలుగంగ నేరదుగానఁ దలఁప
విధి శివసనకాది విమలచిత్తబులఁ
బొడమని భక్తి మీ బుద్ధులందు
జనియించె మీ పూర్వ సంచిత సౌభాగ్య
మెట్టిదో యది తుద ముట్టెనింక

తే॥ నటమటముగాదు మీకు నెన్నటికినైనఁ
గలుగనేరవు నిరయ సంగతములైన
జన్మకర్మము లిటమీఁద మన్మనీష
సుమహితధ్యానలార యోరమణులార. 1071

(స ర్వ వ్యా ప క తా బో ధ.)

సీ॥ అఖిలభూతములకు ననయంబు నాది మ
ధ్యాంత కాంతర్బహిర్వ్యాప్తి నేన
ఘటఫటాదిక భూత కార్యంబులకును పా
దానకారణములై తవరునట్టి

గగనానిలానలకక్షోణులను భూత
పంచకంబైక్యత వడయఁగాదె
లోకంబులందుఁ బంచీకరణ వ్యవ
స్థలచేత నట్టి భూతములరీతి

తే॥ గగన ముఖభూత తత్కార్య కారణములఁ
దగిలి యాధార హేతుభూతంబునైన
నాకుఁబరమన్య మొకఁడెన్నంగ లేదు
విమలమతులార మాటలు వేయునేల. 1072

తే॥ అనినఁదెలివొంది వారు దేహాభిమాన
ములు సమస్తంబు విడిచి యో నలిననాభ
నిఖిల జగదంతరాత్మ మానితచరిత్ర
భక్తజనమందిరాంగణ పారిజాత. 1073

తే॥ ఘోరసంసారసాగరోత్తారణంబు
దీయుత జ్ఞానయోగి హృద్ధ్యేయ వస్తు
వగుచుఁజెలువొందు నీ చరణాంబు జాత
యుగళమును మామనంబులఁదగులనీవె. 1074

క॥ అనివేఁడినఁగృష్ణుఁడు ముని
వినుఁడు కరుణించి వల్లవీజనములు కో
రినయట్ల యిచ్చెఁగరుణా
వననిధి సద్భక్తలోక వత్సలుఁడంతన్.

---

## 8. తల్లి పుత్రుని యందుంచు వాత్సల్యము వలె.

దేవకీ దేవి యశోదా దేవుల ప్రేమ; పుత్రవాత్సల్యము; పుత్రుని కన్నను మహత్తగు పదార్థము లేదని కొందఱి యభిప్రాయము. అట్టి భావముగలవారికి ప్రపంచమంతయు తనపుత్రునిమయముగా నగబడును. సేకరించుచుండు వస్తువులును సంపదయు పుత్రుని స్మరణకు తెచ్చుచుండును. ఈభావన కొందఱు పరాత్పరునియందుంచి నివృత్తిగాంచిరి. లాలన, ఆలింగన, [illegible] వాత్సల్యములు వీరికి విశేష

ములు. "గోపాంగనక్రియ కరుణబడయ రఖిలేశ్వరుచే" అనిముష్మ
త్ములే ఆశ్చర్యపడినారు. ఇంకను

క. వెన్నునికోకపరివిషమగు,
చన్నిచ్చిన బాలహంత్రిచనెనఁటడివికి
వెన్నుఁగనిపెంచిభక్తిం,
జన్నిచ్చినసతికి నుఱియు జన్మముగలదే.

అనిభాగవతమునగలదు గాని పవిత్రమైన మార్గములలోనిదియు
నొకటి.

దేవకీదేవి స్వామిని స్తుతించుట.

శ్రీకృష్ణజననము (భాగ-దశ-పూర్వభాగము)

వ॥ అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును విచక్షు
డును సుకుమారుండును నైనకుమారుసింగని కంసునివలని వెఱపున
శుచిస్మితయై యిట్లనియె.

సీ॥ అట్టిట్టిదనరానిదై మొదలైనిండు
కొన్నదై వెలుఁగుచు గుణములేని
దైయొక్క చందంబుదై కలదైనిర్వి
శేషమై క్రియలేక చెప్పరాని
దేరూపమని శ్రుతులెప్పుడు నొడివడి
నారూపమగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మరెండవ యర్థంబుతుదిజగం
బులునశింపఁగఁబెద్ద భూతగణము

ఆ॥ సూక్ష్మభూతమందుఁజొరఁగ నాభూతంబు
ప్రకృతిలోనఁజొరగఁ ప్రకృతిపోయి
వ్యక్తమందుఁజొరఁగ వ్యక్తమడంగను
శేషసంజ్ఞనీవు సెలువమగుదు.

ఉ. విశ్వములీలద్రిప్పుచు నవిద్యకుఁజుట్టములైని నీకుఁదా
శాశ్వతమైనకాలమిది సర్వము వేడబమందు రట్టి వి
శ్వేశ్వరమేలుకుప్పనిను నెవ్వఁడు గోరిభజించు వాడఁపో
శాశ్వతలక్ష్మి మృత్యుజయసౌఖ్యయుతుండభయుండు మాధవ

మత్తకోకిలము.—

ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
కంటిమందురు కాని నిక్కము కానరీభవదాకృతిం
గంటిభద్రము గంటి మాంసపుఁ గన్నులంగనఁ బోలదీ
తొంటిరూపుఁవొలంగఁ బెట్టుము తోయజేక్షణ మ్రొక్కెదన్.

ఆ॥ విలయకాలమందు విశ్వంబునీపెద్ద
కడుపులోన దాఁచుకడిమిమేటి
నటుఁడవీవు నేఁడు నాగర్భజుఁడవౌట
పరమపురుష వేడబంబుగాదె. 129

తరలము:—

నలినలోచననీవు నిక్కము నాకుఁబుట్టెదవంచు నీ
ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము కారయింటనడంచెదు
ర్మలినచిత్తుని నాజ్ఞసేయుము మమ్ముఁగావుము భీతులన్
నులుసులేక ఫలించె నోఁచిన నోములెల్లను నీవయై.

(దేవకీ వసుదేవుల పూర్వజన్మముల వృత్తాంతము.)

వ॥ అనియిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుండిట్లనియె. నవ్వా నీవుదొల్లి స్వాయంభువ మన్వంతరంబునఁ బృశ్నియను పరమపతి వ్రతవు వసుదేవుండును సుతపుండను ప్రజాపతి మీరిరువురును సృష్టి కాలంబున బ్రహ్మపంపునఁ బొంపున నింద్రియంబుల జయించి తెంపున వానగాలి యెండమంచులకు సైరించి యేకలములరయి యాకలములు దిని యేకలంకంబును లేక వేంద్రంబుగఁ బంద్రెండువేల దివ్య వర్షం బులు దపంబులు సేసిన నెపంబున మీ రూపంబులు మెఱయనోజ నాజపంబులు సేసిడాసి పేర్చియర్చింప మీకు నాకుం గలరూపుఁజూపి యేను దిరంబులగు వరంబులు వేఁడుండనిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలులేని దొడ్డ యడ్డంబున దుర్గమంబగు నప వర్గంబు గోరక నాయీడు కొడుకు నడిగిన మెచ్చి యిట్లువరంబిచ్చి మీకేను బృశ్నిగర్భుండను నర్భకుండ నయితి మఱియును. 131

(సశేషము)

# జీవిత లక్ష్యము.

(గ్రంథకర్తలు - శ్రీ మతుకుమల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారు
శ్రీ రామకృష్ణ వివేకానంద సందేశ ప్రచారకులు)
ప్రకాశకులు - శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారు; ప్రొప్రైటర్;
వేంకట్రామా అండు కో, హెడ్ ఆఫీసు, ఏలూరు.)
(గతసంచిక 278-వ పుట శేషము.)

---

ప్రపంచమున నంతకు మించిన ఉత్తమ విద్య లేదట; ఆత్మవిద్యయే ఆత నికి జీవితానందమట; ఆ విద్యయే అతనికి మరణ శయ్యపై ఆనందమును చేకూర్చగలదట. అట్టి ఉపనిషత్తులయందు ప్రకాశించుచున్న విద్య, ప్రతిమానవుని జన్మహక్కు. ధైర్య సాహసములతో పంచకోశముల త్యజించి, అవస్థాత్రయాతీతమై సృష్టిస్థితి లయములకు హేతుభూతమై, పిండమునందు ప్రత్యగాత్మమై ఉన్న ఆత్మ స్వరూపుని సాక్షాత్కరించి ధన్యులైన ఋషిసర్గమువారి ధైర్యసాహసము లత్యద్భుతములు అందుకనియే వివేకానందుడు (So bold were these thinkers that even a spark of their boldness should have frightened the so called bold thinkers of the west.) వీరి సాహసముల గూర్చి ముచ్చటించుచు, వీరిసాహసముముందు పాశ్చాత్యతత్వవేత్తలు గడగడ వణకవలసినదేనని వక్కాణించియున్నాడు. నేడట్టి ధైర్యసాహసములు మనకు లేవు. అట్టిధైర్యసాహసములు మనము పొందవలెనన్నచో, ఆత్మ విద్య మనకు లభించవలె. ఆత్మసాక్షాత్కారముచేగాని అట్టి ధైర్య సాహసములు మనకలవడవు. యథార్థముగ నట్టి ఆత్మను సాక్షాత్క రించినప్పుడే భారతదేశోద్ధరణ కాగలదు. మానవోద్ధరణకూడ కా గలదు. సర్వసౌభ్రాతృత్వము వర్ధిల్లగలదు.

బృహదారణ్యకోపనిషత్తు అశ్వమేధయాగముతో ప్రారంభ మైనది. కారణమేమి? యాగములలో అశ్వమేధము గొప్పది. దీని ఫలముగూడ జ్ఞానఫలముముందు స్వల్పమేనని సూచించుటకే శ్రీ

శంకరాచార్యులు భాష్యమును మూడవ అధ్యాయముతో మాత్రమే ప్రారంభించినారు. ఐహికభోగములనిత్యములు (క్షీణే పుణ్యే మర్త్య లోకం విశన్తి) అను న్యాయము ననుసరించి, పుణ్యము నశించిన వెనుక జీవులు మానవలోకమున జన్మించుచున్నారు. జీవితము పత్రము చివర నీటి బిందువువంటిది. అది యే నిమిషముననైన జారిపోవచ్చును. (దుర్లభో మానుషో దేహో) .... అను శ్లోకమున మనుష్యదేహము దుర్లభము; లభించినను ప్రాణి యే నిమిషముననైన దేహము వదల వచ్చును. అన్యశరీరములద్వారా తత్వము తెలియబడదు. కాబట్టి మానవుడు రహస్యమును గుర్తించి జీవితలక్ష్యమును చేరుటకు ప్రయత్నించవలె. నామరూపాత్మక జగత్తునందు, భ్రమజనిత దోషమునకు జిక్కక యమ నియమములచే ఆసనమును పొంది, ప్రాణాయామముచే గాలిని బంధించి, ప్రత్యాహార ధారణ ధ్యానాదులచే సమాధిచేరి జీవుని బ్రహ్మాలో లయము చేయవలె; యిట్టి పరిశ్రమ యోగమనబడు; చిత్తవృత్తుల పరిమార్చుటయే యోగముం జూపు విధానము. ఇట్టియోగము కలిగియుగమున దుర్లభము. 'మనస్సు నిలచిన మారుతంబపుడెనిలచు' కనుక మానవుండేయే మార్గములచేతనైన మనస్సును లయింప జేయవలె. మనస్సే బంధమోక్షములకు కారణము. యోగముచేనైన, జ్ఞానముచేనైన, భక్తిచిత్తముతోనైన, ఆత్మసాక్షాత్కారముచేసినవానికి బంధము లేదు. (all roads lead to Rome) అన్ని త్రోవలు రోమ్ నగరమునకే తీసికొని పోవునట్లు మార్గములన్నియు భగవత్ప్రాప్తినే చేకూర్చగలవు. కాబట్టి మానవుండు తన కుపకరించు మార్గము చేబూని భగవత్ప్రాప్తి పొందవలె. కాని జ్ఞానముకంటె యోగము యెక్కువని, యోగముకంటె జ్ఞానమెక్కుడని కలహించుట తగదు. తన శక్తి ననుసరించి మార్గము ననుకరించవలె. జొన్న, సజ్జ, వరి మొదలగు నన్ని ధాన్యముల యందును దేహపుష్టిని చేకూర్చగల శక్తిగలదు. దేహదార్ఢ్యత ననుసరించి వాటిని భుజించవలె కాని, బలహీనుండు జొన్నన్నము తినంగూడదు. తేలికయగు భక్తిమార్గముచే జ్ఞానయోగ ఫలములు సిద్ధించును; దేహాత్మభ్రాంతి నశింపవలె. అప్పుడుగాని జీవునకు బంధము నశించదు. బ్రహ్మ

సాక్షాత్కారము కలుగునంతవరకు వేదాంత శ్రవణము జేయునట్లు; శ్రవణములో మనన, నిధిధ్యాసలుగూడ అంతర్భూతమై యున్నవి. చతుర్వేదములకు భాష్యమురచించిన శాయనాచారి జీవన్ముక్తి వివేక మను గ్రంథమున, వాసనాక్షయము, మనోనాశము పొందువరకు తత్త్వానుసంధానము జేయవలెనని వచించియున్నాడు. తత్త్వ జిజ్ఞాస యున్నకాని మోక్షములభింపదు. (The longing of the soul is the prophesy of its fulfilment) జిజ్ఞాస పొడసూపుట కృతార్థు డగుటకు సూచనయని అమెరికాదేశపు ఋషిబిరుదాంకితుడగు (Emerson) ఎమర్సన్ వచించియున్నాడు. ఈజిజ్ఞాసచే నిత్యానిత్య వస్తు వివేకముగలిగి, మానవుడు ఇహాముత్ర ఫలభోగ విరాగముపొంది శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము గలిగి ఆత్మ సాక్షాత్కారము పొందుచున్నాడు. తీవ్రమోక్షేచ్ఛ జనించినగాని మానవునికి ముక్తిలేదు.

ఒకడు తత్త్వము తెలుసుకొనుటకై ఒకానొక మహనీయుని చెం తకేగినాడట; గురువుచెంత కొంత కాలమున్న తదుపరి ఒకనాటి మధ్యాహ్నమున స్నానము చేయుటకై చెంతనున్న నది కేగినాడట. స్నానమాచరించుచు శిష్యుడు నీటిలో మునుగగా, గురువు వాని శిర స్సు అడుగునకు గట్టిగ నొక్కినాడట. శిష్యుడు ఊపిరాడక క్రొల్లి పడి పైకి లేచినాడట. స్నానానంతరము ఆశ్రమమునకు వచ్చు చు నేను వత్తిడి చేసినప్పుడు ఏల నీవు గిల గిల కొట్టుకొనినావని శిష్యుని ప్రశ్నించెనట. ఆతడు ప్రాణము కొరకని బదులు చెప్పగా, నీమనస్సు ప్రాణమునకై తహతహ పడుచుండ, నీ కాత్మవిద్య లభించు నట్లని గురువు వచించి నాడట. అనగా మోక్షా పేక్ష లో సమస్తము మఱచిపోవలె కాముకుడైన వానికి లజ్జాభిమాన ములు లేనట్లు, ప్రాణభయముగూడ లేనట్లు, ఆత్మ సాక్షాత్కారము చేయగోరువానికి మిగత విషయమేమియు గోచరింపగూడదు. అట్టి తీవ్రవేదన జనించినగాని ఆత్మప్రాప్తిలేదు. భోజనముచేసి, శయనించి తాంబూలము నమలి, నసారాలోకూర్చుని గ్రంథపారాయణచేసిన ఆత్మసాక్షాత్కారము కానేరదు. ఇప్పటి పద్ధతిలో, ఈజీచైర్ లోగాని

సోషా పైగాని గ్రంథావలోకనముచేసిన అనుభవజ్ఞానమును లభింపదు. వివేకానందుడు చెప్పినట్లు ఒకగదిలో ధన కనకరాసులు గలవను కొనుడు; ప్రక్కగదిలో దొంగ ప్రవేశించి, గోడత్రొలచి ధనము స్వీకరించు నంతవరకు అతనికి నిద్రపట్టదు. అటులనే ఆత్మప్రాప్తి గోరువారు నిముషమైనను ఉపేక్ష వహింపజాలరు. అట్టి తీవ్రవేదన పొందినవారే కృతార్థులు. ఆ వేదనయే బ్రహ్మసాక్షాత్కారమను సూర్యోదయమునకు అరుణోదయ సూచన; మనకు మన దేహములపై విరక్తి జనించినగాని ఆత్మప్రాప్తిలేదు మనకు మన దేహభ్రమ యున్నంతవరకు ఆత్మప్రాప్తిలేదు. దేహభ్రమ నశించినపుడే మానవుడు ఉత్తమగతి నొందుచున్నాడు. జీవితమునందు బ్రహ్మచర్యము సలిపి, తదుపరి గృహస్థాశ్రమము స్వీకరించి, సుఖదుఃఖానుభవము నొంది, వానప్రస్థాశ్రమము స్వీకరించి, జితేంద్రియుడై తపోనిష్ఠాగరిష్ఠుడై, ఆత్మసాక్షాత్కారము నొందుటకై సన్యసించి, దేహాత్మభ్రాంతివదలి, ఆత్మను సాక్షాత్కరించి, ఆత్మానందము పొంది, ఆత్మలో రమించుచు, ఇతరులకు తోడ్పడవలె. ఇట్టి మహోత్కృష్టమైన ఆశయమే ప్రాచీన భారతవర్షపు ఆశయము. నిశ్చలచిత్తము లేక తపస్సులేదు. తపస్సు లేక తత్వము గోచరింపదు. ఆత్మసాక్షాత్కారము లేనిది బ్రహ్మానంద ములేదు. విషయవాసనతోపాటు శాస్త్రవాసన గూడ నశించవలె.

జీవిత లక్ష్యము బ్రహ్మానందము; యిది ఆత్మసాక్షాత్కారముచే గాని లభింపదు; ఒకప్పుడు ఆత్మానందము ననుభవించి, జీవుడు ఆత్మగా శోభిల్లినాడు; అట్టి ఉత్తమస్థితినుండి పతితుడై, దేహభ్రాంతిలో బడి జీవుడు వ్యాకులపడుచున్నాడు; తన ఆనంద స్వరూపమును తిలకించలేక, నామ రూపాత్మక జగత్తునందు చిక్కి, విషయములందు ఆత్మను వెదకుచున్నాడు. తా నానందస్వరూపుడని జ్ఞప్తియున్నది గాని, అది ఉన్నచోటు మఱచినాడు. భూపతన మైనప్పటినుండి, దేహధారియైన జీవుఁడు యీ ఆనందమునకై వెతకుచున్నాడు. మొట్టమొదట తల్లిరొమ్మున పాలు గ్రహించుచు ఆనందము యొక్క ఛాయను చూచుచున్నాడు. రెండేండ్లు వచ్చుసరికి చిన్న చిన్న బొమ్మలు ఆనందస్వరూపమని భావించి, ఆనందించు

చున్నాడు. 5, 6 వత్సరములు వచ్చుసరికి పాఠశాలలో ప్రవేశించి ఓనమల పుస్తకములో ఆత్మను వెదకుచున్నాడు. 7, 8 వత్సరములు వచ్చుసరికి అతనికి ఆనందమును చేకూర్చునవి చిన్న కథలపుస్తకములు. 10, 12 వత్సరములు వచ్చుసరికి ఇంగ్లీషు నభ్యసించి, ఆనందించుచున్నాడు. షోడశ వర్షప్రాయుడై ప్రవేశ పరీక్షలో కృతార్థుడై, ఆనందించుచున్నాడు. కళాశాలనుండి, విశ్వవిద్యాలయమునకు పోయి, పట్ట పరీక్షలో ఉత్తీర్ణుడై ఆనందించుచున్నాడు. ఇంతలో వివాహ ప్రయత్నములు; భార్యయే ఆనందస్వరూప మనుకొన్నాడు; యింతలో ఉద్యోగము; నూరు రూప్యములు సంపాదించుచు కులాసాగా కాలము గడుపుచు గర్భాదానమునకై (Honey moon) తహ తహ పడుచున్నాడు. భార్యయే ప్రాణమని భావించి ఆనందించుచున్నాడు. తదుపరి పుత్రప్రాప్తికై కాంక్షించి పుత్రోదయమునుగాంచి ఆనందించుచున్నాడు. తనపుత్రుడే సర్వస్వమన్నాడు. పుత్రుడే ఆత్మస్వరూపుడని భావించినాడు; పుత్రుడే ఆనంద మనుచున్నాడు. ఇట్లానంద మనేకచోట్ల మజిలీలుచేయుచు ముందుకు పోవుచున్నది. ఒకరోజున ఆఫీసులో నుండగా తంతిమోగినది. వెంటనే లేచి వార్త నాలకించినాడు. ఇంకేమున్నది? ఇంటికి నిప్పుఅంటుకున్నదట. అంతయు మఱచి బయటికి వెడలినాడు. ఇంతలో పోస్టుజవాను ఒక జాబు చేతికిచ్చినాడు; ఇతనికి ఉద్యోగము జీతముప్రమోషనైనదట; కాని ఆవిషయ మితని సంతోష పెట్టలేకపోయినది; ఎందుచేత? ఈతని లక్ష్య మంతయు యింటిమీాదనే నిలిచిపోయినది. దేహాభిమానము త్యజించిన జ్ఞానివలె ఊడిపోవుచున్న బట్టను గూడ సవరించుకొనక యింటికి పరుగిడినాడు. ఇల్లు నిప్పు అంటుకొన్నది; భార్య రొమ్ములు కొట్టుకొని యేడ్చుచున్నది; వృద్ధులగు తల్లిదండ్రులు రోదనము చేయుచున్నారు. నిప్పుచల్లార్చుటకై అందఱు ప్రయత్నించుచున్నారు. కాని పుత్రుడు మాత్రము కాన్పింపడు. ఈతడు కుమారుడెక్కడెక్కడ యని గగ్గోలు పెట్టినాడు. చిన్నకుమారుని ఉయ్యాలలో నుంచి అందఱు బయటికి వచ్చినారు. పాపము! యీతని విచారము మఱింత హెచ్చినది. భరింపలేక రొమ్ము కొట్టుకొనుచు యింటిచుట్టు తిరుగుచున్నాడు. కాని లోపలికి మాత్రము పోజాలడు. కుమారుడే నా

ప్రాణమని, కుమారుడే యాత్మయని ఇదివరలో చెప్పుచున్న యీతడు కుమారునికొఱకై తన ప్రాణము నర్పింపలేక పోయినాడు. దీనిని బట్టి తేలిన దేమన: కుమారునికంటె ప్రాణమే యెక్కువనిగదా! తదుపరి నిప్పు చల్లార్చినారు. కుమారుడు బ్రతికినాడు. ఇట్లు కొంతకాలము గడచినది. అంతట మన కథానాయకుడు రోగగ్రస్థుడైనాడు. దేహ బాధ అంతకంతకు యెక్కుడుకాగా యీ ప్రాణి పోయిన బాగుండు నని మంచములో విలపించుచున్నాడు. అన్నిటికంటె పరమ ప్రీతి యైనది ప్రాణముగదా! నాప్రాణముపోయిన బాగుండు నన్నపుడు తాను వేఱనియు, ప్రాణము వేఱనియు తేలుచున్నది గదా! తల్లి స్తనము లగాయతు, ప్రాణావసానము వరకు ఆనందము ప్రయాణము చేసి, తుదకంతర్ధానమై పోయినది గదా. ఈ ఆనందమునకు తావెక్కడ? తల్లి స్తనముగాదు, ఆటబొమ్మలుగాదు; భార్యకాదు; పుత్రుడుగాదు; తుదకు ప్రాణముగూడఁ గాదు; ఆ ఆనందధామము ఆత్మ ఆనందనిలయము ఆత్మ; ఆత్మయందే ఆనందమున్నది. ఆత్మానందము విషయములపై ప్రసరించినప్పుడు విషయములన్నియు ఆనందస్వరూపములుగ కాన్పించినవి. సూర్యునియొక్క ప్రకాశములో ఘటపటాదులు ప్రకాశించినట్లు, ఆత్మప్రకాశములో విషయములు ప్రకాశించినవి. ఆనంద స్వరూపములుగ గోచరించినవి; తుదకు ఆనందము ఆత్మయందు లయముకాగా విషయములన్నియు తారుమారైనవి; ఆనందము గోచరింపదు; యెందుచేత? విషయములలో ఆనందము లేదు కాబట్టి; 'ఆత్మనస్తుకామాయ సర్వం ప్రియంభవతి' అని బృహదారణ్యకోపనిషత్తునందు వినబడు చున్నది; అనగా ఆత్మకొరకే అంతయు ప్రియమగుచున్నది. కాబట్టి అట్టి ఆత్మను సాక్షాత్కరించి, ఆత్మానందము పొందినవానికి విషయవాంఛ యుండదు. అట్టి ఆత్మ సాక్షాత్కారముచేతనే మానవుఁడు భ్రమజనిత దోషమును పోగొట్టుకొని దారాపుత్రక్షేత్ర విత్తాదులకు సాక్షిస్వరూపుడై బంధమునందు తగుల్కొనక ఆనందించుచున్నాడు. తనయొక్క స్థావరముచేరి శాంతించుచున్నాడు. అట్టి వానికి బంధము లేదు. అట్టి ఆత్మసాక్షాత్కారమే మానవునికి గమ్యస్థానము,

శ్లో॥ దేహాదిభావం పరిమార్జయన్తః
ఆత్మానమాత్మన్యవలోకయన్తః
నాన్తం నమధ్యం నబహి స్స్మరన్తః
కౌపీనవన్తః ఖలుభాగ్యవన్తః.

అని శంకరుండు చెప్పుచున్నాఁడు. దేహాది భావమును పరిమార్చి, ఆత్మను సాక్షాత్కరించి, ఆత్మలో ఆత్మగా రమించునట్టి వానికి విశ్వమంతకును సారభౌమత్వము చేకూరగలదు.

(I am the monarch of all I survey, My right there is none to dispute.)

నేను చూచుదానికంతకును నేనే చక్రవర్తిని. నా హుకుం ఎవ్వరును నిరసింప లేరని ఆత్మసాక్షాత్కారముగల ధీరుఁడే వచింప గలఁడు. అట్టి సార్వభౌమత్వమే మానవుని జన్మహక్కు. ఇట్టి పరమోత్కృష్టమైన పదవిని పొంది ఆనందింతము. రండు! (If man be a man, he must rule the Empire of Himself) మానవుడు మానవుముగా శోభిల్ల వలెనన్న ఆత్మసామ్రాజ్యమును పరిపాలింపవలె, అని (Shelly) మహాకవి వర్ణించియున్నాఁడు.

ఈ విశ్వమంతటను ఒక మహాశక్తి గాప్పించుచున్నది. ఆశక్తియే పిపీలికాది బ్రహ్మపర్యంతరము వ్యాపించియున్నది; యీ శక్తిచేతనే చెట్లు చిగుర్చుచున్నవి; పుష్పములు వికసించుచున్నవి; యీశక్తిచేతనే సూర్యుడు ప్రకాశించుచున్నాఁడు; చంద్రుడు చల్లని కాంతుల నిచ్చుచున్నాఁడు; ఆశక్తిచేతనే గ్రహములు సంచారము చేయుచున్నవి; గగనమండలమున నక్షత్రములు ప్రకాశించుచున్నవి; ఆశక్తిచేతనే వాయువు వీచుచున్నది; అగ్ని కాల్చుచున్నది; అగ్ని కాల్చుచున్నది; చెవులు వినుచున్నవి; నాసికములు వాసన చూచుచున్నవి; ఆశక్తి చేతనే జఠరాగ్ని మనము తినుచున్న ఆహారము పచనముచేయుచున్నది; ఆశక్తినే ప్రాణమునకు ప్రాణము, ఆశక్తియే నేత్రముల ద్వారా చూచుచున్నది; ఆశక్తియే మనస్సునకు మనస్సు; బుద్ధికి బుద్ధి; ఆశక్తియే విలక్షణమైన శక్తి; అంతయు నిండి నిబిడీకృతమైన శక్తి యీశక్తియే; ఇదియే చైతన్యశక్తి; యీశక్తిచేతనే విశ్వమంతయు కదలు

చున్నది; యీశక్తియే అంతఃకరణ చతుష్టయమున ప్రతిఫలించినదై ప్రకాశించుచున్నది. ఈదేహమంతయు వ్యాపించి కూటస్థ చైతన్యమై నదీ; యీశక్తియే పిండమున ఆత్మ, బ్రహ్మాండమున విశ్వాత్మ; యీ శక్తిలేక విశ్వమునందు యేపనియు జరుగదు; విద్యుల్లతయందు ప్రకాశించు శక్తి యిదియే; ఈశక్తియే అన్నిశక్తులకు శక్తి; అన్నిశక్తులు ఆ మహాశక్తి ననుసరించియే పనిచేయును. ఆశక్తిలేక గాలి వీచదు; అగ్ని దహనము చేయలేదు; సూర్యుడు ప్రకాశింపలేడు; కొంతవఱకు కేనో పనిషత్తు యీవిషయమునే స్పష్టీకరించి యున్నది. ఈశక్తియే ప్రజ్ఞాశక్తి; ఆప్రజ్ఞయే బ్రహ్మ; ఆప్రజ్ఞయే నీవు, ఆప్రజ్ఞను నీవు నీయందుంచుకొని, శక్తివిహీనునివలె యేల విచారపడెదవు? ఏల క్షోభ: జెందెదవు. ఆశక్తి నీశక్తియని తెలుసుకున్నప్పుడు, నీకు విచారములేదు: నీకు లంపటలేదు; ఆశక్తి చావదు; నశించుట అనునది లేనేలేదు.

నీవు ఆత్మస్వరూపుడవు. ఆత్మ నిత్యము, అమృతస్వరూపము, ఆనందము. అట్టి ఆత్మస్వరూపుడవై, చచ్చెదవని యేల భ్రమజెందెదవు? పాంచభౌతిక దేహముఁగూడ నశించదు; అది పరిణామమును మాత్ర మేఁజెందును. ఒకమనుజుడు మృతినొందినాడనుకొనుము. అతని శరీరమును పాతిఁబెట్టగా, క్రుళ్ళి, పురుగులు బయలు వెడలును; అనగా శరీరము పురుగులుగ పరిణామము నొందినది; రూపభేదము నొందినది; అచ్చట నొకగులాబి అంటు పెట్టినయెడల పుష్పించి శోభిల్లుచున్నది; దేహమందలి పదార్థము మట్టిలోఁగలసి గులాబిపుష్పముగ పరిణామముఁ జెందినది. భూతసృష్టియే నశించనపుడు, ఆత్మ నశించునా? మహాసముద్రముపైన ప్రతినిమిషము తరంగములు లేచిపడుచుండును. అన్ని అలలయందు క్షీరోదకమే; యీఅలలు రూపభేదమును పొంది, సముద్రములో లయమై, మరల రూపముల పొందుచుండును. సువర్ణము అనేక రూపాంతరములఁ జెంది భూషణములుగ ప్రకాశించుచున్నది. తుదకు సొమ్ములన్నియు బంగారులో లయమై, రూపముల గోల్పోవును. ఇటులనే, ప్రకృతిఁగూడ రూపాంతరముల నొందుచున్నది. ఒక రూపము మారినప్పుడు, చావు అందుము; కాని ఆత్మ అవినాశి; ఆత్మకు చావుపుట్టుకలు లేవు. అట్టి ఆత్మయే నీవని తెలుసుకొని శాశ్వ

తానందము పొందుము; ఆత్మసాక్షాత్కారముచేతగాని ఆత్మానందము లేదు. అజ్ఞానముచే నావరింపబడిన నీవు యీఅజ్ఞానాంధకారమును పోగొట్టుకొనుటకు, ఆత్మజ్యోతిని ప్రకాశింపఁజేయవలె; ఆ ఆత్మజ్యోతి నీయందేయున్నది. చీకటి, చీకటి అనినంతమాత్రమున, చీకటి పోదు; జ్యోతి వెలిగించినప్పుడే చీకటి మాయమగుచున్నది. నీయందలి నీచే వచ్చినచీకటిని, నీచేత నీలో ప్రకాశింప జేయబడిన 'నీవు' జ్యోతి మాత్రమే లయింపగలదు; నిన్ను నీవు సాక్షాత్కరించి, నీవు ధన్యుడవు కావలె. అప్పుడజ్ఞానము పటాపంచలగును. జ్ఞానభాస్కరుడు ప్రకాశించిన అజ్ఞానము ఉండగలదా? అంధతమస్సులు పటాపంచలై ఆత్మ సామ్రాజ్యము ప్రకాశించు. 'కింజ్యోతి స్తవ భానుమే....'నీకు పగలు వెల్తురు నిచ్చునదేది? సూర్యుడు. రాత్రి వెల్తురిచ్చునదియేది? చంద్రుడు. చంద్రుడు లేనప్పుడు నక్షత్రములు నక్షత్రములు లేనప్పుడు దీపకళిక. నీవు కండ్లు మూసుకున్నప్పుడు నీకు వెల్తురు నిచ్చునదేది? నీయందుప్రకాశించు నీ ఆత్మ నీఆత్మను సాక్షాత్కరించి కృతార్థుడవు గమ్ము" అని శంకరాచార్యులు కాశీలో నొక కుష్ఠురోగికి ఏకశ్లోకియందు ఉపదేశించియున్నాడు. మణికంఠహారము మెడయందు మెఱయుచుండ, దానికొఱకు విశ్వమంతటను వెదకుట వెఱ్ఱితనము; నీ కంకణము నీ చేతియందు మెఱయుచుండ దాని నెచ్చట వెదకెదవు?

అస్మద్దేశీయులారా! మీఅజ్ఞాన నిద్రనుండి లెండు; అరుణోదయ కాంతులనుగాంచుడు; ప్రచండజ్ఞానభాస్కరుని మీలో ఉదయింప జేసికొనుడు, సత్వరజస్తమో గుణాత్మకమైన దేహమునందు ఆత్మనుగాంచుడు; దేహాత్మభ్రాంతిని విసర్జించుడు; సుఖదుఃఖములచే బాధింపబడక స్వస్వరూప సంధానముచేయుడు. నీయందు నివురుకప్పిన నిప్పువలె యున్న యీ ఆత్మజ్యోతిని రగుల్కొల్పి, దేహభ్రాంతికి చిచ్చుపెట్టుడు; ఆచిచ్చు నామరూపాత్మక జగత్తంతయు వ్యాపించి దగ్ధము చేయగలదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతయు బ్రహ్మమేనని తెలుసుకొనగలవు. అప్పుడంతయు సర్వమున్నదని దివ్యకళామయమంచు ఆనందింపగలవు. అప్పుడే డాంటీ (Dante) మహాకవి గానముచేసిన (Cosmic Dance of

# యథార్థభారతి

సంపుటము 13. | ప్రమాది సం॥రం కార్తీకమాసం నవంబరునెల 1939. | సంచిక 9.

భక్తియోగః

ఓం

జ్ఞానయోగః

(పత్రిక విలాసము:—శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

సర్వభూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి;

యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.

Published by:— K. Venkatachalam Naidu, Tapovanam, Chittoor.

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామము.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత, నూతలపాటి నాగప్పనాయుడుగారు, యేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కఠారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, ఆడ్డా."

5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్‌పూర్.

# యథార్థభారతి

| సంపుటం 13 | ప్రమాది సంవత్సరం | చందా |
|---|---|---|
| సంచిక 9 | కార్తీక మాసం | సం॥రం రు 2-4-0 |
| | 1939 సం॥రం నవంబరు నెల | విడిపత్రిక రు 0-4-0 |

ఓం

## బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి.

27. మనోవ్యాపారాభావసమయే యత్సుఖం భాసతే తత్సుఖమాత్మస్వరూపమిత్యాత్మనిశ్చయః సమ్యగ్భూయాత్.

తా॥ మనోవ్యాపారము లేని సమయమునందు ఏ సుఖము గోచరించునో, ఆ సుఖము ఆత్మస్వరూపమనెడి ఆత్మనిశ్చయము లెస్సగా కలుగును గాక!

28. స్వస్వప్నః స్వాతిరేకేణ యథా నాస్తి తథైవ జాగ్రదపి స్వాతిరేకేణ నాస్తీత్యద్వితీయాత్మానుభవః సమ్యగ్భూయాత్.

తా॥ తన స్వప్నము తనకు వేఱుగా నెట్లులేదో, అట్లే జాగ్రమును తనకు వేఱుగా లేదనెడి అద్వితీయాత్మానుభవము చక్కఁగా గల్గునుగాక!

---

## మనస్తత్వము.

(నివృత్తి మార్గము)

(శ్రీ మలయాళ స్వాములవారు)

(289-వ పుట శేషము).

ఎవని మనస్సు విషయాసక్తి లేనిదై దుఃఖరహితమై యుండునో అట్టివానిచే జనులందఱును కతకరేణువు (చిల్లగింజ)చే నీటివలె పరిశుద్ధత్వమును జెందుదురు.

ఆపిశీతరుచావర్కే- సుతప్తేపీందుమండలే
అప్యధః ప్రసరత్యగ్నౌ విస్మయోఽస్య నజాయతే.

సూర్యుడు చల్లబడినను, చంద్రుడుష్ణత్వముఁ జెందినను, అగ్ని అధోముఖముగ జ్వలించినను, ఆత్మజ్ఞాని కేమియు నాశ్చర్యము గలుగదు.

సత్తాలయం యాతి యత్ర నిర్వికారం చ తిష్ఠతి
భూయో నావర్తతే దుఃఖే తత్ర లబ్ధపదః పుమాన్.

ధర్మి, ధర్మముల విభాగమేమియు లేని నిర్వికారపదమునందు స్థితిఁ జెందినవాఁడిక దుఃఖభూయిష్టమగు యీసంసారమున తగుల్కొనఁడు. మోక్షమను పురుషార్థసాధనమున సమర్థుడగుటచే అట్టివాడే పురుషుడనఁబడును.

తద్ధేతు స్సర్వహేతూనాం తస్య హేతుర్నవిద్యతే
సంసారః సర్వసారాణాం తస్మాత్సారం న విద్యతే.

నిర్వికారమగు బ్రహ్మమే సర్వకారణములకును కారణము. దానికి మఱియొక కారణము లేదు. అదియే సారవస్తువులన్నింటిలోను సారమైనది. కాన యద్దానికి మించిన సారవస్తువు మఱొకటి లేదు.

యస్యాజ్ఞానాత్మనో జ్ఞస్య దేహ ఏవాత్మభావనా
ఉదితేతిరు షైవాక్షరిపవోభిభవంతి తమ్.

దేహమందాత్మాభిమానముగల్గి ఇంద్రియముల వశమొనర్పకయుండు అజ్ఞానిని ఇంద్రియములను శత్రువులు అతిక్రోధముతో యెదిర్చి బాధింతురు.

యస్య జ్ఞానాత్మనో జ్ఞస్య సత్యేవాత్మని సంస్థితిః
సంతు ష్టైవాక్ష సుహృదో నఘ్నంతి తమనిందితమ్.

పవిత్రాచరణ గల్గి సత్యస్వరూపమగు ఆత్మయందు నిలుకడబొందినట్టి జ్ఞానిని ఇంద్రియములు మిత్రునివలె సంతోషముతో నాదరించును. అయ్యవి వానినేమియు బాధింపక అనుకూలాచరణచే వానికి జ్ఞానాభివృద్ధి గలుగజేయును.

అకర్తృత్వాదభోక్తృత్వమభోక్తృత్వాత్సమైకతా
సమైకత్వాదనంతత్వం తత్తో బ్రహ్మత్వమాతతమ్.

అక ర్తయగుటచే మనుజుఁడభో క్తయునగును. అభో క్తయగుటచే సమత్వము సిద్ధించును. సమత్వముచే యేకత్వమున్ను, ఏకత్వముచే అనంతత్వమున్ను సిద్ధించును. ఆపిదప వ్యాపకమగు పరబ్రహ్మరూపత్వముసంప్రాప్తమగును.

మౌర్ఖ్య మోహ సముత్థానాత్వనాత్మన్యాత్మభావనా
ఆత్మజ్ఞానాన్మహాబోధాద్విలయం యాతి వాసనా.

తత్వజ్ఞానాభావమను మౌర్ఖ్యముచే నుత్పన్నమైన దేహాదులందాత్మాభిమానమను వాసన ఆత్మజ్ఞానమను యుత్తమ బోధచే నశించును.

యోనసిర్వాసనో నూనం సర్వధర్మపరోపిసః
సర్వజ్ఞోప్యభితో బద్ధః పంజరస్థో యథాఖగః.

సమస్త ధర్మముల నెఱింగినను, సర్వజ్ఞుడైనను, వాసనలఁ ద్యజింపనిచో, పంజరమందలి పక్షివలె యాతడు బద్ధుడే యగును.

సర్వత్ర విద్యమానాపి దేహేషు తరలాయతే
సర్వగోప్యాతపః సౌరో భిత్త్యా దౌ వైవిజృంభతే.

సూర్యప్రకాశము, దర్పణ భిత్త్యాదులందతిశయముగ భాసించునట్లు, సర్వత్ర వ్యాప్తమైయున్నను చైతన్యము శుద్ధబుద్ధియందే యధికముగ ప్రకాశించును.

సాధూనాం సమదృష్టీనాం పరిప్రశ్నేన సేవయా
సంగమేనచ సాయుక్తిర్లభ్యతే ముచ్యతే యయా.

సమదృష్టిగల సాధువుల సేవించుటచేతను, వారి సంసర్గముచేతను, భక్తియుతముగ వారలఁబ్రశ్నించుటచేతను జ్ఞానరూపమగు యుక్తిలభింప యద్దానిచే జీవుడు ముక్తినొందును.

బుద్ధిర్మహదహంకారః ప్రాణాశ్చేత్యాదిభిర్మనే
క్రియానురూపైరభిధా వ్యాపారైఃశాంతముచ్యతే.

చిత్తమే క్రియాభేదము ననుసరించి అంతఃకరణము, బుద్ధి, మహత్తత్వము, అహంకారము, ప్రాణము, జీవాత్మ మున్నగు నామంబులచే జెప్పబడుచున్నది.

యథా స్వయం భూఃసంకల్పః స్వయంనామ తథైవహి
ఏతౌ స్వవేదనాయత్తౌ బంధ మోక్షౌ వ్యవస్థితౌ.

సమష్ట్యహంకారరూపుడగు బ్రహ్మవలెనే వ్యష్ట్యహంకార రూపుడగు జీవుడును సంకల్పమాత్రుడే యగును. సంకల్పముచే బంధమును, సంకల్పత్యాగముచే మోక్షమును నిశ్చయముగ సిద్ధించును.

గమ్యదేశైకనిష్ఠస్య యథా పాంథస్య పాదయోః
స్పందోవిగతసంకల్ప స్తథా స్పందః స్వకర్మసు.

స్వగృహాభిముఖుడై జను పథికుని పాదములు నిరంతరము చలించుచున్నను, వానికాచలనమును గూర్చిన సంకల్పముండనట్లు, సంకల్పరహితుడైనను యోగి శాస్త్రోచితములగు అనిషిద్ధకార్యములం బ్రవృత్తిగలిగి యుండును.

దర్శనాత్స్పర్శనాచ్ఛబ్దాత్కృపయా శిష్యదేహకే
జనయేద్యః సమావేశం శాంభవం సహి దేశికః.

దర్శన, స్పర్శనోపదేశాదులచే శిష్యునియందు శివస్వరూపుడగు పరమాత్మయొక్క సన్నివేశము గల్గించగల్గునాతడే గురువనఁదగును.

స్వభావం సంవిజిత్యాదావింద్రియాణాం సచేతసామ్
ప్రవర్తతే వివేకే యః సర్వాం తస్యాశు సిద్ధ్యతి.

విషయములపై పునరు పరుగిడు మనస్సుయొక్కయు, సర్వేంద్రియములయొక్కయు దుస్స్వభావమును జయించి అధ్యాత్మశాస్త్రములందు ప్రవృత్తిగల్గియుండువానికంతయును సత్వరము సిద్ధించును.

స్వభావమాత్రం యేనాంతర్న జితం దగ్ధబుద్ధినా
తస్యోత్తమ పదప్రాప్తిః సికతా తైలదుర్లభా.

తన దుస్స్వభావమును మొట్టమొదట జయించని మూఢునకు ఇసుకయందు తైలమువలె ఆత్మపదప్రాప్తి దుర్లభమైనది.

శుద్ధేఽల్పోప్యుపదేశోహి నిర్మలే తైలబిందువత్
లగత్యుత్తానచిత్తేషు నాదర్శఇవమౌక్తికమ్.

స్వల్పోపదేశమైనను నిర్మలచిత్తునియందు, శుభ్రవస్త్రముపై తైలబిందువువలె వెంటనే ప్రవేశించును. అద్దముయొక్క వెనుకభాగమున ముత్యములైనను ప్రతిబింబించనట్లు సాధనచతుష్టయసంపత్తి లేనివారల శూన్యచిత్తములందట్టి యుపదేశము ప్రవేశింపదు.

సుసాధ్యః కరటోద్భేదో మత్తైరావత దంతినః
నోత్పథ ప్రతిపన్నానాం స్వేంద్రియాణాం వినిగ్రహః.

మదించిన ఐరావతమను యేనుగయొక్క గండస్థలమును చీల్చు టయు సులభమే కాని చెడు మార్గమందు ప్రవృత్తి గల్గియుండు యింద్రియముల నిగ్రహించుట సులభము కాదు.

యథాక్షి సంవృతిః సర్వరూపాలోకశ మోరిహన్
సంవిత్సంవరణం నామ సర్వదృశ్య శమ స్తథా.

కామాది శత్రువుల నశింపచేయు నో బ్రాహ్మణోత్తమా! కనుమూసినతోడనే రూపజ్ఞానమంతయు శమించునట్లు, బహిర్ముఖ చిత్తము నంతర్ముఖముగా జేసి ఆత్మాభిముఖ మొనర్చుటచే దృశ్యమం తయు శమించును. (మంకియను బ్రాహ్మణునకు శ్రీ వసిష్ఠమునీం ద్రులుపదేశించినది.)

అపేక్షైవ ఘనో బంధ ఉపేక్షైవ విముక్తతా
సర్వ శబ్దాన్వితా తస్యాం విశ్రాంతేన కిమీహ్యతే.

దృశ్యవిషయముల నపేక్షించుటయే బంధము. ఉపేక్షించుట యే ముక్తి. పూర్ణకాముడును, ఆత్మయందు విశ్రాంతిని బడసినవాడును నగు జ్ఞాని యిక దేనిని వాంఛించును?

యావన్నాధిగతం బ్రహ్మ న విశ్రాంతం పదే పదే
తావత్తన్మనన త్వేన న ధ్యానమవగమ్యతే.

బ్రహ్మము నెఱుంగనంతవఱకును, ఆత్మపదమందు విశ్రాంతిని బొందనంతవఱకును, విషయచింతన యున్నంతవఱకును జీవునకాత్మ ధ్యానమందు నిలుకడ కలుగదు.

తావద్విషయవైరస్యం భావయన్త్యుచితాశయాః
న పశ్యంత్యేవ తాన్యాయ వద్భోగాంశ్చిత్రితానయథా.

భోగము లెదుటనున్నను చిత్రిమందలి మనుజునకు వాటియందే యపేక్షయు నుండదు. అట్టి వికారరహితమగు స్థితికలుగువఱకు యోగులు విషయవైరాగ్య మభ్యసించుచునే యుందురు.

క్వకిల స్వాత్మ విశ్రాంతిః క్వైతద్విషయసేవనమ్
సుషుప్త జాగ్రతోరైక్యం భ్రాంతాభ్రాంతాత్మనోభవేత్.

ఆత్మసుఖమందలి విశ్రాంతి యెచట! విషయ సుఖమెచట! తత్వజ్ఞానికిని విషయములందు ప్రీతియుండుచో నిక జాగత్సుషుప్తులున్న జ్ఞానియు నజ్ఞానియు ఒకేవిధమున యుండవలసి వచ్చును. (అనగా నట్లెన్నటికిని సంభవింపదనుట.)

అజ్ఞోపి తజ్ఞతామేతి శనైః శైలోపి చూర్ణ్యతే
బాణోప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాస విజృంభణమ్.

ఓ రామచంద్రా! అభ్యాస ప్రభావమెట్టిదో చూడుము! దీనిచే నజ్ఞానియు క్రమముగ జ్ఞాని యగుచున్నాడు. పర్వతములు చూర్ణమొనర్పబడుచున్నవి. జడమగు బాణమున్ను అతి సూక్ష్మమగు లక్ష్యమును జేరుచున్నది.

స్వసంవిద్యత్నసంరోధా ద్యథా చేతః ప్రశామ్యతి
న తథాంగ తపస్తీర్థ విద్యా యజ్ఞ క్రియాగణైః.

బాహ్యవిషయాకార చిత్తవృత్తి నిరోధముచే చిత్తము శమించునటుల తపస్తీర్థవిద్యా యజ్ఞాది క్రియలచే శమింపనేరదు.

నిర్వాణాయ వితృష్ణాయ స్వచ్ఛశీతల సంవిదే
స్పృహయంతి సదా సత్తాం బ్రహ్మవిష్ణు హరా అపి.

తృష్ణారహితమును, నిర్మలమును, శాంతిస్వరూపమును పరమప్రేమాస్పదమును, బోధరూపమునునగు ఆత్మసత్తను బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులుకూడ నిరంతర మభివాంఛింతురు.

సహస్రేభ్యః సహస్రేభ్యః కశ్చిదుత్థాయ వీర్యవాన్
భినత్తి వాసనాజాలం పంజరం కేసరీయథా.

ప్రయత్న మొనర్చునట్టి లక్షలమంది జనులలో ధీరుడగు యోగి నొకడు మాత్రమే, పంజరమును సింహము ఛేదించునట్లు వాసనాజాలమును ఛేదించివైచును.

జ్ఞాతజ్ఞేయ స్త్వసంకల్పః సంకల్పాతిశయాశయః
అవాసననో వ్యవహృతౌ వాతవత్స్పందతేనవా.

జ్ఞాత జ్ఞేయుడు (ఎఱుంగదగిన ఆత్మవస్తువు నెఱింగినవాడు)ను, సంకల్పరహితుడును, వాసనావివర్జితుడునునగు జీవన్ముక్తుడు ప్రపంచ

వ్యవహారములందు, వాయుస్పందమువలె వర్తించును, వర్తింపకయు నుండును.

ఆకల్ప సిద్ధసంఘేషు మోక్షోపాయాః సహస్రశః
వ్యాఖ్యాతాశ్చ శ్రుతాశ్చాల మీదృశాస్తు న కేచన.

(శ్రీ వసిష్ఠ మునీంద్రుల యుపదేశమునుగూర్చి సిద్ధులు బల్కినది)

కల్పారంభమునుండి మోక్షోపాయమును గూర్చిన వేల కొలది గ్రంథముల వినియున్నాము. మఱియు స్వయముగ వాటికి వ్యాఖ్య యొనర్చియున్నాము. కాని యిట్టి దివ్యోపదేశము నెపుడును కనివినియుండ లేదు.'

సత్యవిషయమును గూర్చి యెంతకెంతకు అంతరాత్మలో విమర్శ తీవ్రావస్థను పొందుచుండునో అంతకంతకు జీవుడు ప్రకృతికి దూరుడై ఈశ్వర సమీపమునకు అనగా ఈశ్వరాత్మస్థితికి చేరుచుండునని యే తలంచవలెను. దీనివలన తాను పరిశుద్ధుడగుచున్నాడా, లేదాయను తత్వమును సాధకుడు తెలిసికొనవచ్చును. నడచునప్పుడు తన యొక్క నీడను నిలబెట్టి నడువశక్తిగలవారుండినచో, వారిని మాత్రమే కర్మముగాని సంకల్పముగాని బాధింపదు. ఎవరు నడచునప్పుడు వారి నీడకూడ వారిని వెంబడించి వచ్చుచుండునో అట్టివారు తమ సంకల్పములకు, కర్మలకు సంబంధించిన ఫలము అనుభవించియే తీరవలెను. ఇదే పరిశుద్ధమగు వేదాంతవాక్యము మనకుపదేశించినది. అయితే యిచ్చట యొదు ముముక్షువులకొక సందేహము జనించవచ్చును. ప్రపంచములో గొప్పబ్రహ్మనిష్ఠులు, ఆత్మసాక్షాత్కారజ్ఞాన సంపన్నులు ఉండిరి; ఉండియున్నారు; వీరు సంచరించునపుడు ఛాయలేకపోయినదా? నీడ వెంటనే అనుగమింపకపోయినదా, యని తలంపనక్కరలేదు. బ్రహ్మవేత్తలెవరు యుండిరో, యుండియున్నారో, వారందఱును శ్రుతివాక్యమననుసరించి, పరిశుద్ధాచరణగలవారై, దృశ్యాది సంకల్పరహితులై, శుద్ధాత్మ బోధకులైయేయున్నారు. ఇంతవఱకాలాగుననే యుండిరి. దానికనుగుణ్యమగు ప్రశాంతమును, నిర్మలజ్ఞానసుఖమునే వారనుభవించిరి. అనుభవించుచునే యున్నారు. హేయవిషయములుగల జానికి విషయములతోను, సంకల్పముతోను, మనస్సుతోను,

సంబధము లేదని చెప్పెడు వాక్యమునకే శుష్కవేదాంతమని పేరు. ఆలాగునచేయుట పాతకము. శ్రీ శంకరులు, శ్రీ బుద్ధదేవుడు, శ్రీ కృష్ణచైతన్యులు, శ్రీ గురునానక్ మొదలగు ఉదారచరితులందు యిష్టుడుండేవారు చెప్పులాగున ఏదేనిదోషము కనుపించునా? దోషములెవ్వో జ్ఞానికిగాని యోగికిగాని పరమభక్తునకుగాని సంబంధము లేదని ఆ మహా పురుషులెచ్చటైనను చెప్పియున్నారా? విషయములు, వృత్తులు గల్గియుండువఱకును ప్రకృతిదోషము సంపూర్ణముగా నశింపలేదనియే ప్రతి సాధువును తలంచవలసియున్నది. ఈ విషయమై యింతవఱకనేక సార్లు చెప్పియుండుటచే, మఱలమఱల దానినే చెప్పుట బాగుగలేదని తలంచి అమృతబిందూపనిషద్వాక్యము నిచట నిరూపించి విషయమును ఉపసంహారింప తలంపుగల్గుచున్నది. ఇపుడు సామాన్యముగ వేదాంతములో ప్రవేశించిన వారందఱును యీక్రిందివాక్యమును చెప్పుచుందురు. ఇది శ్రుతివాక్యమనుట సత్యమే. అయితే ఆ శ్లోకమును పూర్తిగ వారు చదివినచో ఇట్టి ప్రమాదమునకవకాశము గలుగదు. పూర్వార్ధమును గ్రహించి, ఉత్తరార్ధమును విడిచిన కారణముచేతనే మోహములో పడుటకు కారణమైనది. ఇదెటువంటిదనగా, న్యాయాధిపతి వాదిప్రతివాదులను విచారింపక, వాదియొక్క వాక్యములనుమాత్రమునమ్మి కార్యమును తీర్మానముచేసినట్లగును. అదెంతవిచారణాన్యమో, ధర్మవిరుద్ధమో, న్యాయదూరమో, యోచించుకొనదగును. వారుచెప్పెడి శ్రుతివాక్యమిది:—

(ఈపవిత్రవాక్యము ఉపనిషత్తులలోను, యోగవాసిష్ఠాదిలో కొన్నతగ్రంథములలోను గన్పించుచున్నది)

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

దీనితాత్పర్యమేమన, మనుష్యులయొక్క బంధమునకును, మోక్షమునకును కారణము మనస్సేయగుచున్నది. ఉత్తరార్ధమువినుడు.

"బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్".

ఏది బంధమునకును మోక్షమునకును కారణమగుచున్నదో, దానిని యీ రెండవపాదము నిరూపించుచున్నది. విషయములందాసక్తిగల మనస్సు బంధమును గలుగజేయుచున్నది. విషయములందాసక్తి నశించిన

మనస్సు మోక్షముకొఱకే యగుచున్నది. ఈ పరమసత్యమును గ్రహింపకపోవుటయే అనర్థములన్నిటికిని కారణమైనది. ఈ ఒక్కశ్లోకమును ముముక్షువులు సదా జ్ఞాపకములోనుంచుకొని వర్తించిన నిజమైన సత్యమును తెలియంగగలరు.

యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే
అతో నిర్విషయం నిత్యం మనః కార్యంముముక్షుణా.

ఏకారణముచేత విషయాసక్తముకాని మనస్సునకు మోక్షము చెప్పబడియున్నదో, ఆ కారణముచే ముముక్షువుచేత సదా మనస్సు విషయరాహిత్యమైనదిగాఁ జేయదగినది.

నిరస్త విషయాసఙ్గం సంనిరుద్ధం మనోహృది
యదాయాత్యాత్మనోభావం తదా తత్పరమం పదమ్.

ఎప్పుడు విషయములందలి యాసక్తిని విసర్జించిన వెంటనే హృదయమందు చక్కగా నిరోధింపబడిన మనస్సు సదా ఆత్మ స్వరూపమును పొందినదగుచున్నచో, అప్పుడదియే ఉత్తమ పద మనబడును.

తావదేవ నిరోద్ధవ్యం యావద్హృతిగతం క్షయమ్
ఏతజ్జ్ఞానం చ ధ్యానంచ శేషోన్యాయశ్చ విస్తరః.

హృదయమందున్న దృశ్యవాసనా సంబంధములగు సంకల్పములు క్షయమగునంతవఱకును ధ్యానయోగాద్యనుష్ఠానములు చేయుచుండవలెను. ఇదే జ్ఞానము, ఇదే ధ్యానము అనగా యోగము. ఇక విస్తారముగ గ్రంథములలో కన్పించెడు వాక్యములన్నియు వీనిని గూర్చియేగాని, నూతనముగా గ్రహింపదగిన దేదియును అందులేదు.

ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచన్ద్రవత్.

'సర్వభూతములకు ఆత్మయైన భగవంతు డొక్కడే అయినను, అంతఃకరణోపాధి ననుసరించి అనేకములుగ నున్నట్లు కన్పించుచుండును. ఎట్లన ఆకాశమందుండు చందుౄడొక్కడైనను, జలోపాధులచే భిన్నభిన్నములుగ గోచరించుచుండును. ఇదే భేదమునకు కారణము. ఇట్టి ఆత్మస్వరూపము ... సాధనము డెట్లుండ

వలెనో ఆ విషయము ముండకోపనిషత్తు విస్తారముగ ఉపదేశించు చున్నది.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.

ఈ ఆత్మస్వరూపము వేదశాస్త్రాదులను కడవఱకు చదువుట చేతగాని, వేదార్థములను చక్కగ వివరించి చెప్పెడు శక్తి కలిగి యుండుటచేగాని, పఠించిన శాస్త్రములను మఱువక ధారణచేసెడి బుద్ధివిశేష శక్తివలనగాని, అనేక శాస్త్రములను అనేకులవద్ద శ్రవణము చేయుటచేతగాని, లభించునది కాదు. అనగా పైఁజెప్పిన సమర్థత గల్గియున్నను, అంతఃకరణశుద్ధిగల్గి, తీవ్రవైరాగ్యమవలంబించి, నిరంతర ఈశ్వరచింతన చేయనివారలకు లభించునదిగాదు. (సశేషము)

---

# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

(శ్రీ శ్రీకంఠశివాచార్యులవారి గీతాభాష్య గ్రంథమునుండి)

(షోడశాధ్యాయము)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె:—

లక్ష్మీ! మహారాష్ట్రదేశమందు ఖడ్గబహాదురుడను రాజు రాజ్యము చేయుచుండెను. ఒక రోజున వాని ఏనుగుల మహలునుంచి ఒక మదించిన ఏనుగు చెదరి పారిపోవుచుండెను. అప్పుడు మావటివాండ్లు దానిని పట్టుకొనుటకు ప్రయత్నించిరి. కాని అది మఱింత చెదరి చిందర వందరగా పరుగులెత్తుచుండెను. అంత నానగరిజనులు తమ పిల్లల కాపాడుకొనుటకు చింతించుచుండిరి. ఆసమయముననే ఒక బ్రాహ్మణుడు స్నానమాచరించి గీతాపారాయణ చేసికొనుచు బోవుచుండెను. జనులు వానిని జూచి ఈ మార్గమున బోవలదనియు, యేనుగువల్ల నపాయము గలుగుననియు చెప్పిరి. వారి మాటలు పెడచెవిని బెట్టి ఆతడు గీతాధ్యాయము చదువుచు బోవుచుండెను. అంతన్నాబ్రాహ్మ

ణుడు ఆ యేనుగు దగ్గరనుంచి తన యింటికి బోయెను. కాని యేనుగేమియు నతనిని చేయజాలదయ్యెను. ఏనుగు యొక్క ఈ వింతను జూచి జనులు ఖడ్గబహాదురునితో జెప్పిరి. రాజు వారి మాటలాలించి పండితులందరును నుండగా ఆ బ్రాహ్మణుని పిలిపించినిట్లడిగెను. ఓ విప్రుడా! మీదగ్గర మంత్రసిద్ధిగాని లేక యేదైన మాయగాని యుండవచ్చును. కనుకనే ఏనుగు దగ్గరనుంచి వెళ్లినప్పటికి అది మిమ్ముల నేమియు చేయలేదనెను. అప్పుడు బ్రాహ్మణుడు రాజునుజూచి యిట్లనెను. రాజా! నా దగ్గర మంత్రసిద్ధిగాని మాయగాని లేదు. నేను నిత్యము గీత 16-వ అధ్యాయమును పఠించుచుంటిననెను. అంతట రాజా బ్రాహ్మణునికి కొన్ని మోహరీల నిచ్చియింటికి పంపివేసెను. తరువాత రాజున్ను ఒక బ్రాహ్మణునివల్ల గీత 16-వ అధ్యాయము నుపదేశమునొంది నిత్యము పఠించుచుండెను. ఒకనాడా రాజు వేటకు బోగా యింటిదగ్గర నా యేనుగు మరల యల్లరిచేయ నారంభించెను. మంత్రులును ప్రజలును భయపడి యీవార్త రాజునకు దెలిపిరి. అప్పుడు రాజు స్వయముగా వచ్చి యేనుగను పట్టుకొనెను. కాని అదియేమియును చేయలేదు. అంత దానిని మావటివాళ్లకు వప్పగించి తన రాజ్యమందు తన కుమారునకు పట్టాభిషేకము చేసి తాను అరణ్యమునకు బోయి గీత 16-వ అధ్యాయమును పఠించుచు అంత్యమందు అక్షయలోకమున కేగెను.

---

(శ్రీ భగవద్గీత)

# 14. గుణత్రయ విభాగయోగము.

(శ్రీ మలయాళస్వాములవారు)

మూడు గుణములచే జీవుడెట్లు బద్ధుడగునో ఆ విషయమును గూర్చి చెప్పిన దగుటచే యీ అధ్యాయమునకు గుణత్రయ విభాగ యోగమని పేరువచ్చినది. గీతయందింత ప్రాముఖ్యతగల అధ్యాయము మఱియొకటిలేదు. ఇది జ్ఞానయోగమున చేరినది. చాల మేధాసంపత్తి

గలవారికి మాత్రమే యిది అర్థమగును. చిత్తశుద్ధియు, ఏకాగ్రతయు గలవారలకు, విద్యలేనప్పటికిని యిది అర్థము కాగల్గును. మహాపండితు లైనను అంతఃకరణశుద్ధియు, చిత్తైకాగ్రతయు, సంయమమున్ను లేనిచో యిది అర్థముకాదు. నేత్రముగలవారు విద్యలేనివారైనను యేలాగున సూర్యుని జూడగల్గుదురో, నేత్రహీనులైనవారు యెంత శాస్త్రపాండిత్యము గల్గినవారైనను యేలాగున చూడజాలరో, బ్రహ్మ విద్యయొక్క రహస్యమున్ను యిట్టిదే. ఇది కఠినభాగమగుటచే మొదటి శ్లోకములో శ్రీ భగవానులు 'ఇది జ్ఞానములన్నిటిలోను ఉత్తమ జ్ఞానమనియు, ఋషులందఱును యిట్టి జ్ఞానము గలవారగుటచేతనే యీ జన్మములోనే ముక్తిని బొందిరని'యు చెప్పుటకు కారణము. ఈశ్వర స్వరూపమగు ఆత్మకు మాలిన్య మెవ్విధమున గలిగినది, దేనివలన ప్రకృతియందు బంధింపబడినది, మఱల యెట్లు యీ మాయామాలిన్యమునుండి తొలగును, ఏలాగున దానికి ప్రకృతి బంధమునుండి విముక్తి గల్గును, ప్రకృతిదోషము నశించి విముక్తి నొందిన జీవుడేలాగుననుండును, ప్రకృతిదోషము నశించుటకు ముఖ్యసాధనమేద్ధి, ఎవరెవరు ఏయే గుణములతోగూడియుండిరో యెట్లు తెలియును, ఏయే గుణముగల్గియుండునపుడు దేహమును వీడిన ఏయే లోకమును జెందును, మఱల అతనికి యే జన్మము గలుగును, జీవన్ముక్తుని లక్షణమెటువంటిది, మున్నగు విషయములన్నియు నిందు విశదముగా తెలుపబడినవి. స్వయముగ తెలిసికొనగ సమర్థతలేనివారు, గొప్ప మేధాసంపత్తి గలవారును, ఆత్మజ్ఞానులునునగు వారివద్ద యీ అధ్యాయమును తెలిసికొనుటయే మేలు. దీనియందు శుష్కవేదాంతమునకు తావు లేదు. ఏలన, గుణములు యింద్రియములకు స్వభావములనియు 'నీవు సాక్షిగా యున్నట్లు తలంచిన చాలున'నియు, అట్లైన యేకార్యము చేసినను బంధము లేదనియు చెప్పెడు వాక్య మసత్యప్రలాపమని యీ అధ్యాయము భేరీనాదమొనర్చి చెప్పుచున్నది. ఇది సత్యవేదముయొక్క నిజార్థము. గుణములు యింద్రియములకు స్వాభావికములు గావనియు అవి కర్మసంస్కారము ననుసరించి ఆగంతుకముగ వచ్చి చేరినవనియు, అట్టి దోషములు రహితములు కావలయుననియు శ్రీభగవానులుపదేశిం

చిరి. ఈ విషయము రెండవ అధ్యాయములో గల ---- "మాత్రా స్పర్శాస్తు కౌన్తేయ" అను శ్లోకమున వ్యక్తీకరింపబడినది. ఆగంతుక మనగా మధ్యవచ్చిచేరునది. ఎట్లన, వస్త్రముయొక్క నిజరూపము తెలుపైనను, రంగులచే అనేక వర్ణములుగ గన్పించును. అది అసలు వస్త్రముయొక్క స్వభావము కాదనియు, రంగులచే గలిగినదనియు యెట్లు గ్రహించుచున్నామో, ఆలాగున జీవునియొక్క స్థితిని గూర్చియు ముముక్షువులు తెలిసికొనవలెను. ఎటువంటి రంగువస్త్రమైనను ద్రావకములోవేసి, ఉడుకబెట్టి, ఉతికిన, రంగులన్నియు వదలిపోయి, తెలుపు వర్ణము తేలునట్లు, దైవచింతనలో మగ్నులై, ధ్యానములో మునిఁగి, భవదోషము గలుగనీయక చూడవలెనని యీ అధ్యాయ ముపదేశించుచున్నది. ఇందు మూఁడు గుణములు మాత్రమే చెప్పిరే గాని విశుద్ధగుణమును చెప్పలేదని కొందఱు తలంచవచ్చును. గుణ త్రయాతీతుని లక్షణము యీ అధ్యాయమున చెప్పియుండుటచే, అట్టి సందేహము కలుగుటకు అవకాశము లేదు. భగవద్భక్తి యను ద్రావకములో జీవుని శుద్ధమొనర్పవలెనని యీ అధ్యాయమున ఆఖరున భగవానులుపదేశించిరి. కావున నిర్మలమైన భక్తి యొక్క దానివల్లనే ప్రకృతిదోషములన్నియు తొలఁగి జీవకోట్లు భగవత్ప్రాప్తిని బడయ గలరు. కావున ముముక్షువులందఱున్ను, భక్తులందఱున్ను, తక్కిన వారందఱున్ను యీ ప్రకృతిగుణములలో యేవి తమయందు గలవో విచారించుచు, వానిని కనిపెట్టి, అట్టిదోషములు తమయందు లేకుండు నట్లు చూడవలెను. ఈ అధ్యాయమున యీ శ్లోకము ముఖ్యము.

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే. (14-20)

'దేహము కలుగుటకు కారణభూతమైన సత్వరజస్తమోగుణ ములను దేహి యెపుడతిక్రమించునో, అప్పుడతడు జన్మమృత్యుజరా దుఃఖములచే విడువఁబడి మోక్షము నొందును.'

ఓం తత్ సత్.

ఓం.

# సమత్వము.

## (శ్రీ యోగవాసిష్ఠమునుండి)

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సర్వసంపత్తి సుభగం సర్వ సౌభాగ్యవర్ధనమ్
సమతా సులతాయాస్తు ఫలం భవతి పావనమ్.

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామచంద్రా! సంపదలన్నింటిలో సుత్తమమును, సర్వసౌభాగ్యప్రవర్ధకమును నగు సమత్వమను లతయొక్క ఫలము (మైత్రి) మిగుల పావనమైనది.

సమతా సుభగేహానాం కుర్వతాంప్రకృతంక్రమమ్
సర్వైవ్ర్యేయం జగల్లక్ష్మీర్భృత్యతామేతి రాఘవ.

ఓ రామా! సమత్వముగల్గి, సర్వజీవులకు హితమొనర్చుచు, ప్రాప్తించిన కార్యముల జేయుచునుండు మహాత్ములకు ఈ జగదైశ్వర్యమంతయు దాసత్వముఁజెందును.

నతదాసాద్యతే రాజ్యాన్న కాంతాజన సంగమాత్
అనపాయి సుఖం సారం సమత్వాద్యదవాప్యతే.

సమత్వముచే యేనాశరహితమైన యుత్తమ సుఖము గల్గునో, అయ్యది రాజ్యప్రాప్తిచేగాని, స్త్రీసమాగమముచేగాని కలుగనేరదు.

ద్వంద్వోపశమ సీమాన్తం సంరంభజ్వరనాశనమ్
సర్వదుఃఖాతపాంభోదం సమత్వం విద్ధిరాఘవ.

ఓ రామా! సమత్వము ద్వంద్వముల శమింపజేయునదియు, చిన్తాజ్వరమును వినాశమొనర్చునదియు, తాపత్రయమను అగ్నిని చల్లార్చుటయందు మేఘమువంటిదియునని యెఱుంగుము.

మిత్రీభూతాఖిలరిపుర్యథా భూతార్థ దర్శనః
దుర్లభో జగతాం మధ్యే సామ్యామృతమయోజనః.

శత్రువులందఱిని మిత్రులుగ దలంచువారును, తత్వజ్ఞానులును, సమత్వమను యమృతముచే పరిపూర్ణులునునగు యుత్తమ మనుజులు ముల్లోకమందును లభించుట దుర్లభము.

ప్రబుద్ధస్యస్వచి తేందోర్నిష్యందమమృతాధికమ్
సామ్యమాస్వాద్యజీవన్తి సర్వేవై జనకాదయః.

అమృతముకంటెను మిగుల నాస్వాదయుక్తమగు సమత్వమను స్వప్రబుద్ధచిత్తమందలి రసమును గ్రోలియే జనకాది తత్వజ్ఞులు జీవించుచున్నారు.

సామ్యమభ్యస్యతో జంతోః స్వదోషోఽపి గుణాయతే.
దుఃఖం సుఖాయతే నిత్యం మరణం జీవితాయతే.

సమత్వమభ్యసించువానియొక్క కామ క్రోధాది దోషములు క్రమముగ శాన్త్యుదారాది గుణములుగ పరిణమించును. దుఃఖములన్నియు సుఖములుగ దోచును. మరణమున్ను జీవితమువలె సుఖప్రదమగును.

సామ్యసౌందర్యసుభగం వనితా ముదితాదికాః
ఆలింగంతి మహాత్మానం నిత్యం వ్యసనితాఇవ.

సమత్వమును సుదృఢరూపమున యభ్యసించిన మహాత్ముని మైత్రి, కరుణ, ఉపేక్ష్యాది యుత్తమగుణములు, కామినీస్త్రీలు పతినివలె నిత్యమాశ్రయించుచుండును.

సమః సముదితో నిత్యం సమోఽనుదితధీఃసదా
నకాశ్చిదిహ తాః సంతి యాః సమస్యహి నిర్ధయః.

పూర్ణముగ నుదయించిన సమదర్శిత్వముగలవాడును, సమదర్శనముచే దుఃఖరహితుడును నగువానికి లోకమున ప్రాప్తింపనిసంపదయే లేదు.

సర్వకార్య సమంసాధుం ప్రకృతవ్యవహారిణమ్
చిన్తామణి మివోదారం ప్రవాంఛన్తి నరామరాః.

స్వపర కార్యములయెడ సమరూపమున వర్తించువాడును. క్షమౌదార్యమమున్నగు యుత్తమగుణములు గలవాడును, ప్రకృతకార్యములను నిష్పాక్షికముగ నెరవేర్చువాడుననగు చిన్తామణిసదృశుండైన సాధుపుంగవుని జనులందఱును, దేవతలున్ను వాంఛింతురు.

సమ్యక్కారిణముద్దామ ముదితం సమచేతసమ్
నదహంత్యగ్నయో రామ నాపః సించంతి మానవమ్,

ఓరామా! సదాచారసంపన్నుడును, సర్వహితకాంక్షియు, నిర్భయుడును, ధీరుడును, సమత్వము గలవాడును నగువానిని అగ్ని దహింపజాలదు, జలము తడుపజాలదు. (భూతములెవ్వియు దుఃఖమును గల్గింప జాలవనియర్థము).

యద్యథా తత్తథా యేన క్రియతే దృశ్యతే తథా
ఆనందోద్వేగముక్తేన కస్తం తోలయితుం క్షమః.

ఏ కార్యమెట్లు చేయవలెనో, దానినట్లనే చేయువాడును, హర్ష విషాదములులేనివాడును, సమత్వమునాశ్రయించియే సర్వకార్యములను నెరవేర్చువాడునునగు మహాపురుషుని బోల్చుటకెవరు సమర్థులు?

మిత్రాణి బంధురిపవో రాజానో వ్యవహారిణః
సమ్యక్కారిణి తత్త్వజ్ఞే విశ్వసంతి మహాధియః.

సమత్వము గల్గి వ్యవహరించు జ్ఞానియెడ శత్రుమిత్రాదులును, రాజులును, మహాధీమంతులును, సర్వులును విశ్వాసముగలిగియుందురు.

నానిష్టాత్ప్రపలాయంతే నేష్టాదాయాంతి తుష్టతామ్
ప్రకృతక్రమసంప్రాప్తాస్తత్త్వజ్ఞాః సమదర్శినః.

యథారీతి ప్రాప్తించిన కార్యములఁజేయు సమదర్శియైన తత్త్వజ్ఞుడు అనిష్టముచే భయపడి పారిపోవుటయు, ఇష్టప్రాప్తిచే నతిప్రసన్నత్వముఁ జెందుటయు గల్గియుండడు.

త్యక్త్వా సర్వానుపాదేయాన్ రామ భావాననిందితాన్
సమతా యామ దుఃఖాయాం దధానావృత్తిమృత్తమామ్.
విహసంతి జగజ్జాలం జీవయంతి నిరామయాః
పూజ్యంతే విబుధైః సర్వైః సమతాముదితాశయాః.

ఓరామా! ఇతరులు గ్రహించునట్టి గృహ, క్షేత్రాది పదార్థములఁగూడ త్యజించి నిర్లోభత్వమను వృత్తినాశ్రయించి, దుఃఖరహితులై సమత్వమందు ప్రతిష్ఠితులై, వికారరహితులై ప్రసన్నచిత్తులై యుండు మహాత్ములీ జగజ్జాలమును వీక్షించి హాసింతురు. అట్టివారు పరమార్థతత్త్వమునితరులకు భోధించుచుందురు. మఱియు, వారు దేవతలచే గూడ పూజింపబడుదురు.

ప్రకృతక్రమసంప్రాప్తసుఖేంవా కోపమేవయః
సమాశయో ధారయతిస్యాత్సేమ్యామృతసజ్జనః.
సమత్వముగల పురుషుడెప్పుడైన క్రోధము ప్రకటించినను అయ్యది చంద్రమండలమునందలి అమృతమువలె శీతలస్వభావమే గల్గియుండును గాని, క్షోభకరము గానేరదు.

యత్కరోతి యదశ్నాతి యదాక్రామతి నిందతి
సమదృష్టి స్తదస్యేయం స్తౌతి నిత్యం జనావలిః.
సమదర్శియగువాడు యెద్దానినోనర్చునో, దేనినిభుజించునో మఱియు (అనుచితమైనదానిగూర్చి) యేనిందగావించునో, వాటినన్నింటిని జనులు శ్లాఘింతురు.

యచ్ఛుభంవాశుభంయచ్చ యచ్చిరేణ యదద్యవా
సమదృష్టికృతం సమ్యగభినందతి సజ్జనః.
శుభమైనను, అశుభమైనను, అల్పకాలకృతమైనను, బహుకాలకృతమైనను సమదృష్టిగలవాడు యొనర్చుదానిని సజ్జనులు ప్రశంసింతురు.

సుఖదుఃఖేషు భీమేషు సంతతేషు మహత్స్వపి
మనాగపి నవైరస్యం ప్రయాతి సమదృష్టయః.
చిరకాలము ఘోరసంకటము సంప్రాప్తించినను సమదృష్టిగలవాడొకింతేని చిత్తోద్వేగము నొందకయుండును.

---

ఓం

# తపోమాహాత్మ్యము.

శ్రీ

(శ్రీ శివమహాపురాణము 5-వ ఉమాసంహిత. 12-వ అధ్యాయము.)

వ్యాస ఉవాచః—వ్యాసభగవానుడు చెప్పుచున్నాడు:—

1. తపసో మే ఫలం బ్రూహి పునరేవ విశేషతః
సర్వేషాంచైవ వర్ణానాం బ్రాహ్మణానాం తపోధన.

తా॥ మహర్షి సత్తమా! సమస్త బ్రాహ్మణాది వర్ణములకు తపము వలన నేమి ఫలము లభించునో అద్దానిని విశేషముగ వివరింపుము.

సనత్కుమార ఉవాచః—సనత్కుమారుడు చెప్పుచున్నాడు.

2. ప్రవక్ష్యామి తపోఽధ్యాయం సర్వకామార్థ సాధకమ్
సుదుశ్చరం ద్విజాతీనాం తన్మే నిగదతః శృణు.

తా॥ సమస్త కామఫలసాధకమును, ద్విజాతులకు గూడ దుస్సాధ్యము నగు తపమును గురించిన యధ్యాయమును చెప్పగలను. అద్దాని నాకర్ణింపుము.

3. తపోహి పరమం ప్రోక్తం తపసా విద్యతే ఫలమ్
తపోరతాః హి యే నిత్యం మోదంతే సహ దేవతైః.

తా॥ తపస్సు ఉత్తమమైనది. తపస్సుచే ఫలముగలదు. తపోనిరతులు నిరంతరము దేవతలతో గూడి సంతోషింతురు.

4. తపసా ప్రాప్యతే స్వర్గః తపసా ప్రాప్యతే యశః
తపసా ప్రాప్యతే కామః తపస్సర్వార్థసాధనమ్.

తా॥ తపముచే స్వర్గము లభించును. తపస్సుచే యశస్సు చేకూరును. తపస్సుచే మనోరథ మీడేరును. తపము సర్వార్థసాధనము.

5. తపసా మోక్షమాప్నోతి తపసా విందతే మహత్
జ్ఞాన విజ్ఞాన సంపత్తిః సౌభాగ్యం రూపమేవచ.

తా॥ తపస్సుచే మోక్షము నొందును; జ్ఞానమున్ను, విజ్ఞానమున్ను, గొప్ప సంపదయు, సౌందర్యమున్ను పొందును.

6. నానావిధాని వస్తూని తపసా లభతే నరః
తపసా లభతే సర్వం మనసా యద్యదిచ్ఛతి.

తా॥ నానావిధములైన వస్తువులను తపముచే నరుడు పొందగలడు. తనచిత్తమున యెద్దియెద్ది కాంక్షించబడునో, అయ్యది యంతయు తపముచే లభించును.

7. నా తప్త తపసో యాంతి బ్రహ్మలోకం కదాచన
నా తప్త తపసాం ప్రాప్య శ్శంకరః పరమేశ్వరః.

తా॥ తపము నాచరింపనివారలు యెన్నడును బ్రహ్మపదము నొందజాలరు. తపము సలుపనివారికి పరమేశ్వరుడగు శంకరుడు అప్రాప్యుడు. (పొంద వీలుకానివాడు).

8. యత్కార్యం కించిదాస్థాయ పురుషస్తపతే తపః
తత్సర్వం సమవాప్నోతి పరత్రేహచ మానవః.

తా॥ ఏకార్యమును మనస్సున సంకల్పించి పురుషుడు తపమాచరించునో అతడు ఇహపరలోకములలో అద్దానినంతను పొందగలడు.

9. సురాపః పరదారీచ బ్రహ్మహా గురుతల్పగః
తపసా తరతే సర్వం సర్వతశ్చ విముంచతి.

తా॥ కలుద్రాగువాడు, పరభార్యాపహర్త, బ్రహ్మహత్యాపాతకి, గురుభార్యాగామి, యిట్టి అకార్యముల చేసినవారైనను వీరందఱు తపముచే అన్ని పాపములు నశించినవారై దుఃఖమునుండి విడివడుదురు.

10. అపి సర్వేశ్వరస్థాణుర్విష్ణుశ్చైవ సనాతనః
బ్రహ్మాహుతాశనః శక్రో యేచాన్యే తపసాన్వితాః.

11. అష్టాశీతి సహస్రాణి మునీనా మూర్ధ్వరేతసామ్
తపసా దివిమోదంతే సమేతాః దేవతైస్సహ.

తా॥ సర్వేశ్వరుడగు పరమశివుడేగాదు. సనాతనుడగు విష్ణువేగాదు. బ్రహ్మయును, అగ్నియు, ఇంద్రుడును, మరి ఇతరులును తపస్సుచేతనే ఆయాస్థానముల నాక్రమించిరి.

'మరియు యెనభైయెనిమిదివేల ఊర్ధ్వరేతస్కులగు మహామునులు తపముచేతనే స్వర్లోకమున దేవతలతో గూడి సంతోషించుచున్నారు.'

12. తపసా లభ్యతే రాజ్యం సచ శక్రస్సురేశ్వరః
తపసాఽపాలయత్సర్వ మహన్యహాని వృత్రహా.

తా॥ ఇంద్రుడు తపస్సుచేతనే సురాధిపతియై రాజ్యమును సంపాదింపగలిగెను. తపస్సుచేతనే ప్రతిదినము ఇంద్రుడు సమస్తరాజ్యమును పరిపాలింపగలుగుచున్నాడు.

13. సూర్యా చంద్రమసౌదేవౌ సర్వలోకహితే రతౌ
తపసైవప్రకాశంతే నక్షత్రాణిగ్రహాస్తథా.

తా॥ తపముచేతనే సూర్య చంద్రులు సమస్తలోకములకు హితము సలుపుచున్నారు. అద్దాననే నక్షత్రములు అట్టులే, గ్రహములు ప్రకాశించుచున్నవి.

14. నచాస్తి తత్సుఖం లోకే యద్వినా తపసా కిల
తపసైవ సుఖంసర్వమితి వేదవిదో విదుః.

తా॥ ఎయ్యది తపములేక సంపాదింపసాధ్యమో అట్టిసుఖము ప్రపంచమున లేదుగదా. తపస్సుచేతనే, సమస్తసుఖమునున్నట్లు వేదవేత్తలెఱుగుదురు.

15. జ్ఞానం విజ్ఞాన మారోగ్యం రూపవత్త్వం తథైవచ
సౌభాగ్యంచైవ తపసా ప్రాప్యతే సర్వదా సుఖం.

తా॥ జ్ఞానము, విజ్ఞానము, ఆరోగ్యము, అందము, సౌభాగ్యము, సౌఖ్యము తపముచే యెల్లపుడు పొందనగును.

16. తపసా సృజ్యతే విశ్వం బ్రహ్మా విశ్వం వినా శ్రమం
పాతి విష్ణుర్హరోఽప్యేతి ధత్తే శేషోఽఖిలాం మహీం.

తా॥ తపస్సుచేతనే సమస్తప్రపంచమును శ్రమలేకయే బ్రహ్మ సృజించుచున్నాడు. విష్ణువు పోషించుచున్నాడు శివుడు లయింపజేయుచున్నాడు. ఆదిశేషుడు సమస్తమహీమండలమును మోయుచున్నాడు.

17. విశ్వామిత్రో గాధిసుతస్తపసైవ మహామునే
క్షత్రియోఽథాభవద్విప్రః ప్రసిద్ధంత్రిభవేష్విదం.

తా॥ గాధితనయుడగు విశ్వామిత్రుడు తపముచేతనే, క్షత్రియుడయ్యు విప్రుడాయెను. మహర్షిసత్తమా! ఇది మూడులోకములలో ప్రసిద్ధము.

18. ఇత్యుక్తంతే మహాప్రాజ్ఞ తపోమహాత్మ్య ముత్తమం

తా॥ బుద్ధిమంతుడవగు మహర్షీ ! ఉత్తమమగు తపోమాహాత్మ్యము ఇట్లు చెప్పబడినది.

ఇతి శ్రీ శివమహాపురాణే పంచమ్యాముమాసంహితాయాం తపోమాహాత్మ్యవర్ణనంనామ ద్వాదశోఽధ్యాయః.

ఇయ్యది శ్రీ శివమహాపురాణమున పంచమోమాసంహిత యందలి తపోమాహాత్మ్యవర్ణనమను పండ్రెండవ అధ్యాయము.

ఓమ్

# అన్నదాన మాహాత్మ్యము.

శ్రీ

(శ్రీ శివమహాపురాణము ఉమాసంహిత 5-వది 11-వ అధ్యాయము.)

సనత్కుమార ఉవాచ:—సనత్కుమారుడు చెప్పుచున్నాడు.

1. సర్వేషామేవ దానానామన్నదానం పరం స్మృతమ్
సద్యః ప్రీతికరం హృద్యం బాలబుద్ధివివర్ధనమ్.

తా॥ సర్వదానములలో అన్నదానము ఉత్కృష్టమైనదిగా చెప్ప బడెను. అయ్యది వెంటనే సంతోషము నొసంగును. హృదయమున కింపైనది. లేత బుద్ధిని పెంపొందించును.

2. నాన్నదాన సమం దానం విద్యతే మునిసత్తమ
అన్నాద్భవంతి భూతాని తదభావే మ్రియన్తిచ.

తా॥ ఓ మహర్షిపుంగవా! అన్నదాన సమమగు దానములేదు. అన్నము వలననే ప్రాణికోట్లు జనియించును. అన్నములేనిచో మర ణించును.

3. రక్తం - మాంసం - వసా శుక్రం క్రమాదన్నాత్ప్రవర్ధతే
శుక్రాద్భవన్తి భూతాని తస్మాదన్నమయం జగత్.

తా॥ రక్తము, మాంసము, క్రొవ్వు, శుక్లము క్రమముగా అన్నము వల్లనే వృద్ధినొందును. శుక్లము వలన భూతములు కలుగును గనుక ప్రపంచము అన్నమయము.

4. హేమరత్నాశ్వ నాగేంద్రైర్నారీ స్రక్చందనాదిభిః
సమస్తైరపి సంప్రాప్తైర్న రమంతి బుభుక్షితాః.

తా॥ ఆకలిగొన్నవారు బంగారు, రత్నములు, అశ్వములు, శ్రేష్ఠ గజములు, స్త్రీలు, స్రక్చందనాదులు లభించినను ఆనందింపరు.

5. గర్భస్థా జాయమానాశ్చ బాలవృద్ధాశ్చ మధ్యమాః
ఆహారమభికాంక్షంతి దేవదానవరాక్షసాః.

తా॥ గర్భస్థములగు పిండములు, పుట్టిన శిశువులు, బాలురు, వృద్ధులు, యువకులు, దేవతలు, దానవులు, రాక్షసులు, ఆహార మును కోరుచుందురు.

6. క్షుధా నిశ్శేషరోగాణాం వ్యాధిః శ్రేష్ఠతమః స్మృతః
సచాన్నౌషధిలేపేన నశ్యతీహ నసంశయః.

తా॥ ఆకలి సమస్తరోగములోను గొప్ప రోగమగును. అది అన్నమ నెడు ఓషధి సేవనమున నశించును. ఇట సందియములేదు.

7. నాస్తిక్షుధాసమందుఃఖం నాస్తిరోగః క్షుధాసమః
నాస్త్యరోగసమంసౌఖ్యం నాస్తిక్రోధసమో రిపుః.

తా॥ ఆకలికి సమమగు దుఃఖములేదు. ఆకలికి సమానమైన రోగములేదు. ఆరోగ్యమునకు సమమైన సౌఖ్యములేదు. క్రోధమునకు సదృశమగు శత్రువులేదు.

8. అతఏవమహత్పుణ్య మన్నదానే ప్రకీర్తితం
తథా క్షుధాగ్నినా తప్తా మ్రియన్తే సర్వదేహినః.

తా॥ గనుకనే అన్నదానముచే గొప్పపుణ్యము లభించునని చెప్పబడెను. క్షుధయనెడు యగ్నిచే సంతప్తులై సకలప్రాణులు మరణించును.

9. అన్నదః ప్రాణదః ప్రోక్తః ప్రాణదశ్చాపిసర్వదః
తస్మాదన్నప్రదానేన సర్వదానఫలం లభేత్.

తా॥ అన్నదాత ప్రాణమునొసంగువాడు. ప్రాణము మాత్రమొసంగుటేకాదు, సర్వమునిచ్చువాడు గనుక అన్నప్రదానముచే సమస్త దాన ఫలము లభించును.

10. యస్యాన్నపాన పుష్టాంగః కురుతే పుణ్యసంచయమ్
అన్నప్రదాతు స్తస్యార్ధం కర్తుశ్చార్ధం న సంశయః.

తా॥ ఎవని అన్నపానములవలన దేహవృద్ధినిగాంచి పుణ్యమునెవడు సంపాదించునో అతని పుణ్యమున సగముపాలు అన్నప్రదాతకు, అర్ధభాగము పుణ్యము నార్జించిన వానికిని లభించును. సంశయములేదు.

11. త్రైలోక్యే యానిరత్నాని భోగస్త్రీ వాహనానిచ
అన్నదానప్రదస్సర్వమిహాముత్రచ తల్లభేత్.

తా॥ మూడులోకములలో ఏశ్రేష్ఠవస్తువులు గలవో, భోగములు, స్త్రీలు, వాహనములు యేవి గలవో వానినన్నిటిని అన్నదాత ఇహలోకమునన్ను, పరలోకములలోను పొందగలడు.

12. ధర్మార్థకామమోక్షాణాం దేహః పరమసాధనమ్
తస్మాదన్నేనపానేన పాలయేద్దేహమాత్మనః.

తా॥ ధర్మార్థకామమోక్షములకు దేహమే పరమసాధనము గనుక అన్నపానములచే తనదేహమును పోషించుకొనవలయును.

13. అన్నమేవ ప్రశంసంతి సర్వమేవ ప్రతిష్ఠతం
అన్నేన సదృశం దానం నభూతం నభవిష్యతి.

తా॥ అన్నమునే అన్నిటికి నాధారభూతముగ ప్రశంసింతురు. అన్న దానముతో సదృశమగు దానము భూతభవిష్యద్వర్తమానకాలములలో లేదు.

14. అన్నేన ధార్యతే సర్వం విశ్వం జగదిదం మునే !
అన్నమూర్జస్కరం లోకే ప్రాణాహ్యన్నే ప్రతిష్ఠితాః.

తా॥ ఓ మహర్షీ! అన్నముచే యీ కానుపించు సర్వప్రపంచము నిలచియున్నది. అన్నము బలమునొసంగును. లోకమున ప్రాణులు అన్నమున ప్రతిష్ఠితములైనవి.

15. దాతవ్యం భిక్షవే చాన్నం బ్రాహ్మణాయ మహాత్మనే.
కుటుంబం పీడయిత్వాపి హ్యాత్మనో భూతిమిచ్ఛతా.

తా॥ తనశ్రేయము నభిలషించువాడు తన కుటుంబమునకు భాధగలిగినను బ్రహ్మజ్ఞానసంపన్నుడును, భిక్షార్థియునగు మహాత్మునికొఱకు భిక్షనొసంగవలయును.

16. వివదాతి నిధిశ్రేష్ఠం యో దద్యాదన్నమర్థినే.
బ్రాహ్మణాయార్తరూపాయ పారలౌకిక మాత్మనః.

తా॥ ఎవడు నిధులలో శ్రేష్ఠనిధియగు అన్నమును, ఆకలిగొని భిక్షార్థియైవచ్చియున్న మహాత్మునికి పెట్టునో, అతనికి పరలోక సౌఖ్యమబ్బును.

17. అర్చయేద్భ్యాతి మన్విచ్ఛన్ కాలే ద్విజముపస్థితం.
శ్రాంతమధ్వని వృత్త్యర్థం గృహస్థో గృహమాగతం.

తా॥ మార్గమున అలసి భిక్షవృత్తికై తన యింటికి సకాలమున వచ్చిన మహాత్ముని ఆత్మశ్రేయము నభిలషించు గృహస్థుడు సత్కరింపవలయు.

18. అన్నదః పూజయేద్వ్యాస! సుశీలస్తు విమత్సరః
క్రోధ ముత్పతితం హిత్వా దివిచేహ మహత్సుఖమ్.

తా॥ ఓవ్యాసా! అన్నదాత మంచిశీలము (నడత) గలవాడై మాత్స ర్యము లేనివాడై పొంగివచ్చుచుండు క్రోధమునణచుకొనియైనను భిక్షార్థిని పూజింపవలయు. అతనికి యిహలోకమునను స్వర్గలోకము నను సుఖము సిద్ధించును.

19. నాభినిందేదధిగతం నప్రణుద్యాత్కథంచన
అపిశ్వపాకే శునివా నాన్నదానం ప్రణశ్యతి.

తా॥ వచ్చిన యతిథిని తిట్టరాదు. ఎటులైనను త్రోసిపుచ్చరాదు. (వ్యర్థముగ త్రిప్పిపంపరాదు). చండాలునకుగాని కుక్కకుగాని పెట్టిన అన్నదానపు ఫలము వ్యర్థముకాజాలదు.

20. శ్రాంతాయాదృష్టపూర్వాయ హ్యన్నమధ్వనివర్తతే
యోదద్యాదపరిక్లిష్టః ససమృద్ధిమవాప్నుయాత్.

తా॥ మార్గాయాసముతో వచ్చినట్టియు, ముందెన్నడు చూడబడనట్టి యు అన్నార్థికొఱకు యెవడు క్లేశమునొందక అన్నమునిడునో అతడు సమృద్ధిని గాంచును.

21. పితౄన్ దేవాంస్తథా విప్రానతిథీంశ్చ మహామునే
యోనరః ప్రీణయత్యన్నైః తస్య పుణ్యఫలంమహత్.

తా॥ ఓ మునిసత్తమా! ఏ నరుడు, పితృదేవతలను, సత్పురుషులగు అతిథులను అన్నములచే సంతోషపరచునో అతనికి గొప్పపుణ్య ఫలము దొరకును.

22. అన్నం పానంచ శూద్రేఽపి బ్రాహ్మణేచ విశిష్యతే
నపృచ్ఛేత గోత్రచరణం స్వాధ్యాయం దేశమేవచ.

తా॥ అన్నపానముల బ్రాహ్మణునకే గాదు, శూద్రునకొసంగినను విశేషఫలము సిద్ధించును. భిక్షార్థి కులగోత్రములనుగాని, విద్యనుగాని, దేశమునుగాని ప్రశ్నింపరాదు.

23. భిక్షితో బ్రాహ్మణే నేహద ద్యాదన్నంచ యఃపుమాన్
స యాతి పరమం స్వర్గం యావదాభూతసంప్లవమ్.

తా॥ సత్పురుషునిచే యాచింపబడిన ఏ పురుషుడు అతనికి అన్నము నొసంగునో అతడు ప్రళయకాలపర్యంతము ఉత్కృష్టమగు స్వర్గపదము నధిష్ఠించియుండును.

24. అన్నదస్య చ వృక్షాశ్చ సర్వకామఫలాన్వితాః
భవంతీహ యథా విప్రా హర్షయుక్తా స్త్రివిష్టపే.

25. అన్నదానేన యేలోకాః స్వర్గే విరచితా మునే
అన్నదాతు ర్మహాదివ్యాస్తాన్ శృణుష్వ మహామునే.

తా॥ ఓ మహామునీ? ఈ లోకమున అన్నదాతకు వృక్షములెట్లు సమస్తకామఫలముల నొసంగుచున్నవో అన్నదానమువలన సత్పురుషులు ఎట్లు సంతోషముగలవారై యున్నారో, అన్నదానముచే మూడు లోకములలోని యేలోకములు అన్నదాతకు కల్పింపబడెనో, స్వర్గమునందలి మహాదివ్య వైభవములు అన్నదాతకు ఎట్లు ఏర్పాటుగావింపబడెనో వానినన్నిటి నాకర్ణింపుము.

26. భవనాని ప్రకాశంతే దివి తేషాం మహాత్మనామ్
నానాసంస్థానరూపాణి నానాకామాన్వితానిచ.

తా॥ స్వర్గలోకమున అన్నదాతలగు మహాత్ములకు భవనములు, నానాసన్నివేశముల (చతుష్పథములు=నాలుగు దారులుకలియుచోటుల) తోఁగూడినవియు నానావిధములగు కోర్కెలనెరవేర్చునవియునై విరాజిల్లును.

27. సర్వకామఫలాశ్చాఽపి వృక్షా భవనసంస్థితాః
హేమవాప్యశ్శుభాః కూపా దీర్ఘికాశ్చైవ సర్వశః.

28. ఘోషయంతి చ పానాని శుభాన్యథ సహస్రశః

తా॥ నివసించుస్థలమందున్న వృక్షములు సర్వకామఫలప్రదములై యుండును. భవనములందున్న బంగారునడబావులు, శుభకరములగు నూతులు అన్నివైపులగలిగి మంగళప్రదములగు పానములను అనేక తెరగుల ఇచ్చుచుండును.

భక్ష్యభోజ్యమయాశ్శైలా వాసాంస్యాభరణానిచ.

29. క్షీరంస్రవంత్య స్సరిత స్తథైవాజ్యస్య పర్వతాః
ప్రాసాదాః పాండురాభాసాశ్శయ్యాశ్చ కనకోజ్వలాః.

30. తానన్నదాశ్చ గచ్ఛంతి తస్మాదన్నప్రదో భవేత్

తా॥ భక్ష్యభోజ్యములు పర్వతములుగనుండును. వస్త్రములు, ఆభరణములు కొండలవలె పడియుండును. అచటినదులు క్షీరమును ప్రవహింపచేయును. అట్లే నెయ్యి శైలములవలెయుండును. మేడలు స్వచ్ఛమగుధవళకాంతి గలిగి యొప్పారును. పడకలుబంగారముచే ప్రకాశవంతములై యుండును. వానినన్నిటిని అన్నదాతలు పొందుచుందురు. గాన అన్నదాతగావలయును.

యదీచ్ఛేదాత్మనో భవ్యమిహలోకే పరత్ర చ.

తా॥ ఇహాపరలోకములలోతనకు శుభము చేకూరవలయునన్న తప్పకలభించును.

31. ఏతేలోకాః పుణ్యకృతా మన్నదానాం మహాప్రభాః
తస్మాదన్నం విశేషేణ దాతవ్యం మానవైర్భువిమ్.

తా॥ మిక్కిలి కాంతివంతములకు ఈ పూర్వోక్తలోకములన్నియు అన్నదాతలగు పుణ్యవంతులకే గనుక మానవులు అన్నమును విశేషముగ తప్పక దానముచేయవలయు.

32. అన్నం ప్రజాపతిస్సాక్షాదన్నం విష్ణుస్స్వయం హరః
తస్మాదన్నసమందానం న భూతం న భవిష్యతి.

తా॥ అన్నము సాక్షాత్ బ్రహ్మదేవుడు; అన్నము విష్ణువు; అన్నము పరమశివుడు. గనుగ అన్నదానసమమగు దానము ఉండియుండలేదు. ఇక నుండబోదు.

33. కృత్వాపి సుమహత్పాపం యః పశ్చాదన్నదో భవేత్
విముక్తస్సర్వపాపేభ్యస్స్వర్గలోకం స గచ్ఛతి.

తా॥ ఎవడు గొప్పపాప మాచరించియున్నను వెనుక అన్నప్రదాతయినచో సర్వపాపములనుండి విడివడి స్వర్గలోకము నధిష్ఠించును.

34. అన్నపానాశ్వగోవస్త్ర శయ్యాచ్ఛత్రాసనానిచ
ప్రేతలోకే ప్రశస్తాని దానాన్యష్టౌ విశేషతః.

తా॥ అన్నము, పానము, అశ్వము, గోవు, వస్త్రము, పడక, ఛత్రము.

ఆసనము యీ యెనిమిదింటి ధానములు ప్రేతలోకమున మిక్కిలి ప్రశస్తములుగ పేర్కొనబడును.

35 ఏవం దానవిశేషేణ ధర్మరాజపురం నరః
యస్మాద్యాతి విమానేన తస్మాద్దానం సమాచరేత్.

తా॥ ఈ పూర్వోక్త అష్టవిధదానవిశేషములచే మానవుడు విమానము నధిష్ఠించి స్వర్గపురికరుగును. గనుక దానమాచరింపవలయు.

36. ఏతదాఖ్యానమనఘు మన్నదాన ప్రభావతః
యఃపఠేత్ పాఠయేదన్యాన్ ససమృద్ధః ప్రజాయతే.

37. శృణుయాత్ శ్రావయేత్ శ్రాద్ధే బ్రాహ్మణాన్ యో మహామునే
అక్షయ్యమన్నదానంచ పితౄణాముపతిష్ఠతి.

తా॥ అన్నదాన ప్రభావరూపమగు పాపరహితమైన ఈ ఆఖ్యానము నెవడు పఠించునో, ఇతరులచే చదివించునో అతడు సమృద్ధిగలవాడై జనించును. ఓ మహర్షీ! శ్రాద్ధకాలమున యీ ఆఖ్యానమును విన్నను, పుణ్యవంతులకు వినిపించినను తఱుగని అన్నదానఫలము పితృదేవతలకు లభించును.

ఇతి శ్రీ శివమహాపురాణే పంచమ్యాముమాసం
హితాయా మన్నదాన మహాత్మ్యవర్ణ
నంనామ ఏకాదశోఽధ్యాయః

ఇయ్యది శ్రీ శివమహాపురాణమున ఐదవ ఉమాసంహిత
యందలి అన్నదానమాహాత్మ్యవర్ణనమను
పదునొకండవ యధ్యాయము.
ఓమ్ తత్ సత్.

---

# వివేకానంద లేఖావళి.

(అనువాదకులు:—శ్రీ తత్త్వానంద స్వాములవారు)

వాషింగ్టను నగరము

27—10—1894.

ప్రియమైన:—

* * * నేను సరిగా భారతదేశమున ఏమిచేసెడివాడనో, ఇక్కడను అటులనే చేయుచున్నాను. ముందుగా నా పన్నుగడల పన్నకుండ సదా భగవంతుని పైని ఆధారపడుచుండుటే.

అయినను ఈ దేశములో నేను నిరంతరము పనిచేయవలసిన వాడననుట మీరు మఱవకూడదు. నా భావములను ఒక గ్రంథరూపమున కూర్చుటకు నాకు వ్యవధి లేకున్నది. ఇంతేల ఈ సంతత తీవ్ర కార్యపరతవలన నా నాడులు అఱిగిపోయినవి. అది నాకు అనుభూతమగుచున్నది కూడను. మీరు నా కొఱకై కావించిన స్వార్థరహితమును సాహసయుతమునగు మహోపకృతిని గూర్చి మీయెడలను నా చన్నపురి స్నేహితులయెడలను నేనెంత కృతజ్ఞుడనో వ్యక్తముచేయ సమర్థుడగాకున్నాను. నేను సంస్థలనెలకొలుపు నిపుణత గలవాడను కాను; నా స్వభావము పాండిత్యము వైపునకును, ధ్యానము వైపునకును దారితీయుచుండును. నేను చేయగలంత పనిని చేసితినని యే తలచుచున్నాను. నాకిప్పుడు విశ్రాంతి అవసరము. నాగురుదేవుడు నాకడకుపంపినవారికి ఒకింత బోధచేయుటే నాకోరిక. 'ఇప్పుడు మీరేమి చేయగల్గుదురో మీకు తెలిసినది. ఏమన? నిజముగా మీరలే, చన్నపురియువకులే సుడీ ఇదంతయు నిర్వహించినది! నేను నామమాత్రమే; నేను త్యాగిని; నాకు కావలసినది ఒక్కటే విషయము. వితంతువు కన్నీటిని ఆపజాలనట్టిగాని, అనాథశిశువునోటి కొఱకు ముద్దయన్నము నిడజాలనట్టిగాని యేమతమునైనను నేను విశ్వసింపజాలను. సిద్ధాంతము లెంతటి మహనీయములైనను, తత్త్వవిచారణము ఎంతటి నేర్పుతో నడచునదైనను కేవలము గ్రంథములలోను ధర్మపన్నములలోను నిలిచిపోవునెడల నేనట్టిదానిని మతమని యే పిలువను. కన్ను నొసటనుండునుగాని వీపుననుండునది కాదు. ముందునకు సాగి నడువుడు; మీరు

"మతము మతము" అనిపిలుచుచు మరియు దానిని ఆచరణలో పెట్టుడు. అప్పుడు భగవంతుడు మిమ్ము ధన్యుల జేయుగాక!

ఆత్మవిశ్వాసము పూనుడు; నాకై ఎదురు చూచుచుండకుడు. ఉత్సాహమును అంకురింపజేయుటకు నేను కారణుడనైతిని; నాకంతే సంతోషము. దానిని ఆశ్రయించి దానిపైని తేలియాడుచు పొండు; సమస్తమును సవ్యముగ నడచును. కుమారా, ప్రేమ యెన్నడును వ్యర్థమగునది కాదు. నేడో, రేపో, కాకున్న యుగాంతములకైన సత్యము జయించి తీరును! ప్రేమ విజయమును సాధించితీరును. నీకు తోడి మానవునందు ప్రేమగలదా? ఇక నీవు దేవునికై వెదకుచు ఎక్కడికో పోవలయునా? ఈ పేదలందఱు, ఈ దిక్కులేనివారలందఱు, ఈ దీనులందఱు దేవతలు కారా? మొట్టమొదటగా మీరు వీరినెందుకు పూజింపరు? గంగాతీరమున నూయి త్రవ్వబోదురేల? ప్రేమయొక్క అఖండశక్తియందు విశ్వాసము పూనుడు. పేరుప్రఖ్యాతుల నెడు కాకిబంగారపు తళుకుల కెవడాశించును? వార్తాపత్రికలు ఏమి ప్రకటించుచుండెనా యను గొడవ నాకుపట్టదు. నీకు ప్రేమయనునది కలదా? నీవింక సర్వశక్తిమంతుడవే! నీవు పూర్తిగ స్వార్థరహితుడవేనా? అగుదో నీకెదురై నిలువగలదేమియు నుండదు. సర్వమును సమకూర్చునది శీలమే సుమీ! సముద్రమధ్యమున బడియున్నను తన బిడ్డల సంరక్షించుటకు సర్వేశ్వరుడున్నాడు. మీ దేశము శూరులను గోరుచున్నది; కాన శూరులు కండు!

ప్రతివాడును నన్ను భారతదేశమునకు తిరిగి రమ్మనుచుండును. నేనువచ్చునెడల తామేమొ హెచ్చుగసాధింప జాలుదుమని వారనుకొనుచున్నారు. మిత్రమా! వారెంతయు పొరబడుచున్నారు. ఈ తాత్కాలికపు ఉత్సాహము దేశాభిమానపు అల్పఛాయ మాత్రమే; అర్థశూన్యమైనది. అది సత్యమును నిష్కపటమునైనచో వందలకొలదిగా శూరులు బయలుదేఱి స్వల్పకాలములో పనులసాగింపబూనుట మీకు తెలియవచ్చును. కాబట్టి మీరు నిజముగా చక్కని ప్రారంభముచేసితిరని గ్రహించి ముందునకు సాగిపొండు. నాకొఱకై కనుపెట్టుకొనియుండకుడు. మనకొక దివ్యమగు క్షేత్రము దొఱికినది. ఈ సం

ప్రదాయమొ ఆసంప్రదాయమొ నాకేల ? నేను పరమేశ్వరుని సేవకుడను. శుభంకరయులగు ఉన్నతభావములనన్నిటిని ప్రచారముచేయుటకు భూలోకములో నింతకంటె యోగ్యతరక్షేత్రమెందుగలదు ? ఇక్కడ ఒక్కపురుషుడు నాకెదురై నిలుచునెడల, నాకు అండయై నిలుచువారు వందమంది వత్తురు. ఇక్కడపురుషునకు పురుషునెడల సానుభూతికలదు; స్త్రీలా దేవతాలలామలే ! అంతయు అనుకూలముగ నడచుతరిని వెఱ్ఱివారును వీరులై నిలిచి తమ్ముగూర్చిన స్తోత్రముల నాలకించుచు ఆనందింపగలరు; పిఱికిపందలు సయితము శూరులవలె నటింపజాలుదురు. కాని నిజమగు ధీరుడు నిరాడంబరముగ పనిచేయుచుండును. నోరెత్తి మాటాడకుండ ఎంతమంది బుద్ధదేవులో కాలగతిని బడిపోవుచున్నారు ! బిడ్డా ! నాకు నారాయణునందు నమ్మకము గలదు. నరుడనిన నాకు విశ్వాసము మెండు. దీనజనసేవ నా పరమనిష్ఠ ; పరులకుపకరించు నిమిత్తము నేను నరకమున దుముకుటకైనను సంసిద్ధుడను ! ఈ పాశ్చాత్యుల గురించియేమి చెప్పుదు ? వీరు నాకు తిండిపెట్టుచున్నారు; నీడ నొసగుచున్నారు; మిత్రభావము చూపుచున్నారు; సంరక్షకులై నిలుచుచున్నారు. —శుద్ధపూర్వాచార పరులగు క్రైస్తవులు సయితము అటులచేయుచున్నారు! వీరి బోధకులలో నొకడు భారతదేశమువచ్చునపుడు మీరెటుల చూచుచున్నారు ? మీరు వానిని తాకనైనను తాకరుగదా; వానిని మ్లేచ్ఛుడందురుగదా! ఏనరుడుగాని, ఏజాతిగాని, బిడ్డా! ఇతరులద్వేషించి వర్ధిల్లజాలునా? ఏనాడు మ్లేచ్ఛ శబ్దమును కల్పనచేసి అన్యజనసంసర్గమును మానుకొనెనో, ఆనాడే భారతభూమి శాపగ్రస్తమైపోయినది! అట్టిభావమును మీరెటుల ఆదరింతురో జాగ్రత్త! వేదాంతమనుచు గజిబిజిగ ముచ్చటలాడుట సులభమే; కాని ఆ సిద్ధాంతముల నిసుమంతైనను ఆచరించుటన ఎంతయు దుర్లభము సుమీ !

ఇట్లాశీర్వాదపురస్సరముగ,

నీ వివేకానందః

ఉ. లే:—అధికారవాంఛ మత్సరము, అను నీరెంటిని గుఱించి మెలకువతో నుండుడు. 'ఆత్మవిశ్వాసమును' సదా అలవఱచుకొను చుండుడు.

వివేకానంద.

---

# శ్రీ పరబ్రహ్మోపాసన !!

# త్రయోదశ మార్గములు.

(గతసంచిక 311 పుట శేషము.)

క. అదితియుఁగశ్యపుఁ డనఁగా
విదితులరగు మీకుఁగుఱుచ వేషంబుననే
నుదయించితి వామనుఁడనఁ
ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్. 132

క. ఇప్పుడుమూఁడవ భవమునఁ
దప్పక మీకిరువురకును దనయుఁడనైతిం
జెప్పితిఁబూర్వము మీయం
దప్పటికిని లేదు జన్మమిట పైనారుఁ. 133

క. నందనుఁడనియుంబరమా
నందంబగు బ్రహ్మమని యనను దలచుఁచునా
పెంజెరువునొం దెదరునా
యందుల ప్రేమమున భవమునందరు మీరల్. 134

వ. అనియిట్లువలికి యీశ్వరుం డారూపంబు విడిచి. 135

క. తెప్పలిడక తలిదండ్రులు
దప్పక తనుఁజూడమాయఁ దనరిలలితుఁడై
యప్పుడటుగన్న పాపని
యొప్పున వేడుకలు సేసె నొకకొన్నినృపా. 136

(మన్ను భక్షించ లేదను నెపమున తల్లికి విశ్వరూపదర్శనము)

(భాగవతము దశమస్కంధ-పూర్వభాగము)

వ. అనిపలికినమునుగుదతల్లికి నెఱవాది దంటయైనకొడు కిట్లనియె.

శా॥ అమ్మామన్ను దినంగనే శిశువనో యూఁకొంటినో వెట్టినో
నమ్మంజూడకు వీరిమాటలుమదిఁ నన్నీవుగొట్టంగఁదా
రిమ్మార్గంబు ఘటించిచెప్పెదరు కాదేని మదీయాస్యగం
ధమ్మాఘ్రాణముసేసి నావచనముల్ దప్పైన దండింపవే. 339

వ. అనిపలికి నెయ్యంబున నయ్యవ్వనియ్యకొలిపి క్రీడామనుజ
బాలకుండైన యీశ్వరుండు తననోరు దెఱచిముఖంబు జూపిన 340

క॥ ఆలలితాంగి గనుంగొనె
బాలునిముఖమందు జలధిపర్వతవన భూ
గోళశిఖితరణి శశిది
క్పాలాదికరండమయిన బ్రహ్మాండంబుల్. 341

వ॥ కనుంగొని. 342

మ. కలయో వైష్ణవ మాయయో యితరసంకల్పార్థమో సత్యమో
తలఁపఁ నేరక యున్నదాననో యశోదాదేవిఁగానో పర
స్థలమో బాలకుఁడెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమైయుండుట కేమి హేతువో మహాశ్చర్యంబు చింతింపఁగన్.

ఆ. బాలమాత్రుఁడైన బాలునిముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసియుండు
బాలుభంగినితఁడు బాసిల్లుఁగాపస
ర్వాత్ముఁడాది విష్ణుఁడగుటనిజము. 344

వ. అని నిశ్చయించి. 345

ఆ. ఏమహాత్ములవలన నీవిశ్వమంతయుఁ
గానఁబడినబుద్ధికంపమయ్యె
నా మహాత్మునితని నఖిలలోకాధారు
నార్తులెల్లఁబాయ నాశ్రయింతు. 346

క. నా మగఁడు నేనుగోవులు
నీమందయు గోపజనులు నిబ్బాలునినె
మ్మోమున నున్నవిధముగని
యేమఱితిమిగాని యీశుడీతడుమాకున్. 347

వ. అని తన్నుఁ బరమేశ్వరుండని తలంచుచున్న యశోదయందు నాకృష్ణుండు వైష్ణవ మాయం బొందించిన. 348

క. జడనుపడి యెఱుక సెడియా
పడఁతుక సర్వాత్ముఁడనుచుఁ బలుకక
యతనిం గొడుకని తొడపైనిడుకొని
కడువేడుకతోడ మమత గావించెనృపా. 349

(అనంతత్వనిరూపణము–శ్రీకృష్ణుని ఱోల కట్టుట)

---

(భాగ-దశ-పూర్వభాగము)

వ. అని నిశ్చయించి కేలనున్న కోల జళిపించి బాలా నిలునిలు మని బగ్గుబగ్గున నదల్చుచుఁ దల్లిదగ్గఱిన బెగ్గడిలిన చందంబున నగ్గలిక సెడి ఱోలు డిగ్గనుఱికి.

క॥ గజ్జెలుగల్లని మ్రోయఁగ
నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో
గిజ్జనములు నగఁదల్లియుఁ
బజ్జంజను దేరనతఁడు పరువిడెనధిపా. 369

వ. అప్పుడు. 370

మ॥ స్తనభారంబున డస్సిక్రుస్సియనదై జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణగూడఁ బాఱెమెయిదర్పా వారించుచున్వాకిటన్
ఘనయోగీంద్రమనంబులున్ వెనకొనంగా లేనిలీలారతున్. 371

వ. ఇట్లు గూడంజని. 372

సీ॥ స్తంభాదికంబులు దనకు నడ్డంబైన
సిట్టట్టుసనిపట్ట నీనివాని
నీతప్పు సైరింపు మింకదొంగిలఁబోవ
నేనని మునుముట్ట నేడ్చువానిఁ
గాటుక నెఱియంగఁ గన్నులునులుముచు
వెడలు కన్నీటితో వెగచువాని
నేదెసవచ్చునో యితియని పలుమాఱు

ఆ॥ గూఁడ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ
జిన్ని వెన్నదొంగ సిక్కెననుచు
నలిగికొట్టఁ జేతులాడక పూఁ బోఁడి
కరుణతోడ బాలుఁ గట్టఁ దలచి 373

వ॥ ఇట్లనియె. 374

క॥ వీరెవ్వరు శ్రీకృష్ణులుఁ
గారాయెన్నఁ డును వెన్నఁ గానరఁటకదా
చోరత్వంబించుకయును
నేరరఁట ధరిత్రినిట్టి నియతులుగలరే. 375

క॥ ఆలలనగట్టె బోలన్
లీలన్ నవనీత చౌర్యలీలుంబ్రియవా
గ్జాలుంబరివిస్మితగో
పాలున్ ముక్తాలలామ ఫాలున్ బాలున్. 380

క॥ బోలనుగట్టునడియున
బ్బాలుడు విలసిల్లెభక్తపరతంత్రుండై
యూలాన సన్నిబద్ధవి
శాలమదేభేంద్రకలభ సమరుచి నధిపా. 381

క. వెలిలోను మొదలు దుదినడు
ములు లేక జగంబుతుదియు మొదలున్ నడుమున్
వెలియునులోనగు నీశ్వరు
నలవడునేకట్టఁ బ్రణతురాల్ గాకున్నన్. 382

ఆ. పట్టియెల్లబోఁటి పట్టి యూతండని
గట్టితలఁపుతోడఁ గట్టెగాక
పట్టికడుపుపెక్కు బ్రహ్మాండములువట్టు
టెఱిఁగెనేనిఁ దల్లి యేలకట్టు. 383

క॥ చిక్కఁడుసిరికౌఁగిటిలోఁ
జిక్కఁడుసనకాదియోగి చిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావనిఁ
జిక్కెనతఁడు లీలఁదల్లిచేతన్ ఱోలన్.

వ॥ ఇట్లుగ నిద్దననాముద్దియ ముద్దులగ్ముకనియుదరంబుగట్టఁ జదురంబున చక్కనొక్క తాటిడు సుట్టిననది రెండంగుళంబులు గడమపడియె. మఱియునొక్క బంధనంబు సంధించి నలగొనిన నంతియకొంత యయ్యె. వెండియునొక్క పాశంబుగూర్చి పరివేష్టించిన వెల్తిసూపె నట్లు. 385

క. తజ్జననిలోఁగిటంగల
రజ్జుపరంపరల గ్రన్ననకుసుతుఁగట్టన్
బొజ్జదిరిగి రాదయ్యెజ
గజ్జాలపులున్న బొజ్జఁగట్టన్ వశమే. 386

వ. అప్పుడా యవ్వయు గోపికలును వెఱఁగుపడిరి తదనంతరంబ.

ఆ. ఒడలఁజెమట లెగయను త్తరీయముజాఱ
వీడియున్న తుఱుము విరులురాలఁ
గట్టరాని తన్నుఁగట్టదనసిచింతఁ
గట్టుకొనిన తల్లిఁగరుణఁజేసి. 388

క. బంధవిమోచనుఁడీశుఁడు
బంధింపఁబెనంగు జననిఁ బాలించి సుహృ
ద్బంధుఁడుగావున జననీ
బంధంబునఁ గట్టునడియెఁ బాటించినృపా. 389

క. సంగడిఁదిరిగెడు శంభుఁడు
నంగాశ్రయమైన సిరియు నాత్మజుఁడైయు
ప్పొంగెడి పద్మజుఁడునుగో
పాంగనక్రియఁ గరుణవడయ రఖిలేశ్వరుచేన్.

క. జ్ఞానులచే మానులచే
దానులచే యోగసంవిధానులచేతం
బూని నిబద్ధుండగునే
శ్రీనాథుఁడు భక్తియుతుల చేతంబోలెన్. 391

(ప శేషము.)

# జీవిత లక్ష్యము.

(గ్రంథకర్తలు - శ్రీ మతకుమల్లి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు
శ్రీ రామకృష్ణ వివేకానంద సందేశ ప్రచారకులు)

ప్రకాశకులు - శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారు; ప్రొప్రైటర్;
వేంకట్రామా అండు కో, హెడ్ ఆఫీసు, ఏలూరు.)

(గతసంచిక 320-వ పుట శేషము.)

---

Love) విశ్వప్రేమ నాట్యమును చూడగలవు. అప్పుడే రవీంద్రుడు వచించిన (Love is the ultimate meaning of things) సమస్త విషయముల పరమావధి ఆనందమే'' యని తెలుసుకొనగలవు. లెండు! అస్మద్దేశీయులారా? లెండు!! మేల్కాంచుడు! ఈసత్యమును మఱువకుడు. ఆత్మప్రాప్తిగలిగినపుడు భారతదేశమునందుగల 35 కోట్ల మానవులు 35 కోట్ల దేవతలుగ ప్రకాశింపగలరు. ఇట్టి దేవత్వమును పొందవలెనన్న మీ రాక్షసత్వమును వీడవలె; మీఅంధతమస్సులు పోవలె; అట్టి పరమపూజ్యమైన స్థితి పొందుటకు మీకు యిచ్ఛలేదా? ఇష్టమున్న యిపుడే ఆ స్థితిపొందుటకు లెండు. రేపు అనునది లేదు. రేపు అన్నది లేక పోవచ్చును.

Eternal Now ఇప్పుడే యిప్పుడే; ఆత్మరాజ్యమును ప్రవేశింతము రండు; యిది మన జన్మహక్కు; దీనినాటంకపెట్టువారెవ్వరును లేరు; హైందవదేశమున జన్మించి అరిషడ్వర్గమును బరిమార్చి, తపస్సుచే నిశ్చల చిత్తముతో ఆత్మను సాక్షాత్కరించి, ఆత్మవిజయము స్థిరపరచి, పాంచభౌతిక దేహమును విసర్జించి ఆధ్యాత్మగగనమండలమున తారకా గణములలో బ్రకాశించు ఋషివర్గపు పరువుకీర్తులు కాపాడవలెనన్న మీరుగూడ ఋషులు కావలె. 35 కోట్లభారతీయులు ఆత్మవిజయము పొందినపుడు భారతదేశము ఎట్టికీర్తి యశస్సుల నెల్ల ప్రపంచమునకు బ్రసాదింప గలదో, అది ఊహాతీతము; వర్ణనాతీతము; కాని అదియే పరమ పూజ్యమైనపదవి.



---

## కర్మ.

మ. విధిచేగాని సుర ల్తమంతనెఫలా
  పిప్కారకు ల్గారు త
ద్విధియన్నన్ నియత క్రియాఫలదము
  ర్విన్నత్ఫలం, బన్నఁగ
ర్మధురాయత్తమి బొటజేసి భజనా
  ర్హంభోచుఁ గర్మంబె య
త్యధికంబై ప్రవిభాసిలు న్సురభి మ
  ల్లానీతి వాచస్పతీ.

కర్మచేత మానవుడు బంధింప బడుచున్నాడు; విద్యచేత విముక్తి నొందుచున్నాడు. కర్మస్వరూపము తెలిసుకొనినగాని ఈకర్మ బంధము నుండి మానవుడు విముక్తి నొందజాలడు. అందుచే యీకర్మ స్వరూపము ఒకింత తెలసుకొనుటకు ప్రయత్నింతము. కర్మ త్రివిధము. (1) ప్రారబ్ధము. (2) ఆగామి. (3) సంచితము. ఈకర్మ స్వరూపమును లోకమాన్యుడు తన గీతారహస్యమునందు రెండుగా మాత్రమే విభజించియున్నాడు. (1) ఆరబ్ధము. (2) అనారబ్ధము. ఈ భేదము యథార్థములో అంతగా బాధింపదు జీవుడు తాను సంపాదించిన కర్మసముదాయములో తీవ్రకర్మ నాధారము చేసికొని దేహధారియగు చున్నాడు. ఈకర్మ ఫలమునే జీవుడు యీజీవితమున అనుభవించును. ఇదియే ప్రారబ్ధము. అనుభవించుటకు ఆరంభింపబడిన దేహధారియగు జీవుని కర్మ ఆరబ్ధమని లోకమాన్యుడు వచించియున్నాడు. ఆరబ్ధమనగా నారంభింపబడినది. ఇక దేహధారియైన జీవుడు యీ జన్మమునందు సంపాదించు కర్మకు ఆగామియనిపేరు. ఆగామియన రానున్న కర్మ. ఇక అనేక జన్మార్జితమై, జీవుని సూక్ష్మశరీరమునకు అంటినదై, చిత్తసరోవరమున అణగి ఆరంభింపబడక, మున్ముందు అనుభవింపవలసిన కర్మసముదాయమునకు సంచితమనిపేరు. ఆగామిసంచితములు ఇప్పుడనుభవించుటకు ప్రారంభింపబడలేదు. కాన యీకర్మ సముదాయమును లోకమాన్యుడనారబ్ధమని వచించినాడు. ఇది కర్మ స్వరూపము.

"ప్రారబ్ధం భోగతో నశ్యాత్." ప్రారబ్ధము ననుభవించిన గాని నశింపదు. ఇది ఋషుల సిద్ధాంతము. కాని దేహసంబంధమగు ప్రారబ్ధమును జీవుడు మానసికముగ తప్పించుకొనవచ్చును; బాధపడకుండ వచ్చును; ఆవిషయమును గూర్చి తదుపరి విచారింతము. ఇక ఆగామి సంచితములగూర్చి విచారింతము. ఒక దూదిగాశియందు నిప్పురవ్వ పడిన దూదియంతయు దగ్ధమై పోవునుగదా! అటులనే సంచితమను దూది రాశియందు జ్ఞానమను నిప్పురవ్వబడిన సంచిత కర్మయంతయు దగ్ధమైపోవును. అప్పుడు జీవుడు సంచితమును అనుభవించుటకై మరల మరల దేహమును ధరింపవలసిన పనిలేదు. జ్ఞానోదయమైనతోడనే అజ్ఞానమను చీకటి నశించునుగదా; అజ్ఞానముచే గలిగిన సంచితమంతయు నశించును. వాసనాక్షయమై మనోనాశనమును పొందినప్పుడు యింక సంచితమెక్కడ? ఇక ఆగామినిగూర్చి విచారింతము. జీవునికి పుణ్యపాపములు అహంమమలచే ప్రేరేపింపబడిన దేహాత్మభ్రాంతిచే గలుగుచున్నవి. దేహాత్మభ్రాంతి పోవలెనన్న అహంమమలను పిశాచములనుండి జీవుడు బైటపడవలె. ఈఅహంమమలచే ప్రేరేపింపబడి జీవుడు పుణ్య పాపములను సంపాదించుకొనుచున్నాడు. ఇదియే ఆగామి. జీవుడు బ్రహ్మజ్ఞానముచే సంచితమును నశింపజేసుకొని అహంమమలనువదలుచున్నాడు. అజ్ఞానముచే వచ్చిన 'నేను, నాది' అను భావములు వీడివిలక్షణుడై ఆత్మస్వరూపుడుగా ఆనందించుచున్నాడు. అప్పుడతని కార్యములు ఆతని బంధింపలేవు. ప్రారబ్ధముచే వచ్చిన దేహమున్నంతవరకు పనులు చేయుచుండును గాని, తనకర్మచే తాను బంధింపబడడు. చూచువారికి బంధితుడైనట్లు కనుబడుచున్నను వాసనాక్షయమును పొందిన కారణముచే ఆతడు విలక్షణుడే. ఆతని జీవితమంతయు మనకు ఒక గుణపాఠమే. ఇప్పుడు మనము నేర్చుకొనిన విషయమేమన; జ్ఞానముచే సంచితము నశించుననియు, అహంమమలు వీడుటచే ఆగామి లేదనియు, అనిగదా! అనగా ఆగామి సంచితములు నశించి, ప్రారబ్ధముచే వచ్చిన దేహధారియైన జీవుని ఆగామి సంచితములు బంధింపలేవు. మానసికమే జ్ఞానముచే లయమొందగా కర్మయెవరిని బంధించును? పుణ్యపాపము లెవరికి? ఇకఅనుభవించక తప్పని

ప్రారబ్ధమునందుండి కూడ మానవుడు ఎట్లు స్వేచ్ఛ ననుభవించు చున్నాడో చూతము. ప్రారబ్ధము దేహసంబంధమైనది. రోమక దేశమున మహావక్తయని పేరు ప్రతిష్ఠలు గాంచిన (Ciciro) సిసిరో పండితుడు దేహము బాధజెందవచ్చును. కాని మానసికము మన యధీనములో నున్నది. దానిని దేహముతో లగ్నము చేయక విడదీసిన దేహబాధ నంటకుండవచ్చునని వచించియున్నాడు. బంధమోక్షములకు కారణము మనస్సని ఉపనిషద్వాక్యముఁగదా! "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" మిల్టన్ మహాకవి గూడ మానసికముచే నరకమును స్వర్గధామముగ మార్చగలము. స్వర్గమును నరకతుల్యముగ గోచరింపజేయునది గూడ యీమానసికమే యని వచించియున్నాడు. గ్రీసు దేశమున ఏథెన్సు పట్టణమునకు జ్యోతిస్స్వరూపుడై, తత్వమును దేవలోకమునుండి మానవలోకమునకు కొనిచ్చిన ధీరుడని ప్రఖ్యాతివడసిన సోక్రెటిస్ అను పండితుడు విషపాత్రను ఆనందముతో త్రాగి దేహమును తృణప్రాయముగఁ జూడగలిగెఁగదా. దేనిచేత? మానసిక స్వేచ్ఛచేత జానుబనియన్ చెఱసాలలో బంధితుడై చెఱసాలను పర్ణశాలగ భావించి ప్రపంచమునకు "యాత్రికుల ప్రయాణము (Pilgrims Progress) అనుగ్రంథరాజము నొసంగగలిగె. ఇటులనే లోకమాన్యుడుగూడ చెరసాలలో గీతారహస్యము వ్రాయగలిగెగదా. దేనిచేత? మానసిక స్వేచ్ఛచేత. రోమక దేశమున కుంటివాడగు ఎపిక్టిటస్ అనుతత్వవేత్త తన్ను బంధించి నప్పటికి పరాత్పరుడు సహితము తన్నువిచారగ్రస్థునిచేయలేడని వచించినాడుగదా! మరియు ప్రహ్లాదుడు తన మానసికమును భగవంతునియందు లగ్నముచేసిన కారణముచే తండ్రి యాజ్ఞలననుసరించి తన దేహమును ఏనుగులచే త్రొక్కించినను, నిప్పుచేకాల్చినను తైలపాత్రలలోవడవైచినను, వేడియినుకలో నిలబెట్టినను, అంటక తామరాకులోని జలమువలెనుండగలిగెగదా! రాముడా సుగ్రాడు! సను స్తత్రుములనుండి యెట్లు స్వేచ్ఛ పొందగలిగె. ఇక మన రాష్ట్రమున కలకత్తాకు సమీపమున దక్షిణేశ్వరమున శ్రీ రామానుడై జ్ఞానజ్యోతివలె వెలిగి భౌతిక దేహమును వీడి హైందవజగమునం డెలమున

ప్రకాశించుచున్న రామకృష్ణుడు గొంతులోపుండు పుట్టగా డాక్టరుచే శస్త్రచికిత్స చేయబడినప్పుడు నిశ్చలభక్తి చిత్తముతో సమాధియం దుండు దేహబాధ కతీతుడు కాగలిగెఁగదా! అందుకనియే ప్రారబ్ధకర్మ గూడ సమాధిచే నశింప చేయవచ్చునని విజ్ఞానభిక్షువచించియున్నాడు. యథార్థముగ నశించకున్నను జీవునికి బాధలేదు. బాధలేనప్పుడు ఉన్ననేమి? లేకున్ననేమి? ఈసమాధి నవీనజ్ఞానమునకందదు. అంగుళ ములోతుకు మాత్రమే పోగలిగిన యీనవీన జ్ఞానము. యింకనెన్ని శతాబ్దములకు సమాధిస్థితి తెలుసుకొనగలదోగదా! సమాధి పొందు ట మాత్రము వీరికి కలలోనివార్త. రామకృష్ణుడు సమాధిలోనుండగ చూచి డాక్టరుసర్కారు (Western Science cannot explain it) పాశ్చాత్య విజ్ఞానము ఈస్థితి బోధింపలేదన్నాడు.

వివేకానంద స్వాములవారు హిమాలయ పర్వతములలో పర్య టనము సల్పుచుండ ఒకప్పుడొక యోగిపుంగవుని గాంచినారట. ఆ యోగిపుంగవుని ఒక ఘోరవ్యాఘ్రము నోటగరచుకొని, దేహమును జీల్చుచుండగ, అట్టిబాధలో సహితము 'సోహం' సినాదము వివేకా నందునికి వినవచ్చినదట. దేహాత్మ భ్రాంతినివర్జించి మానసికము నాత్మ యందు లగ్నమొనర్చి విపరీత పరిస్థితియందు సహితము 'సోహం' అని జప మొనర్చుచున్న యోగిపుంగవుని ధైర్యసాహసమునకు మన మాశ్చర్య పడవలసి యున్నది. మరియు రామతీర్థ స్వాములవారు తమ జీవితకాలమున నొక సాధుపుంగవుని సందర్శించి నారట. ఆమహా నీయుని కాలిపై నొకరణము గలదట. చీము నెత్తురుతో గూడిన నా రణమునుండి పురుగులు క్రింద పడుచుండగ మందహాసవదనముతో తిరిగి వాటిని రణముపైనుంచి చీము నెత్తురుపీల్చునట్లు చేయుచున్నాడట. ఏమి ఆశ్చర్యము! ఆ సాధువు దేహాత్మ భ్రాంతి వర్జించి, పాంచభౌతిక దేహమును తృణప్రాయముగనెంచి దేహబాధ కతీతుడుఁగా కలిగెగదా! ఈ విషయము లేమి బోధించు చున్నవి? జీవించి యుండగనే తత్వజ్ఞానముచే జీవ బ్రహ్మైక్యాను సంధానము చేసి, నిత్య సమాధి యందానందించు దేహధారులవస్థాత్రయాతీతులై ప్రకృతి సంబంధ మైన దేహబాధకు విలక్షణులై ఆనందిప గలరు గదా! (సశేషము)

# శుద్ధాంధ్రభారతి

సంపుటం 13. | ప్రమాది సం॥రం మార్గశిరమాసం డిసంబరు నెల 1939. | సంచిక 10.

భక్తియోగః











జ్ఞానయోగః

(పత్రిక విలాసము:— శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

సర్వభూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి
యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

Printed by R. Krishna Singh, at the Dt. Printing Works, Chittoor.
Published by:— K. Venkatachalam Naidu, Tapovanam, Chittoor.

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, యేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కతారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చంధా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు.
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, ఆడ్రా."
5. శ్రీయుత. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్ పూర్.
6. సారంగం శేషయ్యగారు కోట.

# యథార్థభారతి

సంపుటం 13
సంచిక 10

ప్రమాది సంవత్సరం
మార్గసిర మాసం
1939 సం॥రం డిసెంబరు నెల

చందా
సం॥రం రు 2-4-0
విడిపత్రిక రు 0-4-0

ఓం

## బ్రహ్మవిద్యాశీర్వాదపద్ధతి.

---

29. వాసనాక్షయమనోనాశాభ్యాం నిర్వాసనే వృత్తిశూన్యే చిత్తే సంశయ విపర్యయదోషద్వయాఽభావేన ప్రతిబన్ధాఽభావాదుత్పన్నం తత్త్వజ్ఞానమబాధితత్వేన సురక్షితం భూయాత్.

తా॥ వాసనాక్షయము, మనోనాశము అను నీరెంటిచేతను వాసనలేని వృత్తిశూన్యమైన చిత్తమందు సంశయము, విపర్యయము అను దోషములు రెండును లేనందువలన ప్రతిబన్ధము కలుగమిచే బుట్టిన తత్త్వజ్ఞానము బాధింపబడకుండునట్లు చక్కగా రక్షింపబడినది యగుగాక !

30. పఞ్చమ్యాది భూమిత్రయరూపాయాం జీవన్ముక్తౌ సంపాద్యమానాయాం ద్వైతాభాసాభావేన సంశయ విపర్యయ ప్రసంగాభావాదుత్పన్నం తత్త్వజ్ఞాన మబాధితత్వేన సురక్షితం భూయాత్.

తా॥ అయిదు మొదలు మూడు (5,6,7) భూమికలయొక్క స్వరూపమైన జీవన్ముక్తిలభించునప్పుడు ద్వైతము గోచరింపమిచే సంశయ విపర్యయ ప్రసంగము లేనందువలన కలిగినట్టి తత్త్వజ్ఞానము బాధింపబడనియట్లు చక్కగా రక్షింపబడినది యగుగాక !

---

# విషయసూచిక.



## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, యేర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కఠారి. వెంకటసుబ్బరాజుగారు—చిననింద్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడ గ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చంధా రూ. 10.

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు.
3. శ్రీయుత. మైలవరపు చిన్నహనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, ఆడ్రా."
5. శ్రీయుత, కృష్ణమూర్తి నాయుడుగారు, జంషెడ్ పూర్.
6. సారంగం శేషయ్యగారు కోట.

# యథార్థభారతి

సంపుటం 13 | ప్రమాది సంవత్సరం | చందా
సంచిక 10 | మార్గసిర మాసం | సం॥రం రు 2-4-0
1939 సం॥రం డిసంబరు నెల | విడిప్రతిక రు 0-4-0


ఓం

## బ్రహ్మవిద్యాశీర్వాదపద్ధతి.

29. వాసనాక్షయమనోనాశాభ్యాం నిర్వాసనే వృత్తిశూన్యే చిత్తే సంశయ విపర్యయదోషద్వయాఽభావేన ప్రతిబన్ధాఽభావాదుత్పన్నం తత్త్వజ్ఞానమబాధితత్వేన సురక్షితం భూయాత్.

తా॥ వాసనాక్షయము, మనోనాశము అను నీరెంటిచేతను వాసనలేని వృత్తిశూన్యమైన చిత్తమందు సంశయము, విపర్యయము అను దోషములు రెండును లేనందువలన ప్రతిబన్ధము కలుగమిచే బుట్టిన తత్త్వజ్ఞానము బాధింపబడకుండునట్లు చక్కగా రక్షింపబడినది యగుగాక !

30. పఞ్చమ్యాది భూమిత్రయరూపాయాం జీవన్ముక్తౌ సంపాద్యమానాయాం ద్వైతాభాసాభావేన సంశయ విపర్యయ ప్రసంగాభావాదుత్పన్నం తత్త్వజ్ఞానమబాధితత్వేన సురక్షితం భూయాత్.

తా॥ అయిదు మొదలు మూఁడు (5,6,7) భూమికలయొక్క స్వరూపమైన జీవన్ముక్తిలభించునప్పుడు ద్వైతము గోచరింపమిచే సంశయ విపర్యయ ప్రసంగము లేనందువలన కలిగినట్టి తత్త్వజ్ఞానము బాధింపబడనియట్లు చక్కగా రక్షింపబడినది యగుగాక !

ఓం.

# తొలిపలుకు.

విజ్ఞానమూర్తులగు సోదరీ సోదరులారా!

ఈ "సదాచార"మను చిన్ని పొత్తము శ్రీ శంకర భగవత్పాదాచార్యులచే విరచితము. ఇద్దానికి తంజావూరు ప్రాంతీయులును, కీర్తిశేషులు నగు శ్రీ బ్రహ్మానందస్వాములవారు ద్రావిడభాషలో తాత్పర్యము వ్రాసియుండిరి. ఇయ్యది, యాంధ్రుల కపరిచితంబగుటం జేసియు, బ్రహ్మజ్ఞానాభిలాషులై అభ్యాసులగువారికి ఉపకరించునని తలంచియు, దీనికాంధ్రమున తాత్పర్యము వ్రాయబడెను. ఇయ్యది జిజ్ఞాసువులకు చాలయుపయోగకరమని నమ్మెద.

ఇట్లు,

ఆంధ్రానువాదకుడు: B. ప్రహ్లాద్,

సాహిత్యశిరోమణి.

---

ఓం

# సదాచారము.

## మంగళాచరణము.

సచ్చిదానందకందాయ జగదంకురహేతవే
సదోదితాయ పూర్ణాయ నమోఽనంతాయ విష్ణవే. 1

తా॥ సచ్చిదానందమునకు మూలమును, జగత్తనెడి అంకురమునకు కారణమును, ఎల్లపుడు పుట్టియేయున్న (నిత్యుడు) పరిపూర్ణుడును, అనంతుడును, సర్వవ్యాపియునగు పరబ్రహ్మము కొఱకు నమస్కారము.

## ప్రతిజ్ఞ — అధికారియు.

సర్వవేదాంతసిద్ధాంత గ్రథితం నిర్మలం శివం
సదాచారం ప్రవక్ష్యామి యోగినాం జ్ఞానసిద్ధయే. 2

తా॥ సమస్తవేదాంత సిద్ధాంతములు గలిగి, నిర్మలమై, మంగళప్రదమునగు నీసదాచారమును యోగుల జ్ఞానసిద్ధికై చెప్పబూనుచున్నాను.

## గాయత్రీ ప్రాతఃస్మరణము.

ప్రాతఃస్మరామి దేవస్య సవితుర్భర్గ ఆత్మనః
వరేణ్యం తద్ధియో యోఽనన్తచిదానందే ప్రచోదయాత్. 3

తా॥ ఎవడు మన బుద్ధిని చిదానందమున ప్రేరేపించునో అట్టి సూర్య భగవానునిచేతను ఉపాసింపదగిన స్వయంజ్యోతిని ప్రాతఃకాలమున స్మరింపుచున్నాను.

అన్వయవ్యతిరేకాభ్యాం జాగ్రత్స్వప్నసుషుప్తిషు
యదేకం కేవలం జ్ఞానం తదేవాహం పరం బృహత్. 4

తా॥ అన్వయ వ్యతిరేకములచే జాగ్రత్స్వప్నసుషుప్తులయందు ఏద్ది ఏకమై, కేవలమై, జ్ఞానస్వరూపమునై యున్నదో, అట్టి మహత్స్వరూపమే నేను.

జ్ఞానాజ్ఞానవిలాసోఽయం జ్ఞానాజ్ఞానేచ పశ్యతి
జ్ఞానాజ్ఞానే పరిత్యజ్య జానమేవావశిష్యతే. 5

తా॥ జ్ఞానవిలాసము జ్ఞానమును గాంచును. అజ్ఞానవిలాసము అజ్ఞానమును జూచును. గనుక జ్ఞానాజ్ఞానముల రెండింటిని తొలగించినచో స్వయం జ్ఞానమే మిగులుచుండును.

శౌ చ వి ధి.

అత్యంతమలినో దేహో దేహీచాత్యంత నిర్మలః
అసంగోఽహమితి జ్ఞాత్వా శౌచమేతత్ప్రచక్షతే. 6

తా॥ దేహము అతిమాలిన్యముతో గూడినది. దేహి (ఆత్మ) నిర్మలుడు. నేను అసంగుడను (కర్మబంధములకు లోనుగానివాడను) అను జ్ఞానముగలిగియుండుట శౌచమనంబడును.

మన్మనో మీనవన్నిత్యం క్రీడత్యానందవారిధౌ
సుస్నాతస్తేన పూతాత్మా సమ్యగ్విజ్ఞానవారిణా. 7

తా॥ నామనస్సు సముద్రమున చేపచందమున ఆనందసాగరమున యెల్లపుడు విహరించుచున్నది. ఆ విజ్ఞానమను జలముచే సుస్నాతుడనై మిక్కిలి పరిశుద్ధాత్ముడనైతిని.

అ ఘ మ ర్ష ణ స్నా న ము.

అథాఘమర్షణం కుర్యాత్ప్రాణాపాననిరోధతః
మనః పూర్ణే సమాధాయ మగ్నః కుంభోయథార్ణవే. 8

తా॥ ప్రాణాపాననిరోధమువలన అఘమర్షణ మంత్రమును (పాపముల నశింపచేయు మంత్రమును) జపింపవలయును, తదుపరి మనస్సు

సమాధానతనొంది పరిపూర్ణమగు పరమాత్మయందు సముద్రమున పూర్ణ ఘటముపోల్కి మగ్నమైయుండును.

## సంధ్యావిధి.

లయవిక్షేపయోస్సన్ధౌ మనస్తత్ర నిరామిషమ్
స సంధిః సాధితో యేన స ముక్తో నాత్ర సంశయః. 9

తా॥ లయమునను (సుషుప్తియందును), విక్షేపమునను (మనస్సంచలనముగల జాగ్రత్స్వప్నములయందు) మనస్సును భోగరహితముగ నుంచుట (ఇచ్ఛలేకుండనిల్పుట) సంధియగును. అట్టిసంధి (సంధ్య) ఎవనిచే సాధింపబడునో అతఁడు ముక్తుడు. ఇట సందియములేదు.

## సాధనజపము.

సర్వత్రప్రాణినాందేహే జపోభవతి సర్వదా
హంసః సోఽహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే 10

తా॥ సమస్తప్రాణుల దేహమున ఎల్లపుడు "హంసః, సోఽహం" అను మంత్రజపము జరుగుచుండును. అద్దానిని జ్ఞాని గనుగొని సర్వబంధములనుండి విడివడును.

## తర్పణము.

తర్పణంస్వసుఖేనైవ స్వేంద్రియాణాం ప్రతర్పణమ్
మనసా మన ఆలోక్య స్వయమాత్మా ప్రకాశతే. 11

తా॥ స్వస్వరూపసుఖమునందు తన ఇంద్రియములయొక్క మిక్కిలి అర్పణమెద్దిగలదో అది తర్పణమగును. మనస్సుచే మనస్సును గనుగొన్నచో అద్దాన, ఆత్మస్వయముగ ప్రకాశించును.

## అగ్నిహోత్రము.

ఆత్మని స్వప్రకాశాగ్నౌ చిత్తమేకాహుతిం క్షిపేత్
అగ్నిహోత్రీ స విజ్ఞేయః ఇతరే నామధారకాః. 12

తా॥ ఆత్మయను స్వప్రకాశ జ్ఞానాగ్నియందు చిత్తమును ఆహుతిగా నుంపవలయు. అతడే నిజమైన అగ్నిహోత యగును. తక్కిన బాహ్యాగ్నిహోత్రులు కేవలము నామధారులే.

## అ ర్చ న ము.

దేహో దేవాలయః ప్రోక్తో దేహీ దేవో నిరంజనః
అర్చితః సర్వభావేన స్వానుభూత్యా విరాజతే. 13

తా॥ దేహమే దేవాలయము; దేహియే (ఆత్మ) నిరంజనస్వరూపుడగు దేవుడు. ఆ దేవుడు సర్వభావములతో అర్చింపబడి స్వానుభవముచే ప్రకాశించుచున్నాడు.

## స్వా ధ్యా య ము, ధ్యా న ము.

మౌనం స్వాధ్యయనం ధ్యానం ధ్యేయ బ్రహ్మానుచింతనం
జ్ఞానేనేతి తయో స్సమ్యఙ్నిషేధోఽతః ప్రదర్శనమ్. 14

తా॥ మౌనమే స్వాధ్యాయము; ధ్యేయమగు పరబ్రహ్మమును ఎడతెగకుండ చింతించుట ధ్యానమనంబడును. జ్ఞానముచే స్వాధ్యాయ ధ్యానములను (వాఙ్మనఃకర్మలను) సంపూర్ణముగ తొలగించుటయే ఆత్మదర్శనమగును.

## భో జ న ము.

అతీతానాగతం కించిన్నస్మరామి న చింతయే
రాగద్వేషం వినా ప్రాప్తం భునజ్మ్యత్ర శుభాశుభం. 15

తా॥ గడచినదానినిగాని, రాబోవుదానినిగాని స్మరింపను. దానికై చింతింపను. రాగద్వేషములులేక ప్రాప్తించిన శుభాశుభముల ఇహమున భుజింతును (అనుభవింతును).

## జ్ఞా న వై రా గ్య ము ల య వ ధి.

అభయం సర్వభూతానాం జ్ఞానమాహుర్మనీషిణః
నిజానందేస్పృహా నాన్యా వైరాగ్యస్యావధిర్మతః. 16

తా॥ సమస్తప్రాణులకు అభయమే పెద్దలు జ్ఞానమందురు. నిజానందమున (ఆత్మానందమున) ఇచ్ఛయు (ఆశ), ఇతరకాంక్షలయెడ నిరాశయు, వైరాగ్యావధియందురు.

## శ్రవణ, మనన, నిదిధ్యాసనములు.

వేదాంతైః శ్రవణం కుర్యాన్మననంచోపపత్తిభిః
యోగేనాభ్యసనంనిత్యం తతో దర్శనమాత్మనః. 17

తా॥ వేదాంతమును శ్రవణము చేయవలయు. అద్దానిని యుక్తులచే మననము గావింపవలయు. యోగముచే యెల్లపుడు అభ్యాసము సలుపవలయు. తదుపరి ఆత్మసాక్షాత్కారము సిద్ధించును.

అ ప రో క్ష జ్ఞా న ము .

శబ్దశక్తేరచింత్యత్వాత్ శబ్దాదేవాపరోక్షధీః
సుషుప్తః పురుషో యద్వచ్ఛబ్దేనైవానుబుధ్యతే. 18

తా॥ శబ్దశక్తి చింతింపనలవిగానిదగుటచే, నిద్రించు పురుషుడు శబ్దముచే ఎటుల మేల్కాంచుచున్నాడో అటువలె శ్రుతివాక్యముచేతనే అపరోక్షజ్ఞానముదయించును.

ఆ త్మా నా త్మ వి వే క ము .

ఆత్మానాత్మవివేకేన జ్ఞానం భవతి నిర్మలం
గురుణాబోధితః శిష్యః శబ్దబ్రహ్మాతివర్తతే. 19

తా॥ ఆత్మానాత్మవివేకముచే నిర్మలనుగు జ్ఞానముదయించును, గురువుచే బోధింపబడిన శిష్యుడు శబ్దబ్రహ్మము నతిక్రమించుచున్నాడు.

నత్వం దేహో నేంద్రియాణి న ప్రాణో నమనో న ధీః
వికారిత్వాద్వినాశిత్వా ద్దృశ్యత్వాచ్ఛఘటోయథా. 20

తా॥ నీవు దేహమును గావు. ఇంద్రియములును గాజాలవు. ప్రాణములును గానోల్లవు, మనస్సును గానోపవు, బుద్ధియు గానేరవు. ఇవియన్నియు ఘటముమాడ్కి వికారముగలవియు, వినాశముతో గూడినవియును దృశ్యములును గదా. అనగా నీవు (ఆత్మ) వినాశములేనిది. వికారశూన్యము, అదృశ్యము అనగా చర్మచక్షువులకు అగోచరము, గాన పూర్వోక్తస్వరూపము నీవు గావని భావము.

విశుద్ధం కేవలం జ్ఞానం నిర్విశేషం నిరంజనమ్
యదేకంపరమానందం తత్త్వమస్య ద్వయంపరం. 21

తా॥ విశుద్ధమై, కేవలమై, జ్ఞానస్వరూపమై, నిర్విశేషమై, నిరంజనమై, ఏకమై, పరమానందస్వరూపమై యుండునదెద్దిగలదో అద్వయస్వరూపమును, ఉత్కృష్టమునగు, ఆ పరమాత్మస్వరూపమవు నీవు.

శబ్దస్యాద్యంతయోస్సిద్ధం మనసోఽపితథైవచ
మధ్యేసాక్షితయా నిత్యం తదేవత్వంభ్రమంజహి. 22

తా॥ శబ్దముల యొక్క ఆద్యంతములయందును, అట్టులే మనస్సు యొక్క ఆద్యంతములయందును ఏదిసిద్ధించుచున్నదో అది మధ్యమందును సాక్షిరూపమున ఎల్లపుడు సిద్ధించుచున్నది. అదియే నీవు గాని భ్రాంతిని వదలుము.

జీ వ బ్ర హ్మై క్య ము.

స్థూలవైరాజయోరైక్యం సూక్ష్మహైరణ్యగర్భయోః.
అజ్ఞానమాయయోరైక్యం ప్రత్యగ్విజ్ఞానపూర్ణయోః. 23

తా॥ స్థూలమునకును, వైరాజసమునకును, (సమష్టి స్థూలమునకును) సూక్ష్మమునకును, హిరణ్యగర్భునికిని (సమష్టి సూక్ష్మమునకును) అజ్ఞానమునకును, మాయకును, ఐక్యతగలదు. ప్రత్యక్కునకు (కూటస్థునకిని) విజ్ఞానపూర్ణునకు (పరబ్రహ్మమునకు) ఐక్యతగలదు.

చిన్మాత్రైకరసేవిష్ణౌ బ్రహ్మాత్మైక స్వరూపకే
భ్రమఏవ జగజ్జాతం రజ్జ్వాం సర్పభ్రమోయథా. 24

తా॥ చిన్మాత్రైకరసమును, సర్వవ్యాపియునగు బ్రహ్మాత్మైక స్వరూపమున జగత్తు రజ్జువున సర్పమురీతి భ్రాంతిరూపమున గనుపించుచున్నది. అనగా జగము పరబ్రహ్మ స్వరూపమనుట. భ్రాంతివలన (అజ్ఞానము వలన) జగత్తు భాసించుచున్నది.

తార్కికాణాం చ జీవేశౌ వాచ్యావేతౌ విదుర్బుధాః
లక్ష్యౌ చ సాంఖ్యయోగాభ్యాం వేదాంతైరేకతాఽనయోః.25

తా॥ తార్కికులు జీవేశ్వరులు వాచ్యమనియు, సాంఖ్యయోగులు లక్ష్యమనియు, చెప్పుదురు. వేదాంతులు ఈజీవపరమాత్మల ఐక్యతను బోధింతురు.

కార్యకారణ వాచ్యాంశౌ జీవేశౌ యౌ జహచ్ఛ్రుతౌ
అజహచ్ఛ తయోర్లక్ష్యౌ చిదంశావేకరూపిణౌ. 26

తా॥ కార్యకారణ వాచ్యాంశులైన జీవేశ్వరులు జహల్లక్షణతో గూడినవారు. ఈయిరువురి లక్ష్యమైన ఏకరూపమగు చిదంశము అజహల్లక్షణము. (విడువని లక్షణము).

మీమాంసాదికనిరాకరణము.

కర్మశాస్త్రే కుతోఽజ్ఞానం తర్కే నైవాస్తి నిశ్చయః
సాంఖ్యయోగా ద్విధాపన్నా శాబ్దికాః శబ్దతత్పరాః. 27
అన్యే పాషండినః సర్వే జ్ఞావార్తాసు దుర్బలాః
ఏకంవేదాంతవిజ్ఞానం స్వానుభూత్యా విరాజతే. 28

తా॥ కర్మలబోధించు శాస్త్రమున జ్ఞానమెట్లు లభించును? తర్కమున తత్త్వనిశ్చయ మెక్కడిది? సాంఖ్యయోగము సేశ్వర, నిరీశ్వరములనెడి రెండుతెఱంగుల భిన్నగతులు గలిగియున్నది. వ్యాకరణ శాస్త్రజ్ఞులు శబ్దతత్పరులు; మరికొందఱు పాషండులు (నాస్తికులు). వీరందఱును యథార్థజ్ఞానము నెఱుగజాలరు. కాని వేదాంతశాస్త్రమువలన గ్రహింపబడిన విజ్ఞానము మాత్రము స్వానుభవముచే ప్రకాశించును.

బంధముక్తిలక్షణము.

అహంమమేత్యయం బంధో నాహం మమేతిచముక్తతా
బంధోమోక్షో గుణైర్భాతి గుణాః ప్రకృతి సంభవాః. 29

తా॥ నేను, నాదియను భావమే బంధము. ఈదేహము నేనుగాదు, ఇది నాది గాదను భావమే ముక్తి. బంధముగాని మోక్షముగాని గుణములచే ఏర్పడును. గుణములు ప్రకృతివలన జనించునవిగదా?

జ్ఞానమేకం సదాభాతి సర్వావస్థాసు నిర్మలం
మందభాగ్యా న జానంతి స్వరూపం కేవలం బృహత్. 30

తా॥ నిర్మలమైన జ్ఞానమొక్కటే సర్వావస్థలయందు ప్రకాశించుచున్నది. మందభాగ్యులు ఆ దివ్యతత్త్వము నెఱుంగజాలరు.

సంకల్పసాక్షిణం జ్ఞానం సర్వలోకైకజీవనం
తదస్మీతి చ యో వేద స ముక్తో నాత్రసంశయః. 31

తా॥ సంకల్పములకు సాక్షియై సమస్తప్రాణికోట్లకు జీవన మొసంగునట్టి యే జ్ఞానస్వరూపము (పరమాత్మ) గలదో అదియే నేను. దానినెవడెఱుంగునో వాడు ముక్తుడు. ఇట సందియము లేదు.

జ్ఞానప్రామాణ్యము.

ప్రమాతా చ ప్రమాణం చ ప్రమేయం ప్రమితిస్తథా
యస్య భాసావభాసంతే మానం జ్ఞానాయ తస్యకిం. 32

తా॥ ప్రమాత (తెలుసుకొనువాడు), ప్రమాణము (ప్రత్యక్షాది ప్రమాణము.) ప్రమేయము, (తెలియఁదగినది) అట్లే ప్రమితియు (యథార్థజ్ఞానము) ఎవనిశక్తిచే ప్రకాశించుచున్నవో అట్టి పరమాత్మ స్వరూపమును నిరూపింప ప్రమాణము గలదా?

## ప ర వ స్తు స్వ రూ ప ము.

అర్థాకారా భవేద్వృత్తిః ఫలేనార్థః ప్రకాశతే
అర్థజ్ఞానం విజానాతి సఏవార్థః పరఃస్మృతః. 33

తా॥ వృత్తి, వస్తు స్వరూపమగుచున్నది. ఫలము వస్తువుచే ప్రకాశించుచున్నది. అర్థజ్ఞానము నెద్ది తెలుసుకొనునో అదియే పరవస్తువుగ నెంచబడుచున్నవి.

## చి దా త్మ, ఫ ల వ్యా ప్తి కి వి ష య ము గా కుం డు ట.

వృత్తివ్యాప్యత్వమేవాస్తు, ఫలవ్యాప్తిః కథం భవేత్.
స్వప్రకాశస్వరూపత్వాత్ సిద్ధత్వాచ్చ చిదాత్మనః. 34

తా॥ చిదాత్మ, స్వప్రకాశస్వరూపముగ నుండుటంబట్టియు, సిద్ధముగనుండుటచేతను దానికి వృత్తివ్యాప్యత్వమేయుండును గాని, ఫలవ్యాప్తియెట్లుండగలదు?

## ఉ న్మ నీ స్వ రూ ప ము.

అర్థాదర్థే యదా వృత్తిర్గంతుం చలతి చాంతరే
అనాధారా నిర్వికారా యా దశా సోన్మనీస్మృతా. 35

తా॥ ఒక వస్తువునుండి మరియొక వస్తువునకు మనోవ్యాపారము చలించు నడుమ ఆధారములేని, వికారశూన్యమైన, యే యవస్థ గలదో అదియున్మన్యవస్థయగును.

## చి త్త ము, చి త్త గు ట.

చిత్తం చిచ్చ విజానీయాత్తకార రహితం యదా
తకారో విషయాధ్యాసో జపారాగో యథా మణౌ. 36

తా॥ చిత్తమెపుడు తకారరహితమగునో (నిర్వ్యాపారమై) = యుండునో, అది చిత్తని (జ్ఞానస్వరూపమని) యెఱుగవలెను. స్వచ్ఛమగు మణియందు జపాకుసుమ (దాసానిపుష్పపు) వర్ణము సంక్రమించి ఆవర్ణముగలదిగనెట్లు భాసించునో అట్లే తకారమే విషయాధ్యాసమగును.

అనగా చిద్రూపమునకు వస్తుపరిజ్ఞాన మేర్పడినపుడు చిత్తమగు చుండును.

బ్రహ్మనిర్వాణప్రాప్త్యుపాయము.

జ్ఞేయవస్తు పరిత్యాగాత్ జ్ఞానం తిష్ఠతి కేవలం
త్రిపుటీ క్షీణతామేతి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 37

తా॥ జ్ఞేయవస్తువును (దృశ్యవస్తువును) పరిత్యజించుటచే కేవలజ్ఞానమే నిలిచియుండును. త్రిపుటి (జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు) క్షీణమైనచో బ్రహ్మనిర్వాణపదవిని బొందుచున్నాడు.

జ్ఞానాజ్ఞాన విజ్ఞానములు.

మనోమాత్రమిదం సర్వం చిన్మనోజ్ఞానమాత్రకమ్
అజ్ఞానం భ్రమ ఇత్యాహు ర్విజ్ఞానం పరమంపదం. 38

తా॥ మనోమాత్రమైన ఈ కనుపించునదంతయు చిత్తు. మనస్సు జ్ఞానమాత్రము. అజ్ఞానము భ్రమయనియు, విజ్ఞానము పరమపదమనియు, పెద్దలు చెప్పుదురు.

అజ్ఞానం చాన్యథా జ్ఞానం మాయామేతాం వదంతి తే
ఈశ్వరం మాయినం విద్యాన్మాయాతీతం నిరంజనం. 39

తా॥ అజ్ఞానమును, అన్యథాజ్ఞానమును (భ్రాంతిజ్ఞానమును) పెద్దలు మాయయందురు. ఈశ్వరుని మాయగలవానిగను, మాయాతీతమైనది నిరంజనస్వరూపముగను తెలిసికొనుము.

సదానందే చిదాకాశే మాయామేఘ స్తడిన్మనః
అహంతా గర్జనం తత్ర ధారాసారో హి యత్తమః. 40

తా॥ సదానందరూపమగు చిదాకాశమున మాయ మేఘము; మెఱుపు మనస్సు; అహంకారము ఉఱుము; చీకటి అజ్ఞానము; ధారావర్షము అసారము (సారములేమి).

మహామోహాంధకారేఽస్మిన్ దేవో వర్షతి లీలయా
అస్యా వృష్టేర్విరామాయ ప్రబోధైక సమీరిణః. 41

తా॥ మహామోహమనెడి అంధకారముగల యీ జగమున, దేవుడు లీలారూపముగ వర్షించుచున్నాడు. (లీల జరుపుచున్నాడు.) ఈవర్షము నిలుప ముఖ్యమగు ప్రబోధమనెడి (జ్ఞానమనెడి) వాయువు గావలయు.

జ్ఞానం దృగ్దృశ్యయోర్భానం విజ్ఞానం దృశ్యశూన్యతా
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాఽస్తి కించన. 42

తా॥ జ్ఞానము దృగ్దృశ్యములరెండింటిని ప్రకాశింపచేయునట్టిది. విజ్ఞానము దృశ్యరాహిత్యము. పరబ్రహ్మము ఏకము; అద్వితీయము. పరమాత్మయందు కొద్దియైనను నానాత్వము లేదు.

క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం తజ్జ్ఞానం జ్ఞానముచ్యతే
విజ్ఞానం చోభయోరైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనోః. 43

తా॥ క్షేత్రక్షేత్రజ్ఞుల (శరీరజీవుల) నెఱుగుటయే జ్ఞానమందురు. క్షేత్రజ్ఞ పరమాత్మలయొక్క ఐక్యజ్ఞానమును విజ్ఞానమందురు.

పరోక్షం శాస్త్రజం జ్ఞానం విజ్ఞానం చాత్మదర్శనం
ఆత్మనో బ్రహ్మణః సమ్యగుపాధిద్వయ వర్జితం. 44

తా॥ శాస్త్రజన్యమగు జ్ఞానము పరోక్షజ్ఞానము. జీవపరమాత్మల యుపాధులరెంటిని బాగుగవదలుచే ఆత్మదర్శనమనియు, విజ్ఞానమనియు నందురు.

త్వమర్థవిషయంజ్ఞానం విజ్ఞానం తత్పదాశ్రయం
పదయోరైక్యబోధస్తు జ్ఞానవిజ్ఞాన సంజ్ఞకం. 45

తా॥ త్వంపదార్థము (జీవు) నెఱుగుట జ్ఞానము. తత్పదార్థమగు పరబ్రహ్మమును గనుగొనుట విజ్ఞానము. "తత్, త్వం" అనురెండుపదముల ఐక్యత నెఱుగుట (జీవపరమాత్మల యేకతదెలియుట) జ్ఞానవిజ్ఞాన సంజ్ఞకము.

ఆత్మానాత్మవివేకస్తు జ్ఞానమాహుర్మనీషిణః
అజ్ఞానం చాన్యథా లోకే విజ్ఞానం తన్మయం జగత్. 46

తా॥ ఆత్మానాత్మవివేకమే జ్ఞానమని పెద్దలందురు. అజ్ఞానము లోకమును బ్రహ్మముకంటె భిన్నముగ గాంచుట. విజ్ఞానము జగత్తును బ్రహ్మమయముగ జూచుటయగును.

అన్వయవ్యతిరేకాభ్యాం సర్వత్రైకం ప్రపశ్యతి
యత్తు తద్వృత్తిజం జ్ఞానం విజ్ఞానం జ్ఞానమాత్రకం. 47

తా॥ ఒకవస్తువును ఉండుదానికన్న వ్యతిరేకముగ గాంచుట వృత్తి జన్యమగు జ్ఞానము (వృత్తిజ్ఞానము) జ్ఞానమాత్రమైనది. వృత్తి సహితముగానిది) విజ్ఞానమనబడును.

అజ్ఞానధ్వంసకం జ్ఞానం విజ్ఞానం చోభయాత్మకం
జ్ఞానవిజ్ఞాననిష్ఠేయం తత్ సత్ బ్రహ్మణిచార్పణం. 48

తా॥ అజ్ఞానమును నశింపచేయు జ్ఞానము, జ్ఞానవిజ్ఞానోభయాత్మకము. ఈజ్ఞానవిజ్ఞాననిష్ఠ. ప్రాప్తించినచో తత్సత్స్వరూపమగు పరబ్రహ్మమునకు అర్పణము గావించినట్లులగును.

భోక్తాసత్త్వగుణః శుద్ధో భోగానాం సాధనంరజః
భోగ్యం తమోగుణః ప్రాహురాత్మాచైషాం ప్రకాశకః. 49

తా॥ భోక్త (జీవుడు) శుద్ధసత్త్వగుణస్వరూపుడు. భోగసాధనము రజస్సని చెప్పఁబడును. భోగ్యమైన (అనుభవింపతగిన) వస్తువు తమోగుణ స్వరూపమగును. ఆత్మ ఈమూడింటిని ప్రకాశింపజేయునట్టిది.

## బ్ర హ్మ చా రి.

బ్రహ్మాధ్యయనసంయుక్తో బ్రహ్మచర్యరతః సదా
సర్వం బ్రహ్మేతి యోవేద బ్రహ్మచారీ స ఉచ్యతే. 50

తా॥ బ్రహ్మాధ్యయన తత్పరుడై సర్వదా బ్రహ్మచర్యరతుడై సర్వమును పరబ్రహ్మముగ నెవడు గాంచునో అతడు బ్రహ్మచారియగును.

## గృ హ స్థు డు.

గృహస్థో గుణమధ్యస్థః శరీరం గృహముచ్యతే
గుణాః కుర్వంతి కర్మాణి నాహం కర్తేతి బుద్ధిమాన్. 51

తా॥ గృహస్థుడు గుణములకు నడుమ చిక్కియుండువాడు. శరీరము గృహమనబడును. "గుణములు కర్మలను గలిగించును; కాని నేను కర్తనుగాన"ను జ్ఞానముకలవాడు బుద్ధిమంతుడు.

## వా న ప్ర స్థు డు.

కిముగ్రైశ్చ తపోభిశ్చ యస్య జ్ఞానమయంతపః
హర్షామర్షవినిర్ముక్తో వానప్రస్థస్స ఉచ్యతే. 52

తా॥ జ్ఞానరూపమగు తపముగలవానికి ఉగ్రములగు (ఘోరములగు) తపములేల? ఇచ్ఛాద్వేషములు వదలినవాడు వానప్రస్థుడగును.

సన్యాసము.

దేహన్యాసో హి సన్న్యాసః నైవకాషాయవాససా
నాహం దేహో౽హ మాత్మేతి నిశ్చయోజ్ఞానలక్షణం. 53

తా॥ దేహబుద్ధిని వదలుటే సన్న్యాసముగాని కాషాయవస్త్ర స్వీకారమున మాత్రము సన్న్యాసము గాజాలదు. నేను దేహముగాను, ఆత్మస్వరూపుడనను నిశ్చయముగల్గుటే జ్ఞానమలవడినందుకు గుఱుతు.

సదాచారమిమం నిత్యం యే౽నుసందధతే బుధాః
సంసారసాగరాచ్ఛీఘ్రం ముచ్యంతే నాత్ర సంశయః. 54

"ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాదకృతః సదాచారః సమాప్తః".

తా॥ ఈసదాచారము నెల్లపుడు యే బుధులుహృదయమున నుంతురో వారు సంసారసాగరమునుండి తరింపగలరు. సందియము లేదు.

ఇయ్యది, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచితమగు
సదాచారము సమాప్తము.
ఓం తత్ సత్.

---

ఓమ్ తత్సత్.

# యోగము.

(కల్యాణి, హిందీనుండి.)

అనువాదకులు:—శ్రీ సీతారామసేవాసమితివారు.

వేదములు మూడు కాండములుగా విభక్తములై యున్నవి. యేలాగుననగా కర్మకాండము, ఉపాసనాకాండము, జ్ఞానకాండము. వేదములయొక్క కర్మకాండము ననుసరించి కర్మకౌశలమును అనగా కర్మకుశలతను యోగమందురు. ఉపాసనాకాండము ననుసరించి చిత్తవృత్తులను నిరోధించుటను యోగమందురు. జ్ఞానకాండము ననుసరించి జీవాత్మపరమాత్మల యేకీకరణమును యోగమందురు. కర్మకాండము

యొక్క అంతిమలక్ష్యము, నిష్కామముగా కర్మచేయవలయును. శ్రీమద్భగవద్గీతయందు దీనియొక్క విస్తరింపబడిన వర్ణనచేయబడినది. కర్మచేయుచుండియు, కర్మబంధనమునుండి ముక్తి అవుటయే దాని యొక్క స్వరూపమైయున్నది. ఉపాసనాకాండముయొక్క అంతిమ లక్ష్యము అంతఃకరణముయొక్క వృత్తులను సాధనద్వారా నిరోధము చేసి, పరమాత్మయొక్క స్వరూపమును అనుభవము చేయవలయును. తరంగరహిత జలాశయమునందు ఏలాగైతే మనుష్యుడు తనయొక్క ముఖమును చూడగల్గునో అట్లు చిత్తముయొక్క వృత్తులు నిరోధమైన తోడనే దృశ్యప్రపంచముయొక్క ద్రష్ట(పరమాత్మ స్వరూపము) తోడనే అంతఃకరణములో కానుపించుచుండును. ఈ విజ్ఞానముయొక్క విస్తరింపబడిన వర్ణన యోగదర్శనముయొక్క సూత్రములందు దొరకబడును. జ్ఞానకాండముయొక్క అంతిమలక్ష్యము అవిద్యాజనిత అజ్ఞానమును విద్యాకృపవలన దూరముచేసి, ఆత్మజ్ఞానము ప్రాప్తింపజేసికొనుచు పరమాత్మ జీవాత్మలయొక్క ఏ మిథ్యాజ్ఞానముకలదో దానిని తొలగించి జీవాత్మ పరమాత్మలయొక్క అద్వైతసిద్ధిచేయుటయైయున్నది. దీనియొక్క విస్తరింపబడిన వర్ణనము ఉపనిషత్తులు, వేదాంతాది శాస్త్రములందు దొరుకును. ఇదియే వేదములయొక్క మూడు కాండముల ననుసరించి (యోగ) సిద్ధాంతముల రహస్యమైయున్నది. వస్తుతః మూడింటిద్వారా ఒకే అవస్థ ప్రాప్తమగును.

శ్రీభగవానుని సాన్నిధ్యప్రాప్తమునకు సాధనములను ఉపాసనయందురు. ఉపాసనయొక్క ప్రాణము భక్తియైయున్నది. కళేబరము యోగమైయున్నది. శరీరమున ప్రాణములేకపోయిన ఎట్లు శరీరము ఏమాత్రము ఉపయోగమైయుండదో అట్లే భగవద్భక్తిలేని యోగము నటకుని ఆటలాటమైపోవును. శరీరాభావమున ప్రాణముండుటకు ఏస్థానము ఉండదు ఈదశయందు ప్రాణ అస్తిత్వమే సంభవింపజాలదు. ఈ విజ్ఞానము ననుసరించియే భక్తియోగములు ఉపాసనా కాండమునకు అన్నిసాధనములలో అన్యోన్యాశ్రయమై యుండుట స్వాభావికమైయున్నది. యోగతత్వవేత్తలయిన పూజ్యపాదమహాఋషులు యోగసాధనకు నాలుగు స్వతంత్రమార్గము లుపదేశించిరి.

యోగమార్గమునుండి భగవద్రాజ్యములో చేరుటనుగురించి ఎనిమిది మెట్లును జూపిరి. (నాలుగు సాధనము లేవనగా; మంత్రయోగము, హఠయోగము, లయయోగము, రాజయోగము. ఎనిమిది మెట్లేవనగా; యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి) త్రికాలదర్శులును, స్థూల, యట్లే సూక్ష్మరాజ్యములను కరతలామలకమువలె చూచు మహారుషులును యోగవిజ్ఞానమును ఈనాలుగు శ్రేణులు మరియు ఎనిమిది మెట్లలో విభక్తముచేసి యేమో స్తరుగా చూపిరనగా (సాధన మార్గములయొక్క అన్ని అంగ ప్రత్యంగములు యిందే వచ్చివేయును):-

మంత్రయోగముయొక్క సిద్ధాంతమిదియైయున్నది. ఈసంసారము నామరూపాత్మకమైనది. నామరూపముల వలననే జీవుడు అవిద్యయందు చిక్కుకొని కొట్టుకొనుచుండును. మనుష్యుడు ఏభూమి పైపడునో దానియొక్క అనగా తిరిగి ఆభూమి అవలంబన వలననే లేచిపోగలడు. ఎందుచేతననగా నామరూప అవలంబనచేత ఎప్పుడైతే వాడు (జీవుడు) చిక్కిపోవునో అందుచే నామరూపముల అవలంబనచేతనే ముక్తుడుకూడా కాగలడు. మంత్రయోగజ్ఞాత పూజ్యపాద ఆచార్యులు మంత్రయోగముయొక్క సాధనలను పదినూరు భాగములలో విభక్తినొనరించిరి. దిక్శుద్ధి, స్థానశుద్ధి, మంత్రజపము, స్తుతి, న్యాసము ఇత్యాదులు. మంత్రయోగ ధ్యానమునకు, స్థూలధ్యానమందురు. ఈధ్యానము పంచగుణోపాసన మరియు అవతారోపాసనలనుసరించి అనేక ప్రకారములతై యుండును.

హఠయోగ సిద్ధాంతమిదియైయున్నది. స్థూలశరీరము సూక్ష్మశరీరము ఒక్కటీభావమందు గుంబనమైయున్నది. ఒకేదాని ప్రభావము మరియొక దానిపై పూర్తిగాకలిగియుండును. స్థూలశరీరము తనస్వాధీనముచేసి సూక్ష్మశరీరమును స్వాధీనము చేసికొనుచు యోగప్రాప్తిచేసికొనుట హఠయోగమందురు. యోగనిష్ణాత (యోగక్రమము నెరింగినవారు) ఆచార్యులైనవారు హఠయోగమును ఏడంగములలో విభక్తము చేసిరి. ఎట్లనగా నేతి, దౌతీ ఆది షట్కర్మ, ఆసనము ప్రాణాయామము యిత్యాదులు, హఠయోగధ్యానమును జ్యోతిర్ధ్యానమందురు మరియు

ప్రాణనిరోధమువలన జరిగినటువంటి హఠయోగసమాధిని మహాబోధ సమాధియని పిలువబడును.

లయయోగ సిద్ధాంతమిదియైయున్నది. బ్రహ్మాండముయొక్క ప్రతికృతిమానవ పిండమైయున్నది. బ్రహ్మమరియు బ్రహ్మశక్తియొక్క విలాసము యేలాగైతే బ్రహ్మాండమైయున్నదో అట్లే మానవపిండము కూడాయున్నది. గ్రహ, నక్షత్ర చతుర్దసభువనములు మొదలగునవి మానవపిండముయందు గూడాకలవు. పంచకోశముల ఆవరణ శిథిలమైనందుపై పిండము ఎట్లుకావలసివచ్చినను అనగా ఏలోకమునందైనను ఆమూలోకములయందు తన యొక్క సంబంధము స్థాపనచేసికొన్నవచ్చును. ఈవిజ్ఞానమునసుసరించియే మనుష్యపిండముయొక్క ఆధారపద్మమందు కుళకుండలని ఈనామముచే చెప్పబడు బ్రహ్మశక్తి ప్రసుప్తమైయుండి, అవిద్యా ప్రభావమువలన సృష్టిక్రియలు చేయుచుండును. మనుష్యశరీరస్థ సప్తమచక్రము మస్తకమందు యేయోగముద్వారా కుళకుండల నీశక్తిని తీసుకొనిపోయి బ్రహ్మరూప సదాశివునితో కలిపివేయబడునో ఆశివునియందు శక్తి నిలయముచేసి ముక్తిప్రాప్తిచేసికొనుటకు చేయబడిన సాధనయొక్క నామము లయయోగమైయున్నది. లయయోగమునకు ఎనిమిది అంగములు గలవు, లయయోగధ్యానమునకు బిందుధ్యానమనియు, లయయోగసమాధికి మహాలయ సమాధియందురు.

రాజయోగము అన్య మూడుయోగములయొక్క చరమసీమయైయున్నది. దానియొక్క సిద్ధాంతమేమనగా; మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారములతో గూడిన అంతఃకరణయే జీవుని బంధమునకు కారణము మరియు ముక్తికి కూడాకారణము ఎట్లనగా, అశుద్ధమనస్సు జీవుని అధోముఖమునకు త్రోసివేయుచున్నది. శుద్ధమనస్సు ఊర్ధ్వమునకు ఎత్తుచున్నది. అట్లే ఇంద్రియ పరాయణమైన బుద్ధి జీవునిబంధమునకుక్కివేయును మరియు బ్రహ్మపరాయణమైన బుద్ధి జీవుని ముక్తిభూమియందు చేర్చివేయును. అంతేగాక శుద్ధబుద్ధి సహాయమున తత్వజ్ఞాన లాభమును పొంది అంతముందురాజయోగి జీవబ్రహ్మల అభేధకారణమును తెలుసుకొని జ్ఞానముచే అజ్ఞాననాశనముచేయుచు

జీవబ్రహ్మల అద్వైతసిద్ధిద్వారా ముక్తుడై పోవును. రాజయోగసాధనమునకు పదియారంగములు గలవు. రాజయోగధ్యానమునకు బ్రహ్మధ్యానమందురు రాజయోగసమాధి నిర్వికల్పసమాధియని చెప్పబడును. దానియొక్క ఫలము జీవన్ముక్తియైయున్నది.

ఈ నాల్గుమార్గముల మూలమందు భగవద్భక్తితో కూడిన అష్టాంగయోగసాధనక్రమము విద్యమానమైయున్నది. వానియొక్క సంక్షిప్త విజ్ఞాన మేమనగా ? బహిరింద్రియములపై ఆధిపత్యత కూర్చుకొను సాధనలను యమ మందురు. అంతరింద్రియములపై ఆధిపత్యత కూర్చుకొను సాధనలను నియమ మందురు. స్థూలశరీరమును యోగమునకు ఉపయోగమగునట్లు చేసికొను సాధనలను ఆసన మందురు. శరీరస్థప్రాణమును యోగమునకు ఉపయోగముగ చేసికొను సాధనకు ప్రాణాయామ మందురు. ఈ పైనాలుగు సాధనలను బహిరంగములు. బహిర్ముఖ మనస్సును అంతర్ముఖముచేయు సాధనలను ప్రత్యాహార మందురు. ప్రత్యాహారముతోనే అంతరంగముయొక్క సాధన ప్రారంభమగును. అంతరజగత్తుయందు తీసికొనిపోయి మనస్సును ఏకస్థానమందు నిల్పు సాధనలను ధారణ యందురు. అంతరజగత్తున నిల్పుటకు అభ్యాసప్రాప్తి చేసికొనుటకైతనయిష్టదేవత సగుణభావమయమైన రూపమునగాని, నిర్గుణ సచ్చిదానందమయరూపమైయుండినను సరే. ఎవరెవరికి యే అధికారముండునో ఆ యిష్టదేవతలను కేవల ధ్యేయరూపముచేసుకొని జగత్తును మఱచియుండుట ధ్యాన మందురు. పరమాత్మయందు తన జీవాత్మను అనగా తనను కలిపివేయుట సమాధి యందురు. ఆ సమాధి సవికల్పమనియు, నిర్వికల్పమనియు రెండు భాగములుగా విభక్తమైయున్నది. ఇదియే సర్వజీవహితకరమును, అన్నిసంప్రదాయకుల అనుయాయులకు, అన్నిప్రకారముల ఉపాసకులకు, అన్నిప్రకారముల సాధకులకు పరమహితకరమగు యోగముయొక్క సంక్షిప్త విజ్ఞానమైయున్నది.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఓం తత్ సత్.

---

# మనస్తత్త్వము.

(నివృత్తి మార్గము).

(శ్రీ మలయాళ స్వాములవారు)

(336-పుట శేషము).

ఏభక్తుడు నిరంతరము పరమేశ్వరుని పొందవలెనని ఆసక్తిగల్గి ధ్యానముచేయు చుండునో, సదా ధ్యానపరాయణుడై యుండునో వానికి మాత్రమే అట్టి జ్ఞానముగల్గును. అట్టివానికి పరమాత్మ తన నిజస్వరూపమును ప్రకాశింపజేయుచున్నాడు. ఈ పరమతత్త్వమెఱిగినచో, అంతఃకరణశుద్ధిగల్గి బ్రహ్మవిచారము ధ్యానపూర్వకముగ చేయనిచో ఆత్మప్రాప్తికలుగదను తత్త్వము బాగుగ గోచరముకాగలదు. ఏలన, శాస్త్రము చదువుటకును, చెప్పుటకును, ధారణయొనర్చుటకును, నిర్విషయస్థితి కలుగవలెనని లేదు. ఈశ్వరస్వరూపమో, "తమసఃపరస్తాత్" — ప్రకృతికావలయుండుటచే అంతఃకరణలోగల అవిద్యను సంపూర్ణముగ దాటిపోవలసియుండును. ఇట్టిమోహమును గలుగజేసెడు మాయను రహితముచేయ ప్రయత్నించువారలకు పైఁజెప్పిన పఠనపాఠనధారణలు లేనప్పటికిని ముక్తిగల్గును. ఈ సత్యమునే శ్రీభగవానులు గీతయందుపదేశించిరి.

తేషామేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

నేను నిరంతరము ధ్యానముచేయు భక్తుల యంతఃకరణమున నివసించువాడనై, అనుగ్రహించు తలంపుతో వారలయొక్క అజ్ఞానమువలన బుట్టిన మాయారూపమగు యంధకారమును, మిక్కిలి ప్రకాశించుచున్న జ్ఞానదీపముచేత తొలగించి, నిజరూపమగు ఆత్మస్వరూప ప్రకాశమును గలుగజేయుచున్నాను. పరమకారుణికుడగు భగవంతునకు భక్తులపైగల ప్రేమ యేమని చెప్పవచ్చును! కొందఱు 'మేము శాస్త్రము చదువలేదు. కాన ముక్తికి దూరులగుదుము' అనితలంచి వ్యాకులపడుదురేమోయనియెంచి కరుణగల్గి, అది అవసరము లేదనియు

శుద్ధాంతఃకరణులై, నిరంతరము ధ్యానము చేసినచాలుననియు ఈశ్రుతి స్మృతివాక్యములు తెలుపుచున్నవి.

సత్యేన లభ్యస్తప సాహ్యేషఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్
అంతశ్శరీరే జ్యోతిర్మయోహి శుభ్రో
యం పశ్యంతి యతయః క్షీణదోషాః.

నశించినపాపములు గలవారలును, పరిశుద్ధమైన జ్ఞానమును పొంద తలంపుగల్గి పరమాత్మస్వరూపానుసంధానమునకు ప్రయత్నించు వారలును నగువారు, ఏ ఆత్మను తమలో దర్శించుచున్నారో అట్టి ప్రకాశస్వరూపమును, పరిశుద్ధమునునగు ఆత్మస్వరూపమును సాధకులు నిరంతరసత్యపాలనము చేతను, శుద్ధాత్మజ్ఞానపరమగు తపస్సుచేతను, శుద్ధబ్రహ్మసాక్షాత్కారరూప జ్ఞానముచేతను, బ్రహ్మచర్య నియమపరిపాలనము చేతను, హృదయపుండరీకమునందు పొంద గలరని యర్థము.

మనోతత్వ రహస్యమును గురించి యింతవఱకు వివరించడమైనది. దీనియొక్క రహస్యమును తెలిసికొనకపోవుటచేతనే మనస్సే ప్రధానమని మనవేదాంతులలో కొందఱు చెప్పుటకు కారణమైనది. ఇందలి మొదటి అర్థము మనస్సే అన్నిటికిని కారణమగుచుండుననుట. దీనియొక్క పరమార్థము, మనస్సు మంచిదైన మంచికార్యములు చేయుటకును మనస్సు చెడ్డదైన చెడుకార్యములుచేయుటకును కారణమగుచుండుననుటయే. కాని వీరుచెప్పేలాగున పాపకృత్యములొనర్చుచు మనస్సేప్రధానమనునట్టి విపరీతార్థముకాదు. ఏలన, కారణమునకన్యముగ కార్యముండరాదుగదా. ఏవిత్తనము పెట్టిన దాని కనుగుణ్యముమగు వృక్షమున్ను పుష్పమున్ను, ఫలమున్ను మాత్రమేగలుగును. ఆలాగున యెవరి మనస్సులో గల సంకల్పములు, సంస్కారములు వృత్తులు, వాసనలు ఏయే ప్రకారముగానుండునో దానికి తగినకార్యములే వారు చేయుచుందురు. ఇదియే మనస్సుప్రధానమని చెప్పెడు వాక్యము యొక్క మొదటి యర్థము.

2. ఇక ఇంద్రియములన్నిటికిని మనస్సే యధిపతి. కనుక మనస్సు ననుసరించి ఇంద్రియములు విషయములందు ప్రవర్తించును. మనస్సు ఇంద్రియములను నిరోధించినచో నవి యాగిపోవును. సేనాధిపతి యాజ్ఞ ననుసరించి సైనికులు ప్రవర్తించునట్లే ఇంద్రియములును మనస్సు యొక్క ఆజ్ఞననుసరించి వర్తించును.

కావున మనస్సు శుద్ధముగానుండిన, ఇంద్రియములు అశుద్ధ విషయములలో పోవనిశ్చయించినను, వానినట్లు పోనీయక అయ్యది నిరోధించునని భావము. సైన్యములో ఒక్కడు దుర్మార్గుడుండినను సేనాధిపతి యాజ్ఞకు బద్ధుడైపోవును గదా!

3. దృశ్యవిషయములు యెట్లుండినను మనోభావము ననుస రించియే అవి మంచివిగను చెడ్డవిగను నున్నట్లు భావముకలుగును. ఇది భావనావిశేషముయొక్క రహస్యము. పామరులకు విషయములు మహాశ్రేష్ఠములుగ తోచును. పరిశుద్ధాత్ములకు విషయము లతీనీచ ములుగా తోచును. ఇదిన్ని మనస్సుయొక్క మార్పు యనియే విజ్ఞులు తెలిసికొనియున్నారు. దీనివల్లను మనస్సే ప్రధానమని చెప్పుటకు కారణమైనది.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధాభవతిభారత
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్సఏవసః.

అని శ్రీ గీతాచార్యులుపదేశించిరి. అనగా, ఓఅర్జునుడా! సమస్త ప్రాణులకును వాని వాని పూర్వజన్మ సంస్కారములతోగూడిన యంతః కరణముననుసరించిన స్వభావము కలుగుచున్నది. జీవుడు స్వభావమే స్వరూపముగ గలవాడు. ఎవ్వడు యెట్టి స్వభావముగలవాడో వాడు అట్టి స్వభావమున కనుకూలముగానే ప్రవర్తించును. ఈ పరమతత్త్వ మును తెలిసికొనిన మనస్సేప్రధానమని చెప్పెడు వాక్యములో గల భ్రమ నివృత్తిగాగలదు.

4. మనోనిరోధముగలిగిన, యితర దేహేంద్రియలన్నింటియొక్క నిరోధము కలుగును. కనుక మనోనిగ్రహ మొనర్చుకొనుటయే అన్నింటి యొక్క సారమని తెలిసికొనవలెను. దీనిచే ముముక్షువు గ్రహింపదగిన దేమన, మనస్సు శుద్ధముగానున్నచో మనుజుడు శుద్ధములైనవియు

సత్యములైనవియునగు కార్యములఁ జేయుచుండును. అశుద్ధముగానున్న చో అశుద్ధములును, అసత్యములును నగు కార్యములందు ప్రవర్తించుచుండును. దృశ్యవాసనలుగాని, విషయవాసనలుగాని కలిగిన అట్టిదోషములు తనయందింకను నిశ్శేషముగా రహితమవలేదనియెంచి వాసనాక్షయమునకు గడంగవలెను. మీరేలాగునయొక పాత్రలో పవిత్రమైన వస్తువు పెట్టతలంచిన, ఆపాత్రను ఒకరిచే శుద్ధపఱుపించినపుడు దానియందేదైన దుర్వాసన యుండినచో, మఱియొకసారి కడిగి తెచ్చులాగున యెట్లుచెప్పుదురో, అట్లే మరల వాసన నిశ్శేషముగ పోనిచో మఱియొకసారిగాని, రెండుసార్లుగాని, మూడు సార్లుగాని, ఇట్లుశుద్ధపఱుపవఱకు క్షారవస్తువులచే యెట్లు శుద్ధమొనర్తురో ఆలాగున హృదయములో దృశ్యవిషయవాసన యేదైనయుండుచో నిర్వాసనస్థితిగలుగువఱకు ధ్యాన, ధారణ, మనన, నిధిధ్యాసనలు చేయుచుండవలెను. ఉత్కృష్టమగు వేదాంతశాస్త్ర మీలాగుననేచెప్పుచున్నది.

తావదేవ నిరోధస్స్యాత్ యావత్తత్వం న విందతి
విదితేతు పరేతత్వే ఏకమేవానుపశ్యతి.

ఎంతవఱకు మనోనిరోధముగల్గి జ్ఞేయమగు బ్రహ్మాకారస్థితి కలుగలేదో అంతవఱకు శమదమాదులతోగూడినవాడై పవిత్రస్థానమందు పవిత్రభావనగల్గి నిష్ఠచేయుచుండవలెను.

అవ్యుత్పన్న మనా యావత్ భవాన జ్ఞాత తత్పదః
గురుశాస్త్ర ప్రమాణైస్తు నిర్ణీతస్తావదాచరేత్.

అని శ్రీ వసిష్ఠులు యోగవాసిష్ఠమందుపదేశించిరి. ఎంతవఱకు మనస్సులోగల వృత్తులు, వాసనలు, విషయములు నశింపలేదో, ఎంతవఱకు ఆత్మసాక్షాత్కార జ్ఞానమందు నిలుకడ కలుగలేదో, అంతవఱకు గురువుల బోధలచేతను, ఉత్కృష్ట వేదాంతశాస్త్రవిచారము చేతను బ్రహ్మవిచారము చేయుచుండవలెనని దీని భావము.

5. ఇక మనస్సే ప్రధానమని చెప్పెడు విషయమై విశేషార్థమును చెప్పెద. ఇంతవఱకు చెప్పిన నాల్గు అర్థములును సామాన్యములు. ఇపుడు చెప్పబోవునది విశేషార్థము. ఇది అనుష్ఠానపరులకు మాత్రమే గలుగును, వారలకే గోచరమగును.

యథా సంకల్పయేద్యోగీ యోగయుక్తో జితేంద్రియః
తథా తత్తదవాప్నోతి భావఏవాత్ర కారణం.

యోగసాధనచేత ధ్యానమందు నిలుకడగలవాడును అందువల్ల ఇంద్రియనిగ్రహముగలవాడును జ్ఞేయమగు బ్రహ్మమున స్థిరతగలవాడు నగు యోగి ఏమేమి సంకల్పించునో అది ఆలాగునే ఫలించును. అట్టి యోగులకు తనయొక్క భావనయే చాలును. ఇట్టి ఉన్నతస్థితిలో నుండు వారిస్థితిని పొందకపోవుటయే సంకల్పములు ఫలింపకపోవుటకు కారణ మగుచున్నది.

ఇది సంకల్పశుద్ధి, మనోనైర్మల్యము, యోగిసిద్ధి, తపోసిద్ధి గల యోగుల విషయమైనదేగాని సామాన్యముగా కొన్ని వేదాంతవాక్యములను మాత్రమునేర్చుకొని శుద్ధాచరణలేనివారి విషయమై ప్రవర్తించినది కాదు. ప్రాకృతగుణములు హృదయమున నశించునపుడు జీవుడు శుద్ధుడై ఈశ్వరావస్థను పొందును. ఈశ్వరునిసంకల్పమాత్రముచేతనే సమస్త జగత్సృష్ట్యాదులు జరుగుచుండును. వ్యష్టిభావము నశించిన జీవునియొక్క సంకల్పములన్నియు సఫలీకృతములగునని శ్రీయోగవాసిష్ఠమునగలదు.

సోఽయం పశ్యత్యశేషేణ యావత్సంకల్పమాత్రకమ్
స్వమాత్మకచనం శాంత మనన్యత్పరమార్థతః.

నిరావరణజ్ఞానయుక్తుడేది సంకల్పించునో, తన సత్యసంకల్పముచే నద్దానిని తన పరమార్థ స్వరూపమునకు భిన్నముగ గాంచుడు గాన దానిని తప్పక ప్రాప్తినొందును.

అనిరావరణజ్ఞప్తేర్యతః శాంతా నభేదధీః
తతః సంకల్పనాద్ద్వైతాద్వరాద్యస్య నసిద్ధ్యతి.

ఆవరణసహితమగు జ్ఞానముగలవానికి భేదబుద్ధి శమింపదు. ఆతడు ద్వైతసంకల్పముతోనే కూడియుండునుగాన వరశాపాదులు వానికి సిద్ధింపజాలవు..

ఒకడు హైకోర్టుజడ్జి, జిల్లాకలెక్టరు మొదలగు పనులలోనుండు నపుడు తాను విధించిన వాక్యములన్నియు వెంటనే యితరులు అములు

జరుపుదురు. తనకట్టి ఉద్యోగములేనపుడు తనవాక్యమేలాగున నిష్ఫల మగునో ఆలాగున బ్రహ్మవిద్యలోగల అనుష్ఠానములతోగూడి సరియైన నిష్ఠయుండినచో అతని వాక్యములేగాక సంకల్పములుగూడ తప్పక ఫలించును. అట్టి ఆచరణ లేనందుచేతనే సంకల్పములన్నియు నిష్ప్రయోజనములగుటకు కారణమగుచున్నది. ఇదిన్ని మనస్సుయొక్క ప్రధానతత్వమునే తెలుపుచున్నది. కావున యెవరైనను తాము సంకల్పించినట్లు జరుగకపోవుచుండిన వారిమనస్సునందు మాలిన్యము నశించియుండలేదని బాగుగా తెలిసికొనవలయునేగాని జనులపై కోపగించిన ప్రయోజనములేదు. అట్లు కోపగించుటచే లోకములో మఱింత యనర్థమును గలుగజేసినవారగుదురు.

(సశేషము)

---

# శ్రీ భగవద్గీతా ఫలస్తుతి.

## (శ్రీ శ్రీకంఠశివాచార్యులవారి గీతాభాష్య గ్రంథమునుండి)

### (సప్తదశాధ్యాయము)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె:—

ఓలక్ష్మీదేవీ ! 16-వ అధ్యాయ ఫలస్తుతియందు చెప్పబడిన ఖడ్గబహాదురుడు స్వర్గమునకుబోగా నతని కుమారుడు ఆ నగరమునందు రాజ్యముచేయుచుండెను. ఒకదినమున దుశ్శాసనుడను ఒక నౌకరు ఆ మదించిన ఏనుగనెక్కి సవారిచేయుటకు ప్రయత్నించుచుండెను. ప్రజలు వానికృత్యమును జూచి ఏనుగు నెక్కనలదనియు, ఎక్కిన కీడు వాటిల్లుననియు చెప్పిరి. వారెంత చెప్పినను వినక ఏనుగు దగ్గరకు బోయి యెక్కుటకు లగాముమీద కాలుపెట్టగా నాయేనుగు తన తొండముతో నాతనిని దూరముగా గిరటవైచెను. వాడు వెంటనే నెత్తురు గ్రక్కి మరణించెను. మరుసటి జన్మయందతడు సింధుదేశపు రాజునకు కుమారుడై జన్మించెను. సింధుదేశపు రాజునకును ఖడ్గబహాదురుని కుమారునకును మైత్రిగలిగియుండెను. అందువలన నా మదపు

ఏనుగును సింధుదేశమునకు తోలివైచెను. అక్కడ కొంతకాలము నకు ఆయేనుగు ముసలిదై జబ్బుపడగా రాజు అనేక వైద్యములు చేయించెను. కాని కొంచెమైనను గుణము కనుపించలేదు. ఏనుగు మిక్కిలి దుఃస్థితిలోనుండి తన యవసానసమయమున మనుష్యవాక్కు తో రాజును చూచి యిట్లు పలికెను. 'ఓరాజా! మందులవలన నాకు ఈ రోగము కుదురజాలదు. కాని మీరు ఏబ్రాహ్మణునినల్లనైనను గీతాధ్యాయమును వినిపించిన యెడల నేను శరీరమును విడిచి స్వర్గ మును పొందుదునని వేడెను. అంతట రాజు వెంటనే నొక బ్రాహ్మ ణుని పిలిపించి గీత 17-వ అధ్యాయమును వినిపించగానే ఏనుగు స్వర్గమునకు వెళ్లెను.

---

(శ్రీ భగవద్గీత)

# 15. పురుషోత్తమ ప్రాప్తియోగము.

(శ్రీ మలయాళస్వాములవారు)

పురుషోత్తముఁడనియు, భగవంతుడనియు, పరమేశ్వరుడనియు, పరబ్రహ్మమనియు చెప్పినను నొకే యర్థము. అట్టి సర్వేశ్వరుని పొందుటకు తగిన పద్ధతి యీ అధ్యాయమున చెప్పబడినందున దీనికి పురుషోత్తమప్రాప్తి యోగమని పేరువచ్చినది. ఈ యధ్యాయములో చెప్పినట్లాచరించువారికి పరమపదప్రాప్తి గలుగును. అనగా మోక్ష ము సిద్ధించును. అదే పురుషోత్తమప్రాప్తియనియు, భగవదైక్య మనియు తెలియఁదగును. అనుష్ఠానపరులందఱును ఈ అధ్యాయ మును భోజనకాలమున పఠించి భుజింతురు. అట్లు చేయువారలకు మహాపుణ్యము గలుగుననియు, పఠించనివారు భక్తితో వినుచుండి నను పుణ్యప్రాప్తి నొందుదురనియు అనాదినుండియు వదంతి గలిగి యున్నది. దానికి కారణము గలదు. గీతలో 18 అధ్యాయములుం డగా యీ అధ్యాయమును మాత్రమేల పఠించవలయు? ఇతర అధ్యాయములలో దేనినైన భోజనసమయములో పారాణ యచేయ

గాదా, యని సందేహముగలుగవచ్చును. సన్యాసులందఱును భోజన కాలమున దీనిని పారాయణచేయుదురు. సన్యాసులు మాత్రముగాక బ్రహ్మనిష్ఠులందఱున్ను ఆలాగున నాచరింతురు. దానికి కారణమే మన, శ్లో॥ 14 లో భగవంతుడీలాగున యుపదేశించియున్నారు.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్.

'నేను జఠరాగ్నిస్వరూపుడనై ప్రాణులదేహములనాశ్రయించి ప్రాణాపానవాయువులలోఁ గూడుకొన్నవాడనై ప్రాణికోట్లు భుజించెడు (భక్ష్యభోజ్యలేహ్యచోష్యములనియెడు) నాల్గువిధములగు అన్నమును పచనముచేయుచున్నాను.'

ఇది బ్రహ్మనిష్ఠులకు, పరమభక్తులకు చాలముఖ్యమైన శ్లోకము. అయ్యది భోజనకాలములోఁగూడ, పంచప్రాణములకు పంచజ్ఞానేంద్రియములకు, పంచకర్మేంద్రియములకు, పంచతన్మాత్రలకు, ఆత్మవిలక్షణ స్వరూపమని భావనచేసికొనుటకొఱకే యగును. లేకం యీ జీవ సంజ్ఞలతోఁ ప్రకాశించువాఁడు కేవలము భగవత్స్వరూపుడే, అట్టి ఆత్మైక్యానుసంధానుపరులై యుండవలెనను యర్థము దీనియందు స్ఫురించుచున్నది. మఱియు భోజనకాలమున నీయధ్యాయము పారాయణ చేయు విషయమై శ్రీకంఠశివాచార్యులు వ్రాసిన గీతాభాష్యమందు కారణము చెప్పబడెను. అట్లు ఒక్క అధ్యాయమునకేగాక ప్రతి అధ్యాయమునకును పారాయణఫలమున్ను దానికి కారణమున్ను నిరూపించియున్నారు. ఈవ్యాస మతిసంక్షిప్తవిషయమగుటచే, దానిని యిట వ్రాయలేదు. ఇకమీద ప్రతిఅధ్యాయముయొక్క ఫలమును అనగా మాహాత్మ్యమును యథార్థభారతిలోఁ ప్రకటించెదరు. దానియందు యీ యధ్యాయముయొక్క మాహాత్మ్యముగూడ గనందగును. దీనిలోఁ మొదటనే ప్రపంచవృక్షముయొక్క వర్ణన చేయబడినది. అట్టి సంసారవృక్షమును నఱికివేసిన మాత్రమే జననమరణ దుఃఖములు నశించి, జీవుడు మోక్షమునొందగల్గును. ఆవిషయములన్నియు దీనిలోఁ విశదీకరింపబడియున్నవి. ముఖ్యముగా సంసారవృక్షము అనగా అజ్ఞానవృక్షము యెట్టిదో, దానిని నఱకెడి గొడ్డలియెట్టిదో, ముముక్షువులు తెలిసికొ

నందగినది. వృక్షములన్నింటిని మూలము క్రిందుగాను, అగ్రము పైగాను నుండును. ఈసంసారమహావృక్షమునకు మొదలు పైభాగమునను, అగ్రము క్రిందభాగమునను నుండునని శ్రీ భగవానులు వర్ణించిరి. ఇది యాశ్చర్యకరము. ఈలాగున యెచ్చటనైన యుండునా? ఇదియే దీనిలోగల మర్మము. ఆత్మచింతకులందఱున్ను, పరమభక్తులందరున్ను యీరహస్యమును తెలిసికొనవలెను. స్వయముగా తెలిసికొనశక్తిలేనివారు ఉత్తమగురువుల వలననైనను గ్రహించుకొనవచ్చును. కనుకనే ప్రారంభములోనే 'ఊర్ధ్వమూలమధశ్శాఖ మసి ఆరంభించిరి. ఈవ్యాసములో దేనికిని ప్రమాణశ్లోకములు వ్రాయగూడదని తలంచడమైనది. ఏలన, గ్రంథము పెరిగి పోవును. అయినను యిది అమూల్య విషయ మగుటచేతను ముముక్షువు ముఖ్యముగా తెలిసికొన దగినదగుట చేతను శ్రుతిస్మృతులందలి రెండు వాక్యములు మాత్రము వ్రాయదలంచడమైనది. ఆ సంసారవృక్షమెటువంటిదో యిట వర్ణింపబడుచున్నది.

> అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోత్థితః
> బుద్ధిస్కన్ధమయశ్చైవ ఇన్ద్రియా న్తరకోటరః.
> మహాభూతప్రశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా
> ధర్మాధర్మ సుపుష్పశ్చ సుఖదుఃఖ ఫలోదయః.
> ఆజీవ్యసర్వవృక్షాణాం బ్రహ్మవృక్షస్సనాతనః
> ఏతద్బ్రహ్మవనంచైవ బ్రహ్మ చరతి నిత్యశః.
> ఏతచ్ఛిత్వాచ భిత్వాచ జ్ఞానేన పరమాసినా
> తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నావర్తతే పునః.

తా॥ 'అవ్యాకృతము (మూలప్రకృతి లేక మాయ) అనెడు వేరునుండిపుట్టి, యావేరు గట్టిదగుటంజేసి క్రమముగా విస్తరించి పెరుగుచున్నదియు, బుద్ధియనెడు మ్రానుగలదియు, నేత్రేంద్రియాది రంధ్రములే తొఱ్ఱలుగా గలదియు, పృథివ్యాది పంచభూతములే పెద్ద కొమ్మలుగాగలదియు, శబ్దాదివిషయములే యాకులుగాగలదియు, ధర్మాధర్మములనెడు మంచిపుష్పములు గలదియు, సుఖదుఃఖ పుణ్యపాప ములనెడు పండ్లుగలదియు, వృక్షము పక్షులకువలె సమస్తప్రాణులకు

జీవనాధారమైనదియు, చిరకాలమునకు బ్రహ్మజ్ఞానము గలిగినపిమ్మట బోవునదియగుటఁబట్టి బహుపురాతనమైనదియునగు బ్రహ్మమే యధిష్ఠానముగాఁగనఁబడు యీ సంసారమనెడు వృక్షమే పరమాత్మకు విహారస్థానమగు వనమైయున్నది'.

అవ్యక్తమనియు, అవిద్య యనియు ప్రకృతియనియు ప్రధానమనియు మాయయనియు అజ్ఞానమనియు చెప్పిననొకే యర్థము.

'ఓం తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నధ, అన్నాత్పురుషః. (తైత్తిరీయోపనిషత్తు).

తా॥ ఆత్మశబ్దవాచ్యమును, సత్యజ్ఞానానందస్వరూపమునునగు ఆ పరబ్రహ్మమునుండి సమస్తభూతములకును, అవకాశమునిచ్చుచున్న ఆకాశముపుట్టినది. ఆకాశమునుండి వాయువును, వాయువునుండి అగ్నియు, అగ్నినుండి జలమును, జలమునుండి పృథివియు, పృథివినుండి తరుగుల్మలతాదులును, సమస్తసస్యములు స్వరూపములుగాగల ఓషధులునుపుట్టినవి. ఆయోషధులవలన అన్నము పుట్టినది. రేతోరూపముగా పరిణమించిన ఆ యన్నమువలన శిరస్సు, హస్తము, మొదలైన అవయవములతో గూడిన యాకృతిగల పురుషుడు పుట్టెను.

భగవంతుడుపదేశించిన యిది చాలా రహస్యమైనది. మూలప్రకృతినుండియే యీ సృష్టి ప్రారంభమైనదనియు, అట్టి మూలావిద్యను ఛేదించిన మాత్రమే అజ్ఞానవృక్షము నశించుననియు ఈశ్వరసాక్షాత్కారజ్ఞానమువల్ల మాత్రమే దానికి వినాశము గల్గుననియు వచించిరి. భోజనకాలములో నిట్టి పవిత్రపారాయణవల్ల అందఱిమనస్సు ఈశ్వరవిషయములో మగ్నమైయుండును. ఆలాగున భుజించెడి అన్నాది పదార్థము లతిపవిత్రములై యుండును. అట్టి అన్నపానాదులచే హృదయము చాలా నిర్మలత్వము నొందును. భోజనసమయములో నెవడెట్టి భావముగలిగియుండునో, అట్టిగుణమాతనికి తప్పక గలుగునని దివ్యదృష్టిగలవారి యాశయము, కావుననే మంత్రపూరితముగా నొనర్చి భుజింపవలయునని చెప్పెడిరహస్యము. అట్టి దివ్యమంత్రములు జపించవలసియుండుటచే యితరములగు వ్యర్థవాక్యములుగాని తలంపులుగాని

చేయుట కవకాశ ముండదు. ఋషులందఱును మంత్రములను సృష్టించుట
కిదియే కారణము. కనుకనే భోజనము కొంత రహస్యస్థలములో చేయ
వలెననియు, ఆసమయములో మాట్లాడగూడదనియు యేర్పఱచిన
రహస్యము. స్వయముగా ద్వైవభావముగలిగి యుండుట సామాన్యులకు
దుస్తరమని తలంచి మంత్రము లేర్పఱచిరి. కాలమహిమచే యిప్పుడట్టి
మంత్రములను జపమొనర్చి భుజించువారు అరుదైరి. ఒకవేళకొందఱు
ఉచ్చరించుచుండినను మనస్సులో ఈశ్వరభావము లేకపోవుచున్నది.
అందువల్లనే అట్టి అన్నాదులు దుష్పరిణామము బొంది, వానివలన గ్సే
ర్పడు స్త్రీపురుష శుక్లశోణితములు అశుద్ధములై, అందువల్ల పుట్టెడి
బిడ్డలు యశస్సున్ను, ఓజస్సున్ను లేనివారుగుటకున్నూ అధర్మప్రవర్త
కులగుటకున్నూ, ఆసురప్రకృతిగలవారగుటకున్నూ కారణమగు
చున్నది. మంత్రములనుమాత్ర మొకవేళ యుచ్చరించుచుండినను
భావము లేకపోయిన, అదిన్ని అంత ఫలమును గలుగజేయదని జ్ఞాప
ముంచుకొనవలెను. కనుకనే వాచ్యవాచకముల నైక్యముగలిగి యుం
డవలెనని చెప్పెడు రహస్యము. వాక్యమునకన్న భావమే గొప్పదైనను,
అముట్టిమంత్ర లేనిచో భావముకూడ చేయరని తలంచి కరుణామూర్తు
లగు పరమఋషులు మంత్రములను కూడ పఠించవలెనని నిర్ణయించిరి.
కలికాలమహిమచే యిది ఆచరించువారే లేకపోయిరి. ఈయధ్యాయ
మున యీశ్లోకము ముఖ్యము.

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః.

'ధ్యానాదులచే బ్రహ్మస్వరూపమును దెలిసికొనుటకు ప్రయ
త్నముచేయుచున్న ధ్యానయోగులు (జ్ఞానులు) తమయందున్నట్టి ఈ
యాత్మను దర్శించుచున్నారు. ధ్యానభజనాది ప్రయత్నములు చేయుచు
న్నను చిత్తశుద్ధిలేని అవివేకులు ఈయాత్మను తెలిసికొనజాలకున్నారు.'

ఓం తత్ సత్.

---

# త్రికరణదోషములు.

(శ్రీ శివ మహాపురాణము.)

1. మనో దోషములు:—

శ్లో॥ పరస్త్రీద్రవ్యసంకల్ప శ్చేతసాఽనిష్టచింతనం.
అకార్యాభినివేశశ్చ చతుర్ధా కర్మమానసమ్.

తా॥ పరస్త్రీ సంకల్పము, పరద్రవ్యసంకల్పము, మనస్సుచే యితరులకపకారమును తలంచుటయు, చేయరానిపనియెడ పట్టుదలయు, — యీనాల్గును, మానసిక దోషములగును.

2. వాచిక దోషములు:—

శ్లో॥ అవిబద్ధప్రలాపత్వమసత్యంచాప్రియంచయత్
పరోక్షతశ్చ పైశున్యం చతుర్ధా కర్మవాచికమ్.

తా॥ అసంబద్ధ ప్రలాపము, అసత్యము పలుకుటయు, ప్రీతిలేకుండ మాట్లాడుటయు, అప్రత్యక్షముగ చాడీలుచెప్పుటయు, — యీనాల్గును వాచిక దోషములనబడును.

3. కాయిక దోషములు:—

శ్లో॥ అభక్ష్యస్య భక్షణం హింసా మిథ్యా కార్యనివేశనం,
పరస్వానాముపాదానం చతుర్ధా కర్మకాయికమ్.

తా॥ పూజానర్హమైనదానిని భుజించుటయు, హింసచేయుటయు, వ్యర్థకార్యమున ప్రవేశించుటయు, పరులసొత్తును పరిగ్రహించుటయు యీనాల్గును కాయిక దోషములు.

---

# వివేకానంద లేఖావళి.

(అనువాదకులు:—శ్రీ తత్త్వానంద స్వాములవారు.)

న్యూయార్కు—నగరము
19—11—1894.

నాదు ధీరసంతానములారా!

నిర్మాణకార్యము నింకను సాగించుడు.........ప్రేమ, విశ్వాసాసక్తత, ఓర్పు ఇవితప్ప మఱేమియు నవసరములేదు. 'జీవము' అనిన

పెరుగుదల; అనగా వికాసము, అనగా ప్రేమయే కాదా? కాబట్టి ప్రేమయంతయు ప్రాణమన్నమాటే; అదొక్కటియే జీవధర్మము. స్వార్థపరత అంతయు మరణలక్షణమే! ఆమాట ఇందును మఱెందునుకూడ చెల్లును. పరులకు మేలుచేయుటయే బ్రతుకు; ఇతరులకు మేలుచేయకుండుటయే మరణము. ఈ నరపశువులలో నూటికి తొంబది మంది మృతులే; ప్రేతములు! — ఏలయన, ప్రేమచూపువాడు తప్ప మఱెవ్వడుగాని, నాయనుంగు బిడ్డలారా! సజీవుడనతగడు. తనయులారా! సానుభూతిచూపుడు! సానుతాపపడుడు! బీదవారిని, పామరులను, అణగద్రొక్కివేయబడినవారిని గాంచి సానుభూతి పూనుడు. గుండెచలన మాగిపోయి, మెదడు తిరిగిపోయి మీకు పిచ్చియెత్తినదో యన తోచునంతగా సానుభూతితో నిండిపొండు. — అనంతరము మీఆత్మగతవాంఛితములను భగవంతుని పాదసన్నిధిని తెలుపుకొనుడు! మీకెంతయు బలము, సహకారము, అప్రతిహతశక్తి చేకూరును! పెనగులాడుడు; పోరాటమే ఇక్కడికి పదియేండ్లనుండియు నాకు కార్యక్రమసూచికగనున్నది. పోరాడుడనియే నేనింకను చెప్పుమాట! సకలమును అంధకారమయమైయున్నప్పుడును; పెనగులాడుడము అనియే నేను పలుకుచుంటిని. ఇప్పుడు వెలుంగులు గోచరమగు తఱిని గూడ, పెనుగులాడుడు అనియే నేను హెచ్చరించుట. బిడ్డలారా! భయము వలదు. ఈ నక్షత్రసంక్షోభితాకాశము మన పైనిబడి చితుకగొట్టివేయునేమో యనుచు, భీతచేతస్కులగుచు అటు కన్నెత్తిచూడకుడు. ఓపికపట్టుడు; కొలది గంటల కాలములోపల అదంతయు నీపాదములక్రింద నుండగలదు. క్షమవహించుడు; డబ్బువలనను పేరువలనను ప్రయోజనములేదు; కీర్తిగాని పాండిత్యముగాని ప్రయోజనకరములుకావు. ప్రయోజనకరమగునది ప్రేమయొక్కటియే. ఆపదలనెడు లోహపుగోడలను సయితము ఛేదించి దూరిపోగలది శీలము!

ఇప్పుడు మనను ఎదుర్కొను సమస్యఇది. స్వాతంత్ర్యము లేనిది పురోవృద్ధి సాధ్యమేకాదు. మనపూర్వులు అధ్యాత్మచింతనకు స్వేచ్ఛనొసగి యున్నారుగాన మనకిప్పుడు అద్భుతమగు మతము కలిమి అబ్బినది. సంఘముయొక్క పాదములకు వారొక భారమగు గొలు

సును పెనవేసి యుంచినందున, మన సంఘస్థితి ఇప్పుడు, ఒక్కమాటలో చెప్పెదను; ఘోరముగనున్నది; ఆసురమైనదనవలయును. పశ్చిమ దేశములందు సంఘమునకు సదా స్వతంత్రతయే; వారెట్లుండిరో చూడుడు! అందుకు భిన్నముగా వారిమతమెట్టులనున్నదో గమనించుడు

వికాసమునకు స్వేచ్ఛయనునది మొట్టమొదటి నియమము. ఆలోచన చేయుటకును మాటలాడుటకును నరునకు స్వాతంత్ర్యము అవసరమగు తీరుననే, ఆహారము, వస్త్రధారణము, వివాహము మొదలగు సందర్భములందును, మఱియు ఇతరులకు హానికరుడు కానంతవఱకు, ప్రతివిషయమునకూడ వానికి స్వేచ్ఛయుండవలసినదే.

లౌకికనాగరికతను నిరసనచేయుచు ఏమేమో మూర్ఖప్రలాపముల గావించుచుందుము. ఆడలేక మద్దెల ఓడన్నట్లున్నది. ఆపిచ్చిమాటలే సత్యమని యొప్పుకొనినను, ఇండియాలో నిప్పుడు నిజముగా పారమార్థిక చింతాభిలాషులగువారు ఒక లక్షమంది యుందురేమొ. సరే వీరి అధ్యాత్మికోన్నతికొఱకై, ముప్పదికోట్ల ప్రజలు దాస్యమున నణగి తిండి లేక మాడి చావవలయునా? వారటులేల ఆకలితో మడియవలెను? మహమ్మదీయులు హిందువులపైని విజయము సాధించుట ఎట్లు సంభవించినది? భౌతిక నాగరికతనుగూర్చి హిందువులు అజ్ఞానులై యుండుటవలననే సుడీ! మహమ్మదీయులు దర్జీవాడు కుట్టిన దుస్తుల ధరించుట సయితము మనకు నేర్పియున్నారు. ఆ మహమ్మదీయులవలననే వీథులలోని దుమ్ముతో కలిసి మలినముకాకుండ పరిశుభ్రముగనున్న యన్నమును తిను ఆచారమునుకూడ హిందువులు నేర్చుకొనినచో నెంతయో బాగుండెడిది! భౌతికనాగరికత యననేల, భోగములుసయితము పేదలకు పని కల్పనచేయుకొఱకు అవసరమే యగును! తిండి! తిండి! ఇక్కడ తిండిమెుసగలేని దేవుడు, పరలోకమున అఖండానందమును ప్రసాదించుటయా? కల్ల! భారతదేశము నుద్ధరించి తీరవలయును; బీదలకు అన్నము సమకూర్పవలయును. విద్యావ్యాప్తి గావింపవలయును; పురోహిత జనపీడను తొలగించి వేయవలయును. పురోహితాధికారము వలదు, వలదు; సాంఘిక దాస్యము నాశనమందవలయును! ఎక్కువతింజియు, సర్వ జనులకు

జీవనావకాశమును లభింపవలయును! ఇంగ్లీషువారినుండి హెచ్చు అధికారములను లాగికొనవలయుననుచు మన యువక మూఢజనులు నీూటింగులు సాగించుచున్నారు! వారో నవ్వుచున్నారు! స్వేచ్ఛ నొసంగుటకు అంగీకరింపజాలనివాడు స్వాతంత్ర్యమునకు అర్హుడే కాడు. ఈ ఆంగ్లులు అధికారమునంతను మీా చేతులలో పెట్టుదురను కొనుడు. అప్పుడు అధికారమువహించువారు ప్రజలను అణగద్రొక్కి యుంచుదురేగాని ప్రజలకా అధికారమును పంచి యీనొల్లరు. బానిసలు బానిసల నిర్మించుకొనుటకే అధికారమును కోరుకొనుచుందురు!

కాబట్టి మతమును సంరక్షించుచు సంఘమునకు హెచ్చుస్వేచ్ఛనొసగుటమూలమున, సావధానముగా ఈపని జరుగవలసియున్నది. ప్రాచీన మతవ్యవస్థనుండి పురోహితవర్గమును పెకలించివేయుడు; అప్పుడు మీాకు ప్రపంచములోనికెల్ల శ్రేష్ఠతమమతము లభ్యమగును. నామాటలు మీాకర్థమగుచుండెనా? భారతదేశపు మతసంస్థను చెదరనీక, నిలిపి, యురపు సంఘ సంస్థను నిర్మాణముచేయుట పొసగునా? అనిన అట్టిపని సాధ్యమనియు, సాధించితీరవలయుననియు నానమ్మకము ***భారతదేశమధ్యమున మీారు మీా ఆదర్శములకు అనుగుణ్యముగా జీవింపగల ఒకఅధినివేశమును నెలకొలుపు మహోద్యమమును సాగింపవలసియున్నది. కొంచెముగ తోడుపెట్టినపాలు, ఎన్నిపాలనైనను తోడుకొనచేయగల్గును. ఈలోపుగా ఒక కేంద్ర సమాజమును స్థాపించుడు; తరువాత దానిశాఖలను భారతదేశమంతట వ్యాపింపజేయుడు. మతము నాధారము చేసుకొని మాత్రమే యిప్పుడు ప్రారంభించుడు; ప్రస్తుతము తీవ్రమగు సంఘసంస్కరణమును బోధింపబోకుడు; కాని అర్థరహితములగు మూఢాచారములయెడ ఆమోదమును జూపకుడు సుడీ! ప్రాచీనాచార్యులగు శంకరులు, రామానుజులు, చైతన్యుల వలన ప్రతిపాదింపబడిన సార్వజనిక మోక్షాధికారము సమత్వములనెడు పూర్వపు పంథాననుసరించియే పునరుద్ధరణమును గావింప ప్రయత్నముల సాగింపుడు.

ఉత్సాహోన్నతి కలిగి ఎల్లెడల పనిచేయుడు. పని, పని పనియే కావలసినది! నాయకత్వము వహింపుచును భృత్యులుగా

వర్తించుడు. స్వార్థరహితులై మెలగుడు; రహస్యముగా పరుల నిందించు స్నేహితులకు చెవియొగ్గకుడు. అసారమగు ఓర్పుగలిగి యుండుడు; విజయము మిమ్ము వరించును. *** బహుజాగ్రత్త. అమెరికనులు అనుచుండునటుల 'ఇతరుల నెత్తి నెక్కుటకై' యత్నింపకుడు. నేను సదా నీకే నాయుత్తరములను పంపుచుండుటవలన ఇతరమిత్రుల మించిన ప్రాధాన్యత వహింపజూడకుము. నీవటువంటి వెఱ్ఱివాడవు కావని యెఱుంగుదును; అయినను హెచ్చరికచేయుట నావిధియై యున్నది. అట్టివర్తనమే సమస్త సంస్థలను నాశమొనరించుచున్నది. పనికి పూనుడు; పనిచేయుడు; పరశ్రేయముకొఱకై పాటుపడుటయే జీవనిస్సారము!

ఏమాత్రమును కపట వర్తనముగాని, మోసముగాని వంచన గాని దరిరాదగదని నాకోరిక. నేను సర్వదా భగవంతునిపైని ఆధార పడువాడను. సూర్యప్రకాశమువలె నిరాఘాటముగ వెలుగు సత్య మును నేను సదా నమ్మికొందును. పేరుకొఱకో లేక ప్రఖ్యాతికొఱకో, అదియుకాకున్న పరోపకారార్థము సయితము కపటచర్య అను మచ్చ నా అంతరాత్మయందు తలజూపకుండ మరణింతుగాక! లేశమేనియు అవినీతిగాని ఇంచుకంత కుతంత్రపుకళంకముగాని యుండతగదు.

ఏవిధమగు ఛాందసమును వలదు; గురుకీలకముల నెడు మోసపు చర్యలు తగవు. గోప్యముగా నేమియు జరుగరాదు. పక్షపాతముతో గూడిన గురుకృపలు అనుచితములు.—అట్టిచో గురువే యక్కరలేదు. నాప్రియకుమారులారా! ముందునకు సాగిపొండు; డబ్బు రానీ, రాక పోనీ, మనుష్యులు వచ్చిచేరనీ, చేరకపోనీ ఆగకుడు! మీలో ప్రేమ కలదా? మీకు భగవంతునిపైని విశ్వాసముకలదా? చాలును పదండి! సంగ్రామములో దుముకండి. మీరు అజేయులై వెలుంగుదురు!

ఎంతటి అసంగతమో చూడుడు! దివ్యజ్ఞాన సమాజపు పత్రి కలు వారు నా విజయమునకు మార్గము చూపినటుల పలుకుచున్నవి; నిజమా? అర్థహీనపు ప్రలాపము! దివ్యజ్ఞాన సామాజికులు మార్గము సిద్ధముచేసి పెట్టుటయా! * * *

బహుజాగ్రత్త! అసత్యమగు దేనినికూడ దరిరానీయకుము సత్యమును అంటిపట్టుకొని యుండుము! మనము కృతకృత్యుల మగుదుము; ఒకవేళ ఆలస్యమైననేమి? కానిండు, విజయము నిశ్చయము! నేనెన్నడును లేనేలేనటుల భావించి పనిచేయుడు. కార్యభారమంతయు మీలో ఒక్కొకనిపైననే ఆధారపడియున్నటుల పాటుపడుడు. ఏబది శతాబ్దములు మిమ్ము కనుపెట్టి చూచుచున్నవి; భారతదేశపు భావిదశ మీపైని ఆధారపడియున్నది. పని సాగించుడు! నేను భారతదేశమున కెప్పుడు తిరిగి రాగలనో నాకు తెలియదు. ఇయ్యది మహా కర్మక్షేత్రమై యొప్పుచున్నది. భారతదేశములోని ప్రజలు పొగడిన పొగడవచ్చును. కాని దేనికిని ఒక్కపైసనైన నీయరు. వారికది యెక్కడినుండి వచ్చును? వారే బిచ్చగాండ్రై యుండిరి గదా? గడచిన రెండువేల సంవత్సరములనుండియో, అంతకుపైగ కూడనో ప్రజోపకారము సలుపు సమర్థతనే వారు కోల్పోయియుండిరి. వారిప్పుడిప్పుడు 'జాతి' 'ప్రజలు' అను మొదలగు భావములను నేర్చుకొనుచున్నారు. కావున వారిని నిందించి ప్రయోజనములేదు. ఇంక విశేషములు ముందుముందు వ్రాసెదగాక!

ఆశీర్వాదపురస్సముగ
వివేకానంద

---

# శ్రీ పరబ్రహ్మోపాసన!!

## త్రింశాదశమార్గములు.

(గతసంచిక 355 పుట శేషము.)

### కంసవధానంతరము

(భాగ-.దశ--పూర్వభాగము)

వ. దేవకీవసుదేవుల సంకలియలు విడిపించి బలభద్ర సహితుండై వారలకుం బ్రణామంబులుసేసిన. 1391

మ. కని తాకేశులుగాని వీరుకొడుకుల్ గారంచుఁజిత్తంబులన్
జనయిత్రీజనకుల్ విచారపరులై శంకింపఁగృష్ణుండుదా

జనసమ్మోహినియైన మాయఁదదభిజ్ఞానంబు వారించియు
ట్లనిర్మల సాగ్రజుఁడై మహావినతుఁడై యానంద సంధాయియై. 1392

శా. కారాశాలల మానిమిత్తము మిముం గంసుండు గారింపఁగా
నారింపంగ సమర్థతల్ గలిగియు న్వారింపఁగా రాకసి
షట్కారుణ్యాత్ములమైన క్రూరుల మహాకౌటిల్యసంచారుల
సారాతిక్షములార మమ్ముఁగొఱఁతల్ సైరించి రక్షింపరే. 1397

వ. అని ఇట్లు మాయామనుష్యుండైన హరిపలికిన పలుకులకు మోహితులై వారల నంకపీఠంబులనిడుకొని కౌఁగిలించుకొని వారి వదనంబులు కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశాబద్ధులై దేవకీ వసుదేవులూరకుండిరంత.

## వృషభ దేవుని తల్లి (నాభి)

(భాగ—పంచమ—ప్రథమాశ్వాసము)

వ. నాభియుందనకోరిన చందంబునం బుత్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపబడు నరలోక ధర్మంబుగల పుండరీకాక్షుని మాయావిలసితంబునం జేసి బాలక! నాతండ్రీ! నాకులదీపక! యనిమోహంబున నుపలాలించుచు బ్రజానురాగంబున సర్వసమ్మతుండయిన పుత్రుని 60

(భాగ—దశ—ఉత్తరభాగము)

క. వసుదేవుఁడు వారికిసం,
తసమునఁగావించె సముచితక్రియ లంతన్
ముసలియు హరియును మ్రొక్కిరి,
వెసనందయశోదలకును వినయంబెసఁగన్. 1062

వ. అట్లునమస్కృతులుసేసి యాలింగనంబులుగావించి నయనారవిందంబుల నానందబాష్పంబులు దొరఁగనఱలేని స్నేహంబులు చిత్తంబుల నత్తమిల్లనేమియుం బలుకకుండి రంతనయ్యశోదాదేవి రామకృష్ణుల నిజాంకపీఠంబుల నునిచి యక్కునంగదియందిగిచి చెక్కులు ముద్దుగొని శిరంబులు మూర్కొని, చిబుకంబులు పుడుకుచుఁబునః పునరాలింగనంబులుగావించి పరమానందంబునం బొందుచు నున్నంతఁ.

# 9. సేవకుడు ప్రభువునకు జేయు సేవలె.

ఇదిసేవకాభావము. మహమ్మదు నబిగారి ముఖ్యాభిప్రాయము యిదియె. యీవిశ్వమంతయు అల్లాది; సర్వమును పుట్టింప, పెంప, సంహరింప, సమర్థులు వారే. మనము చేయువలసినది వారి సేవయే. అట్టిదైవసేవ చక్కగా నెరవేర్చిన వారికి వేఱె జన్మలేదు; అనిబోధించి యున్నారు. మొదట ద్వైతపరముగా అల్లా; స్వర్గాధిపతి; ప్రభువు; ఆయన యాజ్ఞతో నేను విశ్వసేవ జేయుచున్నానని తెలిపి; పరిశుద్ధ స్థితికివచ్చినవారికి "మైఅల్లా" అని అద్వైతస్థితిని బోధించియున్నారు. నిజమెఱిగినవారికి వంకరలు రావు. లోకములో అనేకులు ప్రభువునకు సేవచేసి భయభక్తులతో మెలగి, వారి అనుగ్రహమును సంపాదించి యిష్టార్థములను పొందుచున్నారు. అట్లే పరబ్రహ్మమును ప్రభువుగా భావించి ప్రభుసృష్టి (రక్షణ) లోనిదగు ప్రపంచసేవచేసి ధర్మమార్గమున వర్తించి; వారి అనుగ్రహమును సంపాదించిన మరిజన్మలేదని; కొందఱునమ్మిన మార్గము. ఇదియు ఋషుల మార్గమున కన్యముగాదు.

ద్వా ర కా పు ర వా సు లు.

( భాగ - దశ - పూర్వభాగము )

సీ॥ ఆసక్తికృష్ణముఖావలోకనమంద,
హరిపాదసేవన మంద చింత
వెలుపు నారాయణవిముఖ కార్యములంద
పారవశ్యము విష్ణుభక్తియంద
బాష్పసిర్గతిచక్రిపద్య సంస్తుతులంద
పక్షపాతము శార్ఙ్గి భక్తులంద
లేమిగోవిందాన్యలీలాచరణమంద
శ్రమముగోవింద పూజనములంద
తే॥ బంధమచ్యుతేతరదుష్టపథములంద
జ్వరముమాధవ విరహితక్షణములంద
మత్సరములీశకైంకర్యమతములంద
నరవరోత్తమ విన్నుము తన్నాగరులకు,

1614

క॥ ఆపీటనుండువారికి
భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త
ద్గోవింద కృపావశమున
దేవప్రతిమాను లగుచు దీపింతురిలన్. 1613

శ్రీకృష్ణమూర్తి రాజసూయాగమునకు వెళ్లి తిరిగి ద్వారకకువచ్చి
నపుడు తత్పురవాసులు
(భాగ - ప్రథమస్కంధము)

క॥ ఆరాటము మది నెఱుఁగము
పోరాటము లిండ్లకడలఁబుట్టవు పురిలో
జోరాటన మెనయదునీ
దూరాటన మోర్వలేము తోయజనేత్రా. 214

ఉ॥ తండ్రుల కెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవుమా
తండ్రివిఁ దల్లివిం బతివి దైవమవుం సఖివిం గురుండవుం
దండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁ జేసిరె? వేల్పు లైననో
తండ్రి! భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మావిధంబునన్.

# 10. బంధువు బంధువు యందుజూపు బాంధవ్యమువలె—

బంధుభావము మొకటి కలదు. ఇందులో అనేకులకు చిత్తవృత్తిపనిచేయుచుండును. అట్టిబంధువు సామాన్యుడైన సామాన్యఫలమే గాన అట్లుగాక, యీబంధువు యీశుడు, రక్షకుడు, పరాత్పరుడని నిరంతరము భావమున స్మరించిన అట్టివారు ఆపరాత్పరునే చేరుదురు. ఇట్లు యదు, వృష్టి, భోజులు, పాండవులును, కుంతీదేవియు భావించి సేవించి తరించిరి. గాన ఇదియు త్రయోదశ మార్గములలో నొకటి.

దావాగ్నిచుట్టుకొన్నప్పుడు.
(భాగ_దశ_పూర్వభాగము).

శా. నీచుట్టాలకు నాపదల్ గలుగునే మేమెల్లనీవారమ
· న్యాచారంబు లెఱుంగమీశుఁడవు మాకాభీలదావాగ్నినేఁ

డేచందంబున నింకదాఁటుదుహు మమ్మోక్షించిరక్షింపవ
న్నాచంద్రాభవిపన్నులక్ శిఖిసితానచ్ఛన్నులక్ ఖిన్నులన్.

వ. అనిమఱియును. 748

ఉ. బంధుజనంబుచేతనిటు ప్రార్థితుఁడైహరి విశ్వరూపుఁడో
బాంధవులార మీనయనపంకజముల్ ముకుళింపుఁడగ్నినీ
సంధినడంతు నేననినఁజక్కనవారలు సిల్లచేయుడక్
బంధురదావపావకముఁ బట్టిముఖంబునఁద్రావెలీలతోన్ 749

(భాగ - దశ - ఉత్తరభాగము).

చ. సనకసనందనాది మునిసత్తములంచిత యోగదృష్టిచేఁ
బనివడియాత్మలక్ వెదకిపట్టనగోచరమైన మూర్తియి
ల్లనవరతంబు మాంసనయనాంచలగోచరుఁడయ్యె నట్టినే
మననగువీరిపుణ్యమున కాదటనెట్టితపంబు సేసిరో. 1048

మ. నిరయస్వర్గములాత్మఁగైకొనకతా నిర్వాణమూర్తినయీ
హరిఁజూడక్ హరితోడఁబల్కహరిమేనంటక్ హరింబాడఁగా
హరితోనేగ సహాసనాస్తరణ శయ్యావాసులై యుండఁగక్
హరిబంధుత్వసఖిత్వముల్ గలుగు భాగ్యంబెట్లు సిద్ధించెనో

తే. అనుచుయాదవ వృష్టిభోజాంధకులును
హరిదయాలబ్ధనిఖిలార్థులగుచునున్న
మనికిఁదమచిత్తములఁ బలుమాఱు పొగడి
పరిణమించిరి యంతనప్పాండు మహిపి. 1050

(సశేషము)

# జీవితలక్ష్యము.

(గ్రంథకర్తలు - శ్రీ మతకుమల్లి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు
శ్రీ రామకృష్ణ వివేకానంద సందేశ ప్రచారకులు)
ప్రకాశకులు — శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారు; ప్రొప్రైటర్;
వేంకట్రామా అండు కో, హెడ్ ఆఫీసు, ఏలూరు.)

(గతసంచిక 360-వ పుట శేషము.)

దేహసంబంధమైన ప్రారబ్ధము ఆత్మకంటదని యీ రెండు విష
యములు ఋజువు చేయుచున్నవి. అట్టి ధీరులు స్థితప్రజ్ఞులై ఆత్మకాశో

మున దేహమను కారు మబ్బులపై ఆత్మసాక్షాత్కారమను సూర్య ప్రకాశముచే ఇంద్రధనస్సువలె శోభిల్లగలరు గదా!

గాంధిమహాత్ముడు కొన్ని వత్సరముల క్రిందట (Appendicitis) అను వ్యాధిచే బాధితుడైనప్పు డాతని దేహము శస్త్రచికిత్సచేయబడి నది; అప్పుడు మత్తులేకుండ చికిత్స చేయుచున్నను అతడు చలింపలే దట. అదిచూచి డాక్టరుగారు ఆశ్చర్యచకితులై గాంధిమహాత్ముని ధైర్యసాహసములఁ బ్రశంసించినారట. మహాత్మునికి శస్త్రచికిత్స చేయునప్పుడు కొంచెము దేహబాధ కలిగినదట. ఆబాధకుగూడ విలక్ష ణుడై దేహమును తృణప్రాయముగచూచి ద్వంద్వాతీతుడగుటయే జీవుని లక్ష్యమని మహాత్ముడు వచించియున్నాడు. ఆహా! ఏమి ఆశ్చ ర్యము!! ఇట్టి పరమోత్కృష్టమైన స్థితి దేహభ్రాంతి యున్నంతకా లము లభింపదుగదా! సత్వరజస్తమో గుణాత్మకమైన ప్రకృతియొక్క పంచకోశ గుహాయందలి షడ్చక్రములలో సంచారముచేయు హంస, సుషుమ్ననాడిలో, అధోగతి సంచారముమాని, ఊర్ధ్వగమనముచే సమాధిచేరి, ఆత్మసాక్షాత్కారము పొందినప్పుడే లభింపగలదు. ఆస్థితి యోగులు అష్టాంగయోగముచే సమాధిచేరి సాధించుచున్నారు. జ్ఞానులు జ్ఞానముచే జీవబ్రహ్మైక్యానుసంధాన మునర్చి శోభిల్లుచు న్నారు. భక్తులు భగవంతునిలో లయమై ఆనందించుచున్నారు ఇట్టి పరమపవిత్రితమైన స్థితి లభించినప్పుడు జీవులు భ్రమజనిత దోషమునకు చిక్కక దేహభ్రాంతి విసర్జించి ఆత్మలో రమించి ఆనందించుచున్నారు. ఇదియే ప్రాచీనభారతవర్ష పుటాదర్శము. ఇట్టి పరమపవిత్రమైనస్థితియే మానవుని లక్ష్యము. ఆగామిసంచితములతో పాటు దేహసంబంధమైన ప్రారబ్ధమునకుగూడ నంటక అతీతుడై బ్రహ్మానందము పొందుటయే జీవితలక్ష్యము. ఇదియే మానవుని గమ్యస్థానము; ఇదియే ఆర్యసిద్ధాం తము.

ఈప్రపంచమున సన్మార్గులు కష్టపడుటయు దుర్మార్గులు సుఖిం చుటయు చూడగ ప్రతివానికి మానసికము చికాకుఁ జెందుచుండును. భగవంతు డెక్కడ? సత్యమెక్కడ? అని ప్రతివాడు నిస్పృహ జెందు చున్నాడు. (Parnell) అను మహాకవి రచించిన (Hermit) పద్యావళి

యందు యిటుల వివరించినాడు. ఒక యోగిపుంగవుడు మహారణ్యమున తపోనిష్ఠాగరిష్ఠుడై భగవత్ప్రార్థనలో, ఆధ్యాత్మిక చింతలో, తన కాలము గడపుచుండెను. అతనియొద్ద కేతెంచువారందరు ప్రపంచమున ధర్మము లేదనియు, సత్యము కాన్పింపదనియు, ఉత్తములు కష్టపడుచున్నారనియు, దుర్మార్గులు సుఖించుచున్నారనియు చెప్పసాగిరి. అప్పుడా మహనీయుడు ప్రపంచ విషయములు తెలుసుకొనుటకై బయలుదేరిరి. మార్గమధ్యముననొక యువకుడాయనను కలసికొనియె. పొద్దుగ్రుంకెను, వారొక భవనమునుచేరిరి. యజమాని వారల నుచితరీతి మర్యాదచేసి, బంగారుపాత్రిలలో భక్ష్యభోజ్యాదుల నొసంగెను, భోజనానంతరము సోఫాలపై శయనించిరి. ఉదయమున వీరిరువురు కాలకృత్యములతీర్చుకొనిరి. యజమాని వారలకు స్వల్పాహారవిందు చేయ అంతయు నారగించి, తేయాకు పానీయముత్రాగి బయలుదేరునపుడు యువకుడు బల్లమీదనున్న బంగారుపాత్రిను దొంగిలించి దాచిపెట్టెను; అదిచూచి సాధుపుంగవుడాశ్చర్య చకితుడై, అన్న పానీయముల నొసంగిన దాత బంగారుపాత్ర దొంగిలింపబడుట యెంత అన్యాయమని చికాకుజెందెను. వీరిద్దరును ప్రయాణమైరి. మార్గమధ్యమున పొద్దుగ్రుంకి వర్షము ప్రారంభమైనది; చలిబాధ మిక్కుటమైనది; విసికివేసారి నిస్పృహులై నొక భవనముచెంతచేరిరి. మెల్లగా తలుపులు తెరువబడెను. చెంతనున్న నిప్పుచేత చలిబాధ తీర్చుకొనుచుండిరి. రాత్రిజాము పొద్దుపోయినది; ఆకలి హెచ్చుగుచున్నది; అన్నపానాదు లొసంగువారెవ్వరును లేరు; తుదకు కొంచెము బార్లీజావ వీరల కొసంగబడినది. చాలిచాలనిజావ త్రాగి అంగవస్త్రముల నేలపై బరచి నిద్రించిరి. ఉదయమైనంతనే యిరువురు ప్రయాణమైరి. యువకుడు తాను దొంగలించిన బంగారుపాత్రి నచ్చటనుంచివచ్చెను. దీనిని పరికించి యోగిపుంగవుడు ఆశ్చర్యచకితుడై సంతుష్టికరముగ భక్ష్యభోజ్యాదులచే సత్కరించినవాని బంగారు పాత్రిను గంజిపోయుటకుగూడ నిచ్ఛగింపని వీరి యింట బడవైచుట యెంత విపరీతమని తలంచి, యువకుని వెంబడించెను. పగలంతయు దిననాథునితోపాటు

(సశేషము.)

# యథార్థ భారతి.

సంపుటం 13. | ప్రమాదిసం॥రం మార్గశిరమాసం జనవరి 1940 | సంచిక 11

భక్తియోగః

కర్మయోగః




...యోగః

జ్ఞానయోగః

ఉత్తిష్ఠత. జాగ్రత, ప్రాప్య, వరా౯ నిబోధత.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
సమాపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి
యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి.

(పత్రికవిలాసము:- శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.)

## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమండ్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం. శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా. శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమండ్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, వీర్పేడుగ్రామం.
10. శ్రీమతి. ఆకుల సీతారామమ్మగారు, రాజమండ్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కతారి. వెంకటసుబ్బరాజుగారు—చినసింద్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడగ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మార్చెర్ల.

## అభిమానులు చందా రూ. 10.

1. శ్రీయుత, చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి, తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు.
3. శ్రీయుత. మైలవరపు చిన్న హనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ. "మంత్రి నరసింహమూర్తిగారు, అడ్డా."
5. శ్రీయుత. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్‌పూర్.

ఓమ్ తత్ సత్.

# చందాదార్లకు మనవి.

యథార్థభారతి పాఠకులగు ఆత్మసోదరీ సోదరులారా! కరుణామూర్తి యగు సర్వేశ్వరుని కృపచేతను, పరమపావనులగు మహాత్ముల కరుణచేతను, ఈసంవత్సరము యుద్ధముచే కాగితము ధరఎక్కినను, పత్రిక సకాలమున ...కరముల కంద జేయగల్గితిమి. ఫిబ్రవరి 15-వ తేదీకి పంద్రెండవ సంవత్సరము పూర్తియగుచున్నది. రాబోవు సంచికతో, 12 నెలలు పూర్తియగును. కావున ...ను ఈసంవత్సరమునకు కట్టిన చందారూపాయలు తీరిపోవుచున్నవి. కనుక రాబోవు సంవత్సరమున కింతవరకు చందారూపాయలను పంపనివారలు తమ చందారూపాయలను, భక్తిశ్రద్ధలుగల్గి పంపగోరుచున్నాము. మీగ్రామములో యథార్థభారతి చందాదార్లు ఉండిన నలుగురిసొమ్ము ఒకేతూరి సమకూర్చి ...రుపంపినచో మనియార్డరు రుసుము తగ్గిపోవును. మీయొక్కరి చందా పంపినను రెండణాలు మనియార్డరుచార్జీ పట్టును. 10 రూపాయల వరకున్ను ...తేచార్జిచాలును. ఇచ్చటనుండి పత్రిక వీ. పి. గా పంపుటలో రిజిస్ట్రేషన్ చార్జీ యొక్కువైనందుచే వ్యర్థముగా నష్టముగల్గును. కావున వారివారి చందా సొమ్మును మనియార్డరుగా పంపుటయే మంచిది. సొమ్ముపంపునప్పుడు మీ అడ్రస్సు పూర్తిగా వ్రాయవలయును. మీపత్రిక చందానెంబర్లున్నూ తెలిపిన బాగుండును. చందానెంబర్లు, పత్రికపైముద్రించియుండు గార్మెంటు రిజిస్ట్రేషన్ 237 నెంబరు కాదు. మీచిరునామపై వ్రాయబడిన సంఖ్యయని జ్ఞాపక ముంచవలయును. ఆర్థిక దుస్థితివల్ల బాధగల్గియు, పత్రికను లోపములేక జరిపియుండుసంగతి మీకే తెలియును. ఉత్కృష్టములగు వ్యాసరాజముల చేతను, మహాపురుషుల ఉపదేశవచనములచేతను, అమూల్యమైన నూతన గ్రంథములచేతను, పత్రిక శోభాయమానమైయుండు విషయము పాఠకులగు మీరే యెరుంగగలరు. భవిష్యత్కాలమునగూడ ఆలాగున జరిపేలాగున చందాదారులు తోడ్పడి సహాయముచేయగలరనినమ్ముచున్నాము. ఈపత్రికకు చందాదారుల, యభిమానుల, సహాయముతప్ప మరేలాటి మూలధనమున్ను లేదు. గాన ఈపత్రిక సంరక్షణ మీయందరి ప్రియమైన ఆదరణతో జరుగ వలసియున్నది. ఆశ్రమముపై విశ్వాసముగల మీరందరు ఒక్కొక్క క్రొత్త చందాదారులను యేర్పరచిన ప్రయాసములేక పత్రికను నిర్వహింపగలము. ఇది లోకసేవయు, దైవసేవయు, గురుసేవయునని తలంచి నిర్వహించు చున్నాము. ఇంతవరకు కొందరికి యుచితముగా పంపుచుండెడి పత్రికలను ఇక మీద ఆలాగునచేయుట కవకాశములేదు. [illegible] నైన నేర్పాటు చేసికొనవలయును.

ఇట్లు, సంపాదకుడు.

## శ్రీ విచార చంద్రోదయము.

శ్రీ బ్రహ్మనిష్ఠ పండిత పీతాంబరజీగారు హిందీభాషలో రచించిన దానికి తెనుగు అనువాదము. ఇది బ్రహ్మనిష్ఠులకు బ్రహ్మవిద్యారంభకులకు ముఖ్యమైనది. విచారసాగరము అద్వైతసిద్ధి వృత్తి ప్రభాకరము మొదలగు మహోన్నత గ్రంథములలోగల ముఖ్యవిషయములను సంక్షిప్తముగ వ్రాయబడినది. అంతేగాక సామాన్యజనులకు అర్థముకాని వేదాంతవాక్యని గూఢ పదములకన్నిటికిని జిజ్ఞాసువులు సులభముగ తెలుసుకొనేలాగున రచింపబడినది. హిందీభాషలో మరాల గ్రంథముగా ఉండెను ఇది విచారసాగరము తెనుగున వ్రాసిన శ్రీ జనార్దనస్వామి చైతన్యులు దీనికి ఆంధ్రానువాదము చేసియున్నారు. దీని వెల 0—8—0.

## శ్రీ వృత్తిరత్నావళి.

ఇది వృత్తి ప్రభాకరసారము ఇదన్ని హిందీభాషలో బ్రహ్మనిష్ఠ పండిత పీతాంబరజీగారు వ్రాసినదే. బ్రహ్మశ్రీ నడిమింటి సుబ్రహ్మణ్యయ్య గారు ఆంధ్రీకరించిరి. సామాన్యముగ విద్యగలవారందరికిన్ని వేదాంతశాస్త్రములలోగల రహస్యములన్నియు, కఠిన పదములన్నియు, ప్రయాసములేక తెలుసుకొనేలాగున సులభశైలిలో వ్రాసియున్నారు. ఈపదములన్నియు తెలిసినయెడల మహోన్నత వేదాంతగ్రంథములైనను అర్థము చేసుకొన వచ్చును. దీని వెల 0—8—0.

## ఆత్మపురాణము.

గురువర్యులగు శ్రీ విద్యారణ్యుల శ్రీ శంకరానంద యతీశ్వరకృతమగు ఉపనిషత్సారమైన ఆత్మపురాణము సంస్కృతమునుండి హిందీభాషలోనికి భాషాంతరీకరింపబడియుండెను. ఆ యాత్మపురాణపు తెనుగుఅనువాదము యీ నెలనుండి యథార్థభారతిలో 16 పేజీలచొప్పున తెనుగున అనువదించి ప్రచురించేలాగున నిశ్చయించడమైనది. ఇది 18 అధ్యాయములుగలది. ఇదివరలోను తెనుగున ముద్రించియుండలేదు. దీనియొక్క యాంధ్రానువాదులు శ్రీజనార్దన చైతన్యస్వాములవారే. ఇట్టిఅమూల్యగ్రంథము సర్వేశ్వరుని కృపవల్లనే యిప్పుడు ఆంధ్రలోకమునకు రాగలిగెను. చందాదారులందరు వారిసంచికలను భద్రముగా ఉంచిన గ్రంథము పూర్తియైనపుడు ప్రత్యేకముగ, పుస్తకరూపముగ, బైండు చేసుకొనవచ్చును. ఓమ్ తత్ సత్.

# యథార్థభారతి.

సంపుటం 13 సంచిక 11 | ప్రమాది సంవత్సరం పుష్య మాసం 1940సం॥రం జనవరి నెల | చందా సం॥రం రు 2-4-0 విడిపత్రిక రు 0-4-0

ఓం.

## బ్రహ్మవిదాశీర్వాద పద్ధతి.

31. స్వప్నే స్థూలశరీరాభానేపి యస్మిన్ జాగ్రదాద్యవస్థా చతుష్టయే యచ్చిద్రూపాత్మా మణిసూత్రమివానుస్యూతతయా నిరన్తరం భాసతే సచ్చిద్రూపాత్మైవాహమస్మీతి శరీరత్రయం నాహమస్మీత్యన్వయవ్యతిరేకాభ్యాం శరీరత్రయస్య వ్యావృత్తిం తత్సాక్షిచైతన్యస్యానువృత్తించ పశ్యతో మమ శరీరత్రయ వ్యతిరిక్తత్వానుభవః సమ్యగావిర్భూయాత్.

తా॥ స్వప్నమునందు స్థూలశరీరము కనబడకపోయినను ఈ జాగ్రము మొదలగు నాల్గు అవస్థలలో ఏ చిత్స్వరూపమైన ఆత్మ మణులయందు దారమువలె ఎల్లపుడును కనబడుచున్నదో, ఆ చిత్స్వరూపమైన ఆత్మయే నేను; శరీరత్రయములు నేను కాను; అనెడి అన్వయ వ్యతిరేకములచేత త్రివిధ శరీరములయొక్క వ్యావృత్తి (లేకుండుట)యును, దాని సాక్షిచైతన్యముయొక్క అనువృత్తియు (నిశ్చయము)ను చూచుచుండు నాకు శరీరత్రయములయొక్క వ్యతిరేక (వేఱుపడిన) స్థితియొక్క అనుభవము చక్కగా బయలుపడునుగాక!

32. భగవన్తం పరమేశ్వరం ప్రీతిపూర్వకం భజతో మమోపర్యనుగ్రహార్థం భగవాన్ వాసుదేవ ఆత్మభావస్థః సన్ వివేకరూపేణ శక్తిప్రసాదస్నేహాసిక్తేన మద్భావనాభినివేశ వాతేరితేన బ్రహ్మచర్యాది సాధనసంస్కారవత్ప్రజ్ఞావర్తినా విరక్తాన్తః కరణాదికరణేన విషయవ్యావృత్తచిత్త రాగద్వేషాకలుషిత నివాతాపవరకస్థేన నిత్యప్రవృత్తైకాగ్ర్యే

ధ్యానజనిత సమ్యగ్దర్శన భాస్వత జ్ఞానదీపేన అజ్ఞానజమవివేకతో జాతం మిథ్యాప్రత్యయరూపః మోహాన్ధకారం తమో నాశయత్విత్యాశీర్నిరన్తరం భూయాత్.

తా. భగవంతుడైన పరమేశ్వరుని ప్రీతిపూర్వకముగా భజించునట్టివాడనైన నాయందు అనుగ్రహించు నిమిత్తము భగవంతుడైన వాసుదేవుడు ఆత్మస్థితిగా నుండునట్టి వివేకస్వరూపమైన భక్తప్రసాదస్నేహము (తైలము)వలన తడుపబడినదియు, నాయొక్క భావనయనెడి అభినివేశవాయువుచేత ప్రేరేపింపబడినదియును, బ్రహ్మచర్యాది సాధనసంస్కారముగల ప్రజ్ఞయనెడి వత్తిగలదియును, విరక్తిగల అంతఃకరణము ఆధారముగాగల్గి, రాగద్వేషాదులను కాలుష్యములేక, విషయముల నుండి వేఱుపడిన చిత్తమనెడి గాలిలేని స్థలమునందలి ప్రమిదయాదుండునట్టిదియు, సదా ప్రవర్తించునట్టిదియునగు ఏకాగ్రస్థితిచే ధ్యానమువలన పుట్టిన సమ్యగ్దర్శనమనెడి ప్రకాశముగల జ్ఞానదీపముచేత, అజ్ఞానమువలన గల్గినదియును, అవివేకముచే బుట్టినదియునునగు మిథ్యాజ్ఞానస్వరూపమైన మోహాంధకారమైన చీకటి నాశముగుగాక! అను ఆశీర్వాదము నిరంతరము కల్గును గాక!



# మనస్తత్త్వము.

(శ్రీ మళయాళ స్వాములవారు)

(గతసంచిక తరువాయి)

ఏ సంకల్పము యుండరాదనియు, ఏ వస్తువుపై ఆశ గలిగియుండరాదనియు, వైరాగ్యనిష్ఠగలిగి యుండవలెననియు శాస్త్రము చెప్పుచుండగా తాను గలిగియుండవలసిన నిస్సంకల్పత్వమును నిరాశత్వమును నిర్దోషత్వమును మఱచి యితరులపై ద్వేషమును గలుగజేసికొనుట మంచిదికాదు. అనగా తానడిగినది యివ్వకపోయినచో, వీరు లోభులు, కఠినులు, ధర్మబుద్ధిలేని వారలు అని పగల నిందించుట చాల పొరపాటు. ఈశ్వరుడిచ్చినదానితో తృప్తిపడి ఆత్మశాంతికి భంగకరముకాని పనిని మాత్రము చేసిన చాలును. బ్రహ్మనిష్ఠకు మించిన కార్యము

మఱియొకటి ముల్లోకములందును లేదు. అయ్యది మన స్వాధీనములో నుండ, అట్టి నిష్ఠను వదలి ధర్మకార్యములకైనను పుణ్యకార్యములకైనను లేక యితరకార్యములకైనను ఏల యితరుల యాచన చేయవలెను ? పరోపకారము కొఱకును, ఈశ్వరకార్యముల కొఱకును, యితరుల యాచించవచ్చునని శాస్త్రములందు చెప్పబడియున్నను అది తీవ్రబ్రహ్మనిష్ఠుల విషయమై చెప్పబడినది కాదనియు, సామాన్యుల విషయమై చెప్పబడిన దనియు బ్రహ్మనిష్ఠు లెఱుంగవలెను. ఈ విషయమై యొకకథ జెప్పెద— ఒక బిచ్చగాడు దారిలో గల యొకచెట్టు నీడక్రింద కూర్చొనియుండ ఆ మ్రానుక్రింద యెవరో బాటసారులు చెరుకు నమిలి ఊసివేసిన పిప్పి యుండెను. దానిని తీసుకొని ఆ యాచకుడు నమిలినప్పుడు అందు మాధుర్యము గాని చెరుకురసముగాని యుండలేదట. అప్పుడు ఇది యే మూఢుడు నమిలివైచెనో కొంచెమైనను గసమునుంచక పోయెను. గదా అని తలంచుచు, అతనిని, కఠినుడు, ధర్మహీనుడు అని తిట్టుచుండె నట. పైనదెల్పిన జనులయొక్క ప్రవృత్తియు ఈలాగుననే యుండునని తలచవలెను. కాన, మానవుడు దొరికినదానితో తృప్తి బొందేలాగున చూడవలెను. ఎవరున్ను ఆత్మవంచనలేక సర్వేశ్వరుడిచ్చినదానిలో శక్తికొలది యేకార్యమునైన చేసిన చాలును. ఇక యాఱవ యర్థమును చెప్పెద.

6. తపోసిద్ధిగాని యోగసిద్ధిగాని, గలిగిన యోగికి 1. అణిమ 2. మహిమ 3. గరిమ 4. లఘిమ 5. ప్రాప్తి 6. ప్రాకామ్యము 7. ఈశత్వము 8. వశిత్వములను సిద్ధులు కలుగును. అట్టి సిద్ధపురుషులు సంకల్పమాత్రముచే తలంచినట్లు చేయగలరు. కాన అట్టి వారికి మనస్సే ప్రధానమని చెప్పుటకు కారణము. మనస్సే ప్రధానమని చెప్పువారు తాము సంకల్పించినలాగున జరుగుచున్నదా లేదా యని పరీక్షించి చూచిన దీని యొక్క రహస్యము గోచరము కాగలదు.

7. మఱియొక అర్థముకూడ తెలిపెద. అదేమన, తన్నును ప్రపంచములోగల యేవస్తువునైనను తనయొక్క యిష్టానుసారముగ మార్పు చేయు శక్తి సంకల్పమాత్రముచే గలుగుచుండునా యను విషయము. సిద్ధపురుషులైనచో సంకల్పించినట్లు చేయగలరు. వీరికి మనస్సే ప్రధానము. వీరికందఱివలె ప్రయత్నమేమియు చేయబనిలేదు. ఇట్టి యున్నత

స్థితి తనకు గలినదా యని యోచింపక యిప్పుడుండువారిలో కొందఱు తినుటలోను త్రాగుటలోను, హీనకృత్యము లొనర్చుటలోను, వస్త్రధారణలోను ప్రవర్తించి అమాయకులతో "మనస్సే ప్రధాన" మని వేదాంతవాక్యములను బల్కుచుందురు. ఇందువలననే అతి పవిత్రమగు వేదాంతశాస్త్రమునకు పతనము గల్గినది. మఱియు వేదాంతులపై జనులకు విశ్వాసము లేకుండుటకును కారణమైనది. మనస్సు చెడు విషయములలో పోవునపుడు, అయ్యో, మన మనస్సెంత మలినమైనది, దుష్టకార్యములలోనికి బోవుచున్నదేయని, తలంచి జ్ఞానము తెచ్చుకొని అట్టి చెడుకార్యముల నుండి మనస్సును మరలించుకొనుటయే మనస్సు ప్రధానమని చెప్పెడుదాని కర్థము. ముఖ్యముగా నివాసదోషము చేతను, ఆహారదోషముచేతను, మనస్సు వశపడక పోవును. ఈ రెంటిలో ఆహారదోషముకంటె నివాసదోష మెక్కుడు చెఱుపు చేయును. ఆహార దోషముండిన అది కాలక్రమముననే మనస్సును మాలిన్యపఱచును. ఇక నివాసదోషమో, తత్క్షణమే విపత్తులో బడద్రోయును. కాన పై జెప్పిన రెండు లోపములు లేక జిజ్ఞాసువు లుండవలెను. పైం జెప్పేలాగున అందఱును మనస్సేప్రధానమని తలంచి నీతిబాహ్యులై యున్నారని తలంపరాదు. అట్టివారెందరో పుణ్యపురుషులు గలరు. ఎందఱో బ్రహ్మనిష్ఠులును గలరు. ఎందరో పవిత్రాత్ములుగలరు. అట్టివారు లేనిచో నిక సంసారసాగరమున బడియున్నవారిని తరింపజేయువారుండరు. అంతేగాక ఎవరికైనను ఆత్మశాంతి గలుగవలసియుండిన, మనోనిగ్రహము లభించవలసియుండిన, శాశ్వతదైవసుఖము సిద్ధించవలసియుండిన, జీవించియున్నప్పుడే దివ్యప్రకాశము గలుగవలసియుండిన, జననమరణములగు భవరోగమునుండి తరించవలసియున్న, వేదాంతశాస్త్రాభ్యాసము తప్ప వానిని రక్షించునది మఱియొకటి మూడు లోకములందును లేదు. అట్టి పుణ్యజీవులకు గోరంత యిచ్చినను కొండంత పెరుగును. బిందువంత జలమిచ్చినను అయ్యది సముద్రమువలె వృద్ధినొందును. అట్టి పుణ్యపురుషుల హృదయములో పడిన వస్తువులన్నియు సాక్షాత్ భగవంతున కర్పించినట్లే యుండును. మనస్సే ప్రధానమను విషయమై ముండకోపనిషత్తు చెప్పినది చూడుడు.

యం యం లోకం మనసా సంవిభాతి
విశుద్ధసత్వః కామయతే యాంశ్చ కామాన్

తం తం లోకం జయతే తాంశ్చ కామాన్
తస్మా దాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతికామః.

పరిశుద్ధాంతఃకరణముగల జ్ఞాని మనస్సుచేత ఏయే లోకమును సంకల్పించునో, ఏయే కోరికలను కోరునో, ఆయా లోకమును, ఆయా కోరికలను పొందును. కాన ఈశ్వరానుగ్రహము నభిలషించువాడు బ్రహ్మవేత్తను సేవించవలెను.

సర్వసంగవిముక్తస్య యోగారూఢస్య ధీమతః
యాదృశం మానసం యత్ర తాదృశం విన్దతే ఫలమ్.

ప్రాకృతములగు సమస్త బంధములనుండి విముక్తినొందిన చిత్తము గలవాడు, ఈశ్వరధ్యానమందు ఐక్యానుసంధానము సిద్ధించినవాడు, శుద్ధమైన బుద్ధిగలవాడునగుయోగి తనమనస్సునందు యేమేమి సంకల్పములు చేయునో ఆయా సంకల్పముల ననుసరించిన ఫలమును తప్పక పొందగల్గును అని యుపనిషద్వాక్యము. అయినను యిట యొకవిషయము జ్ఞప్తి యందుంచుకొనవలెను. లోకోద్ధారమొనర్చుట, గొప్పగొప్ప సంస్థలనిర్మించుట, మహాకార్యము లొనర్చుట మున్నగునవి మేమేల యొనర్చజాల మన్నామని చిత్తశుద్ధిగలవారు భక్తులు కొందరు తలంచవచ్చును. అట్టి సంస్కారము కొందఱకుమాత్రమే యుండునని గ్రహింపవలెను. లేక ఈశ్వరుడు వారికట్టి సంస్కారమును కలుగజేసెననిగాని తలంచి లక్ష్యమగు జీవన్ముక్తికొఱకే ప్రయత్నమును కొనసాగించుచుండవలెను. ఇందలి నిగూఢతత్త్వమేమన, ప్రపంచసృష్టియంతకును ప్రకృతియే కారణము. అట్టి ప్రకృతి యెవనికి వశపడియుండునో అనగా యెవడు ప్రకృతి రహితత్వ మొందునో లేక ప్రకృతిని జయించునో అతడు ప్రకృతికి పరమగు పరమాత్మానుభవము గల్గియుండును.

ఇట్టి యున్నతస్థితిని సర్వులు బొంద నర్హులే. బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని, యెవరైనను అంతఃకరణ శుద్ధిగల్గి ప్రయత్నించిన నట్టి దివ్యపదవిని పొందగలరు. అపుడా స్థానమునకు సంబంధించిన సర్వశక్తులును వారికి లభింపగలవు. ఒకగొప్ప ఉద్యోగమునందు ప్రవేశించువారెవరైనను, ఏజాతివారైనను, ఏకులమువారైనను, ఏదేశీయులైనను, అద్దానికి సంబంధించిన సర్వాధికారములు

వానికి గల్గునుగదా! అట్లనే ఇట్టి మహోన్నతమగు దైవస్థితిని బొందిన ప్రతివారికిని ఆయాదైవీకశక్తులన్నియు గలుగును. అట్టివాని కార్యము లన్నియు ప్రకృతియే నిర్వహించుచుండును. దీనికే జగన్మాతయనియు పరాశక్తియనియు, మహాశక్తియనియు, శివశక్తియనియు, విష్ణుమాయ యనియు భగవత్కృప యనియు గూడ పేర్లు గలవు ఇట్లు ప్రకృతియే గోడవలె జీవుని అడ్డుపఱచుచుండును. గోడ యేలాగున అనేక రాళ్లతో కట్టబడినదో ఆలాగున జీవునియొక్క జన్మాంతర సంస్కారము లన్నియు కర్మరూపముగ అడ్డుపడియుండును. దీనిని తొలగించుటయే బ్రహ్మ నిష్ఠుని కర్తవ్యమై యున్నది.

8. మనస్సే ప్రధానమను విషయమై యింకొక అర్థముకూడ తెలిపెద. ఈ జీవజగత్తులన్నియు కేవలము పరమేశ్వరస్వరూపములై యున్నను మనస్సుయొక్క భావనావిశేషముచే ప్రపంచముగాను, జీవులుగాను, సత్వరజస్తమో గుణములుగాను, జననమరణములను అవస్థలుగాను, వెయ్యేల సమస్తసంసారసంకటములరూపముగాను నగుచుండును. ఈవిషయము ప్రమాణపూర్వకముగ చెప్పబడిన విస్తారమగును కాన సంగ్రహముగ నిటచెప్పబడినది. ధ్యాన, జ్ఞాన, యోగాదులచే మనస్సు శుద్ధపడుటవలనను, బ్రహ్మవిచారమందు ప్రవేశించుటవలనను, శ్రవణమనననిధిద్యాసనము లొనర్చుటవలనను దోషములన్నియు నివారింప, అపుడు జీవునకు తాను శుద్ధ శివస్వరూపుడనియు, మాయచే గల్గిన భ్రమవలననే యీ సత్యము నింతవఱకు తెలిసికొనలేదనియు జ్ఞానము గలుగును. అపుడు అవిద్యయొక్కయు అజ్ఞానముయొక్కయు శక్తిచే యీప్రపంచ మీలాగున కనుపించుచున్నదను బోధము గలుగును. ఇట్టి అవిద్యాదోషము నశించిన మాత్రమే నిజమైన యవస్థ జీవకోట్లకు గలుగును. అవిద్య నశింపవలసియుండిన ఈశ్వరభక్తి అవశ్యము గలిగి యుండవలెను. ఇదియే దీనిలోగల సారము. శాస్త్రములన్నియు ఈ విషయమునే యుద్ఘోషించుచున్నవి.

యావదాత్మా న లబ్ధోయం శుద్ధో జ్ఞానంచ నోదితమ్
మలీన విషయేరాగ తావదజ్ఞానినో భవేత్.

ఎంతవఱకు ఈ ఆత్మ లభించుటలేదో, శుద్ధమైన ఆత్మజ్ఞాన ముద యము కాలేదో, ఎంతవఱకు విషయవాసన లీనముకాలేదో అంతవఱకు తా నజ్ఞానదశలో యున్నట్లే తలంచుకొనవలెను.

యథా భర్జితబీజస్య ప్రరోహిత్వం వినశ్యతి
తథాత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధి ర్విలీయతే.

ఏలాగున అగ్నిలో వేయించిన బీజముయొక్క అంకురత్వము నశించియుండునో, ఆలాగున ఆత్మజ్ఞానాగ్నిలో దహించిన చిత్తముగల వానికి దృశ్యవిషయములు నశించియుండును. విషయాంకురములు హృద యములో పుట్టుచుండిన యింకను జ్ఞానాగ్నియందు చిత్తము దగ్ధము కాలేదని సాధకుడు గ్రహించుకొనవలెను.

ఇంద్రియేష్వింద్రియార్థేషు ప్రవర్తేషు యదృచ్ఛయా
అనుధావతి తాన్యేవ మనోవాయు మివానిలః.

ఇంద్రియములు, ఇంద్రియార్థము (విషయము)లలో స్వేచ్ఛగా ప్రవర్తించుచుండిన, విషయముల ననుభవించుచుండిన, అగ్నిదేవునకు వాయుదేవుడు సహాయపడునట్లు విషయానలము మఱింత ప్రజ్వలించునే గాని శమింపదు.

నాశ్రమం కారణం ముక్తేః దర్శనాని న కారణం
తథైవ సర్వకర్మాణి జ్ఞానమేవహి కారణం.

ఆత్మజ్ఞానప్రాప్తికి సన్న్యాసాది ఆశ్రమములు కారణముకావు. ఆలాగున శాస్త్రముల పఠించుటయు కారణము కాదు. అదేప్రకారము కర్మకాండలో ప్రవృత్తిగలిగియుండుటయు కారణముకాదు. ఈశ్వర సాక్షాత్కారజ్ఞానము కలుగుట ఒక్కటిమాత్రమే కారణమగును.

అంతస్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకమ్
న నశ్యతి తమోనామ కృతయా దీపవార్తయా.

గృహాంతర్భాగ తిమిరము (చీకటి) దీపముయొక్క వార్తవలన నేలాగున నశింపదో ఆలాగున హృదయ గుహయందుగల అజ్ఞాన తమ స్సు శాస్త్రముల పఠించుటచేగాని చెప్పుటచేగాని విలయమునొందదు.

యస్య నాస్తి నివేకస్తు కేవలం యో బహుశ్రుతః
స నజానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసానివ.

బహుశాస్త్రములను పఠించినవాడైనను, ఎవనికి అంతఃకరణము శుద్ధిగలిగి వివేకజ్ఞాన ముదయము కాలేదో అట్టివాడు చదివినశాస్త్రము లన్నియు అనేక రసయుక్త పదార్థములలో త్రిప్పబడు గరిటెవలెనుండును. అనగా గరిటె ఆయాపదార్థముల రసమును తెలిసికొనజాలనట్లు ఆచరణలేని కేవలశాస్త్రపఠన యొనర్చువాడును ఆ యథార్థతత్వమును, శాస్త్రార్థమును మెఱుగజాలక అనుభవజ్ఞానరహితుడై యుండును.

స్వతంత్రాభ్యాసశీలానాం కథం యోగ మవాప్నుయాత్
నాస్తితేషా మపిజ్ఞానం నాస్తితేషాం గతిఃపరా.

అనుభవముగల మహనీయుల అనుగ్రహముపొందక స్వతంత్రముగ యెవడు యోగాది సాధనలు చేయునో, అట్టివారికి యోగసిద్ధి కలుగుటగాని ఆత్మజ్ఞాన ముదయించుటగాని, ఉత్తమగతి లభించుటగాని సంభవింపదు. (సశేషము)

---

# శ్రీభగవద్గీతాఫలస్తుతి.

(శ్రీ శ్రీకంఠ శివాచార్యులవారి గీతాభాష్యగ్రంథమునుండి)

(అష్టాదశాధ్యాయము)

శ్రీ విష్ణువు లక్ష్మీదేవితో నిట్లనియె:—

ఓలక్ష్మీ:—ఇక గీత 18 వ అధ్యాయ మాహాత్మ్యమును చెప్పెద. నదులన్నిటికంటె గంగానది యెటుల పుణ్యమైనదియో అట్లే గీత అన్ని అధ్యాయముల కంటె 18 వ అధ్యాయము మిక్కిలి పవిత్రమైనది. మేరుపర్వతమునందలి అమరావతీ పురమునందు ఇంద్రుడు శచీదేవితోడను, 33 కోట్ల దేవతలతోడను కొలువు దీర్చియుండగా, 100 నేత్రములు గలిగి మిక్కిలి తేజోవంతుడైన ఒక పురుషుడా సభ కరుదెంచెను. ఆ పురుషుని జూచి దేవతలందఱు అదరిపడిరి. దేవేంద్రుడు సింహాసనము నుండి దిగి దూరముగా పారిపోయి చాటునుండి చూచుచుండెను. అంత దేవతలు ఆ నూతన పురుషునిదెచ్చి శచీదేవియొక్క సరసను గూర్చుండబెట్టిరి. అప్పుడు దేవతలు పుష్పవర్షమును గురిపించిరి. గాయకులు

పాడిరి. రంభాది అప్సరసలు నాట్యమాడిరి. ఇది యంతయును జూచి ఇంద్రు డాశ్చర్యపడి తొట్రుపాటుతో బృహస్పతి యింటికి బోయి జరిగిన దంతయు వానితో జెప్పి మరల యిట్లనెను. ఓ గురూత్తమా! నేను 100 అశ్వమేధయాగములుచేసి ఈ యింద్రపదవిని పొందితిని. గనుక నాకంటె యధికమగు యే పుణ్యముచేత ఆ పురుషున కింద్రత్వము ప్రాప్తించెనని యడుగగా నాదేవగురు విట్లు చెప్పెను—ఓ యింద్రుడా! భయపడకుము. ఆపురుషుడు పుణ్యశీలుడు. ఎట్లందువా? అతడు నియమముగా గీత 18 వ అధ్యాయమును ప్రతిదినము పఠించువాడు. గీత 18 వ అధ్యాయము మిక్కిలి పవిత్రమైనది. అందువల్ల నతనికి యింద్రత్వము వచ్చెననియు, నీ పుణ్యము క్షీణమైనదనియు చెప్పెను. వెంటనే ఇంద్రుడు బృహస్పతివలన గీత 18 వ అధ్యాయము నుపదేశమునొంది గోదావరీతీరమందు పఠించుచుండగా నతనిపాపమంతయు నశింప అచిరకాలములోనే మరల తన యింద్రపదవిని పొందెను.



ఓం

# బ్రహ్మజ్ఞని స్వభావము.

(శ్రీయోగవాసిష్ఠమునుండి)

శ్రీరామ ఉవాచ:—

పరిజ్ఞాతే పరేవస్తున్యాద్యాది నిధనాత్మని
సంపద్యతే వద బ్రహ్మన్ కీదృశః పురుషోత్తమ.

శ్రీరాముడు:— బ్రహ్మజ్ఞుడగునో వసిష్ఠమునీంద్రా! ఆద్యంతరహితమును, పరమతత్వమునగు బ్రహ్మవస్తువు నెఱింగిన మహాత్ముం డేయే లక్షణములు గల్గియుండునో వచింపుము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

శృణు సంపద్యతే కీదృగ్జాతజ్ఞేయో నరోత్తమః
యావజ్జీవం కథంచైవ కిమాచారోఽవతిష్ఠతే.

శ్రీవసిష్ఠుడు:—ఓరామా! జ్ఞేయమగు బ్రహ్మము నెఱింగిన పురుషోత్తము డెవ్విధమున నుండునో, యావజ్జీవ మెట్టి ఆచరణ గల్గియుండునో వచించెద వినుము.

ఉపలా అపి మిత్రాణి బంధవో వనపాదపాః
వనమధ్యే స్థితస్యాపి స్వజనా మృగపోతకాః.

బ్రహ్మజ్ఞునకు శిలాంసులుకూడ మిత్రులును, వనవృక్షములు కూడ బంధువులును నై యుండును. వనమందుండునపుడు మృగశాబకములే వాని స్వజనమై యొప్పును (సమత్వము, సర్వభూతదయ గల్గి వర్తించు ననుట.)

ఆకీర్ణం శూన్యమేవాస్య విపదశ్చాతిసంపదః
స్థితస్యాపి మహారాజ్యే వ్యసనాన్యేవ సూత్సవాః.

జనాకీర్ణప్రదేశమున్న వానికి శూన్య ప్రదేశముగాను, ఆపదలు సంపదలుగను నుండును. మహారాజ్యమున స్థితుఁడై యున్నను దుఃఖములనే యుత్సవముగా దలంచుచుండును.

అసమాధిః సమాధానం దుఃఖమేవ మహాత్సుఖమ్
వ్యవహారోఽపి సన్మౌనం కర్మణ్యేవాత్యకర్మతా.

అసమాధిని సమాధిగను, దుఃఖమునే మహాసుఖముగను, వాగ్వ్యవహారమును కూడ మౌనముగను, కర్మల నకర్మలుగను నెంచుచుండును.

జాగ్రదేవ సుషుప్తస్థో జీవన్నేవ మృతోపమః
కరోతి సర్వమాచారం నకరోతిచ కించన.

(దృశ్యభావము లేమిచే) మేల్కొన్నను సుషుప్తియందున్న వానివలెను, జీవించియున్నను మృతించినవానివగిదిని యుండును. సర్వాచారముల నొనర్చుచున్నను చిద్రూపదేహముతో నేమియుఁ జేయక యుండును.

సర్వాభినందితాచారః సర్వాచార బహిష్కృతః
వీతశోక భయాయాసః సశోకఇవ లక్ష్యతే.

సర్వులచే ప్రశంసింపబడు యాచరణగలవాడును, సర్వాచారాతీతుఁడును, శోకభయ ఖేదవివర్జితుఁడును, అజ్ఞులదుఃఖములను గాంచుటచే శోకయుక్తుడుగ గన్పట్టువాడును నై యుండును.

తస్మాన్నో ద్విజతేలోకో లోకాన్నో ద్విజతేతు సః
పరముద్వేగమాపన్నః సంసృతౌ రసికోఽపిసన్.

వానిచే లోకమున్ను, లోకముచే తానున్ను భీతిఁజెందక యుం డును. ఇతరుల దృష్టియందు సంసారమున నాయాసక్తి గల్గియున్నట్లు గన్పించినను పరమవైరాగ్యోపేతుఁడై యే యుండును.

నాభినందతి సంప్రాప్తం నాప్రాప్త మభివాంఛతి
ఆస్తేఽనుభూయమానేస్థే నచహర్ష విషాదయోః.

ప్రాప్తించిన వస్తువుచే ప్రసన్నుఁడుగాఁడు; అప్రాప్తవస్తువు నభిలషిం పఁడు. పదార్థముల ననుభవించినను హర్షవిషాదముల బొందకుండును.

దుఃఖితే దుఃఖితకథః సుఖితే సుఖసంకథః
ఆస్తే సర్వాస్వవస్థాసు హృదయేనాపరాజితః.

దుఃఖితులమధ్య దుఃఖగాథలను, సుఖవంతులమధ్య సుఖగాథలను వచింపుచున్నను, సర్వావస్థలయందును హృదయమున నేకరీతి వర్తించు చుండును.

కర్మణః సుకృతాదన్య దస్మైకించిన్నరోచతే
స్వభావ ఏవ మహతాం నను యన్న విచేష్టితమ్.

ఉత్తమకర్మ దప్ప మఱేదియు వానికి రుచింపకుండును. శాస్త్ర నిషిద్ధ కార్యముల నొనర్పకుండుటయే మహాత్ముల స్వభావమై యున్నది.

నాలంబతే రసికతాం నచనీరసతాం క్వచిత్
నార్థేషు విచరత్యర్థీ వీతరాగః సరాగవత్.

బ్రహ్మజ్ఞాని దేనియందును ఆసక్తిగల్గియుండఁడు. అయినను ప్రేమ నెన్నఁడును విడనాడకయుండును. యాచకుఁడై ధనార్థము సంచరింపకుం డును. వీతరాగుఁడైనను రాగసహితుఁడుగ గన్పట్టును.

యథాశాస్త్ర వ్యవహృతేః సుఖదుఃఖైః క్రమాగతైః
అనాగతోఽపి చాయాతి నహర్షం నవిషాదితామ్.

శాస్త్రానుకూల వ్యవహారముల నాచరించుచు, సంప్రాప్తమగు సుఖదుఃఖములచే స్పృశింపబడకున్నను, స్పృశింపబడినట్లు గన్పట్టును. కాన యథార్థముగ నాతఁడు హర్షవిషాదముల బొందకయే యుండును.

సంప్రాప్తాశ్చ లక్ష్యంతే లక్ష్యంతే దుఃఖితాస్తథా
న స్వభావం త్యజంత్యంతః సంసారారథఘటే నటాః.

సుఖదుఃఖకారణములచే ప్రసన్నత్వదుఃఖములం జెందినట్లగపడినను, అమ్మహాత్ములు నిరతిశయానంద జనితమగు తమ ధీరస్వభావము నెన్నటికిని విడనాడరు. ఏలయన వారీసంసార నాటకమందలి నటులే యగుదురు.

ఆత్మయేవ్వర్థజాతేషు మిథ్యాత్మసు సుతాదిషు
బుద్బుదేష్వివ తోయానాం నస్నేహ స్తత్వదర్శినామ్.

బుద్బుదములందువలె తత్వజ్ఞాని స్వధనాదులందును, మిథ్యాత్మభూతులగు పుత్రాదులందును రాగిము లేక యుండును.

అస్నేహ ఏవ సుఘన స్నేహార్ద్రి హృదయో యథా
వత్సలాం దర్శయన్ వృత్తిం జ్ఞ స్తిష్ఠతి యథాక్రమమ్.

తత్వజ్ఞుడు రాగరహితుండును, నిస్సంగుడనునైనను స్నేహార్ద్రి హృదయుండై ప్రేమపూర్ణమగు వృత్తిని దర్శింపజేయుచు యథారీతి మెలంగును.

బహిః సర్వ సమాచార మంతః సర్వార్థ శీతలమ్
నిత్య మంతరనావిష్ట ఆవిష్ట ఇవ తిష్ఠతి.

తత్వజ్ఞాని బాహ్యమున శిష్టాచారము లన్నింటిని నెరవేర్చుచుండినను, అంతరంగమున పరమప్రశాంతయుతుడై నిస్సంగత్వము గల్గియుండును. హృదయమున తానందఱికంటె విలక్షణమైన స్థితియందున్నను, బాహ్యమున అందఱితో కలసియున్నట్లు గోచరించును.

శ్రీరామ ఉవాచ:—స్వరూపమీదృశం తస్య కోవేత్తి మునినాయక
వద సత్యమసత్యంవా భవత్యజ్ఞోప్యపీదృశః.

శ్రీరాముడు :— ఓ మునీంద్రా ! జ్ఞానియొక్క యిట్టి స్వరూపము సత్యమైనదో, అసత్యమైనదో యెవరెఱుంగుదురు ? ఏలయన అజ్ఞానియున్నా దంభముచె యిట్టి చిహ్నములతో గూడియున్నట్లు గన్పట్టుచున్నాడుగదా.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—అసత్యం వాస్తు సత్యం వా స్వరూపం పరమీదృశమ్
విద్ధి వేదవిదాం త్వేష స్వభావానుభవస్థితిః.

శ్రీ వసిష్ఠుడు :— ఓరామచంద్రా ! అసత్యమైనను, సత్యమైనను యిట్టి స్వరూపము వేదవిత్తమమైనది; ఇది స్వానుభవమునకు మాత్రము యనుచితము

త్త్వవేత్తలకీ లక్షణములు స్వభావముగనే గల్గునుగాని దంభహా
శాదులచే యవి గల్గునవికావు.

అనావిష్టా విచేష్టంతే వీతరాగాః సరాగివత్
గతహాసా హసంత్యజ్ఞాన్సహాసా కరుణాకులాః.

జ్ఞానులు రాగరహితులును, క్రియాఫలమం దాసక్తిలేనివారు
నైనను, ఆసక్తిగలవారివలె గన్పట్టుదురు. హాస్యరహితులైనను కరుణా
పూరితచిత్తులై అజ్ఞానులఁగాంచి హసింతురు.

చిత్తాదర్శగతం దృశ్యం సర్వం కపట కుట్టిమమ్
పశ్యన్త్యసత్పరిజ్ఞాతం స్వప్నే హేమేవ హస్తగమ్.

చిత్తమను యద్దమందు గన్పట్టు ప్రతిబింబిత హర్మ్యమువలె
నసత్యమగు యీ సమస్త దృశ్యమును తత్త్వజ్ఞులు స్వప్నమందలి హస్త
గత సువర్ణమువలె మిథ్యారూపమున గాంతురు.

అంతః శీతలతామేషాం తాం నజానంతి కేచన
దూరాచ్చందన దారూణామామోదమివ జంతవః.

చందనముయొక్క సుగంధమును దూరముననుండి క్రిమి మున్నగు
జీవము లెఱుంగజాలనట్లు తత్త్వజ్ఞానులు యంతఃకరణమందలి ప్రశాంత
స్థితిని యెరులెవరును యెఱుంగ జాలరు.

యేతు విజ్ఞాత విజ్ఞేయాస్తాదృశాః పావనాశయాః
జానంతి తాం స్తథైవాంత రహేః పాదానివాహయః.

సర్పముయొక్క పాదములను సర్పమే యెఱుంగునట్లు జ్ఞాతజ్ఞేయు
లైన పవిత్రాంతఃకరణులగు జ్ఞానులే జ్ఞానులచిత్తము నెఱుంగగలరు.

భావం నిగూహయంత్యేతే తముత్తమమనుత్తమాః
గ్రామ్యైర్ధనైః కిలానర్ఘ్యైః కశ్చింతామణిరాపణే.

గ్రామసంబంధధనములచే కొననయోగ్యమగు ఉత్తమచిన్తామణిని
మనుజుడు విక్రయశాలయందు గోప్యముగా నుంచునట్లు, సత్యనిష్ఠులును,
సర్వశ్రేష్ఠులును నగు జ్ఞానులు తమ యుత్తమభావమును గూఢముగా
నుంచుదురు.

తస్మిన్నిగూహనే భావో యత స్తేషాం న దర్శనే
నిర్వాసనా గతద్వైతా గతమానాః కిలాంగతే.

వాసనాద్వైతవివర్జితులును, అభిమానరహితులు నగుటచే తత్త్వజ్ఞులు తమ యాంతరిక భావమును నిగూఢముగా నుంచదలంతురు. కాని పాషండు లద్దానిని వ్యాప్తిజేయు దలంపు గల్గియుందురు.

ఏకాంతా మానదార్గత్య జనావజ్ఞ ప్త యస్తుతాన్
సుఖయంతి యథారామ న తథైవ మహర్ధయః.

ఓరామా! ఇట్టి మహాత్ములకు యేకాంతప్రదేశము, పూజప్రతిష్ఠల యభావము, దారిద్ర్యము, మనుజులలో యవమానము మున్నగునవి గల్గించు సుఖమును గొప్పగొప్ప సిద్ధులుకూడ గల్గింపజాలవు. ఏలయన మానప్రతిష్ఠాదులు ఆత్మసుఖమునకు విక్షేపకారకములు గదా!

స్వసంవేదన సంవేద్య సారావిదిత వేద్యతా
నైషా దర్శయితుంశక్యా దృశ్యతే సచ తద్విదా.

స్వానుభవమాత్రమును, సారయుతమును నగు ఆత్మ మెవనికిని జూప సాధ్యము కాదు. ఇయ్యది ఆత్మజ్ఞునకుకూడ దృష్టిచే గోచరమగునది కాదు. కేవలము స్వప్రకాశరూపముననే యనుభూత మగును.

గుణం మమేమం జానాతు జనః పూజాం కరోతు మే
ఇత్యహంకారిణా మీహా నతు తన్ముక్తచేతసామ్.

నాయీ గుణములను ప్రపంచ మెఱుంగునుగాక, మఱియు నన్ను పూజించుకాక, ఇట్టి యల్పబుద్ధి అహంకారయుతులకే గలుగునుగాని జీవన్ముక్తులకు కాదు.

క్రియాఫలాని చిద్వ్యోమ గమనాదీని రాఘవ
అజ్ఞానామపి సిద్ధ్యంతి మంత్రౌషధివశాదిహ.

ఓరామా! మంత్రౌషధాదుల శక్తిచే ఆకాశగమనాది సిద్ధులు అజ్ఞానులకుఁగూడ గల్గును.

యో యాదృక్ క్లేశమాధాతుం సమర్థస్తాదృగేవ సః
అవశ్యం ఫలమాప్నోతి ప్రబుద్ధోఽస్త్వజ్ఞ ఏవవా.

అజ్ఞానియైనను, జ్ఞానియైనను యెవడెట్టి శ్రమను సహింప సమర్థుడగునో, వాడు తదనురూపమగు ఫలమును తప్పక పొందును.

ఆమోద శ్చందనస్యేవ స్పందనస్య ఫలంహృది
సర్వస్యైవ వ్యాప్తిమన్నైవం తద్వ్రజ న విద్యతే.

చందనమందు సుగంధమున్నవిధమున విహితనిషిద్ధకర్మల ఫలము బుద్ధియందును యుండియే యుండును. కాలక్రమమున మనుజుడు తా నాచరించిన కర్మకనురూపమగునట్టి ఫలమును అవశ్యము పొందును.

అహంతా వాసనాద్వైతం వస్తుతా దృశ్యవస్తుషు
యస్యాస్త్యసౌ సాధయతి ఖగమాది క్రియాఫలమ్.

సిద్ధులు మున్నగు దృశ్యవస్తువులయొక్క భోక్తను నే నను అహంకార వాసనారూపమైన పరిచ్ఛిన్న భావముగలవాడు తత్సాధనచే ఆకాశగమనాది క్రియలయొక్క ఫలమును బొందుచున్నాడు.

ఇదం నకించిద్భ్రాంతిర్వా ఖంచేతి జ్ఞస్తువేత్తియః
సోఽవాసనః కర్మవాత్యాః కథం సాధయతి క్రియాః.

ఈ ఆకాశగమనాది సిద్ధులు తుచ్ఛములును, మనోభ్రాంతిమాత్ర ములును నగును. జ్ఞానియగువాడు వాసనారహితుడై కేవలము చిదా కాశమును మాత్రమే యెఱుంగునుగాని కర్మలను మహావాయువేగ మందు పరిభ్రమించుచు ఆకాశగమనాది సిద్ధుల నేల సాధించును?

నైవతస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః.

తత్త్వజ్ఞానికి ప్రపంచమున కర్మల నొనర్చుటచేగాని, యొనర్పక పోవుటచేగాని యించుకేని ప్రయోజనము లేదు. మఱియు వానికి సమస్త భూతములయందును ప్రయోజన నిమిత్తమైన యాశ్రయమెద్దియును లేదు.

నతదస్తి పృథివ్యాంవా దివిదేవేషువా క్వచిత్
యదుదార మనోవృత్తే ర్లోభాయ విదితాత్మనః.

ఉదారచిత్తుడగు తత్త్వజ్ఞుని ప్రలోభన మొనర్చునట్టి పదార్థము స్వర్గ, భూతలములందుగాని, మఱి యెచటనైనను గాని లేదు.

జగదేవ తృణాం యస్య నకించిద్రజ ఏవవా
కిం నామ తస్య భవతు అన్యదాదేయతాంగతమ్.

ఎవనికి జగత్తంతయు తృణప్రాయమై యుండునో, ఎవనికి రజో గుణము లేశమైన నుండనేరదో, అట్టి ధీరుడగు జ్ఞానికి ఆత్మకంటె నన్య మగు నేది గ్రహణయోగ్యమగును?

నిర్వాహిత జగద్యాత్రః పరిపూర్ణమనా మునిః
యథాస్థిత మసావాస్తే సంప్రయాతి యథాగతమ్.

జగద్వ్యవహారములను పరిపూర్ణముగ నిర్వహించువాడును, పరిపూర్ణచిత్తముగలవాడును, తన యాత్మస్వరూపమునందు యథావిధమున స్థితిగల్గియుండువాడును నగు జ్ఞాని ప్రాప్తించిన శిష్టాచారములననువర్తించును.

నిత్యాంతఃశీతలో మానీ సత్త్వభూతమనోవనిః
పరిపూర్ణార్ణవాకారో గంభీరప్రకటాశయః.

జ్ఞాని నిత్యమంతఃకరణమున ప్రశాంతముగ నుండువాడును, మానియు, సత్వయుక్తమనంబుచే సర్వుల రక్షించువాడును, పూర్ణసముద్రమువలె గంభీరహృదయము గలవాడును, ప్రకటితయాశయములు గలవాడునునై యుండును.

రసాయన పరాపూర్ణ హ్రాదనత్ హ్లాదమాత్మని
ధత్తే కరోతి వాన్యస్య సకలేందు రివామలః.

అమృతపూర్ణ సరంబువలె నిజాత్మయందాతడానందమును ధరించియుండును. మఱియు నిర్మల పూర్ణచంద్రుని పగిది యితరుల కానంద మొనగూర్చును.

మందార మంజరీ కుంజ పింజరాదేవ భూమయః
నతథా హ్లాదయం త్యేతా యథా పండితబుద్ధయః.

తమ యుపదేశముల ద్వారా తత్వజ్ఞానులగు మహాత్ములు జనులకే యానందమును గలుగజేతురో అద్దానిని మందారలతా నికుంజములచే పూర్ణమగు దేవతల నందనవనమున్ను గలుగజేయజాలదు.

భ్రాంతిమాత్ర మిదం విశ్వ మింద్రజాల మసన్మయమ్
త్యజతీతి వినిశ్చిత్య దినానుదినమేషణాః.

ఈప్రపంచ మింద్రజాలమువలె యసన్మయమనియు, భ్రాంతిమాత్రమనియు నిశ్చయించి ప్రతిదినము కోర్కెల నాతడు పరిత్యజించుచుండును.

శీతాతపాది దుఃఖాని నిజదేహగతాన్యపి
అన్యదేహగతానీవ జ్ఞ పశ్యత్యవహేలయా.

నిజదేహమునకు ప్రాప్తించిన శీతాతపాది దుఃఖములను అన్యదేహమునకు సంప్రాప్తమైనవిగ నెంచి యనాదరమున జూచును.

కరుణోదారయావృత్త్యా వృత్త్యా ప్రతతి ధీరయా
నీరజో నీరసారాంతః సారతాం సంతిష్ఠతే.

లత అన్యుల నిమిత్తమే పుష్పఫలాదులను ధరించునట్లు జ్ఞాని కరుణ చేతను ఉదారవృత్తిచేతను అన్యులఁ బాలించుచుండును కాని స్వయముగ తాను విరక్తి నవలంబించి జలమాత్రముచే సంతుష్టుడగును.

వ్యవహారం యథా ప్రాప్తం లోకసామాన్యమాచరన్
చరాచరాణాం భూతానా ముపర్యేవావతిష్ఠతే.

ప్రాప్తించిన లోకసామాన్యమగు వ్యవహారములను గావించుచు చరాచరప్రాణికోట్ల కతీతుడై మెలంగుచుండును.

ప్రజ్ఞాప్రాసాదమారూఢ స్త్వశోచ్యః శోచతే జనాన్
భూమిష్ఠానివ శైలస్థః సర్వాన్ ప్రజ్ఞోఽనుపశ్యతి.

తాను స్వయముగ నశోచ్యుండైనను జ్ఞాని బుద్ధియను ప్రాసాదము నెక్కి అజ్ఞానులఁగూర్చి శోకించును. మఱియు పర్వతముపై నున్నవారిని జూచునట్లాతడు సర్వుల నవలోకించుచుండును.

చిరం కల్లోలవలితః సుమనా జలధా భ్రమే
పరం పార ముపాగత్య పరాం విశ్రాంతిమేతి సః.

భ్రాంతి సముద్రమున కామక్రోధాది తరంగములచే చిరకాలము విక్షేపముజెంది తుదకు జ్ఞానముచే నావలితీరమునుజేరి తత్వజ్ఞుడు పరమ శాంతిని బడయును.

హసన్నశాంతయావృత్త్యా ప్రాక్తనీర్జాగతీర్గతీః
స్మయమాన ఇవాస్తేంఽత ర్జనతాశ్చ ఘనభ్రమాః.

జ్ఞానితనపూర్వకాలిక సాంసారిక గతుల నతిశాంతముతో వీక్షించి నవ్వుచుండును మఱియు మిగుల అజ్ఞానయుక్తులగు జనులగాంచి లోలోన హసించుచుండును.

ఏతాః కాంతార నిర్మగ్న మితాః సంసార దృష్టయః
అసత్యో హ్యాతివత్యోః మామిత్యంత ర్యాతి విస్మయమ్.

అరణ్యమున మార్గభ్రష్టులైన యంధజనులతోఁ బోల్పదగిన యీ మిథ్యా సంసారదృష్టులు నన్ను మోహింపనెంచుచున్నవని తలంచి యంతరంగమున విస్మయమును బడయును.

దృష్ట్వాష్టగుణమైశ్వర్య మనిష్టం మేతృణాయతే
ఇత్యుపై త్యుపశాంతత్వా త్స్మయమానోఽపి నస్మయమ్.

సౌభాగ్యవశముచే అష్టైశ్వర్యములును నాకు తుచ్ఛములుగను, తృణసదృశముగను గోచరించుచున్నవని తలంచుచు చిరునగవుజెందినను గర్వమునకు తావీయక యుండును.

కశ్చిద్గిరిగుహాగేహః కశ్చిత్పుణ్యాశ్రమాశ్రయః
కశ్చిద్గృహస్థాశ్రమవాన్ కశ్చిద్బహుఅటన్ స్థితః.

కశ్చిద్భిక్షాచరాచారః కశ్చిదేకాంతతాపసః
కశ్చిన్మౌనవ్రతధరః కశ్చిద్ధ్యానపరాయణః.

కశ్చిద్విశ్వ ద్విఖ్యాతః కశ్చిచ్ఛోత్రితాశ్రుతేః స్మృతేః
కశ్చిద్రాజాద్విజః కశ్చిత్కశ్చిదజ్ఞ ఇవస్థితః.

గుటికాంజన ఖడ్గాది సిద్ధః కశ్చిన్నభోగతః
కశ్చిచ్ఛిల్పకలాజీవీ కశ్చిత్పామరరూపభృత్.

కశ్చిత్త్యక్తసమాచారః కశ్చిచ్ఛ్రోత్రియనాయకః
కశ్చిదున్మత్తచరితః ప్రవజ్యాం కశ్చిదాశ్రితః.

జ్ఞానులలో కొందఱు పర్వతగుహాలయంను వసింతురు. కొందఱు గృహస్థాశ్రమస్థులై యుందురు. కొందఱు విశేషముగ సంచరించుచునే యుందురు. కొందఱు భిక్షాటన మొనర్చుచు చరింతురు. కొందఱు ఏకాన్తమున తపంబొనర్చుచుందురు. కొందరు మౌనవ్రతము ధరింతురు. కొందఱు ధ్యానపరాయణులై యుందురు. మఱికొందఱు విఖ్యాతిగాంచిన పండితులుగను, కొందఱు శ్రుతిస్మృతుల శ్రవణ మొనర్చువారుగను నుందురు. కొందరు బ్రాహ్మణులుగ నుందురు. మఱికొందఱు అజ్ఞునివలె నొప్పుచుందురు. కొందఱు గుటిక, అంజనాదులచే సిద్ధులను బడసి ఆకాశగమన మొనర్చుదురు. ఒకానొక జ్ఞాని శిల్పకళచే జీవించుచుండును. మఱియొకడు పామరునివంటి రూపము గల్గియుండును. ఒకడాచారములన్నిటిని త్యజించివైచును. మఱియొకడు వేదవిద్యారిష్ఠుడై యుండును. ఒకడున్మత్తునివలె నుండును. ఇంకొకడు సన్యాసియై మెలంగును.

పాతాలమూవిశతు యాతు నభోవిలంఘ్య
దిఙ్మండలం భ్రమతు పేషణమేవయేన
చిన్మాత్రమేతదజరం నతుయాతునాశ
మాకాశకోశ ఇవ శాంతమజం శివంతత్.

ఓరామా! తత్వజ్ఞాని పాతాళమందు ప్రవేశించినను, ఆకాశమును దాటి యూర్ధ్వముగ జనినను, దిక్కులందు సంచరించినను, మానసోత్తర లోకాలోకాది పర్వతములచే చూర్ణమొనర్పబడినను చిన్మాత్రమగు వాని స్వరూపమెన్నటికిని నశింపకుండును. ఏలయన నాతఁడు ఆకాశము వలె ప్రశాంతరూపముగలవాడును, నాశరహితుడును, శివస్వరూపుడును నగును.



(శ్రీ భగవద్గీత)

# దైవాసుర సంపద్విభాగ యోగము.

(శ్రీ మలయాళ స్వాములవారు)

ఈ యధ్యాయమున దైవసంపత్తును గుఱించియు, అసురసంపత్తునుగూర్చియు విస్తారముగ చెప్పుటచే దీనికి దైవాసురసంపద్విభాగ యోగమని పేరు గల్గినది. దైవసంపత్తనగా దైవగుణములనియు, అసుర సంపత్తనగా అసురగుణములనియు గ్రహించఁదగినది. కావున ముముక్షువులు అసురస్వభావములు తమలో నుండిన, కనిపెట్టి ఒకేసారి విడిచిపెట్టుటగాని, లేక ఒక్కొక్కదానిని క్రమముగ త్యజించుటగాని చేయవలెను. తీవ్రవైరాగ్యముగలవారు ఒకేసారి విడువవచ్చును. కొంచెము మందవైరాగ్యమున్ను కొంచెము బంధనమున్ను గలవారు ఒక్కొక్క దానిని క్రమముగ ఉపేక్షించి పరిశుద్ధులయ్యేలాగున ప్రయత్నించవలెను. ఆలాగున ఒకవేళ పైఁజెప్పిన సుగుణములన్నియు తనలో పూర్తిగ లేనిచో, వానినిన్ని త్వరలో ఒకొటొకటిగా సంపాదించు కొనవలయు. చెడువిత్తనమునకు చెడ్డఫలమే గలుగునట్లు అసురస్వభావముగలవారికి దుఃఖములే గలుగును. ఇహమందును ఆలాగేయుండును; పరమందును అదేప్రకారముగ గలుగును. ఇదేరీతిగా మంచి బీజము వేయువారికి ...

మంచి ఫలములున్ను గలుగును. ఈ కార్యములో శ్రద్ధనుంచక తపస్సు గాని భక్తిగాని సత్కర్మలుగాని చేయుచుండినను దైవకృప కలుగదు; జ్ఞానము దయించదు. కనుకనే భగవంతుడు దైవీక గుణములుగలవారికి మాత్రమే మోక్షము గలుగుననియు, రాక్షస గుణములుగలవారికి నరకము ప్రాప్తించుననియు ఉపదేశించిరి. ఇది ఈశ్వరునియొక్క నియతిగానున్నది. దాని పరమేశ్వరుడు మార్చుకొనడు. అసురగుణమే తామసస్వభావమనియు, పైశాచికలక్షణమనియు గ్రహించవలెను. దైవగుణము నకే సాత్వికగుణమనియు, ఈశ్వరవిభూతియనియు పేర్లు. కర్మఫలప్రాప్తి సర్వేశ్వరుని నియతియగుటచే కొందఱు పరమభక్తులైయుండియు, కొన్ని కష్టములకు పాత్రులగుచున్నారు. ఇది యెపుడో చేసిన పాపకర్మఫలమని ముముక్షువులు గ్రహించదగును. అలాగున ప్రస్తుతము కొందఱు దుష్టకృత్యములు చేయువారైనను భాగ్యవంతులుగా కనబడుచున్నారు. అదిన్ని వారు యెప్పుడో చేసిన సుకృతఫలవిశేషమని తెలియదగును. అయితే యీ పైన జెప్పిన రెండును బాహ్యఫలమును గుఱించినదే. బాహ్యముననే మనకిట్లు గాన్పించును. ఏలన, సుఖమునకు మనస్సే స్థానమగుటచే మనశ్శుద్ధి గలవాడు దరిద్రుడైనను గొప్ప ఆత్మశాంతి, సౌఖ్యమును పొందుచుండును. ధనవంతుడైనను ఆత్మసంస్కారము శుద్ధముగా లేనిచో దుఃఖములో మునుగవలసియుండును. మాయవల్ల జ్ఞాననేత్రము మూయబడియుండుటచే కర్మయొక్క గతిని యెవరును తెలిసికొనజాలకున్నారు. అయినను అనుమాన ప్రత్యక్షములద్వారా కారణములేక కార్యము గలుగదని యూహించుకొనవలయు. ఒక్క అడవిప్రదేశమును మంచి పుష్పోద్యానముగ చేయవలసిన, ఏలాగున కంటకాది సమస్తవృక్షములను సమూలముగ ఛేదించి తీసివైచి, ఉత్కృష్టములగు వృక్షములను పెట్టి పెంచుదురో, అలాగున హృదయారణ్యములోగల దుర్గుణములను, దుస్స్వభావములను, దుర్వృత్తులను, దుష్ప్రవర్తనలను, దుర్మార్గములను, దుష్టవిచారములను అన్నింటిని నిర్మూలనమొనర్చి ఆ స్థానములో సత్యము, శాంతము, దయ, విరక్తి, భక్తి, జ్ఞానము మొదలగు సుగుణములను పెట్టి జాగ్రతగా పెంచవలెను. అపుడు మాత్రమే నిత్యానందమును, పరమశాంతియు జీవులకు కలుగును.

ఇదియే భగవంతుడుపదేశించిన విద్యాసారము. కర్షకులును ఫలపుష్పాదులనుపెట్టి పోషించు తోటమాలులును ఏలాగున వారి భూములలో అప్పుడప్పుడు ఉద్భవించెడు గడ్డి మొదలైనవానిని తీసివేయుచుందురో, ఆలాగున హృదయాంతరాళములో జన్మజన్మాంతరములనుండి కలుగుచు వచ్చినసంస్కారములను నశింపచేయవలెను. కాని అవి అతిసూక్ష్మములుగా నుండుటచే సంపూర్ణముగా ఒకేసారి నశింపచేయుటకు సాధ్యముకాదు. కావున అవి ఆవిర్భవించినపుడెల్ల అట్టిదుర్గుణములు ప్రకృతిసంబంధములని తలంచి తీసివేయుచుండవలయు. కంటకాది తృణవృక్షములు తీసివేయబడనిచో, అవి అసలుపైరును, ఫలవృక్షాదులను అణచివేసి దుర్బలమొనర్చును. ఆలాగున ప్రాకృతగుణములుండిన అవి ఆత్మజ్ఞానఫలమును నన్నగిల్లచేయునని సాధకులు సదా జ్ఞాపకము చేయవలెను. రోగియైనవాడు ఏయేవస్తువులు భుజించవచ్చునో, ఏయేపదార్థములు విషువవలయునో యెఱింగి జాగ్రతగ వర్తింపవలసియున్నట్లు భవరోగులగు జీవులున్ను తగని గుణములను విడచిపెట్టి తగినగుణములను సంపాదించుకొనవలెను. అట్లుకానిచో ఎంతశ్రేష్ఠఔషధమైనను పథ్యము సరిగాచేయనిచో ఆరోగ్యము కలుగనట్లు, యెంతగొప్ప గురువువద్దయుండి యుపదేశము నొందినను భవరోగము నశింపదు. ఆత్మశాంతి గలుగదు. ఈతత్వమంతయు భక్తులు ఈయధ్యాయమున గ్రహించుకొనవచ్చును. మఱియు మంచివృక్షమునకు లేప్రాయమున పురుగులు పట్టెడు స్వభావ మెట్లుండునో, మఱియు జాగ్రతతో కనిపెట్టి వానినెట్లు తీసివేయవలసియుండునో, ఆలాగున అధ్యాత్మజ్ఞాన నిష్ఠలో ప్రథమమున విఘ్నము లనేకములు గలుగవచ్చును. కాని వాటిని కనిపెట్టి రహిత మొనర్చుచుండవలెను. జన్మాంతర సుకృతవిశేష మెక్కువగలవారికిని ఈశ్వర కృపగలవారికిని యెక్కువ ప్రతిబంధము లుండవు కాని తక్కినవారికి పతనము గలుగుటకు కారణము లనేకములు గలవు. అందు విషయవిరక్తి లేకయుండుట యొకటి. విషయవిరక్తికలుగుట చాల కష్టము. ఏలన ప్రపంచముయొక్క సంసృతియంతయు దానిపై నిబిడముగా బంధింపబడియున్నది. కాలచక్రగమనమంతయు దానిలోనే అమర్చబడియున్నది. సృష్టియొక్క క్రమమంతయు దానిలోనే యిమిడియున్నది. అదిలేనిచో ప్రపంచమే లేదు. అత్యు

ధిక గురుభక్తియు, దైవభక్తియు, పుణ్యబలమునుగల జీవుని మాత్రమే అదియెక్కువగ బాధింపక చిన్నగా విడిచిపెట్టును. కావుననే సత్కర్మలును, సదాచారములును, ఆత్మవిచారమును సదా గలిగియుండేలాగున చూడవలెనని మహనీయులు చెప్పెడి రహస్యము. దీనియందు దీక్షోకము ముఖ్యము

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
ససిద్ధి మవాప్నోతి నసుఖం న పరాంగతిమ్. (16-23)

ఎవఁడు శాస్త్రవిధి నుల్లంఘించి తన యిష్టానుసారమే ప్రవర్తించునో, అట్టివాడు (కార్య) సిద్ధిని బొందడు. (ఇహలోకమున) సుఖమును బొందడు, (మరణానంతరమున) మోక్షము నొందడు.

ఓం తత్ సత్.



ఓమ్

# అహింస.

(శ్రీ శివమహాపురాణము. ద్వితీయరుద్ర సంహిత నాలుగవ అధ్యాయము.)

1. యథైవ మరణాద్భీతి రస్మదాది వపుష్మతామ్
బ్రహ్మాది కీటకాంతానాం తథా మరణతో భయమ్.

తా. దేహధారులమగు మనకేలాగున మరణమువలన భయమో అట్లే బ్రహ్మ మొదలు కీటపర్యంతముగల ప్రాణులకు మరణమన్న భయము జనించును.

2. సర్వే తనుభృతస్తుల్యా యదిబుద్ధ్యా విచార్యతే
ఇదం నిశ్చిత్య కేనాపి నోహింస్యః కోఽపి కుత్రచిత్.

తా. బుద్ధిచే విచారింతుమేని సకల ప్రాణికోట్లును సమానులు. ఇద్దాని నెఱింగి యెవనిచేతను, నే ప్రాణియు, ఎచ్చటను హింసింపతగదు.

3. ధర్మో జీవదయాతుల్యో నక్వాఽపిజగతీతలే
తస్మాత్సర్వప్రయత్నేన కార్యా జీవదయా నృభిః.

తా. జీవులయెడగల దయతో సమానమగు ధర్మము ప్రపంచ మున మెచ్చుట వెదకినను కనుపింపదు. గనుక సర్వప్రయత్నముల గానించి యైనను మానవులు జీవదయగలవారై యుండవలయు.

4. ఏకస్మిన్ రక్షితే జీవే త్రైలోక్యం రక్షితంభవేత్
ఘాతితే ఘాతితం తద్వత్తస్మాద్రక్షేన్న ఘాతయేత్.

తా. ఒక్కప్రాణి రక్షింపబడినచో మూడు లోకములు రక్షింపబడి నట్టులగును. హింసింతుమేని లోకత్రయము హింసింపబడినట్టులే గనుక ప్రాణుల రక్షింపవలయుగాని హింసింపరాదు.

5. అహింసా పరమోధర్మః పాపమాత్మప్రపీడనమ్
అపరాధీనతాముక్తి స్స్వర్గోఽభిలషితాశనమ్.

తా. అహింస ఉత్తమ ధర్మము. ఆత్మను హింసించుట పాపము. అపరాధీనతయే (స్వాతంత్ర్యమే) ముక్తి యగును. తా నభిలషించు (ఆకలిశాంతికై తనకెంత యవసరమో అంత) నాహారముగొనుట స్వర్గ సమానము.

6. పూర్వసూరిభిరిత్యుక్తం సత్ప్రమాణతయాధ్రువమ్
తస్మాన్న హింసా కర్తవ్యా నరై ర్నరకభీరుభిః.

తా. పెద్దలు శ్రేష్ట ప్రమాణముల నొసగి హింస చేయరాదని వక్కాణించియున్నారు. గనుక నరకమన్న భీతిగల ప్రతినరులును హింస చేయరాదు.

7. నహింసాసదృశం పాపం త్రైలోక్యే సచరాచరే
హింసకో నరకంగచ్ఛే త్స్వర్గం గచ్ఛే దహింసకః.

తా. హింసతో సమానమైన పాపము చరాచరభూతజాల ముతో నిండిన మూడులోకములలో మెచ్చుటను లేదు. హింస చేయు వాడు నరకమును బొందును. అహింసాతత్పరుడు స్వర్గము నధిష్ఠించును.

8. సంతి దానా న్యనేకాని కింతైస్తుచ్ఛఫలప్రదైః
అభీతిసదృశందానం పరమేక మపీహ న.

తా. లోకమున దానము లనేకములు గలవు. నికృష్టఫలముల నొసగు వానిచే నేమి ప్రయోజనము? కాని అభయప్రదానముతో సదృశమైన ఉత్కృష్టదానము ప్రపంచమున ఒక్కటియు లేదు.

9. ఇహ చత్వారి దానాని ప్రోక్తాని పరమర్షిభిః
విచార్య నానాశాస్త్రాని శర్మణేఽత్ర పరత్రచ.

తా. పరమమహర్షులు ఇహపరము. సౌఖ్యమబ్బు కొఱకై నానా శాస్త్రములు విమర్శించి ఇట నాల్గుదానములు జెప్పియున్నారు.

10. భీతేభ్యశ్చాభయం దేయం వ్యాధితేభ్యస్తథౌషధమ్
దేయావిద్యార్థినాం విద్యా దేయమన్నం క్షుధాతురే.

తా. అవి యెవ్వియనః— భయముగలవారికి అభయమిచ్చుట, అట్లే వ్యాధిపీడితులకు ఔషధము నొసంగుట, విద్యార్థులకు విద్యాదాన మొనర్చుట ఆకలిచే మాడుచుండు జీవులకు అన్నమిడుట.

11. యాని యానీహ దానాని బహుమున్యుదితానిచ
జీవాభయప్రదానస్య కలాంనార్హంతి షోడశీం.

తా మహర్షులచే పూర్వోక్తదానములు మొదలగు యేదానములు చెప్పబడెనో అవియన్నియు ప్రాణికోట్లకు అభయమొసంగుటయనెడు దానమునకు (హింసారాహిత్యమునకు) పదునారవ భాగమునను సరిగాజాలవు.



# ఓమ్

## శ్రీమదాత్మపురాణావతారిక.

---

"ననిరోధో నచోత్పత్తిర్నబద్ధో నచసాధకః। నముముక్షుర్న వైముక్త ఇత్యేషా పరమార్థతా॥" సర్వపురుషులు దుఃఖనివృత్తి సుఖప్రాప్తికోరుచున్నారు. దానికొరకు నానాప్రయత్నములను చేయుచున్నారు. పెక్కులేల ఒకప్రాతఃకాలమునుండి ఇంకొక ప్రాతఃకాలమువరకు ఇదేప్రయత్నము, ఐనను "నేను దుఃఖినైయున్నాను" అను నీ భ్రాంతిదక్క ఇంకొక దుఃఖములేదు. మరియు తననాభియందుండు కస్తూరిచే సకలవనము సుగంధితమగుచున్నదని యెరుగక సుగంధముకొరకు మృగము వనవనమున పరుగెత్తుచున్నది, ఆప్రకారముగ తాను సుఖరూపాత్మ, తనచేతనే విషయమందును సుఖలాభమగుచున్నది, ఇట్లుండగా సుఖముకొరకు నానాప్రయత్నముచేయుచున్నాడు, దీనియొక భ్రాంతియే.

ఈద్వివిధ భ్రాంతి నివర్తించుటకొరకు శ్రీవేదనారాయణుండు నడుముకట్టి యుండుచున్నాడు, అధికారుల భేదోపభేదములు కల్పించి వానివానికి దగిన ఉపదేశముకొరకు కర్మోపాసన జ్ఞానములని త్రివిధ భేదములును, అనేకోపభేధములును కల్పించి, విచిత్రముగ ఉపదేశ ప్రకారము నారంభించెను. వానిలో సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని దుఃఖ నివృత్తిసుఖప్రాప్త్యుపాయములే వర్ణింపబడినవి.

వానిలో— జిజ్ఞాసులైన అధికారులకు తగిన ఉపనిషత్తులుగలవు; వానివలన సాక్షాత్తుగా దుఃఖనివృత్తి సుఖప్రాప్తి రూప మోక్షప్రాప్తియగుచున్నది; ఆ యుపనిషత్తులమీద సూత్రభాష్యవార్తికాద్యనేక గ్రంథములగుచున్నవి, ఆయుపనిషత్తులును, ఆగ్రంథములును గీర్వాణ వాణీరూపము లగుటవలన ఆవాణియొక్క అభ్యాసములేనివారికి వానియొక్క ఉపయోగమగుట మహాకష్టమని యెరిగి అనేకభాషలెరిగినవారైన ఆధునిక సాధుజనులు పరోపకారబుద్ధిచే ఆధునికభాషలలో వానియొక్క భాషాంతరణమును, వానిమీద అనేక ప్రకార గ్రంథములును రచించుచున్నారు.

వానిలో— "శ్రీమదాత్మపురాణము" అను నీగ్రంథమును కావేరీతట నివాసి శ్రీశంకరానంద మునీశ్వరుడను మహానుభావుడు రచించెను. ఈగ్రంథము ఐతరేయ, కాషీతకి మొదలగు శ్రేష్ఠములైన యనేక ఉపనిషత్తులకు స్పష్టార్థరూపముగనున్నది, దీనిలో ఉపనిషదర్థముగాక వేరైన మరొక సంగతిలేదు. అందువలన నిది అందరికి వందనీయముగ నున్నది.

ఇదియునుగాక ఈగ్రంథము ఎట్లున్నదనగా—ఎంతవరకు ఈగ్రంథము సమగ్రము, అథవా ఒక అధ్యాయము చదువలేదో వినలేదో అంత వరకు లోభి పురుషునకును లోభము పుట్టించదు, గాని, ఒకసారికొంచెము శ్రవణపతనమైనపుడు, అత్యంత వైరాగ్య శీల నిర్లోభియైన పరమహంస సన్యాసికిని లోభముపుట్టించతగినదిగానున్నది. ఈగ్రంథమునకు భాషాంతరీకరణము హిందుస్థానిభాషలోనున్నది, ఆరవభాషలోనున్నది, ఇప్పుడు ఆంధ్రభాషలో నడుచుచున్నది. ఇంకను ఎప్పుడెప్పుడు ఇతరభాషగలవారు చూచుచున్నారో, అప్పుడప్పుడు, ఆయాభాషలలో భాషాంతరీకరణమగును; సారాంశము— ఈగ్రంథము స్వానుభూతి ద్వారమున అత్యంతలోభహేతువుగానున్నది.

శ్రీవాసుదేవసూను జనార్దనస్వామి చైతన్య.

---

ఓమ్.

# ఆత్మపురాణము.

---

అథ, ఆత్మపురాణ ప్రథమాధ్యాయమందు ఋగ్వేదాంతర్గత ఐతరేయోపనిషదర్థ నిరూపణముచేయుచు నారంభమందు గురుశిష్య సంవాదము ద్వారా అధికారిలక్షణము నిరూపించెదను.

వేదపఠనముచేయువాడై ఆచార్యునిచేజెప్పబడిన వేదార్థధారణచేయుటయందు సమర్థమైనట్టి బుద్ధిగలవాడై, పరోపకారవిషయమునందు కరుణాయుక్తుడైన ముముక్షువొకడు, పంచభేద జ్ఞానంబుచే భయపడినవారలైన జనులనుజూచి శ్రీగురుని గూర్చి ప్రార్థించుచున్నాడు. భగవంతుడా! అహాహా! ఏమికష్టమిది! అజ్ఞానరూప లోహముచే పుట్టినదైన, సత్వరజస్తమములైన త్రిగుణరూప తీక్ష్ణకొనగల శృంగత్రయముగలదైన ఈసంసార శూలమునుజూచి జనులు హాహాకారము చేయుచున్నారుగదా! ఓ భగవంతుడా! ఏయుపాయముచే ఇటువంటి ఘోరశూలవ్యథను విడచి జనులకు పరమానంద రూపమోక్షప్రాప్తియగును? శ్రీగురు:— హే శిష్య! అజ్ఞాన నివృత్త్యుపాయమును, మోక్షమున కుపాయమును, ఒకటి జ్ఞానముగాని కర్మోపాసనలుగావు. కామక్రోధాది కాకులకును, స్త్రీమొదలగు వృకములకును ఆశ్రయమైన ఈసంసార శూలము పరమేశ్వరుని మాయచే నిర్మింపబడియున్నది. అందువలన జ్ఞానముచే మాయా నివృత్తియగుట, తత్కార్యమైన సంసారశూలమును సహజముగానే నివృత్తమగుచున్నది. ఎట్లనగా తంతునాశంబువలన పటనాశమగుచున్నది.

శిష్య:— హే గురో! జ్ఞానముచే నజ్ఞాన నివృత్తియగునని చెప్పితిరి. అది ఘటిల్లదు. ఘటపటాది పదార్థజ్ఞానము సకల జనులకైనదిగాని, ఏవనికిని యజ్ఞాన నివృత్తికాలేదు. శ్రీగురు;— హే శిష్యోత్తమా! సన్నిపాతముచే భ్రమిష్టుడైన పురుషుడు నాకు ఎంత మనోహరముగ భేరీనాదము వినబడుచున్నదనుచున్నాడు. అభ్రమిష్టుని జ్ఞానము విశ్వసనీయమా? దానిచే దేనికి నివృత్తియగును? అట్లే నీవును ఘటపటాదిజ్ఞానముచే యజ్ఞాననివృత్తిలేనేలేదనుచున్నావు. అయ్యా! ఘటపటాదిజ్ఞానమును భ్రమిష్టుని జ్ఞానమువలెనె అజ్ఞానముయొక్కయే కార్యము. దానిచే నజ్ఞాన నివృత్తి యెట్లగును? కాదు. నేను చెప్పిన జ్ఞానమునకు స్వరూపము వినుము. హే శిష్య!

సద్గురు కృపాసహితముగ వేదాంత శాస్త్రముయొక్క శ్రవణ మననాది సాధనముల వలన పుట్టినదైన "నేను బ్రహ్మము" యనునట్టి చరమవృత్తిరూపజ్ఞానమువలన అజ్ఞానము యొక్కయు తత్కార్యమైన సంసారశూలముయొక్కయు నివృత్తియై బ్రహ్మభావ రూపముక్తియగును. ఆముక్తి రూపమంటపమందు రమ్మా! వేదాంత శ్రవణాది సాధనముల నంగీకారము చేయుమా! మఱియు ఆత్మజ్ఞానము కన్న భిన్నమైనట్టి దేహమువల బంధముచేసినట్టి యజ్ఞాది కామ్యకర్మములను పరిత్యజింపుమా!

ఇపుడు ఆత్మస్వరూప బ్రహ్మవిషయమందు పరిచ్ఛేదత్రయా భావము చూపుట కొఱకు, మొదలు ఘటాద్యనాత్మ పదార్థములందు పరిచ్ఛేదము చూపుచున్నాడు. (1) అత్యంతా భావమునకు ప్రతియోగికి పేరు దేశపరిచ్ఛేదము. ఎట్లనగా భూతలము ఒకదేశమందు స్థితమైన ఘటమునకు అన్యదేశమందు అత్యంతాభావము గలదు. ఆ యత్యంతాభావమునకు ప్రతియోగిత ఘటమునందు గలదు, ఇది దేశపరిచ్ఛేదము. (2) ప్రాగభావమునకు, మఱియు ప్రధ్వంసాభావమునకు, ప్రతియోగికి పేరు కాలపరిచ్ఛేదము. ఎట్లనగా ఘటోత్పత్తికి పూర్వము కపాలములందు ఘటమునకు ప్రాగభావము మఱియు ఘటనాశానంతరము కపాలములందు ఘటమునకు ప్రధ్వంసాభావముగలదు. ఆరెండుభావముల ప్రతియోగిత ఘటమందు గలదు. (3) అన్యోన్యాభావమునకు ప్రతియోగి యొక్క పేరు వస్తుపరిచ్ఛేదము. ఎట్లనగా పటము ఘటముకాదు. ఈయనుభవముచే ఘటమున కన్యోన్యాభావము పటమందు భాసించుచున్నది. : ఆ యన్యోన్యాభావముయొక్క ప్రతియోగిత ఘటమందుగలదు. కనుక ఇదివస్తుపరిచ్ఛేదము. ఈరీతిగా సకలా నాత్మపదార్థములు మూడు పరిచ్ఛేదములచే యుక్తములైయున్నవి.

ఆత్మస్వరూప బ్రహ్మమందు ఒకటికూడ పరిచ్ఛేదములేదు. చూడుము- బ్రహ్మము వ్యాపకమగుటవలన దేశపరిచ్ఛేదము లేదు. ఉత్పత్తి నాశరహితమగుటవలన కాలపరిచ్ఛేదములేదు. సర్వమున కాత్మయగుటవలన వస్తుపరిచ్ఛేదములేదు. ఈఅభిప్రాయము వలననే శ్రుతిచేత జీవబ్రహ్మల కభేదము చెప్పబడియె. మఱియు ఆత్మస్వరూప బ్రహ్మ ప్రాప్తికి సాధనమగుటవలన జ్ఞానము సత్యమనియు, బ్రహ్మమనియు చెప్పబడియె. ఎట్లనగా ఆయుష్యవృద్ధి కారకమైన ఘృతమునకు శాస్త్రమందు ఆయుష్యమనిచెప్పుచున్నారు. ఈరీతిగా జూచిన పక్షమందు జ్ఞానము సత్యపదమునకును, బ్రహ్మపదమునకును ముఖ్యార్థముగాకున్నను గౌణార్థమైయున్నది. ఆత్మయే సత్యపదమునకును బ్రహ్మపదమునకును ముఖ్యార్థము.

ఇపుడు సత్యపదమునకు లక్ష్యము చెప్పుచున్నాడు. త్రికాలమందును స్వరూప

త్యాగము చేయని, త్రికాలమందును యేకరసమైనట్టి అర్థమునకు శాస్త్రమందు సత్య మనుచున్నారు. మఱియు ఏవస్తువు అస్తిజ్ఞానమునకును, అస్తిపదమునకును, విషయ మగునో, దానిని లోకమందు సత్యమనుచున్నారు. వంధ్యాపుత్రునియందు 'వంధ్యా పుత్రోస్తి' జ్ఞానమునకు యోగ్యతలేదు. అందుకే వంధ్యాపుత్రుని లోకమందును, శాస్త్రమందును యెవడైనను సత్యమనడు.

శిష్య:— ఓభగవంతుడా! ఘటోస్తి, పటోస్తి ఈరీతిగ అస్తిపదమునకును, అస్తిజ్ఞానమునకును, విషయములైన ఘటపటాదులను సత్యము లనవలసినది. సిద్ధాంత మందో బ్రహ్మాభిన్నమైన మరొక సత్యపదార్థము లేదు. శ్రీగురు:— హేశిష్య! సచ్చిదానందబ్రహ్మము నేను. నాసత్తయే సకలానాత్మపదార్థములందు అవివేకముగ ప్రతీతమగుచున్నది. విచారము చేసినపుడు ఆత్మాభిన్నమైనట్టి వేరొక సత్యపదార్థము లేదు. ఈయభిప్రాయమువలననే అసత్యస్వరూపమైన యాత్మను విషయముచేయు నట్టి జ్ఞానమునకును శ్రుతిచే సత్యమని చెప్పబడియున్నది. ఎట్లనగా సత్యార్థబోధన చేయువాడై విచారవంతుడైన పురుషునివచనము సత్యమనుచున్నారు. అథవా శత్రు రహితుడైన హిరణ్యగర్భుని శ్రుతిచే సత్యమని చెప్పబడియె. అట్లే అజ్ఞానమునకును, తత్కార్య ప్రపంచరూప శత్రువునకును నాశముగలుగజేయునట్టిదైన ఆత్మజ్ఞానమును శ్రుతిచే సత్యమనబడియె. (హిరణ్యగర్భునందును ఆత్మజ్ఞానమందును శత్రురాహిత్యము సమానము.)

శిష్య;— హే భగవన్! జ్ఞాన శత్రువైన యజ్ఞానమును, తత్కార్యమైన ప్రపంచ మును నీవు అసత్యమని చెప్పుచున్నావు, అది ఘటిల్లదు. ఎందుకనగా త్రికాలమందభావ మైనది అసత్యమనబడును. అజ్ఞానమునకును, తత్కార్యమునకును, త్రికాలమునందభా వములేదు, జ్ఞానకాలమందు సకార్యాజ్ఞాన నాశమైనను వర్తమానకాలమందును, భూతకాలమందును విద్యమానముగలదు. శ్రీగురు:— హేశిష్య! ఒకకాలమందుండగా నింకొక కాలమందు లేనివస్తువు కూడ అసత్యమనబడును. త్రికాలాభావ నియమము లేదు. అజ్ఞానమునకు భవిష్యత్కాలమందభావము, మఱియు ప్రపంచమునకును భూత భవిష్యత్కాలమందును అభావము. అవి రెండును అసత్యములే. ఎట్లు వంధ్యా పుత్రుని భూత భవిష్యత్కాలమందు లేకపోవుటవలన వర్తమాన కాలమందును వానిని సత్యమనరో, ఎట్లు వంధ్యాపుత్రునికి అపరోక్షజ్ఞానము కాలేదో, అట్లు కార్యసహితా జ్ఞానమునకును జ్ఞానముగాలేదు. అందువలననది వంధ్యాపుత్రునితో సమానమే.

శిష్య:—ఓ భగవంతుడా! ఆత్మపరీకాశమును తీసికొని కార్యసహితాజ్ఞానము

భాసిల్లును. వంధ్యా పుత్రుడు భాసిల్లడు. అందువలన విలక్షణత గలదుగదా?
శ్రీగురు;—హే శిష్య! ముముక్షువునకు విలక్షణత ప్రతీతమైనను, జ్ఞానికి రెండును సమానములే. ఆత్మ సత్తా ప్రకాశముపొంది కార్య సహితాజ్ఞానమును సత్యమని నపుడు వంధ్యాపుత్రుడును సత్యముగావలసినది. లోకమునందు పర ధనమును అప్పు తీసుకొన్న వానిని ధనికుడనరు. ఒకానొకప్పుడు ముముక్షుదృష్టిని అంగీకరించి ఆత్మ యందు కార్యసహితాజ్ఞానము రజ్జుసర్పమువలె కల్పితమనినను. కల్పిత వస్తువునకు అధిష్ఠానముతో భేదములేదు. అనేక జన్మ సుకృత బలముచే నేను బ్రహ్మమని బోధ యెవనికైనదో వాడు ఇతరమై యేదొక అనాత్మవస్తువు నెఱుగుట యోగ్యముగాదు. ఎందుకనగా, జీవబ్రహ్మ భేదజ్ఞానమే పరమానంద రూపమోక్షమిచ్చును. అందువలన అజ్ఞానమునకన్న భిన్నములైన కర్మాదులను ముముక్షువు చేయగూడదు. సర్వాంత ర్యామి అద్వితీయాత్మను విడిచేవారు తామసియైన పశ్వాది యోనులను పొందు చున్నారు. పరమేశ్వరునిచే జెప్పబడిన వేదముయొక్క అనాదరమే పరమేశ్వరుని త్యాగమగును. హేశిష్య! ఈవిషయమై యొక పురాతనేతిహాసము చెప్పెదనువినుము.

సృష్టికి ఆదికాలమందు బ్రహ్మదేవుడు సనకాదులను బుట్టించెను. ఎట్లున్నారా సనకాదులనగా:— తర్కమున కవిషయమైనట్టి వేదార్థము నెఱిగినవారై, బాహ్యాంత రేంద్రియములను జయించినవారై యథాలాభసంతోష వృత్తిగలవారై. శీతోష్ణాది ద్వంద్వమును సహించినవారై, బ్రహ్మాత్మజ్ఞాన ప్రవీణులై, లోకకల్యాణార్థమే శరీర ధారణముజేయువారై, ఆ సన కాది మునీశ్వరులు జనులను ఆత్మజ్ఞానరహితులై, విషయాసక్తికలవారుగ చూచుచు, కృపావిష్టులై పలుకుచున్నారు.— ఓ జను లారా! మీకు ఆత్మజ్ఞానమే సుఖమునకు సాధనమగును. ఆత్మజ్ఞాన భిన్నమైన సకల మును దుఃఖసాధనములే. ఈప్రకారము అమృతతుల్యమైనట్టి సనకాదుల భాషణము వినియు, పూర్వకృతదుష్కృత సంస్కారముచే మోహితులైన యాదుర్భాగ్య జనులు అటువంటి అమృతభాషణమునుకూడ అనాదరము చేయుచున్నారు.

ఆప్రజా జనులందు అధమ, మధ్యమ, ఉత్తమములని మూడు ప్రకారములు. వానిలో తామసి జనులు వేదాజ్ఞను బొత్తిగ అవమానించి, శబ్దస్పర్శాదివిషయ ముల సుఖసాధనమని యెఱిగి మనఃపూర్తక్రియల నాచరించుచున్నారు. దానివలన క్రూర సంభాషణాది, అసత్యభాషణాది వాగ్దోషములను, పరధనేచ్ఛాది మానస దోషములను, చౌర్యఘాతాది శరీరదోషములను పొంది, వానివలన పశు, పక్షి, సర్ప వృక్షాది నానాదుష్టయోనులను పొందుచున్నారు. తామసి జనులు అంతఃకరణ

శుద్ధిద్వారమున ఆత్మజ్ఞానాధికారముకొఱకు వేదముచే ప్రతిపాదితమైన యజ్ఞాది కర్మములు, అగ్ని సూర్యాదిదేవతోపాసనలు, అవి ఐహికాముష్మిక సుఖసాధనమని యెఱిగి, వాని నాచరించుచున్నారు. దానివలన ఉత్తమాశ్రమములైన నానాజన్మములను పొందుచున్నారు. సాత్త్వికప్రజాజనులు పూర్వము సనకాది మునీశ్వరులచే చేయబడిన ఉపదేశము తామాదరము చేయలేదని స్మరణముచేసి పశ్చాత్తాపము పొందుచున్నారు. మేమిదివరకు యేమియు ఆత్మజ్ఞానము సంపాదనము చేయలేదు, జ్ఞానసాధనమును అవలంబించలేదు; కహషమునియొక్క కుమారులు వాక్ప్రాణాది వ్యాపారవిషయలయ చింతనరూప అంతరాగ్నిహోత్రము నెఱిగి బాహ్యాగ్నిహోత్రవిషయక వైరాగ్యము పొందుచున్నారు; అట్లు మేము యజ్ఞాది కర్మవిషయిక వైరాగ్యము పొందలేదు. దానివలన మాకు శ్రీగురునెదుట పోవుట కధికారమును లేదు. ఇపుడు మేము పరమాత్మ నెఱుగక, స్వర్గాది ప్రాప్తికొఱకు కర్మాచరణము చేసినపుడు మాజన్మము నిష్ఫలమగును. ఈప్రకారముగ మనోవ్యాకులురై, పలువిధముల విచారముచేసి తుదకట యిట్లు నిర్ధారణమొనర్చిరి. ఇపుడు మేము వివేకాది సాధనాధికారముకొఱకు నిష్కామ కర్మోపాసనలు చేయవలయును, అవి నిశ్చయముచేసి, అట్లే కర్మోపాసనలుగావించి, శుద్ధమనస్సుకలవారై, శమదమాది సాధనయుక్తులై మఱల సనకాది మునీశ్వరుల సన్నిధికి జని శాస్త్రానుసారముగ శరణాగతులై ఆత్మజ్ఞానప్రాప్తి విషయమందు తమయభిప్రాయమును నివేదించుచున్నారు.

ఆ శరణాగతులైన సాత్త్వికజనులనుజూచి సనకాది మునీశ్వరులు — ఓ జిజ్ఞాసులారా! ఆత్మ, వాణియొక్కయు, మనస్సుయొక్కయు విషయముగాదు. ఏలాగనగా, జాతి,గుణ, క్రియలు గలిగిన వస్తువుయొక్కయే శబ్దము బోధనచేయుచున్నది. ఘటమను శబ్దము నీల గుణము కలిగిన ఘటమును బోధనచేయుచున్నది, పాచకుడను శబ్దము పాక క్రియ కలిగిన పురుషుని బోధనచేయుచున్నది. ఈరీతిగా ధర్మగ్రహణముచేసి, శబ్దము తన అర్థమును బోధనచేయుచున్నది. ఆత్మ జాత్యాది ధర్మములచే రహితుడగుటవలన ఆత్మయందు శబ్దప్రవృత్తి ఘటిల్లదు. అట్లే ఆత్మ సుఖదుఃఖ కామక్రోధాది మనోధర్మములచే రహితుడగుట వలన ఆత్మయందు మానసప్రవృత్తియు ఘటిల్లదు. ఈరీతిగా మనోవాణుల కవిషయమైన సచ్చిదానంద రూపాత్మను చెప్పుటయందు మేము సమర్థులముకాము. మఱియు యెఱుగుటయందు మీరును సమర్థులుకారు. అట్లయినను, నిర్గుణపరమాత్మయందు ప్రపంచారోపణముచేసి, ఆ ప్రపంచముయొక్క నిషేధరూపాపవాదముచేసి, దానివలన సిద్ధమైన ఏ భాగత్యాలక్షణగలదో ఆలక్షణ ద్వారమున మేము మీకు పరమాత్మ నుపదేశించెదము. ఎట్లు సుప్తమైన

రాజును వందిజనులు జాగరూకునిగ జేయుచున్నారో అట్లు వాస్తవముగ శుద్ధమై, అజ్ఞానరూప నిద్రచే ప్రసుప్తుడైన పరమాత్మను వేదాంత శాస్త్రము భాగత్యాగలక్షణచే ప్రబోధన చేయుచున్నది.

ప్రజ ;— ఓ భగవంతులారా! శుద్ధాత్మను వేదాంతము బోధనచేయునని మీరనుచున్నారు. ఆసంగతి ఘటిల్లదు. ఎందుకనగా— ఆత్మ అహంకారాదులచే విశిష్టుడైయుండుటవలన ప్రత్యక్షాది ప్రమాణములచే నెఱుగబడును. సనకాదులు ;— ఓ జిజ్ఞాసులారా! ఆత్మయందు అహంకారమేది ప్రతీతమగుచున్నదో అది మాయచే కల్పితమగుటవలన మిథ్య, సకల కల్పితాధిష్ఠాన వస్తువే ఆత్మశబ్దమున కర్థము, హే బుద్ధిమత్ప్రజా జనులారా! శాస్త్రరహిత లౌకిక పురుషులచేతను, శాస్త్రజ్ఞులైన వాది పురుషులచేతను, వ్యవహారమందు ద్వివిధ శబ్దము, మఱియు ద్వివిధజ్ఞానము నిశ్చయింపబడినది. మఱియు ఆశబ్దమునకును, జ్ఞానమునకును విషయ రూపార్థమున్ను ద్వివిధముగ నిశ్చయింపబడినది. అచ్చట అహం శబ్దమునకును, అహం జ్ఞానమునకును విషయము అంతరాత్మగలదు. మఱియు నాహంశబ్దమునకును, నాహంజ్ఞానమునకును అర్థము బాహ్యమైన అనాత్మగలదు. అచ్చట అహంశబ్దమునుండియు, అహంజ్ఞానమునుండియు ఆత్మరూపార్థము వేఱుగా నున్నది. ఈరీతిగా పరస్పర భిన్నములైన శబ్దజ్ఞానార్థములను ఒకేరూపముగ నెఱిగి భ్రాంతిష్టజనులు ఆత్మను అహంశబ్దమునకు, అహంజ్ఞానమునకు విషయమని యెంచుచున్నారు. మఱియు అనాత్మను నాహంశబ్దమునకు, నాహంజ్ఞానమునకు విషయమని యెంచుచున్నారు. ఈసకల వ్యవహారము భ్రమరూపముగానున్నది. ఏలాగుననగా :—

లౌకిక పురుషుని యెవడైన యడుగుచున్నాడు— ఏపదార్థమిది? వానికి లౌకిక పురుషుడు ఘటమని ఉత్తరమిచ్చుచున్నాడు. మఱియు ఏశబ్దము నీవు వినుచున్నావని యడిగిన, ఘటమని ఉత్తరమిచ్చుచున్నాడు. ఈరీతిగా సకలలోక వ్యవహారము భ్రమరూపముగనున్నది. ఈవ్యవహారము యుక్తిని సహించదు. చూడుము— వాగింద్రియమందు శబ్దముగలదు. హృదయమందు జ్ఞానముగలదు. భూమిమీద అర్థముగలదు. అటువంటి శబ్దజ్ఞానార్థత్రయము నొకటిగా నెఱుగుట కేవల భ్రాంతిగాక ఘటిల్లదు దానియందు వ్యాఘాత దోషమున్ను జనించును. ఎందుకనగా — ఎప్పుడు శబ్దము, మఱియు జ్ఞానము ప్రకాశకము అర్థము ప్రకాశ్యము అగునో అప్పుడు శబ్దము, జ్ఞానము, మఱియు అర్థము వీనికి పరస్పర భేదమే సిద్ధమగును. లోకమందు ప్రకాశ ప్రకాశ్యములకు భేదమే కనబడుచున్నది ఎట్లు ఒక పురుషుడు పిత పుత్రుని ఒకచోట చూచుచున్నాడు; అచ్చట పిత ప్రకాశకుడు, పుత్రుడు ప్రకాశ్యుడు. తరువాత రెండవ

క్షేత్రమందు పుత్రుని మాత్రముజూచి వానికి పితయొక్క స్మరణమగుచున్నది. ఈసాన ందు పుత్రుడు ప్రకాశకుడుగాదు, పిత ప్రకాశ్యముగానున్నాడు. వారిద్దరికి భేదము లోకప్రసిద్ధము, అట్లు ప్రకాశములైన శబ్దజ్ఞానములు ప్రకాశ్యరూపార్థముతో అభేదమనిన పక్షమందు తనతో తనకు భేదరూపమగు వ్యాఘాతదోషముప్రాప్తమగును.

పైజెప్పిన ప్రకారముగ వ్యవహారమందు అహంశబ్దమునకు, అహంజ్ఞానమునకు లోకులచే విషయము ఆత్మయని యెఱుగబడుచున్నది. మఱియు నాహంశబ్దమునకు, నాహంజ్ఞానమునకు విషయము అనాత్మయని యెఱుగబడుచున్నది. అచ్చట అహం శబ్దమునకును, అహం జ్ఞానమునకును, పరిత్యాగముజేసి, వానికి భేదరహితమైనట్టి ఏ అర్థము మిగిలినదో ఆ భేదరహితార్థరూప శుద్ధపరమాత్మ దేవుడు, ప్రపంచోత్పత్తికి పూర్వముండెను. మఱియు అపుడు లోకప్రసిద్ధమైన శబ్దము, జ్ఞానము, మఱియు విష యము లేకుండెను. దృష్టాంతము— అంధకారమునకు విరోధి సూర్యభగవానుడు. తను దినమందు అంధకారనివృత్తిచేసి, అంధకారమునుండియు, అందువర్తించుతారాలైన చాదులనుండియు రహితుడై ప్రకాశకుడైయున్నాడు. అట్లు పరమాత్మ ప్రళయ రూప తన దినమందు అజ్ఞానమును, తత్కార్యమైన ప్రపంచమును తనయందు లయము చేసి స్వప్రకాశరూపముగనుండెను. మఱియు రాత్రియందు అంధకారముపుట్టి సూర్యుని నాచ్ఛాదించునట్లు, రాత్రిరూప సృష్టికాలమందు అసజ్జడ దుఃఖరూపములైన అనాత్మ పదార్థములు బుట్టి సచ్చిదానందాత్మను ఆచ్ఛాదించును. అన్యదృష్టాంతము— సర్పో త్పత్తికి పూర్వము కేవలము రజ్జువేయుండును. సర్పము తనయుత్పత్తికి పూర్వముండదు అట్లు అనాత్మజగదుత్పత్తికి పూర్వము కేవల యాత్మయే యుండును. జగత్తు తన యుత్పత్తికి పూర్వముండదు.

ప్రజ :—ఓ భగవంతులారా! సృష్టికి పూర్వము కేవల పరమాత్మయనుచున్నారు అది ఘటిల్లదు. పూర్వము కార్యరూపప్రపంచము లేకుండినను తత్కారణరూప మాయ యుండును. సనకాదులు ;— ఓజనులారా! మాయ ఆత్మకన్న భిన్నమైప్రతీతమగుట వలన సత్యమనుచున్నారా? లేక ప్రమాణముచే సిద్ధమగుటవలన సత్యమనుచున్నారా? ప్రథమపక్షము ఘటిల్లదు. సుప్తపురుషుడు జాగ్రత్స్వప్న సంస్కార గర్భితమగు నిద్రను జూచియుండినను, తనకన్న భిన్నముగా జూడడు. అట్లే ప్రజలయందు పూర్ణ ప్రపంచ సంస్కార గర్భిత మాయను జూచియు, చిదానందాత్మ ఆమాయను తనకంటె భిన్నముగాజూడడు. దృష్టాంతము — వర్షాకాలముపోయిన తరువాత, కప్పలయొక్క సూక్ష్మావస్థానరూప సంస్కారము భూమియందుండును. మఱల వర్ష

కాలము రాగానే కప్పలయొక్క ప్రాదుర్భావమగును. ఇపుడు మాయ ప్రమాణముచే సిద్ధమను రెండవపక్షమున్ను సిద్ధముకాదు. ఎందుకనగా, మాయయొక్క సిద్ధి వివేక పురుషులచే మాయచేతనే యంగీకరింపబడినది. ప్రమాణముచే మాయాసిద్ధి అంగీకరింపబడలేదు. దృష్టాంతము— సుప్తపురుషుని సుషుప్తి సుషుప్తిచేతనే సిద్ధ మగునుగాని ప్రమాణముచేత సిద్ధముగాదు.

ఎవడైన ప్రమాణముచే సుషుప్తి సిద్ధియగునవనిన, వాని నిట్లడుగవలయును— ప్రత్యక్షముచేతనా? అనుమానముచేతనా? అథవా ఇంకొక ప్రమాణముచేతనా? ప్రత్యక్షప్రమాణముచేతననిన, సుప్తపురుషుని ప్రత్యక్షముచేతనా? అన్య పురుషుని ప్రత్యక్షముచేతనా? రెండు పక్షములును ఘటిల్లవు. ఎందుకనగా— ఇంద్రియ జన్య జ్ఞానమును నైయ్యాయికుడు ప్రత్యక్షమనుచున్నాడు. సుషుప్తియందు ఇంద్రియములు లయమగుచున్నవి. అందువలన సుప్తపురుషుని ప్రత్యక్షజ్ఞానముచే సుషుప్తిజ్ఞానముగాదు. అట్లే జాగరూకుడైన యన్య పురుషునకు, రెండవవాని సుషుప్తి ప్రత్యక్షప్రమాణముతో తెలియబడదు. ఎటులననగా, ఒక పురుషుని సుషుప్తియొక్క జ్ఞానము రెండవ పురుషునకు ప్రత్యక్షప్రమాణముచే సిద్ధముగాదు. ప్రత్యక్ష ప్రమాణముచే సుషుప్తి జ్ఞానమురాదు. అయినను ఇంద్రియ క్రియారహిత పురుషునిజూచి, ఇతడు సుషుప్తి గలవాడని, అనుమాన ప్రమాణముచే సుషుప్తిజ్ఞానమగుననిన, అదికూడ సంభవింపదు. ఎటులననగా — ఇంద్రియ క్రియాభావరూప హేతువు సుషుప్తిరూప సాధ్యముయొక్క అభావరూపములైన స్వప్నసమాధులందును యుండుటవలన నది వ్యభిచారిగానున్నది. అందువలన నది సుషుప్తికి సాధకము కాదు. ఇపుడు శబ్దప్రమాణముచే సుషుప్తిజ్ఞాన మగుననిన, శాస్త్రశబ్దముచేతనా? వేదశబ్దముచేతనా? శాస్త్రప్రమాణముచేతనో ఘటి ల్లదు. ఎటులననగా, శాస్త్రము పురుషరచితము, అది ప్రత్యక్షాది ప్రమాణములచే సిద్ధపదార్థములను ప్రతిపాదనము చేయుచున్నది. ప్రత్యక్షాది ప్రమాణములో సుషుప్తికి సాధకముగావని పూర్వమసిద్ధమే. ఇపుడా యపౌరుషేయమైన వేదప్రమాణముచేననిన కూడ సంభవింపదు. ఎటులననగా — ఫలముగల పదార్థవిషయమందే వేదప్రమాణము సాధకము, ఫలనామము సుఖప్రాప్తికిని దుఃఖ నివృత్తికిని గలదు, అవి రెండును జీవ బ్రహ్మైక్యజ్ఞానముచేతనే నగును, అవిద్యాజ్ఞానముచేతగావు. ఈలాగే అవిద్యా విష యమందు వేదప్రమాణము సాధకముకాదు. వేదమందు మాయయొక్కయు, అవిద్య యొక్కయు బోధనవాక్యములు, మరియు అవిద్యచే జగదుత్పత్తి బోధకవాక్యములు, అనేకములు చూడబడియున్నవి, దానియందభిప్రాయ మేమని యాక్షేపణ చేసినపక్ష మందు ఫలాభావముండుటవలన అవిద్యాబోధన కొరకే వేదముయొక్క తాత్పర్యము

గాదు; అనగా అద్వితీయానంద రూపాత్మనెరింగించుటకొరకు అవిద్యయొక్కయు కార్యమైన ప్రపంచోత్పత్తియొక్కయు, వేదమునందు కథనముకలదు.

అది ఎట్లున్నదనగా— ఎట్లు దీపముచే అంధకారము యొక్క జ్ఞానముగాదో అట్లు ప్రమాణముచేత ఆవిద్యయొక్క జ్ఞానముకాదు. అవిద్యచేతనే అవిద్యయొక్క సిద్ధిగలదు. అందువలననే ప్రళయకాలమందు కార్యరూప ప్రపంచముయొక్క లయమైన తరువాత కేవల కారణరూప మాయతో పరమాత్మవిశిష్టుడుగానుండినను, ఆవిశిష్ట పరమాత్మ మాయా రహితమనియు శుద్ధమనియు చెప్పబడెను. ఎట్లనగా— సూర్య భగవంతుడు అంధకారకారణమైన యజ్ఞానముచే విశిష్టుడైయుండగా, దినమందు కార్య రూపాంధకారముచే రహితుడగుటవలన సూర్యభగవంతుడు అంధకార రహితు డనబడెను.

ఈప్రకారముగ ప్రళయకాలమందు స్థితుడైన పరమాత్మ, పూర్వకల్పమందు సృష్టికి విషయముచేయునట్టిదైన, మాయావృత్తిరూపజ్ఞానజనిత సంస్కారములు గలవాడైయుండగా జీవులయొక్క పుణ్యపాపరూపాదృష్టముచే ప్రకటమైనసంస్కారముగలవాడైయుండగా, ఆపరమాత్మసృష్టికి ఆదికాలమందు విచారముచేయుచున్నాడు— మాయోపహితుడైన పరమాత్మయగు నాయందు భూతకార్యసహితమగు సకల బ్రహ్మాండము సూక్ష్మమైయున్నది; దానిలో ఇపుడు స్వర్గము, ఆకాశము, భూమి, ఈమూడింటిని సృజింపవలయును. (ఇచ్చట స్వర్గశబ్దముచే పైని ఏడులోకముల గ్రహణము, మరియు భూమి శబ్దముచే క్రింది ఏడులోకముల గ్రహణము,) అట్లే సత్యసంకల్పుడైన పరమాత్మ బ్రహ్మాండమును సృజించుచున్నాడు. ఆబ్రహ్మాండము విరాడ్భగవంతుని శరీరముగాను, హిరణ్యగర్భ భగవంతుని అంతఃకరణమైన సూక్ష్మమగు పంచభూతములకు నివాసస్థానముగాను, చతుర్దశలోక యుక్తముగాను, చేతన సత్తతో అభిన్నసత్తగలదిగాను, నామరూపక్రియాత్మకముగానున్నది. (ఇచ్చట నామ శబ్దముచే శబ్దరూప ప్రపంచమునకు రూపశబ్దముచే అర్థరూప ప్రపంచమునను క్రియా శబ్దముచే నామరూపములకు కారణమైన కర్మమునకు గ్రహణము.) ఎట్లు అసుర బాలుడు రాగద్వేషముచే రహితమై స్వమాయా బలముచే పదార్థములను రచించు చున్నాడో అట్లే పరమేశ్వరుడు జగత్తును సృజించుచున్నాడు.

పరమేశ్వరుడు ఇంకను విచారముచేయుచున్నాడు - ఈబ్రహ్మాండము జల ప్రధానమైన పంచభూతములందుగలదు, ఆబ్రహ్మాండమందు చతుర్దశలోకములుగలవు, అన్నియు అచేతనములగుటవలన స్వామి రహితగృహమువలెనే, ప్రాణరహిత శరీరము వలెనే క్షణమందే నాశముపొందదగినవి. ఇట్టి విచారముచేసి పరమేశ్వరుడు పూర్వము

తమతమ సత్వగుణ రూపకారణముచే పుట్టినవైన సంపూర్ణ ఇంద్రియాదులకును, దేవతలకును ప్రకటనముచేయనారంభించెను. అచ్చట ముఖఛిద్రగోళకమునందు వాగింద్రియము, అగ్నిదేవత; నాసిక ఛిద్రగోళకమునందు ఘ్రాణేంద్రియము, అశ్విదేవత; అక్షి ఛిద్రగోళకమునందు చక్షురింద్రియము, సూర్యదేవత: కర్ణఛిద్రగోళకమందు శ్రోత్రేంద్రియము, దిగ్దేవత; అతిసూక్ష్మములైన అనంత ఛిద్రరూపత్వఛగోళకములందు లోమకేశ సహితత్వగింద్రియము, వాయుదేవత; ప్రకటమగుచున్నది. మరియును పంచఛిద్రములుగల మాంస మలరూపహృదయ గోళకమందు మనస్సు; చంద్రదేవత; నాభిఛిద్రరూపగోళకమందు అపానవాయువు ప్రకటమగుచున్నది. (ఆయపానవాయువు దుఃఖముచే సహనమైనది. ఇందువలననే ప్రాణయముగా మతి కష్టతరమని శాస్త్రమందు చెప్పబడినది,) ఆయపానవాయువు ముఖద్వారమున ప్రాప్తమైన అన్నజలములను క్రిందిదేశమునకు తీసుకొనిపోవుచున్నది. అందువలన దానిని అపానమందురు. ఆ యపానవాయువుచే సకలప్రాణి మాత్రులకు భయంకరమైన మహా మృత్యుప్రకటమగుటవలన అపానము మృత్యుకారణమని లోకమందును ప్రసిద్ధమే. (అన్నదోషము తాక నెవడును చనిపోడు.) మరియును ఉపస్థఛిద్రగోళకమందు వీర్యసహితముగ ఉపస్థేంద్రియము, ప్రజాపతిదేవత; వీర్యము జరాయుజ అండజమేహములకు విస్తార కర్తయని లోకమందును ప్రసిద్ధము. పంచమాహుతికిని సాధనము. (ఈసంగతి ముందు పంచాగ్ని విద్యయందు చెప్పబడును.) షట్కోశముగల శరీరమునకు కారణము. (త్వచ, రుధిర, మాంసములు మూడుకోశములు మాతాసంబంధములు. మరియు నాడీ, అస్థి, మజ్జ ఈమూడు కోశములు పితాసంబధములు.) ఈ ప్రకారముగ ఐతరేయోపనిషత్తునందు ఇంద్రియములయొక్కయు దేవతలయొక్కయు ఉత్పత్తి చెప్పబడియున్నది,

ఇప్పుడు పై శ్రుతియందుచెప్పబడిన సంగతిమీద అధికము యెరుగుట సంగతి- వాగింద్రియము అగ్నిదేవతను చెప్పుటచే విషయమైన శబ్దమునకునుగ్రహణము. మృత్యువునకు హేతువైన అపానము దానికి ఇంద్రియముపాయు దేవత మృత్యువనిగ్రహణము మరియు ఘ్రాణేంద్రియము అశ్విదేవతను చెప్పుటవలన పక్షాంతరమునే విషయమైన గంధము పృథ్వీదేవతయొక్కయు గ్రహణము, త్వగింద్రియమనుటచే విషయమైన స్పర్శముయొక్కయు, వాయుదేవతయొక్కయు గ్రహణము; మనశ్శబ్దముచే బుద్ధికిని అహంకారమునకును, చిత్తమునకును గ్రహణము. మరియు మనోదేవత చంద్రుడని చెప్పుటచే బుద్ధి అహంకారచిత్తములకు బ్రహ్మ రుద్ర మహేశ దేవతలకునుగ్రహణము పూర్వము అపానమని చెప్పబడినది. అచ్చట ఆయపాన శబ్దముచే క్రియాశక్తి కలదైన

పంచప్రాణులయొక్కయు గ్రహణము. మరియును ముఖగోళకమందు వాగింద్రియము లున్నవి, తద్దేవతే యగ్నియని చెప్పబడినది. అచ్చట ముఖగోళకమందు రసనేంద్రియ మనునను తద్దేవత వరుణునకును గ్రహణము. ఈరీతిగా బ్రహ్మాండమందు అనేక ఛిద్ర ములు రచించి రెండు హస్తములును, రెండుపాదములును సృజించి, తద్దేవతల నింద్రో పేంద్రుల సృజించుచున్నాడు. అనేక కర్మోపాసనలచే ప్రాప్తమైన దేవ శరీరము సుఖగ్రసితము. అచ్చట అన్యశరీరము దుఃఖగ్రసితమని చెప్పుటయేమి! ఈకైము త్తిక న్యాయముగ విరాడ్భగవంతుని శరీరమును సముద్రరూపముగ వర్ణించుచున్నాము— అనంతకోటి యోజనవిస్తీర్ణమగు విరాడ్భగవంతుని శరీరరూపసముద్రముగలదు, యద్యపి సముద్రపరిమాణము వ్రాయబడియున్నది, అథాపి ప్రళయకాలమందు నియమములేదు, ఎందుకనగా ప్రళయమునందు గణనచేయువాడెవ్వడును లేడు, ఈశ్వరుడుండినను, వానికి గణనతో ప్రయోజనములేదు. మఱియును సముద్రమునుజూచి యెట్లు ప్రాణి మాత్రులకు భయమగుచున్నదో, అట్లే "నేను సర్వాత్మ విరాడ్భగవంతుడను" అను అహంగ్రహ జ్ఞానములేక అహంగ్రహ ధ్యానములేనివాడై పరిచ్ఛిన్న దృష్టిగలవాడైన అజ్ఞాని పురుషునకు విరాట్సముద్రము వినుటచే భయోత్పత్తియగును. మరియును ఆ సముద్రమందు పంచమహాభూతరూపమగు గంభీరజలమును, చతుర్దశలోకరూప తరంగ ములను గలవు. మరియు యెట్లు సముద్రము శుక్తిశంఖాదులచే విరాజమానమగు చున్నదో, అట్లే యీసముద్రమందును జరాయుజాండజస్వేదజ ఉద్భిజ్జలనెడి చతుర్విధ శరీరరూప శుక్తిశంఖాదులుగలవు. మరియు కామక్రోధాది మకరములుగలవు. సంచిత క్రియ మాణప్రారబ్ధరూప గ్రాహములుగలవు, హనుమంతునివలె కనబడునట్టి యెందరో రాక్షసులుగలరు, యెన్నియో ఆవర్తములునుగలవు.

ఇటువంటి సముద్రప్రాయమైన విరాట్ శరీరమందు ప్రాప్తములైన వాగాదిదేవతలు క్షుధాతృషలచే వ్యాకులములై సమిష్టి విరాట్శరీరముకన్న భిన్నమైన అన్నమును జల మును లేదనిజూచి తమ జనకుడైన పరమేశ్వరుని ప్రార్థించుచున్నవి—ఓభగవంతుడా! సంపూర్ణజగత్తు సమిష్టిరూప విరాడ్భగవంతుని శరీరము నీవు సృజించుచున్నావు; ఈ శరీరముకన్న భిన్నమైన అన్న, జలము యెక్కడను కనబడదు; మేము వస్తుపడి యున్నాము, నాయనా! మానిర్వాహముకొరకు కొంచెము కొంచెము అన్నము జల ముచే తృప్తిపొందునట్టి యేదో యొకశరీరమును సృజింపుమా!

ఈప్రకారముగ దేవతల ప్రార్థన విని వానికొరకు జనకుడైన పరమేశ్వరుడు గోశరీరమును సృజించెను, ఆగోశరీరమున దేవతలకు తృప్తికాలేదు. ఎందుకనగా— గోశరీరమందు పూర్వకృతకర్మ ఫలోపభోగము మాత్రమగునుకాని, ఈగోశరీరమందు

బుద్ధియును లేదు, క్రొత్త కర్మసంపాదనమును లేదు. తరువాత భగవంతుడు అశ్వశరీ మును సృజించెను. ఆయశ్వశరీరమందును బిడ్డలకు ప్రీతిలేదని జూచి, జనకుడైన పరమేశ్వరుడు ఎనుబదినాల్గులక్షల ప్రకారములుగ శరీరములను సృజించెను. ఐనను దానిలో యేశరీరమందును బిడ్డలకు ప్రేమగాలేదు. కడపట భగవంతుడు మనుష్య శరీరమును సృజించెను, దానినిజూచి సకల దేవతలు హర్ష నిర్భరులై ఆమనుష్య శరీరమును పరమప్రేమతో నంగీకరించి భగవంతుని స్తోత్రముచేయనారంభించిరి.

ఆహా! నాయనా! ఈమనుష్యశరీరమును సాక్షాన్నీవే సృజించినావు, ఏవని చేతను సృజింపలేదు. ఒక శిల్పికారుడు ఒకనిచే చేయించినపని, తాను స్వతఃచేసిన పనితో సమానమగునా? ఆహాహా! ఎంత సుందర మనుష్యశరీరమిది! ఏవనిచేత నగును? నీవే సాక్షాత్తుగ సృజించుచున్నావు. ఈమనుష్యుడు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ యుక్తుడగుటవలన, సకల పదార్థముల నెరిగి కథనముచేయుచున్నాడు. యద్యపి వానరాది శరీరములందును చక్షుశ్శ్రోత్రాదింద్రియములుగలవు; తథాపి వానరాదుల ఇంద్రియములకు విషయములతో సంబంధమైనను, సర్వదా అజ్ఞాన నివృత్తికాదు. మనుష్యుని ఇంద్రియములకు ఘటాది విషయములతో సంబంధమగుట సంపూర్ణజ్ఞాననివృత్తి యగుచున్నది. తస్మాత్ వానరాదులకన్న మనుష్యుడు శ్రేష్ఠుడు, ఈమనుష్యుడెట్లున్నాడు — ఇహలోకసంబంధ స్వర్గాదిలోక సంబంధ సుఖమును, తత్సాధనములైన యజ్ఞాదికర్మములను, శాస్త్రముచే నెరుగుచున్నాడు. భూత భవిష్యత్కార్యములను యెరుగుచున్నాడు, మరియును సుఖప్రాప్తి దుఃఖనివృత్తి సాధనముల నెరుగుటకొరకు మహాజనుల సమాగమ ప్రకారము నెరుగుచున్నాడు. మరియు నీమనుష్యుడు వేద వాక్య ద్వారమున, ఆత్మసాక్షాత్కారమును పొందుచున్నాడు, ఆహాహా! ఆ హర్ష యుక్తులైన దేవతలను జనకుడైన భగవంతుడు ఆజ్ఞచేయుచున్నాడు— ఓయిదేవతలారా! మీరీ మనుష్యశరీరములో తమతమ గోళకస్థానమందు ప్రవేశింపుడు! అపుడు దేవతలు విన్నవించుచున్నారు — ఓభగవంతుడా! ఇంద్రియములు నివసించుస్థానమంద మా ప్రవేశముగాదు. ఎందుకనగా మేము వ్యాపకులము వీనియొక్క స్థానము అల్పము ఇదియునుగాక ఇంద్రియములచేతనే అర్థసిద్ధియగును, మాప్రవేశమునకు ప్రయోజనమును లేదు. భగవంతుడనుచున్నాడు— ఓదేవతలార! మీసంబంధముగలవి ఇంద్రియములు గలవు, వాని విషయమందు భేదభావమును విడచి ఏకతాభిమానముచే ప్రవేశము చేయుడు. ఎట్లనగా ప్రజ్వలిత మూషయందనేక ధాతువులు వేసినపుడు ఏకరూపమగును, భేదముండదు, అభిప్రాయము— ఒకటి రెండవదానిని యపేక్ష చేయక తమతమకార్యము చేయునట్టి రెంటికి ఒకే యధికరణమందు వర్తనముగాదు. ఇంద్రియ

ములకు దేవతలతో పరస్పరాపేక్షగలదు. ఎటులననగా— చక్షువులేని ప్రకాశరూప సూర్యుడు సిద్ధముకాడు, మరియు సూర్యుని వినాచక్షురింద్రియము సిద్ధముగాదు, అందువలననే అంధకారమునందు చక్షువునకు రూపజ్ఞానముగాదు. మరియు రూపాది వస్తుసంబంధ జ్ఞానరూపకార్యముచేతనే, చక్షురింద్రియమునకు అనుమితి జ్ఞానమైనది. ఇంద్రియముయొక్క ఇంద్రియముచే ప్రత్యక్షజ్ఞానముకాదు. దీనివలన నేమిసిద్ధమైన దనగా— సూర్యుడు విద్యమానపక్షమందే చక్షువునను రూ పా ది వస్తువుయొక్క జ్ఞానమగును. పరమేశ్వరుడట్లు విచారము చెప్పగా. . సంపూర్ణదేవతలట్లే ప్రవేశము చేయుచున్నారు. దానివలన అధిదైవ అధ్యాత్మ అధిభూత ఈత్రిపుటి సిద్ధమగుచున్నది. అచ్చట సూర్యాది అధిదైవము, చక్షురింద్రియాది అధ్యాత్మము, రూపావిషయము లనిమాడుము.

ఈప్రకారము పరమేశ్వర జనకునిచే స క ల దేవతలకు యథాయోగ్యస్థానము ఇవ్వబడినదిజూచి అశనా మరియు పిపాస ఈరెండు దేవతలు నాయనా! అందరికి స్థానము యిచ్చుచున్నావే? మాకు? అప్పుడు బిడ్డలు తంటాలుచేస్తారు, వేరే స్థాన మెక్కడనులేదు. ఏమిచేయుటయని యాలోచించి నాయనయనుచున్నాడు— ఓ యశనా పిపాసులైన ప్రియబిడ్డలారా! అధ్యాత్మాధిదైవతల స్థా న మం దే చేరుడు, అనగా ఆదేవతల తృప్తిచేతనే అనాయాసముగ మీతృప్తియగును. ఈలాగే నాయన బిడ్డల సమాధానముచేయుచున్నాడు. (ఇపుడనుభవమందును అట్లే వచ్చుచున్నది. సూర్యాది దేవతలకు ఘృతాది హవి ఇచ్చుటచే అశనాపిపాస దేవతలయొక్క సహజ శాంతి యగుచున్నది,)

తరువాత లోకమందెట్లు బిడ్డలు ప్రార్థనచేయక గూడ తండ్రివానికొరకు అన్న వస్త్రాది యేర్పాటు చేయుచున్నాడో అట్లు పరమేశ్వరజనకుడు "నాబిడ్డలు తీనది తులగనున్నారు, వానికొరకు అన్నయోజన చేయవలయు" అనిచారముజేసి, నానా ఉపాయములుచేసి, పంచభూతములనుండి అనేక ప్రకారములైన అన్నములను పుట్టించు చున్నాడు, వానిలో మనుష్య పశ్వాదులకొరకు, వ్రీహితృణాదుల అన్నము, వ్యాఘ్ర సింహాదులకొరకు మృగాది యన్నము, సర్పాదులకొరకు వాయు మూషకాది యన్నము, ఈప్రకారముగ నానావిధ అన్నములు సృజించియు, అపాన వాయువు వినా బిడ్డలు అన్నగ్రహణమందు అసమర్థులేయని (అందువలననే అపానవాయువునకు శ్రుతియందు "అన్నాద" యనబడినది.) అందువలన దేవతలు అపాన వాయువు యొక్క యాశ్రయమముచేయుచున్నారు. అట్లయినను ఎట్లు చైతన్యరూప పురు షుడు లేక కుఠారి ఛేదనకార్యమందు సమర్థముకాదో, అట్లు సర్వవ్యవహారసాధకమైన

సర్వాంతర్యామి ఆత్మవినా, అపానవాయువు అన్నగ్రహణమందు సమర్థముగాక పోయెను. అధిదైవాది జగత్తు ప్రాణవాయువుచే ప్రకటమైనను, పరమాత్మవినా ఈజడ జగత్తు ఏరీతిగానైనను సిద్ధముగాదు. ఎందుకనగా ఏదేది జడవస్తువుగలదో, అది యాది ప్రకాశమునకపేక్షచేయుచున్నది. ఈ యన్నము భోజనముచేయుట యోగ్యమా? ఈశబ్దము ఉచ్చారణచేయుట యోగ్యమా? ఈ రూపము జూచుట యోగ్యమా? ఈప్రకార జ్ఞానము భోక్త, వక్త, ద్రష్టరూప ప్రకాశాత్మ వినాసిద్ధము కాదు, ఆత్మయే ప్రాణ విశిష్టుడై భోక్త, వాచా విశిష్టుడై వ్యక్త, చక్షువిశిష్టుడై ద్రష్ట యనబడును. లోకమందును సూర్యదీపాది ప్రకాశములేనపుడు అంధకార మందు రూపవద్ఘటాది పదార్థములు యెఱుగబడవు.

ప్రజ :—హేభగవన్! జడవస్తువు తనసిద్ధియందు ప్రకాశాపేక్షచేయుచున్నదని నియమును చెప్పుచున్నావు, అది ఘటిల్లదు, ఎటులననగా— ఆనియమము ఘటాదు లందు ఘటిల్లినను, అంధకారమందు వానికి వ్యభిచారముగలదు. ఎందుకనగా- అంధ కారము జడమైనను, తనసిద్ధియందు ప్రకాశాపేక్ష చేయదు; వ్యత్యాసముగ ప్రకాశముచే తాను నివృత్తమగును. సనకాదులు —ఓజనులారా! అంధకారము యద్యపి సూర్య దేవాది ప్రకాశమును అపేక్షచేయుదు. తదాపి చక్షురూప ప్రకాశమునపేక్షించును. అందువలననే చక్షురహిత పురుషుడు అంధకారమునుచూడడు. ఎట్లు ఘటాదిపదార్థ జ్ఞానమందు, ఘటాదులతో భిన్నమైన సూర్యాది ప్రకాశము హేతువో, అట్లంధకార ము కన్న భిన్నమైన చక్షుప్రకాశము అంధకారజ్ఞానమందు హేతువు, అట్లే చక్షురా దులును జడములే, వానికి ప్రకాశకుడు ఆత్మ. ప్రజ :— చక్షుప్రకాశకము ఆత్మ యనిచెప్పినది ఘటిల్లదు; సూర్యునిచేతనే చక్షుప్రకాశకమగుచున్నది. సనకాదులు— జనులారా! విషయమైన ఘటము సూర్యుని ప్రకాశముచేయదు. అట్లు విషయమైన సూర్యుడు చక్షుప్రకాశముచేయడు. దీనివలన అనుమానము — చక్షు సూర్యాది ప్రకాశములు తమసిద్ధియందు ఇతర ప్రకాశాపేక్షచేయుచున్నవి. జడములగుటవలన ఏదేది ఇతరుని యపేక్షచేయదో అది జడమునుకాదు. ఎట్లనగా, చైతన్యమైన స్వయం ప్రకాశాత్మ. ప్రజా :— హే భగవన్! చక్షురాదులు రెండవ ప్రకాశాపేక్ష చేయ దనిన — చక్షురాది తమసిద్ధియందు ఇతర ప్రకాశాపేక్షచేయదు. ప్రకాశరూపమగుట వలన, దీపన్యాయమున ఈయనుమానముతో విరోధమగును! సనకాదులు:—ఎట్లు దీపము సజాతీయమైన ఇతర ప్రకాశాపేక్షచేయదో అట్లు సకల ప్రకాశములుచేయవని నియమములేదు. చూడుము — వజ్రమణ్యాదులందు ప్రకాశతయుండినను వానిలో ఇతర ప్రకాశాపేక్షాభావములేదు.

# యథార్థభారతి

| ...టం 13. | ప్రమాది సం॥రం మాఖమాసం ఫిబ్రవరి నెల 1940. | సంచిక 12 |
| --- | --- | --- |




ఉత్తిష్ఠత. జాగ్రత, ప్రాప్య, వరాన్ నిబోధత.

...భూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని, సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛ...

...హం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి సచమేన ప్రణశ్య...

(పత్రికవిలాసము:- శ్రీవ్యాసాశ్రమం, యేర్పేడుపోస్టు, చిత్తూరు జిల్లా.)

## రాజపోషకులు చందా రూ. 100.

1. బ్రహ్మశ్రీ. న్యాపతి. సుబ్బారావుపంతులుగారు—రాజమంద్రి.
2. శ్రీయుత. కొత్త వెంకటరత్నం జమీందారుగారు—యానాం.
3. శ్రీయుత. నూలు. సూర్యనారాయణగారు—యానాం.
4. శ్రీయుత. మాఖం. వెంకటేశం శెట్టిగారు—మదరాసు.
5. శ్రీయుత. కోలా, శ్రీనివాసులు శెట్టిగారు—పిల్లమేడుగ్రామం.
6. శ్రీయుత. దుర్గాప్రసాద్ ఉపాధ్యాయ—మదరాసు.
7. శ్రీమతి. దేవరకొండ. మహాలక్ష్మమ్మగారు—రాజమంద్రి.
8. శ్రీమతి. బుల్లమ్మగారు.
9. శ్రీయుత. నూతలపాటి నాగప్పనాయుడుగారు, ఏర్పేడుగ్రామం.
10. శ్రీమతి. అకుల సీతారామమ్మగారు, రాజమంద్రి.

## పోషకులు చందా రూ. 50.

1. శ్రీయుత. కతారి. వెంకటసుబ్బరాజుగారు—చిననిండ్రకొలను.
2. శ్రీయుత. కలిదిండి. నారాయణరాజుగారు—పెద్దపుల్లేరు.
3. శ్రీయుత. ఎమ్. క్రిష్ణానందముగారు—నెడంబరం.
4. శ్రీయుత. గుంటుమడుగు. వెంకట్రాజుగారు—జంబాడగ్రామం.
5. శ్రీయుత. A. B. చిన్నరాయప్పగారు, తిమ్మాచెర్ల.

## అభిమానులు చందా రూ. 10

1. శ్రీయుత. చక్కా. సుబ్బరావుగారు, గుంటూరు.
2. శ్రీమతి. తోలేటి. కామేశ్వరమ్మగారు, గుంటూరు.
3. శ్రీయుత. మైలవరపు చిన్న హనుమయ్యగారు, గుంటూరు.
4. బ్రహ్మశ్రీ ... మూర్తిగారు, ...
5. శ్రీయుత, జి. కృష్ణమూర్తినాయుడుగారు, జంషెడ్‌పూర్.

# మధ్వార్థభారతి

సంపుటము 13 సంచిక 12

ప్రమాది సంవత్సరం
మాఘ మాసం
1940సం॥రం ఫిబ్రవరి నెల

చందా
సం॥రం రు 2-4-0
విడిపత్రిక రు 0-4-0


ఓం

## బ్రహ్మవిద్యాశీర్వాద పద్ధతి.

33. పరమేశ్వరం ప్రీతిపూర్వకం భజన్తో భక్తా యేన బుద్ధియోగేన సమ్యగ్దర్శనలక్షణేనాత్మభూతం భగవన్తం పరమేశ్వరమాత్మత్వేనోప యాన్తి ప్రతిపద్యతే తం బుద్ధియోగం భగవాన్ వాసుదేవో మే దదా త్వత్యాశీర్నిరన్తరం భూయాత్.

తా॥ పరమేశ్వరుని ప్రీతితో భజించి భక్తులు ఏ శ్రేష్ఠమైన దర్శ నమే లక్షణముగాగల బుద్ధి (జ్ఞాన) యోగముచేత ఆత్మస్వరూపమైన భగవంతుడగు పరమేశ్వరుని ఆత్మమాత్రముగా (గ్రహించి) పొందు చున్నారో (అనగా యెఱుంగుచున్నారో), అట్టి బుద్ధియోగమును భగ వంతుడైన వాసుదేవుడు నా కొసంగునుగాక! అనెడి మంగళశాసనము సర్వకాలమును కలుగుచుగాక!

34. అసంగోఽహం చిదాత్మాహమితి ప్రత్యగాత్మని నివేశితే వృత్తిరహితే సంస్కారశేషమాత్రతయా సూక్ష్మరూపేణావస్థితే చిత్తే ఽత్మనః స్వరూపభూత పరమానన్దో నిరన్తరం సమ్యగావిర్భూయాత్.

తా॥ నేను అసంగుడను, నేను చిదాత్మ అనెడి భావముచే ప్రత్య గాత్మయందు ప్రవేశింపబడి వృత్తిరహితమైనదియై, సంస్కారశేష మాత్రత్వముగను, సూక్ష్మస్వరూపముగను నెలకొనియుండు చిత్తము నందు ఆత్మయొక్క స్వరూపభూతమైన పరమానందము ఎల్లపుడును చక్కగా ప్రకాశమగునుగాక!

# మనస్తత్వము.

(శ్రీ మలయాళస్వాములవారు)

(గతసంచిక తరువాయి)

శ్రద్ధా వినయ సంయుక్తః శాన్తిదాన్త్యాది సంయుతః,
యావజ్ఞానోదయస్తావ ద్వేదాంతార్థం నిరూపయేత్.

ఎంతవఱకు ఆత్మజ్ఞానోదయము కాలేదో అంతవఱకు శ్రద్ధా వినయములతో గూడినవాడై శమదమాది గుణములు కలుగజేసికొని వేదాంత విచారము, బ్రహ్మచింతన, ధ్యానయోగాభ్యాసము గావించుకొనవలెను. వేదాంతశాస్త్రముయొక్క సారమంతయు, మహనీయుల యభిప్రాయమంతయు నీ శ్లోకములో యిమిడియున్నది.

ఇక శ్రీయోగవాసిష్ఠమున ఉపదేశించినది చూడుడు.

అనర్థేనావిచారేణ వయః కుర్యాన్న భస్మసాత్,
బోధేన జ్ఞానసారేణ దృశ్యం కర్తవ్య మాత్మసాత్.

ఓ రామా! అనర్థప్రదమగు అవిచారణచే ఆయువును నశింపజేయవలదు. శ్రవణమననాదులచే ప్రాప్తమగు తత్వజ్ఞానముచే యీ దృశ్యము నాత్మతోటి నైక్య మొనర్పుము.

ఆయుషః క్షణ ఏకోపి సర్వరత్నైర్నలభ్యతే,
నీయతే తద్వృథా యేన ప్రమాదః సుమహానహో.

ఆయువునందలి యొక్క క్షణమైనను వ్యర్థముగ గడపినచో, మఱల నయ్యది అనేకరత్నములచే గూడ లభింపనేరదు. కాన ఆత్మవిచారములేక సమయము గడుపుట మిక్కిలి ప్రమాదమగును.

శాస్త్రస్యాస్యతు యన్నామ వాదనం తద్వినాపరః,
అభ్యాసో దృశ్యసంశాంత్యై నభూతో నభవిష్యతి.

మోక్షోపాయమనఁబడు యీ వేదాంతశాస్త్రమును గురుముఖతః శ్రవణమొనర్చి, ఆ పిదప మనన నిదిధ్యాసనాదులచే బాగుగ నభ్యసింపవలెను. దృశ్యము శమించుట కింతకు మించిన యుపాయ మెద్దియు నేటివఱకు మఱియొకటి యుండియుండలేదు, ఇకను యుండబోదు.

క్షపయంతి విపాకం తం పూర్వోపా త్తస్యకర్మణః,
సకాలే ప్రభవత్యేహ పూర్వోపా త్తం శుభాశుభమ్
స్వచ్ఛాయామివదుర్వారం దేవానామపి పార్థివ.

పూర్వజన్మమునందు వారువారు చేసిన పుణ్యపాపములయొక్క ఫలము అనుభవకాలము వచ్చినపుడు అనుభవించియే తీరవలెను. శుభాశుభఫలములు తమ నీడవలెనే మనుజుని విడువక వెంబడించి వచ్చుచుండును. అవి దేవతలనైనను విడువవు.

శాస్త్ర మీలాగున చెప్పుచుండగా సామాన్యజనులు కూడ తమకు కర్మ, ధర్మములు లేవని చెప్పుట యెంత అవిచారకరమగు ప్రవృత్తియో తెలియఁదగినది.

యోయాదృక్ క్లేశమాధాతుం సమర్థస్తా దృగేవ సః,
అవశ్యం ఫలమాప్నోతి ప్రబుద్ధో స్త్వజ్ఞ ఏవ వా.

జ్ఞానియైనను అజ్ఞానియైనను క్లేశకరములగు వారివారి కర్మలననురూపమగు ఫలములను తప్పక బొందుదురు.

ఆమోదశ్చందనస్యేవ స్పందనస్య ఫలం హృది,
సర్వస్యైవా స్తి తన్మూనం తద్వతా సమవాప్యతే.

శ్రీగంధమందు సుగంధమువలె విహితనిషిద్ధకర్మల ఫలము అంతటియందును యుండియేయుండును. కాలక్రమమున అట్టి క్రియలయొక్క ఫలములను వారవశ్యము పొందెదరు.

ఇక యీ విషయమై విస్తారముగ వ్రాసి గ్రంథమును పెంచదలంచుటలేదు. ఉత్కృష్టమగు శాస్త్రము లీలాగున యుద్ఘోషించుచుండ, సామాన్యస్థితిలోనుండు వేదాంతుల వాక్యములను గుణించిన సత్యమును శుద్ధబుద్ధిగల ముముక్షువులే తెలిసికొనగలరు. దైవప్రాప్తి అనగా ఈశ్వర సాక్షాత్కార జ్ఞానము కలుగుటకు దైవభక్తి గల్గియుండవలెనని అనేక శాస్త్రములును, పలువురు మహాత్ములును తెలుపుచున్నారు. శ్రీభగవద్గీతయొక్క సారమున్ను యిదియే. ఏలన, గీతలోగల 14వ అధ్యాయమున గుణత్రయవిభాగమునుగూర్చి చెప్పబడినది. మూడుగుణములు, వాటి పరిణామములు, వాటివలన గలిగెడు ఫలములు అన్నియు నీ యధ్యాయమున నుపదేశించినదేగాక గుణత్రయాతీతుని అనగా జీవన్ముక్తుని స్థితికూడ

యిందు తెలిపిరి. మఱియు నట్టి దుష్కరమగు గుణత్రయాతీతస్థితి నిర్మల మగు భగవద్భక్తి యొక్క దానిచే గలుగునని అందు శ్రీభగవాను లుపదేశించిరి. ఏలన, యిది సర్వజనులకు అనుష్ఠించుటకు సులభ కారణ మగుటచేతను, కారుణ్యనిధియగు భగవానులు అందఱును తరించ వలె నను యభిప్రాయము గలవారగుటచేతను యిట్లుపదేశించబడ యినది. గీ. అ. 14. శ్లో. 26.

మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

ఎవడు అచలమైన భక్తియోగముచేత నన్ను ధ్యానించుచు న్నాడో, ఆతెడు త్రిగుణములను అతిక్రమించి జీవన్ముక్తిదశను బొందుట కొఱకు సమర్థుఁడగుచున్నాడు. ఈలాగుననే ఆఱవ అధ్యాయములో ఆత్మసంయమపరమగు ధ్యానయోగమున్ను, జ్ఞానప్రాప్తియు, జ్ఞాన ప్రాప్తికై యుపాయమున్ను భగవాను లుపదేశించిన తరువాత ఆఖరున అనన్యభక్తి యొక్క దానిచేతనే అట్టి పదవి లభించుననియు, సాధన లన్నింటిలోను పావనమైన భక్తియే శ్రేష్ఠమనియు నుపదేశించిరి.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున.
యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.

(అ. 6. శ్లో. 46, 47.)

తపస్సు చేయువానికంటెను, అనుష్ఠానములేని వేదాంత శాస్త్రములు పఠించువానికంటెను నిత్యనైమిత్తికాదికర్మల చేయు వానికంటెను యోగనిష్ఠగలవాడు శ్రేష్ఠుడు. అట్టి యోగి అందఱిలోను అధికుడని భగవంతుఁ డుపదేశించిన తరువాత అట్టి ధ్యానయోగులందఱి లోను భక్తిగలిగి పరమాత్మయందు నిలుపబడిన చిత్తము గలవాడై, అత్యధిక శ్రద్ధతో గూడినవాడై సర్వేశ్వరుని యెవడు భజించునో, అనగా ధ్యానించునో ఆతడు అందఱికంటె యధికుఁడనియు, అదియే తన సమ్మత మనియు వచించెను.

18. అ. శ్లో. 55:—భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్.

వేదాంత శాస్త్రమంతయు సంగ్రహముగ ఉపదేశించిన అంతిమాధ్యాయమగు పదునెనిమిదవ అధ్యాయములో భగవాను లుపదేశించినది చూడుడు:—భక్తులారా! బ్రహ్మనిష్ఠులారా! ఎన్ని రకములగు రసయుక్తములైన బీజములుండినను అన్నిటికిని యొకే ఆధారభూతమగు జలము అనగా వర్షము లేనిచో యెట్లన్నియు వ్యర్థములగునో, అలాగున మీరు యోగముగాని తపస్సుగాని, జపముగాని, వ్రతముగాని మఱి యెన్నెన్ని మార్గములు గలవో అవన్నియు అనుష్ఠించువారలైనను, అనన్యమైన భక్తి యొక్కటి లేనిచో అవేవియు పూర్ణఫలము నొసంగజాలవు. మఱియు బీజములన్నియు అంకురించుటకు జలమొకటియే ఆధారమెట్లగునో, అట్లనే అన్నిమార్గములకును భక్తియొక్కటియే ఆధారమగును. అంతేగాక భక్తియొక్క దానియందు మాత్రమే, అహంకారము, అసూయ, ద్వేషము మున్నగుదోషములు నశించును. అయితే యిప్పుడుగల భక్తులలో కొందఱియం దిట్టి ద్వేషాదులు కన్పించుచున్న వే యని తలంచవచ్చును. అది భక్తియొక్క పరమోత్కృష్టము పొందకపోవుటయే కారణము. భక్తియొక్క పరమకాష్ఠ సర్వచరాచరప్రాణికోట్లయందును, తనయందును భగవంతుని చూచుటయే యగును. అట్టి భక్తి కలుగనందుచేతనే ద్వేషాదులు కలుగుటకు కారణమగుచున్నది.

ఇక పైశ్లోక తాత్పర్యము వినుడు:—పరిశుద్ధమైన భక్తియే, నాయొక్క స్వరూపమును అనగా భగవత్స్వరూపమును లెస్సగ తెలిసికొనుట; అట్టి తెలివివలననే, అనగా జ్ఞానము వలననే నిజమైన తత్త్వము బోధపడుటకున్ను, ఆత్మయొక్క ఆవరణములు, బంధనములు నశించుటకును కారణమగుచున్నది. అట్టి సాక్షాత్కారజ్ఞానమువలన జీవుడు పరమశాంతిని, నిత్యమగు మోక్షమును పొందుచున్నాడు.

ఈ భక్తివిషయమై వ్రాయవలసియుండిన యెంతయో గలదు. ఇదివఱకు వ్రాసియుండిన గ్రంథములలో విశేషముగ తెలుపబడియుండెను. ఇప్పుడు ధ్యానము అన్నిటిలోను యెక్కువ ఫలమును కలుగజేయు విషయమై సూతసంహితలో చెప్పబడిన విషయము కొంచెము మాత్రమిట తెలుపబడుచున్నది.

1. ధ్యానయజ్ఞం వినా ముక్త్యై యతన్తే మోహితా జనాః,
పాయసాన్నం పరిత్యజ్య భక్షయన్తి మహావిషమ్.

2. ధ్యానయజ్ఞం వినా కించిత్ కుర్వాణో ముక్తిసిద్ధయే,
అక్ష్ణాపి శబ్దం గృహ్ణాతి వినా శ్రోత్రేన కేవలమ్.

3. అశ్వమేధాదయో యజ్ఞా అశేషా వేదదర్శితాః,
మునీంద్రా ధ్యానయజ్ఞస్య కలాం నార్హన్తి షోడశీమ్.

4. ధ్యానయజ్ఞపరో మర్త్యశ్శివ ఏవ నచాపరః,
ధ్యానయజ్ఞైకనిష్ఠస్య నకించిదపి దుర్లభమ్.

5. ధ్యానయజ్ఞపరాణాంతు ప్రసాదం కురుతే శివః,
శివోపి సాక్షాత్ సర్వజ్ఞః సంసారవినివర్తకః.

6. బహునోక్తేన కిం సర్వం సమాసేన మయోదితమ్,
కురుధ్వం వేదవిన్ముఖ్యాః ధ్యానయజ్ఞమశంకితాః.

1. మాయా మోహితులగు యేజనులు ధ్యానమనెడు ఆత్మయజ్ఞమును విడచి ముక్తివిషయమై యితర యజ్ఞములు చేయుదురో వారు శుద్ధమగు క్షీరాన్నమును త్యజించి మహావిషమును భుజించిన వారగుదురు.

2. ధ్యానయజ్ఞము నుపేక్షించి మోక్షవిషయమై యితర క్రియలు చేయువారలు శ్రోత్రముచేత వినవలసిన శబ్దమును నేత్రముచేత విన దలచినవారి చందమున నుందురు.

3. ఓ మునీంద్రులారా! వేదమందు కర్మభాగములో నుపదేశించిన అశ్వమేధాదులగు సమస్త యజ్ఞములున్నూ ధ్యానయజ్ఞముచే గలిగెడు ఫలముయొక్క పదునారు భాగములలో నొక్కభాగమైనను కలుగ జేయజాలవు.

4. ధ్యానయజ్ఞపరుడగు మానవుడు సాక్షాత్ శివస్వరూపుడే యగును. ధ్యానయజ్ఞైక నిష్ఠునకు దుర్లభమైన దేదియు యేలోకమం దును లేదు.

5. ఆత్మధ్యానమనెడు యజ్ఞమందు నిష్ఠగలవానికి ఈశ్వరానుగ్రహము త్వరలోనే సిద్ధించును. సర్వజ్ఞుడున్నూ, సర్వసాక్షియు, సంసారదుఃఖమును నివర్తింపజేయువాడును సాక్షాత్ శివుడే యగును.

6. వెయ్యేల, సంక్షిప్తముగ నుపదేశించెదను. వేదవేత్తలలో శ్రేష్ఠులగు నో బ్రహ్మనిష్ఠులారా ! మీరు సంశయము లేనివారై ఆత్మధ్యానమను జ్ఞానయజ్ఞము నాచరింపుడు. దీనియొక్క దానిచే సంసారమును తరించి మోక్షపదవిని చేరగల్గుదురు.

ఇట్టి ఆత్మజ్ఞానమునకు అనగా బ్రహ్మనిష్ఠయను ధ్యానయజ్ఞమునకు విఘ్నములను గలుగజేయునట్టి పాపగుణములను ప్రతిముముక్షువున్ను విడువవలయును. ఇట్టి పాపగుణములే మోక్షమునకు విఘ్నములై యున్నవి. అవి యేవనగా—

భయంక్రోధ మథాలస్య మతిస్వప్నాతి జాగరం,
అత్యాహారమనాహారం నిత్యం యోగీ వివర్జయేత్.

భయము, క్రోధము, ఆలస్యము (సోమరితనము), అతినిద్ర, నిద్రలేకుండుట, అతిభోజనము, భోజనము లేకుండుట ఈ యేడింటిని యోగనిష్ఠాభిలాషి విడువవలెను.

ఆలస్యమనృతంశాఠ్యం జాడ్యం నింద్యాప్యనుద్యమః,
షడేతే మంత్రిణస్తస్య జ్ఞానద్వారనిరోధినః.

సోమరితనము, అసత్యము, మూర్ఖత్వము, రోగము, పరనింద, స్వప్రయత్నరాహిత్యము అను నీయాఱున్ను సాధకునకు మోక్షద్వారనిరోధులని తెలియఁదగినది.

ఇప్పుడు మనస్తత్త్వమును ఉపసంహరించెద. యథార్థముగ విచారించిన మనస్సను వస్తువే లేదు. విషయములు, గుణములు, వాసనలు, సంస్కారములు, సంకల్పములు, మాయ, అవిద్య, అజ్ఞానము మొదలైనవన్నియుఁ జేరి మనస్సగుచున్నవి. ఇవన్నియు ఆత్మనుండి వదలిపోవునపుడు మనస్సుకూడ లేకపోవును. ఇవన్నియు యున్నచో ఆత్మప్రకాశమును మఱుగుజేసి జీవుని అంధకారమున బడద్రోయును. ఎట్లన, యథార్థముగ విచారించిన మేఘమను వస్తువే లేదు. సూర్యరశ్మిచే గలిగెడు జలరేణువులు, వాయువు, విద్యుత్తు, మొదలైనవి చేరినపుడు మేఘమనునది యేర్పడుచున్నది. ఇయ్యది చల్లనిగాలిచే కరఁగి వర్షమై కురిసిన మరల మేఘముండదు. ఈ మేఘము దట్టమై యుఁడునపుడు ఎంతయో

ప్రకాశవంతమైన సూర్యునికూడ కనుపడకుండఁజేయు విధముననే మనస్సుయొక్క స్థితికూడ ముముక్షులును, విజ్ఞానస్వరూపులును తెలిసికొనఁదగినది. బృహదారణ్యకోపనిషత్తునందు మనస్సును గూర్చి చెప్పబడిన అతిపవిత్రమగు ఉపనిషద్వాక్యము నిట యుదహరించి యిక దీనిని ముగించెద.

కామ సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతి
రధృతి ర్హీర్ధీర్భీరిత్యేతత్సర్వం మనఏవ.

తా. కామము, సంకల్పము, విమర్శేచ్ఛ, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, జ్ఞానము, భయము, మొదలగు వృత్తులన్నియు జేరియే మనస్సని చెప్పబడును.

ఓం తత్ సత్.

మన స్తత్త్వము, సమాప్తము.



ఓమ్.

# స త్య మ హి మ.

(శివ, ఉమాసంహిత 12 అధ్యాయము.)

సత్యమేవ పరంబ్రహ్మ సత్యమేవ పరం తపః,
సత్యమేవ పరో యజ్ఞః సత్యమేవ పరంశ్రుతమ్. 1

తా. సత్యమే పరబ్రహ్మము. సత్యమే యుత్కృష్టతపము. సత్యమే శ్రేష్ఠయజ్ఞము. సత్యమే గొప్ప శాస్త్రము.

సత్యం సుప్తేషు జాగర్తి సత్యంచ పరమం పదం,
సత్యేనైవ ధృతా పృథ్వీ సత్యే సర్వం ప్రతిష్ఠితం. 2

తా. సత్యము నిద్రించువారలలో మేల్కొంచియుండును. సత్యము పరమపదము. సత్యముచేతనే భూమి మోయబడుచున్నది. సమస్తము సత్యమునందే ప్రతిష్ఠితమై యున్నది.

తపోయజ్ఞశ్చ పుణ్యంచ దేవర్షి పితృపూజనే,
ఆపో విద్యాచ తే సర్వే సర్వం సత్యే ప్రతిష్ఠితమ్. 3

తా. తపము, యజ్ఞము, దేవతలను మహర్షులను పితృదేవతలను పూజించుటచే లభించు పుణ్యము, జలము, విద్యయు ఇవి యననేల, సమస్తము సత్యమునందే ప్రతిష్ఠితమై యున్నది.

సత్యం యజ్ఞ స్తపోదానం మన్త్రా దేవీ సరస్వతీ,
బ్రహ్మచర్యం తథా సత్యమోంకార స్సత్యమేవచ. 4

తా. సత్యమే యజ్ఞము, తపము, దానము, మన్త్రములు, సరస్వతి యును; అట్లే సత్యమే బ్రహ్మచర్యము. సత్యమే ఓంకారస్వరూపము.

సత్యేన వాయు రభ్యేతి సత్యేన తపతే రవిః,
సత్యేనాగ్నిర్నిర్దహతి స్వర్గస్సత్యేన తిష్ఠతి. 5

తా. సత్యముచే వాయువు వీచుచున్నది. సత్యముచే సూర్యుడు ప్రకాశించుచున్నాడు. సత్యముచే అగ్ని దహింపగలుగుచున్నది. స్వర్గము సత్యముచేతనే నిలచియున్నది.

పాలనం సర్వవేదానాం సర్వతీర్థావగాహనమ్,
సత్యేన వహతే లోకే సర్వ మాప్నోత్యసంశయమ్. 6

తా. సమస్తవేదములు సత్యముచేతనే పరిపాలింపబడుచున్నవి. సత్యముచే సమస్తతీర్థములలో స్నానముచేసిన ఫలము లభించును. ఇందు సంశయము లేదు.

అశ్వమేధ సహస్రంచ సత్యంచ తులయా ధృతమ్,
లక్షాణి క్రతవశ్చైవ సత్యమేవ విశిష్యతే. 7

తా. ఒకవైపు వెయ్యి అశ్వమేధఫలమును, లక్షలకొలది క్రతువుల ఫలములును, మఱియొకవైపు సత్యమును నునిచి త్రాసులో తూచిన సత్యమే మిగులుగ నుండును.

సత్యేన దేవాః పితరో మానవోరగరాక్షసాః,
ప్రీయంతే సత్యత స్సర్వే లోకాశ్చ సచరాచరాః. 8

తా. సత్యముచే దేవతలు, పితరులు, మానవులు, సర్పములు, రాక్షసులు, సంతోషముగలవారై యున్నారు. సచరాచర భూత జాలము సత్యముచేతనే సంతుష్టమై యున్నది.

సత్యమాహుః పరం ధర్మం సత్యమాహుః పరం పదం,
సత్యమాహుః పరంబ్రహ్మ తస్మాత్సత్యం సదా వదేత్. 9

తా. (పెద్దలు) సత్యమును, పరమధర్మమునుగా వక్కాణింతురు సత్యమును పరమపదమునుగా బలుకుచుందురు. సత్యమును పరబ్రహ్మమునుగా చెప్పుచుందురు. గనుక యెల్లప్పుడు సత్యమే బలుకవలయు.

మునయస్సత్యనిరతా స్తప స్తప్త్వా సుదుశ్చరమ్,
సత్యధర్మగతా స్సిద్ధా స్తత స్స్వర్గంచ తే గతాః. 10
అప్సరో గణసంవిష్టై ర్విమానైః పరిమాతృభిః,
వక్తవ్యంచ సదా సత్యం న సత్యా ద్విద్యతే పరమ్. 11

తా. మునులు సత్యనిరతులై దుస్సాధ్యమగు తపము నాచరించి పిమ్మట సత్యధర్మపరులయ్యె తపస్సిద్ధినొంది అప్సరస సముదాయముచే అధిష్ఠింపబడియుండు తగు విమానములతో స్వర్గపదము నధిగమించిరి. గనుక యెల్లపుడు సత్యమే పలుకవలయు. సత్యమునకన్న ఉత్కృష్టమైనది లేదు.

అగాధే విపులే సిద్ధే సత్యతీర్థే శుచిహ్రదే,
స్నాతవ్యం మనసాయుక్తం స్థానం తత్పరమం స్మృతమ్. 12

తా. అగాధమై, విశాలమై, సిద్ధమై శుచి యనెడి హ్రదము(లోతుగల ప్రదేశము) గల సత్యమనెడి తీర్థమున మనస్సుచే స్నానమాచరింపవలయు. అదియే స్నానయోగ్యమగు ఉత్తమస్థానముగ పేర్కొనబడియున్నది.

ఆత్మార్థేవా పరార్థేవా పుత్రార్థే వాపి మానవాః,
అనృతంయే న భాషంతే తే నరా స్స్వర్గగామినః. 13

తా. తనకైగాని, పరులకొఱకైగాని, పుత్రనిమిత్తమునగాని ఏమానవులు అసత్యమును బలుకరో ఆనరులు స్వర్గమును పొందువారలు.

వేదా యజ్ఞా స్తథా మంత్రా స్సంతి విప్రేషు నిత్యశః,
నోభాంత్యపి హ్యసత్యేషు తస్మాత్సత్యం సమాచరేత్. 14

తా. వేదములు, యజ్ఞములు, అట్లులె మంత్రములు యెల్లపుడు విప్రులలో గలవు. కాని వారలు అసత్యభాషణులైనచో అవి యేవియు ప్రకాశింపజాలవు. గనుక సత్య మాచరింపవలయు.

ఓమ్ తత్ సత్.



# 17. శ్రద్ధాత్రయవిభాగయోగము.

(శ్రీ మలయాళస్వాములవారు)

సత్వ రజస్తమోగుణములు మూడున్ను మానవులయం దెట్లు అణగియున్నవో, అవి యేలాగున ఆత్మను ప్రేరణచేయునో, ఈ మున్నగు విషయములు యీ యధ్యాయమున వివరముగా జెప్పినందుచే దీనికి శ్రద్ధాత్రయవిభాగయోగమని పేరు వచ్చినది. దీనిలో చెప్పిన గుఱుతులను కని పెట్టిన యెవరు యేస్వభావము గలిగియుందురో తెలిసికొనవచ్చును. జన్మాంతరసంస్కారము ననుసరించి అంతఃకరణ మేర్పడియుండును. దాని లోగల జీవుడున్ను ఆలాగుననే ప్రవర్తించును. అయితే జీవులు పూర్వ జన్మసంస్కారము ననుసరించియే ప్రవర్తించుచుండిరని చెప్పినది నిజ మైనచో ప్రవృత్తిమార్గములోనుండు జీవుడు నివృత్తిమార్గములోనికి యెట్లు రాగల్గును? రజస్తమో గుణములుగల మానవులు సత్వగుణము లోనికియెట్లు ప్రవేశింప గల్గుదురను సందేహము సామాన్యులకు కలుగ వచ్చును. సరి. అట్లైన ధర్మముల నుపదేశించెడు వేదశాస్త్రములున్ను, జ్ఞానము నుపదేశించెడు పుణ్యాత్ములున్ను వ్యర్థులై పోవుదురుగదా, యని శంకింపఃబనిలేదు. జీవులయొక్క నైజస్వభావము దైవాంశమగుట చేతను, శుద్ధజ్ఞానస్వరూపమగుటచేతను, సహజముగ ఆనందస్వరూప మగుటచేతను, ప్రతిజీవికి ఉత్తమసుఖము పొందవలెనను తలంపు గలు గుటచేతను, జీవులు చైతన్యస్వరూపులగుటచేతను—త్రోవదప్పిన బాటసారికి మంచిమార్గమును జూపిన ఆతడేలాగున దాని ననుసరించి పోవుచుండునో, లేక మంచి ఆహారము దొరకక ఆకులు అలములు గడ్డలు, కాయలు మొదలైన వానిని తిని జీవించువారికి ఉత్తమ భోజనపద్ధతి యేర్పడిన, వెంటనే యెట్లు మార్చుకొనెదరో ఆలాగున—మార్గము తెలియక సంకటపడు అట్టివారికి ధర్మశాస్త్రమున్ను ధర్మబోధకులున్ను ఉపయోగపడును. ప్రజ్ఞావంతులు తమలోగల రజోగుణ తమోగుణ దోషములను విడచి సత్వగుణములోనికి వచ్చుటకు మార్గ మేర్పడును. రోగులైనవారు రోగశాంతి పొందుటకు ఏలాగున ఆహారమున మార్పు చేసికొని ఆరోగ్యపదార్థములను భుజింతురో, ఆలాగున ప్రాజ్ఞులగు జీవు లున్నూ ఉత్తమగతిని గలుగజేసికొనుటకు అవకాశము గలుగును. కనుక గుణదోషమును తెలిపెడు పవిత్ర శాస్త్రములున్ను, జ్ఞానము

నుపదేశించెడు పుణ్యపురుషులున్న వ్యర్థులు గాజాలరు. ఈ యధ్యాయమును చాలా జాగరూకతతో చదువవలసియుండును. అట్లైనమాత్రమే వారు తమయొక్క స్థితిగతులను తెలిసికొనుటకు సాధ్యపడును. ఇతరుల స్థితిగతులనుకూడ తెలిసికొనుటకు అవకాశము గల్గును. మూడుగుణములని చెప్పినను, మూడుశ్రద్ధలని చెప్పినను అర్థమొక్కటియే. మూడు గుణములనుగురించి 14 వ. అధ్యాయమున చెప్పినందుచే యిచ్చట మూడువిధములగు శ్రద్ధలని చెప్పుటకు కారణమైనది. కావున ముముక్షువులు తమలో గల రాజసతామస శ్రద్ధలను కనిపెట్టి వాటిని రహితమొనర్చి సత్వగుణశ్రద్ధగలిగి వర్తించేలాగున చూడవలెను. దీనితోను తృప్తినొందక శ్రద్ధాత్రయాతీతమగు శుద్ధజ్ఞాన స్వరూపస్థితిలో నిలుకడచేసికొనవలయు. అది యీమూడు విధములగు శ్రద్ధలకంటె విలక్షణము. అది శివము; ఆనందము; అమృతము; శాశ్వతము. అయితే సాత్వికశ్రద్ధ నవలంబించి అచ్చోటకు ప్రయాణముచేసిన మాత్రమే ఆ స్థానములోనికి వెళ్లగలము. ఈమార్గము సుగమము. అచ్చట ప్రకృతులన్నియు ప్రయాణమునకు అనుకూలముగానే యుండును. మార్గము చాలా ప్రసన్నముగాను, ప్రశాంతముగాను ఆనందముగాను నుండును. రజోగుణ తమోగుణములు గలవారి మార్గములు కంటకావృతములు, భయంకరజంతుసంకీర్ణములు. ఎచ్చటయు ప్రతిబంధములే కన్పించును ఒక్కమూరెడు దూరమేగిన మూడుమూరల దూరము క్రిందకు జారి పడిపోవును. మార్గము మహాదుర్గమము. అవరోధములు మెండు. కనుకనే పాపముగలవారు మోక్షమార్గములో ప్రవేశించిన, అనేక పతనములు, సంకటములు, రోగబాధలు మొదలైనవి కలుగుటకు కారణము. ఇవన్నియు ఈశ్వరభక్తిచేతను, పుణ్యకర్మల ఫలముచేతను, పరిశుద్ధ వ్రతములచేతను దాటవలెను. రాజభటులచే నిరోధింపబడిన మార్గముయొక్క పురోభాగమునకు యేలాగున వెళ్లజాలమో, కాని రాజాజ్ఞను సంపాదించినచో యింతకు పూర్వము నిరోధించినవారే యెంతో ఉపకారపరులై మార్గావరోధము తొలగించి ఏలాటి ఆపత్తులను గలుగజేయక సన్మార్గముగుండా తీసికొని పోవుదురో, ఆలాగున ఈశ్వరకృపయొక్క ఫలమునుగూర్చియు నెఱుంగవలెను. ఈశ్వరకృప గల్గినచో అప్పుడు సత్వగుణశ్రద్ధ గలవారు పోనెడు త్రోవలో కలుసుకొనెదరు. అప్పటినుండి

మంటిల కష్టమేమియు నుండదు. పైవారివలె శాంతియు సౌఖ్యమును వారికికూడ లభించును. ఈ యధ్యాయమందీ శ్లోకము ముఖ్యము.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః (17-3)

ఓ యర్జునా! సమస్త ప్రాణులకును వానివాని పూర్వజన్మ సంస్కారములతో గూడిన యంతఃకరణమునకు దగిన శ్రద్ధయే కలుగుచున్నది ఎవఁడెట్టి శ్రద్ధగలవాడో వాడట్టి శ్రద్ధతో గూడినవాడగును.

ఓం తత్ సత్.

# ప్రణవస్వరూపము.

ఓం నమః ప్రణవార్థాయ ప్రణవార్థ విధాయినే,
ప్రణవాక్షర బీజాయ ప్రణవాయ నమోనమః. 1

తస్మాన్మద్ జ్ఞానసిద్ధ్యర్థం మంత్రం ఓంకార నామకం,
ఇతః పరం ప్రజపతాం మామకం మానభంజనం. 2

ఉపాదిశం నిజం మంత్రం ఓంకారం ఉరుమంగళం,
ఓంకారో మన్ముఖాత్ జజ్ఞే ప్రథమం మత్ప్రబోధకః. 3

వాచకోఽయమహం వాచ్యో మంత్రోఽయం హి మదాత్మకః,
తదనుస్మరణం నిత్యం మమానుస్మరణం భవేత్. 4

అకార ఉత్తరాత్ పూర్వ ముకారః పశ్చిమాననాత్,
మకారో దక్షిణ ముఖాత్ బిందుః ప్రాఙ్ముఖతస్తథా. 5

నాదో మధ్యముఖా దేవం పంచధాఽసౌ విజృంభితః,
ఏకీభూతః పునస్తద్వత్ ఓమిత్యేకాక్షరోఽభవత్. 6

నామరూపాత్మకం సర్వం వేదభూత కులద్వయం,
వ్యాప్త మేతేన మంత్రేణ శివశక్త్యోశ్చ బోధకః. 7

అస్మాత్ ప చాక్షరం జజ్ఞే బోధకం సకలస్య తత్,
అకారాది క్రమేణైవ నకారాది యథాక్రమమ్. 8

అస్మాత్ పంచాక్షరాజ్జాతా మాతృకాః పంచభేదతః,
తస్మాచ్ఛిర శ్చతుర్వక్త్రాత్ త్రిపాద్గాయత్రి రేవ హి. 9

వేదాః సర్వే స్తతో జజ్ఞే తతో వై మంత్రకోటయః,
తత్ర స్మంత్రేణ తత్సిద్ధిః సర్వసిద్ధి రితో భవేత్. 10
అనేన మంత్రకందేన భోగో మోక్షశ్చ సిద్ధ్యతి,
సకలా మంత్రరాజానః సాక్షాద్భోగప్రదాః శుభాః. 11

ఇతి శ్రీ శివపురాణే, విద్యేశ్వర సంహితాయాం, నవమోఽధ్యాయః.

1. ప్రణవార్థము నెఱింగించు ప్రణవార్థస్వరూపుడగు పరమేశ్వరుని కొఱకు నమస్కారము. ప్రణవాక్షర బీజమగు ప్రణవము కొఱకు నమస్కారము.

2. గనుక నన్ను తెలిసికొనగోరుదురేని ఓంకారమను పేరు గలిగి నన్ను బోధించునదియు, చిత్తచాంచల్యమును తొలగించునదియు నగు యీ ప్రణవరూపదివ్య మంత్రమును ఇకమీదట జపము సలుపుడు.

3. మిక్కిలి మంగళప్రదమై, నన్నెఱింగించు ఓంకారమను దివ్య మంత్రము నుపదేశించితిని. ఓంకారము నా ముఖమునుండి ప్రథమమున జనించినది. అయ్యది నన్ను బోధించును.

4. ప్రణవము వాచకము. నేను వాచ్యుడను. గాన నీ మంత్రము నా స్వరూపము. దాని నెల్లపుడు స్మరించువారు నన్ను స్మరించినటులే యగును.

5, 6. మొదట ఉత్తరముఖమునుండి అకారమును, పశ్చిమ ముఖమునుండి ఉకారమును, దక్షిణముఖమునుండి మకారమును, అట్టులే తూర్పుముఖమునుండి బిందువును, ఆలాగున మధ్యముఖము నుండి నాదమును ఇట్లు ఐదు విధముల యీ ప్రణవ మావిర్భవించి యుండెను. పిమ్మట ఆ ఐదునుచేరి "ఓమ్" అను యేకాక్షరస్వరూప మాయెను.

7. నామరూపాత్మకమగు యీ ప్రపంచమున్ను, సమస్త వేదములును, సమస్తభూతములును, యీ ప్రణవమంత్రముచే వ్యాప్తములై యున్నవి. ఇయ్యది ప్రకృతి పరమాత్మల (శివశక్తుల) బోధించును.

8. ఈ ప్రణవమునుండియే పంచాక్షరి పుట్టెను. అయ్యది అకారము మొదలు నాదము వఱకు గల ఐదింటిని నకారము మొదలు యకారము దనుక గల వర్ణములచే బోధించును. అనగ ప్రణవ పంచాక్షరులు యేకస్వరూపము లనుట.

9. యీ పంచాక్షరినుండినే అయిదు మాతృకలు ఉద్భవించెను. దానినుండియే, ప్రణవశిరస్సున్ను పుట్టెను. ఈశ్వరుని నాల్గవ ముఖము నుండి మూడు పాదములతో గూడిన గాయత్రి యావిర్భవించెను.

10. దానినుండియే సమస్త వేదము లావిర్భవించెను. అద్దాని నుండియే కోట్లకొలది మంత్రము లుద్భవించెను. ఆయా మంత్రముచే ఆయాసిద్ధిమాత్రము లభించును. ఆ సిద్ధులన్నియు యీప్రణవ మొక్క దానిచేతనే లభించును.

11. ఈ మంత్రమువలన ఐశ్వర్యము, మోక్షము సిద్ధించును. సకల మంత్రరాజములు ప్రత్యక్షముగ సకలసౌఖ్యముల నొసగును. మంగళకరములు నగును.

ఇది శ్రీ శివమహాపురాణమున విద్యేశ్వర సంహిత యందలి తొమ్మిదవ అధ్యాయము.

ఓమ్ తత్ సత్



# శ్రీ పరబ్రహ్మోపాసన.

త్రయోదశ మార్గములు.

(10-వ. సంచిక 398 పుట శేషము)

## 11. చెలికాడు చెలికానియందు చూపు చెలిమివలె.

చెలికాని భావము శ్రేష్ఠమైనది. గోపాలుర గుఱించి గోవ త్సము దాచిన ఘట్టమున బ్రహ్మదేవుడు "ఈవ్రేలందొక్కని పాదరేణు లు పై ప్రేష్ఠినంజాలదే" అని స్తుతించిన పరమశ్రేష్ఠమార్గమిది. ఇంకను, ము. నిను హింసించిన పూతనాదులకు ముక్తినీమేటి సంకేతమి చ్చిన నీకుగ బురదారపుత్రగృహగోశ్రీప్రాణ దేహాదులె ల్లను వంచింపక యిచ్చుగోపకులకుగ లక్షింపనే మిచ్చెదో యని సందేహము దోచుచున్నది ప్రపన్నా నీకరక్షామణీ,

అనికూడా ఆపదవిని బ్రహ్మదేవుడే నిశ్చయింపజాలక సందేహమును పొందినట్లును కలదు.

పూర్వము ఒక దిక్కులేని బ్రాహ్మణవిద్యార్థి యుండెను. ఆయన తెలియని బాలుడు. వాని తల్లి కొంత దూరమున గల పాఠశాలకు పంపుటకై, మీ అన్న గొల్లకృష్ణన్న నీవు పోవు మార్గమున వనములో యున్నాడు. నీవు పిలిచినంతనే తోడువచ్చునని పుత్రుని ఊరించుటకు చెప్పినంత మాత్రమున, ఆ యమాయక బాలుడు నమ్మి దారిలో తనకు భయముగల వనసమీపమునకు పోయి పరిశుద్ధభావముతో "గొల్లకృష్ణన్నా" యని పిలువగానే పరబ్రహ్మమే సౌందర్యమగు ఆకారమున తన చెలికానివలె ప్రత్యక్షమై తోడు వచ్చుచుండెను. ఆవనములో వచ్చునప్పుడును పోవునప్పుడును కొంతసేపు ఆటలాడుదురు. ఆ మాయాబాలుడు తోడువెళ్లి పాఠశాలకు పంపేవారు. తన అన్న యెక్కడనుండి వచ్చుచున్నారు, యెక్కడికి వెళ్లుదురు, తన కెట్లు అన్న అయినారు, అని మన అమాయక బాలునికి తెలిసేది కాదు. లోకాలోకములకు తన మాయచేత భ్రమగలిగించి ఆడించు పరబ్రహ్మసంకల్పమగు యీ వైష్ణవ మాయను యీ బాలు డేమెఱుగు? గాన ఆస్మరణగలిగేది లేదు. ఇట్లుండ యొకనాడు ఉపాధ్యాయుల యింట్లో యేదో విశేషకార్యము జరుగుచుండెను. తోడిబాలురందు బహువిధములైన పదార్థముల తెచ్చి యిచ్చుచుండిరి. అది చూచి యీ పేద విద్యార్థి గురువులవారి కేదైన యివ్వమని తల్లిని కోరెను. ఆమె దరిద్రదేవితో కలసి కాపురము చేయు మహానియ్యగాన వేఱేమార్గములేక మీ యన్నయ్య నడుగు పొమ్మని చెప్పెను. ఆరోజున్ను యథాప్రకారము పిలువ, అన్నగారు దర్శనమిచ్చిరి. కారణము తెలిపి గురువులవారి కేదైన యివ్వమని కోరెను. ఆమాయా చెలికాడు ఒక మట్టి పాత్ర (ముంతే) నిండ పెరుగు నిచ్చి పంపెను. గురుస్థానమునకు తెచ్చినవారి పదార్థములలో యిది గణన కెక్కునదిగాదు. గాన యెవ్వరును దానియందు శ్రద్ధవహించి లోనికి తీసికొనిపోలేదు. తుదకు యెవ్వరో యొకరు ఆముంతను అక్కడయుండు పెరుగు బాండువలో గ్రుమ్మరించిరి. ఎత్తి చూడ, యెప్పటియంత పెరుగు తిరిగి యుండెను. మఱల యందులో పోసెను; గాని యెప్పటివలె అక్షయమై యుండెను. ఆ పెద్ద బాండువ నిండి

నయీామట్టి పాత్ర అక్షయమే, అయి యుండెను. గురువులవారు దానికి కారణమడిగి మీా అన్నయ్యను నాకు చూపమని తొందరపెట్టగా యీా బాలుడు అట్లే యని వనసమీాపమునకు రమ్మని పోయి యథా ప్రకారము యన్నను పిలిచెను; గాని కనబడలేదు. అరచెను. ఏడవ నారంభించెను. అప్పుడు దైవవాక్కు యిట్లు వినబడెను. "తమ్ముడా! అందఱు మానవులు నీవంటివారు గారు. అందఱు తల్లులు మన తల్లివంటివారు గారు. గాన నేను యెల్లరికి మీావలె గోచరించను. వారి పరిపక్వస్థితిని బట్టి దర్శన మిచ్చుచుందును. ఊరడిల్లుము" యని చెప్పెను. అప్పుడు యుపాధ్యాయులు ఆ బాలుని వూరార్చి పిలుచుకొని పోయెను. దేవతలు స్వర్గభోగముల నొల్లక భూమియందు గోపాలురై జన్మించి పరాత్పరుని సేవించి కర్మబంధ నివృత్తి పొందినట్లు భాగవతమున గలదు. బలభద్రుడే యొకచోట యీా గోపాలురు వేల్పుల యంశంబున జన్మించిరని తెలిపి యున్నారు. గాన సిది మహాసంస్కారపరులకు దొంకు గొప్ప పదవియై యున్నది.

---

## గోపకుమారులు.

(భాగ-దశ-పూర్వభాగము)

సీ. అలసినచోఁ గొంద ఱతిమోదమున వీఁపు
 లెక్కించుకొనిపోదు రేపు మెఱసి
సొలసి నిద్రించినచో నూరుతల్పంబు
 లిడుదురు కొండఱు హితవు గలిగి
చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద
 ఱొయ్యన విసరుదు రుత్సహించి
దవ్వేఁగి నిలుచుచోఁ దడయక గొందఱు
 పదములొత్తుదురతి బాంధవమున
ఆ. గోపవరులు మఱియుఁ గొందఱు గొందఱు
 మాధవునకుఁ బెక్కుమార్గములను
బనులు సేసి రెల్ల భవములఁ జేసిన
 పాపసంచయములు భస్మములుగ. 611

క. వనజాక్షుఁడు మున్నరిగిన
మునుపడనే నేనెయతని ముట్టెదననుచుం
జనిమును ముట్టనివానిన్
మునుముట్టినవాఁడు నవ్వె మొనసి నరేంద్రా. 460

(శ్రీ శుకమహర్షుల వారు)

ఉ. ఎన్నఁడునైన యోగి విభులెవ్వని పాదపరాగ మింతయుం
గన్నులఁగానరట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁ బట్టుచుం
దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైపడి గూడియాడుచున్
మన్ననసేయు వల్లవకుమారుల భాగ్యము లింతయొప్పునే. 462

క. విందులకు బ్రహ్మసుఖా
నందంబై భక్తగణమునకు దైవతమై
మందులకు బాలుఁడగుహరి
పొందుఁగనిరి గొల్లలిట్టి పుణ్యులు గలరే. 463

(బ్రహ్మదేవుడు)

శా. ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలో గృష్ణయం
చాలాపాది సమస్తభావములు నీయందే సమర్పించు నీ
వ్రేలందొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే. 574

(సశేషము)

---

# శ్రీ వివేకానంద లేఖావళి.

(అనువాదకులు—శ్రీ తత్త్వానందస్వాములవారు)

(మాతృక వంగభాషలో నున్నది)

రోజ్ బ్యాంకు డార్జిలింగు
వర్ధమాన మహారాజాగారినగరు.

ఓం తత్ సత్

భారతీపత్రికా సంపాదకురాలికి ! 6-4-1897.

పూజ్యజననీ!

మీరు పంపిన "భారతీ" సంచికకై కృతజ్ఞుడను. నే నేయుద్యమ మునుగుఱించి నా యల్పజీవితమును అర్పణము చేసియుంటినో, అయ్యది

నము:బోలు ఉత్తమప్రజ్ఞావంతురాం(డ అభినందనముల నందగలుగుట చేత ధన్యుడనుగ భావించుకొనుచున్నాడను.

ఈ జీవనసంగ్రామమునందు, సవ్యభావప్రకటనను ప్రోత్సహించు పురుషులు అరుదు; అట్లుండ అట్టిహానికి ప్రోత్సాహమునుగూర్చు స్త్రీల మాట, అందునను ముఖ్యముగ మన దౌర్భాగ్యపు దేశమున, చెప్ప నేల? ఆకారణమువలన, భారతదేశమందలి పురుషులందఱును ఉచ్చైస్స్వరముతోచేయు స్తోత్రములకన్న, విద్యాసంపన్నయగు నొక వంగరాష్ట్ర నారీరత్నముయొక్క ఆమోదము మిగుల విలువగలది యగును.

మీవంటి నారీమణులు అనేకు లీదేశమున జన్మించి, మాతృదేశా భ్యుదయమునకై తమ జీవితముల నర్పణము గావించునటుల సర్వేశ్వ రుడు అనుగ్రహించుగాక! భారతీపత్రికలో నన్ను గుఱించి మీరు వ్రాసిన వ్యాసము సందర్భమున, నేను కొంత చెప్పవలసియున్నది. అదేమన, భారతదేశపు మేలుకొఱకే పాశ్చాత్యభూమియందు మతబోధలు ఇప్పుడు చేయబడుటయు, భావికాలమున చేయబడనుండుటయును! పాశ్చాత్యప్రజలు మనకు తోడ్పడినగాని మనము ఉన్నతికి రాజాలమని నా గట్టి నమ్మకమై యున్నది. యోగ్యతను గుఱుతించుట యనునది ఈ దేశమునం దింకను కానవచ్చుటలేదు; ధన సాహాయ్యమా అసలే సున్న. అన్నిటికంటె అధ్వానవిషయ మేమన, మనకు కార్యశూరత శూన్యము.

నిర్వహింపవలసిన విషయములు చాలగ నున్నవి; కాని సాధన సంపత్తి ఈదేశమున సున్నగనున్నది. మనకు మెదడున్నది; కాని చేతులు లేవు. మనకు దివ్యమగు వేదాంతసిద్ధాంత మున్నది. కాని దానిని ఆచర ణలోపెట్టు సమర్థత మనలేదు. మన గ్రంథములందు సార్వజనీనమగు సమత్వ సిద్ధాంతము కలదు; కాని నడతలంతయు అన్నియు విభేదములే! అత్యుత్తమమగు స్వార్థరహిత నిష్కామకర్మము బోధింపబడినది ఈమన భారతదేశములోనే. కాని ప్రవర్తనమునందు మనము మహాక్రూరు లమై వర్తించుచున్నారము. హృదయ మనునది మచ్చునకైన కాన రాదు.—మాంసమయదేహములఁదాటి, దేనినేని విచారించుటకైనను మనము సమర్థులము కాకున్నారము!

అయినను ప్రస్తుతపు పరిస్థితుల ననుసరించియు పనులసాగించుట

సాధ్యమే యగును. వేఱుమార్గము లేదు. మంచిచెడ్డలు విచారణచేయు శక్తి ప్రతివానికిని గలదు. కాని దోషములు, దుఃఖములు, మోహములు మున్నగువానితో నిండియున్న సంసారతరంగిణిలో చిక్కియుండియు, ధైర్యము వహించి ఒక చేతితో కన్నీటిని తుడుచుకొనుచును జంకుపడక, రెండవచేతితో ముక్తిమార్గమునుచూపు పురుషవరేణ్యుడే నిజమగు వీరుడు! ఒకవైపున నిర్జీవమై కదలికలేని రాతిగుట్టవలె పూర్వాచారబద్ధమై సంఘమున్నది; రెండవపక్షమున ఓర్పుగాని, శాంతముగాని లేక నిప్పులుగ్రక్కు సంస్కర్త కలడు. ఈయుభయులకు మధ్యముగానున్నది క్షేమమగు మార్గము! నేను జపానులో నుండగా, ఆ దేశపుబాలికలు, తాము హృదయపూర్వకముగ ప్రేమించునెడల తమ యాటబొమ్మలు సజీవములు కాగలవని నమ్ముదురని విన్నాను. జపానుబాలిక తన బొమ్మనెన్నడును విరుగగొట్టుకొనదట. ఓ భాగ్యశాలినీ! లక్ష్మీకటాక్షములకు దూరులై, ఐశ్వర్యముల గోల్పోయి, పూర్తిగ వివేకభ్రష్టులై, అణగద్రొక్కబడి, సంతతక్షుదార్తులై, కలహప్రియులును, మత్సరగ్రస్తులునై అగచాట్లుబడుచున్న ఈ దేశప్రజలను ఎవరేని పూర్ణహృదయముతో ప్రేమించునెడల, భారతభూమి మఱల ప్రబోధము గాంచ గలదని నేనుగూడ నమ్ముచున్నాను. ఉదారచిత్తులగు స్త్రీ పురుషులు వందలకొలఁదిగ ముందునకు వచ్చి, తమ జీవితభోగవిలాసలాలసలను త్యాగముచేసి, అజ్ఞానదారిద్ర్యము లనెడు సుడిగుండములో బడిపోయి, ఇంకను ఇంకను అధఃపతితులగుచు కోట్లాదిగనున్న తమ దేశప్రజలను నుద్ధరించు నిమిత్తము తీవ్రసంకల్పులై తమ శక్తికొలంది పాటుపడుదురేని, అప్పుడు మాత్రమే ఈ భారతభూమి మేల్కొనగలదు. నా స్వల్ప జీవితములో సయితము, సత్సంకల్పములు, నిష్కాపట్యము, అఖండ ప్రేమయు జగత్తునంతను జయింపగలవను అనుభవము నాకు గల్గినది. ఇట్టి కల్యాణగుణములుగల ఒక్క పురుషుడు గలడేని, కోట్లకొలంది కపటాత్ములయొక్కయు, మృగప్రాయులయొక్కయు, ఘాతుక కుతంత్రములను సయితము విచ్ఛిన్నము చేసివేయజాలును.

నేను మఱల పశ్చిమఖండములకేగుట ఇంకను నిశ్చయము కాలేదు; నేను వెళ్లుదునేని, అదియు భారతదేశ ప్రయోజనముకొఱకే యగును. తెలిసికొనుడు. ఈదేశమునందు ప్రజాబలమెక్కడ? ధనబలమెక్కడ?

పాశ్చాత్యులలో చాలమంది స్త్రీలును పురుషులును, హైందవసంప్రదాయముల ననుసరించి, హిందూమతము ద్వారమున నే, కడజాతి చండాలునకు సైతము సేవలొనరించుచు, ఈ భారతదేశమునకు ఉపకారము చేయ సంసిద్ధముగ నున్నారు. అటువంటివారు ఈ దేశములో ఎంతమంది కలరు? ధనసాహాయ్యమెక్కడ? నాకు స్వాగతమర్పించినందులకైన ఖర్చులను పూడ్చుకొను నిమిత్తము, ఈ కలకత్తావారు నాచేత నొక ఉపన్యాసమిప్పించి టిక్కెట్లు అమ్ముకొన్నారు! అందులకై నేనెవరినని ఆక్షేపించుటగాని, దూషించుటగాని లేదు; పాశ్చాత్యదేశములనుండి మనుష్యులును ధనమును వచ్చినగాని, మనకు తరణోపాయము లేదని మాత్రము తెలుపగోరుచున్నాను.

సంతత కృతజ్ఞతాబద్ధుడనై, మీ క్షేమముకొఅకై సర్వేశ్వరుని ప్రార్థించు

వివేకానందుడ.

---

# జీవిత లక్ష్యము.

(గ్రంథకర్తలు—శ్రీమతుకూమల్లి వెంకటలక్ష్మీ నరసింహారావు గారు.
శ్రీరామకృష్ణ వివేకానంద సందేశ ప్రచారకులు.
ప్రకాశకులు—శ్రీ ఈదర వెంకట్రావు పంతులుగారు.
ప్రొప్రైటర్, వెంకట్రామా అండు కో., హెడ్ ఆఫీసు, ఏలూరు)
(10.వ సంచిక 460 పుట శేషము.)

ప్రయాణమొనర్చి, ఆకాశమున నక్షత్రజాలము మిణుకు మిణుకుమని ప్రకాశించుచుండ వారొక భవనమునుఁ జేరిరి. గృహయజమాని వారల నాదరించి అర్ఘ్యపాద్యాదులొసంగి, కుశల ప్రశ్నల నడిగి, ఉచిత రీతిని గౌరవించె. వారందరు కలసి భగవత్ప్రార్థనసల్పి విందారగించి పాన్పులపై జేరి నిద్రించిరి. ఉదయమున వీరు నిత్యకృత్యముల తీర్చుకొని గృహమేధి యొసంగిన అల్పాహారము నారగించి, శెలవు గైకొని బయల్వెడలిరి. ఈ లోపుననే మన యువకుడు తొట్టెలో నిద్రించుచున్న శిశువు కంఠము పిసికి చంపి వృద్ధునివెంట వచ్చెను. యజమానిచే ప్రేరేపింపబడి

నౌకరి నారలను కొంత దూరము పంపుటకు వారితోడ నడచెను. వారు ముగ్వురు మార్గమధ్యమున వంతెనపై నడచుచుండ యువకుడు నౌకరిని నదిలోనికి ద్రోసెను. ఇదంతయు పరికించి వృద్ధుడు చీకాకుఁజెంది ప్రపంచమున ధర్మము నశించినదనియు, సృష్టి స్థితి లయములకు హేతుభూతుడగు పరాత్పరుడు లేడనియు, ఉన్నచో నిట్టి విపరీత పరిస్థితు లుండవనియు నిశ్చయించుకొనియె. అంతయు తారుమారైనది; మనస్సు కలవరము జెందినది; విషాదమను తుపానుచే నావరింపబడి వృద్ధుడు వడకుచు కూలబడియె; యువకుడు నూతన కాంతులతో దేవదూతవలె వృద్ధుని యెదుట ప్రకాశించినాడట; వృద్ధుడు వానికి నమస్కరించి, మహనీయుని యీ సృష్టియందలి విపరీతములు తెనకర్థమగునటుల బోధింపుమని వేడుకొనియె.

" నాకృత్యములు మానవకోటి కర్థములు గావు; నీకవన్నియు విచారమును గలిగించినవి; నాసృష్టిరహస్యమును వినుము " అని యువకుడు చెప్పదొడంగె. మనము వచ్చుచుండగా, మొదట ఆతిథ్య మొసంగినవాని బంగారు పాత్ర తస్కరించితిని. కారణము తెలియునా? ఈతడు యథార్థముగ ఆతిథ్య మివ్వవలెనను బుద్ధిచే ప్రేరేపింపబడక తనయొక్క పేరుప్రఖ్యాతులు ప్రపంచముచే కొనియాడబడవలెనని వెండి బంగారు పాత్రలలో భక్ష్యభోజ్యాదుల నొసంగెడువాడు; ఒకని మంచి చెడ్డలు నిర్ధారణ చేయవలెనన్న ఆతనిబుద్ధి పరీక్షించవలె. మన కాతిథ్య మొసంగినవాడు అహంభావముతో పాటు పొగడ్త నపేక్షించినాడు; నే నతని బంగారుపాత్ర తస్కరించితిని. రేపటినుండి ఆతడు వెండి బంగారు పాత్రలకు మారు సామాన్యమైన పాత్రలలోనే అన్నపానీయముల నొసంగు; అతని కాబుద్ధి గరపుటకే నే నీపని జేసితిని; యెటులైన అతనికి మంచిబుద్ధి గలదు. అహంభావము పోయిన ఆ మంచి మఱింత వికసింపగలదు. రెండవ మజిలీలో బార్లీ జావ పోసినవానియింట, తస్కరించిన బంగారు పాత్ర నుంచితిని. కారణమేమై యుండునో ఊహింపగలవా? ఈతడాతిథ్య మిచ్చుటయే యెఱుంగడు. మనకే అది మొదటిసారి లభించినది. ఇచ్చట బంగారుపాత్ర నేల నుంచితి ననగా: యీతడొకింత ఆతిథ్యమిచ్చినంతనే, భగవంతుడు మనకు బంగారుపాత్ర నిచ్చినాడుగదా! మనమింక యెక్కుడుగ ఆతిథ్యమిచ్చుచో, మన కెక్కువ మేలు చేకూరగలదను విశ్వాసము దృఢీకృతమగుటకే రేపటినుండి బార్లీజావతో పాటు

గొంచెము భోజనపదార్థములుగూడ నొసంగు. మూడవగృహమున, భక్తుడగు యజమాని, మనల నాదరించి, భోజనాదుల నొసంగి సత్కరించినాడు; వాని బిడ్డను నేను గొంతుపిసికి చంపినప్పుడు నీ మానసికము జెందిన క్షోభ నేను గ్రహించితిని. ఈ యజమాని చాలాకాలము నుండి భగవద్భక్తితో కాలము గడుపుచుండె. కాని పుత్రోత్సవమైనంతనే, దారేషణ, ధనేషణ, పుత్రేషణలలోబడి, దారాపుత్రాదులు స్థిరమని నమ్మి, భక్తిసుఖమును గోల్పోయినాడు; యింకను గోల్పోవుచున్నాడు; ఇప్పుడీపుత్రుడు గతించిన కారణముచే, ప్రపంచవిషయములశాశ్వతములని నమ్మి, గోల్పోయిన భగవద్భక్తిని మరల పొంది, భక్తాగ్రేసరుడు కాగలడు. మరియు భక్తి పరీక్షించవలెనన్న కష్ట సమయములో గదా దాని నిగ్గుతేలునది ఇక వీని కొఱకు బాలుని యెందుకు జంపవలెనని ప్రశ్నింపవచ్చును. ఆబాలుడు తనకర్మ ననుసరించి యీ యజమానునికి శిశువైనాడు. ఈకర్మ రహస్యము తరువాత విచారింతము. ఇక యజమానుడు పంపిన నౌకరిని కాలవలో ద్రోసితిని. అప్పుడు నీమానసికము జెందిన సంక్షోభము నే నెఱుంగుదును. ఈనౌకరి యీనాటి రాత్రి యజమానియింటిలో సమస్తము తస్కరింపనున్నాడు; ఆపని జరుగకుండ యజమాని భక్తికి లోపము జరుగకుండుటకై నదిలో ద్రోసితిని. ఆనౌకరి తన కర్మ ననుసరించియే ఆగతిని పొందె. ఇది నాకృత్యముల రహస్యము; ఇదియే కర్మయొక్క హృదయము. బాహ్యవిషయములబట్టి, నాకృత్యములు మానవులు గ్రహింపలేరు. తెలియనప్పుడు చికాకుజెంది భగవంతుని నిరసింపగూడదు. నాస్తికులు కాగూడదు. నేర్చుకొనవలసిన గుణపాఠమేమన (Confess the Almighty just, and where you cannot unriddle learn to trust) భగవంతుడు న్యాయమూర్తియని నమ్ముము. భౌతిక విషయములలో జొచ్చి హృదయ పరీక్షజేసి, సత్యము తెలుసుకొనలేనప్పుడు భగవంతునియందు విశ్వాసము గోల్పోవద్దు. నమ్మినవారికి చెరుపులేదు. ఇదియే సమస్తమానవకోటి నేర్చుకొనవలసిన విషయము. నాపనులు మానవకోటి కర్థములుగావు; కర్మసూక్ష్మములు తెలియబడవు. "గహనాకర్మణోగతిః" అని వేదాంతము గూడ జెప్పుచున్నదిగదా! కర్మ విషయములు తెలుసుకొనుట కష్టము. ఈకర్మ మానవకోటిని బండిలాగు యెద్దుల కాళ్ళవెంట చక్రము వచ్చు

రీతి అనుకరించు; భారతము బోధించునట్లు, ఒక ఆవులమందలో నొక లేగను వదలిన దాని తల్లి చెంతకే అది పోవును. బాహుళ్యమైన ఆవుల సముదాయము దానిని భ్రమింపజేయదు; అటులనే అనంతమై, బాహుళ్యమైన నామరూపాత్మకమైన జగత్తునందు, యెవనికర్మ వానినే అనుకరించు; ఇందేమియు పొరపాటు జరుగదు; యెవనికర్మకు వాడే బాధ్యుడు; భగవంతునికి సృష్టియందలి జీవరాసులన్నియు సమానమే. పరాత్పరునకు హెచ్చుతగ్గులు లేవు; ఆతడు న్యాయమూర్తివంటివాడు; జీవులన్నిటియందాతడు సమానముగ ప్రవర్తించు; భగవంతుని న్యాయము వర్ణనాతీతము; ఈ ప్రపంచమున కర్మకు మించిన అదృష్టము వేఱులేదు. కర్మకు వ్యతిరేకముగ నేదియు నాకస్మికముగ రాదు. ప్రపంచమంతయు గణితశాస్త్ర చట్టములచేతనే బంధింపబడియున్నది. రెండు రెండు కలిపిన యే పరిస్థితులలోను అయిదు గాదు; యీ గణితశాస్త్ర న్యాయమే విశ్వమర్యాద గూడ, అని (Waltair) ఫ్రెంచి పండితుడు వచించియుండె. ప్రతివారును జననకాలమును తెలుసుకొనుచుందురు. ప్రపంచమంతయు గ్రహములచేతనే పరిపాలింపబడుచున్నది. ఈ గ్రహవీక్షణమును బట్టియే మనకు మంచిచెడ్డలు గలుగుచున్నవి. ఉచ్చనీచదశలు ప్రాప్తించుచున్నవి. ఆరోగ్యములు చేకూరుచున్నవి; గ్రహవీక్షణ తప్పించుకొనుట శక్యముగానేరదు. ఈ గ్రహములు పరాత్పరుడే సృజించినాడు; కర్మానుసారము జీవులు గ్రహములచే పరిపాలింపబడు విశ్వమున జన్మించుచున్నారు. (Newton) తత్త్వవేత్త యేమి వచించినాడు? ఒకరాయి పైకి విసరిన క్రిందపడును. ఎందుచేత? సామాన్యులకది తెలియదు; శాస్త్రపరిజ్ఞానము గలవారికి, భూమియొక్క ఆకర్షణశక్తియే విసరినరాయి నేలమీద బడుటకు కారణమని తెలియును. కాని మన మొకరాతిని ఆకర్షణశక్తి దాటి పైకి విసరగలిగినచో, అది క్రిందపడదట; దాని గమనము ఊర్ధ్వగమనమట. అటులనే అహంమమేతీడి అవస్థాత్రయాతీతులై, భగవద్ధ్యాన నిమగ్నులైన మహనీయులు ఆగామి సంచితములకు దూరులగుదురు. ప్రారబ్ధము దేహసంబంధముగ వచ్చినను, వారల సంక్షోభము పొందింపలేదు.

ప్రజ :— ఓభగవంతులారా! ప్రకాశత మణ్యాదులందును, చక్షురాదులందును నుండగా ఒకచోట ఇతర ప్రకాశాపేక్ష, ఒకచోట ఇతర ప్రకాశాపేక్షలేకుం టయుండు హేతువేమి? సనకాదులు — ఓ శిష్యులారా! ప్రకాశ :పదార్థములందు ఏదేది పరిచ్ఛిన్నమో అదియది ప్రకాశ్యము; ఏదేది వ్యాపకమో అదియది ప్రకాశము. మణి ప్రకాశముకన్న దీప ప్రకాశము వ్యాపకము, అందువలన అచ్చట మణిప్రకా శ్యము, దీపము ప్రకాశకము వ్యాపకమైన ప్రకాశ లక్షణముగలవాడు కూటస్థుడే యగును. అందువలన నేను కూటస్థుడనే. సర్వమునకున్ను ప్రకాశకుడను; ఇట్లు చెప్పటచేత నాకన్నభిన్నమైన బుద్ధ్యాదులు నాకన్న పరిచ్ఛిన్నములగుటవలన నాప్రకా శముచే ప్రకాశ్యములగుచున్నవి. బుద్ధ్యపేక్షచే సూర్యాదులున్ను, ఘటపటాది జగ త్తున్ను ప్రకాశ్యము గాను, బుద్ధి సత్వగుణకార్యమగుటవలన హిరణ్యగర్భుని యుపాధి యగుటవలనను, వ్యాపకముగనుండినను, ఆత్మబుద్ధికన్నను అధిక వ్యాపకమగుటవలన ఆత్మాపేక్షచే బుద్ధి ప్రకాశ్యమే. ఇపుడు అద్వితీయాత్మ సిద్ధికొరకు ప్రపంచ మిథ్యా త్వ నిరూపణము గావింపబడుచున్నది. రజ్జువందు సర్పమువలె పరమాత్మయైన నా యందు దేశకాల నామరూపక్రియలచే యుక్తమైన ఈసంపూర్ణ జగత్తు కల్పితముగాను పరమాత్మయగు నేనే సర్వత్ర వ్యాపకముగాను నున్నాను. నాకన్న వేరైన ఏయొక వస్తువున్ను లేదు.

ప్రజ :— ఓమునీశ్వరులారా! జగత్తు ఆత్మ, వీనియొక్క పరస్పర భేదములేద నగా లేదుగాని, యెట్లు ఘటమందు వర్తించినవైన రూపాదిగుణములు ఘటముకన్న భిన్నములైయున్నవో అట్లు సచ్చిదానంద ధర్మములచే ఆత్మ వేఱని యెందుకు చెప్ప గూడదు? అట్లనినపుడు ఆత్మయందు వస్తుపరిచ్ఛేదము సిద్ధమేగదా. సనకాదులు:— సచ్చిదానంద ధర్మములు ఆత్మయైన నాకంటె భిన్నములైన పక్షమందు ఆ ధర్మములు సేమ స్వరూపముతోనే రహితములగును. ఎందుకనగా, నేను వ్యాపకుడను, నాకన్న భిన్నమైన పక్షమందు ఆనందము వస్తుపరిచ్ఛేదము కలదగును. శ్రుతియందు వ్యాపక మునకే ఆనందరూపమని చెప్పుటవలన పరిచ్ఛిన్నపదార్థము ఆనందరూపముకాదు. అట్లే సత్తుకన్న వేరైనది అసద్రూపమగును. అట్లు చిత్తుకన్న వేరైనది అచిత్, అనగా జడరూపమగును. అందువలన సత్తు, చిత్తు, ఆనందములు ఆత్మస్వరూపములేకాని వేఱుకావు. ప్రజ :— ఓ భగవంతులారా! సచ్చిదానంద ధర్మములతో యభిన్నమనిన పక్షమందు ఆ సచ్చిదానందములు ఆత్మధర్మములను ప్రయోగమున్ను ఘటిల్లదు. పరస్పరభిన్నవస్తువులకే ధర్మ ధర్మిభావము లోకమందు ప్రసిద్ధము.

సనకాదులు :— ఓ శిష్యులారా ! అత్యంత భిన్నములకును, అత్యంతా

భిన్నములకును, ధర్మధర్మిభావము ఘటిల్లదు. చూడుము — అత్యంతాభిన్నమునకు ఘటించిన పక్షమందు అత్యంతభిన్నమైన గోవునకు అశ్వధర్మము కావలయును. అట్ల గుటలేదు. అట్లే అత్యంతాభిన్నమున కగుననిన, అత్యంతాభేదముగల ఘటమునకు కలశధర్మముకావలయును. అట్లగుటలేదు. పరస్పర భిన్నమై పరస్పరాభిన్నస్థలమందు ధర్మధర్మి వ్యవహారమగును.

ప్రజ: —ఓ భగవంతులారా! ఒకే అధికరణమందు ఒకేవస్తువుయొక్క భేదము మఱియు అభేదము విరుద్ధము. సనకాదులు — ఏకసత్తగలభేదమునకును, అభేదమునకును విరోధమగునుగాని, భిన్నసత్తగల భేదాభేదములకు విరోధముకాదు. అట్లే ఇచ్చట సచ్చిదానంద ధర్మములకు ఆత్మతో అభేదము పరమార్థ సత్త కలదిగానున్నది. అందువలన వానికి పరస్పరవిరోధములేదు. దృష్టాంతము— ఒకరాజుచే పెద్దచక్రవర్తియైన ఇంకొకరాజుయొక్క పరాభవమై, వాడు బందిశాలయందు యుంచబడెను. తరువాత కృపగల్గి బంధవిముక్తునిగజేసి ఖర్చుకొఱకొక గ్రామమిచ్చెను. ఆ పెద్దదేశాధికారియగు రాజు ఆయొకే గ్రామముచేతనే మిగుల సంతోషపడుచున్నాడు. అట్లు కల్పితభేదమంగీకరించి ధర్మధర్మిభావ వ్యవహారము సిద్ధించును. అది సత్యభేదాపేక్షచేయదు, కల్పితభేదముచే ద్వైతమున్నుకాదు. కల్పిత భేదముచే సచ్చిదానంద ధర్మములును, రజ్జు సర్పన్యాయమున సత్యభేదమును పుట్టించవు. పరమార్థముచేతనో, నాస్వరూపము సచ్చిదానందమని సిద్ధించును. ఆ వ్యాపక ప్రకాశరూపమైన ఆత్మయగు నేను శరీరమందు ప్రవేశించుచున్నాను.

శరీరమందు పరమేశ్వరుడు ప్రవేశించుటయందు రెండు ప్రయోజనములుగలవు. ఒకటి కర్మఫలభోగమునకు సిద్ధి, రెండవది తన స్వరూపముయొక్క జ్ఞానము; వానిలో ప్రథమ ప్రయోజన విచారము పూర్వమే చేయబడియున్నది. ఇపుడు రెండవ ప్రయోజనమునకు నిరూపణము;—పరమేశ్వరుడిట్లాలోచించెను. ఈసంఘాతమందు ప్రవేశించుటకు నాకు ద్వారమేద్ది? పాద నఖాగ్రభాగ రూపమార్గముచేసి జ్ఞానశక్తిరహితమై క్రియాశక్తిగలదైన నీచప్రాణము. ఈనీచమార్గముచే ప్రవేశము చేయుచున్నది. నేను జ్ఞానశక్తిగలవాడై సర్వోత్కృష్టుడైన పరమాత్మను సేవక సంబంధ నీచమార్గముచే ప్రవేశము చేయుటయా! సరికాదని తన స్వరూపముయొక్కయు, శరీరముయొక్కయు విచారము నారంభించెను.

ప్రజ:— ఓ భగవంతులారా! అనాత్మరూపముచే దేహము ప్రసిద్ధమైయున్నది. దానియందు విచారమేమి? సనకాదులు:— ఓ శిష్యులారా! శాస్త్రతాత్పర్య మెఱిగిన వారైన విద్వజ్జనుల దృష్టిచే దేహము అనాత్మ ప్రసిద్ధమైనను మందబుద్ధిగల పురు

ఖుల యుపకారముకొఱకు దేహమున కనాత్మత దృశ్యత్వాది హేతువులచేత ఆత్మ జ్ఞానులు అజ్ఞానికి నేర్పవలయును కదా! ఈలాగే విచారము సఫలము. ఈదేహమో అనాత్మ గానున్నది. దృశ్యమగుటవలన, పరిచ్ఛిన్నమగుటవలన, జడమగుటవలన ఏదేది యనాత్మకాదో, అదియది దృశ్యము, పరిచ్ఛిన్నము, జడమునుకాదు. ఎట్లనగా ఆత్మ యదియునుగాక అనిర్వచనీయమగుటవలనను, దేహమనాత్మ ఇపుడిదే యర్థమునకు విస్తారమగు నిరూపణము:- అనుభవముచేయఁబడిన వస్తువులందు దేహమేది? ప్రజ:- హే భగవన్! సంఘాతమునకు పేరు దేహము. ఈసంగతి లోకప్రసిద్ధమే. సనకాదులు:— ఓప్రజా జనులారా! మేము లోక ప్రసిద్ధమైన దానినే గ్రహణముచేసిన పక్షమందు దేహ మాత్మకావలయును. ఎందుకనగా విచారహీనమైన పురుషులు నేను రామారావు, నేను శ్యామారావు, ఈప్రకారముగ దేహమే యాత్మయని యెఱుగుచున్నారు. విచారముచేసిన పక్షమున సంఘాతము దేహముకానేరదు. ఏలాగుననగా, సమాన ధర్మముగలవానికి పరస్పర సంబంధము సంఘాతమనబడినది. ఆసంఘాతములనేకములు— (1) శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియ సంఘాతము. (2) వాగాది పంచ కర్మేంద్రియ సంఘాతము, (3) పంచప్రాణ సంఘాతము, (4) త్వచాది సప్తధాతు సంఘాతము. (5) కఫాది త్రిదోషసంఘాతము. (6) విణ్మూత్రసంఘాతము. (7) స్వేదప్రాయ సంఘాతము. (8) కేశలోమాది సంఘాతము. ఈయెనిమిదిలోనే సంఘాతమునకు దేహమనిపేరు. అష్టసంఘాతములుచేరిన యొక సంఘాతమునకా? ఒక్కొక్క సంఘాతమునకా? ఎనిమిదిచేరిన యొకటి మహాసంఘాతము (మహాసముదాయము) వేఱువేఱు ఒక్కొక్కటి యవాంతర సముదాయము. ఈద్వివిధ సముదాయమునకు మొదలు నిర్వచనముకాదు. నిర్వచనమగుననిన వానినిట్లడుగవలయును— ద్వివిధ సముదాయము సముదాయితో భిన్నమా? అభిన్నమా? ప్రథమపక్షము ఘటిల్లదు. ఎందుకనగా, ఈపక్షమందు ఎప్పుడు మహాసముదాయితో అవాంతరములైన అష్టసముదాయములు అభిన్నమగునో అపుడు ఒక్కొక్క అవాంతర సముదాయమందును మహాసముదాయవ్యవహారము కావలయును. అట్లగుటలేదు. అథవా- అవాంతర సముదాయములలో నొక్కొక్క సముదాయము దేహమైనపుడు ఆ యవాంతర సముదాయాంతర్గతమగు నొక్కొక్క ఇంద్రియమునకును, అవాంతర సముదాయముతో నభిన్నమగుటవలన ఆయొక్కొక్క ఇంద్రియమందును సముదాయ వ్యవహారము, మఱియు దేహ వ్యవహారము కావలయును. అట్లగుటలేదు. సముదాయము ఘటించినదానికి పేరు సముదాయి అగును. అందువలన మహాసముదాయమునకు సముదాయి అవాంతర సముదాయములు. మఱియు అవాంతరసముదాయమునకు సముదాయి ఇంద్రియములు. ప్రజ:- హేభగవన్! సముదాయ సముదాయిలయొక్క భిన్నాభిన్నతలందు మీరుదోషము

చూపుచున్నారు? అది మేమంగీకరింపము. ఎందుకనగా, పూర్వము చెప్పిన ఇంద్రియాదులు అభిన్నములై సముదాయము లైనవి. అందువలన యీపక్షమందు దోషములేదు. సనకాదులు:- ఈపక్షమందుకూడ పునరుక్తిదోషముకలదు. ఏలాగుననగా, సకల సముదాయములకు ఒకే బుద్ధిచే విషయీకరణరూపమేళనమే సముదాయము. ఇది సకలశాస్త్ర సిద్ధాంతము. సంపూర్ణముచేరి సముదాయమైనదనుటచే మేళనరూపసముదాయముచే విశిష్టమైనది సముదాయమని యర్థమగుచున్నది. ధనికుడైన దేవదత్తుడు పుట్టుచున్నాడు. ఈస్థానమందు విశేష్యమైన దేవదత్తునియందుపుట్టుటకు అన్వయముకాదు విశేషణమైన ధనమందే పుట్టుట అన్వయము. అట్లు మేళనరూప సముదాయమనుటయందును, మేళన రూప సముదాయము విశేషణరూపము. దానియందు సముదాయమునకు అన్వయము చేసిన పక్షమందు, ఘటము, ఘటము అను పునరుక్తివలె సముదాయము, సముదాయము అను పునరుక్తి స్పష్టమగును. ప్రజ:—ఓభగవంతులారా! మీరు మేళన విశిష్టమునకు పేరు సముదాయమనిచెప్పి, ఆపక్షమందు దోషమును చూపుచున్నారు. ఆపక్షము అంగీకారార్హముకాదు. ఎందుకనగా, ఇంద్రియములయొక్క పరస్పర మేళనమునకే సముదాయమనిపేరు. సనకాదులు:— ఓశిష్యులారా? మేళనమను నామము సంబంధమునకు గలదు. ఆసంబంధము తాదాత్మ్యమా? సంయోగమా? సమవాయమా? తాదాత్మ్య సంబంధమనిన, ఘటిల్లదు. ఎందుకనగా, భేదమును సహించిన అభేదము తాదాత్మ్యసంబంధము. అచ్చట నిరపేక్ష యభేదము సత్యము. మఱియు ధర్మి ప్రతియోగియొక్క అపేక్షచేసినదైన భేదము కల్పితము. అందువలన సత్యములో నభిన్నములైన వస్తువులయొక్క మేళనము, 'నాముఖమందుజిహ్వ వేద'ను వాక్యముతో సమానము. ఈరీతిగా తాదాత్మ్యపక్షము ఘటిల్లదు. సంయోగసంబంధమను ద్వితీయ పక్షమును ఘటిల్లదు. ఏలాగుననగా రెండు ద్రవ్యములకే సంయోగ సంబంధము ఘటిల్లును. అందువలన ప్రభాకరునిచే సంయోగము వికల్ప మాత్రమని చెప్పబడియె. మఱియును, సమవాయసంబంధమను తృతీయపక్షమును ఘటిల్లదు. ఎందుకనగా గుణము గుణికి నైయాయికులు సమవాయ సంబంధమనుచున్నారు. ఆ సమవాయము తన సంబంధి ద్రవ్యాదిగుణములందు సంయోగసంబంధముచే నుండునా? అథవా సమవాయముచేనుండునా? ప్రథమపక్షము ఘటిల్లదు. ఎందుకనగా, రెండు ద్రవ్యములకు సంయోగమగును. సమవాయ ద్రవ్యముకాదు. మఱియు సమవాయముచేనుండినను ద్వితీయ పక్షమును ఘటిల్లదు. ఏలననగా, ఏ సమవాయ సంబంధముచే సమవాయమగునో ఆసమవాయము ప్రథమ సమవాయముకన్న అభిన్నమా? భిన్నమా? అని యడుగవలయును. అభిన్నమను ప్రథమపక్షమనిన, తన స్థితియందు తాను అపేక్షచేయుట ఆత్మాశ్రయ దోషమగును. భిన్నమను ద్వితీయపక్షమనిన, ప్రథమ సమవాయముకు ఆను ద్వి

యము, మఱియు ద్వితీయము కొఱకు ప్రథమ మనిన, అన్యోన్యాశ్రయ దోషము తీయ సిద్ధికొఱకు, తృతీయము మఱియు తృతీయ సిద్ధికొఱకు ప్రథమమనిన చక్రికా షము, తృతీయసిద్ధికొఱకు చతుర్థము, చతుర్థ సిద్ధికొఱకు పంచమము, ఈరీతిగా మము నడచిన పక్షమందు అనవస్థాదోషమున్ను యగును. అందువలన సమవాయ బంధరూపమేళనమునకు పేరు సముదాయమనుట సిద్ధింపదు.

అథవా, సంయోగము మఱియు సమవాయము చేరి సముదాయ మేళనమునకు నిన పక్షమందు, వృక్షసముదాయము వన మనబడినది. అచ్చట వృక్షములయొక్క స్పర సంబంధము లేదు, సమవాయమును లేదు. అందువలన సముదాయ వ్యవహార గాకుండవలసియుండెడి. సముదాయ వ్యవహారమగుచున్నది. అథవా, సంబంధమును ముదాయమనిన, వాని నిట్లడుగవలయును— సంబంధపదమందు 'సం' మఱియు ంధ' అను నీరెండవయవములుగలవు, వానికేమి యర్థమగును? ప్రజ:—హే భగవన్! సం' అవయమునకు సమ్యక్ అని యర్థము. 'బంధ' అవయమునకు బంధమని యర్థము. కాములు — ఓ శిష్యులారా! ఈ యర్థము మీవచనమందే కనబడుచున్నదిగాని పంచమందింకెక్కడను కనబడుటలేదు. అయ్యా! శ్రుతియందు సంపూర్ణజగత్తు ష్యయనియు, ఆత్మ సమ్యక్కనియు చెప్పబడియున్నది. అట్లే బంధ శబ్దమునకు ంధనమను పేరు ఘటిల్లదు. ఎందుకనగా, లోకమందు బంధింపబడు వస్తువుకన్న బంధ ము భిన్నముగా జూడబడెను. ఎట్లనగా, బంధింపబడిన రెండు ఆవులకన్న రజ్జ్వాది ంధనము వేఱుగానున్నది. అథవా, మూర్తవస్తువుచేతనే బంధనము సంభవించును. మూర్తవస్తువుచే బంధనముకాదు. అందువలననే అమూర్తమైన ఆకాశముచే ఘట బాది పదార్థములు బంధింపబడవు. అలాగుననే దేహమందు ఇంద్రియాదులను బం ంచునట్టి, రజ్జ్వాదికమువలె అమూర్తపదార్థ మేదియు కనబడదు. అందువలన సంబంధ' పదమునకు ఏ ప్రసిద్ధార్థమున్ను లేదు. ఈప్రకారముగ సంఘాతమందే దేహ ను పక్షమునుఖండించి ఇప్పుడు సంఘాతమునకు ఘటించు ఇంద్రియాదులను అనాత్మ ని నిరూపించుచున్నాము.

విజ్ఞుల యనుభవమున ప్రత్యక్షప్రమాణమున ఇంద్రియములందు ఆత్మత యెప్పటికిని దు. ఎందుకనగా, సర్వమునకు అంతరమైనది ఆత్మ ఇంద్రియములు బాహ్యములు. ందువలన నవి ఘటాదులవలె అనాత్మరూపములు. ఇపుడు ఉపమాన ప్రమాణము సను, ఇంద్రియానాత్మత చెప్పుచున్నాను — ఏది దృశ్య పరిచ్ఛిన్నవస్తువో అది నాత్మ. అట్లు వాగాదీంద్రియములును, దృశ్య, పరిచ్ఛిన్నములగుటవలన అనాత్మయే.

ప్రజ:— ఓ భగవంతులారా! కర్తకు ఆత్మయని శాస్త్రప్రసిద్ధము. స్వాతంత్ర్యమునకు కర్తయని పేరు. తమతమ వ్యాపారమందు ఇంద్రియములకు స్వాతంత్ర్యముగలదు. కనుక ఇంద్రియములే యాత్మ. సనకాదులు:— ఓ ప్రజలారా! ఏదేది స్వతంత్రమగునో, అదియది చైతన్యమగును. చైతన్యముగానిచో స్వాతంత్ర్యముగలిగియుండదు. ఎట్లనగా, అగ్నిలేక ధూమముండదు. అలాగే చైతన్యరూప పరమాత్మలేక సంపూర్ణ ఇంద్రియములందు చైతన్యభావము కలుగదు. ఎట్లనగా, అచేతనములగు రథాదులు చైతన్యములైన అశ్వాదులులేక గమనముచేయవు. జ్ఞానేంద్రియములకు, అంతఃకరణమునకు జ్ఞానరూపవ్యాపారము, కర్మేంద్రియ ప్రాణములకు క్రియారూప వ్యాపారము, సంపూర్ణవ్యాపారములు పరమాత్మయైన నా సాన్నిధ్యముచేతనే సిద్ధించుచున్నవి. అథవా, వాగాదీంద్రియములకు శబ్దోచ్చారణాది వ్యాపారమందు స్వాతంత్ర్యము కన బడినను. అన్యవ్యాపారమందు స్వాతంత్ర్యములేదు. ఎట్లు రాజు తమతమ కార్యములందు సేవకులను నియమించుచున్నాడో, అట్లు ఇంద్రియములకు వ్యాపార నియమము పరమాత్మయైన నేను చేయుచున్నాను. ప్రజ:— ఓ భగవంతులారా! ఇంద్రియాదులందు స్వాతంత్ర్యములేదుగాని జ్ఞానశక్తి గలదగుటవలన సర్వజ్ఞాత్మయొక్క ఉపాధియైన బుద్ధి స్వతంత్రమైయున్నది. ఆబుద్ధి ఆత్మయెందుకు కాగూడదు? సనకాదులు:- ఓ ప్రజలారా! బుద్ధి సర్వజ్ఞుడగు పరమేశ్వరుని యుపాధిగా నుండెను. బుద్ధి యాత్మగాదు. బుద్ధియందు సకల పదార్థ విషయతయను సామర్థ్య మేదికలదో, అదంతయు ఆత్మసాన్నిధ్యముచేతనే గలుగుచున్నది గాని స్వయముగ బుద్ధియందు స్వాతంత్ర్యము లేదు. ఎట్లు జలదర్పణాదులు సూర్యుని ప్రకాశమును తీసికొని ఘట భిత్త్యాదులను ప్రకాశింపుచున్నవో, అట్లే చైతన్య ప్రకాశము తీసికొని బుద్ధి సకల పదార్థములను ప్రకాశింపుచున్నది. శ్రీకృష్ణభగవానుని సాన్నిధ్యముచే అర్జునునియందు యుద్ధ సామర్థ్యము గలిగినదిగాని శ్రీకృష్ణుని వినా, అర్జునునియందు యుద్ధసామర్థ్యములేదు. అథవా, చైతన్యము పరిణామము పొందదు. బుద్ధి విషయాకార పరిణామముపొందును. మృత్తికవలె జడమైన బుద్ధి ఆత్మయెట్లగును? కాదు. ఎట్లు గృహమున్ను, గృహనిష్ఠమైన మృత్తికా కాష్ఠాది పదార్థములును గృహి కొఱకు గలవో, అట్లు వాగాది సంపూర్ణ సముదాయము ఆత్మకొఱకే గలవు. ప్రజ:—ఓ భగవంతులారా! రాజభయముచే సేవక జనులవలె, వాగాది సంపూర్ణములు మీకు భయపడి తమ తమ కార్యములందు ప్రవృత్తమగుచున్నవి. ఇట్లుండగా సంఘాతమందు మీప్రవేశమునకు ప్రయోజనమేమి? సనకాదులు:— ఓ ప్రజలారా! ఈవాగాదులు నాభయముచే ప్రవర్తించినను, పరమాత్మయగు నన్ను త్వం పదార్థమని యెఱుగవు. మఱియు సకల జగత్కారణమైన పరమేశ్వరుడ నగు నన్ను తత్పదార్థమనియు నెఱుగవు. ఎప్పుడు మూఢములైన ఈ

వాగాదులు త్వం పదార్థమును, తత్పదార్థము నెఱుఁగవో, అపుడివి త్వం పద తత్పదా ర్థైక్యము నెట్లుఱుఁగును? ఎఱుఁగవు. అందువలన పరమాత్మయగు నేను సంఘాత మందు ప్రవేశించి 'నేనెవడను?' అని విచారము చేయవలసినది. (ఇచ్చట వాగాదీం ద్రియములతో తాదాత్మ్య సంబంధముచేసి 'నేను మాట్లాడుచున్నాను', 'నేను చూచు చున్నాను', ఇటువంటి యభిమానమేది గలదో అదే పరమేశ్వరుని ప్రవేశము. ఈవిష యమందే ప్రతిబింబవాదము, అవచ్ఛేదవాదము, మొదలగు వాదములు శాస్త్రమందు చెప్పబడియున్నవి.) ప్రశ్న:— ఓభగవంతులారా! మీరు మీస్వరూపమును విచారము చేయదలంచిన పక్షమందు అవిచారము శరీరమందు ప్రవేశముచేయకయే చేయరాదా? ఎందుకు ఈ దుఃఖరూప శరీరమందు ప్రవేశించెదరు! సనకాదులు:— నాస్వరూపము అట్లేయగాక! ఇట్లే యగాక! దానినిగూర్చిన విశేష చింత నాకులేదు. ఈవాగా దులకు సుఖప్రాప్తిచేసి, స్వస్వరూపముయొక్క విచారము చేసెదను. ఈద్వివిధప్రయో జనమును బట్టి సంఘాతమందు ప్రవేశము చేయవలసినది.

ఈ ప్రకారముగ పరమాత్మ చింతనముజేసి, ఏద్వారమున శరీరమందు ప్రవేశము చేయవలయునని విచారముచేయుచున్నాడు— నా సేవకులైన దేవతలు ముఖద్వారమున ప్రవేశము చేయుచున్నారు; అదే ద్వారమున నేను ప్రవేశముచేయుట సరికాదు. అని ఆలోచించి మూర్ధసీమను భేదించి శరీరమందు ప్రవేశించెను. శిరస్సునందు వామ, దక్షిణ, మధ్యములను మూడు కపాలములుగలవు. వానిలో మధ్యభాగమునకు మూర్ధ సీమయనిపేరు. అది కేశరహితకృశ పురుషుని శరీరమందు కనబడుచున్నది. అథవా స్త్రీలు కేశవిభాగముచేయుటచేయే రేఖ కనబడుచున్నదో, ఆరేఖ సమాప్తమయ్యే స్థానమునకు మూర్ధసీమ యనుపేరు లోకప్రసిద్ధము. ప్రవర్షణ యను పర్వతమునుండి దుమికి ఆకాశమార్గముగుండా శ్రీకృష్ణపరమాత్మ ద్వారకాపురియందు ప్రవేశించినట్లు, ఈమనుష్య శరీరమను ద్వారకాపురియందు పరమాత్మరూపుడగు కృష్ణుడు ఊర్ధ్వమార్గ ముచే ప్రవేశించుచున్నాడు. మనుష్య శరీరమునకే ఇతరశరీరములు ఉపలక్షణములు. (మనుష్యశరీరమందే ఆత్మసాక్షాత్కార యోగ్యత వర్తించుటవలన మనుష్యశరీరమున పుణ్యక్షేత్రమగు ద్వారకాపురి యనబడుచున్నది.) ప్రశ్న:— ఓ భగవంతులారా! శ్రుతి స్మృతులందు నవద్వారములు ప్రసిద్ధములైయున్నవి. దశమద్వారము అప్రసిద్ధ ము. అట్టి దశమమైన మూర్ధద్వారముచే మనుష్యశరీరమును ద్వారకాపురియని యెట్లను చున్నారు? సనకాదులు:— ఈమూర్ధమును దశమ ద్వారమునకు ఈపాసన జనులు 'విధృతి' యనుచున్నారు. మస్తకమున కటుతైలమర్దనము చేసినపుడు బుద్ధిమత్పురు షునిచే ఈద్వారముగుండానే కటుతానుభవముగావింపబడును. మూఢజనులద్దాని నెఱుఁ

గుట అశక్యమే దానివలన యాద్వారము ప్రసిద్ధమగునా? పరమేశ్వరుడు ప్రవేశించు ద్వారము భృత్యజన ప్రవేశమునకు యోగ్యమైన స్థూలద్వారమువంటిదికాదు. అందు వలన ఆ నవద్వారములతో నీద్వారమునకు శ్రుతిస్మృతులందు గణనచేయలేదు. యోగులు ఏయూర్ధ్వద్వారముచే బయలుదేఱి బ్రహ్మలోక ప్రాప్తికి హేతువైన దేవయానమార్గ మును బొందుచున్నారో, అది ఈ యూర్ధ్వద్వారమే. ఇది 'నందన'మనబడెను. (దేని వలన ఆనందప్రాప్తియగునో అది నందనము ఇంద్రుని తోటకును నందనమను పేరు గలదుగాని, అది పతనభయముచే గ్రస్తమగుటవలన దానియందు సుఖహేతుత సంశ యార్థమే యైయున్నది. ఈయూర్ధ్వద్వారము ముక్తిరూపాఖండానందమునకు హేతువగుటవలన నిజమైన నందనమగును.) ఈప్రకారముగా జీవరూపముచే పరమాత్మ యొక్క ప్రవేశము చెప్పబడినది, ఇపుడు ఉపాధియొక్క అభిమానముచే జీవాత్మకు సంసారప్రాప్తి చెప్పుచున్నాము.

శరీరమందు ప్రవిష్టులైన అగ్న్యాది దేవతలప్రభువైన ఇంద్రుడు స్వనివాసము కొఱకు గృహత్రయమును నియమించుచున్నాడు— నేత్రగోళక మొకటి, హృదయ కమలమొకటి, హృదయకమలాంతరాకాశ మొకటి. ఈగృహములందు అహంకార మను మంచముపై తన ప్రతిబింబ రూపగర్భమును ధరించినట్టి జ్ఞానశక్తియను ఇంద్రాణీ పత్నితో శయనముచేసి, ఆ యింద్రరూప జీవాత్మ జాగ్రత్స్వప్న సుషుప్తిరూప స్వప్న త్రయమునుజూచుచున్నాడు. ప్రజ:— ఓభగవంతులారా! స్వప్నమనగా స్వప్నమే గాని, జాగ్రత్స్వప్న సుషుప్తులుగూడ స్వప్నమెట్లనుచున్నారు? సనకాదులు:— ఓ ప్రజలారా! ఈ ఇంద్రరూప జీవాత్మ స్వస్వరూప జ్ఞానరహితుడు. అందువలన జాగ్ర దాది మూడును వీనికి స్వప్నరూపములేయైయున్నవి. ఏందుకనగా, ఏవస్తువున కేది స్వరూపమో ఆస్వరూపముగ వస్తువును యథార్థముగ నెఱుగుటను జాగ్రదనవలసినది ఈజీవాత్మయో,తాను అద్వయానంద రూపుడుగనుండగా, విభ్రమించి, 'నేను దుఃఖిని కర్తను, భోక్తను' యని తన్నెఱుఁగుచున్నాడు. ఈలాగే అజ్ఞానరూప నిద్రచే యేయే వస్తువును చూచుచున్నాడో, అదంతయు స్వప్నమే యగును. ఆ త్రివిధ స్వప్నములలో— జాగ్రత్స్వప్నము—వాస్తవముగ శుద్ధమైనపరమాత్మ శబ్దస్పర్శాది స్థూలభోగ భోగప్రాప్తికొఱకు అనాది యజ్ఞానముచే భోగకారణములైన ధర్మాధర్మ ములను, యేకాలమందు అంగీకరించుచున్నారో, ఆకాలమును జాగ్రదనుచున్నారు. (అదే జాగ్రత్స్వప్నము). ఆ జాగ్రత్కాలములో వామ, దక్షిణములను రెండు నేత్ర ములందు భగవంతుడు స్త్రీ పురుషరూపములచే ప్రకటితమగుచున్నాడు. దక్షిణ నేత్రమందధిక ప్రకాశరూపభోక్త పురుషుడుగాను, వామనేత్రమందల్ప జలముగల

గ్య స్త్రీరూపముగాను దైనాడు. ఈరీతిగ భోక్తృ భోగ్యరూపముచే పరమేశ్వ
ని ఉపాసన శ్రుతియందు చెప్పబడియె.

ఈ ప్రకారముగా భగవంతుడు వ్యష్టి శరీరమున కభిమానియై, తన్ను పరిచ్ఛిన్న
ని యెఱిఁగి వాగాదీంద్రియముల నంగీకరించి కృతకర్మమునకు ఫలరూపమైన భోగ
ఫలను పొందినాడు. చైతన్యపదార్థములందు ఇతడు నాపితి, ఈమె నామాత
నియు అట్లే భ్రాతృభగినీ బాంధవ స్త్రీ పుత్ర మిత్ర శత్రు గురు రాజాదులందతని
ని, నాది యనియు యనుచున్నాడు. అట్లే జడపదార్థములందు, గృహ, భూమి
న్న, వస్త్ర, భూషణాదులను నాది నాది యనుచున్నాడు. అట్లే ఇది సుందరము,
ది అసుందరమనియు నెఱుఁగుచున్నాడు. అధిక న్యూనదూర సమీపశబ్ద స్పర్శ
రూప రస గంధముల నెఱుగుచున్నాడు. ఇది చెప్పటకు యోగ్యము, ఇది హస్తగ్రహ
యోగ్యము, ఇది చరణములచే చలనయోగ్యము, ఇది బంధనకారకము, ఇది సుఖ
కారకము, ఇది దుఃఖకారకము, ఈమొదలుగ నెఱుగుచున్నాడు. అట్లే నేను పురు
షుడను, నేను స్త్రీని, నేను నపుంసకుడను, నేను మనుష్యుడను, అట్లే నేను బాలకు
డను, నేను తరుణుడను, నేను వృద్ధుడను, నేను రూపవంతుడను. నేను కురూపిని;
ఈప్రకారముగను అజ్ఞానరూపనిద్రచే నిద్రితుడైన యాత్మ యెఱుఁగుచున్నాడు. అట్లే
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్ర, బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్యాసి నేనను
చున్నాడు. అట్లు వర్ణాశ్రమములందు అవాంతరభేదములు జూచి, ఆ యవాంతర
భేదములను తనయందే ఆరోపించుకొనుచున్నాడు. ఒకవస్తువాచక శబ్దమునకు అన్య
వస్తువందు కథనము అధ్యాసము వినా ఘటిల్లదు. ఎట్లు రజతార్థవాచకమైన రజతశబ్ద
మునకు శుక్తియందు కథనము అధ్యాసమువినా గాదో, అట్లే ఈపురుషుడు ఆత్మవాచక
మగు అహం శబ్దమునకు 'అహం గౌరః', 'అహం మందః', 'అహం తృషితః' ఈ
ప్రకారముగ శరీరమందు, ఇంద్రియములందు, ప్రాణములందు కథనము చేయుచున్నాడు.
ఇది యధ్యాసమే. పూర్వము చెప్పబడిన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారమును
ఆకాశాది భూతముల వ్యాపారమును, భౌతిక ప్రపంచవ్యాపారమును, ఆ యన్ని వ్యా
పారములును అజ్ఞానముచే ఆత్మయైన తనయందే నెఱుఁగుచున్నాడు. ఆ జాగ్రదవస్థా
స్థానము సంపూర్ణము అధ్యాసముచే వ్యాప్తమైయున్నది. అందువలన యీజాగ్రత్తు
సచ్చిదానందాత్మయొక్క స్వప్నమని శ్రుతియందు చెప్పబడియె. ప్రబోధమునకభావ
మైన మిథ్యావస్తుదర్శనమునకు స్వప్నమనిపేరు. ఘటాది పదార్థముల నెఱుగనివాడైన
భ్రాంత పురుషుని లోకమందు నిద్రితుడనుచున్నారు. ఈప్రకారముగ లోకవ్యవహార
మందును విపరీత దర్శనమునకు స్వప్ననామము ప్రసిద్ధము. ఈస్వప్నలక్షణము పై

జెప్పబడిన జాగ్రత్తునందు ఘటించుచున్నది. స్వప్నమందు ఇంద్రియములకు విరామము గలిగి జాగ్రతయందు లేకున్నను మిథ్యాదర్శనమను ధర్మము జాగ్రత్స్వప్నములందును సమానమగుటవలన జాగ్రత్తున్ను స్వప్నమే.

స్వప్న స్వప్ననిరూపణము—ఈస్వప్నావస్థయందు జీవాత్మ యనుఇంద్రుడు తన బుద్ధియను ఇంద్రాణి సహితముగ హృదయకమలదళమైన ద్వితీయగృహమును చేరును. ఆస్థానమందు ఇంద్ర ఇంద్రాణీ సమ్ముఖముగ మనోరూప నటి పూర్వాపూర్వ కర్మాను సారముగ అనంతవేషములువేసికొని నాట్యమాడును, తాత్పర్యమేమన, అనంతజన్మములం దనుభూతమైన పదార్థముల సంస్కారములచే యుక్తమైన మనస్సు రథాది విషయాకారముగను, జ్ఞానాకారముగను పరిణామము పొందును. మఱియు మనస్సునందుగల వాసనా విశిష్టమగు అజ్ఞానమే స్వప్నమందు రథాది విషయాకార జ్ఞానాకార పరిణామమును పొందుచున్నది. ఇదియొక పక్షము.

ఇపుడు జాగ్రత్స్వప్నముతో, ఈస్వప్నస్వప్నమున కింకను విలక్షణత చూపుచున్నాము— ఈ స్వప్న స్వప్నమందు స్వరూప నియమము, దేశనియమము, కాల నియమము, హేతు నియమము, ఈ చతుర్విధ నియమముల యభావముగలదు. ఇపుడు కనబడిన హస్తిలక్షణమందు వృక్షరూపముగను, క్షణమందు పర్వతరూపముగను, ప్రతీతమగుచున్నది. అట్లే స్వప్నద్రష్టయు క్షణమందు బ్రాహ్మణుడుగను, క్షణమందు శూద్రుడుగను, క్షణమందు పశువుగను ప్రతీతుడగుచున్నాడు. అట్లు స్వప్నమందు సూక్ష్మమైన స్వప్నవాహకనాడియందుండిన ద్రష్ట ఆ సూక్ష్మనాడియందే పెద్ద పెద్ద సముద్రములను, పర్వతములను, సప్తద్వీప పృథ్వియున్ను చూచుచున్నాడు. అట్లే రాత్రి మంచముపై పరుండిన పురుషుడు సూర్య సహితమగు దివసము చూచుచున్నాడు. అట్లే ధరణిఖండమునందు వసించు అల్ప శరీరముగల పురుషుడు సూర్యచంద్రులనుగూడ భక్షించుచున్నాడు. అట్లే స్వప్నమందు శిల్పికారుడు కాష్ఠాది సామగ్రి లేకుండినను, సంకల్పమాత్రముచేతనే రథమును సృష్టించుచున్నాడు. ఈరీతిగా స్వప్నమందు ఏయొక నియమమున్ను చెప్పుటలేదు. అందువలననే శ్రుత్యర్థ నిష్ణాతులైన వ్యాస భగవంతునిచే, స్వప్నము మాయామాత్రమని చెప్పబడియె.

ఇపుడు సుషుప్తిస్వప్న నిరూపణము గావింపబడుచున్నది— ఈప్రకారముగ స్వప్నముజూచి ఇంద్రరూప జీవాత్మ ఇంద్రాణి ప్రియతోగూడి హృదయాకాశమను తృతీయ గృహమును చేరును. ఆహృదయగృహమందు ఇంద్రాణి ప్రియను దృఢాలింగనమొనర్చి ఆప్రియతో నభేదమును పొందుచున్నాడు. అట్చట భోక్త, భోగ్యము వేఱువేఱుగా ప్రతీతముగావు. స్వప్నమైన తరువాత సుషుప్తి యగునా? అథవా

జాగ్రత్తు తరువాత యగునా? అను నియమములేదు. ఒకసారి ఆవిషముగను, ఒకసారి ఈవిషముగను జరుగును.

ప్రజ:— ఓ భగవంతులారా! సుషుప్తియందు అజ్ఞాన కార్యరూప భోగ్యము లేకున్నను కారణాజ్ఞాన రూపభోగ్యముకలదు. దానివలన భోక్తృ భోగ్యాభేదము ఘటిల్లదా? సనకాదులు:— ఓ శిష్యులారా! అంధకారముయొక్క జ్ఞానము దీపముచే నెట్లుకాదో, అట్లే యేప్రమాణముచేతను అజ్ఞానము సిద్ధింపదు. సాక్షి చైతన్యముచేతనే సిద్ధించును. ఆ సాక్షియైన ద్రష్ట సుషుప్తియందు అజ్ఞానమును చూచుచున్నాడు. (సుషుప్తినుండి జాగ్రతుడైన వాడు 'నేనేమియు నెఱుగనైతిన'ని స్మరణము చేయుచున్నాడు. పూర్వానుభూతమునకే స్మరణమగునని నియమము.) ఈరీతిగా సుషుప్తియందు ద్రష్ట అజ్ఞానమును జూచినను, సామాన్యముగనే జూచుచున్నాడు గాని విశేషముగ జూడడు. కనుక మేము సుషుప్తియందు భోక్తృ భోగ్యముల కభేదమును చెప్పుచున్నాము.

ప్రజ:— ఓ భగవంతులారా! ఎపుడు అజ్ఞానరూపావరణము సుషుప్తియందు లేదో అపుడా ప్రతిబంధకాభావమువలన, జీవులకు మోక్షముగావలసినది గదా? సనకాదులు:— ఓశిష్యులారా! సుషుప్త్యవస్థయందు ద్రష్ట అద్వితీయానందరూపమగు తన స్వరూపము నెఱుగడు. అందువలన అచ్చట విశేషజ్ఞానమున కభావముగలదు. దీని యభిప్రాయమేమన— సుషుప్తియందు ప్రతిబంధకాభావముండినను గురుశాస్త్రాది జ్ఞానసామగ్రి లేకుండుటవలన మోక్షసాధనమైన ఆత్మజ్ఞాన మచ్చట కలుగ నేరదు. మఱియు అచ్చట స్వరూపాజ్ఞాన ముండుటవలన ఆత్మసాక్షాత్కారమున కభావము గలదు. మఱియు, మిథ్యా విద్యయుండుటవలన సుషుప్తి స్వప్న రూపముగానే యున్నది. ఈప్రకారముగ జాగ్రత్స్వప్న సుషుప్తులు మూడును స్వప్నములే. హృదయాది మూడు గృహములు గలవాడును, శరీరమను ద్వారవతియందున్నవాడును, దేహాదులందు అహంమమాభిమానముగలవాడును నైన పరమాత్మ దేవుడు గురుకృపచే అజ్ఞానరూప నిద్రనుంచి జాగరూకుడై ఈవిచారము చేయుచున్నాడు— వాస్తవముగ ఉత్పత్తిరహితుడగు పరమాత్మయగు నేను ఏపంచభూతములయొక్క విశేషరూపముచే ప్రకటితమగుచున్నానో, ఆయాకాశాది భూతములు నాకు ఉపాధికొరకు పుట్టుచున్నవి. ఈభూతములు శరీరాది భేదముచే అనేక ప్రకారములు గలవిగాని, సంక్షేపముగ జూచి నపుడు ద్వివిధము— జడరూపము, అజడరూపమని అచ్చట భోగ్యరూపముచే జడముగాను, భోక్తృరూపముచే అజడముగాను నుండును. బాహ్యాకాశాది పంచభూత స్థావరజంగమముచేరి కేవలము భోగ్యము, మఱియు వృక్షాది స్థావరమునకును మనుష్యాది

జంగమమునకును పరస్పర భోక్తృ భోగ్యత నియమములేదు. ఒకప్పుడు స్థావరము, భోక్త, జంగమము భోగ్యమగును. మఱియొకప్పుడు జంగమము భోక్త స్థావరము భోగ్యమగును. ఇచ్చట ఉపకారముచేయునది భోగ్యమనబడినది. ఉపకారము నైకొను నది భోక్తయనబడినది. మనుష్యాదులు జలసించనాది ఉపకారములు వృక్షాదులకు చేయుచున్నారు. అప్పుడు మనుష్యాదులు జంగమములై భోగ్యమైనవి. వృక్షాదులు స్థావరములై భోక్తలైనవి. మఱియు వృక్షాదులు మనుష్యాదులకు ఛాయాకాష్ఠ ప్రదాన రూప ఉపకారముచేయుచున్నవి. అపుడు మనుష్యాదులు జంగమములై భోక్తలైనవి. వృక్షాదులు స్థావరములై భోగ్యమైనవి. ఈసంగతి లోకప్రసిద్ధము.

ఇపుడు విచారముచేసి చూచిన పక్షమందు ఈద్వివిధ ప్రపంచమును అద్వితీయత్వమునే బోధించుచున్నది. ఎవడు స్వతంత్రుడో వాడు కర్త; ఎవడు కర్తయో, వాడు భోక్త. 'ఈవస్తువు నాకు సుఖసాధనము. ఇది దుఃఖసాధనమను' నిట్టి జ్ఞానమునకు భోగ మనిపేరు. భోగమున కాశ్రయము భోక్త, జడపదార్థమందు జ్ఞానములేదు. కర్తృత్వమున్నులేదు. కనుక నది కర్తయుగాదు. భోక్తయుగాదు. చైతన్యమైన యాత్మయే కర్తయనియు, భోక్తయనియు సిద్ధించుచున్నది. అట్లే అంతఃకరణవృత్తి యందారూఢమైన చిదాభాసునకును ఆశ్రయత్వరూపభోక్తృత ఘటిల్లదు. చైతన్యాత్మకే ఘటిల్లును. ఇపుడు జడచైతన్యములకు సంబంధముగలుగజేయు అజ్ఞానము గలదు, ఆ యజ్ఞానమునకు విచారకాలమందు నివృత్తియైనది. ఇపుడు ' ఇది సుఖసాధనము, ఇది దుఃఖసాధన'మని యెఱిగినదైన వృత్తిస్థితసకలచైతన్యరూప ప్రకాశము, ఆచిదాభాస రూపప్రకాశమును పరమాత్మయగు నేనుగానే యున్నాను. ఏలాగుననగా—: ఆ ప్రకాశమున్ను నా సంబంధముచేతనే గలదు. స్వయముగ అంతఃకరణ వృత్తియందు ప్రకాశములేదు. ఎట్లు రాజసభయందు రాజాజ్ఞలేక యెవడును 'హూం' చేయడో, 'చూం' చేయడో, అట్లు సకల దృశ్య వస్తువులు నాయాజ్ఞలేక ఏ వ్యవహారమున్ను చేయవు.

ఇపుడు ఆత్మకన్న సకలము అనిర్వచనీయమని చెప్పుచున్నాము— ఎట్లు రజ్జ్వజ్ఞానముచే ప్రతీతియైన సర్పము కల్పితమో, అట్లు కూటస్థాత్మయైన నాయందు సకల ప్రపంచము కల్పితము. అచ్చట ప్రపంచమునకు స్వరూపమేమి? నామక్రియా సముదాయమునకు పేరు ప్రపంచమా? ఒక్కొక్క నామాదికమునకు పేరు ప్రపంచమా! ఈరెండు పక్షములును పూర్వము దేహప్రకరణమందు ఖండింపబడినను, ఇపుడే పక్షములందింకను దూషణ మాపుట కొఱకు వికల్పన చేయుచున్నాము:— నామరూప

యా నామరూపక్రియారూపమా? కాదా? నామము నామరూపమా? కాదా? రూప రూపస్వరూపమా? కాదా? ఈవికల్పములకు ఖండనమును, అటువంటి యుక్తి నే యగును. (ఈవికల్పములు చదువువానికిని వినువానికిని నవ్వే వచ్చుచున్నది.) చ్చట సిద్ధాంతమేమనగా — నామరూపక్రియ అనిర్వచనీయముగ నున్నది. అట్లే చభూతములు నామరూపక్రియలను విడిచి ఎక్కడను యుండవు. అందునలన చభూతములును, తత్కార్యమైన ప్రపంచమును అనిర్వచనీయములుగా నున్నవి. డు భూతకారణమైన మాయకు అసత్యతా ప్రతిపాదనము—అచ్చట ప్రపంచమునకు యగాక అనుపపత్తిరూప అర్థాపత్తిప్రమాణముచే మాయ సిద్ధమా? అథవా శ్రుతి మాణముచే సిద్ధమా? అథవా అనుభవప్రమాణముచే సిద్ధమా? వీనిలో ప్రథమపక్షము భవింపదు. ఏలాగుననగా— అసత్య వంధ్యాపుత్రోల్పత్తి మాయచేతగాదు, అట్లు సత్య ప్రపంచమున్ను మాయచేత ఉత్పత్తిగాదు. ప్రజ:— ఓ భగవంతుడా! మిమీద స్థితుడైన మాయావియగు నటుడు స్వమాయచే ఆకాశమందు స్థితుడై సత్యమైన ఇంకొక ప్రకారముగ తన స్వరూపమును చూపుచున్నాడు గదా? నకాదులు:—ఓ ప్రజలారా! ఆకాశమందును, మాయావి పురుషునకు మాయ నిమిత్త కారణముగాని, ఉపాదాన కారణముకాదు. నటపురుషుని ఆత్మయే ఆయా రూప లచే ప్రతీతమైనది. మాయ శ్రుతిప్రమాణముచే సిద్ధమను ద్వితీయపక్షమున్ను సంభ పదు. ఎందుకనగా— మాయచే జగదుత్పత్తి ప్రతిపాదక శ్రుతికి అద్వితీయ బ్రహ్మము యెఱింగించుటయందు తాత్పర్యముగాని మాయాసిద్ధియందులేదు. ఈసంగతి ర్వమున్ను చెప్పబడియున్నది. మాయ అనుభవముచే సిద్ధమను తృతీయపక్షమున్ను భవింపదు. ఎందుకనగా— ఎట్లు నిద్రితుడైన బాలకుడు తన శరీరమును రాక్షస ని యెఱిగి భయ కంపాదులను పొందుచున్నాడో, అట్లు ఆత్మయు తన సచ్చిదానంద రూపమును విస్మరించి తన్ను ఆవరణముచేయు మాయను తాను కల్పించుకొను న్నాడు. విచార రహిత అవివేకపురుషుని అనుభవముచేతనో మాయకు సిద్ధికాదు. దుకనగా నాతడు భ్రాంతిజ్ఞానముగలవాడు, భ్రాంతిజ్ఞానము వస్తు సిద్ధిచేసిన పక్ష ను శుక్తియందు రజతమునకు, రజ్జువందు సర్పమునకు సిద్ధిగావలసినది. విచార హితానుభవముచేచూచినపక్షమందు మాయ నిలువదు. ఎట్లనగా— సూర్యోదయము గా అంధకారమునిలువదు. సారాంశము—ఈమాయ ఏప్రమాణముచేతను సిద్ధింపదు.

ప్రజ;— ఓ భగవంతుడా! చైతన్యాత్మయందు మాయలేకుండిన పక్షమందు జ్ఞాని యను అనుభవము దేనిని విషయము చేయుచున్నది? సనకాదులు:— ఈ య ఆత్మయైన నాకన్న వేఱుకాదు, నాస్వరూపమే. ఎట్లనగా బాలకుని శరీరము

కన్న రాక్షసము వేఱుకాదు. తాత్పర్యము— ఆత్మ యొక్క స్వరూపమే మాయ అవిద్య అజ్ఞానము మొదలగు శబ్దములచే చెప్పబడియున్నది. ప్రజ:—ఓభగవంతుడా మాయ, అవిద్య, అజ్ఞానము ఇటువంటి శబ్దములు, మఱియు తజ్జ్ఞానము వానియొక్క బలముచే చైతన్యాత్మకన్న భిన్నమై స్వతంత్రముగ మాయయొక్క సిద్ధి ఎందుకు కూడదు? సనకాదులు:— ఓశిష్యులారా! శబ్దమందును, జ్ఞానమందును ప్రమాణతచే అసత్యమైన వంధ్యాపుత్రుని యందును, శబ్దము జ్ఞానము చూడబడినవి. శబ్దజ్ఞానములకు తమ విషయసిద్ధిచేయుటకు సామర్థ్యము లేదు. శబ్దమునకు ఖండనము పూర్వము న్యాయ విచారమునందు చేయబడియున్నది. ఇపుడు జ్ఞానస్వరూప బుద్ధికి స్వవిషయ సిద్ధి సామర్థ్యము లేదని చెప్పుట కొఱకు బుద్ధి బోధరూపమా! అబోధరూపమా? ఇత్యాది వికల్పములఁజేసి తత్ఖండన మొనర్పబడుచున్నది. అచ్చట బుద్ధి అబోధరూపమను ద్వితీయపక్షము సంభవింపదు. ఎందుకనగా, ఎట్లు అబోధరూప మగుటవలన ఘటాదులు స్వతంత్రములు కావో అట్లు అబోధరూపమగుటవలన బుద్ధియును స్వతంత్రము గాకపోవును. ఇపుడు బుద్ధి బోధరూపమను ప్రథమపక్షమనిన ఆక్షేపము— ఆ బోధ ధర్మరూపమా? అథవా సర్వాధిష్ఠానమగు ధర్మిరూపమా? అచ్చట ప్రథమపక్షమందు బోధకు ధర్మరూపత సిద్ధించిన యెడల బుద్ధి బోధరూపమని సిద్ధించును. విచారము చేతనో, బోధయందు ధర్మరూపత సిద్ధింపదు. మఱియు బోధ ధర్మిరూపమను ద్వితీయపక్షములో ఆ బోధ అధిష్ఠాన పరమాత్మతో యభిన్నమగుటవలన ఆ బోధ రూపబుద్ధి పరమాత్మకన్న భిన్నమై స్వతంత్రముగ సిద్ధింపదు. ఈప్రకారము గల నిర్ణయము చేయుట కొఱకు మొదలే బోధ స్వరూపమును విచారముచేయవలసినది. అచ్చట బోధ ధర్మరూపమను పక్షమందు విచారము— ఆ బోధ ఘటపటాది విషయముల ధర్మమా! అథవా చక్షురాది జ్ఞానేంద్రియముల ధర్మమా! అథవా ఆత్మధర్మమా! అథవా బుద్ధియొక్క ధర్మమా! అచ్చట విషయముల ధర్మమను ప్రథమ పక్షము ఘటిల్లదు. ఏందుకనగా, బోధ ఘటాది విషయముల ధర్మమైన యెడల, ఆ ఘటాది విషయములు చైతన్య స్వరూపముగావలసియుండె. ఏదేది బోధ గలదియైయుండునో, అదియది చైతన్యమని నియమము. ఆక్షేపము— ఘటాది విషయములు చైతన్యరూపమని మేమంగీకారము చేసెదము. సమాధానము— ఘటాదులను చైతన్యరూప మనినపుడు చైతన్యము స్వప్రకాశమగుటవలన తద్రూపమైన ఘటాదులకు తమ జ్ఞానము కొఱకు ఇతరాపేక్ష గాకుండవలసియుండె. ఘటాదులలో, తమ సిద్ధికొఱకు ఇతరాపేక్ష చేయుచున్నవి. అథవా బోధ విషయముల ధర్మమని నపుడు భోక్త మఱియు భోగ్యము, వీనికి విపరీతభావమగును. అనగా, భోగ్యరూపముచే ప్రసిద్ధములైన విషయములు భోక్తృరూపము గాను, ఘటాదులకు భిన్నమగు వాని భోక్త భోగ్యరూప

ముగాను నగును. ఇచ్చట బోధగలదే భోక్తయొక్క లక్షణమని ప్రసిద్ధము. ఇట్లుండగా ఘటాదులు భోక్తయనుట అనుభవవిరుద్ధము. ఇపుడు బోధ ఇంద్రియముల ధర్మ మను ద్వితీయపక్షమున్ను ఘటిల్లదు. ఎందుకనగా— ఏది దేనియొక్క ధర్మమో అది దానియందు సదా ప్రతీతమగును. ఎట్లనగా, ఉష్ణత అగ్నియొక్క ధర్మము బోధ ఇంద్రియ ధర్మమైన పక్షమందు అది ఇంద్రియములందు సదా ప్రతీతముగావలసియుండెను. అట్లు నియమముగ ప్రతీతముగాదు. మఱేమనిన— ఇంద్రియములు విద్యమానములైయుండినను ఒకపుడు బోధ ప్రతీతమగును, ఒకపుడు ప్రతీతముకాదు వాడుమతి — శబ్దము విద్యమానమైయున్నను, బధిరుని శ్రోత్రేంద్రియము శబ్దము తెలుగదు. రూపము విద్యమానమైయున్నను అంధుని శ్రోత్రేంద్రియ మద్దాని తెలుగదు. మనస్సు సావధానముగ లేని కాలమందు సమ్మూర్ఛమునున్న పురుషుని, మఱియు సావధానముగనున్న కాలమునను పృష్టదేశము నున్న పురుషుని చక్షురింద్రియ మెఱుగదు. బోధ ఇంద్రియ ధర్మమైనపక్షమందు, ఎచ్చట ఇంద్రియముండునో అచ్చట బోధ గావలసియుండెను. బోధయో ఇంద్రియమున్నచోట సర్వత్ర ప్రతీతము గాదు. కనుక బోధ ఇంద్రియ ధర్మముగాదు. మఱేమనిన బోధకు ఇంద్రియములు ఉపకరణములైయున్నవి. తాత్పర్యము — అంతఃకరణ వృత్తియం దారూఢమైన చైతన్యమునకు పేరు బోధ. ఆ వృత్తి ఇంద్రియములచే పుట్టుచున్నది. ఈలాగే బోధ కుపకరణములు ఇంద్రియములు. ఇట్లు ఉపకరణ మనుటచే పూర్వోక్తదోషము సంప్రాప్తింపదు. అథవా, బోధ ఇంద్రియములందు ప్రతీతమైనపుడు ఇంద్రియ ధర్మ మనవచ్చును. కాని బోధయో, అట్లింద్రియములందు ప్రతీతముగాను. మఱేమనిన ఘటాద్యర్థములందు ప్రతీతమైనది. తాత్పర్యము— స్ఫురణమునకు నామము బోధ. బోధ, ఘటము స్ఫురణమైనది, పటము స్ఫురణమైనది. ఈ ప్రకారముగల అనుభవముచే విషయములందు ప్రతీతమగుచున్నది. అథవా, పరోక్షజ్ఞాన విషయభూతేంద్రియములందు బోధ గలదని ఏయొక ప్రమాణమున్ను లేదు.

ఆక్షేపము— ఎట్లు నైయాయికమతమందు ఆత్మస్థితమైన బోధ ఘటాది పదార్థములను విషయము చేయుచున్నదో, అట్లు ఇంద్రియస్థితమైన బోధయు ఘటాదులను విషయము చేయును. నైయాయికునివలె ఘటాది విషయములతో సంబంధ మిచ్చట లేకున్నది? సమాధానము— ఒక వస్తువందు స్థితమైన బోధ అన్యవస్తువును ప్రకాశముచేసిన యెడల తాదాత్మ్య సంబంధముగా ఘటమందున్న బోధ పటము నెందుకు ప్రకాశము చేయదండెను? ఇంద్రియ స్థిత బోధకు ఘటాదులతో విషయతా సంబంధము నెవనిచేతను నివారణముగాదు. ఈలాగే ఇంద్రియ ధర్మము బోధకాదు.

అథవా చక్షురింద్రియస్థిత బోధచే ఘటాదుల భాన మంగీకరించినపుడు మీ మతమందు చక్షురింద్రియమునకు ఎట్లు ఘటముతో సంయోగ సంబంధము గలదో, ఎట్లు ఘటస్థిత రసాదులతోను చక్షువునకు సంయుక్త సమవాయ సంబంధము గలదో, అట్లు ఘటస్థిత రసాదులతోను చక్షువునకు సంయుక్త సమవాయ సంబంధము సంభవించుచున్నది. అందువలన ఎట్లు ఘటముయొక్క రూపము చక్షుస్థిత బోధయందు ప్రతీతమగుచున్నదో, అట్లు ఘటస్థితరసాదులును, చక్షుస్థితబోధయందెందుకు ప్రతీతము గావు? ప్రతీతము గావలసినదే. మామతమందో, ఈదోషము రాదు. ఎందుకనగా రూపాకారవృత్తియం దారూఢమైన చైతన్యరూపబోధయొక్క తాదాత్మ్యరూప విషయతాసంబంధము రూపమందు గలదు. రసాదులందు లేదు. అందువలన చక్షువుచే రసాదుల ప్రతీతిగాదు. దీనివలన నేమి సిద్ధించెననగా — ఒకపదార్థమందు స్థితమైన బోధ అన్య పదార్థమును ప్రకాశింపజేయదు, ప్రకాశింపజేయుననుపక్షమందు ఘటమందు స్థితమైన బోధ పటమును ప్రకాశింపజేయునను అతి ప్రసంగదోషప్రాప్తియగును. ఘటాదులందు ధర్మరూపముచే బోధయుండిన పక్షమందు ఆ బోధచేత ఘటాదులకును ప్రకాశమగును. ఐనను ఘటాదులందు ధర్మరూపముగ బోధయుండదు. అట్లే ఆబోధ ఘటాదుల ధర్మమైనపక్షమందు ఘటాదులు భోక్తగావలసియుండె. ఇవ్విధమున ఏలాగైనను, ఆబోధ ఇంద్రియములయొక్క ధర్మముకాదు.

మఱియు ఆ బోధ ఆత్మయొక్క ధర్మమను తృతీయ పక్షమున్ను ఘటిల్లదు. ఎందుకనగా, ఒకదానియందున్న బోధ రెండవదానిని ప్రకాశింపజేయదు. ఆత్మస్థిత ధర్మము ఘటాదులను ప్రకాశింపజేయుననిన, ఇచ్చటను అతిప్రసంగదోషప్రాప్తియగును. ఈలాగే ఆత్మయందు బోధయుండదు. ఆక్షేపము— ఆత్మయందు స్థితమైన బోధ ఘటాదులను ప్రకాశింపక పోనీ, అట్లయినను ఆత్మయొక్క ప్రకాశముకొఱకు బోధ ఆత్మయొక్క ధర్మమని మేము అంగీకారముచెసెదము. సమాధానము— ఆబోధ ఆత్మయొక్క ధర్మమైన పక్షమందు ధర్మము ధర్మికన్న భిన్నమగుటవలన బోధకన్న భిన్నమైన ఆత్మకు జడత్వము ప్రాప్తించును. అథవా, ఎట్లు ఘటోపహిత చైతన్యముతో అభేదభావమును పొందిన ఘటాకార వృత్త్యుపహిత చైతన్యరూపబోధయందు ఘటాదులు కల్పితములై అకల్పిత ఘటాదులను అధిష్ఠానరూపబోధ ప్రకాశముచేయుచున్నదో, అట్లే ఆత్మయైన నాకు ఏయొక యధిష్ఠానములేదు. మఱేమనిన నేను నా మహిమయందు స్థితమైయున్నాను. సకలానాత్మవస్తువులకు అధిష్ఠానముగ నున్నాను. మఱియు బోధయే ఆత్మయొక్క అధిష్ఠానమనిన, ఆబోధయే ఆత్మయని సిద్ధించును. ఎందుకనగా సర్వమునకధిష్ఠానము ఆత్మయైయున్నది. మఱియు ఆత్మకన్న భిన్న

1. ఈ పత్రిక మానవకోట్లలో ఐక్యజ్ఞానము, కరుణ, భక్తి విరక్తి, శాంతి మొదలైన దైవగుణము నభివృద్ధిచేసి తద్వారా విశ్వప్రేమను గలుగుచేయు నిమిత్తము స్థాపింపబడినది.

2. కేవలము భక్తుల సహాయముచే మాత్రము జరుగవలసినదేగాని మరియేయొక్క ధనసహాయము దీనికిలేదు. ఈపత్రికను ఆదరించుట దైవసేవయనియు, లోకసేవయనియు, గురుసేవయనియు తలంచి మేము, మనసా, వాచా, శక్తికొలది సేవచేయువార్గము.

3. వ్యాసము వ్రాయువారు శుద్ధముగా అక్షరాలు విడి విడిగా, కాగితము వకప్రక్కమాత్రమే వ్రాయవలయును. వక్క మతమునుగాని సంఘమునుగాని దూషించెడి వ్యాసము అంగీకరింప బడదు. వ్యాసము విషయమైన కార్యములన్నిటికి వారే జవాబు దారులై వుండవలయును.

4. వాద ప్రతివాదములకుగాని, ప్రశ్నోత్తరములకుగాని, దీనియందు స్థలము దొరుకదు.

5. ఇంగ్లీషునెల ప్రతి తే 15 లో పత్రిక పంపబడును. ఏదైన కారణాంతరముచే, సకాలమున పత్రిక చేరనివారలు మరు నెల 15 తేదిలోపల తెలుపవలయును.

6. పత్రిక విషయమై వ్రాయునప్పుడు చందా నెంబరున్ను విలాసమున్ను విశదముగా వ్రాయవలయును. లేనిచో సమాధాన మిచ్చుటకు అనుకూలముండదు. చందా నెంబరు 2237 ముద్రించి యుండు రిజిస్టర్ నెంబరుగాడు. మా చిరునామపై ముద్రించియుండు సన్న అక్షరము గలిగినదని జ్ఞాపకముంచవలయును.

7. చందాదారులై క్రొత్తగా ఏనెలలో చేరినను, ఆ సంవత్సర పత్రికలన్నియు వారికి పంపబడును. చేరిన నెలనుండి మాత్రము యేర్పాటుచేయుటకు అనుకూలముండదు.

8. ఏదైనా కారణాంతరముచే చందాదార్లు నిలిచిపోవుటకు తలంచిరేని దయయుంచి ముందుగా ఆశ్రమమునకు తెలుపకోరు ధము. అట్లుచేయక పత్రిక వి. పి. పంపినతర్వాత అవసరములేదని వాపసు చేయుట ఆశ్రమమునకు ధనంతో నష్టపరచినవారగుదురు.

---

ఆశ్రమ సంరక్షణ.



1. సీతారామ సేవాసమితి, ఖరగ్ పూర్, పుష్యమాసం రూ. 20—0—0

REG. No. M. 2237.

# విజ్ఞప్తి.

ఈక్రింద కనుపరచిన స్థలములలో ఆశ్రమ పుస్తకములన్నియు అసలువెలకు దొరకును. కన్నిగ్పేటులనుండి వి. పి. గా పంపబడదు.

1. శ్రీపరమాత్మనన్దాశ్రమమ్, పెనమలూరు, P. O. కృష్ణాజిల్లా.
2. శ్రీ ఓంకారాశ్రమం, తెనాలి, గుంటూరుజిల్లా.
3. శ్రీ సాధుస్త్రీల మఠం, వీరభద్రపురం, రాజమహేంద్రవరము.
4. దేవతి తిమ్మరాయప్ప శెట్టిగారు, శాంతనివాసము, విశ్వేశ్వరపురం, బెంగుళూరుసిటి
5. శ్రీపరమశివానందస్వామిగారు, ప్రక్కి సోమనాథంగారు, మిలిటరులైను, బరంపురం.
6. వంగ. గోవిందు నరసయ్యగారు, బీసాట్ ట్ పెరస్, బొంబాయి.
7. ముక్కాముల సీతయ్యగారు, యీడుపుగల్లు, P. O. కృష్ణాజిల్లా.
8. శ్రీ రామానందస్వామిగారు. గాంధినగరు, బళ్లారి.
9. సాధు నారాయణంగారు, శ్రీ సుబ్రహ్మణ్యస్వామిగుడి, మారేడుపల్లి, నైజాం.
10. చక్కా సుబ్బన్నగారు, యినుపకోట్లు, గుంటూరు.
11. శ్రీ సీతారామ సేవాసమితి, ఖరగ్ పూర్.
12. శ్రీ రామకోటి సమాజం, ఏలూరు.

తపాలుమార్గముగ తెప్పించుకొనువారు యీక్రిందివిలాసమునకు వ్రాసిన దొరకును.

శ్రీ వ్యాసాశ్రమం, ఏర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.

## శ్రీ మలయాళస్వాములవారి గ్రంథములు.

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము ... | వెల రూ. | 1 | 4 | 0 |
| స్వబోధ సుధాకరము ... ... | ... | 1 | 2 | 0 |
| ఓంకారము (ప్రణవోపాసన) ... | ... | 1 | 0 | 0 |
| ధర్మసేతువు ... ... | ... | 1 | 8 | 0 |
| ఉపదేశామృతము, ద్వితీయభాగము ... | ... | 0 | 10 | 0 |
| శ్రీ వేంకటేశాది పూజా పంచరత్నమాల ... | ... | 0 | 6 | 0 |

ఇతర చిన్న చిన్న పుస్తకములు కొన్ని గలవు.

## సాయం వరదదాసుగారిచే రచితగ్రంథములు.

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1. | శ్రీ మలయాళ సద్గురు స్మరణామృతము ... ... | 0 | 4 | 0 |
| 2. | ఆత్మారామ తత్త్వామృతము ... ... ... | 0 | 4 | 0 |
| 3. | నమశ్శివాయ గేయామృతము ... ... | 0 | 1 | 0 |
| 4. | భజగోవిందము ... ... ... | 0 | 1 | 0 |
| 5. | నారాయణ గేయామృతము ... ... ... | 0 | 1 | 0 |
| 6. | అహింసా పుష్పము ... ... ... | 0 | 1 | 0 |

## శ్రీ తత్త్వానందస్వాములవారి గ్రంథములు.

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1. | జ్ఞానప్రియ ... ... ... | 0 | 12 | 0 |
| 2. | అనుష్ఠానవేదాంతము ... ... ... | 0 | 7 | 0 |
| 3. | శ్రీరామకృష్ణ పరమహంస జీవితకథ | 0 | 10 | 0 |

ఇ[illegible]

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1. | వృత్తి రత్నావళి | 0 | 8 | 0 |
| 2. | ధర్మపదం శ్రీ బుద్ధదేవకృతం ... | 0 | 8 | 0 |
| 3. | విచారసంగ్రహము | 0 | 4 | 0 |

